## MANNARU JETTY and NIMBAJAMĀHATMYAMU

Badagalanāti Narasakavi, a poet living in Tanjore has dedicated his work Nimbajā mahatmyamu to Mannaru Jetty who belonged to the Tokkadamu family In the introduction the geneology of Mannaru Jetty is described thus




Venkata Jetty acquired the family name of Tokkadamu on account of his ability in clearing the way, which is conjested by the numerous foot holdings of people (Janula Tokkadamu) in Tanjore.

Mannaru Jetty belonged to Kaus'ika or Viswamitra gotra and Appastambasūtra.

This work Nimbajamāhatmyamu is also known as **Ekavira-mahatyamu** It is a Dwipada work, and deals with the origin of Mallakula. It deals with ten different sections of Mallas, beginning with Mudgala gotra. The style is good The work is unprinted [1]

The date of the work can be fixed tentatively as 1740 A. D. on the basis of a note writter at the end of the manuscript as under .—

"Vijayasamvatsara Bhadrapadas'uddha Das'amınātiki Nelluri Vīrarāghava Perumallakumarudu Kanaka Jetty Vrāyinchinadi"

Kanaka Jetty son of Nelluri Veeraraghava Perumallu caused this work to be copied on the 10th day of Bhadrapada in the year Vijaya Since Vijaya Samvatsara correspond to 1740 A D. the same date is given for the composition of the work

## TOKKADAMU RAMA JETTY

Rama Jetty, the brother of Mannāru Jetty is a poet and wrote a sataka on Vemana. It is called "**Balachakravema Sataka**" as the

---

1. Only one copy on palm leaves is avaible in the Tanjore Library. (Vide Descriptive Catalogue)

makuta or ending is "Balachakravema Bhavyanama" It is written in Ataveladi metre, i. e the same metre used by Vemana. This is unprinted [2]

## TIMMA JETTY AND NASIKETA PURAṆAMU

Timma Jetty belongs to Pedda Garidi (Garidikutam) in Tanjore. **Sringarakavi, Tirumalanathakavi** wrote his Dwipada work, Nasiketa Puranamu,[1] at the instance of Timma Jetty. The work is dedicated to Krishna who is enshrined in Pedda Garidi

The geneology of Timma Jetty is given below,




In the introduction of the work, Tirumalanathakavi states, that he wrote a Devamalla Charitamu in Telugu and dedicated to Timma Jetty. But this work is not available We have now only one Devamalla charitramu or Mallupuranam written by Nadurupati Venkana (already referred to )

The story of Nāchiketas or Nāchiketa of Kothopanishad fame is the main theme of Nāsiketapuranam. This work is in three cantos and closely follows the work of Daggupalli Duggana, of the same name

## VENKATAKRISHNA KAVI - SIVAPARIJATAMU[3]

Venkatakrishnakavi belongs to Mallukula and is the court poet in Telugu in the time of the last Marata king Sivaji (1832 -1855) of

---

1 The manuscript relating to this work is in the Adyar Library For details The Lives of Sataka poets Revised Edition by N Venkata Rao, M A , (Page 715) and page 293 of the Southern School

2. A paper manuscript of the work is available in the Madras Government Oriental Manuscript Library.

3. Tanjore Library No 637—636 two copies.

Tanjore. In the beginning of the work, Venkatakrishnakavi states that he belonged to Mallukula, of Vasista gotra His father is Kanakayya The author also states that he is a young man, without any literary equipment but the grace of Chandramoulīswara and the patronage of Sivaji Raja encouraged him to undertake the work. In the colophon of the work, Venkatakrishnakavi styles himself as Venkatakrishna Jetty son of Kanaka Jetty, and as such there is no room for doubt. Venkatakrishnakavi is the popular name of the author

Sivaparijatamu is a Yakshagana both in manner and matter It follows the Yakshaganas of the Southern School. The subject is the appeasement of quarrel between Ganga and Gauri by Siva Being a juvenile composition, it has no literary merit. The work is unprinted

## THE SETUPATIS OF RAMNAD

Along with Nayaks and Chieftains in South, the Setupatis of Ramnad had their share in the patronage of Telugu Among them **Vijay Raghunatha Setupati** (1709—1720) evinced keen interest in Dramas and Dramatic performances. He constructed a theatre, and Telugu Dramas were enacted there.

In [1]Bommalata Natakamu, a Telugu play written in the time of the above Chieftain, it is stated that the Drama is enacted before him. "Dakshinasimhāsanādhīswarundu Vijaya Setu Raghunatha Bhupaluni nataka Salayandu, anapada Chadavanērchina Vidvamsulu"

(There are many learned men, well versed in both Sangita Sahitya, that adorned the theatre (Natakasala) of Vijaya Sethu Raghunatha Bhupati)

**Vadukanatha Setupati,** the brother of Vijaya Raghunatha is also a patron of Telugu. Birudu Kuppalmalla to whom Telugu Mallupuranam is dedicated was honoured by Vadukanatha, and a few stray verses in Telugu regarding his liberal donations to poets are available in manuscrpt.

---

1 Unprinted Manuscript bearing No. R. B. 719 in Government Oriental Manuscript Library, Madras.

# The Southern School in Telugu Literature

## Articles—Reference Books—(ENGLISH)

1. Cavelly Venkata Ramaswami—Sketches of Deccan Poets, 1829.

   (1) Kuppanakavi (Andhra Kalidas).
   (2) Govindakavi.
   (3) Mudduranganath.
   (4) Bappana Kavi (Ganapavarapu Venkatakavi Andhra Prayogaratnakaramu).

2. *The Southern School in Telugu Literature*—
   J. Ramayya Pantulu, B.A., B.L. Journal of the Andhra Historical Research Society, Rajahmundry, Vol. II Nos. 3 & 4 pp. 169—177—1928.

3. *The Southern School in the History of Telugu Literature*—Chenchiah and Bhujanga Rao—pp. 91—96. *Heritage of India Series*—1930.

4. *The Tanjore Saraswathi Mahal Library and its importance*—P. Lakshmikantam, M.A. Hindu (17-1-1932.)

5. *Introduction to the Descriptive Catalogue of Telugu Manuscripts in the Tanjore Maharaja Serjoji Saraswati Mahal Library*—pp. 1—13. Dr. P. P. S Sastri—Andhra University Publication—1933.

6. *Telugu Literature under the Naik Kings of Madura and Tanjore*—C. Satyanarayana, M. A. (Research Scholar in the Madras University—1935-36.

7. *Telugu Literature outside the Telugu Country*—

   K. Ramakrishnaih, M.A. Annals of Oriental Research, University of Madras—Vol. V pp. 1—38 pages 1 to 25 dealing with literature—1941.

8. *Telugu Literature under Madura Nayaks*—N. Venkata Rao, M. A. Journal of the Andhra Historical Research Society—Vol. 17 Nos. 1—4 pp. 133—148.

   *Telugu Literature under Pudukkota Rulers*—

   N. Venkata Rao, M. A. Appended to introduction to Khadga Lakshna Siromani—Madras Government Oriental, Series 1950.

9. *Telugu Literature under Vijaya Raghava Nayaka*—N. Venkata Rao, M A. Introduction to *Rajagopalavilasamu* of Chengalva Kalakavi 1951.

10 *Telugu Literature under Mysore Rulers and their Subordinates*—N. Venkata Rao, M. A. Annals of Oriental Research, University of Madras—Vol. X 1952-53—pp. 1-41.

## Works

1. Vijayavilasamu—A critique in English by late Dr. C. Narayana Rao, M A , Ph. D

   *History*—Works consulted.

   (1) Sources of Vijayanagar History—S K. Iyengar—Madras University Publication 1919.
   References relating to the works of Southern School (Telugu works)

   | | | |
   |---|---|---|
   | No. 38 | *Rayavachakamu*—pp 118-129 | |
   | 85 | *R* [illegible]— 110 lines (Introduction) | pp. 254-266 |
   | 86 | *Kammavarivakkana* 108 lines | |
   | 87 | *Regarding palaces* 50 ,, | |

   Tanjavuri Andhra Rajula Charitra—pp 327-336

   (2) The Nayaks of Madura—R. Satyanatha Iyer, M A ,L T., Madura University Publication 1924

   (3) The Marata Rajahs of Tanjore—Late Dr. K R. Subrahmanian, 1929.

   (4) The Nayaks of Tanjore—V. Vriddhagirisan, M.A , M. Litt, Annamalai University Historical Series No. 3. 1942.

   (5) Introduction to Raghunathabhyudayamu and Ragunathanayakabhyudayamu—Dr. N. Venkata Ramanayya, M A., Ph D. 1959.

   (6) The Salem District Gazetteer.

   (7) The Trichinopoly District Gazettee.

# పీఠిక

## (ద్వితీయ ముద్రణము)

ఆంధ్రవాఙ్మయ చరిత్రమున దక్షిణదేశీయాంధ్ర వాఙ్మయము రమారమి యేఁబదేండ్ల కాలమునుండియే యెఱుకలోనికి వచ్చినది. ఈ వాఙ్మయమునకు సంబంధించిన గ్రంథములించుమించుగ నన్నియు తంజావూరియందున్న శ్రీ శరభోజీ సరస్వతీమహాలు గ్రంథాలయమునఁ గలవు. కాని తంజావూరు తెనుఁగుదేశమునకు సుదూరమున నుండుటచేతను, ఒకవేళ నచ్చటికెవ్వరైన వెడలినను, గ్రంథములప్రతిని వ్రాసికొనుటకైన సాధ్యముకాని పరిస్థితులలో నవి నిక్షిప్తములై యుండుటచేతను, కవితా గౌరవముచేత ప్రచుర ప్రచారమును బడసిన యే మూఁడునాలుగు ప్రబంధములను గూర్చియేతప్ప, తక్కిన వాఙ్మయ స్వరూపమేమియు నానాఁడు గోచరింపలేదు.

ఇట్లు సమగ్రవాఙ్మయ స్వరూపము గోచరించుట కవకాశములు లేకున్నను, నీ వాఙ్మయమునకు సంబంధించిన విజయవిలాసాది ప్రబంధములు ప్రభవించిన నాఁటినుండియు ననఁగా క్రైస్తవశకము పదునేడవ శతాబ్దినుండియు లాక్షణికులకు, కవులకు పరిచితమై యున్నవి. ఈ ప్రబంధ ముద్రణాది వ్యవహారమూలమున, కొందఱు మహనీయుల యొక్క భాషాభిమానము కారణముగా నీ వాఙ్మయసమగ్ర స్వరూపమీ నాఁటికి సమకూడినది.

ఆంధ్ర భాషోద్ధారకులలో నగ్రగణ్యులగు బ్రౌనుదొరగారు (1798 – 1884) అముద్రితగ్రంథచింతామణ్యాధిపతులు శ్రీ పూండ్ల రామకృష్ణయ్యగారు (1860 – 1904), సరస్వతీ పత్రికాధిపతులు శ్రీ కొచ్చెర్లకోట రామచంద్ర వేంకటకృష్ణారావుగారు (1872 – 1919), శృంగార గ్రంథమాలాధిపతులు శ్రీ గంటి సూర్యనారాయణ శాస్త్రిగారు (1892 – 1950), శృంగారకావ్య గ్రంథమండలి యధిపతులు శ్రీ కే. జి. మూర్తిగారు (1890 – 1945), శ్రీ శైవప్రచారిణీ పత్రికాధిపతులు

లోకారాధ్య [1]కొడిమేల రాజలింగారాధ్యులవారు (1870 -  ) యీ వాఙ్మయమునకుఁ జెందిన గ్రంథములను ముద్రించి ప్రకాశమొనర్చి యున్నారు.

ఆంధ్రవాఙ్మయేతిహాస ప్రపంచమునకుఁ బెన్నిధులై సారస్వత పరిశోధనకు జగాదివ్యాటీలైన మానవల్లి రామకృష్ణకవిగారు, వేటూరి ప్రభాకర శాస్త్రులవారు నీ దక్షిణాంధ్రవాఙ్మయ గ్రంథముల విలువను లోకమునకుఁ దెలిపిన మహనీయులు. ఈ సందర్భమున నీ నడుమ కీర్తిశేషులై, తంజాపురాంధ్ర నాయకరాజ చరిత్రమును వ్రాసిన కురుగంటి సీతారామ భట్టాచార్యులవారిని ప్రశంసించుట కర్తవ్యము. ఇఁక నీ దక్షిణాంధ్ర వాఙ్మయమునకుఁ జిరస్థాయిత్వము గల్పించిన నొక మహాసంస్థగూర్చియు, నొక మహావ్యక్తినిఁగూర్చియు మీకు విన్నవించుచున్నాను.

## ఆంధ్ర సాహిత్యపరిషత్తు

ఆంధ్రసాహిత్య పరిషత్తు చెన్నపురియందేర్పడిన వెనుక, పరిషత్తు వారు, దక్షిణదేశమునందలి తెలుఁగుగ్రంథములకొఱకు నన్వేషణము చేయించి, తంజావూరియందే కాక, మధుర, పుదుక్కోట మున్నగు ప్రదేశములయందు వర్ధిల్లిన తెలుఁగుసాహిత్య గ్రంథములను సేకరించిరి. ఆనాఁడాంధ్ర సాహిత్యపరిషత్కార్యాలయ నిర్వాహకులును కీర్తిశేషులును నగు శ్రీ అక్కిరాజు ఉమాకాంత విద్యాశేఖరు లీగ్రంథములను పరిశీలించి వీనికొక స్వరూపము నేర్పఱచి, "అరవదేశమందలి ఆంధ్రవాఙ్మయము" అను పేర నొక చిన్నగ్రంథము వెలయించిరి. దీనినిబట్టి యానాటికీ వాఙ్మయము పేరు, పైని వివరించినరీతి నుండెనని గ్రహింపవచ్చును.

ఆంధ్రసాహిత్య పరిషత్తువారాపైని తంజావూరి పుస్తకభాండాగారమునందలి గ్రంథములను పరిశోధించి, కొన్ని గ్రంథములకుఁ బ్రతులు వ్రాయించిరి. కొన్ని యముద్రిత గ్రంథములకు సూచికలు పరిషత్పత్రిక

1. వీరు ఒరంగలు పురమున శ్రీ శివధర్మవర్ధనీ రామలింగేశ్వర ముద్రాక్షరశాలలో పండితారాధ్య చరిత్రాది మహా బహుశైవగ్రంథములను ముద్రించి ప్రకటించియున్నారు. దక్షిణాంధ్ర వాఙ్మయమునకు సంబంధించిన, కోడూరి వేంకటాచల కవి కృత శివరహస్య ఖండములో (28 ఆశ్వాసముల మహాకావ్యము) నిరువది యాశ్వాసముల గ్రంథమును, విశేషద్రవ్యము వెచ్చించి ముద్రించియున్నారు.

యందుఁ బ్రకటించుటయే గాక, యావాఙ్మయమునకు సంబంధించిన మన్నారుదాస విలాసాది కృతులను బ్రప్రథమమున ముద్రించి ప్రకటించిరి. మఱియుఁబరిషదధ్యక్షులగు శ్రీజయంతి రామయ్యపంతులుగారి వాఙ్మయమునకుఁ దొలుత The Southern School in Telugu Literature అని నామకరణము గావించిరి.

## శ్రీ పింగళి లక్ష్మీకాంతముగారు

తంజావూరి సరస్వతీమహాలు గ్రంథాలయములోని తెలుఁగు గ్రంథములయొక్క విలువను లోకమునకుఁ దెలుపుటయేగాక, ఆ వాఙ్మయమును వాఙ్మయచరిత్రమున సుప్రతిష్ఠితము గావించిన యశస్సు ఆంధ్ర విశ్వకళాపరిషత్తునఁ బూర్వమాంధ్రభాషా శాఖాధ్యక్షులయిన శ్రీ పింగళి లక్ష్మీకాంతమహాశయులదని ఘంటాపథముగఁ జెప్పవచ్చును. వారు సరస్వతీమహాలునందలి తెలుఁగుగ్రంథముల విశిష్టతనుగూర్చి "హిందూ పత్రిక" 17-1-1932 తేదీని యాంగ్లేయభాషలో నొకవ్యాసముఁ బ్రకటించిరి. అంతియేకాక ఆ తెలుఁగు గ్రంథముల సమగ్రపట్టికను, ఆంధ్ర విశ్వకళాపరిషత్తువారు ప్రకటించుటకుఁగూడ మూలకారకులైరి. లక్ష్మీకాంతముగారికి సరస్వతీమహాలు గ్రంథభాండాగారమునం దెంతటి యభినివేశము, ఎంత పవిత్రభావముగలదో ద్విపద భారతము నకు (ఆది సభాపర్వములు గల ప్రథమ సంపుటము) వారు వ్రాసిన పీఠికయందలి యీ క్రింది వాక్యములవలన విశదమగును.

> "దక్షిణతీర్థమును సేవింపఁబోవు నాంధ్రులు దర్శింపవలసిన ముఖ్య తీర్థము తంజావూరి సరస్వతీ మహాలులోని పుస్తకభాండాగారము ఆ యాలయమును నిర్మించినది యాంధ్రనాయకరాజులు అందుఁ బ్రతిష్ఠ చేసిన దేవి యాంధ్రసరస్వతి. కాలక్రమమున ఆ దేవికి యిరుపార్శ్వముల ఇతరభాషామూర్తులును, నెలకొల్పఁబడినవి. అయినను మూలపీఠమున దర్శనమిచ్చు దేవత ఆంధ్రసరస్వతియే. ఆ తీర్థసంసేవనము, ఆంధ్రు లెల్లరను, విశేషించి సాహిత్యోపాసకులును ముఖ్యముగా ఆచరింపఁదగినది." (పుట 40)

ఇట్లే గ్రంథ భాండాగార విశిష్టత వెల్లడించుటయేగాక వారొనర్చిన మహత్తరసేవ మఱియొకటి గలదు. అది యీ తంజావూరి గ్రంథాలయమునఁ గల గ్రంథములన్నింటికిని, ఆంధ్రవిశ్వకళాపరిషత్ పక్షమున ప్రతికలను వ్రాయించుట. వారీ పనికి తగిన పండిత విశేఖరులను నియమించుటయేగాక, స్వయముగా నా లేఖనములను పర్యవేక్షించుచు, నా గ్రంథములకు సాకల్యముగా పరిష్కృతమైన ప్రతులను తయారు చేయించి, ఆంధ్ర విశ్వకళా పరిషత్తున భద్రపఱచి తాళపత్ర లిఖిత గ్రంథ శాఖ నేర్పాటుచేసిరి. ఇట్లాంధ్ర దేశమున కెంతయో దూరమున నున్న తంజాపురాంధ్ర వాఙ్మయమును, సాహిత్యోపాసకుల కందుబాటులో నుండునట్లు చేయుటయేగాక, వాని యోగ్యతను విద్వల్లోకము గ్రహించు నట్లుగా నందలి యముద్రిత గ్రంథములను ముద్రించు కార్యమును ప్రారంభించిరి. తెనుఁగునఁ గల పెద్ద ద్విపదగ్రంథములలో నొకటియగు ద్విపద భారతముయొక్క ముద్రణమునకు వారే శ్రీకారము చుట్టిరి. ఆదిసభా పర్వములుగల సంపుటమును, వారే పరిష్కరించి, దాని నమూల్యమగు విపులపీఠికతో నలంకరించి, యాంధ్రసాహితీ లోకమునకుఁ సమర్పించినారు. అఖండమై, అనితర సాధారణమైన వారి పరిశ్రమ మూలముననే నేఁడాంధ్ర విశ్వకళా పరిషత్తువారు తంజావూరి సరస్వతీమహాలు గ్రంథములను ప్రకటించుట కనువుపడినదని చెప్పుట యతిశయోక్తి కానేరదు.

మఱియు ప్రథమమున వారే వాఙ్మయచరిత్రమున దీనికి – "దక్షిణాంధ్ర యుగము" అను నామకరణము గావించి, యాంధ్రసారస్వత చరిత్రలో నీ యుగమును చిరస్థాయి కావించినారు. మఱియు కృష్ణరాయని యుగము ననుసరించుచు, నంతకంటె కొన్ని శాఖలలో నద్భుత పరిణామ వికాసములను చూపినదీ యుగమని సోపపత్తికముగా నిరూపించి నారు. నేఁడు వాఙ్మయ చరిత్రలయందన్నిట నీ పేరితోడనే యీయుగము వ్యవహృత మగుచున్నది.

అనిర్వచనీయమగు శ్రీ లక్ష్మీకాంతముగారి యీ దక్షిణాంధ్ర సాహితీసేవ, వాఙ్మయచరిత్రమున ననవరతస్మరణీయమై యలరారుచున్నది.

ఇప్పటి కిరువదియైదేండ్లకుఁ బూర్వమునుండి నే నీదక్షిణాంధ్ర వాఙ్మయమునఁ బరిశ్రమము చేయుచున్నాను. క్రీ. శ. 1934 - లో "చంద్రిక" అను మాసపత్రికయందు, "తంజావూరి మహారాష్ట్రరాజులు, సంస్కృతాంధ్ర వాఙ్మయము" అను వ్యాసమును బ్రకటించితిని. 1936 లో ఆంధ్రసాహిత్య పరిషత్తు రజతోత్సవసందర్భమున, "తంజాపురాంధ్ర వాఙ్మయము" అను పేర నొకవ్యాసము వ్రాసితిని. పై రెండును, తంజావూరి వాఙ్మయమునుగూర్చిన యపూర్వ విషయము లెన్నింటినో బహిర్గత మొనర్చినవి. క్రీ. శ. 1938 లో లింగనమఖి శ్రీ కామేశ్వరకవికృత మగు సత్యభామాసాంత్వనమును పరిష్కరించి, పీఠికాదులతో వెల యించితిని. క్రీ. శ. 1940 లో వెలిదండ్ల వేంకటపతి రాధామాధవ సంవాదమును, పరిష్కరించి విపులపీఠిక రచించితిని. క్రీ. శ. 1941 లో తంజావూరి రఘునాథనాయకుని రసవత్కృతియగు వాల్మీకిచరిత్రమును నద్వితీయముగ సంతరించితిని. ఈ ముద్రణము వలననే, యా కృతివిశిష్టత వాఙ్మయప్రపంచ మెఱుఁగఁజాలినది.

పై పరిశ్రమమును పురస్కరించుకొని నేను మదరాసు విశ్వవిద్యాలయమున, పరిశోధక శాఖయందు నియమితుఁడనైనప్పుడు (క్రీ. శ. 1944) దక్షిణదేశీయాంధ్రవాఙ్మయ సమగ్రచరిత్ర వ్రాయుటయు నా పరిశోధక కార్యక్రమమున నొక కృత్యముగ చేర్చితిని. కాని యా కార్యక్రమమున తెనుఁగుకవుల చరిత్రయను గ్రంథము మొదటిదగుటచేత నేను దానినిగూర్చి పరిశ్రమము చేసితిని. ఆ గ్రంథము క్ర. శ. 1953 లో విశ్వవిద్యాలయమువారు ప్రకటించిరి. దాని వెనుక మఱి రెండేండ్లకు నఁగా క్రి. శ. 1955 లో "దక్షిణ దేశీయాంధ్ర వాఙ్మయచరిత్ర" ను పూర్తి చేసితిని. దానిని విశ్వవిద్యాలయమువారే ప్రకటించిరి.

దక్షిణదేశమున వర్ధిల్లిన తెలుఁగువాఙ్మయమునుగూర్చి, యీ గ్రంథముకన్న [1]సమగ్రమైన గ్రంథమింతవఱకు ప్రకటితము కాకపోవుట చేత, నొక యేడాదిలోపుగా ముద్రితములైన ప్రతులు చెల్లిపోయినవి.

---

1 ఈ తరువాత "దాక్షిణాత్యాంధ్ర సాహిత్యము" అను పేర శ్రీ డాక్టరు నేలటూరి వేంకటరమణయ్యగారొక చిన్న గ్రంథము, "దక్షిణాంధ్రయుగ వాఙ్మయ చరిత్ర" అను పేరితో వేఱొక గ్రంథమును శ్రీ డాక్టరు కే. వి. ఆర్. నరసింహము గారును ప్రకటించిరి

మఱియు నీ దక్షిణాంధ్ర వాఙ్మయము విశ్వవిద్యాలయములలో 'తెలుఁగు ఆనర్సు' 'ఎమ్. ఏ.' తరగతులవారికి ఆంధ్రవాఙ్మయ చరిత్రమున ప్రత్యేక పఠనీయభాగమైన కారణముచేత, వెనువెంటనే దీనికి పునర్ముద్రణావకాశము లభించినది.

పూర్వముద్రణముకన్న నీ ద్వితీయ ముద్రణమునఁగల విశేషములు.

1. సాహిత్య విమర్శనభాగము హెచ్చుగాఁగల వాఙ్మయ సమీక్ష.
2. అనుక్రమణిక.
3. ఆంగ్లేయ భాషలో సంగ్రహముగా నీ వాఙ్మయచరిత్ర.
4. విపులీకృత గ్రంథసూచి.
5. దక్షిణదేశమున వాఙ్మయరంగములను సూచించు పటము.

ఈ గ్రంథమును సమీక్షించినవారు తమ సమీక్షలలో సూచించిన, సవరణ వివరణములను నేను చేకొని, యీ ముద్రణమున వానిని సరి చేసితిని. సమీక్షకుఁడు సహృదయతతో గ్రంథము విమర్శించిన నది సరసమును, సమంజసమును, సారస్వతాభ్యుదయ హేతువునునై విలసిల్లును, కాని యాతఁడు రంధ్రాన్వేషణాయత్తచిత్తుండైనచో, విమర్శనము విరసము, అసమంజసము, విద్వత్సంతాప హేతుకమునునై, వెఱ్ఱి తలలు వేయును. ప్రకృత గ్రంథవిమర్శనములలో 'సత్యవాది' అను విమర్శకుఁడు ప్రకటించిన విమర్శనము - 'సంస్కృతి' అను పత్రిక ప్రకటించినది.

కాని యా సమీక్షను తిలకించిన వారందఱికి, నదియొక 'అసత్యవాది' రచితమైన యసంస్కృతమగు విమర్శ - కేవలము గ్రంథమునందలి విషయమునకే మాత్రము సంబంధించని భాషావిమర్శ మాత్రము అని తోఁచును. ఇఁకనట్టి సందర్భమున దానిప్రత్యుత్తరించుట యనవసరము. అట్టివానిని వివేకముగలవారు విస్మరింతురు. అట్లే మఱికొన్ని యపరిణత బుద్ధుల వ్రాఁతలును విస్మార్యమాణములు. సహృదయతతో సమీచీనముగా, సవరణములు సూచించినవారిని గ్రంథరచయిత నిరంతరము సంస్మరించుచునే యుండును.

ప్రస్తుతద్వితీయముద్రణము, విషయసేకరణమునందేమి, విమర్శనా పథకమునందేమి, సాధ్యమగునంతవఱకు సమగ్రముగ నుండు రీతిని రచితమైనది. అయిన నింకను తాళపత్రగ్రంథశోధన జరుగవలసి యున్నది. నేఁడట్టి పరిశోధనము చేయుచున్నవారిలో నగ్రగణ్యులు సేలముజిల్లా హోసూరు వాస్తవ్యులు. శ్రీ యస్. కోదండరామయ్యగారు. దక్షిణప్రాంతముల కవులీవఱవారు కపరిచితులను నెందఱనో తెలిపిరి. అట్టి వారిలో కొందఱ నిందుఁ జేర్కొను చున్నాను.

కొణిదెన నాగయకవి :— ఈతఁడు మైసూరిసీమలోని నంజనగుడి వాస్తవ్యుఁడు. బ్రహ్మనారదసంవాదము - అను నాఱాశ్వాస ప్రబంధము రచియించియున్నాఁడు. మఱియు, పతివ్రతాభరణము, రాధామాధవసంవాదము అను రెండు కృతులను రచించెనఁట.

హోసూరి సాకమ్మ :— ఈకవయిత్రి రామాయణ ముక్తికాంతా విలాసాది బహుగ్రంథములు రచించినది.

రాఘవదాసకవి - అచ్యుతరాయశతకమును తంజావూరి వరదరాజ శతకమును రచించెను.

ఇఁక కర్తృత్వము తెలియని యీక్రింది శతకములు లభ్యము లైనవని వారు తెలుపుచున్నారు.

౧. సుబ్బరాయ శతకము. (సీసపద్యములు)
౨. అంబాయమ్మ శతకము. (కందములు)
3. సర్వేశ్వర శతకము (మత్తేభ శార్దూల వృత్తములు)

ఇది యథావాక్కుల యన్నమయ కృతికన్న వేఱైనది.

మైసూరు చెన్నపట్టణ పరిపాలకుఁడగు జగదేవరాయనిగూర్చి వీరు చక్కనిపరిశోధన సలిపిరి. ఆ ప్రాంతమున "జగదేవిదుర్గము" నుండి యీతఁడు పరిపాలించినాఁడని, రెండవ జగదేవరాయని యాస్థాన పండితుఁడగు కాళహస్త్యధ్వరి రచించిన "చతుశ్శ్లోకి" కల్పతరు వ్యాఖ్య యందు, జగదేవరాయనిగూర్చి గలదనియు నా గ్రంథము కలకత్తా విశ్వ విద్యాలయము వారచ్చువేయించిరనియు మున్నగు విషయములెన్నో వారు లేఖామూలముగ నాకుఁదెలిపిరి. వారి లేఖలనుబట్టి చూడగా నింకను దక్షిణప్రాంతమున, మైసూరు సీమలోను, తెలుఁగు గ్రంథములగూర్చి అన్వేషణ చేయవలసిన యావశ్యకమున్నట్లు స్పష్టమగుచున్నది. ఇట్టి

యపూర్వవిషయములు దెలిపిన శ్రీ కోదండరామయ్యగారి కీ పీఠికమూల మున నా కృతజ్ఞతను దెలుపుకొనుచున్నాను. వారింకను తమ పరిశ్రమము నితోఽధికముగ కొనసాగింతురని యాశించుచున్నాను.

ఇఁక ప్రస్తుతగ్రంథముద్రణము పూర్తియగువఱకును నాకు సహాయ భూతులైన వారినిందు పేర్కొనుచున్నాను.

1. విద్వాన్ రావూరి. దొరస్వామిశర్మగారు ఎమ్.ఏ., బి.ఓ.ఎల్. హిందూ హైస్కూలు పండితులు – తిరువల్లిక్కేణి, మదరాసు.
2. విద్వచ్ఛిరోమణి విరలదేవుని సుందరశర్మగారు, తంజావూరి [illegible]లు లైబ్రరీ పండితులు
3. శ్రీ మల్లంపల్లి శరభేశ్వరశర్మగారు, మదరాసు ప్రభుత్వ ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారము తెలుఁగు పండితులు.
   వీరికి నానమస్సులు.
4. శ్రీ యన్. శివసుందరేశ్వరరావు, ప్రాచ్యలిఖిత పుస్తకశాలా పూర్వ పండితుఁడు.
5. యన్. సర్వేశ్వరరావు 'బి. ఏ. ఆనర్సు' మదరాసు ప్రాచ్య లిఖిత గ్రంథాలయమునఁ బకృతము మెకంజీ పండితుఁడు.
6. శ్రీ ఆర్. రాజగోపాల్ 'బి.ఏ. ఆనర్సు' మదరాసు క్రైస్తవ కళాశాల – తాంబరము.
   ఈతఁ డీ గ్రంథమునకు ననుక్రమణికను రచించుటయే గాక, దేశపటమునుకూడ తయారుచేసి యున్నాఁడు.
   వీరికి నా యాశీస్సులు.

ఇఁక నీ గ్రంథ ముద్రణమున కనుజ్ఞ యొసంగిన మదరాసు విశ్వ విద్యాలయము [illegible], విశ్వవిద్యాలయోపాధ్యక్షులైన డాక్టరు సర్ ఎ. లక్ష్మణస్వామి మొదలియారు M.D L.L., D.D Sc., D.C.L D. Litt M.L.C. వారికి నా మనఃపూర్వక కృతజ్ఞతావందనము లర్పించు చున్నాను. ఈ గ్రంథమును సర్వాంగ సుందరముగా-ముద్రించిన 'రత్నం' ముద్రణాలయాధికారులను మిక్కిలి ప్రశంసించుచున్నాను.

మదరాసు
విశ్వవిద్యాలయ భవనములు
తేది 20-3-1960

నిడుదవోలు వేంకటరావు : రీడరు
ఆంధ్ర శాఖాధ్యక్షుఁడు

# సాహిత్య సమీక్ష



ఆంధ్రవాఙ్మయ చరిత్రమున దక్షిణదేశాంధ్రవాఙ్మయము కృష్ణ రాయని యుగము వెనుక వెలసినదని సాహితీ విమర్శకులును, చారిత్రకులును నంగీకరించిరి. సాహితీక్రమ పరిణామదృష్టి ననుసరించి కృష్ణరాయ యుగము ప్రబంధయుగముగా పరిగణితమైనది. అందు ప్రబంధ రచనలే ప్రధానములై ప్రకృష్ట స్థానమునాక్రమించినవి. ఇఁక దక్షిణాంధ్రవాఙ్మయమున ప్రబంధములేకాక ఇతఃపూర్వమాంధ్రవాఙ్మయమున వెలయని యక్షగాన, నాటక, వచన, గేయరచనా శాఖలు వర్ధిల్లినవి. ఈ నాలుగు శాఖలును దక్షిణాంధ్రవాఙ్మయముననేకాక, యాంధ్రవాఙ్మయమున కంతటికి నొక ప్రత్యేక విశిష్టతా గౌరవములను సంపాదించినవి. కాఁబట్టి యీ యుగమునందలి సాహిత్య రచనలను నీ గ్రంథమున సమీక్షించుట ప్రధానకర్తవ్యమైయున్నది.

దక్షిణాంధ్రవాఙ్మయమునకు ప్రత్యేకత నొడఁగూర్చిన పై నాలుగు శాఖలలో వచనముతప్ప తక్కినవి సంగీతసాహిత్య సమప్రాధాన్యము గలవి. తెలుఁగు భాషలో సంగీతసాహిత్యములకు గల యవినాభావ సంబంధమును గుర్తించి మన లాక్షణికులు కవితారచనలన్నింటిని "ఆశు, మధుర, చిత్ర, విస్తర కవితలు "అని చతుర్విధములుగా విభజించి, వానిని నిర్వచించిరి. వీనిలో మధురకవితలు సంగీతసాహిత్య సమప్రధాన కృతులు. విస్తరకవితలు-ప్రబంధములు మొదలగు కృతులు ; కావున దక్షిణాంధ్ర వాఙ్మయమున సాహిత్యరచనలు పైవిభజన దృష్టితో విమర్శించిన నది సాహితీక్రమ వికాసమును, ప్రత్యేక లక్షణములను నిరూపించునని యెంచి యీ పథకము నవలంబించినాఁడను.

ఆశు, మధుర, చిత్ర, విస్తర కవితలనునవి నన్నయనాఁటి నుండి యున్నవే కాని నిన్న మొన్నటివి గావు. కాఁగా నీ విభజనము సంస్కృ

కారశాస్త్రదృష్టితో చేయఁబడినదియుఁ గాదు. ఇది [1]దేశీయమైనది. చతుర్విధ కవితలనఁగా నీ తరువాత ఆశు, బంధ, గర్భ, చిత్ర కవిత్వములను నొక మతభేదము చూడనూపినది. ఇది యల్లసాని పెద్దనగారి "చతుర్విధ కవితామతల్లి, కాల్లసాని పెద్దన" అను వాక్యమునకు జూలూరి వారు వ్రాసిన టీకయందున్నది. కాని పెద్దన తరువాతి కవులందఱును ఆశు, మధుర, చిత్ర, విస్తర కవిత్వములనియే పేర్కొనిరి. కళాపూర్ణోదయకర్త ఆశు, మధుర, విస్తర కవితలఁ (1-11) బేర్కొన్నాఁడు. పరమయోగి విలాసకర్త "ఆశు, మధుర, చిత్ర, విస్తర కవిత్వతత్త్వ కోవిద ప్రసక్తి" అని వీని నుట్టంకించినాఁడు.

ఇక దక్షిణాంధ్ర వాఙ్మయమున నీ సంప్రదాయమే కవులు గ్రహించిరి. విజయరాఘవభూపాలుఁడు "పూతనాహరణము" అను నాటకమున నవతారికలో "చతుర్విధ కవితా నిర్వాహక సార్వభౌమ బిరుదాంగద విరాజమాన చరణాంభోజ" అని పై చతుర్విధ కవితలఁ దడవియున్నాఁడు.

గణపవరపు వేంకటకవి తన ప్రబంధరాజమున "అమితాశువు, మధురము, చిత్రము, విస్తరము నా చతుర్విధ కవితల" గవిత రచింపఁ గలనని ప్రతిజ్ఞచేసినాఁడు.

తారాశశాంక కర్త "చిత్ర విస్తర మధురాశులీలఁ గవితల్ రచియింపఁగ నేర్చె" (2-54) అని చతుర్విధ కవితలను జెప్పియున్నాఁడు.

మహారాష్ట్రరాజ మాణిక్యమగు శహాజీ నాటకరచనలయందు నీ చతుర్విధ సాహితీ రీతులు ప్రయుక్తములై యున్నవి.

---

1, వీని స్వరూప స్వభావాదులను గూర్చినా 'తెనుఁగు కవుల చరిత్ర' అవతారికలో చర్చించియున్నాను.

ద్రౌపదీ కల్యాణము :

శ్లో. " శాహేంద్రస్సకలానవద్యసుకలా పాండిత్య జాగ్రద్యశో
హారాలంకృతదిగ్వధూకుచతటీ కాశ్మీరదంచన్మహః
అత్రత్యాః కవయశ్చతుర్విధమహాసాహిత్య నిర్వాహకా
సోహంచేద్దశరూపకాభినయధీపారంగతో రంగతః "

త్యాగవినోద చిత్రప్రబంధము :

" సర్వగుణభరిత సకలభాషాచతుర్విధసాహితీ నిర్వాహకుండు "

అను విశేషణము ప్రయుక్తమైనది. గంగాపార్వతీ సంవాదము :

" గుణభరిత సకలభాషా చతుర్విధసాహితీ నిర్వాహకుండు "

ఇట్లే యాతని పంచరత్న ప్రబంధమునఁ గలదు.

" సకలభాషాచతుర్విధ సాహితీనిర్వాహకుండు "

ముద్దుపళని రాధికాసాంత్వనములో (1-50)

సీ. " ఆశుకవ్వింబు లల్లితేనే సరా చిత్రప్రబంధముల్ చెప్పవలదె ? "

అని చతుర్విధ కవితలలో నాశు, చిత్ర కవితలఁ బేర్కొన్నది.

పైని వివరించిన రీతిని నాయకరాజులు, మహారాష్ట్రరాజులును, కవులును నీ చతుర్విధ కవితలను పేర్కొనుటచే నీ పద్ధతినే సాహిత్య సమీక్షయొనరించుచున్నాను.

ఆశు, మధుర, చిత్ర, విస్తర కవితాలక్షణముల నా యా శీర్షికల క్రింద నుదాహరింపఁబడి యుండుటచేత నిచట ప్రత్యేకముగ నీయఁబడ లేదు. ఇందు మొదటి శీర్షిక యగు నాశు కవితయందు ఆశు కవిత, సమస్యాపూరణములు, శతలేఖినీ, సమయలేఖినీ, మాలికా కవిత్వము అను విభాగములుగలవు.

## సాహిత్యరచనలు - ఆశుకవితలు

" ఏకపాద, త్రిపాద, కరినప్రాస, విషమసమస్యాపూర్తులు, వ్యస్తాక్షరీ సంఘటిత పద్యంబులును, ఇష్టార్థదేవతావరప్రతిపాది నిషేధాక్షర రచనా చమత్కృతియు, అష్టావధానంబులు, ఘటికాశతగ్రంథ కల్పనయు, ఆకాశపురాణంబులని తత్కాలోచితాతిత్వరితగతిని రచియింపఁబడునది "

యాశుకవిత్వంబని లాక్షణిక గ్రంథనిర్వచనము.

నాయకరాజుల యేల్బడిలో నీయాశుకవితకు నెక్కువ యాదరువు లభించినది. రఘునాథుని కాలమున విలసిల్లిన కవయిత్రి రామభద్రాంబ శతలేఖినీ, సమయలేఖినీ, అష్టభాషా కల్పిత చతుర్విధ కవితాను ప్రాణిత సాహిత్యసామ్రాజ్యభద్ర పీఠారూఢ " యని తన రఘునాథాభ్యుదయ గద్యయందు చెప్పుకొన్నది. తేనియ సోనలై, రసిక వేద్యములైన కావ్యముల నెన్నియేని రచించిన కాళకవి కీమె శిష్యురాలు. ఆయన చేతి చలువచేతనే గాంబోలు నీమెకు "ఘటికాశత గ్రంథఘటనోత్కటన" పాండిత్యము "ఓష్ఠ్యనిరోష్ఠ్యాది కోద్దామరసగర్భ" కవన చాతుర్యధుర్యత లభించినవి. లక్ష్మీసరస్వతులు తాండవించిన రఘునాథనాయకుని కొలువున రామభద్రాంబ పూరించిన సమస్యలను రఘునాథాభ్యుదయ నాటకమున 19, 20, 21 పుటలలో గాంచనగును. తెలుఁగు భాషయందే కాక సంస్కృతప్రాకృతములందును సమస్యలను రామభద్రాంబ పూరించినది. రామభద్రాంబయే కాక మధురవాణియను కవయిత్రిగూడ రఘునాథనాయకుని కాలమున నాశు, చిత్ర కవిత్వములందు నేర్పరియని తన సంస్కృతరామాయణ గద్యపంక్తులను బట్టి తెలియుచున్నది.

> "వీణావాదకళావినోద సముద్యేత్యా సమస్యాశతం సద్యస్సంసది సాధుపూరయతయాదత్తా కవీంద్రైస్త్రియా......నద్యోవిస్మయకృన్నిరోష్ఠ్య కవితాసందర్భధారా సుధాసారోర్మి పరిపూరిత శ్రుతిసుధీసంభావితాభిఖ్యయా ...ఘటికార్ధనిర్మిత శతశ్లోకీ ఫణిగ్రామణీ ప్రస్తారాభినవార్త వృత్తకవితాధాటీ కథాశుక్రియా షడ్భాషా రచనా విశేషబహుధావిఖ్యాత కీర్తిశ్రియా " యగు

నీమెయు రామభద్రాంబతోబాటు రఘునాథుని కొల్వున సమస్యలను బూరించినది. ఆశు చిత్ర కవిత్వ రచన యాడువారి కానాడు నల్లేరుపై బండినడకయైనది. విజయరాఘవునిచే కనకాభిషేకసమ్మానితయైన రంగాజమ్మ,

> "విచిత్రతర పత్రికాశత లిఖితవాచికార్థావగాహన ప్రవీణయు, తత్ప్రతి పత్రికాశత స్వహస్తలేఖన ప్రశస్తకీర్తియు, అతులితాష్ట భాషాకవితా సర్వంకషమనీషా విశారదయు "నై

విలసిల్లెను. రఘునాథనాయకుని కాలమున విలసిల్లిన విద్వత్కవయిత్రులు రామభద్రాంబ మధురవాణులవలె, విజయరాఘవుని యాస్థానమున

రంగాజీతోఁబాటు కృష్ణమాంబ యను వేఱొక కవయిత్రియు నాశు, చిత్ర కవనములం దారితేరిన దిట్టయని తెలియుచున్నది. కృష్ణమాంబ,

"ప్రస్తార సంఖ్యను పదుమూడు కోటులు నలునదిరెండు లక్షల పదేడు వేల నేన్నూఱును వింశతియును నాఱువృత్తంబులందు, నీ వృత్తమునకు నీ వర్ణనసమస్య గూర్పుమటన్న నా వృత్తమున సమస్యను రచించి యందుకు శ్లోకంబు లాశువుగాఁజెప్పి యవి తెనుఁగునను పద్యము చేసి, ఇరువదాఱు ఛందము లెఱిఁగి కవిత చెప్పి ఘనతగాంచినది"

అని కాళయరాజగోపాల విలాసమున నామెను ప్రశంసించినాఁడు. ఈ యుగమున నీ యాశు కవితకును తంజాపూరి రఘునాథుఁడే యాద్యుఁడు.

రఘునాథనాయకుఁడు పారిజాతాపహరణము అను తెనుఁగు కృతిని యాశువుగా యామద్వయమునఁ (అనఁగా నాలుగంటలలో) జెప్పఁగా దానిని లేఖకు లతికష్టముతో నా యాశుధారా త్వరితగతినందుకొని వ్రాయఁగలిగిరని సాహిత్యరత్నాకరమున నిట్లుట్టంకింపఁబడినది. అంతత్వరితముగాఁ జెప్పఁబడినను నందలి కవనము మాకంద మధుర్ఝరివలె నుండెనఁట.

"మాకందకందళదమంద మరందబిందు
త్వం పారిజాత హరణం త్వరయానిబద్ధ(?)మ్
యామద్వయేన యదునేతరి పారిజాత
మాజీహరత్సరస మచ్యుత భూపసూనుః
కావ్యంతదత్ర విబుధైస్తు కథంకథంచి
దాలేఖి చిత్రమవధాయ ఫణీంద్రకల్పైః"

5 సం. 30, 31 శ్లోకములు.

తండ్రియగు నచ్యుతప్పనాయకుఁడు తన కుమారుని యాశుకవితా వైదుష్యమున కెంతయు సంతసించి, గురూత్తంసుఁడగు గోవింద దీక్షితుని ప్రేరణచేత, రఘునాథునకు కనకాభిషేకము గావించెనఁట.

ఏవంవదస్తనయమేష కృపారసాప్తైః
జాతాభిషేకమపితం జగతీ బిడౌజః
తత్రాభిషించితమణీభిర సౌసభాయాం
ఆసీత్స ఏవవసుధేశపటాభిషేకః

5 సం. 35 శ్లో.

మధురలో విజయరంగచొక్కనాథుని కాలమున కుందుర్తి వేంకటాచల కవి "కథాశుకవి" యని పొగడ్తకెక్కినాఁడు. ఈతఁ డేకథనైనను నాశువుగాఁ జెప్పుటచే నతని కా బిరుదు వచ్చియుండును.

## సమస్యాపూరణములు

దక్షిణదేశీయాంధ్ర వాఙ్మయమున నీ[1]సమస్యాపూరణ ప్రక్రియ మిక్కిలిగా వ్యాప్తినందినది. మఱియు నొక్క తెలుఁగు భాషయందే కాక, సంస్కృత ప్రాకృతాష్టభాష లందును సమస్యాపూరణములు జరుగు చుండెడివి.

రఘునాథనాయకుని కాలమున నీ సమస్యాపూరణ ప్రక్రియ సార్వత్రికమైన దని చెప్పనొప్పును.

సమప్రధానం శతశేఖినీసమం ప్రక్లప్త నానావిధపద్యపూరణమ్
సలీలజాగ్రత్ ఘటి కాశతో-చితక్రమాష్టభాషాకవితావిజృంభణమ్.

యజ్ఞనారాయణ దీక్షితుని సాహిత్యరత్నాకరము ౧౧-౩౭

పై శ్లోకమున 'పాదపూరణము' అను ప్రక్రియయే సమస్య. అనఁగా పద్యమున గాని, శ్లోకమునగాని యొక పాదమునిచ్చి తక్కిన పాదములు

1 సమస్యలనఁగాఁ గవినిబరీక్షించుటకై పెద్దలిచ్చెడు పద్యాదిభాగములు. కవికిఁగల భాషాపాటవమును, కవితయందలి యభ్యాసవిశేషములను దెలిసికొనుటకై యొసఁగెడు పద్యరూప ప్రశ్నలనే 'సమస్య' లందురు. ఇవి సంస్కృతమునందును గలవు. తద్ద్వారమునవే తెలుఁగునకు వచ్చినవి సమస్యాపూరణమునఁ గవికి లోకజ్ఞానము బహుభాషా పాండిత్యము, మాతృభాషయందు పరిణతి, ప్రజ్ఞయుండవలెను అష్టావధాన, శతావధానములందిది యొక యంగముగానున్నది. పూర్వకాలమున కవి యెవ్వఁడైన రాజాస్థానమునకు వచ్చునెడల కవి సామర్థ్యము పరీక్షించుటకు సమస్యలే ముఖ్యాధారములు. అల్లసాని పెద్దన రాధామాధవకవి సామర్థ్యమును సమస్యాపూరణమువలననే కనిపెట్టెనను విషయ మందఱికి విదితమే. సమస్యలు తెలుఁగున తిక్కననాఁటినుండి ప్రచారములో నున్నవి. ఈ ఆశు కవితలనుగూర్చి ప్రత్యేక పరిశ్రమయే జరుగలేదు సమస్యాపూరణప్రక్రియ, తమిళ, కన్నడ, మళయాళ భాషలలో గాని తదితర రాష్ట్రేతర భాషలలో గాని యున్నట్లు కానరాదు. పరిశీలించుట కర్తవ్యము.

పూరింపుమని పృచ్ఛకులు కవి నడుగుదురు. అది యాతని కొక సమస్యగా పరిణమించును. కావుననే పాదపూరణము సమస్యయైనది. దీనికి సరియగు తెలుఁగు మాట "కైపదము"; అనఁగా చేతికందిచ్చుపదము. భోజరాజీయమున (౨-౮౦) (క్రీ. శ. 1430) అనంతుఁ డీ పదమును నుపయోగించి యున్నాఁడు.

"కైపదమిచ్చువారలును గ్రక్కునఁ బద్యముఁ జెప్పువారలున్"

రఘునాథనాయకాభ్యుదయమున నీ ప్రక్రియ సూచితమైనది.

"తానిర్వహించిన తక్కినకృతులు
కొందఱు వినిపింపఁ గొందఱుతగిన
సందర్భములసమస్యలు [1]సేకరింప
నెదుట సంగీతసాహిత్యనాట్యములు
మొదలైన విద్యలు మూర్తిభవించె."

రఘు. ప్ర ౫౨-౫౫ పంక్తులు.

రఘునాథనాయకుని కాలమున కొలువున నడచిన సమస్యాపూరణములు రఘునాథాభ్యుదయమున (నాటకము) నుదాహృతములైనవి.

---

1. "సేకరించు" అను ముద్రితపాఠము "శేఖరించు" అని యుండఁదగును. "శేకరించు or శేఖరము చేసుట u. a to prepare, collect సిద్ధముచేసుట కూర్చుట" అని బ్రౌణ్యనిఘంటువు పుట ౧౨౭౫. శేఖరము అనగా శిరోభూషణము శిరస్సునకు భూషణమును సమకూర్చఁగనే యెట్లుగా నలంకరణము పూర్తియగునో, యట్లే పద్యములో నాల్గవపాదమున గల సమస్యను, తక్కిన మూఁడుపాదములతో పూర్తిచేసిన పద్యము పూర్తియగును. 'శేఖరించు' అను పదము శబ్దరత్నాకరమున పుట ౭౫౬ లో నున్నది. అర్థము 'గొప్పపడు' అని కలదు. కాని యది సరికాదు. బ్రౌను చెప్పినదే సరియైనది.

"రఘునాథనాయనివారి మాట వింటిరా! కవులార! ఈ పడుచు లాంధ్ర గీర్వాణ ప్రాకృతసమస్యలు పూరింపఁ గోరుచున్నారు వీరినిఁ బరీక్షింపరయా!

వా. అనిన విని యమ్మహారాజుతోఁ గవిరాజు లేమనుచున్నారు.

"అయ్యయ్యా! స్వామి నగరలక్ష్మీసరస్వతులు సాక్షాత్కరించి యుండఁగఁ బరీక్షయేలయ్యా? అయినను మీరానతిచ్చిన మీఱరాదుగద. ఈ కమలాస్యలకు సమస్యలు యిచ్చేమయ్యా" అని సమస్యలు యిచ్చిరట యెటువలెను.

సమస్య : రారాజని యచ్యుతేంద్ర రఘునాథనృపా!

వా. ఔరా! రామభద్రమ్మవారు ఆ సమస్యపూరించి చదివిరట యెటువలెను.

క. ఏరీ నీసరిరాజులు
భూరమణులు నిన్నుఁ జాలఁబొగడుదురు భళీ!
స్వారాజని రేరాజని
రారాజని యచ్యుతేంద్ర రఘునాథ నృపా!

విజయరాఘవనాయని కాలమున సమస్యాపూరణములు విజయ రాఘవ కల్యాణము అను నాటకమున పేర్కొనబడినవి. అందు సంస్కృ తము, ప్రాకృతము (అష్టవిధప్రాకృతములు), తెలుఁగు సమస్యలు గలవు.

| సమస్యనిచ్చినవారు : | పూరించినవారు : |
|---|---|
| సంస్కృతము చిట్టా జళసోమయాజులు | గోవిందభట్లు |
| "విద్యానిధిర్విజయరాఘవసార్వభౌమ" | "సద్యోదదాతిసుకవి ప్రకరేప్సితార్థాన్<br>హృద్యానవద్యతర<br>ప్రద్యోతన ప్రతిమ బాహుమహాభిరామో<br>విద్యానిధిర్విజయరాఘవసార్వభౌమ" |

ప్రాకృతము మొదలగు నష్ట భాషలయందు, మధురకవి యిచ్చిన సమస్య లను సకల విద్యాసార్వభౌముఁడు పూరించియున్నాఁడు.

౧. శౌరసేని :

[1]మ. తుహాప్పదావోతమోహారది

[2]స. సా. సుయ్యోభవం మహాందోమణ్ణారుదాస ఛమావాళి
జుత్తణ్ణిమంఖుదాణిం తుహాప్పదావోతమోహారది ||

ఛాయ. శ్లో. సూర్యోద్భవాన్ మహాన్ మన్నారుదాసక్షమాపాల
యుక్తమిదం ఖల్విదానీం తవప్రతాపస్తమోహారతి ||

౨. మాగధి

మ. వియముపదాళూడ శాహవేజయది

స. సా. శ్లో. శోహాణబంహాణశంఖం
లుకంచె లజ్జలఖ్యణోవేదో
అన్నాళియమహిమనిహీ
వియయపవాళూఢ శాహవోజయది

ఛాయ. శ్లో. శోభన బ్రాహ్మణసంఘం
రక్షన్ రాజలక్షణోపేతః
అన్యాదృశ మహిమనిధి
ర్విజయపదారూఢ రాఘవోజయతి

3. పైశాచి :

మ. తుర్ఘుసమోనద్ది భూతలంమికయూ
మన్నలతాసోకునాది బూమిపయీూ

స. సా. ఔన్నుసరిఛోవిజ్జే పున్నమచందోద్దిదంసనంమితుమం
దహునాథతమాయపునో తుర్ఘుసమోనద్ది బూతలమ్మికయూ

ఛాయ. విష్ణుసదృశోవీర్యే పూర్ణిమచంద్రోసి దర్శనేత్వం
రఘునాథతనూజ పునస్తవ సమోనాస్తి భూతలేకవిః

---

1. మ. మధురకవి.
2. స. సా. సకల విద్యాసార్వభౌముఁడు

## ౪. చూళికాపైశాచి :

మ. దవతివన్నెదమ్మెతేతి
తుచాతిన కంకితాయింపలాయిం
బత్తాసనాహిలూదో
మన్నలుతాసోకునాదికో బూమిపయీ

ఛాయ. స్థాపయతి వర్ణధర్మాన్
దదాతి ద్విజాతీనాం కాంక్షితానిఫలాని
భద్రాసనాధిరూఢో
మన్నరుదాసోగుణాధిపోభూమిపతిః

## ౫. అపభ్రంశము :

మ. రావూవియయరాహావూ

స. సా. వెణ్ణుపావుపయోజాద భమరికియ మానసు
సయాజయది తంకేసు రావూవియయరావావూ

ఛాయ. విష్ణుపాదపయోజాత భ్రమరీకృతమానసః
సదాజయతి తంజేశో రాజావిజయరాఘవః

## ౬. ప్రాకృతము :

మ. జయయిసయా వియయరాహవోరాయా

స సా. వయణరుయివియియచందో
వయణవిలాసాహినంది యాయరియో
జువయీ జణణవమయణో
జయయిసయా వియయరాహవోరాయా

ఛాయ. వదనరుచి విజితచంద్రో
వచనవిలాసాభినందితాచార్యః
యువతీ జననవమదనో
జయతి సదావిజయరాఘవోరాజా ||

భాండీరభాష :

దీని లక్షణము.

“ కాంభోజామాగధీగౌడీ మహారాష్ట్రీ కళింగజా
గైర్వాణీమిశ్రితా భాషా భాండీరీతిప్రకీర్తితా ”

సార్వభౌముని సమస్య.

రాయగోపాళుచెసయా

మధురకవి పూరణ.

శ్రీకృష్ణవానందకరు
తుహమన్నారు దాసరె
తుహమానంద కరుహే
రాయగోపాళు చెసయా

ఛాయ. హేమన్నారుదాస
తవ శ్రీకృష్ణ ఆనందకరః
త్వం రాజగోపాలస్యాః
తథానందకరస్సదా

పుదుకోట్టరాజగు కోటి రఘునాథనాయకుఁడు ప్రౌఢ ప్రబంధ రచన యందే గాక సమస్యాపూరణమందును మిక్కిలి చతురుఁడు. తన యాస్థానకవియు నుద్దండకవియునగు నుదురుమాటి వెంకనార్యుఁడిచ్చిన నూఱు సమస్యల నాతఁడుపూరించెను. అవి “ [1]కవిజనోజ్జీవని ” అను పేర సంగృహీతములై ప్రకటితములైనవి.

రఘునాథతొండమాన్ రాజు సమస్యాపూరణమునం దెంత సమర్థుఁడో తెలుపుటకు నా గ్రంథమునుండి కొన్ని సమస్యలను వాని పూరణములను నీ క్రిందనిచ్చుచున్నాను.

1. కవిజనోజ్జీవని ఆంధ్రసాహిత్యపరిషత్తువారిచే క్రీ. శ. 1937 లో ముద్రితమైనది.

౧. "మీసానకుఁ గాల్లుమూఁడు మేదిని గల్గెన్"

క. మీ సానకుఁ గాల్లెక్కుడ
వాసిగవిన్నదియు లేదు వసుధాస్థలిలో
వాసనగంధము రాచెదు
మీసానకుఁ గాల్లుమూఁడు మేదిని గల్గెన్.

మీసానకు - మీసమునకు. మీసానకు - మీగందపుసానకు.

శబ్దచిత్ర సమస్య :

౨. "వావిలిలోఁ ద్రోయఁ గ్రోతివ లెనే యుండెన్" వావిలి చెట్లలోఁ ద్రోయఁగాఁ గ్రోతివలెనే కన్పట్టుచుండెనని సమస్య.

క. ఓ విద్వన్మణినను సు
గ్రీవునియన్నకును జేరెతీంగింపుము రా
ఘేవితమునియెదు మధ్యము
వావిలిలోఁ ద్రోయఁ గ్రోతివ లెనే యుండెన్.

వావిలి యను పదమున మధ్యము వి - ద్రోయఁగా-వాలి యగును.

౩. యతివంచన సమస్య :

"గ్లావిమలాక్షు వేంకటనగాధ్యక్షా" ఇది ద్విపదపాదముగాఁ గను పట్టఁజేసినది. కాని చివరి దీర్ఘమున్నది.

క. దిగ్గలలనాకబరీభర
స్రగ్గాలితకీర్తిజాలసద్గుణశీలా
విగ్లపితరక్షమార్తాం
డగ్లావిమలాక్షు వేంకటనగాధ్యక్షా

ఇచట 'గ్లా' ప్రాసలో కందపద్యమున నిముడుటచే సమస్యనిచ్చిన వారు వంచితులైరి.

ఈ క్రింది సమస్యాపూరణమువలన రఘునాథ తొండమానురాజు సంస్కృత వ్యాకరణమందు నిష్ణాతుఁడని తెలియనగును.

క. అగ్రజగోశబ్దముపై
నగ్రణిశబ్దంబు గూడనది యెట్లగు సం
ధి గ్రహణముఁ దెలుపుమనన్
గోగ్రణిగో అగ్రణీగవాగ్రణియనియెన్.

## శతలేఖినీ విద్య లేక శతావధానము

ఆద్యతన కాలమున నాంధ్రదేశమంతయు తమ శతావధాన విద్యచే మాఱుమ్రోఁగింపఁజేసినవారు తిరుపతి వేంకటేశ్వర కవులు. వారే బుద్ధ చరిత్రమున శతలేఖినీ విద్యయే శతావధానమని యిట్లు చెప్పియున్నారు.

మ. శతలేఖిన్యవధానపద్యరచనా సంజాతభాస్వద్యశో
వితతాశేషవరాంధ్ర భూపతిసభా విఖ్యాతనామాస్మదో
న్నతికిం గారణమైన దేవి ఘనవీణా పాణియవ్వాణి సం
తతమున్ వేంకటకృష్ణరాయనృపు వాగ్ధామంబుఁగామించుతన్

శతలేఖినీవిద్య యనఁగా నూఱుమంది తమ చేత లేఖినులు లేక గంటములు బట్టి వ్రాయుచుండగా, విరామము లేక నూఱుమందికిని నూఱు పద్యములు చెప్పుట. శతమనునది యూశుకవితలలో నొక పరిమితిగా నేర్పడినది. ఈశతలేఖినీ విద్య దక్షిణాంధ్రవాఙ్మయమున రాజాస్థానములయందు ముఖ్యముగా తంజాపురాస్థానమునందు ప్రచారములో నున్నట్లుగా నీక్రింది వివరణమువలనఁ దెలియుచున్నది.

తంజాపురాస్థానమున నీవిద్య వెలయుటకు ముందు క్రీ. శ. 1500 ప్రాంతముల విలసిల్లినవాఁడును కృష్ణరాయల నమకాలికుఁడునునగు చఱిగొండ ధర్మన యను కవి యీ శతలేఖినీ విద్యయం దాఱితేఱినట్లు తన చిత్ర                    జెప్పుకొనియున్నాఁడు.

మ. శతలేఖిన్యవధాన పద్యరచనా సంధాసురత్రాణ చి
హ్నితనామా! చఱిగొండ ధర్మసుకవీ! నీ వాగ్విలాసంబులా
శితికంఠోజ్జ్వల జూటకోటరకుటీ శీతాంశురేఖాసుధా
న్వితగంగాకనకాబ్జ నిర్భరసావిర్భూతమాధుర్యముల్

కాని తంజాపురాస్థానమునగాని తదితర స్థలములయందుఁగాని జరిగిన యీ శతలేఖినీ విద్యాప్రదర్శనముల వివరములు మనకు లభ్యము కాలేదు. కాని యన్నింటికన్న విశేష మేమనఁగా నీ కాలమున శతావధాను లందఱు పురుషులే. స్త్రీలే లేరు. అట్టిచో తంజావూరి వాఙ్మయమున రామభద్రాంబ, మధురవాణి, రంగాజమ్మ శతలేఖినీ విద్యాప్రపంచము నకు త్రిశక్తులవలె తేజరిల్లుచున్నారు! ఇదియే యచ్చటి విశిష్టత విద్యా.

## సమయలేఖినీ విద్య

ఒక నిర్దిష్ట సమయములో ననఁగాపరిమిత కాలములో పద్యములు చెప్పుట. ఇది సాధారణముగా 'గడియ' (అనఁగా నిరువది నాలుగు నిమిష ములు) లో నూఱు పద్యములు జెప్పుట యను నియమముతో నుండును. అడిదము సూరకవి "గడియకు నూఱు పద్యములు గంటము లేక రచింతుదిట్టనై" అని ప్రతిజ్ఞ చేసిన దిట్టిదియే యని యెఱుఁగవలెను.

"ఘటికాశత గ్రంథకల్పను" అనునదియు సమయలేఖినిలోఁ జేరును. ఇచట గ్రంథమనఁగా, ముప్పది రెండక్షరములు గల శ్లోకరచన. ఈ విద్యయందును దక్షిణాంధ్ర వాఙ్మయమున స్త్రీలకే ప్రాధాన్యము. రామభద్రాంబ, రంగాజమ్మ, ఘటికాశత గ్రంధ సమయలేఖినీ విద్యలు నేర్చిన వారు. మధురవాణి, ఘటికార్ధ నిర్మిత శతశ్లోకి" నని చెప్పుకొన్నది. నిక్కువముగా వారందఱును సరస్వతీ మూర్తులు.

## మాలికా కవిత్వము[1]

ఆశు కవితలలోఁ జేరిన మఱియొక ముఖ్యశాఖ, మాలికాకవి త్వము. దీనికి "నల్లసాని పెద్దనగారి "పూఁతమెఱుంగులున్" అను

1. మాలికా కవిత్వము నేటికిని ప్రత్యేకముగా నొక వాఙ్మయశాఖగాఁ బరిగణి తము కాలేదు. మొట్టమొదట యాశుకవితఁగూర్చియే పరిశ్రమ జరుగలేదు. నేను తొలుత మాలికాకవిత్వము యొక్క విశిష్టత, ప్రాధాన్యమునుగూర్చి పెద్దన మను చరిత్ర అను వ్యాసమున (భారతి నవంబరు 1954) నాంధ్రలోకమునకుఁ దెలిపితిని. దానినిఁ గూర్చి యీతరువాత పెక్కువిషయములు సేకరించితిని అవకాశము కలుగ గానే మాలికాకవిత్వచరిత్రను విద్వల్లోకమునకు నివేదింపఁగలను.

నుత్పల పద్యమాలిక నాంది. ఇచట విశేషమేమనఁగా చంపకోత్పలములు, శార్దూలమత్తేభములు నాల్గుపాదములు నియతముగా గల వృత్తములు. వీనిని ద్విపదలవలె నొక దానితో నొకటి చేర్చి కొన్ని పంక్తుల మాలికలుగా వ్రాయకూడదు. భావము నాలుగు పాదములలో నిముడక పోయిన నైదుపాదములుగా వ్రాయవచ్చును కాని యది సాధారణము కాదు. పెద్దనగారు "పూత మెఱుంగులున్" అన్న మాలికలో ముప్పది చరణములు చెప్పిరి. ముప్పది రెండయిన నెనిమిది యుత్పలమాలలగును. కాని యీ ముప్పది చరణములు నొకే ప్రాసలోనున్నవి, కాగా నొకే ప్రాసతో పదులు, వందలు చరణములుగా మాలికరచించు సంప్రదాయము పెద్దనగారితో ప్రారంభమైనది.

దక్షిణాంధ్ర వాఙ్మయమున నీ మాలికా కవిత్వమును పెంపొంది నది. మధురాపురాంధ్ర వాఙ్మయమున ముద్దళగిరికాశితుఁడగు గణపవరపు వేంకటకవి 'పెదళ్లిరి విజయము'ను నుత్పలమాలికలుగా రచియించి యున్నాఁడు. వివరము లీ క్రింద నీయఁబడినవి.

మాలికాకవిత్వమువ సీసమాలికలు చెప్పుటకంటె చంపకోత్పల మాలికలు చెప్పుట కష్టతరము. ఏలననగా సీసములయందు యతి నియమమే తప్పప్రాసనియమము లేదు. వృత్తములలో యతి ప్రాస నియములు రెండును నుండును.

వేంకటకవి చెప్పిన 'పెదళ్లిరి విజయము'న తూర్పుమాలిక, పడమటి మాలిక, ఉత్తరపుమాలిక, దక్షిణపుమాలిక గలవు. ఈ నాల్గును ఉత్పల మాలికలే. వాని వివరము.

తూర్పుమాలిక - టకారప్రాసీ - 74 చరణములు :

ఇందు 342 పంక్తులు గలవు.

మొదలు ఉ. పోటరినంటఁదాళిహాజి పుత్రుఁడొకానొక నాఁడుతూరుపుం
 పేటకుఁ జేరి................. ..............స

తుది యాృటలొనర్చి కాచుమ పెదళ్గిరి ధీరుఁడు వర్ధిలుఙ్
 .. ............ ..................ధరఙ్.

పడమటి మాలిక - సకారప్రాస - 69 చరణములు :

మొదలు ఉ. శ్రీసతిమందిరంబున వసించి సమంచితభూరి ..
వాసవిశేష సంపదల .................వైభవా

తుది దాసాబగొంది సంతసము దాల్చి పెదళ్గిరి శౌరివర్ధిలున్.

ఉత్తరపుమాలిక - లకారప్రాస - 163 చరణములు :

మొదలు ఉ. శ్రీలలితాంగియున్ బుడమి చెల్వయుఁ గొల్వఁగ బెల్వచూపు గో
పాలుఁడు

తుది .. ...... ..............ముద్దువీర భూ
పాలు పెదళ్గిరి ప్రభుఁడపార శుభోన్నతి ధాత్రివర్ధిలున్.

దక్షిణమాలిక - రకారప్రాస - 119 చరణములు :

మొదలు ఉ. శ్రీరమణీయమూర్తి నృపసింహుఁడు దుర్జయవైరివీరసం
హారుఁడు ముద్దువీరయ పెదళ్గిరి ధీరుఁడు.........

తుది. ... .. ...........పెదళ్గిరి ధీరుఁడు దక్షిణక్షితి
శ్రీరుచిరస్ఫురజ్జయముఁ జేకొని పౌరులు సన్నుతింపఁగా
వారణమెక్కి-వచ్చి శుభవైభవలీలల ధాత్రివర్ధిలెన్.

మొత్తము చరణములు - 426.

## సీసమాలికలు

వేంకటకవియే సీసమాలికలు రచించుటలోఁ బ్రథముఁడు. ఈతని యాంధ్ర కౌముది వేయి చరణములుగల సీసమాలిక.

వేంకటకవి ననుసరించి పుదుక్కోటలో, నుదురుమాటి వెంకన కవీంద్రుఁడు తొండమాన్ వంశావళిని సీసమాలికగా పూర్వతరముల నుండి తనకాలము వఱకుగల రాజుల వృత్తాంతము రచించెను. ఇందు 373 పంక్తులు గలవు.

తత్పౌత్రుఁడు సాంబశివకవి తన కాలము వఱకుఁ గల రాజుల చరిత్ర నొక దానిని సీసమాలికగా పూరించెను. ఆ మాలికయందు 342 పంక్తులు గలవు. మధురాపురాంధ్ర వాఙ్మయమునకుఁ జెందిన బాల కవి యనంతయ రచితమగు నల్లందిగళ్ వారి వంశావళి యను నదియు సీసమాలికయే. ఇందు 202 పంక్తులుగలవు.

## సాహిత్య రచనలు - మధుర కవితలు

నాటకాలంకారములు, కళికోత్కలికలు, విభక్త్యర్థి దేవతోదాహరణములు, సప్తతాళనటనలు, నట్లొట్లు, గీత ప్రబంధములు, చతుర్భద్రిక, అష్టభద్రికలు, బిరుదావళి, నామావళి, రంగఘోష, జయఘోష చతురుత్తర సంఘటనలు, యక్షగానంబుల వెలయుపదంబులు, దరువులు, ఏలలు, ధవళంబులు, మంగళ హారతులు, శోభనంబులు, ఉయ్యాలజోలలు, జక్కులరేకు పదంబులు, చందమామ సుద్దులు అష్టకంబులు, ఏకపద, ద్విపద, త్రిపద, చతుష్పదాష్టపదులు, నివియాది గానన్నియు లయప్రమాణంబుల నొప్పిమృదుమధుర వచన రచనలఁ బ్రసిద్ధంబైన యవి మధుర కవిత్వంబులు. (లక్షణశిరోమణి)

మధుర కవితలలోఁ బైని పేర్కొనఁబడిన రచనాభేదములలో నాటకాలంకారములు, యక్షగానపదములునను నివిరెంటను దక్షిణాంధ్ర వాఙ్మయమునుగూర్చి వ్రాయునపుడు మనము ముఖ్యముగఁ బరిగణింపఁ దగినవి. ఈ రెండింటినిగూర్చి యిటీవల విశేషపరిశ్రమ జరిగినది. వీనిని గూర్చియేగాక, తదితర పదరచనలనుగూర్చి యిప్పటికెన్నియేని వ్యాసములు వెలువడినవి. కాని తద్రచయితలెవ్వరును, సంప్రదాయసిద్ధమును, శాస్త్రీయమునునగు సంగీత భరతనాట్యవిజ్ఞానముతో సమన్వయమొనర్చి యక్షగాన స్వరూపముగూర్చిగాని, పదరచనా పథకమునుగూర్చిగాని సామాన్యులకేగాక, సాహిత్య జిజ్ఞాసువులకుఁగూడ నిదమిత్థమను లక్ష్య లక్షణస్వరూపము నందింపలేకపోయిరి. ముఖ్యముగా మధుర కవితా రచనలను విమర్శించునపుడు సాహిత్యజ్ఞానమేగాక సమధికమైన సంగీత శాస్త్ర పరిజ్ఞానముగూడ నావశ్యకమైయున్నది. అందును దక్షిణదేశమున

యక్షగాన నాటక పదరచయితలందఱును సంగీతసాహిత్యములలో సమర్థమును శాస్త్రీయమును నగు జ్ఞానముగలవారు. కావున నట్టిరచనలను మనము విమర్శించునపుడు కడుజాగరూకులమై యుండవలయును.

## యక్షగానము — నాటకము

యక్షగానము, నాటకము భిన్నరచనా ప్రక్రియలైనను, దక్షిణ దేశమున, తంజావూరిలో నాయకమహారాష్ట్ర రాజపరిపాలనలో యక్షగాన రచన యపారముగా నభివృద్ధిచెందినదని సాహితీచారిత్రక విమర్శకు లెల్లరును వ్రాసియున్నారు. కాని యాగ్రంథములను సాకల్యముగాఁ బరిశీలింపఁగా, దక్షిణాంధ్ర వాఙ్మయమున, నభివృద్ధిచెందినది నాటక రచనయా? లేక యక్షగానరచనయా? యనుసందేహము పొడసూపినది. ఈసందర్భమున సందేహ నివృత్తిచేయుటకు నావాఙ్మయమున నేఁడుపలబ్ధములగుచున్న కృతులనుండి యాయాగ్రంథకర్తలు తమరచనల నే రీతిగా పరిగణించిరో తొలుత తెలియఁజేయుచున్నాను.

దక్షిణాంధ్ర వాఙ్మయ ప్రారంభకుఁడు తంజావూరి రఘునాథుఁడు. అతఁడీ క్రింది యక్షగానరచనలను చేసినట్లుగా నాతని యాస్థాన కవులును, కుమారుఁడు విజయరాఘవ నాయకుఁడును స్పష్టపఱచి యున్నారు.

౧. శ్రీరుక్మిణీకృష్ణవివాహము. ఇది యక్షగానమని గోవిందదీక్షితుల వారు, సాహిత్యసుధలో "శ్రీరుక్మిణీకృష్ణవివాహ యక్షగానం ప్రబంధాన్ నటనైకభేదాన్" అనివ్రాసియున్నారు. కావున నిది యక్షగానమే కాని యలభ్యము.

౨. జానకీకల్యాణము. ఇది రఘునాథునికృతియే. దీనిని చాటు

"మెఱవడిఁ జూపు వాల్మీకి చరిత్ర
జానకీకల్యాణ చాటుకావ్యంబు
తా నిర్వహించిన తక్కినకృతులు" "రఘునాథ నాయకాభ్యుదయము"

పై పంక్తులే రఘునాథాభ్యుదయమున నున్నవి.

ఇది చాటుకావ్యమని పేర్కొనఁబడుటవలన, పద్యద్విపద కృతుల కన్న విలక్షణమైనది యనిమాత్రమే మనము తెలిసికొనఁగలము. ఇదియు నలభ్యమే కావున నితమిత్థమని నిర్ణయింపలేము. కావున నీమధుర కవితలలో రఘునాథునిరచన మొక యక్షగానము మాత్రమే.

ఇఁక విజయరాఘవ నాయకునికాలమున నీరచనలు విరివిగా సాగినవి. ఆతని యాస్థానమున నున్నవారట్టి రచనలఁగావించిరి. ఒక్క విజయరాఘవుని రచనలనే మొదట గ్రహింతము.

| పేరు | రచనాభేదము – | లభ్యమా ? అలభ్యమా ? |
|---|---|---|
| | నాటకము | అలభ్యము |
| 1. రాజగోపాల విలాసము | ,, | ,, |
| 2. ఉషాపరిణయము | ,, | ,, |
| 3. మోహినీవిలాసము | ,, | ,, |
| 4. మంజరీద్విపద | ,, | ,, |
| 5. సముద్ర మథనము | ,, | ,, |
| 6. జానకీకల్యాణము | ,, | ,, |
| 7. పుణ్యకవ్రతము | ,, | ,, |

లభ్యములు

1 కాళియమర్దనము – ముద్రితము – గ్రంథారంభమున స్పష్టముగా "కాళియమర్దన నాటకంబు నృత్యగీత వాద్యపద్యమై శారద్యంబు గనిపింప"

2. రఘునాథాభ్యుదయము – ముద్రితము – గ్రంథారంభమున రఘునాథనాయకాభ్యుదయ నాటకంబునకు సంవిధానం బెటువలెను అని కలదు.

3. ప్రహ్లాదచరిత్రము – ముద్రితము. "స్వామివారు హావణించిన ప్రహ్లాద నాటకంబు"

4. పూతనాహరణము – ముద్రితము "స్వామివారు హావణించిన పూతనాహరణ నాటకంబు"

5. విప్రనారాయణచరిత్ర – ముద్రితము "స్వామివారు హావణించిన విప్రనారాయణ చరిత్రమను విచిత్ర నాటకంబు"

6. కృష్ణవిలాసము – ముద్రితము. విజయరాఘవ సార్వభౌముఁడు హావణించిన కృష్ణవిలాస నాటకము.

విజయరాఘవ నాయకుని యాస్థానకవులు.

కామరసు వెంకటపతి సోమయాజి – విజయరాఘవ చంద్రికా విహారము. (ముద్రితము)

"శృంగార రసవర్ణా విర్భావంబునకు గర్భోద్ఘాటకంబుగా నొక నాటకంబు"

కోనేటి దీక్షితచంద్రుఁడు – విజయరాఘవ కల్యాణము – ముద్రితము "విజయరాఘవ కల్యాణంబను నాటకరాజంబు"

పురుషోత్తమ దీక్షితుఁడు – గ్రంథము పేరే తంజాపురాన్నదాన మహానాటకము ముద్రితము

రంగాజమ్మ – గ్రంథము పేరే మన్నారుదాస విలాసనాటకము ముద్రితము విజయరాఘవుని కుమారుఁడు మన్నారుదాసు.

హేమాబ్జ నాయికాస్వయంవరము (ముద్రితము) "హేమాబ్జ నాయికాస్వయంవరంబను నాటకంబునకు"

నాయకరాజుల వెనుక పాలించినవారు, మహారాష్ట్రరాజులు. వారును, వారియాస్థానకవులును బహుళముగా నీనాటకరచనలను వెలయించినారు. వారిలో సాహితీ భోజుఁడు శహాజీమహారాజు ప్రథముఁడు. ఆతని నాటకరచనలు మనకు లభ్యమైనవి. ఇవియన్నియు నాటకములనియే పేర్కొనఁబడినవి.

1. కిరాతవిలాసము "కిరాతవిలాసంబనెడు నాటకంబునందు"
2. కృష్ణలీలావిలాసము "కృష్ణలీలా విలాసనాటకమ్..సకలశ్రేయసే"
3. గంగాపార్వతీసంవాదము 'గంగాపార్వతీ సంవాదంబనెడునాటకంబు'
4. జలక్రీడలు "జలక్రీడలనియెడు నాటకంబు"
5. ద్రౌపదీ కల్యాణము "ద్రౌపదీ కల్యాణంబనెడు నాటకంబునందు"
6. భక్తవత్సల నాటకము – నాటకము పేరుతోనున్నది.
7. రతీకల్యాణము "రతీకల్యాణ నాటక కథాక్రమము"
8. రామపట్టాభిషేకము "రామపట్టాభిషేక మనెడునాటకంబు"
9. రుక్మిణీ సత్యభామా సంవాదము "రుక్మిణీ సత్యభామా సంవాదంబనెడునాటకంబు"
10. వల్లీకల్యాణము "వల్లీకల్యాణ నాటకము"
11. విఘ్నేశ్వర కల్యాణము "విఘ్నేశ్వరకల్యాణ మనెడునాటకంబు"
12. శచీపురందరము "శచీపురందర కల్యాణనాటకము"
13. శాంతాకల్యాణము "శాంతాకల్యాణ నాటకము"
14. సతిదాన శూరము "సతిదాన శూరనాటకము"
15. సతీపతిదాన విలాసము "సతీపతిదాన నాటకము"
16. సీతాకల్యాణము "సీతాకల్యాణంబనెడు నాటకము"

ఇవిగాక యీక్రింది శహాజీకృతులు నాలుగు ప్రబంధములుగా పేర్కొనఁబడి యున్నవి.

1. త్యాగరాజ వినోద చిత్రప్రబంధము
2. పంచరత్న ప్రబంధము
3. విష్ణుపల్లకిసేవాప్రబంధము
4. శంకరపల్లకి సేవాప్రబంధము

ఇవి ప్రబంధములను పేరుతోనున్నను నివినాటకములే. వీనిని సంగీతనాటకములు లేక గేయనాటకములని యందురు. ఆంగ్లేయభాషలో వీనిని 'opera' అనియందురు.[1] కావున శహాజీ కృతములన్నియు నాటకములె.

## ఇతర కవుల రచనలు

1. శేషాచలపతి

శాహారాజ విలాసము "లలితగతి శాహారాజు విలాసమనెడు నాటకము

సరస్వతీ కల్యాణము "సరస్వతీ పరిణయంబనెడు సరసనాటకము"

గిరిరాజకవి

రాజకన్యాపరిణయము "రాజకన్యాపరిణయ నాటకము"

రామమోహన కొరవంజి "కొరవంజి నాటకము"

లీలావతీ కల్యాణము "లీలావతీ కల్యాణ నాటకము"

వాదజయము "వాదజయంబను వరనాటకంబు"

సర్వాంగ సుందరీవిలాసము "శాహాధవుని సర్వాంగ సుందరి వివాహంబు నవవైఖరులుమీఱ నాటకము"

2. బాలకవి సుబ్బన్న

పంచకన్యా పరిణయము "పంచకన్యా పరిణయంబను నాటకంబు"

లీలావతీ శాహారాజీయము "లీలావతీ శాహారాజీయంబను నాటకము

శాహామహారాజ కల్యాణము "శాహామహారాజ కల్యాణనాటకము"

3. వాసుదేవకవి

పార్వతిపరిణయము "పార్వతీ పరిణయాఖ్యమనెడు నాటకంబు"

4. రామకవి

వాదజయ కొరవంజి "వాదజయ కొరవంజి నాటకం"

---

1 చూడుండు. పల్లకి సేవాప్రబంధము. ప్రొఫెసరు సాంబమూర్తిగారి యాంగ్లేయపీఠిక, శ్రీ. పి. వి. చలపతీశ్వర రావుగారి తెలుఁగుపీఠిక.

5. తులజాజీ లేక తులజమహారాజు.

౧. శివకామసుందరీ పరిణయము కృతికర్త తులజాజీయే భాసుర తుళజక్షితీశ......శివకామసుందరీ పరిణయ రూపనాటకము "బాగుగ నాడుద మీసభాస్థలిన్" అని వ్రాసియున్నాఁడు.

ఇందు సంస్కృత నాటకపద్ధతి గలదు. "నాద్యంతే సూత్రధారః సూ॥ వసంత ఋతువర్ణన...............

"ఓరి పారిపార్శ్వక యిటురమ్ము" అని సూత్రధారపారిపార్శ్వకులు ప్రవేశ పెట్టఁబడిరి.

౨. రాజరంజన విద్యావిలాస నాటకము. ఇది నాటకము పేరుతో నున్నది. పైనాటకమునంనువలె, సూత్రధారపారిపార్శ్వకులు గలరు.

6. ఏకమహారాజు - విఘ్నేశ్వర కల్యాణము

"ఏకమహారాజు ప్రణీతమ్ - విఘ్నేశ్వర
పరిణయమ్ నామమ్ నాటకమ్"

7. శివాజీమహారాజు - అన్నపూర్ణా పరిణయము

"అన్నపూర్ణా పరిణయంబను నూతననాటకంబు
నటియింపఁ జేసి"

ఇందు 1-2 అంకములు గలవు.

8. మాతృభూతకవి - పారిజాతాపహరణము.

"పారిజాతాపహరణ నాటకమందు"

అని గద్యలో గలదు.

ఇందంక విభజనగలదు. అయిదంకములు గలవు.

ఇతర కవికృతులు.

9. పారిజాతాపహారము - శ్రీనారాయణతీర్థులు

"పారిజాతాపహారాఖ్యం నాటకమభినీయతే"

10. బాలకృష్ణలీలా విలాసము - అక్కనామాత్యుఁడు.

"బాలకృష్ణ లీలావిలాస లాలిత నాటకంబు"

11. శివపారిజాతము - వెంకట కృష్ణకవి.

"శివపారిజాత నాటకమా డేటటువంటి మార్గము"

12. అష్టావధానికవి

చంద్రశేఖర విలాసము "శ్రీర్మం నాటకమ్"

13. చల్లాసూరయ

వివేకవిజయము "అలరఁగనీ వివేకవిజయాభిధ నాటకమెవ్వ రేని"

14. మేలత్తూరి వేంకటరామశాస్త్రి

"ఈతని కృతములగు [1]పదునొకొండింటికి నాటకము"లనియే పేరు

మధుర

కుందుర్తి వేంకటాచలకవి మిత్రవిందా పరిణయములో

సీ. "ఘటియించినావు ద్రాక్షా పాకమున

బహునాటకంబులు సమున్నతిఁ జెలంగ"

అని తాను పెక్కునాటకములు రచియించినట్లు చెప్పుకొనియున్నాఁడు. కాని యందొకటియుఁ గానరాలేదు.

తిరుమలకవి "చిత్రకూట మాహాత్మ్యము" అనునాటకమును రచియించెను. కవియే గ్రంథావతారికలో

"గొనబుమీఱిన చిత్ర

కూట మాహాత్మ్యమను నాటకము"

అని వ్రాసియున్నాఁడు.

ఎల్లయ చంద్రతారా విలాసము లేక, తారాశశాంకము 'తారాశశాంక కతిపయ నాటక ప్రబంధములు.'

---

1. చూడుఁడు, మేలటూరు భాగవతమేళ నాటకములు.

మైసూరు

కంఠీరవరాజు - కంఠీరవరాజు పదునాలుగు కృతులన్నియు గేయనాటకములు.

వానిలోఁ గొన్నింటికి పావకినాటకము, వైవస్వతనాటకము, నైరుతినాటకము, వారుణినాటకము, వాయవినాటకము, కౌబేరినాటకము, అను పేరేయున్నది. తక్కినవి నృత్యగేయనాటకములు. అందు [1]వసంతోత్సవ విలాసము "నాట్యమేళానగతి ప్రబంధనాటకము."

పైని నిరూపించిన వివరణమును బట్టి, దక్షిణాంధ్ర వాఙ్మయమున నాటక రచనలే గాని యక్షగానరచనలకు ప్రాధాన్యమే లేదని స్పష్టమగుచున్నది గదా! యక్షగానము వేఱు, నాటకము వేఱు అను నిశ్చితమగు నభిప్రాయ మీకాలమున కవులకునుండుటచేతనే వారు తమ రచనలలో విశదముగా, 'నాటకము' రచించుచున్నానని 'యక్షగానము' రచించుచున్నానని తెలిపియున్నారు. తంజావూరిలో మహారాష్ట్రరాజగు శహాజీమహారాజు కాలమున గిరిరాజకవి, తానురచించిన కృత్యంతరములు నాటకములని చెప్పినను, "శాహేంద్ర చరిత్రము" అను కృతిమాత్రము "యక్షగానమని" యిట్లు చెప్పియున్నాడు.

"ద్వి. సరస సాహిత్యలక్షణ విదుషేర
నిరవొంద శాహరాజేంద్రుని పేర
. . . ...... .........
కండ చక్కెరలీలఁ గల్పించురుచుల
గండుమీఱిన యక్షగానంబుమిగుల
గరిమను గిరిరాజకవి విరచించె"

మైసూరిప్రభువగు చిక్కదేవరాయలపేర రచితమైన చిక్కదేవరాయ విలాసము, యక్షగానమని, కవియే యిట్లుచెప్పియున్నాఁడు.

1. ఈగ్రంథమున పుట 430 లోను, నంతకుముందును నేను వీనిని యక్షగానములనే పేర్కొంటిని. కాని యీతరువాత పరిశోధనలవలన నివి గేయనాటకములని గుర్తించితిని.

" అభ్యుదయ పరంపరాభివృద్ధిగా నాయొనర్పంబూనిన శ్రీచిక్క-దేవరాయ విలాసంబను **యక్షగానంబునకు** గథాప్రారంభంబెట్టిదనిన "

బెంగుళూరునిర్మాత పెదకెంపరాయఁడు తన గంగాగౌరీవిలాసమున నది యక్షగాన మని పేర్కొన లేదు. గావున దానిని నాటకముగానే మనము పరిగణింప వచ్చును.

పై విధముగా, తంజావూరి నాయకమహారాష్ట్రరాజుల కాలమున రచితములైన పై కృతులన్నియు విశదముగా నాటకములుగా పేర్కొనఁబడియున్నవి. అయినను పై కృతులలో కొన్నింటిని " ఆంధ్రవిశ్వకళా పరిషత్తువారు [1]3 సంపుటములలోఁ బ్రకటించిరి. మొదటి సంపుటమున 1. ప్రహ్లాద చరిత్ర 2. పూతనాహరణము 3. కాళీయమర్దనము 4. హేమాబ్జనాయికాస్వయంవరము. రెండవ సంపుటమున 1. విజయ రాఘవచంద్రికావిహారము 2. విజయరాఘవ కల్యాణము 3. తంజావు రాన్నదాన మహానాటకము. మూఁడవ సంపుటమున 1. ద్రౌపదీ కల్యాణము 2. రతికల్యాణము 3. శచీపురందరము 4. సతిదానశూరము 5. పంచకన్యాపరిణయము. మొత్తముమీఁద పండ్రెండు నాటకములు గలవు.

పై మూఁడు సంపుటముల ముఖపత్రములపైని పెద్దయక్షరము లతో **యక్షగానములు** (తంజావూరు) సంపుటము అని కలదు. పైన నే నుదాహరించిన రీతిని నీ సంపుటములలోఁ బ్రకటితములైన వన్నియు **నాటకములుగా** కృతికర్తల చేతను, తంజావూరి కేటలాగు సంపాదకుల చేతను (ఇది యాంధ్రవిశ్వకళా పరిషత్ప్రకటితమే !) పరిగణితములు కాగా, ప్రస్తుత సంపాదకులు యక్షగానములుగా వాని నెట్లు పేర్కొనిరో దురూహ్యముగనున్నది. ప్రథమ సంపుటము యొక్క యుపోద్ఘాతములో సంపాదకు లిట్లువ్రాసిరి. " ప్రహ్లాదచరిత్రము – విజయరాఘవ కృతము.

1. ఈ మూఁడింటికి పరిష్కర్తలు, పీఠికాకర్తలు ప్రొఫెసరు గంటిజోగి సోమయాజిగారు, ఎమ్. ఏ.

ఇది యొక దృశ్యకావ్యము ఇట్టి రచనములను యక్షగానములనియు ప్రబంధములనియు, మహానాటకములనియు నాటకములనియు నాయా కవులు పేర్కొనుచు వచ్చిరి. ఈ జాతి కావ్యములు నాట్యసంగీత ప్రధానములై నేటివీధి భాగవతములను బోలియుండును"

కాని పరిష్కర్తలు పై వివరించిన రీతిని నాయాకవులు నాటకములని పేర్కొనిన వానిని యక్షగానమని పేర్కొనలేదు. ఇక ప్రబంధములను పేరుతోనున్నవి కూడ నాటకములుగానే పరిగణితములు. త్యాగరాజ వినోద చిత్రప్రబంధము. ఇది నాటకముగానే పరిగణితము దీనినే, "కాళీతాండవ నాటకము" అని ఆంధ్రవాఙ్మయ సూచిక పేర్కొనినది. పంచరత్న ప్రబంధము, శంకర విష్ణుపల్లకి సేవప్రబంధములు, రచనా రీతిచే ప్రబంధములైనను నాటకముల క్రింద పరిగణితములు. ఈ ప్రబంధములు నాటకభేదములలో [1]గేయ నాటకములు లేక సంగీత నాటకములు అను రచనకుఁ జెందినవి. పంచరత్న ప్రబంధము నిట్టిదియే. "మహానాటకము" అని యొక్క తంజాపురాన్నదాన మహానాటక కర్త మాత్రమే పేర్కొన్నాఁడు గాని వేఱెవ్వరు పేర్కొనలేదు. కృతికర్తలు నాటకములనియే వీనిని పేర్కొనగా, పరిష్కర్తలు, వీనికిన్ని నామాంతరములున్న వనుటయెంత మాత్రము సమంజసముగ లేదు.

"హేమాబ్జనాయికా స్వయంవరము" ఉపోద్ఘాతములో

"ఈ యక్షగానమును రచించిన వాఁడు మన్నారు దేవుఁడు" అని వ్రాసిరి కాని కవియే - ప్రస్తావనలో - మన్నారుదేవుండు...హనఁణించిన హేమాబ్జనాయికా స్వయంవరంబను నాటకంబునకు అని వ్రాసియున్నాఁడు. పరిష్కర్తలు దీనిని చూచియుండరు.

---

1. శంకర విష్ణుపల్లకిసేవ ప్రబంధములఁ బ్రకటించిన ప్రొఫెసరు సాంబమూర్తి గారు, వీనిని గేయరూపములు (వీనినే యింగ్లీషులో operas) అందురు. లేక సంగీత నాటకములుగా పరిగణించిరని యీ వఱకే తెలిపితిని.

మూఁడవ సంపుటమున నిట్లే శహాజీ కృతులను గూర్చి (పుట IV) "శహాజీ అతని యక్షగానకృతులు" అని వ్రాసి, తిరిగి V-వ పుటలో శహాజీకృతులు "ఆ యిరువదింటను బదునాలు నాటకములుగను నాలుగు ప్రబంధములుగను, గ్రంథకర్తచేఁ జేర్కొనఁ బడినవి" అని కలదు. పై యుద్ధృతాంశములవలన పరిష్కర్తలకు, యక్షగాన నాటక భేదమవగాహనముకాలేదనుట స్పష్టము.

XV-వ పుటలో రాజమోహాన కొరవంజి-ఇది కొరవంజి అనఁగా ఎఱుకత పాత్రవిశిష్టమైన యక్షగాన ప్రాయరచన అని కలదు. కాని తంజావూరి కేట్లాగులోనిది "కొరవంజి నాటకం" అని కలదు. (చూ. పుట 205) యక్షగానములు నాటకములు భిన్నరచనములు కావుననే, తంజావూరి కేటలాగునందు, యక్షగానములు వేఱుగను, నాటకములు వేఱుగను పరిగణితములై యున్నది.

సారాంశమేమనఁగా తంజావూరిని వెలసినవి యే యొకటి రెండు యక్షగానములు తప్ప తక్కిన వన్నియు నాటకములే. ఇవి యన్నియు సంస్కృతనాటకముల పద్ధతి పూర్తిగా ననువదింపక, దేశీయమైన పద్ధతులలో నూతనముగా రచితములైన స్వతంత్రనాటకములు - దక్షిణాంధ్ర వాఙ్మయము యొక్క ప్రత్యేక విశిష్టత యీ స్వతంత్రనాటక రచనము. నాయకరాజు లీ స్వతంత్రనాటక సృష్టి యెట్టులొనర్చిరో కనుగొందము.

## నాయక రాజుల స్వతంత్రనాటక రచన విధానము

౧. నాయకరాజుల కాలమునకు ముందు యక్షగానములను నొక గేయరచనా భేదము వెలయుచుండెను. అందు కథావస్తువున్నను ప్రాయికముగా నవి సంగీతపద ప్రాధాన్యములైనవి. అవి కేవలము శ్రవ్యములే కాని, ప్రదర్శన యోగ్యములు కావు. ఇట్టి రచనలు, శ్రీనాథ మహాకవి యొక్కయు, నాతనికి సమకాలికులును తిరుపతి క్షేత్రమున సంకీర్తనాచార్యులునగు అన్నమయ్యగారి యొక్కయు, కాలమున ప్రవర్తిల్లినట్లుగా నీ క్రింది పంక్తులను బట్టి తెలియనగును.

సీ. " కీర్తింతురెవ్వాని కీర్తిగంధర్వులు
గాంధర్వమున యక్షగానసరణి "

అని శ్రీనాథుని భీమఖండము.

"యక్షగాన పదంబుల నలరునట్టి" అని అన్నమయ్యగారి సంకీర్తన లక్షణమునఁగలదు. ఆనాటి యక్షగాన కృతులు మనకు లభ్యము కాలేదు కానిప్రోలుగంటి చెన్నకవి సౌభరి చరితము, కర్తృత్వము తెలియని "లక్ష్మీకల్యాణము"అను యక్షగాన కృతి క్రీ.శ. 1500 నాటికే వెలసినవి. ఆ వెనుక విజయనగర రాజుల కాలమున వెలసిన కందుకూరి రుద్రకవి యక్షగానము సుగ్రీవ విజయము చాల ప్రసిద్ధమైనది.

నాయకరాజులలో రఘునాథుఁడొక యక్షగానమును రచించినట్లు మనకుఁ దెలియుచున్నది గదా! కాని తరువాత రెవ్వరును యక్షగానము (పై రీతిగా శ్రవ్యగాన ప్రయోజనము మాత్రమే గలది.) వ్రాయలేదు, సరికదా నాటకములే వ్రాసినట్లు పై వివరణము తెలుపుచున్నది. దానికి కారణము నాకిట్లు లోఁచినది. సాహిత్యానుభవముగల పెద్దలు వితర్కింతురు గాక !

సంగీత సాహిత్య విద్యావిశారదుఁడు, మార్గదేశి సంప్రదాయ సమభిజ్ఞుండును నగు రఘునాథ నాయకుఁడే తంజావూరున ప్రభవించిన స్వతంత్రమైన తెలుఁగు నాటకరచనకు మూలపురుషుఁడని నా యభిప్రాయము. ఆతఁడు యక్షగాన కృతిని రచించినను నది శ్రవ్యప్రధానమే యగుటచేత, నందలి నాటకోపయోగ గేయపద పరికరసంపత్తిని గ్రహించి సంస్కృత నాటకరీతులను మేళవించి, ప్రదర్శన యోగ్యమై దృశ్యమాన మగు నొక నూతన నాటకసృష్టి గావించుటకు పథకము నేర్పఱచెను. రఘునాథ నాయకుఁడొనర్చిన నాటకశాలా నిర్మాణము కూడ నీ నాటక సృష్టికిఁ దోడ్పడి యుండవచ్చును. రఘునాథనాయకుని కుమారుఁడగు విజయరాఘవుని కాలమున నీపథకము క్షుణ్ణమైనది. ఆతఁడు పెక్కునాటకరచనలు గావించి దీనిని వాఙ్మయమున సుప్రతిష్ఠితము. చేసెను. నాయకరాజుల కాలమున నీ రచనా విధానమెట్లు పరిణతిఁ జెందినదియు నీ క్రింద వివరించుచున్నాను.

౧. సంస్కృత నాటకములలో పురుషులే, పురుష వేషమును, స్త్రీ వేషముకూడ వేయవలసి యుండెను. అట్టి వేషధారులగు పురుషులకు "భృకుంసుఁడు" అని పేరు. కాని రఘునాథనాయకుఁ డాపద్ధతి మాన్పించి, స్త్రీలచేతనే స్త్రీవేషములు వేయింప నారంభించెను. ఈ విషయమునే,

> "భరత విద్యాధురంధరుఁడొట
> రంగస్థలంబు రామాలంకృతంబుచేసె"

అని విజయవిలాసమున చేమకూర వేంకటకవి చెప్పియున్నాడు.

౨. రంగస్థలమనఁగనే మనకు నాటకశాల జ్ఞప్తికిరాక మానదు. "భరత విద్యాధురంధర" అను పైవిశేషణము రఘునాథుని భరత నాట్యశాస్త్రము ననుసరించి రంగస్థల నిర్మాణము చేసెనని సూచించు చున్నది. మఱియు, నాటకశాలను నాతఁడు నిర్మాణము చేయించెనని వేంకటకవి చెప్పియున్నాడు.

> ఉ. మాటలనేర్పులా ......... బహుదానలీలలా
> నాటకశాలలా యొకటనవ్వలదు. (1 – 28.)

అనఁగా నాటక ప్రదర్శనముకొఱకు నాటకశాలల నిర్మాణముచేసెను.

నాటకశాలలయందు నాయకరాజులు కొలువు తీర్చెడి వారని ప్రహ్లాద చరిత్రనుండి తెలియుచున్నది.

"హిరణ్యకశిపు వాక్యం — రారా! కటికి నాటకశాల కొలువుకు ఆచార్యులు మొదలైన వారిని రప్పించరా.

కటికి - అయ్యయ్య అయ్యా ఆచార్యనందన! ఏలినవారు నాటక శాల చూస్తామన్నారు రారయ్య!"

హిరణ్యకశిపుడు పిలువగా నాటకశాలవారు వచ్చిరట యెటువలెను. విజయరాఘవ చంద్రికావిహారనాటకమున తంజావూరి వర్ణనలో నాటక శాలల ప్రశంసగలదు.

"భూరమణీమణిహారము, తంజపురము సంపదల కొటారము, వలరా యని మీాద నేలలు చాలవర్ణింప నేర్చిన బాలలు విలసిల్ల నాటకశాలలు నందు వింతవింతలు కృష్ణలీలలు" హేమాబ్జనాయికా స్వయంవరమున నాటకశాలప్రశంసగలదు. గోపాలుఁడు రావేయోబరాబరి! నాటకశాలలోని బిరుదు పాత్రను రప్పించవె."

నాటకశాలను (Theatres) గాక బయలు నాటకశాలలు (Open air theatres) నాయకరాజుల కాలమున నుండెడి వని విజయరాఘవ చంద్రికా విహారనాటకమునగల కమ్మ వక్కాణనుండి తెలియుచున్నది.

సీ. శ్రీరాజగోపకుమారులౌ విజయ రా
ఘవనాయనయ్య వారవధరింపఁ
గదరయ్య దేవరపదపద్మములకు మీా
బయలినాటకశాల పదునుచునైన
లీలావతిని వదివేలదండంబులు

బయలున నున్న రంగస్థలమున నాడు నాటకములకు "బయలునాటకము అని పేరు. అముద్రితమైన గొడగూచి బయలునాటకము" అడయారు (మదరాసు) పుస్తకభాండారమున నున్నది.

3. సంస్కృత నాటకములయందువలె, ప్రాకృతాది భాషాభేదములను విడనాడి, తెలుఁగు భాషలోనే, గ్రాంథిక వ్యవహారిక భాషామూలమున నుత్తమ నీచపాత్రల సంభాషణములను రచించు పద్ధతి యీ నాటకములలోఁ గలదు.

నాటకములలోని పాత్రలొండొరులతో భాషించుట సంభాషణ యనఁబడును. యక్షగానములలో నీసంభాషణయే యుండదు. "కవియే పాత్రయేమను చున్నాడు" అని చెప్పును. కావున సంభాషణ యనునది, యక్షగానములను సంస్కరించుట యందు చేసిన యొక గొప్ప మార్పని తెలియవలెను.

౪. సంభాషణ యనఁగా భాషాసంబంధిముగాన నిచ్చట కొంత వివరణము కావలసియున్నది. నాయకరాజులు తెలుఁగువారైనను, వారు తెలుఁగును రాజభాషగా చేసినను, వారు పాలించినదేశము ద్రవిడ దేశము. కాబట్టి యచ్చటి ప్రజావ్యవహారభాష తమిళము. ఆ కారణము చేత వారు నాటకములలో తమిళభాషలో సంభాషణము ప్రవేశపెట్టిరి. ఇక ఉత్తమపాత్రలకు, విద్వాంసులకు, సంస్కృతభాషనే ప్రవేశపెట్టిరి. (చూ. దక్షిణాంధ్ర వాఙ్మయము భాష) అచ్చటచ్చట కన్నడముకూడ కన్పట్టును. మహారాష్ట్రరాజులు వచ్చినవెనుక, మహారాష్ట్రమునకుఁగూడ యీసంభాషణలలో ప్రవేశము గన్పట్టుచున్నది. ఇట్లు సంభాషణలయందు భాషాసాంకర్య మగుపడుచున్నను, నది నాటకోచితమై రసస్ఫురణ కల్గించుచున్నదేగాని వైరస్యకారణము కాలేదు. ఇన్నిభాషలున్నను, నాటకములందు తెలుఁగు ముద్రయేకలదు. ఇంకొక విషయముగూడ నీ సందర్భమునఁ దెలుపవలసి యున్నది. ఈనాఁడు మనము సంస్కృతనాటకముల ననువదించునపుడు పాత్రోచిత భాషవాడక, గ్రాంథికభాషనే సర్వేసర్వత్ర వాడుచున్నాము. అట్టి పరిస్థితులలో పాత్రోచిత భాషోపయోగావకాశమున్నయానాఁడు నాయకరాజులు కేవల సంస్కృతనాటకానువాదములు చేయక ప్రత్యేకముగ సంధ్రతాముద్రగల నాటకములను సృష్టించుటయే వారి యపూర్వ సాహిత్యాభిజ్ఞతకు నిదర్శనము.

౫. సంస్కృత నాటకమునందువలె, నాంది ప్రస్తావనలను విసర్జించి 'కైవారము' ను ప్రవేశపెట్టుట. విజయరాఘవుని విప్రనారాయణ చరిత్రమున కైవారము గలదు. మేళగాంద్రదది చదువుమురు.

౬. యక్షగానముల యందిష్టదేవతాస్తుతి యున్నది. కాని విజయరాఘవనాయకుఁడు సీస పద్యముతో నాటకము ప్రారంభించుచు నొక క్రొత్త పథము ద్రొక్కినాఁడు.

సీ. భోజకన్యా ముఖాంభోజ రాజమరాళ
సత్యాఘనస్తన స్తబక భృంగ
జాంబవతీ విలోచన చకోరశశాంక
మిత్రవిందా తటిన్మేఘరూప

భద్రవశావశ భద్రదంతావళ
　　వరసుదంతా మనోవన మృగేంద్ర
లక్షణారూప కలాపినీపర్జన్య
　　భానుసుతాలతా పారిజాత

గీ. షోడశ శ్రీసహస్ర చతుఃప్రసార
హారసారమసార మోహనశరీర
విజయరాఘవ భూపాల భజనలోల
కేలుమోడ్చెద రాజగోపాల ! నీకు

పై పద్యమున శ్రీకృష్ణుని యష్టమహిషులను పేర్కొనుటయే గాక, తన నామముకూడ నిష్టదేవతాస్తుతిలో నుల్లేఖించియున్నాఁడు. ఇది యెంతయు నూతనము. యక్షగానములయం దిట్టి విధానము లేదు.

౭. నాటకమున విదూషక పాత్రగాని, [1]అంకవిభజనముగాని లేవు.

౮. అన్నింటి కన్నముఖ్యమైన సంస్కారము, నాటకమునందలి సంగీత నాట్యవిధానము. యక్షగాన రచనలు ప్రాయికముగా దేశిపద ప్రాధాన్యములని తెలిపితిని. అందు ప్రయుక్తములైన, ఏలలు, జోలలు సువ్వాలలు, మంగళారతులు, ధవళములు, చందమామపదములు దరువులు, ద్విపదలు, చౌపదలు, జక్కులు మొదలగు వానికి నాటకములలో ప్రవేశము గల్పించిరి. క్వాచిత్కముగ పద్యములుండును. ఇవియే గాక, సుసంస్కృతములైన పదరచనలును నాటకమున నుండును. అవి రాగతాళప్రయుక్తములై యుండును.

౯. నాటకములలో నచ్చటచ్చట నాట్యముగలదు. నాట్యగేయములును రచితములైనవి. బిరుదు, పాత్రలు (నాట్యకత్తెలు) పదకేళివినిపించి నాట్యముచేయుట గాననగును.

౧౦. భరతవాక్యము కొన్నింటగలదు.

---

1. అంకవిభజనము—శివాజీరాజు "అన్నపూర్ణాపరిణయ" నాటకమునందుఁ గన్పట్టుచున్నవి. ఇందు రెండంకములు మాత్రమే గలవు.

నాయకరాజులును, తదాస్థానకవులు వ్రాసిన నాటకములకు తరువాత తంజావూరును పాలించిన మహారాష్ట్రరాజుల నాటకములకుఁ గొంత భేదమున్నది.

౧. నాయకరాజులు వైష్ణవులగుటచేతను, నందు ముఖ్యముగా విజయరాఘవ నాయకుఁడు వీరవైష్ణవ సార్వభౌముఁడగుటచేతను, వైష్ణవ భక్తి ప్రపత్తిగల కథావస్తువులనే యాతఁడితి వృత్తములుగా గ్రహించెను. పూతనాహరణము, కాళియమర్దనము, ప్రహ్లాదచరిత్ర, విప్రనారాయణ చరిత్రము మొదలగునవి.

మహారాష్ట్రరాజులు ప్రాయికముగా శివభక్తులు. అందును శహాజీ తిరువారూరునందు త్యాగేశ స్వామిభక్తుఁడు. అందుచే, శివసంబంధమైన యితివృత్తములుగల నాటకములు వెలసినవి. గంగాపార్వతీ సంవాదము, పార్వతీ పరిణయము, విఘ్నేశ్వరకల్యాణము, వల్లీ కల్యాణము మొదలగునవి.

౨. నాయకరాజుల కృతులలో, రచనయందు మూఁడువంతులు తెలుఁగు, తెలుఁగు పద్యములు, తెనుఁగుపద రచనలేయుండును. మహారాష్ట్రరాజుల కృతులలో సంస్కృత భాషాప్రాధాన్యము హెచ్చు. అందును శహాజీరాజుకృతులలో నెక్కడచూచినను సంస్కృత భాషా ప్రభావము స్పష్టముగా కన్పట్టును.

ఈతని కృతులలో 'సతిదాన శూరము' అను నాటకమున ౩౮ శ్లోకములున్నవి. కాని యవియన్నియు శహాజీకృతములుకావు. ప్రాచీన కావ్యములనుండి యుదాహరింపఁబడినవి పెక్కులు.

౩. మహారాష్ట్రరాజుల కృతులలో కవిత్వముకన్న పాండిత్యప్రదర్శనము హెచ్చుగానుండును. త్యాగవినోద చిత్రప్రబంధ మిందులకు సాక్షీభూతము.

౪. పురోహితుల సంభావనతగవులు, ముత్తయిదువులముచ్చటలు, ఆస్థానవిద్వాంసుల యేషాగాథాలు, మహారాష్ట్రరాజుల కృతులలో నంతగా కన్పట్టవు.

౫. జానపద గేయములు నాయకరాజుల కృతులయందు తక్క మహారాష్ట్రరాజుల నాటకరచనలలో నున్నవాయను విషయము పరిశీలింపఁ దగినది. నాయకరాజుల నాటకములలో నున్న జానపదముల నిందు పొందుపఱచు చున్నాను.

సుసంస్కృతమగు పదములను గేయములను, నాటకములలో నాయకరాజులు హెచ్చుగా వాడియున్నను, సామాజిక ప్రజాభిరుచి ననుసరించివారు జాన పద గేయములను నచ్చటచ్చట వాడిరి.

గొల్లపదాలు - పూతనాహరణమున నున్నవి.

౧. ఓటికిస్నెరమీటుకొంట గొల్లలారో ఆ
యేటి సయిసెనేటిమాపు గొల్లలారో!
తందనాలు పాడుకొంట మనమురాగా ఆ
మందలోన సద్దురేగె గొల్లలారో!
....................................
బూసినూసి కేకయేసి గొల్లలారో వాడు
గోసివిడఁగ దూసెగదర గొల్లలారో!

౨. రెండురెండు యిప్పగింజలే తుమ్మెగిలో
రెండువేల మాయావుమందల్ తుమ్మెగిలో
మూడుమూడు యిప్పగింజలే తుమ్మెగిలో
మూడువేల మాయావుమందల్ తుమ్మెగిలో

౩. కుడుములు పిండికూర వెన్నెలాహే
కూకుండితినఁగదే వెన్నెలాహే
నల్లేరుచురదంట వెన్నెలాహే
నమలవెఱచునె మాగంగ వెన్నెలాహే
పల్లేరుముండ్లంట వెన్నెలాహే
పొఱవెఱచునె మాగంగ వెన్నెలాహే
సాకబెట్టి నీకుమ్రొక్కి యేకవీర మమ్మా
సాకిసంతరించవమ్మ యేకవీర!

౪. ఏట్లో పాఱేటి యెఱ్ఱన్నిగంగా
పాలలోనుండేటి పచ్చటీగంగా
ఎట్లో మాయెఱ్ఱన్న యెచ్చరించంగ
పాఱేటిగంగొచ్చి పవ్వళించంగ
చల్లనితల్లి మీకుజాతరలు సేసేమమ్మా
నల్లావుల పాలపొంగళ్లు పెట్టేమమ్మా
గొల్లాలకెల్లాను కొలముదేవరవై
యెల్లమ్మ! యెల్లమ్మ! ఏలుకోవమ్మ!

౫. నల్లనిదేవర నామాముసాతిన
బళ్లారాయుఁడు బసవయ్యకొడుకు
నారదమయసుప్ప నాతినిపెండ్లాడి
బారతకతసెప్పె బైరదేవరకు
రంబకుపుట్టెను రావణుండనగాను
కుంబకర్ణుని పెద్దకొడుకు గాదటరా
అతికాయుదంగమండల ధమ్మరావుతో
అతివక్రై పోరాడి రదివింతగాదా
మనకువరాలిచ్చే మైలారుదేవర
అనుమంతుదేవర కల్లుండుగాడా

౬. మఱ్ఱిమాని కిందనున్న మాతంగిరాణి
యెఱ్ఱమ్మ చెఱుపు చేయించేనుగాని
చింతమాని కిందనున్న శివసత్తిరాణి
సంతబయటనున్న ఓసాంబవీరాణి
బత్తితో తిరువళిక యెత్తేనునీకు
బుత్తిముత్తి యియ్యావమ్మ పోలేరమ్మ
సత్తెముగల్గినతల్లి చాలమేలు
పత్తిచేను బయటనున్న ముత్తేలమ్మనీవు
పళ్లెందు నేతిదీపం పట్టేనునీకు
సిళ్లాడెనమ్మ ఓ కొట్లారిగంగా

కాటమరాజు పదాలు - (విజయరాఘవ కల్యాణము నుండి)

౧. కుంభములో పుట్టినట్టి కుంభకర్ణుడి కొడుకువై
కుంభమల్లా దింటివిగదర ఓ కాటమరాజా ?
కూరనార వెతకవుగా ॥

౨. అంబాలిక సొగసైన అంబోధి దాటువేళ
పంబలు వాయింపుచును - ఓ కాటమరాజ
కంబళి నాచుకొంటివిగా ॥

3. సుప్పనాతి ముక్కుపోయి నొప్పిచేత మూలుగంగ
ఇప్పపూలదండవేసి - ఓ కాటమరాజ
అప్పుడే కూడితివిగదర ॥

కంబమురాయని మీది పదములు.

౧. సరిద పారకేలబూని
వెలుగుమీది తొండవలెను
ఎలుగురాజు మీదనెక్కి - ఓ కంబమురాయ
జలదారి దాటితివేర

౨. మంచము నెత్తిబెట్టుక
కంచము వాయించుకొంటి
మంచుకొండ మీదనెక్కి - ఓ కంబమురాయ
చెంచివికూర దెచ్చితిగా

పోలేరమ్మ పదాలు.

౧. బూరుగమాని గని
బూచియని వెఱచుకొని
బొబ్బరింతవు గదమ్మ - పోలేరమ్మా

౨. వాలు చన్నులల్లాడగ
నాలుకను వెళ్ల బెటుక
పూళ బెట్టుదువుగదమ్మ - పోలేరమ్మా

కూనలమ్మ పదాలు.

౧. కుండనిండ కొండగోగు
(దండిగాను) కూరవండి
కూకుండి తిందువమ్మ — కూనలమ్మా

౨. కోతికూన చంకబెట్టి
(బాతిగాను) కోటయెక్కి
కొక్కిరింతువు గదమ్మ — కూనలమ్మా

౩. కూటికుండ తెఱచివేసి
(గునిసి) గునిసి యాడుచూను
కుక్కల దోలుదువమ్మ — కూనలమ్మా

దరమరాజుమీఁది పదాలు. ౧

౧. ఉడుమూల బట్టితెచ్చి
నడుములకు తాడుగుచ్చి
కొడవలి చేతికిచ్చి — ఓ దరమరాజ
అడవులలో నాడితివిగా

౨. బొద్దికూర సద్దిగొంచు
మద్దెల నెత్తిబెట్టుక
మద్దిమాని మీనకెక్కి ఓ దరమరాజ
యెద్దులను మేపుదువుగా

దరమరాజు పదాలు. ౨

౧. ఉప్పులేని సల్లిగంజి ఓ దరమరాజ!
వూదుక తాగుదువయ్య ఓ దరమరాజ!

౨. ఉట్టిమీది కెగరబోయి ఓ దరమరాజ!
కాలువూనమాయెగద ఓ దరమరాజ!

౩. వొద్దిమాని మీదనున్న ఓ దరమరాజ!
వూగివూగి యాడుమయ్య ఓ దరమరాజ!

౪ ఉల్లంకి పిట్టవలె ఓ దరమరాజ!
పులికి పులికి ఆడుమయ్యా ఓ దరమరాజ!
౫. ఊసర వెల్లివలె ఓ దరమరాజ!
పూచితల యాడుమయ్యా ఓ దరమరాజ!

కేతినాయకుని పదం – (పంచకన్యా పరిణయము నుండి)

కేతినాయకుడే
విందులకై తేను ముందువచ్చువాడె
కదనాలకై తేను కడకేగువాడే
కవిగాయకులకై తే – కానేయనివాడే
ఎల్లలంజలకై తే కొల్లబెట్టేవాడే
తోయజాక్షులపై దమిగల్గువాడు
కేతినాయకుడే

చందమామ పదం – శాహేంద్రచరిత్ర – గిరిరాజుకవి.

వలనొప్పచల్లనివాడవు గదవోయి చందమామా చాల
వలనున్న యింతులనెలిచెదేటికి చందమామా

పైని వివరించిన వివరణమువలన, దక్షిణాంధ్ర వాఙ్మయమునకు ప్రత్యేకత నాపాదించినవి, దృశ్యకావ్యములైన నాటకములేగాని, శ్రవ్యము లగు "యక్షగానములు" కావని తేటపడుచున్నది. అందును తంజాపూరి యందు వెలసిన రచనలలో యక్షగానరచన మొక్కటియేయని నిరూపించితిని. వాస్తవస్థితి యీవిధముగా నుండఁగా, యక్షగానమునుగూర్చి వ్రాసిన విమర్శకులెల్లరు నీక్రిందిరీతిని లిఖించుట దురూహ్యముగనున్నది.

"తంజావూరి ప్రజాసాహిత్యము నంబారీయెక్కించి, యక్షగానమునకు బ్రహ్మారథము పట్టిన దినములవి". (కన్నెర. మే. 1954)

"లలితకళ" లను పోషించిన తంజాపురాంధ్ర నాయకులలో మొట్టమొదట చెప్పుకోనఁ దగినవాఁడు రఘునాథరాయలు........ ఈ మహారాజు కోటలో నాటకశాలలు కట్టించి, యక్షగానములను ప్రద

ర్శింపఁజేసి సపరివారముగా వినోదించువాఁడట. [1]ఇతఁడచ్యుతాభ్యుదయాది కావ్యములనేకాక పారిజాతాపహరణాది నాటకములనుగూడ రచించినట్లు తెలియుచున్నది. కాని దృశ్యకావ్యములు తప్ప శ్రవ్యము లేవియు నీతనివి లభింపలేదు........విజయరాఘవ నాయకుఁడు యక్షగాన పితామహుఁడు......" ఈ రీతిగా యక్షగాన రచనయు ప్రదర్శనమును ", మహారాష్ట్రరాజులు యక్షగానప్రియులే ", " తంజావూరి పాలకుల కాలములో బయల్వెడలిన యక్షగానము నూటికిపైనున్నవి ". యక్షగానములను పరిశీలింపగా... .. అయిదుభాగములుగా గోచరించును.

(భారతి. అక్టోబరు. 1954.)

" తంజావూరికవులసలు యక్షగానాలను కేవలం నాటకాలనే వ్యవహరించడం మొదలుపెట్టారు ".

(కిన్నెర. జనవరి 1955.)

దక్షిణాంధ్ర వాఙ్మయమున ముఖ్యముగా తంజావూరియందుద్భవిల్లిన యీ మధురశాఖారచనలు నాటకములోలేక యక్షగానములో నిర్ణయముకానప్పుడిక యక్షగాన శబ్దవ్యుత్పత్తినిగూర్చి, పుట్టుపూర్వోత్తరములనుగూర్చి చర్చించుట యంతసమంజసము కాదని తోచుచున్నది. అవకాశము లభించినపు డావిషయమునుగూర్చి విపులముగ చర్చించెదను

పదకవితలు – పదకవితలు మధురకవితాశాఖకు సంబంధించినవయినను దక్షిణాంధ్ర వాఙ్మయమున, మధుర, తంజావూరు అను నీ రెండింటిలో, ' మధుర ' అనుపేరుగల రాజ్యమున నీ పదకవితలు పదమూన లేదు. తంజావూరియందే విద్వద్రంజకముగ విలసిల్లినవి. తంజావూరి

1. ఇది యెంతయు నసంబద్ధమగువ్రాఁత. రఘునాథునికృతి పారిజాతాపహరణము ప్రబంధమని, అది యాశువుగా చెప్పఁబడినదని గ్రంథములు నేర్కొ్కఁదుచున్నవి. నాటకము లాశువుగాఁ జెప్పుట యెచ్చటనైన కలదా ? ఇఁక రఘునాథుని కృతులు – దృశ్య కావ్యములుతప్ప శ్రవ్యము లేవియు లభింపలేనట. వాల్మీకిచరిత్రము, రఘునాథ రామాయణము దృశ్యములనియే వీరియభిప్రాయము గాఁబోలు. వ్యాస కర్తృకఁగల దృశ్య, శవ్య కావ్య విచక్షణాజ్ఞానము శంకింపవలసి వచ్చుచున్నది.

నాయకరాజుల కాలమునకుముందే, నాంధ్రదేశమున శ్రీ శేషశైల క్షేత్రమున తాళ్ళపాక యన్నమాచార్యులవారు, సంకీర్తన లక్షణమేర్పఱచి, ముప్పది రెండువేల సంకీర్తనములురచించి, పదకవితాపితామహులైరి. తెలుఁగుననే కాక, ద్రావిడ కర్ణాటక దేశములలో సంకీర్తనశాస్త్రమును గల్పించిన యాచార్యపురుషుఁ డన్నమయ్యయే. అన్నమాచార్యుని సంగీతపద రచనలు శ్రీ దివ్యతిరుపతి క్షేత్రమున వేంకటేశ్వరస్వామి సన్నిధిని, సంకీర్తనముకొఱకు రచితములైనవి. అవి ముప్పదిరెండువేలు. వీనిలోని గొంత భాగముమాత్రమే రాగిరేకులపైఁ జెక్కఁబడి సురక్షితములై యున్నవి. కాని తక్కినవి విద్యానగర రాజ్యపతన కారణముగా వ్రాత కెక్కినను, సురక్షితములు కాకపోయినవి. కాని యాంధ్రదేశమున వానికి గొంత వ్యాప్తియుండెను.

దక్షిణదేశమున నాయకరాజుల యేలుబడి ప్రారంభమైన వెనుక, రఘునాథనాయకుని కాలమున సంగీతవిద్యయు, ప్రధానముగా వ్యాప్తిలో నుండుటవలన, తత్పుత్రుఁడగు విజయరాఘవ నాయకుని కాలమునుండి యీ పదకవిత తంజావూరిలో నభివృద్ధి నందఁజొచ్చినది. విజయరాఘవుఁడు పదకవితాప్రవీణుఁడు. "ఏలలు, విడిపదాల్ హెచ్చుసంకీర్తన లాధ్యాత్మ లొనరించు నతులచర్య!" అని ప్రహ్లాదనాటక ప్రారంభమునగలదు. కాని యీతని పదములు లభింపలేదు. ఇఁక నీతని కాలమున రసవత్కవయిత్రియని పేరందిన రంగాజమ్మ 'మిగుల శృంగారంబుఁ గన్పట్టు పదములు మృదురసాస్పదములగుచు, రాణింప' రచియించెనఁట. అవియు లభ్యము కాలేదు. పదకవితా ప్రవీణుఁడగు క్షేత్రయ విజయరాఘవునిపై "వేయిపదములను" జెప్పియున్నాఁడని తెలియుచున్నను, వానిలో నత్యల్పసంఖ్యగల పదములు మాత్రమే లభించినవి.

మహారాష్ట్రరాజుల కాలమున, పదకవితకునంతకు మున్నెన్నఁడు లభింపని ప్రాధాన్యము లభించినది. సంగీత సాహితీ విద్యా భోజుఁడగు శహాజీ పదకవిత్వమునఁ బ్రవీణుఁడు. ఈతఁడు రచించిన పదముల వివరణ మిప్పుడిప్పుడే తెలియుచున్నది. తనయిష్టదైవమగు త్యాగేశునిపై నీతఁడు

భక్తి, భావ, వైరాగ్య, శృంగార, హాస్యనీతి, మంగళపదములన శీర్షికలతో రెండువందలకుఁబైగా రచించియున్నాఁడు[1] "త్యాగేశపద ములు" అను పేరితోనున్న మఱియొక [2]తాళపత్రగ్రంథమున, 35 పదములున్నవి. ఇవి యన్నియు శహాజీ రచనములే.

శహాజీ ననుసరించి యాతని యాస్థానకవులు పదకవితలు వె యించిరి. వారిలో గిరిరాజ కవి ముఖ్యుఁడు – ఈతని పదరచనలాకా మునఁ జాలవ్యాప్తిలోనుండుటచేత శహాజీ తన నాటకములలో వీ నుట్టంకించియున్నాఁడు. ముద్రితమైన 'రతికల్యాణ నాటకమున' (పుట 70

"పరువడి గిరిరాజకవి పదములను"
సరసుఁడైన యట్టిశాహేంద్రుని
పరిపరివిధములఁ బాడుచును"

అనియు, 'శచీపురందరము' అను మఱియొక ముద్రిత నాటకమున (పుట 180)

"పరువడి గిరిరాజపదములను
సరసుఁడైన యట్టిశాహేంద్రుని
పరిపరివిధములఁ బాడుచును"

అనియు, నీ పదముల ప్రశంస గలదు.

గిరిరాజ కవి శహాజీరాజుపై చెప్పిన పదములు ముద్రితము కాలేదు. వానిలో [3]నూటయిరువది పదములు మనకు లభ్యమగుచున్నది. సోమకవి – ఈతఁడు శహాజీరాజు కాలమున పదకవితల వెలయించినకవి. ఈతఁడు శహాజీపై చెప్పిన శృంగార రసప్రధానములగు పదునేను పద ములు లభ్యములగు చున్నవి.[4]

---

1. చూ. తంజావూరి కేట్లాగు – రెండవసంపుటము. 852 – 853 సంఖ్య.
2. చూ. ,, మొదటి ,, 431 – 433 ,,
3. చూ. ,, రెండవసంపుటము. 854 – 856 ,,
4. చూ. ,, ,, 855 ,,

" సోమకవి వరనుత నన్ను
విరులసరుల నరిగురుల
తురిమి యెంతోహాయిగ
శాహభూవర యేలరా "

శహాజీ సోదరుఁడగు మొదటి శరభోజీకాలమున, గిరిరాజకవి యుండి కొన్ని పదములాతని పేరరచించి యున్నాఁడు. శరభోజీ సోదరుఁడగు తులజాజీ లేక తులజమహారాజు పదములను రచించియున్నాఁడు. పదకవిత యందీతనికొక విశిష్టస్థానమీయఁదగి యున్నది. ఏలయన నీతఁడు శృంగార, వైరాగ్యపదములను విడిచి నీతిపదములను రచియించి యున్నాఁడు.

" నీతి గలిగియందు నిత్యశ్రేయమువచ్చు
నీతియె భూషణము నృపతులకు రాజేంద్ర "
" భూలోకజనులకు ముఖ్యమీనీతి
వేలారు శాస్త్రములు వెదకి చూచినగాని "

ఇట్టి మనోశిక్షణ హేతువులగు పదములలోనే మూఁడునాలుగు మాత్రమే ముద్రితములై యున్నవి. ఈపదములకుఁ గర్తయగు తులజాజీ 'సంగీత సారామృతము' అను సంగీతశాస్త్రగ్రంథమును రచియించి యుండుటచేత, నీ పదములు గీతిపదములేగాక, నీతిసాహితియందును, గీర్తనీయములై యున్నవి.

రెండవ శరభోజీ కాలమున, కాశినాథనారణ కవులను విరువురు పెక్కుగీతములను, పదములను రచించిరి. వీరిరువురును నీవలకపరిచితులు. [1]వీరిరచనలు క్రొత్తఁగ మనకెఱుక పడినవి.

పై శరభోజీ పేరవెలసిన తంజావూరి సరస్వతి గ్రంథాలయమున, 'పదములు' 'కీర్తనలు' అను శీర్షికతో కొన్నివేలపదము లపరిశీలితముగా నున్నవి. అందుదాహరింపఁబడిన, తాళపత్ర [2]గ్రంథసంఖ్య

1. చూడుఁడు తంజావూరి కేటలాగు గ్రంథసంఖ్య 904 – 905.
2. గ్రంథమనఁగా ముప్పది రెండక్షర పరిమితిగల రచన,

ననుసరించి చూడఁగా నవియన్నియు ముద్రించిన నవి యించుమించు రెండువేలపుటల గ్రంథమగును. పదకవితా సంకలనము పరిశీలితమై, సుపరిష్కృతమై, ప్రకటితమైనపుడే మనము, తంజాపూరి పదసాహిత్యము దానియుత్కృష్టత, ఆంధ్రగేయపద వాఙ్మయమున దానికిగల యున్నత స్థానము నెఱుంగుటకు మనకర్హతగలుగును.

ఉదాహరణములు: మధురకవితాశాఖలోఁ జేరిన యుదాహరణ ములు మూఁడుమాత్రమే యీ వాఙ్మయమున లభించినవి. మొదటిది బాల కవి యనంతయ రచితము. రెండవది నుదురుమూటి సీతారామయ్య, రఘునాథ తొండమాన్ తండ్రి తిరుమల రాయని పై రచించినది. కాని సమగ్రముగ యిది దొరక లేదు. [1]మూఁడవది చిక్కదేవరాయో దాహరణము.

మధురకవితలోఁ జేర్పఁబడిన కళికోత్కళికలు విభక్త్యర్థ కేవలోదాహరణములకు నుదాహరణముగా దక్షిణాంధ్ర వాఙ్మయ మున శేషార్యోదాహరణము, చిక్కదేవరాయోదాహరణము అనునవి గలవని తెలిపితిని. శేషార్యోదాహరణము, తెలుఁగు కృతి. బాలకవి యనంతయ శేషార్యుఁడను నొక మహనీయుని (ఈతఁడు మధుర నాయకులగు విజయరంగ చొక్కనాథుని కాలమున మంత్రిత్వము నహించిన పెద్ద రాఘవాచార్యుని సోదరుఁడు) గూర్చి చెప్పినది.

చిక్కదేవరాయోదాహరణము సంస్కృత కృతి. దీనిని తిరుమ లార్యుఁడను కవిరచియించెను.

ఉదాహరణములనఁగా గీతసాహితీలక్షణలక్షితములగు లఘు కృతులు. భాషలో సప్తవిధవిభక్తులను సంబోధన నుదాహరించుచు, నొక్కొక్క విభక్తికి పద్యమొక్కటియు, దానితో రగడభేదములగు కళిక

---

1. ఈ మూఁడుదాహరణములను నా "ఉదాహరణ వాఙ్మయ చరిత్రమున" ముద్రించితిని.

ఈ యుదాహరణములను గూర్చిన, సంపూర్ణ వివరములకు, సాహితీ క్రమ వికాసమునకు నేను రచించిన పై గ్రంథము చూడనగును.

లను చేర్చి రచించిన కృతికి యుదాహరణమని పేరు. కళికోత్కళికలు తాళలయాన్వితముగా పాడఁదగిన వగుటచే నివిమధుర కవితలలోఁ జేరినవి.

చిత్రకవిత్వము :

చిత్రకవిత్వంబన పాదగోపనంబును పద్యభ్రమకము, పాదభ్రమకంబును నామగోపనంబును, ఓష్ఠ్యనిరోష్ఠ్య సంకరజిహ్వా, అచల జిహ్వా వృత్తంబులు, బంధకవిత్వము మొదలైన బహువిధ చమత్కారంబులగు రచనలు చేయుట.

పై వానిలో చిత్ర బంధకవిత్వములు తెలుఁగున మొదట ప్రవేశ పెట్టినవాఁడు నన్నెచోడ కవిరాజశిఖామణి. ఈతని కుమారసంభవ మున, నాగ మురజ గోమూత్రికా చక్రబంధములు గలవు. కాని యివి యన్నియు నన్వర్థములై సందర్భశుద్ధిని గలిగియున్నవి.

చూడుఁడు — నాగాభరణుఁడగు శివునినాగమురజబంధములఁ బ్రస్తుతించెను. "చక్రిశక్రాద్యసుర చక్రంబు చక్రబంధాద్యనేకస్తుతిశతంబులఁ బ్రస్తుతించెను."

నన్నెచోడఁడు ప్రాచీనుఁడు. పండ్రెండవ శతాబ్దినాఁటి వాఁడు ఆనాఁటినుండి క్రీ. శ. 16-వ శతాబ్దివఱకు కవులీ చిత్రబంధ కవిత్వముపై మొగ్గుచూపలేదు. అచ్చటచ్చట ప్రబంధములలోఁ గ్వాచిత్కముగ నీ బంధకవిత్వము కానసగును.

దక్షిణాంధ్ర వాఙ్మయము, శృంగారరస చతురశీతి బంధముల కుత్పత్తిస్థానమైనట్లు ప్రబంధ కవితాచిత్రబంధములకును నుత్పత్తిస్థానము అని చెప్పవచ్చును [1]గణపవరపు వెంకటకవి కవితయందీరచన పరమావధి

---

[1] గణపవరపు వెంకటకవి ననుసరించి గుడారు వెంకటదాసకవి తనప్రకృష్ట బలరామచరిత్రమున, నిట్టిరచన గావించియున్నారు. ఆధ్యతనులలో మండపాక పార్వతీశ్వర శాస్త్రి గారు (1833 – 1897) "ప్రబంధ సంబంధబంధని బంధనగ్రంథము" అను లక్షణగ్రంథమును రచించి, దానికి లక్ష్యముగా "కవితావినోదకోశము" అను నానాబంధవివరణగ్రంథము రచించిరి.

నందినది. ఈతఁడు తన ప్రబంధరాజ వేంకటేశ్వర విజయవిలాసమున ౨౦౨ సంఖ్యగల యొకే సీసపద్యమున నరువదింటికిఁబైగా గర్భితములైన రచనలలో నొక కందమున నిరువది బంధము లిమిడ్చియున్నాఁడు.

ప్రబంధసాహిత్యములో వేంకటకవికి చిత్ర కవిత్వమునం దెట్టి యున్నత స్థానముగలదో, మహారాష్ట్ర రాజశేఖరుఁడగు శహాజీకి సంగీతనాటక ప్రబంధ సాహిత్యమున నట్టియున్నత స్థానముగలదు.

శహాజీ రచించినది త్యాగవినోదచిత్ర ప్రబంధము. "చిత్ర ప్రబంధము" అను పేరు చూడఁగనే యిందు చిత్రకవిత్వ రచన ప్రధానముగానున్నదని గ్రహింపవచ్చును. ఇది యొక నాటకము – శహాజీ కిష్ట దైవమగు త్యాగేశమహిమ యిందు ప్రతిపాదితము. అయిన నిందు కథ స్వల్పము. కవితా చిత్రకల్పనమనల్పము. శహాజీరాజు సంస్కృతాంధ్ర మహారాష్ట్రభాషలలోను, సంగీతశాస్త్రమునందును నుద్దండుఁడైన మహా పండితకవి రాజశిఖామణి. పంచరత్న ప్రబంధమను నీతని మఱియొక కృతి యందు సూత్రధారుఁడు శహజీ సంగీత విద్యానైపుణ్యము నిట్లు ప్రస్తుతించినాఁడు "కలిత సంగీత తానశ్రుతి స్వరస్థాన రాగాంగగాన క్రియా స్థాయిగమక ప్రబంధ సహిత గాయకగుణతతానద్ధ ఘనసుషిర గాత్ర భేదక్రియాగ్రహ జాతి మార్గతాళ, దేశితాళ తత్త్వజ్ఞుండును." ఈ నాటకమున నీ క్రింది కవివచనము వలన నీతని వైదుష్యము తెలియఁగలదు. "సకల భాషాభూషిత సకలార్థ విలాసిత, సకలచిత్ర సాహితీ సంగీత భరత సంభరిత విద్వద్భ్రమర చాతురీమాధురీ సుధాప్రద త్యాగ వినోద చిత్రప్రబంధము సంపూర్ణము"

ఒక్క దరువున చతుర్విధ రాగాలాపనలు, భాషాభేదము, అందు శ్లేషలు, శబ్దాలంకారము, అందులో ననులోమ విలోమాది ప్రక్రియలు, ఏకద్విత్రి చతుఃపంచాక్షర దరువు, లీలా యను పేరితో రచనలు, సంపూర్ణ పాదైకయమక లీలా జ్ఞానాజ్ఞానైక శబ్దభిన్న నామకల్పనాలీలా—అనేక కోశ

నామక [1]శబ్దార్థ గ్రహణపదార్థలీలా - కవిభావనిగూఢ వ్యంగార్థలీలా - ఆద్యసరాక్షరఘటితలీలా-సవ్యాపసవ్యసమపదలీలా మొదలగు, చిత్రాతి చిత్రరచనా ప్రక్రియ లిందుగలవు.

ఈ చిత్రప్రబంధమువంటి చిత్రకృతి వేఱొకటి లేదని చెప్పవచ్చును. ఈ గ్రంథరచనమువలన శహాజీ వశ్యవాక్తముఁడనియు, సంగీత సాహిత్య విద్యారంగమున జగజెట్టియనియుఁ జెప్పుట సత్యోక్తియే గాని యతిశయోక్తి కాదు.

## గర్భకవిత్వము - చిత్రకవితలోనంతర్భూతము

గర్భకవిత్వమనఁగా నొకే వృత్తమునందు, వేఱొక వృత్తముగాని వృత్తములుగాని యిముడ్చుట. ఈప్రక్రియకును నన్నెచోడఁడే ప్రథముఁడు, ఆతఁడు కుమారసంభవమున నొక చంపకమాలలో కందమునిమిడ్చి వ్రాసియున్నాఁడు. గర్భకవిత్వమునకు వేంకటకవి రచనమే పరమావధి. ఒక్క సీసపద్యమున నఱువది పదపద్య వృత్తభేదము లున్నవి. అవి కందములు, తేఁటగీతులు, ఆటవెలఁదులు, శోభనములు, మంగళహారతులు చౌపదలు, వృత్తములు, అష్టకములు, దరువులు, రగడలు, శ్లోకములు. ఉభయభాషాకందములు అను రీతిగా నందుండి వేఱుగా వ్రాసి చూపుట కనువుగానున్నది.

ద్వ్యర్థికావ్యములును చిత్రకవితలోనే పరిగణితములు. కృష్ణాధ్వరి రచించిన నైషధపారిజాతీయము అను ద్వ్యర్థికావ్య మొకటియే దక్షిణాంధ్రవాఙ్మయమునఁగాన నగు చున్నది.

## సాహిత్యరచనలు - విస్తర కవిత్వము

విస్తరకవిత్వమనఁగా నష్టాదశవర్ణనాత్మకమై కథాసరణి గల్గిన ప్రబంధరచనము. దక్షిణదేశీయాంధ్రవాఙ్మయమున ప్రబంధములు గద్య పద్యాత్మకముగానే గాక ద్విపద వచనరూపములుగా కూడ వెలసినవి.

---

1. శహాజీకృతమైన శబ్దరత్న సమన్వయము. అనుకోశమిందు సూచితమైనది. ఇది యొక సంస్కృత నిఘంటువు. ముద్రితమైనది.

ప్రబంధములలో నష్టాదశవర్ణనలలో కొన్ని విడనాడి శాస్త్రీయమైన విషయములనే నొప్పారుచున్నవి గాన నవి శాస్త్రీయగ్రంథములనఁబడును. ఈ విస్తర వాఙ్మయమునకు కథాసూత్రములు – కొన్నింటిలో నాయా రాజుల చరిత్రలు, కొన్నింటిలో స్థలపురాణ మాహాత్మ్యములు, కొన్నింటిలో పురాణకథలు, కొన్నింటిలో జాతుల వృత్తాంతము.

దక్షిణాంధ్రవాఙ్మయమున ప్రబంధముల యందలి కొన్ని యితివృత్తములు క్రొత్తవి.

౧. వాల్మీకి చరిత్రము – వాల్మీకి చరిత్రనే యితి వృత్తముగా గ్రహించి రచించిన పద్య కృతులలో[1] రఘునాథుని కృతియే మొదటిది, కడపటిది యని చెప్పనొప్పును. ఈ కృతిలో మనః ప్రవృత్తులయందు గలుగు మార్పులను కవి చక్కఁగ ప్రదర్శించియున్నాఁడు. నవీన విమర్శక పథకము ననుసరించిన దీనిని "మనస్తత్త్వప్రబంధము" (Psychological Prabandha) అని చెప్పవచ్చును. ఇందలి కవిత్వ రచనయు మనోరమ మగుటచేత, "ప్రబంధమణి భూషణము[2]" అను నొక సంకలన గ్రంథమున నిందుండి పెక్కు పద్యములుద్ధాహృతములై యున్నవి. ఈ గ్రంథము క్రీ. శ. 1700 ప్రాంతముల సంధానితమైనది.

శృంగార సావిత్రి

ఈ పద్యకృతి రఘునాథరాయల కృతమని చెప్పుటకు [3]ముద్రిత గ్రంథ పీఠిక మైదవపుట యందలి యీ క్రింది వాక్యమాధారము. పీఠికలో రఘునాథరాయని గూర్చి చెప్పిన వెనుక,

1. ౧ వంగభాషలో వచనరూపముగ శ్రీ సీతానాథ తత్త్వభూషణులు రచించిన కృతిని తెనుఁగున వచనరూపముగ కీ. శే. కాతా శ్రీ రామశాస్త్రిగారు ఠెలయించిరి. వాల్మీకి చరిత్రమునే ౨ కీ. శే. కాళ్లకూరి గోపాలరావుగారు "వాల్మీకి" అను పేర నొక నాటకమును, రచియించి యున్నారు. అందును వాల్మీకి మనఃప్రవృత్తి చక్కఁగ చిత్రింపఁ బడినది

2. దీనిని కీర్తిశేషులు, విద్వద్వర్యులు మా. రామకృష్ణ కవిగారు క్రీ శ. 1909 లో ముద్రించిరి.

1. జి. యస్. శాస్త్రి అండుకో వారిచే ముద్రితమై ప్రకటితమైనది. 1928. మదరాసు.

## సావిత్రి చరిత్ర

"రసవంతమగు నీ ప్రబంధమునుఁగూడ నా మహారాజకవియే రచియించి యుండునని మే మనుకొనుచున్నాము. దీని మూలము [2]తంజావూరి సరస్వతీ పుస్తకశాలలో నున్నది." కాని ముద్రిత గ్రంథము చివర (౧౩౭ పుటలో) సావిత్రీ చరిత్ర సమాప్తము" అను వాక్యము క్రింద నీ పద్యము కలదు.

"తంజావురి రఘునాథుని
అంజమొ యతఁడో వచోవిలాసము మెఱయన్
రంజిల్ల బుధులు రచనా
మంజిమ సావిత్రిచరిత మహిరచియించెన్"

పై పద్యమును బట్టి ప్రకటన కర్తలకే యీ గ్రంథ కర్తృత్వమునందు సందేహమున్నట్లు స్పష్టము. మఱియు నిచట చిత్రమే మనఁగా, ముద్రిత గ్రంథమునకు మూలమగు తంజావూరి పుస్తక శాలలోని ప్రతిలో నీ కందపద్యము లేదు.

చ. చని మఱునాఁడు తాసకల సంభ్రమముల్ తనరంగ"

అనునదియే చివర పద్యము. అట్టి సందర్భములో పై పద్యముయొక్క యునికిని తెలుపకుండ ప్రకాశకులు ప్రకటించుట యెంతమాత్రమును సమంజసము గాలేదు. మఱియు ముద్రితగ్రంథమున నున్నయాశ్వాస విభాగము మూలగ్రంథమున కానరాదు. గ్రంథమునకుఁగూడ, శృంగార సావిత్రి" యను నామకరణము గ్రంథము ప్రకటించిన శృంగార గ్రంథ మాలాధిపతులే చేసిరనుట నిర్వివాదాంశము. ఏలననగా, తంజావూరి పుస్తకశాలలో నీ గ్రంథమునకు "సావిత్రీకల్యాణము" అను పేరున్నది. పై కందపద్యమునుగూడ వారే చేర్చియుందురేమో యని యనుమానించుచున్నాను. కావున రఘునాథరాయని కర్తృత్వమనిశ్చితమనియే తీర్మానింపవచ్చును.

---

2. తంజావూరి కేట్లాగు ఆంధ్ర విశ్వవిద్యాలయ ప్రకటితము సంఖ్య 283.

కృష్ణరాయ విజయప్రబంధ కర్త యగు కుమార ధూర్జటి, తానొక సావిత్రి చరిత్ర రచించినట్లు కృష్ణరాయ విజయమున చెప్పి యున్నాఁడు.

“చిత్రముగాఁగ...చిన్నపుడె...సావిత్రి వివాహమున్ ”

ఒకవేళ, చిన్నప్పుడే రచించి, యెవ్వరికి కృతినీయకుండ యుంచిన ధూర్జటి సావిత్రి చరిత్ర యిదియోమో తెలియరాదు.

కవి యెవ్వరైనను కావ్యము [1]సంపూర్ణముగా లేకున్నను సరస ముగానున్నది. తేట యగు కూర్పు, భావవైశద్యము, సరసపదసంవి ధానము నీగ్రంథమున ముఖ్యగుణములు. సావిత్రిచరిత్రము శాంతరస ప్రధానము. అయిన కవి యిచట శృంగార రసమునకుఁ గొంత యవ కాశముగల్పించినాఁడు. అచ్చటచ్చట వ్యంగ్యచమత్కృతిగలదు.

ద్వితీయాశ్వాసమున నీక్రింది పద్యమున సావిత్రీ దేవికి శ్రీమహా విష్ణువు ప్రత్యక్షమైనపు డామె యొనరించిన స్తుతిలో దశావతారములు వ్యంగ్యముగాఁ దెలుపఁబడినవి.

| | |
|---|---|
| సీ. ఈఁదుచు జలరాశిపైఁ దేలునొకవేళ | మత్స్యావతారము |
| నూరకే మునిగుండు నొక్కవేళ | కూర్మావతారము |
| బొలుపుగా మొగము ద్రిప్పకయుండు నొకవేళ | వరాహావతారము |
| నుగ్రంబుగాఁ జూచెఁదొక్కవేళఁ | నరసింహావతారము |
| ప్రభువుల చేసాచి బ్రతిమాలు దొకవేళఁ | వామనావతారము |
| జక్కఁగా జెండుదు నొక్క వేళ | పరశురామావతారము |
| రాజువై ధరయెల్ల రక్షింతు వొకవేళ | రామావతారము |
| గ్రక్కున బెకలింతు వొక్కవేళ | కృష్ణావతారము |

---

1. నారదుఁడు సత్యవంతుని జీవితపరిణామమును, సావిత్రికిని, నామెతండ్రికినిఁ జెప్పుట. సావిత్రి యేమైనను సత్యవంతునే వరింతుననుట. సావిత్రీ సత్యవంతుల వివాహము మొదలగు గ్రంథభాగ మందు లోపించినది.

గీ. నుందువొక చోటతలఁగక యొక్కవేళ — బుద్ధావతారము
దిక్కులల్లాడ దిరుగుదు వొక్కవేళఁ — కల్కియవతారము
బరిపరి విధంబులగు మీ ప్రభావ మెఱుఁగ
బ్రహ్మకైనను దరమె యో పద్మనాభ! (౧౯౦ ప)

ఆ యాశ్వాసముననే గల యీ క్రింది పద్యములో 'పచ్చితురక' యను పదము ప్రయుక్తమైయున్నది.

క. ఆ హరుని కన్నుగానక
యహా! తలఁద్రొక్కినావ టందురు చంద్రా!
సాహసమటరా దేవ
ద్రోహమునేఁ జెల్లపచ్చి తురకవు గదరా!

ఇది సావిత్రికి శైత్యోపచారములు చేయునప్పుడు సఖులు చంద్రోపాలంభనము చేయుపట్టు నందలి పద్యము. ఈ'పచ్చితురక'అను పదమే విజయవిలాసమున సుభద్రావిరహ ఘట్టమున మన్మథోపాలంభనమున నున్నది.

పచ్చితురకాగద యమ్మదనుండు చూడఁగన్. (విజయ, ౩. ౬౬)

దీనిని బట్టి సావిత్రికృతికర్త విజయవిలాసకారుని ననుసరించెనని తోచును.

ఇక రచనా విషయమున నిందలి భాష యితర దాక్షిణాత్య కృతులవలె, సందర్భోచితమైన వ్యావహారిక పదజాలముతో కూడుకొని మనోహరమైయున్నది.

అఱువై యేవురు - (౧-౩) ఆటందు ౧-౧౬) త్రొక్కటలు (౧-౧౭) మంకు (౧-౬౩) పెంకె (౧-౬౩) భ్రష్టు (౧-౬౩) కొలారికము (౧-౭౮) పరమాణ (ఫరమానా) (౧-౯౫) వాసవుండు బిరుదపాత్ర మేనకపాలికనుపు పరమానయిది. (పదమాణువిదియని ముద్రితము) చూచేవు (౨-౧౮) జిల్లేడాకుల దొప్ప (౨-౫౯) కళంకు (౨-౪౯) సాహెంబూపంపు (౨-౫౦) కోణెవాకిట (౨-౯౫)

గ్రంథమంతయు నుదాత్తరీతినుండి పాతివ్రత్యభావమును ప్రస్ఫుటీకరించుచున్నది. సావిత్రిపాతివ్రత్యమునకు నారాయణుఁడు ప్రత్యక్షమై యమునితో

"అంతక ! నిన్ను నీ పురికినంపుచు నింతకునేఁటికీ మహీకాంతుని కృపాంబుధిక్ బ్రతుకుగంటి పతివ్రతలున్న త్రోవ నీ వింతటినుండిపోయిన సహించను, నీ మనసు, . . .అని పల్కెను." యముఁడుకూడ సావిత్రిని ప్రశంసించుచు

"ఎంత భాగ్యవతియొ యెంచంగ సావిత్రి
యంత దేవిగొలిచి యముని గెలిచె
శంఖచక్రధరుని సత్యంబుగాఁ జూచెఁ
బులకలొదవె"

అని పలికెను.

ఇందు విసువు పుట్టించువర్ణనలులేవు – "కవితలాలోచించు గతి మిన్ను దెసఁచూచి యేమేమొ తలపోయునెఱుఁగకుండ" అను రీతిమనోహరభావములు గలవు.

'శృంగారసావిత్రి' యని పేరితోనుండుటచే నిదిశృంగారభూయిష్ఠ మనుకొను వారుండవచ్చును. కాని యీ గ్రంథమట్లుగాదు. అందఱకును పఠనీయమగు రీతి నున్నది.

విజయవిలాసము

దక్షిణదేశీయాంధ్ర వాఙ్మయమున, నవతరించిన నాటినుండి విజయవిలాసము, విప్రులప్రచారము వడసినదియని వెనుక నిరూపించి యున్నాను. గ్రంథము రచితమైన ముప్పదేండ్లలో నప్పకవివంటి లాక్షణికులదృష్టి నాకర్షించినదనిన, నీ కావ్యప్రాశస్త్యమునుగుఱించి వేఱుగా చెప్పనక్కఱలేదు. "క్షితిలో నీ మార్గమెవరికిన్ రాదుసుమీ" అని సాహితీభోజుఁడగు, రఘునాథ భూజానిచే మెప్పుగన్నకవి విజయవిలాస కర్త వేంకటరాజు. బహుమహాకృతులు రచియించిన రఘునాథభూపతి "చెవిసోఁకఁ జెప్పుటకు" శక్తికల కవియేయుండఁడని, అట్టి మహారాజ కవీంద్రుని తనకవితచే నలరింపఁజేసి, యాతనిచే బహుకృతుఁడనైతినని వేంకటరాజకవియే స్పష్టపఱచి యున్నాఁడు. వీరేశలింగము పంతులు మొదలువిమర్శకులెల్లరు విజయవిలాసమును బ్రశంసించిరి.

గీ. పేరునసకాని గ్రంథము నారయంగఁ
బసఁగఁ బొసఁగెడునని కీర్తి నెసఁగి నట్టి
చేమకూర వేంకటకవి చేసిన యది
యౌర విజయవిలాసమహాంధ్రమునకు''

అని బిల్వేశ్వరీయమున కొక్కొండవారితిని ప్రత్యేకముగ స్తుతించినారు. ఇక తక్కిన విషయములలో కొక్కొండవారికి ప్రతిస్పర్ధులైనను, వేదము వారు, చేమకూర కవితావిషయమున మాత్రము కొక్కొండవారితో నేకీభవించిరి. దీపాలవారు, సారంగధర చరిత్ర వ్యాఖ్యానమున, చేమకూర తెలుఁగుకవితలో సిద్ధహస్తుఁడనిరి. చేమకూర కవితాధర్మములు, తాపీగా నాలోచించినగాని నాకళింపునకురావని తాపీధర్మారావుగారు ప్రతిపదాక్షర వ్యాఖ్యానము గావించిరి. ఇక నందతిప్రశంసలు క్రిందుపఱచునట్లుగా నేలటూరి వేంకటరమణయ్యగారు, దాక్షిణాంధ్ర సాహిత్యమున "ఇతఁడు చేమకూర (వేంకటకవి) రామరాజభూషణునుని కంటెను, వేయేల ఆంధ్ర కవులందఱికంటెను మిన్నయై వన్నెకెక్కినాఁడు" అనియొక యపూర్వాభిప్రాయము వెలిబుచ్చినారు.[1] (పుట 29).

కాని పై విమర్శకులెల్లరును, విజయ విలాసములోనే, కవి రాత్రి వర్ణన సందర్భమున నీ క్రింది పద్యము నెందుకొఱకు రచించెనో విచారింప లేదు.

చ. క్షితిపయిపట్టి ప్రమోఁకులుఁ జిగిర్చవసంతుఁడు దారసోపగుం
ఫితపదవాసనల్ నెఱప, మెచ్చకచంద్రుఁడు మిన్నునం బ్రస
న్నతయును సౌకుమార్యముఁగనం బడ జొల్లరగంగఁ జేసె నే
గతి రచియించిలేని సమకాలమువారలు మెచ్చరే కదా! (౧-౨౧౦)

ఇచట కవి స్పష్టముగా, తన కవిత్వమునకు, రాజాదరణమున్నను, కవిరాజులు, పండితరాజులునైన సమకాలికుల యాదరణమునే పడయలేదని

1 చేమకూర వేంటకకవి, రామరాజ భూషణుని కన్న, అందఱాంధ్ర కవుల నధికుఁడను మాటలు, కేవల మత్యుక్తులగుటయేగాక రచయిత యొక్క కవితా తారతమ్య వివేచనారాహిత్యమును విస్పష్టము చేయుచున్నవి. "విజయవిలాసమును పిల్లవసు చరిత్రమందురు" అన్న వాక్యము రచయితకు జ్ఞప్తియందుండిన నీరీతివ్రాతను వ్రాసి యుండునా?

తెల్పుచున్నాఁడు. దీనికిఁగారణము మనసాహితీ విమర్శకులారయ లేదు. వేంకటకవి యవతారికలో తననుగూర్చి వ్రాసికొనిన దానినిఁబట్టి చూడఁగా నాతఁడు రఘునాథుని భక్తివిశ్వాసములతో సేవించుకొలువరియై చనవరియై, యాతని సముఖముననుండు వాఁడని తెలియుచున్నది గాని, ఆ కాలమున రఘునాథనాయకుని యాస్థానమునందలి కవులతో నాతనికి సంబంధమున్నట్లు తెలియుటలేదు. రఘునాథనాయకుని యాస్థానమున రామభద్రాంబ మధురవాణి మున్నగు కవయిత్రులులే గాక, కృష్ణాధ్వరి యను విద్వత్కవియు నున్నవారు. వీరుగాక రామభద్రాంబ గురువును, ప్రశస్తాంధ్రకవియునగు చెంగల్వకాళకవియు నా కాలమున నుండెను. కాని యాతఁడు రఘునాథుని యాస్థానములేఁడు. ఆతఁడు ప్రసిద్ధికెక్కినది రఘునాథనాయకుని తనయుఁడగు విజయరాఘవనాయకుని కాలము. "అయ్యదినముల రామభద్రాంబవారు నేఁడు కృష్ణాజి కవితచే నేర్పుమెఱసి వినుతిసేయుటలెల్ల నీ ఘనతగాదె. కవి వినుతచర్య చెంగల్వకాళ నార్య!" అను రాజగోపాల విలాసమందలి వాక్యము పై విషయమును ధ్రువపఱచుచున్నది. ఆస్థాన కవయిత్రి గురువగుటచే నాతఁడు తంజావూరి యందే నివసించుచుండెనని నిశ్చయింపవచ్చును.

సాధారణముగ [1]రాజాస్థానములలోరాజు రసజ్ఞుఁడై సాహితీ పోషకుఁడై, కవితాభిమాని యగుచో, నాస్థాన విద్వాంసులు కవులే కాక, తక్కిన పరిజనమును రాచకార్యములు నిర్వహించువారిలో కొంతమంది నిరంతరకవి పండిత సాహచర్యముచేత కవితా సాహితీ

---

1. అద్యతన కాలమున నాంధ్రభోజుడని ప్రఖ్యాతిఁగాంచిన పీఠికాపుర సంస్థానాధీశుఁడు సూర్యరాయ మహీపతి సంస్థానముతో సన్నిహితసంబంధ మున్నవారికి పైవిషయమవగతము కాగలదు. వారి యుద్యోగులలో సేవకులలో చాలమంది సాహిత్యాభిరుచిగల వారు. వారిసేవకులలో నగ్రగణ్యుఁడగు శ్రీ దాసరి లక్ష్మణస్వామి, వర్ణన రత్నాకరాది బహుమహాగ్రంథములు సమకూర్చి, విద్వత్కవియై పిలసిల్లినాఁడు. ఆ మహారాజు, ఆస్థానకవి మొదలుగా నాంధ్రకవితఁ జెప్పిన తన సన్నిధానవర్తుల రచనలను స్వయముగా విని యానందించి వారిని ప్రోత్సహించుట నేను స్వయముగా నెఱిఁగినది. ఆస్థానములో నున్నకవులును, నితర ప్రదేశములనుండి వచ్చుకవులును తమ రచనల నాస్థానకవికి తొలుత వినిపించు సంప్రదాయమచ్చట నుండెడిది.

వ్యాసంగము చేయుచుందురు. కొందరు కవనము నల్లునేర్పు కూడ సంపాదించి, కృతులు రచియించెదరు. అందును రఘునాథనాయకుని యాస్థానమంతయు కవితా నర్తకీరంగమే కావున చేమకూర వేంకట రాజును, నిట్టి కృతిని రచియించి రఘునాధనాయకుని మెప్పుపొందిన వెనుక, యాస్థానమున నున్న కృష్ణాధ్వరికి, నా యూరనేయున్న కాళ కవికి తన రచన మగు విజయవిలాసమును వినిపించి యుండును. కాని వారు వేంకటపతి రచనమును నెంత మనోహరముగనున్నను మెచ్చి యుండరు. కారణము వారు సంస్కృతాంధ్ర భాషల యందుద్దండులగు పండితులు మహాకవులు. కృష్ణాధ్వరి నైషధపారిజాతీయ మను శ్లేషకావ్య కర్త. కాళయ విద్వాంసుఁడేగాక కమనీయ రచనావిశారదుఁడగు కవి. ఇరువురును నలంకారశాస్త్రమున పండితులు అట్టివారు, కేవలము తెలుఁగు ప్రబంధములను, సంస్కృతాలంకార శాస్త్రీయ దృష్టితో బరిశీలింతురు. విజయవిలాస కృతి యెంత రసవంతముగనున్నను నది తెలుగుఁజాతీయత హెచ్చుగాగలది. తెలుఁగు ప్రబంధము కావున వారిరు వురును విజయవిలాసమును మెచ్చియుండరు.

ఇఁక రాజ్యాధీశుఁడగు రఘునాథుఁడు ప్రశంసించెనుగదా! ఆతని కభిమాన పాత్రుఁడగు తెలుఁగు కవిని యామహారాజాశ్రితులమగు మనము మాత్రమేల ప్రశంసింపరాదు? అను భావము వారికి కలుగక పోవచ్చును. నేఁటివలె, రాజకీయాధినేతల మనోగతుల కనుగుణముగా విచక్షణ లేకుండ కవికృత గ్రంథములపై నభిప్రాయములను యోగ్యతాపత్రముల నొసఁగెడి యాచారమాకాలమున ప్రచారమునలేదు. కవి పండితులు స్వతంత్రులు. భాషాసాహిత్యవిషయమున, రాజుగారి యభిప్రాయములనే యనుసరింపవలెనను నియమముగలవారు కారు. అట్లయిన యాస్థానము నందే,రాజుగారి సముఖమునందే ఒకరి తప్పుల నొకరెత్తి పొడుచు కుందురా[1]? "త్వంశుంఠ త్వంశుంఠ" యనుకొందురా? సాహిత్య విషయమున స్వాతంత్ర్యము వహించిన వారానాఁటి కవిపండితులు.

1. ఆస్థానకవులెట్లు వాగ్వాదముచేసి దూషించుకొనెడివారో విజయరాఘవ కల్యాణ నాటకమున, మధురకవి సమస్యాపూరణఘట్టము చూడనగును.

ఇట్టి సంఘటన నేదియో మనసున నుంచికొనియే, వేంకటరాజుకవి "ఏగతి రచియించిరేని సమకాలమువారలు మెచ్చరే కదా" అన్న యభిప్రాయమును వెలిబుచ్చియుండును. ఈ సందర్భమున మఱియొక విషయమునుకూడ మనము జ్ఞప్తియందుంచుకొనవలసియున్నది. రఘునాథనాయకుఁడు తెనుఁగున ప్రశస్త కవియైనను సంస్కృతమున మహావిద్వాంసుఁడు, కవి యని ప్రసిద్ధిగన్నవాఁడు ఆతనికి తెనుఁగు కన్న సంస్కృతము ప్రియతరము. ఆతని యాస్థానమున సంస్కృత విద్వాంసులకు, సంస్కృత కవులకున్న ప్రాధాన్య మాంధ్ర కవులకులేదు. కావున నచ్చటి తెలుఁగు కవులైన సంస్కృత పండితులు కవిత్వమే గాని పాండిత్యవిశిష్టత లేని విజయవిలాసము వంటి తెలుఁగు కృతి యందలి విశేషములను గ్రహింపక లేక పోవుట వింతకాదు.

వేయేల రాజుగారు మెచ్చిన మఱియొక ప్రసిద్ధ కృతినిఁ గూర్చి వినుఁడు. సాహితీ సమరాంగణ సార్వభౌములగు శ్రీకృష్ణదేవరాయల వారి సభలో, అష్టదిగ్గజములలో నగ్రేసరుఁడైన అల్లసాని పెద్దన్న గారున్నారు గదా! ఆంధ్రకవితాపితామహుఁడగు నాతని మనుచరిత్రను రాయలవారంకితముగొని దానిని పల్లకిలో నూరేగించునపుడు, స్వయముగా తన హస్తముతో నెత్తినారు గదా! రాయలవారి కంత ప్రియతమమై, ప్రశంసించిన గ్రంథము, నాస్థానమునగల తక్కిన కవులు తిమ్మన మల్లన, ధూర్జటి, రామకృష్ణకవి మొదలగు వారుగాని, సమకాలికులగు నెడపాటి యెఱ్ఱన, భానకవి, వల్లభాచార్యులు మొదలగువారు గాని మనుచరిత్రనుగాని పెద్దనను గాని ప్రశంసించిరా? ఆయుగముననే, మఱి కొంత కాలమునకు మహాప్రసిద్ధులైన, పింగళిసూరన, రామరాజభూషణుఁడు మొదలగు వారైన పెద్దన పేరెత్తలేదు. కావున, నేఁటి మన విమర్శన పథకము ననుసరించి పూర్వకావ్యములను విమర్శింపరాదు.

వేంకటకవి "ఏగతి రచియించిరేని సమకాలమువారలు మెచ్చరే కదా" అను వాక్యము, రఘునాథ నాయకుని యాస్థానముగల కవి పండితుల మెప్పును పొందలేక పోవుటవలన వ్రాసిన యది యని విమర్శక లోకమెఱుంగును గాక!

## సారంగధర చరిత్ర - చేమకూర వేంకటరాజు

ప్రత్యేక గ్రంథరూపమున తొలుత సారంగధర చరిత్రను వ్రాసిన కీర్తి చేమకూర వేంకటరాజు దని చెప్పవచ్చును. వేంకటరాజ కవి సారంగధర చరిత్రవ్రాసిన వెనుకనే, యది తెలుఁగు దేశమున చాలఁగా వ్యాపించినది. దాక్షిణాత్యసాహిత్యమున నీ గ్రంథము వెలువడిన వెనుక సారంగధర కథ, ద్విపద, వచన యక్షగానాది శాఖలలో విస్తరిల్లినది. తెనుఁగు దేశమున బహుప్రజారంజకములైన కథలలో నిది యొకటిగాఁబరిణమించినది.

ఈ సారంగధర కథకు తెలుఁగు దేశమునకు తొలుత సంబంధము లేదు. ఇది పరిశీలించునపు డీక్రింది ముఖ్యవిషయము మనము గమనింపవలెను.

ఈ కథను తొలుత తెలుఁగున చెప్పినవాఁడు శ్రీగిరి కవి. ఆతని గ్రంథము మనకు లభ్యము కాలేదు. ఆతఁడు క్రీ. శ. 1350 ప్రాంతము వాఁడు. ఆ వెనుక క్రీ శ. 1450 ప్రాంతమున గౌరన తన "నవనాధ చరిత్ర" అను గ్రంథమున, తొమ్మండుగురు సిద్ధులలో నొకఁడగు చౌరంగి సిద్ధుని చరిత్రగా సారంగధరుని కథ చెప్పియున్నాఁడు. అందీకథ భారత వర్షపశ్చిమ ప్రాంతమున నున్న మాళ్వాప్రదేశమున జరిగినట్లు వర్ణితమైనది. అందు మాళవదేశము, మాంధాతపురము, రాజరాజ నరేంద్రుఁడు గలరు.

దీనినిబట్టి క్రీ. శ. 1450 ప్రాంతమునగూడ యీ సారంగధర కథకు తెలుఁగుదేశముతో నేమాత్రము సంబంధము లేదని తెలియుచున్నది. ఇఁక క్రీ. శ. 1549 లో ద్విపద బాలభాగవతమును వ్రాసిన దోనూరి కోనేరు నాథుఁడు ద్విపద బాలభాగవత గ్రంథాంతమున, తన కృతిపతియైన ఆర్వీటి తిమ్మరాజు వంశమును, తత్పూర్వులను వర్ణించునపుడు తూర్పుచాళుక్యులను గూర్చి కొంతఁ దెలిపియున్నాఁడు అందు ముఖ్యముగా భారత కృతిపతి యగు రాజరాజ నరేంద్రునిగూర్చి యిట్లు వ్రాసియున్నాఁడు.

"ద్వి. అతనికిఁదగ విమలాదిత్యుఁడొదవె
రతికినీడనఁజాలు రత్నాజియందు
నాజగతీశుతొయ్యలి భానుమతికి
రాజరాజనరేంద్ర రాజన్యుఁడొదవె
అతఁడు వేంగిదేశమును హారమునకు
నతులనాయకమణి యనఁదగునట్టి
రాజమహేంద్రవరంబను పేరి
రాజధాని మనోహరముగఁ గట్టించె
నారాజమణి కార్యుఁడగు పెద్దకొడుకు
సారంగధరుఁడతి శాంతుఁడైయుండి
యాసక్తిఁ బినతల్లి యైనచిత్రాంగి
చేసిన యాపదఁ జెచ్చెరఁగడచి
యనఘుఁడై "చౌరంగి" యను సిద్ధుఁడయ్యె
జననాథ! నేఁడును జగతిపైనిలిచె
నాతఁడె యాభారతాఖ్యాన మందుఁ
బ్రతిలేని మొదటిపర్వంబులు మూట
నందె తెనుంగున నానన్నపార్యుఁ
డందఱు తెలిగొందునట్లుగా నొడువ."

ఈ భాగమంతయు నముద్రితమే.[1]

పై విషయములను బట్టి యీ కథ పశ్చిమ ప్రాంతమునుండు మాళ్వానుండి తూర్పుప్రాంతమగు వేఁగీదేశమునకుఁ బ్రాకినదనియు వేఁగీదేశమున మొదటనుండియు లేదనియుఁ దెలియుచున్నది. చదువరులకు సుగమముగ నుండుటకై కథాప్రచారమును, మార్పులను నీ క్రింద సూచించుచున్నాను.

---

1 దీనివెనుక నున్న యార్వీటిరాజుల వంశక్రమమును శ్రీ డాక్టరు నేలటూరి వేంకటరమణయ్యగారు భారతి (జూన్ 1929) లో ప్రకటించిరి. అవతారిక లేక గ్రంథము కొంతభాగము 1929 లో ముద్రితమైనది.

| | దేశము | పురము | రాజు |
|---|---|---|---|
| గౌరన | మాళ్వా | మాంధాత | రాజరాజనరేంద్రుఁడు |
| కోనేరు నాథుఁడు | వేఁగి | రాజమహేంద్రవరము | రాజరాజనరేంద్రుఁడు |
| [1]చేమకూర వెంకటరాజు | మాళ్వా | ,, | ,, |

నవనాథ చరిత్రమున నున్న కథను [2]నాంధ్ర దేశముతో ముడి పెట్టినవాఁడు కోనేరునాథుఁడని నిశ్చయముగఁ జెప్పవచ్చును. ఏలనన నాతఁడు మూలముననున్న రాజరాజ నరేంద్రుని నామ మాధారముగాఁ గొని, ఆతనిది వేఁగిదేశమని, రాజమహేంద్రవరము రాజధాని నాతఁడు కట్టించెనని యీ కథకు సంబంధము గల్పించినాఁడు. మఱియు నీ సంబంధమునకు స్థిరత్వముఁ గల్పించుటకు, నీ కథయందలి రాజరాజనరేంద్రుఁడే, నన్నపార్యునిచేత, మహాభారతము నాంధ్రీకరింపఁ జేసిన రాజేంద్రుఁడని స్పష్టముఁగా దెలిపియున్నాఁడు. ఆంధ్ర మహాభారతమునఁ జెప్పఁబడక పోయినను నన్ని చరిత్రల మూలమున రాజరాజనరేంద్రుని తల్లి – విమలాదిత్యుని భార్య చోళసామ్రాజ్యాధిపతి యగు రాజేంద్రచోళుని కుమార్తె యగు "కుందవాంబాదేవి" యని యందఱకు తెలిసిన విషయము. ఇది నిర్వివాదమైనది. ఆమెకు మఱియొక నామధేయమే లేదు. అట్టిచో, విమలాదిత్యుని భార్య 'భానుమతి'కి భారత కృతిపతి యగు రాజరాజనరేంద్రుడు జన్మించెనని కోనేరునాథుడు వ్రాయుట కల్పితము గాక మఱేమగును ? ఇఁక భారత కృతిపతియగు రాజరాజనరేంద్రునికి, 'అమ్మంగదేవి' 'శేవలదేవి' అని యిరువురు

1 వేంకటరాజు కథయందు చేసిన మార్పులను గ్రంథమునఁ జూడదగును.

2. సారంగధర చరిత్రకథను, నాంధ్రభారత కృతిపతియగు రాజరాజనరేంద్రునితో ముడిపెట్టుటకు మూలకారణము కాకునూరి అప్పకవియని ఇప్పటికి ముప్పదేండ్ల క్రిందట, కీ. శే. భావరాజు వేంకటకృష్ణారావుగారు వ్రాసియున్నారు, (చూడుఁడు రాజరాజనరేంద్ర పట్టాషేకసంచిక. (1922) సారంగధరుఁడు అనువ్యాసము. పుటలు ౧౫౮ – ౧౬౦.) కాని, యప్పకవికన్న యొక శతాబ్ది కాలము ముందున్నవాఁడు కోనేరునాథుఁడు. కావున, యాతఁడే దీనికి కారణమని నిశ్చయముగఁ జెప్పవచ్చును.

భాగ్యము లిట్లు తెలియుచున్నది. అందును అమ్మంగదేవి పట్టపురాణి. ఈమె పేరు శాసనములను గన్పట్టుచున్నది. కాని 'రత్నాంగి' 'చిత్రాంగి' యను పేరు లే శాసనములలోను గన్పట్టలేదు. కాబట్టి యిదియును కల్పితమనియే నిశ్శంకముగాఁ జెప్పవచ్చును. మఱియు రాజరాజనరేంద్రునకు రాజేంద్రచోళుఁడను కొమారుఁడు తప్ప వేఱుపుత్రులు లేరు. అట్టిచో "పెద్దకొడుకు" అనునది కూడ కల్పితమే గదా!

చేమకూర వేంకటరాజు కృతియేగాక క్రీ. శ. 1656 సంవత్సరమున కాకునూరి అప్పకవి రచితమైన అప్పకవీయమునందలి, ఆంధ్ర శబ్ద చింతామణి వృత్తాంతము మూలమున నీ కథ కవిపండిత లోకమున వ్యాప్తమగుటకుఁ గారణమైనది.

ఆంధ్ర శబ్దచింతామణి నన్నయ కృతమని నిరూపించుటకు నప్పకవి, తన గ్రంథమున నీ సారంగధర కథను చొప్పించినాఁడు.

గీ. రాజరాజనరేంద్ర తనూజుఁడార్య
సఖుఁడు సారంగధరుఁడు శైశవమునందు
నన్నయ రచించు నెడఁబఠనంబొనర్చి
నన్యులెవ్వరెఱుంగరీ యాంధ్రఫక్కి

క. అతఁడు తనకాళ్లుసేతులు
మతిసెడి జనకుండు దఱుగ మత్స్యేంద్రుని సం
గతినవిక్రమ్మఱ మొలచిన
క్షితిసిద్ధులగలసి యొక్క సిద్ధుండయ్యెన్. (పీఠిక 48, 49 పద్యములు)

అసలు సారంగధరుని కథయే కల్పితమైనపు డప్పకవి కథ యంతకంటె కల్పితము. తన్మూలముగ నేర్పడిన నన్నయ యాంధ్రశబ్ద చింతామణి కర్తృత్వమంతకంటె కల్పితము.

అప్పకవికి నూరేండ్లవెనుక, నీ సారంగధర కథనే యహోబలపతి పండితుఁడు తన గ్రంథమున సరిగా నట్లే యనువదించియున్నాఁడు. తెనుఁగుమహాభారతము-రాజరాజనరేంద్రుఁడు-నన్నయ-ఈత్రయముతో సంబంధించినట్లు తోచిన కథ కాబట్టి యాంధ్రదేశమంతయు నల్లుకొని

పోయి తెలుఁగు సాహిత్యమున, విపుల ప్రచారమునందినది. కొందఱు కవు లిట్టి కథలను గ్రంథస్థముగావించుట చేత, వాస్తవమగు నాంధ్ర సాహిత్య చరిత్రకొన్ని పట్టుల మఱుఁగుపడియున్నది. సత్యాన్వేషణమే పరమావధిగాఁగలనేఁటి సారస్వత చారిత్రక పరిశోధనమూలమున కొంత వఱకు నిజమగు సాహిత్య చరిత్ర తెలియుట కవకాశము లభించుచున్నది.

విలాసము - అను పేరితో వెలయుకృతులుకూడ దాక్షిణాత్య సాహిత్యమున కానగుచున్నవి.

విజయవిలాసము
రాజగోపాలవిలాసము
మన్నారుదాస విలాసము (ప్రబంధము)
,, (నాటకము)

ఆంధ్రవాఙ్మయమున పై రచనలకు ముందుగా ప్రాచీనకాలము నుండి యిట్టివి వెలసినవి.

| | | |
|---|---|---|
| నన్నెచోడ కవి | – | కళావిలాసము. |
| నాచనసోమన | – | వసంతవిలాసము. |
| శ్రీనాథుఁడు | – | హారవిలాసము. |
| నిశ్శంకకొమ్మన | – | శివలీలావిలాసము |

కాని యీ కృతులన్నియు నిష్టదేవతా, ప్రత్యేక వ్యక్తిలీలా విలాసములు. పై నుదాహరించిన దక్షిణాంధ్రవాఙ్మయ విలాస కృతులొక ప్రత్యేక సంప్రదాయము ననుసరించినవి. ఆ సంప్రదాయ మీ క్రింద వివరింపఁబడినది.

విజయవిలాసము, రాజగోపాలవిలాసము, మన్నారుదాస విలాసము — ఈ మూఁడింటి కాపేళ్లు సార్థకములై యున్నవి. అవి భవనముల పేళ్లు.

**విజయవిలాసము** — విజయభవనవిలాసము అను భవనమున కృతి యీయఁబడినది.

రాజగోపాలవిలాసము — రాజగోపాల విలాసభవనము పేర వెలసినది.

మన్నారుదాసవిలాసము — మన్నారు రంగకూటము లేక విలాసము

అను భవనమునకు సంబంధించినది.[1]

దేవతాసంబంధములగు విలాసకృతులును లేకపోలేదు. పచ్చ కప్పురపు తిరువెంగళకవి చొక్కనాధచరితకు "చౌషష్టి లీలావిలాసము" అను నామాంతరముగలదు. ఇందు మధురాపురాధి దైవమగు హాలాస్యే శ్వరుని యరువదినాలుగు లీలలు వర్ణితములైనవి. ఇదిగాక, దక్షిణాంధ్ర వాఙ్మయమున నీ క్రింది విలాసకృతులు కాననగుచున్నవి.

| గ్రంథము | కావ్యభేదము | గ్రంథకర్త |
|---|---|---|
| రాజగోపాల విలాసము | - నాటకము | విజయరాఘవనాయకుఁడు |
| రతిమన్మథ విలాసము | - ప్రబంధము | ,, |
| మోహినీ విలాసము | - ద్విపద | ,, |
| ,, | - నాటకము | ,, |
| శ్రీకృష్ణవిలాసము | ,, | ,, |
| విజయరాఘవచంద్రికా విలాసము | ,, | కామరుసు వేంకటపతి సోమయాజి |
| కిరాత [1]విలాసము | ,, | శహాజీ |
| కృష్ణలీలా విలాసము | ,, | ,, |
| సతీపతిదాన విలాసము | ,, | ,, |
| భక్తవత్సల విలాసము | ,, | ,, |
| శాహరాజవిలాసము | ,, | శేషాచలపతి |

1. సాధారణముగ నాయాభవనముల పేళ్లు వానిపై చెక్కియుండును. ఆవిలాసము లోనున్నవారి తోను త్తరప్రత్యుత్తరములు జరుపుచో పేరు వ్రాసి భవనముపేరు వ్రాయవలెను. అందుచేతనే నేడు "విలాసము" అనఁగా చిరునామా (postal address) అను నర్థములో వ్యాప్తమైనది. "ఈ పైవిలాసము" నకుఁ బంపుడు. నా "పైవిలాస మిది" అని వ్యవహారము బాహాటముగా నీనాటికిని గలదుగదా!

| గ్రంథము | కావ్యభేదము | గ్రంథకర్త |
|---|---|---|
| సర్వాంగసుందరీ విలాసము | నాటకము | గిరిరాజకవి |
| బాలకృష్ణలీలా విలాసము | ,, | అక్కనామాత్యుఁడు |
| చంద్రశేఖర విలాసము | ,, | అష్టావధానికవి |
| శ్రీకృష్ణ విలాసము | ప్రబంధము | చల్లాపల్లి వెంకన్న |
| రాజరంజనవిద్యావిలాసము | నాటకము | తులజాజీ |
| జగన్మోహనవిలాసము | ,, | మెలత్తూరి వేంకటరామశాస్త్రి |
| ప్రబంధరాజ వేంకటేశ్వర విజయ విలాసము | ప్రబంధము | గణపవరపు వేంకటకవి |
| మధురామంగపుంశ్చలీ లీలావిలాసము | ,, | చిన్న వెంగన? వికటకవి గోపాలకవి |
| చంద్రతారావిలాసము | నాటకము | ఎల్లయ |
| రంగవిలాసము | యక్షగానము | హరోసూరిసాకమ్మ |
| ముక్తికాంతావిలాసము | ,, | ,, |
| చిక్కదేవరాయ విలాసము | ,, | ,, |
| లక్ష్మీ విలాసము | ,, | కంఠీరవరాజు |
| కలవాణీ విలాసము | ,, | ,, |
| నాట్యవిద్యా విలాసము | ,, | ,, |
| విభక్తికాంతావిలాసము | ,, | ,, |
| అష్టదిక్పాలక విలాసము | ,, | ,, |
| గంగాగౌరీ విలాసము | ,, | పెదకెంపరాయఁడు |
| కృష్ణవిలాసము | ప్రబంధము | విశ్వేశ్వరపండితుఁడు |

'అభ్యుదయ' రచనలు అనఁగా "అభ్యుదయము" అను పేరితో నున్న కావ్యరచనలు.

ప్రాచీనకావ్యములలో ప్రత్యేక వ్యక్తుల జీవితచరిత్రను చిత్రించు రచనలకు "అభ్యుదయ" రచనలని పేరు. వీనిని పద్యరూపముగానున్న జీవిత చరిత్రలని (Biographies) చెప్పవచ్చును. సంస్కృతమున వేదాంత

దేశికులవారి యాదవాభ్యుదయ మీరీతి రచనలకు మార్గదర్శకమైనదని నా యభిప్రాయము. దక్షిణాంధ్ర వాఙ్మయమున నిదియొక ప్రత్యేక లక్షణముగా పరిఢవిల్లినది. ఈ రచనలను తంజావూరి నాయకరాజులు మాత్రమే కావించిరి.

తంజావూరినాయకరాజులకు ముందు, విజయనగర రాజ్యమున సాళువ, తుళువ వంశీయుల కాలమున నిట్టి రచనలు సంస్కృతమున వెలసినవి.

1. సాళ్వాభ్యుదయము – రాజనాథడిండిమకవి.

2. రామాభ్యుదయము–సాళువనరసింహానృపతి(దీని ననుసరించియే తెనుఁగున నయ్యలరాజు రామభద్రకవి రామాభ్యుదయమును రచియించి యున్నాఁడు).

3. [1]అచ్యుతరాయాభ్యుదయము – రాజనాథడిండిమకవి.

అచ్యుతరాయాభ్యుదయ కావ్యసందర్భమున నొక విషయము ప్రస్తావింపవలసి యున్నది. అచ్యుతరాయాభ్యుదయ మనఁగా, శ్రీకృష్ణ దేవరాయల తండ్రియగు నచ్యుతదేవరాయలేకాని వేఱుకాదు. కృష్ణ దేవరాయల తండ్రి చరిత్రనునే నచ్యుతదేవరాయల యాస్థానకవి రాజనాథ డిండిముఁడు రచియించెను. కాని, తండ్రిమించినకొడుకై జగత్ప్రసిద్ధుఁడగు కృష్ణదేవరాయల చరిత్రనుమాత్రము, తదాస్థాన కవు లెవ్వరును, సంస్కృతమునగాని, తెనుఁగునగాని, ప్రాంతీయభాషయగు కన్నడమునగాని రచియించియుండలేదు. కృష్ణరాయనికి రఘునాథ నాయకునికి, పెక్కుపోలికలున్నను, నీ విషయమున మాత్రము,

---

1. అభ్యుదయరచనలు, అభ్యుదయ సాహిత్యము అనునవి నవ్యసాహిత్యమున Progressive Writing-Progressive Literature అనువానికి పర్యాయపదములుగా నేర్పడినవి. ఇదియొక సాహిత్యోద్యమముగ సామ్యవాదులు నెలకొల్పిరి వీని దృక్పథము రచనావిధానమే వేఱు. కాబట్టి, పై నాయకరాజుల కాలమునాటి యభ్యుదయరచనలకు, వీనికి నేమాత్రము సంబంధములేదు.

రఘునాథుఁడు, కొంతవిశిష్టత గడించినాఁడు. ఆతనిచరిత్ర, సమకాలికులగు నాస్థానకవులచే రచితమగు భాగ్యమునకుఁ బాత్రమైనది. రాయలవారి కత్యంత సన్నిహితులుగదా అల్లసాని పెద్దన్నగారు! వారైనను మను చరిత్ర కృత్యాదియందు కృష్ణరాయని విజయములనే వర్ణించిరిగాని, రాయలచరిత్ర నభ్యుదయకావ్యముగా దిద్దితీర్పలేదు. కృష్ణదేవరాయలు దక్షిణదేశ చరిత్రమునసేగాక, భారతవర్ష చరిత్రము నందొకస్థానమును గడించిన చక్రవర్తి.

వీనిననుసరించి రఘునాథనాయకుని కాలమున రామభద్రాంబ "రఘునాథాభ్యుదయము" అను కావ్యమును రచియించినది. రఘునాథుఁడు నాయకరాజేకాక, తనకునునాయకుఁడే. కావున యాతని చరిత్రను "రఘు నాథాభ్యుదయము" అనుపేర సంస్కృతభాషలో వెలయించినది.

కేవలము సంస్కృతభాషలోనున్న యిట్టిరచనలను తెనుఁగునకుఁ దెచ్చినకీర్తి రఘునాథనాయకునిది. ఆతఁడు తనతండ్రి జీవితచరిత్రను "అచ్యుతాభ్యుదయము" అనుపేర రచియించెను. ఈ గ్రంథమిప్పుడు లభింపకున్నను, నది తెలుఁగుగ్రంథమేయని యనియు, ద్విపదయేయనియు నాతఁడు రచించిన నలచరిత్ర వలనఁ దెలియుచున్నది. మఱియు నప్పటి యాస్థానకవులందఱు నీ గ్రంథమును బేర్కొనిరి. రఘునాథనాయకుని చరిత్రను, నాతని కొమారుఁడగు విజయరాఘవనాయకుఁడు "రఘునాథ నాయకాభ్యుదయము" అను ద్విపదకావ్యమును, "రఘునాథాభ్యుద యము" అనుపేర నాటకముగాను రచియించియున్నాఁడు. ఈ రెండింటిలో ద్విపదకృతి, రెండాశ్వాసములు సంపూర్ణముగను మూఁడవ యాశ్వాసమ సంపూర్ణముగను లభించినది. యక్షగానకృతి నంపూర్ణముగనున్నది. రెండును రఘునాథుని దినచర్యగూర్చియు నాకాలమునందలి రాజ్యవ్యవస్థ లనుగూర్చియు పెక్కువిషయములు దెలుపుచు చారిత్రకులత్యంతోప యుక్తముగనున్నవి.

విజయరాఘవ నాయకునికుమారుఁడగు మన్నారుదాసు తనతండ్రి చరిత్రను, "విజయరాఘవ నాయకాభ్యుదయము" అనుపేర రచియించి నట్లుగ నాతని "హేమాబ్జనాయికా స్వయంవరము" నుండి తెలియు చున్నది. కాని, యదిలభ్యముకాలేదు.

ఉత్తరాంధ్ర దేశమున, క్రీ. శ. పదునెనిమిదవ శతాబ్దాంతమున, భద్రాయురభ్యుదయము, గణనాథాభ్యుదయము, కృష్ణాభ్యుదయము, ఉమాపత్యభ్యుదయము, శ్రీకుమారాభ్యుదయము మున్నగు నభ్యుదయ కావ్యములు వెలువడినది. ఇవియన్నియు పద్యకృతులు. వీనిలో శ్రీకుమారాభ్యుదయము అని పేరితోనున్న గ్రంథమునకుఁ గర్తలు వావిలికొలను సుబ్బారావుగారు. ఇది క్రీ. శ. 1893 లో ప్రకటితమైనది. అధునాతన కాలమునఁ బుట్టిన ప్రౌఢ ప్రబంధములలో నిదియొకటి. దీనికి టీకకూడ యీ కాలముననే రచితమైనదన్నచో గ్రంథ ప్రశస్తి తేటపడగలదు. "కుమారాభ్యుదయము" అను పేరితో నొకకృతిని కవి సామ్రాట్ విశ్వనాథ సత్యనారాయణగారిటీవల రచించిరనివింటిని. నేనా గ్రంథము చూడక పోవుటచే, విశ్వనాథవారి గ్రంథమునకుగల ప్రత్యేకవిశిష్టతలను నిందు ప్రశంసింపఁ జాలనైతిని.

## రఘునాథనాయకుని చరిత్రము

అభ్యుదయ రచనల ప్రస్తావమున, రఘునాథనాయకుని చరిత్రము సమకాలికులచేత, సంస్కృతాంధ్రభాషలలో రచితమైనట్లు తెల్పితిని. కాని తెనుఁగున వచన రూపమున, నేఁటివరకు వెలువడలేదు. తెనుఁగున నున్న రఘునాథాభ్యుదయ, రఘునాథనాయకాభ్యుదయములలోని విశేషముల కన్న సంస్కృతమున రచితములైన కృతులయందు రఘునాథుని బాల్యదశ, విద్యార్థిదశ, అమేయప్రతిభ, గ్రంథరచన మున్నగువానినిఁ గూర్చి మెన్నియేని యపూర్వవిషయము తెలుఁగనగు చున్నవి. దక్షిణాంధ్రవాఙ్మయముతో మనకుఁ బరిచయముగలుగఁగానే, తంజాపుర నాయక రాజులనుగూర్చి, రాజ్యవ్యవస్థనుగూర్చి నవలారూపమున, నొండు రెండు గ్రంథములు వెలువడినవేకాని, ఆ నాయకరాజులలో నగ్రగణ్యుఁడగు రఘునాథుని సంపూర్ణ చరిత్రము మాత్రము వెలువడ లేదు. సంస్కృతములో నాతనిగూర్చి వ్రాసిన గ్రంథము లొకటి రెండు తప్ప తక్కిన వన్నియు ముద్రితమై యందుబాటులోనున్నవి. వాని నన్నింటిని సమగ్రముగాఁ బరిశీలించి, రఘునాథుని చరిత్ర రచియింపవలసి యున్నది. ఆ గ్రంథములలో రఘునాథునిగూర్చి వర్ణితములైన విష

యము లీవఱకు నాంధ్రలోకమునకుఁ బరిచితములు గాక పోవుటచే, స్థాలీపులాక న్యాయమున, నా గ్రంథములలోని కొన్ని శ్లోకములను నాంధ్ర తాత్పర్యముతో నిందుపొందుపఱచుచున్నాను.

శ్లో॥ లిఖనాయ లిపేః కృతః పురస్తాత్సికతావత్సిత రత్నరాశిరస్య ।
వరణాయ వసుంధరేన్ద్రసూనోరఖిలే వాఙ్కురితా కలావ్యలాసీత్ ॥
(స. 5 శ్లో, 2)

తా. అక్షరములు వ్రాయుటకొఱకు శిశువగు నారాజకుమారుని యెదుట ఇసుక యుంచినట్లు రత్నరాశినుంచిరి. అట్లుంచబడిన యీ రత్నరాశి రాజకుమారుని వరించుటకు సమస్తకళలును అంకురించినవో యని నట్లుండెను.

శ్లో॥ ప్రణవం లిఖతిస్మ పార్థివేన్ద్రోస్తనయో భూమితలే సువృత్తరేఖం ।
ఇయదేవ మమేదమబ్ధి కాంచీవలయం వోఢురితి ప్రదర్శయన్ కిం (స, 5 శ్లో. 4)

తా. భూభారమును వహించెడినాకు సముద్రమనెడి కాంచీవలయము ఇంతమాత్రమైనదే యని ప్రదర్శించుచున్నట్లు ఆ రాజకుమారుఁడు ఓంకారమును వర్తులముగా వ్రాసెను.

శ్లో॥ అఖిలానపి పంచషైంహోభిర్ధరతో వర్ణచయాన్ ధరేన్ద్రసూనోః ।
స్తుతిమస్య పరమ్పరాసుసిద్ధః క్వ చతుర్వర్ణభృతిక్రమః సహేత ॥ (స. 5 శ్లో. 7)

తా. ఈ వంశమువారికి పరంపరగా ప్రసిద్ధమైన చతుర్వర్ణములయొక్క భరణక్రమము, ఈనాఁడీ రాజకుమారుఁడు సమస్తవర్ణములను అయిదారు దినములలో ధరించుటవలన కలిగిన స్తుతి యెట్లు సహించును? (అలంకారము-విరోధాభాస, వర్ణపదమునకు శ్లేష)

శ్లో॥ సమమేవ చతుర్విధం కవిత్వం మతిరాపోన్నతి పురామహేన్ద్రసూనోః :
అమృతాంశు శిరోరభీశురేఖా నిఖిలం దిగ్వలయం యథానిశాయాం ॥
(స. 5 శ్లో 7)

తా. బాలచంద్రుని రేఖ రాత్రియందు నాలుగు దిక్కులను వ్యాపించునట్లు ఈ రాజకుమారుని యొక్క బుద్ధి, చతుర్విధ కవిత్వమునందు సమకాలమందే ప్రసరించెను.

శ్లో॥ సమితిప్రియ తాపసః స యోద్ధుర్వ్యతనోదస్య విపంచికాసు శిక్షాం,
పరథామహతీ విపంచికాయాం పటుతా కిం ప్రభవేన్నృపాత్మజస్య ॥
(స. 5. శ్లో. 8)

తా. సాక్షాన్నారదమహాముని యే యీ రాజకుమారునకు వీణయందు శిక్షనిచ్చియుండవలెను. లేనియెడల యుద్ధప్రియుడగు నీరాజకుమారునకు వీణావాదనమందింత సామర్థ్యమెట్లు కలిగియుండును?

శ్లో॥ అస్యాచ్యుతాభ్యుదయ పూర్వశత ప్రబన్ధకర్తుర్మహీతల శతక్రతురాత్మజస్య ।
అశ్వోరసాని గజతాం స్వవిభూషణాని దేశాన్ బహూంశ్చ దయమానమ నావ్యతారీత్ (స. 6. శ్లో. 8)

తా. అచ్యుతాభ్యుదయము మొదలగు శతప్రబంధకర్తయగు నీతనికి భూతలేంద్రుడైన తండ్రి అశ్వములను, గజసమూహములను, విశేష భూషణములను దేశములను ఇచ్చెను.

శ్లో॥ ఆవర్తనాదార్జిత మాగమానాం జాడ్యం చతుర్ణాం జలజాసనేన ।
సంత్యజ్యతే సాంప్రతమేష భూత్వా చతుర్విధేఽపి ప్రభవన్ కవిత్వే ॥
(స. 16. శ్లో. 60)

తా. నాలుగు వేదములన దేపనిగా వల్లెవేయుటచేత తనకు జాడ్యము కలిగెను. అంతబ్రహ్మదేవుడే రాజుగా ప్రభవించి నాలుగు విధములగు కవిత్వములందు ప్రవీణుడై యా జాడ్యమును త్యజించెను.

శ్లో॥ ప్రబంధ మాత్మన్యకరోత్ప్రసిద్ధం వాల్మీకిరాదావితి వాగ్విలాసైః ।
స ఏవ రామస్తనుతేస్మ కస్మిన్ భూత్వా నిబంధం రఘునాథభూపః ॥
(స. 16. శ్లో. 61)

తా. ఆదియందు వాల్మీకి ప్రసిద్ధమగు రామాయణ ప్రబంధమును తన వాగ్విలాసముచే వ్రాసెనని యా శ్రీరాముడే యిప్పుడు రఘునాథ భూపాలుడై యా వాల్మీకిని గుఱించి ప్రబంధమును వ్రాసెను.

శ్లో॥ సయత్నమాహృత్య సుదృక్ ప్రమోదం స పారిజాతం హరిరబ్ధమేకం ।
అథాదయం త్వస్య కథాం నిబధ్నన్నయత్న మాకల్పమహో తనోతి ॥
(స. 16. శ్లో. 62)

తా. శ్రీకృష్ణుఁడతి ప్రయత్నముతో పారిజాత వృక్షమును తెచ్చి ఒక్క సంవత్సరము మాత్రమే తన భార్యకు సంతోషము కలిగించగలిగెను. కాని రఘునాథభూపతి యీ పారిజాతాపహరణ కథను అప్రయత్నముగానే రచియించి కల్పాంతము వఱకు పండిత ప్రమోదమును కలిగించెను.

శ్లో॥ రామాయణోక్త్యా రఘునాథనేతా ప్రాచేతసాదప్యజని ప్రతీతః।
తత్రాన్యవృత్తం వదతః స్వకీయవృత్తస్య వక్తుశ్చ న కిం విశేషః ॥ (స.16. శ్లో. 63.)

తా. రామాయణ రచనయందు ఈ రఘునాథభూపతి వాల్మీకి కంటె మిక్కిలి ప్రసిద్ధమైనవాఁడాయెను. ఒకఁడితరుని చరిత్రను వ్రాయుట కంటె తాను తన వృత్తాంతమును రచించుటలో విశేషమున్నది కదా!

"రామభద్రాంబ" రఘునాథాభ్యుదయము. (సంస్కృతము)

చిత్రకథా రచనలు

## చారులీలావిలాసము

దక్షిణాంధ్ర వాఙ్మయమున వెలువడిన ప్రబంధములలో చెంగల్వ రాయ విరచితమైన చారులీలావిలాసమొక ప్రత్యేకవిశిష్టతగలది. ఇది కళాపూర్ణోదయము, భద్రరాజ పుత్రచరిత్ర, మదనమోహినీ విలాసము, చిత్రసీమ మొదలగు నూతనచమత్కార కథాకావ్యములవంటిది. గ్రంథము మూఁడవయాశ్వాసమున నడిమిభాగమువఱకే లభించినది. అవతారికా పద్యములులేవు. కథాప్రారంభమునుండి చదువఁగ గ్రంథమందింకను కొన్నియాశ్వాసము లుండవలెనని తోచుచున్నది. ఈ గ్రంథమున గద్యయిట్లుగలదు.

"ఇది శ్రీ మదుమారమణ చరణారవింద సేవాసమాసాదిత కవితా పవిత్ర కౌశికగోత్ర పవిత్ర మారుపెద్ది తిరుమలరాయపౌత్ర వేంకటరాయ పుత్ర చెంగల్వరాయ నామధేయప్రణీతంబైన చారులీలావిలాసంబను ప్రత్యగ్రప్రబంధంబునందుఁ బ్రథమాశ్వాసము" ...........

"ఈ గ్రంథము కృతిపతి వైద్యనాథ భూరమణుఁడు. ద్వితీయాశ్వాసాంతమున

ఉ. రాజకులావతంస, కవిరాజ సరోవరహంస, కీర్తివి
భ్రాజితదిగ్విటంక, పరిభావిత శాత్రవయూధనాథనా
నాజగదీశ్వరాదృత గుణాకర, కాంతిజితప్రభాకరా
వ్యాజసుఖప్రపైక విభవాస్పద, వస్తువిచార తత్పరా !

అను పద్యమువలనను తృతీయాశ్వాస ప్రారంభమున

క. శ్రీధుర్వహా కాళమహీ
నాథకుల సుధానిధాన నారీమదనా
సాధుజనాంబుజినీఇన
నాథా ! వరవైద్యనాథ నాట్యానిరోవ !

అను పద్యమువలనను గానవచ్చు ఘట్టములే కృతిపతి చరిత్రబోధకములు" అని యీగ్రంథము తొలుత నాంధ్రవిద్వల్లోకమునకుఁ దెలుపుచు కీర్తిశేషులు మానవల్లి రామకృష్ణకవిగారు కృతిపతినిఁగూర్చి యిట్లువ్రాసిరి.[1]

"భూరమణశబ్దము కేవల మాపచారికముగాక రాజకులావతంస యను విశేషణముచే వైద్యనాథుఁడు రాజేయైయుండవచ్చును. కాళభూపతి యెవ్వఁడో యెఱుంగరాదు. నెల్లూరి మనుమసిద్ధివంశ్యులలో తిరుకాళభూపతి యుండుటను ప్రసిద్ధము. ఈ గ్రంథరచనమును, బరిశీలింప నిది రెండుశతాబ్దంబుల క్రిందట రచియింపఁబడి యుండునని తోఁచుచున్నది."

కాని కవిగారి యభిప్రాయమును సవరించుచు, కృతికర్త వంశ సంబంధులిట్లువ్రాసిరి.[2]

"కృతిభర్త క్షత్రియుఁడుకాఁడు. శెయ్యూరు (చెంగల్పట్టుజిల్లా మధురాంతకము తాలూకా) జమీాందారగు తిరుకాళత్తి మొదలారిగారు కృతికర్తయే యితనికి విద్యాభ్యాసముచేసి రసికశేఖరునిగ నొనరించెను. కృతిభర్తయగు తిరుక్కాళత్తి మొదలారిగారి పౌత్రుఁడు, అదే పేరుగల యాతఁడు నాల్గుసంవత్సరములనాఁడు శివసాయుజ్యమును బొందెను."

---

1. భారతి. సం ౪. సం. ౭. (జూలై ౧౯౨౭), పుట ౬

2. శ్రీమామిడి వర్ఘుల వెంకటకృష్ణ శర్మగారు. భారతి. సం. ౪. ౧౧. (నవంబరు ౧౯౨౭). కలగూరగంప ౧౩౪ పుట

పైని యుదాహరించిన యంశములనుబట్టి చారులీలావిలాస కృతిపతి, తిరుకాళత్తి మొదలియారనియు కవి సంగ్రహముగా, కాళమహీనాథుఁడని చెప్పినాఁడనియు వైద్యనాథనామముతో సంబంధములేదనియు స్పష్టమగు చున్నది. "వరవైద్యనాథ నాట్యవినోదా!" అనునది కృతిపతియగు కాళమహీపతికి విశేషణము. వైద్యనాథ[illegible] నాట్యవినోదములను జరిపించువాఁడని యర్థము. కృతిపతి పౌత్రుఁడు క్రీ. శ. 1923 లో చనిపోయినాఁడు. కావున, చారులీలావిలాస కృతిపతి, రెండు శతాబ్దుల క్రిందటివాఁడుగాక, 1850 - 60 ప్రాంతము వాఁడగుచున్నాఁడు.

ఇఁక నితని కావ్యమునుగూర్చి ప్రస్తావించెదను.

## కథాసారము

శోభావతి యనుపురమును సుదర్శనుఁడగురాజు పాలించుచుండెను. ఆతనిభార్య ప్రశాంత. వారిరువురు హిమవత్పర్వత ప్రాంతమునఁజరించుచు, నందలి యాశ్రమముల నివసించు తపోధనులను దర్శించుచుండిరి. వారిలో నొకమహర్షి సుదర్శనుఁడు సభార్యుఁడై చేసిన పరిచర్యలకునలరి, సర్వదేవతలను నాహ్వానించుటకు సమర్థమైన యొకజపమాల నొసంగెను. సుదర్శనుఁడాజపమాలతో స్వపురమునకువచ్చి, కొంత కాలమైనతరువాత యొక నాఁడు వేఁటకు వెడలెను. ఒక దినమంతయు నుదయాస్తమయములెఱుంగక వేఁటాడి, మిక్కిలియలసి, సుదర్శనుఁడొకచో మైమఱచి నిద్రించెను. అప్పుడొక రాక్షసుఁడు రాజును పరిభవించుటకు, నొకయుక్తి పన్నెను. నిద్రించుచున్న రాజునట్లే యెత్తికొనిపోయి సముద్రమధ్యమున నొకపర్వతసానుప్రదేశమున విడిచి రాక్షసుఁ డదృశ్యుఁడయ్యెను. అపుడు సుదర్శనుఁడు నిద్రమేల్కొని, తనకుఁదగిలిన యవస్థకుఁజింతిల్లుచు, జపమాల చేఁబూని శివునాహ్వానించెను. శివుడు ప్రత్యక్షముకాగా రాజాతని స్తుతించెను. పరమేశ్వరుఁడు ప్రసన్నుఁడై వరమును కోరుకొమ్మనెను. రాజు సంతానమునుకోరెను. మహేశ్వరుఁడిట్లు చెప్పెను.

"మేము విలాసముగా, వెలదులతో మేలములాడునపుడు, రప్పించితివి. కాన, నీకు శృంగార చారులీలా విలాసవతియగు కూఁతురు గలుగును. మఱియు నామెను, ఆఁడదిచూచిన మగవాఁడగును. మగవాఁడు చూచిన నాఁడదియగును."

రాజు తిరిగివచ్చిన కొంతకాలమునకు శివమహిమవలన ప్రశాంతకుఁదనయకలిగెను. ఆమెకు "చారులీల" అని పేరుపెట్టిరి. ఆమె క్రమక్రమముఁగా బెరిగి యారూఢ యౌవనమయ్యెను. ఇట్లుండ నొకనాఁడు త్రికాలజ్ఞుఁడగు నొక మహాయోగి వచ్చెను. రాజును నాతనిచారులీలకు భర్త యెట్లు సంఘటించునని యడిగెను. యోగియునిట్లుచెప్పెను· "చిత్రరశ్మి భూపాలుఁడను నొకరాజుగలఁడు. ఆతనికి సారసధ్వజుఁడను కుమారుఁడుగలఁడు. ఆతఁడతి సౌందర్యవంతుఁడు. ఆతఁడే చారులీల భర్తయగును."

ఇంతటితో ప్రస్తుతములభ్యమగుచున్న ప్రతియాగిపోయినది. తరువాత నింక నెంతయో, చిత్రతరము చు, రసవత్తరమును నగు కథా సంవిధానము గ్రంథాంతరమున నుండియుండును. "చారులీల నెవ్వతయో చూచినంత నది పురుషుఁడు గాఁదోచి యను రాగప్రవృత్తి పెంపొంది, విస్మయాపాదకముగ మఱల సారసధ్వజుఁడే తేర స్త్రీగానై యుండు కథా వైచిత్రియందుండక తప్పదు" అని విమర్శకాభిప్రాయము. ఇది యెంతయు సమంజసమైయున్నది. ఇందలి కవితా శైలిని నిరూపించుటకు నీ క్రింది పద్యములుదాహృతములు.

చిలుక తన ప్రజ్ఞావిశేషము నెఱుకపఱచుట.

సీ. అఖిలదిగ్దేశ రాజాధిరాజాంతః పు
రములెల్ల కొలువుకూటములు మాకుఁ
బార్వతీగోమతీ బార్వతీప్రముఖామ
రాంగనల్ బలుకుతోడండ్రు మాకుఁ
బృథులనందన చైత్రరథము ఖ్యవివిధోప
తనవిహారములు మాకనుభవములు
ఘనసారకదళీ కా పనసామ్రఖర్జూర
ఫలభక్షణములు మాప్రాభవములు

గీ. వసుమతీ స్థలి వేయు సంవత్సరములు
బ్రదికి యొండొంటికిని సంధిఁబఱపనోర్తు
మంబుదాలక ! సకలలోకంబులందు
మే మెఱుంగని చిత్రంబులేమి కలవు ?

చారులీల విరహావ్యథ.[1]

గీ. సకలచిత్తవ్యథలనాఁగఁ జాలినట్టి
కాంచనవిపంచి చేసినకర్మమేమి ?
కేలనంటదు బెబ్బులి లీలఁజూచు
దళితరిపుజాల ! సారసధ్వజన్నపాల !

శా. ప్రావీణ్యంబునఁ బల్కు నేర్తునని చెప్పంగాదుగా చారులీ
లావైదగ్ధ్యము ముగ్ధభావములఁ జాలంజాలఁ గాత్మించునే
వేవేగం బయనంబుచేసికొని నావెంటన్ దయన్ రమ్మటన్
నీవేకన్నులఁ జూచినన్ దెలియ దానిక్కంబు రాజేంద్రుఁడా !

ఆ. వె. నీమలోఁగలట్టి భామలవలెగాని
తాళఁజాల దట్టితనువు గాదు
అంటిఁజూడఁ జేతికంటును లావణ్య
గరిమ యేమనందు ధరణినాథ !

ఈ క్రిందిపద్యములవలన కవియొక్క భరత సంగీత నాట్య సంప్రదాయపరిజ్ఞానము తెలియవచ్చును.

భరతము.

సీ. వినుసారసధ్వజ ! విశ్వప్రసిద్ధమా
భరతంబు పదియాఱు తెఱఁగులయ్యె
నది యెట్టులనినఁ గౌహాళమతంబును శుక్ర
గురునారదర్షి ఫల్గునమతములు
నందికేశ సమీరనందన యాజ్ఞవ
ల్క్యయ భరతాచార్య కృతమతములుఁ
గీర్తింపఁదగిన సంగీతరత్నాకరా
దులుపది యిలలోనఁ గలిగియుండుఁ

1. మద్రాసు ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారము. సంఖ్య R. 1052.

గడన యెచ్చటనున్నదో పడయుటరిది
గాన నానేర్చినంత నిక్కముగ సభ్యు
లలరఁబలికెదఁ జారులీలాంతరంగ
జలజమదభృంగ ! సకలశాస్త్రప్రసంగ !

సంగీతము.

సీ. శాస్త్రరీతినెసంగు సప్తస్వరంబులు
లక్షణ లక్ష్యమ్ములనుఘటించి
రచనపై దేశిమార్గములను పరికించి
షాడవముఖరాగ సరళినరసి
ఆరోహణావరోహణ గమకస్ఫూర్తి
తెలసి డెబ్బదిరెండు విధములైన
మేళకర్తల నేర్పుమీఱంగఁ బాడుచో
గలుగు వర్జావర్జములనెఱింగి

గీ. మొలమి స్త్రీపురుషాఖ్యల తెలయురాగ
మైత్రిగనుఁగొని గానవైచిత్రిమెఱయ
నచ్చరలు మేలుమేలని యిచ్చునలర
మింమప్రౌఢిమ వీణవాయించుచుండె.

ఇది 'తతనితంబా భోగధవళాంశుకము' గట్టిన యలివేణి వీణవాయించు పెద్దన్నగారి పద్యముతో సీడురాలేదని విమర్శకు లనుకొనవచ్చును. కాని యిందు సంగీత శాస్త్రవిషయము కొంతవిపులముగా ప్రపంచితమగుట చేత, మనుచరిత్ర పద్యముకన్న విశిష్టతగలది. చారులీలావిలాసము నందలి పద్యమున డెబ్బది రెండు మేళకర్తల ప్రస్తావమున్నది. ఇది కృష్ణ దేవరాయల కాలముననే ప్రారంభమైనది. ఆ విషయము మనుచరిత్ర కారుఁడు సూచించిన సమంజసముగనుండెడిది. చారులీలావిలాసకర్త సంగీత నాట్యశాస్త్రజ్ఞాన మాతని "సుందరేశ్వరవిలాసము" వలనఁ దెలియఁగలదు.

## సాంత్వన రచనలు

అనఁగా "సాంత్వనము" అను పేరు గలిగిన రచనలు. ఇవియు ప్రబంధములే కావున వీనికి విస్తర కవితలో స్థానము లభించినది. సాంత్వన శబ్దమునకు "అనునయించుట" లేక "ఊఱడించుట" యని యర్థము. నాయిక కోపము వహించినపుడు నాయకుఁడామె నూఱడించుట యనున దీ రచనలలో ప్రధానఘట్టము. దక్షిణాంధ్ర వాఙ్మయమున నిట్టి రచన లలో తొలుతటిది.

1. సత్యభామాసాంత్వనము - ఇది మధుర నాయకరాజగు ముద్దళగిరికి సంకితముగా రచింపఁబడినది. లింగనమఖి శ్రీకామేశ్వరకవి దీనికిఁ గర్త (క్రీ.శ. 1670 ప్రాంతము). దీని వెనుక నీ క్రింది రెండురచనలు వెలసినవి.

2. రాధికాసాంత్వనము - సముఖము వేంకట కృష్ణప్పనాయక రచితము. ఏకాశ్వాసప్రబంధము. ఇదియు మధురకు సంబంధించినదే) విజయరంగచొక్కనాథుని కాలమున రచితమైనది. క్రీ. 1710 ప్రాంతము.

3. రాధికాసాంత్వనము - ముద్దుపళని రచనము తంజావూరి మహారాష్ట్రరాజగు ప్రతాపసింహుని కాలమున రచితమైనది. (క్రీ.శ. 1740 ప్రాంతము)

పైవానిలో కాలక్రమము ననుసరించి కామేశ్వరకవి సత్యభామా సాంత్వనము "తొలికృతి" కావున సాంత్వనకవిత్వ రచనకుఁ గామేశ్వర కవియే మూలపురుషుఁడని చెప్పనొప్పును.

ఈ కృతులలో శృంగార రసాధినేత యగు శ్రీకృష్ణుఁడు నాయకుఁడు శృంగార రససీమ సత్యభామ యొక నాయిక. రాసిక్య శృంగార లీలావధిక యగు రాధికమఱియొక నాయిక. కాబట్టి శృంగార రసశౌండీర్యమీకృతు లందు పండఁబాఱినది.

## మోహశృంగారము

ఇఁక నీ సాంత్వన రచనల యందలి శృంగారము, "మోహ శృంగారము" అని విమర్శకులు నామకరణము గావించిరి. 'మోహము' అనునది గుణవాచకము. శృంగారము రసవాచకము. ఈ రెండింటిని ముడి బెట్టి, మోహశృంగారమనుటయు, నది విప్రలంభ సంభోగశృంగార విభాగములవలె, నొక శృంగారరస విభాగముగాఁ బరిగణించుటయు చూడఁగా మన విమర్శకులు దాక్షిణాత్య కృతులయందు ప్రపంచితమైన శృంగారరసమును సరిగానర్థము చేసికొనక, ప్రాచీనాలంకారిక రససం ప్రదాయములను సరిగా నవగాహనము చేసికొనలేక, కేవల నవీన పాశ్చాత్య విమర్శనాపథకము ననుసరించిన బాహ్యానైతిక దృష్టికి వ్యామోహితులై యొనర్చిన కల్పనగాని వేఱొండుకాదు. సంస్కృతాలంకార శాస్త్రము నందుగాని, వాని ననుసరించిన యాంధ్రాలంకార గ్రంథములయందుగాని 'మోహశృంగారము' అను విభాగమెంత మాత్రమును గానరాదు. అట్టి మోహశృంగార కావ్యముల కాది యని విమర్శకులు పరిగణించిన సత్యభామా సాంత్వనమునందలి శృంగారమును గూర్చి కొంత చర్చింతము.

## సత్యభామాసాంత్వనము

ఇందు నాయిక సత్యభామ-నాయకుఁడు కృష్ణుఁడు. ఈ గ్రంథమున నాలుగాశ్వాసములున్నవి. మొదటి యాశ్వాసము మధురాపుర వర్ణన, కృష్ణవర్ణనలతో ముగియుచున్నది. రెండవ యాశ్వాసమున, నరకాసురవధోద్యోగము, యుద్ధ ప్రయాణము, సత్యా కృష్ణుల మన్మథ క్రీడ, యుద్ధమున సత్యభామ పాల్గొన గోరుట, శ్రీకృష్ణుఁడంగీకరింపకుంచుట వర్ణితములు. మూఁడవ యాశ్వాసమున సత్యా కృష్ణుల విరహము ప్రద్యుమ్న ప్రయాణము. సత్యరాక-మున్నగు సంశములున్నవి. నాల్గవ యాశ్వాసమున, నరకాసుర యుద్ధము, సత్యభామ యుద్ధమున తన నైపుణ్యముఁ బ్రదర్శించుట. నరకాసుర వధ, భగదత్త పట్టాభిషేకము సత్యభామ కోపము, కృష్ణుఁడామెను సాంత్వనోక్తులతో కోపముపశ మింపఁజేయుట, వారి సమాగమము వర్ణితములైనవి.

పైనుదాహరించిన కథాక్రమము ననుసరించి చూడఁగా సత్యభామా సాంత్వనమున శ్రీకృష్ణుఁడు నరకాసురునితో యుద్ధముచేయుట సత్యభామ యుద్ధమునందు పాల్గొని, వీరత్వమును బ్రదర్శించి కృష్ణునిచే వీరవనిత యనిపించుకొనుట, అను నంశములు, వీరశృంగారరసము కూడ నిందున్నట్లు విశదము చేయుచున్నవి. ఆ సందర్భమున కామేశ్వర కవి రచించిన పద్యములు

శృంగార వీరమునకు

"కంకణ క్రేంక్రియల్ కటు చాపటంక్రియల్
చిఱునవ్వు మెఱయింపు జేవురింపు"

అను సీసమును,

రౌద్రశృంగారమునకు

"సంవర్తకీలియై చంద్రికాపాళియై
కనుగెంపు నునుగెంపు గ్రక్కతిల్ల"

అను సీసమును,

శృంగారాద్భుతమునకు

"వెన్నెలమూఁకయో విడిరొండ కాఁకయో
యనసరొయ్యో చంద్రాస్య మినుకుఁజూపు"

అను సీసమును,

అందఱు విమర్శకులును నేక గ్రీవముగాఁ బ్రశంసించినవియే! మఱియు నీ సందర్భమున, నరకాసుర యుద్ధఘట్టమున సత్యభామ సైన్య [illegible]. కవితా సిద్ధహస్తులగు కవిత్రయమువారి యెఱ్ఱన, నాచన సోమన, బమ్మెరపోతన హృద్యముగను ననవద్యముగను వర్ణించి యున్నారు. కామేశ్వర కవియు సిద్ధహస్తుఁడు గనుకనే, యీ ఘట్టమున వారికిఁ దీసిపోకుండ కవితారచన గావించియున్నాఁడు.

పైదానివలనఁ దేలిదేమనఁగా నీ కృతియందు కేవలము విమర్శకులను కొనునట్లు సంభోగశృంగారమే గాక, వీరశృంగారముకూడ నున్నది.

అది యంగాంగీ భావసమన్వితముగానున్నది-అను విషయము విస్పష్టమగు చున్నది. శృంగార రససంవిధానమున నీకృతియందు తొలుత సంభోగ శృంగారమును, నా వెనుక విప్రలంభము, నా వెనుక తిరిగి సంభోగ శృంగారము నొక క్రమరీతిని వర్ణితములైనవి. ఈ రచనా క్రమము నన్నెచోడ మహాకవి కుమారసంభవ రచనాక్రమమును స్మరణకుఁ దెచ్చుచున్నది.

| కుమారసంభవము | సత్యభామాసాంత్వనము |
|---|---|
| 1. గజక్రీడ-సంభోగ శృంగారము | సత్యాశ్రీకృష్ణ క్రీడ (సంభోగము) |
| 2. పార్వతీపరమేశ్వర విప్రలంభము | సత్యాశ్రీకృష్ణుల విరహము — (విప్రలంభము) |
| 3. పార్వతీ పరిణయము. శివపార్వతి మన్మథ క్రీడ-సంభోగశృంగారము | నరకాసురయుద్ధము-సత్యభామ వీరశృంగారప్రదర్శనము (వీరము) |
| 4. కుమారస్వామితారకాసుర యుద్ధము-వీరరసము | సత్యాకృష్ణుల సరసక్రీడ — (సంభోగము) |

కథా ప్రణాళికననుసరించి, చివర కొంచెము వ్యత్యాసమున్నను పై వానిలో నొక దానితో నొక దానికి పోలికలున్న వనుటస్పష్టము.

ఇట్టిదియే గాక, మఱియొక సందర్భమునగూడ నీ రెండింటికి పోలిక కాననగుచున్నది.

కామేశ్వరకవి శ్రీకృష్ణునికి విరహమును గల్పించి యాతనిని సామాన్యమానవునిగఁ జిత్రించెనని యొక విమర్శ లిట్లు వ్రాసిరి. "కామే శ్వరకవి శృంగారరసావిష్టుఁడై యౌచిత్యమును పీటి బుచ్చినాఁడు. ఈ నరకాసుర వధను ఎఱ్ఱన సోమనపోతన మున్నగు మహాకవు లెందఱో వర్ణించినారు. శ్రీకృష్ణునింతటిబైసి మాలిన వ్యక్తిగ నెవ్వరును ప్రదర్శించి యుండలేదు.........

కామేశ్వరకవి భావించిన శ్రీకృష్ణుఁడు స్త్రీలోలుఁడు, విషయాసక్తుఁడు కాంతావియోగము నొక్కనిముసమైన వహింపఁజాలఁడు."
(దాక్షిణాంధ్రసాహిత్యము. పుట 40.)

పైని యుదాహరించిన వాక్యములను పరిశీలింపగా, విమర్శకు లెత్తిన సోమనపోతనల రచనలను చక్కఁగాఁజదువలేదని తెలియుచున్నది. చదివినచో నెత్తిన సోమనపోతనలలో నెవ్వరైన, నరకాసుర యుద్ధమునే వర్ణించిరి గాని, సత్యభామ సాంత్వనమును, నా ఘట్టముతోపాటు వర్ణించిరా? అను సందేహము వెంటనే వారికిఁ గలుగవలసియుండెను. నరకాసుర వధానంతరమున సత్యభామ సాంత్వనము సత్యముగా నా యా గ్రంథములందు లేనేలేదు. అందుచేత విమర్శకుల వాక్యము లసంబద్ధము లని తేలుచున్నది. నరకాసుర యుద్ధవర్ణన సందర్భమున మహావీరుని గనే నౌచితినిఁ బాటించి చిత్రించిన కామేశ్వర కవి, సాంత్వన సందర్భమున నాతని విరహావస్థను సహజమగు రీతిని వర్ణించినాఁడుగాని "బైసిమాలిన వ్యక్తి"గా వర్ణింపలేదు. విరహావస్థయందందఱకు, ననఁగా పరమేశ్వరుని మొదలు పామరుని వఱకు భావము లొక్కటిగనే యుండును గదా!

త్రిమూర్తులకంటె శివుఁ డెక్కువ యని తెలుపు శివపారమ్యవాది యగు నన్నెచోడ మహాకవి పరమేశ్వరుని విరహతాపము నెట్లు వర్ణించి నాఁడో చూడుఁడు.

వ. "అంత నటచని కృతాంతాంతకుండు కంతులతాంతాస్త్రహతాంతరంగుండై కాంతావియోగమ్మునం దురుపిల్లుచు.

సీ. హిమవంతుఁ డింతినాకీఁడెచ్చు డెటేఁగియు
నామాటలేనేడ నాడనైతి
నతఁడొండునానోడి యతివనాకడనుంచి
యేఁగినకన్నెల యెఱుఁగనైతి
నాబాలననుఁగూడి యాసించుచున్నచో
మిన్నకతపమేల పన్నికొంటి
నెలనాఁగనామీఁద నెలయింపవచ్చిన
భావజాతో నేలపగయుఁగొంటి

ఆ. వె. తరుణి వలరసంబు దఱిమి పైఁబడనున్న
నెఱఁగి కూడ నేర నైతి
జేల నైతిననుచు బాలేందుధరుఁడాత్మ
చింతవిడిచి విరహచింతఁ దగిలె

మ. అలిధమ్మిల్ల మృణాళహస్తఁ గమనీయావర్తనాభిన్ మహో
త్పల గంధిన్ గలహంసయాన విలసద్బింబాధర క్షోణిను
త్పలనేత్రిన్ గమలాస్య నంగజరసాంభఃపూరఁ దత్పార్వతీ
జలజావాసముఁ జొచ్చియాడక మనోజాతానలంబాఱునే ?

ఉ. అత్తను మధ్యరూపు కడునందము గాఁగ సుమాయుధుండు ధా
చిత్తమునందు రేఖఁగొని చిత్రము వ్రాసెనొ పోలుపొందన
చ్చొత్తెనొ నేర్పు నంగలయనూన్చెనొ గాక యిది తన్మనోభవో
న్మత్తవికారమో మదనుమాయయొ నిక్కవమో తలంపఁగాన్

వ. అని యనేక ప్రకారములఁ ద్రిలోచనుండు రణరణకవ్యథాకులిత హృదయుండగుచునుండె.''

[illegible] మన్మథునే సంహరించిన మహాశక్తి సంపన్నుఁడగు నీశ్వరుని విరహావస్థను నన్నెచోడకవి, సాధారణమానవ విరహావస్థవలెనే వర్ణించియున్నాఁడు. మఱియు నీశ్వరునిచేతను "తాను బేలనైతిని" యని యనిపించినాఁడు. అట్టిచో నన్నెచోడకవి గూడ యీ సందర్భమున నౌచిత్యము పాటింపలేదని చెప్పనగునా? సత్యభామా సాంత్వనమున శ్రీకృష్ణుఁడంతకుముందు సత్యాసమాగమ సౌఖ్యమును బొందినవాఁడు గావున, విరహమ్మున నానాఁటి యనుభవములనే పలుమాఱులు తలఁచువాఁడుగావున, నట్టి కృష్ణవిరహావస్థకనుకూలముగా నాయికాశృంగార చేష్టలనుఁబెంచి కవి వ్రాసినాఁడు. ఆతఁడా కాలమునాఁటి శృంగారాభిరుచుల ననుసరించి వ్రాసెనని చెప్పవలయునే కాని యచ్చట వేఱొక యభిప్రాయముతో వ్రాసెనని తెలుపుటకు నేమాత్రము నాస్కారము లేదు.

సత్యభామా సాంత్వనమున కామేశ్వరకవి యనౌచితిని గోల్పోయినాఁడని వ్రాసిన విమర్శకు లా గ్రంథమును సాంతముగాఁ జదివిరాయని

యనుమానముగలుగుచున్నది. "అసభ్యశృంగార వర్ణనాత్మకములైన పద్యములు" వ్రాసిన కామేశ్వర కవిగారే వేశ్యాసమాగమ సౌఖ్యమును దూషించుచు, కులకాంతా సమాగమ సౌఖ్యమును భూషించుచు వ్రాసిన యీ క్రింది పద్యముల యుదాత్తతను నౌచితిని జూడుడు.

క. జాలము మంగుల పొంకుల
జాలంబుచేసి నాగ్రజాల పటంబున్
తేలింతురు కులకాంతలు
గాలింతురు చేసి సాధ్వి గాడె వడిలోనన్

క. వలపోతల్, పలుపోకల్
బలుసలు చేష్టాకలాట భావంబాకల్
వెలయించు వెలమిటారుల
వలకనుచుడి గాసి పొందువారలు గలరే ?

శాస్త్రవిహితముగ వివాహమైన దాంపత్యమున కులకాంతా సమాగమ సౌఖ్యమిట్లు వర్ణితమైనది.

క. మేలెంచును కులకాంతలు
తేలింతురు నాథులం గాంచ దీర్ఘాలోచనన్
పాలింతురు కులధర్మము
లాలింపనగును రతి తత్పరతా హస్తునన్.

చ. అనయము సార్థమాన శుభమన్వయవృద్ధికి సాధుబుద్ధికిన్
విహితము ప్రేమభావనకు విశ్రుతశక్తికి నన్నిపట్లనై
యిహపరసాధకంబగు నిశాంతముయౌ సుఖమెంత వానికిన్
బహుళతగా జన్మపుణ్య పరిపాకమునన్ ఫలియించు నెంచగన్

సీ. దాక్షిణ్యములగీము – లక్షణంబుల దీము
వ్రతముల కొరగల్లు – రతికి నిల్లు
నెఱతనంబుల గావు – నిష్కపటంబుల ప్రోవు
కలిమికిదావు భా – గ్యములకోవు
వినుతికి విడిపట్టు – వినయంబులకు గుట్టు
కలకంఠకుం గెలవుకి – ద్యుతులకు నెలవు
పతిభక్తికి బిడారు – సుతరత్నపు గొటారు
ధర్మంబులకు మూట – దయకుం గోట

గీ. యనుచు నందఱుం గొనియాడ నతిశయించు
కులసతినిఁజేరి యన్నింటఁ గొంకుదీరి
యాత్మ సుఖియించునే ధన్యుఁడట్టివాని
కడక చెలువొందు నెందు నీ పుడమియందు

పరకీయాశృంగార సౌఖ్యము కేవలమైహికమే యనియు దంపతీ నిష్ఠమైన శృంగారము సౌఖ్యమిహమునకే గాక, పరమునకుగూడ సాధక మనియు నది పూర్వజన్మ పరిపాకముననే లభించుననియు, నదియే సాంఘికాభ్యుదయ హేతువనియుఁ దెలిపిన కామేశ్వర కవి యెంతటి శృంగార రసవివేచన కలవాఁడో ప్రాజ్ఞు లూహింతురు గాక !

## రాధికాసాంత్వనములు

సముఖము వేంకటకృష్ణప్పనాయని[1] రాధికాసాంత్వన మేకాశ్వాస కృతియు, ముద్దుపళని నాలుగాశ్వాసములకృతికి మూలమైనది. ఇందు సంభోగవర్ణన యతిమాత్రముగ నున్నదనియు, మఱియునిందు వరాంగ వర్ణన నొకటిగాక రెండు పద్యములతో నున్నదనియు, నిది యసభ్య మనియు నందుచే నిషేధమునకుఁ బాత్రమైన గ్రంథముగాఁ బరిగణించి నారు. ఇందలి వర్ణనా భాగములన్నియు ముద్దుపళని కృతియందుగలవు. కాని యిట్టి రచన లొక్క దాక్షిణాత్యవాఙ్మయముననే కాక, ఉత్త రాంధ్ర ప్రదేశవాఙ్మయముననను గలవు. నన్నెచోడ మహాకవి కుమార సంభవమున పార్వతీదేవి యవయవ వర్ణనమున

క. " స్మరమందిరంబుశోభా
కరముగ మెఱుఁగారు బసిఁడి కంబములనఁగా "

---

1. సముఖము వేంకటకృష్ణప్ప నాయనికృతి క్రీ. శ. 1938 లో శృంగార కావ్య గ్రంథమండలి (బందరు) వారు ముద్రించి ప్రకటించియున్నారు. కాని, యీ ముద్రణ సంగతి నెఱుఁగకయే, తామీగ్రంథమును క్రొత్తఁగ గనిపెట్టినట్లు లోకమును భ్రమింప జేసి యొక పరిశోధకశిరోమణి యాంధ్రసాహిత్య పరిషత్పత్రికలోఁ బ్రకటించెను. దీనినిఁగూర్చి నేను "త్రిలిఙ్గ" పత్రిక యందునొక వ్యాసము తే 8-3-1954 దిని ప్రకటించి సత్యము నిరూపించి, లోకమునకు వెల్లడించితిని.

అని వ్రాసియున్నాఁడు. శ్రీనాథమహాకవి రచితమగు "యజమాన ప్రమదావికస్వర...న్యస్తాశ్వ" అను నైషధ కావ్యగత పద్యమందు ఱెఱింగినదియే. మఱియు క్రీడాభిరామమున శంబరభంజను గేహములు, పంచబాణమందిరములు, అసమశరాలయములు బాహాటముగ గన్పట్టుచున్నవి. ధూర్జటి శ్రీకాళహస్తిమాహాత్మ్యమున "మరునిల్లు బయల్పడఁ జేసి"అని చెప్పియున్నాఁడు. ఇక వీనినన్నింటిని మించిన వైజయంతీ విలాసమున (సారంగు తమ్మయ్యకృతము) నీ క్రింది పద్యముగలదు.

సీ. వెదఁజేయనదనైన మదనుక్రొవ్విరితేనె
    దార్కొన్న హారిణీ పదంబనంగ
ననవిల్తు కేళీవనము [illegible] ట్టె
    తరుణారుణాశ్వత్థ దళమనంగ
దర్పకాలయ బహిర్ద్వార తోరణమునఁ
    దగుకొత్తు మించు టద్దంబనంగఁ
గందర్పదేవు శృంగారంపుఁ దోఁటలోఁ
    బొలుపారు దింటెన పూవనంగ

తే. నతనుఁ డంగడినమ్మ మోహ నపుఁబనస
తొలయునఁగ దీనికిల లేదు తులయనంగఁ
దగినవస్తువుఁ జూచెనమ్మగువమేన
బలితమగు వాంఛగూరి యాబ్రహ్మచారి (3 – 35)

దీని ననుసరించియే రాధికాసాంత్వనమున రెండు పద్యములును నిట్లే సీస పద్యములలో నున్నవి.

సీ. శృంగార జవ్వనక్షీరాబ్ధినడుమను
    దనరారు బంగారు దమ్మియనఁగ

సీ. పంచబాణుని చేతిబాణములోనేక
    పరగెడు నమృతంపు బావియనఁగ

కావున సముఖముగాని, ముద్దుపళనిగాని, యిట్టి రచనలను తామై సృష్టించి రచింపలేదనియు, నంతకుముందున్న వాని ననుకరించి రచించిరనియు

నిశ్చయముగాఁ జెప్పవచ్చును. ఇంతకు నిట్టి రచనలు కొంత భాషా సాహితీ సంస్కారమున్న వారికే గాని యవగతము కావు గదా! అట్టియెడల జనసామాన్యమున కీగ్రంథములు దుర్నీతిని బోధించుచున్నవను విమర్శ కాభిప్రాయమున కెట్టి విలువ నీయవలయునో ప్రాజ్ఞులు విచారింతురు గాత!

సంభోగ వర్ణనలును, వరాంగవర్ణనమును, సంస్కృతభాషలో సంస్కృతసమాసములలోనుండిన యది సభ్యమై యొప్పుచున్నది. వానినే సంస్కృతసమాసములలో తెనుఁగు ప్రత్యయములు చేర్చిచెప్పునపుడది యసభ్యతాదోషమునకు పాల్పడుచున్నది. ఇదేటి న్యాయము? ఇట్టివి కేవలమచ్చ తెలుఁగులలో చెప్పినవవి యసభ్యములు. అట్టి వానిని మన వైయాకరణులు గ్రామ్యములని వర్గీకరించి కావ్యముల యందెంత మాత్రముపయోగింప కూడదని నిర్ణయము చేసియున్నారు. ఈసూత్రము ననుసరించియే శ్రీనాథాది మహాకవు లిట్టి వర్ణనలను సమాసయుక్తముగ వ్రాసియున్నారు. ఇది యుక్తమే! సంభోగ మిరువురు ప్రాణుల సంయుక్త స్థితియేగదా! మఱియు నిట్టి ప్రాణి బంధమును వర్ణించుటకు సమాస బంధమే సరియైనదని గ్రహించి, శృంగార రసార్ణవకర్ణధారుఁడగు శ్రీనాథమహాకవి సమాసబంధమున నిట్టి రచనగావించినాఁడు. ఇది యెంత సరసము, సమంజసము సయుక్తికముగ నున్నదో ప్రాజ్ఞ విమర్శకులు పరిశీలింతురుగాక. శ్రీనాథుని ననుసరించి పెద్దనాది కవులును నిట్టి రచనము గావించిరి.

సీ. పతిపాణి పల్లవచ్యుత నీవిబంధన
వ్యగ్రబాలాహస్త వనరుహంబు (నైషధము. 7. 177.)

సీ. సహసానఖంపచ స్తన దత్తపరిరంభ
మామూలపరిచుంబితాధరోష్ఠము (మనుచరిత్ర. 3. 116.)

శ్రీనాథమహాకవికిఁ బూర్వము నన్నెచోడ మహాకవియుఁ గుమార సంభవమున, (8 - 144 - 153) సంభోగ శృంగార వర్ణనము గావించియే యున్నాఁడు. పాల్కురికి సోమనాథుఁడు పండితారాధ్య చరిత్రమున, గురుభక్తాండారి కథయందు, కామశాస్త్ర తంత్రమును చవిచూపించి

యున్నాఁడు. ఇఁక మహాభక్తులై, తిరుపతి క్షేత్రమున సంకీర్తనాచార్యులగు తాళ్లపాక యన్నమయగారు, తమ వేంకటేశ్వర శతకమున యలమేలుమంగా సంభోగ శృంగారమును వర్ణించియే యున్నారు. వారి సంకీర్తనములలో "శృంగార సంకీర్తలు" అను విభాగమాధ్యాత్మ సంకీర్తనములతో నవినాభావ సంబంధము గలిగియున్నదన్న విషయ మిప్పటికి మనవిమర్శకులకు గోచరింపలేదు.

ఉత్తరాంధ్రదేశమున సారంగు తమ్మయయే కాక ప్రబంధయుగమున, కనుపర్తి యబ్బయామాత్యుఁడు ననిరుద్ధచరిత్రమున, సంభోగ శృంగారముతోపాటు ప్రసవానంతర ప్రథమ ద్వితీయా సంభోగములను గూడ వర్ణించియున్నాఁడు. దాక్షిణాత్యాంధ్ర సాహిత్యముననే, శృంగార భూయిష్ఠములై, యసభ్యములైన ప్రబంధములు వెలువడినవని బాహాటముగ విమర్శించిన విమర్శకులు పై యుత్తరదేశీయాంధ్ర కవుల కృతులను గాని, వానియందుగల సభ్యతాసభ్యతలుగాని, దృష్టిలోనుంచుకొనక తమ యభిప్రాయముల నెట్లు ప్రకటించిరో దురూహ్యముగనున్నది.

కావున నీ విషయమున కేవలము ముద్దుపళని కృతినే నిశితముగ విమర్శించుట సమంజసముగాదు. మఱియు నీ రాధికాసాంత్వనమునందలి పద్యములు ధ్వన్యాలోకమువంటి సుప్రసిద్ధ సంస్కృతాలంకార శాస్త్ర లక్షణములకు లక్ష్యములైన వన్నచో, నట్టి కృతులను మన మెంత జాగరూకతతోఁ బరిశీలింపవలయునో స్పష్టమగు చున్నది గదా!

[1]స్త్రీలయొక్క ప్రత్యేకావయవ వర్ణనలు, ప్రబంధకవులే ప్రత్యేకముగ నొనర్చిరనుట సరికాదు. నన్నెచోడ మహాకవి కుమార సంభవమున, పార్వతీదేవి యవయవ వర్ణనము ముప్పదిరెండు పద్యములలో రచించి యున్నాఁడు. శృంగార నైషధమున నిట్టి రచనలు గలవు. తక్కిన ప్రబంధ వాఙ్మయమందంతటను గలవు. కావున నిట్టి వర్ణనప్రక్రియ వాఙ్మయమునం దనుశ్రుతముగా వచ్చుచున్నదే గాని, వేఱుకాదని తెలియనగును. కాని

1. స్త్రీలపయోధరములను మాత్రమే నూఱు శ్లోకములతో వర్ణించుచు నొక సంస్కృతకవి "కుచశతకము"ను రచియించెను.

యనుశ్రుతముగా వచ్చునట్టి వర్ణనల యందైన కవులు తమతమ ప్రత్యేక తను చాలపట్టుల ప్రదర్శించిరి. వాని నిచ్చట విపులీకరించుటకుఁ దావు లేదు. అట్లు ప్రదర్శితమైన సన్నివేశములను, వర్ణనలను, బాగుగ పరిశీలించియే దాక్షిణాత్యప్రబంధ విమర్శనకుఁ గడఁగుట సాహితీ విమర్శకుల కర్తవ్యమైయున్నది.

## తారాశశాంకము

దక్షిణాంధ్ర వాఙ్మయమున దుర్నీతిని, వ్యభిచారమును సమర్థించు కృతులలో తారాశశాంకము ముఖ్యమైనదని విమర్శకుల యాశయము. "తాటాకులలోన వ్రాసిరి పరాంగన గూడిన పాపమంచు" "ఎన్ని పూవులన్ వ్రాలదు తేఁటి యస్లైమగవాఁడను వానికి దోసమున్నదే?" అను గ్రంథమునందలి వాక్యములు, విమర్శకులకు సూఁతకోలలైనవి. మఱియుఁ గొందఱు విమర్శకులు దుర్నీతిని వర్ణించునపుడు కవి నీతిసూత్రములను వక్కాణించి యట్టి చర్యలదోషమును గర్హింపలేదనియు నందుచేత, నీతఁడట్టి చేష్టలను సమర్థించెననియు వ్రాసిరి. కాని గ్రంథము నామూలాగ్రముగ చదివిన వారికీ విమర్శనము లెంతమాత్రమును సరియైనవి కావని ఘంటాపథముగఁ జెప్పవచ్చును.

తారయే తొలుత చంద్రుని గోరినపుడు చంద్రుఁ డీక్రింద విధముగ నామె చర్య యెంత మాత్రమును సమంజసముగ లేదని చెప్పియున్నాఁడు. ఆ ఘట్టమున తారా చంద్రుల సంభాషణముననే, పైనియుదాహరించిన వాక్యములున్నవి.

చంద్రుని మాటలు.

క. తగునే నీకిది? యెంతటి
తెగువే? యీసుద్దొకింత తెలిసినజగతి
న్నగవారడి యపయశమున్
మగువా! చేపట్టినట్టి మగవానికగున్

ఉ. ఇంతిరో! పాలవంటి కులమీవు జనించినదాట నెన్నఁగా
నెంతయు వన్నెవాసి గనునింటను జొచ్చినదేమిచెప్పు కం
చంతటి కాపురంబు సతులౌననఁజేసెదు జాతినీతి యొ
క్కింతఁదలంప నిప్పనికి నేఁటికినేఁటికిఁ గ్రొత్తగాఁజొరన్

ఉ. ఓర్వరు బంధుజాల మడకొత్తున నొత్తుచుమామగారిదే
పర్వినమాత్ర పంటపగఁబట్టును బావ, మగండటంటిమా
దుర్వహరోష భీషణతఁ దోడనె చంపఁగఁ జూచుఁగావునన్
సర్వవిధంబులన్ సతికి జార సమాగమ కాంక్షఁ జెల్లునే?

ఆ మాటలకు తారప్రత్యుత్తరము చెప్పుచు నిట్లు పలికినది.

"లోకములోనఁ గొంద అబలుల్ సతులన్ దనియింపలేక -న
స్తోకమనీష నన్యపురుషుల్ తమభామల నంటకుండఁ దా
టాకులలోన వ్రాసిరి పరాంగనఁ గూడిన పాపమంచున
య్యాకుల పాటుచూచి యిపుడాకుల పాటొదవెన్ మనంబునన్"

తారాశశాంకమనఁగనే జ్ఞప్తికి వచ్చు నీ పద్యమే గదా విమర్శ కుల యభిప్రాయమునకు నాలంబనమైనది! పై పద్యమందలి కల్పనయే కదా కవి దుర్నీతిని బోధించినాడను విమర్శకు నాధారమైనది! కాని యిచట విమర్శింపవలసిన విషయ మొకటి గలదు. పై పద్యభావము తాను స్వంతముగ కల్పన చేసినచో కవి యిచట విమర్శకుల యాక్షేపణ లకుఁ బాత్రుఁడే. కాని యిది శేషము వేంకటపతి స్వంతకల్పన కాదు. వేంకటపతి కన్న రెండువందల యేండ్లకుముందు, శ్రీ కృష్ణదేవ రాయల యాస్థానమున 'అష్టదిగ్గజములలో' నొకఁడైన యెలకూచి రామ భద్రకవి తాను రచించిన [1]సకల కథాసారసంగ్రహమున నిట్టి కల్పన కావించియున్నాఁడు. ఆ పద్య మిది.

మ. కలిమిం గొందఱు శ్రోత్రియుల్ సతులకాంక్షల్ దీర్పఁగాలేకయా
కలకంఠుల్ తముబాసి చక్కఁదనమున్ గాంభీర్యమున్ మన్మథో
త్కలనారంభము వాగ్విజృంభణము సత్కారుణ్యము౦ గల్గువా
రలతోఁ బొంది తముంగణింప రనుచున్ గ్రంథములం దట్లువ్యా
కులురై వ్రాసిన మార్గముల్ దలఁతురే కుంభిం భుజంగాగ్రణుల్ (4. ఆ.)

---

1. సకల కథాసార సంగ్రహమముద్రితము. దీని యేకైకప్రతి మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారమున గలదు. గ్రంథసంఖ్య. (డి. 855.)

పై పద్యమున, పొల్లుపదములతో నైదు పాదములతో నున్న భావమును గ్రహించి వేంకటపతి రామభద్రుని కవిత సంస్కరించి, యందలి భావము నెంత యర్థవంతముగ నాల్గుపాదములలో నిమిడింపవచ్చునో యీ కవితా శిల్పమును తన పద్యమున చూపియున్నాఁడు.

దీనినిఁ బట్టి వేంకటపతి తారాశశాంకమున వ్రాసిన పైపద్యము దుర్నీతిని సమర్థించుటకుఁ గాదనియు, పూర్వకవి కృతమగు పదభావమునే గ్రహించి, దానికి మెఱుఁగుఁ బెట్టునట్టి శక్తి తనకున్నదని చూపుటకు మాత్రమే వ్రాసినాఁడనియు, దానిని సందర్భోచితముగా నెలకొల్పినాఁడనియు నూహించుట సమంజసము.

ఇట్లే "ఎన్నిపూవులన్ వ్రాలదు తేఁటియట్టి మగవాఁడను వానికి దోసమున్నదే" అను పద్యమును జూడుఁడు.

ఉ. ఏలరజాలిఁ బెట్టెదిపుడేలర వేగమె యెన్నిపువ్వులన్
వ్రాలదు తేఁటి యట్టిమగవాఁడను వానికిదోసమున్నదే ?
జాళిని దానెపైఁబడిన భామనుబిగ్గ కవుంగిలించినన్
జాలరు యింద్రభోగ పదసౌఖ్య మనన్మది వేఱయున్నదే (3 – 86)

ఇందలి భావమును వేంకటపతిది కాదు. ఇది యాంధ్రదేశమున పదునొకొండు, పండ్రెండవ శతాబ్దులలో ప్రచురప్రచారముననున్న "తుమ్మెద పదముల"లో నిది.

"యవ్వనమందున తుమ్మెదా ! బహు
పువ్వులవాసనె తుమ్మెదా
అవ్విగ్రోలుచునున్న తుమ్మెదా ! నీ
కెవ్వినేరములేల తుమ్మెదా !"

పై పదమునగల భావముగ్రహించి, వేంకటపతి పద్యమున నను సంధానించినాఁడు. మఱియు పై పద్యమున, "మగవాఁడను వాని దోసమున్నదే" అను పాదమున "మగవాఁడను వాఁడు" అనునది శ్రీనాథ మహాకవి హరవిలాసమునుండి గ్రహించినది. అర్జునుఁడూర్వశిని తిరస్కరించి నపుడామె యర్జునుని నీ క్రిందిరీతినుపాలంభించినది.

ఉ. వాసవు నిండుకొల్వునకు వచ్చినయప్పుడ తత్సమంచితా
ర్థాసన మెక్కియున్న నినునంగజ సన్నిభుఁజూచి పుష్పబా
ణాసను పుష్పబాణ నివహమ్ములకుం గుఱియైతి నిట్టినా
యాస నిరాకరింపఁదగవా! మగవాడవుకావ యర్జునా! (7 – 129)

మఱియు, తారాశశాంక విజయమున కేవలము శృంగారమేగాక, వీరరసమును ప్రపంచితమైనది. పంచమాశ్వాసాదియందు, కవియే, వీర శృంగారములు రెండును నీకావ్యమున నున్నటుల వ్రాసియున్నాఁడు. ఇంద్రునికి చంద్రునకు జరుగఁబోవు యుద్ధప్రారంభమున, యింద్రుని యుద్ధప్రయాణమును కవి యిట్లు వర్ణించియున్నాఁడు.

క. అంత శచీకాంతుఁడు మది
నెంతయుఁ గుతుకమున వీరశృంగారరసా
త్యంతరమణీయ వైఖరి
వింతైకనుపట్టు సహితవిభవము మెఱయన్ (5 – 3)

యుద్ధవర్ణన మంతయు యొకటిగాదు, రెండుగాదు, నూటపది యేఱు పద్యములలో నందును రెండు పెద్దవచనములతో సంపూర్తి యైనది.

ఇంద్రుఁడు, జయంతుఁడు, సూర్యుడు వీరొక్కొక్కరు క్రమముగా యుద్ధమొనర్చిన విషయము విపులముగా వర్ణితమైనది. సూర్యుఁడును చంద్రుఁడును పోరాడు సమయమున జగమంతయుఁ దల్లడిల్లుటచేత, బ్రహ్మ యప్పుడు శివునాహ్వానింప, నాతనికి చంద్రునకు యుద్ధము జరిగెను. బ్రహ్మ వారినడుమ నిలిచి యుద్ధము వారించెను. శృంగారరస వర్ణనల నెంత సామర్థ్యముతో రచియించినాఁడో, యుద్ధవర్ణనలనుకూడ నంతసమర్థతతో వేంకటపతి రచించెను.

ఇట్లించుమించుగా శశాంక విజయమున నొక యాశ్వాసమునం దంతయు, వీరరసప్రధానమైన యుద్ధము వర్ణితముకాగా. నొకయాశ్వాస మున నొకేఘట్టమున నున్న శృంగార రసోక్తులను పురస్కరించుకొని, గ్రంథమంతయు, పచ్చిశృంగారమని, యసభ్యమని, యౌచితిమీఱినదని విమర్శించుట యెంత "యౌచితి" మీఱిన విమర్శనమో, విద్వల్లోక మెఱుఁగఁగలదు. ఇంతకు వేంకటపతి దుర్నీతిని బోధించుననను పట్టునగల

భావములన్నియు, నాతని స్వంతములు కావనియు నవియన్నియు నంతకు ముందు వాఙ్మయమున వెలయుచున్నవనియు చూపితిని. గ్రంథముల నామూలాగ్రముగ చదువకయే విమర్శనము బ్రకటించుట పరిపాటియైనది గాన యింతగా వ్రాయవలసి వచ్చినది.

సారాంశమేమనఁగా దాక్షిణాత్యాంధ్ర వాఙ్మయమున గనుపట్టు శృంగారమునకు "మోహశృంగారము" అని వాడుట కేవల కల్పిత మనియు, నానాటి కవులు సంప్రదాయసిద్ధముగ వచ్చుచున్న తత్తత్పూర్వ కవుల పోకడలను గ్రహించి, శృంగారరసము వర్ణించిరే కాని సభ్యత, యౌచితిని పాటింపకరచింప లేదనియు, నందుచేత నవివాఙ్మయమునకు 'కళంక' మాసాదింప లేదనియు, నాంధ్రప్రబంధ వాఙ్మయమున నవి యొక ప్రత్యేక విశిష్టత నాపాదించిన కావ్యములనియు సాహితీ విశిష్టులు గ్రహింతురు గాక !

ఈ యుగమందు వెలసినకావ్యములలో కనిపించు శబ్దచమత్కార ములు, జాతీయములు, శ్లేషవైచిత్రి, నాటకీయ సంభాషణపద్ధతి, రసపుష్టి మున్నగు గుణములు కావ్యరచనా సౌందర్యమును తీర్చిదిద్దినవి. అందులకు వాల్మీకిచరిత్రము విజయవిలాసము, సారంగధర చరిత్ర, కోటి రఘునాథరాయని పార్వతీపరిణయము చక్కని యుదాహృతులు. దక్షిణ దేశ నాయకత్వముగలుగుటచేత "దక్షిణనాయకత్వమ"ను నాలంకారిక గుణము చూపట్టుకావ్యములును లేకపోలేదు. అందులకనుగుణముగా [1]రాజగోపాలవిలాసము, విజయవిలాసము. సత్యభామా రాధికా సాంత్వ

---

1. "దాక్షిణాత్యాంధ్ర సాహిత్యము" అనుగ్రంథమున 'రాజగోపాలవిలాసము' గూర్చి వ్రాయుసందర్భమునఁ దత్కర్తలిట్లు లిఖించిరి. "కృష్ణుని యష్టభార్యలను అష్టవిధనాయికలుగఁ జిత్రించుట కాళియప్రధానోద్దేశమని తెలియవచ్చుచున్నది. పంచమాశ్వాసమున మన్నారుగుడిస్థల మాహాత్మ్యకథనముగలదు. కవిత్వము సరసమైనదే ఇతని సమానరచన శ్రీనాథుని రచనఁ దలపించుననియు, నన్నయవలె మత్తేభవృత్తమును నడిపించుటయందు గట్టివాఁడనియు, శృంగార రసమును ఆంధ్రకావ్యములందువలె గాక అమరుక కావ్యమునందువలె భావప్రధానముగనే యా విస్ఫూరణము గావించినాడనియు శ్రీ నిడదవోలు వేంకటరావుగారనుచున్నారు. వ్రతానాముత్తమ వ్రతమను న్యాయముబడి చెప్పినమాటలని తోఁచుచున్నది. ఇంతకంటె 'ఈయన కవిత్వము రసవంతమైనదే కాని విశిష్టగుణములు కలదికాదు' అను సీతారామ భట్టాచార్యులవారి యభిప్రాయమే సత్యమునకు చాఫునమన్నది. (పుట. 33) పైని యుదాహరించిన గ్రంథభాగమును బట్టి

నములు, రాధామాధవ సంవాదము తారాశశాంకము మొదలగు కావ్యము లెక్కువగా శృంగార రసమునే పోషించినవి. మహారాష్ట్రనాయకులు మాత్రము శైవమతాభిమానులగుటచే శివకథలను కూడ చేపట్టి, భక్తి శృంగారమును నెక్కువగా పోషించిరి. దాక్షిణాత్య ప్రబంధ కృతులలో జాతివార్తా చమత్కారము లెక్కువగా ప్రవేశపెట్టబడుటచేత, సంస్కృతపద భూయిష్ఠరచన సన్నగిల్లి, తద్భవ దేశ్యపద బాహుళ్యమగు మెత్తని, కమ్మని, రచనలు, చక్కని తెనుగు నుడికారపు సొంపుతో తల లెత్తినవి. కనుకనే నవి ప్రజాబాహుళ్యమును నెక్కువగా నాకర్షించినవి. తెనుగుదేశమందు విజయవిలాసాది ప్రబంధములలోని పద్యమును కంఠస్థములుగా వచ్చినవారు చాలమంది కలరు.

---

తత్కర్తలు రాజగోపాల విలాసగ్రంథ సంపాదకుఁడు తెలువతించిన యభిప్రాయము 'సత్యమునకు దాపునలేదని' తీర్మానించిరి. ఇఁక వారితీర్మానమున కాధారమును ప్రమాణమునునైన సీతారామ భట్టాచార్యులవారి యభిప్రాయమెంత "సత్యమునకు దాపుననున్నదో" తెలిసికొందము. సీతారామ భట్టాచార్యుల వారనఁగా శ్రీకురుగంటి సీతారామయ్య ఎమ్. ఏ. గారు. వీరు 'కొందఱు తంజాపూరి కవులు పండితులు' అను నొకగ్రంథమును క్రీ. శ. 1943 లోఁ బ్రకటించిరి. ఇందు 121 పుట మొదలు 185 పుటవఱకు తెనుఁగుకవులగూర్చి కలదు. అందు కాళకవినిగూర్చి రాజగోపాల విలాసమునుగూర్చి యేమివ్రాసిరో దానిని క్రిందఁ బొందుపఱచుచున్నాను.

కాళకవి మొదలగువారు: "ఈయన విజయరాఘవుని యాస్థానాంధ్రకవులలో వన్నె కెక్కినవాఁడు. ఈయన 'రాజగోపాలవిలాసము" ను గ్రంథమును రచియించెను. ఈయన యింటిపేరు చెంగల్వలవారు. వెంకటయ్య తనతండ్రిపేరనియు, తాను "విజయరాఘవ భూపప్రసాదాసాదిత వివిధరాజ చిహ్నచిహ్నిత భాగధేయుఁడ" ననియు, తెల్పుకొని యున్నాఁడు. ఈ గ్రంథమొక స్థలపురాణము. మన్నారుగుడి స్వామి చరితము ఈ గ్రంథముతో పాటు మఱియొకటి విజయరాఘవుని వంశచరిత్రము మాత్రముకలది యున్నది. దానికి విజయరాఘవ వంశావళి యనినామమున్నట్లు తెలియుచున్నది. ఈయన కవిత్వము రసవంతమైనదేగాని విశిష్టగుణము కలదికాదు. అప్పటికింకను ప్రబంధ కవిత్వమే యేలుచున్నకాలము. అందుచే కాలానుగుణముగ వ్రాసెను. ఈయన విజయరాఘవుని తుదిదినములవరకును దాదాపున్నట్లు కన్పడును. (పుట 176,177)

పైనియుదాహరించిన భాగమునుబట్టి చూడఁగా తత్కర్తలు కవిత్వముమాట యటుండ నిచ్చి గ్రంథముయొక్క స్వరూప స్వభావములుఁగూడ నెఱుఁగరని స్పష్టమగుచున్నది. గ్రంథమున మన్నారుగుడి క్షేత్రమాహాత్మ్యము పంచమాశ్వాసముననే యున్నది. తక్కిన నాలుగుశ్వాసముల భాగమును శ్రీకృష్ణుఁడష్ట మహిషులతో విహరించిన

దాక్షిణాత్యాంధ్రకృతులలో నొక్క-శృంగారరసమే కాక, నాటకములయందు హాస్యరసము ప్రపంచితమైయున్నది. శృంగారమున మోహశృంగారములె, హాస్యమున, ససభ్యము ననౌచితి యీకృతుల యందుగలవని విమర్శకులు వ్రాసియున్నారు. వీరి విమర్శనమునకు గుఱియైనవి రెండు నాటకములు. ఒకటి పురుషోత్తమ దీక్షితుని తంజాపురాన్నదాన మహానాటకము. రెండవది వాసుదేవకవి కృత పార్వతీ పరిణయనాటకము. లోకసామాన్యరీతిగా నిట్టి యితివృత్తములయందు,

---

విషయములతో (శృంగార రసమున అష్టవిధనాయికల స్వభావముల ననుసరించినవి) తోనున్నది. ప్రస్తుత గ్రంథకర్తలీ విషయమే ప్రస్తావింపలేదు. సరికదా మఱియొక వ్రాంత నిట్టువ్రాసిరి. "ఈ గ్రంథముతో పాటు మఱియొకటి విజయరాఘవుని వంశ చరిత్రము మాత్రము కలదియున్నది. దానికి విజయరాఘవవంశావళి ' అను నామమున్నట్లు తెలియుచున్నది.' కాని, "విజయరాఘవ వంశావళి" యనునది వేఱు గ్రంథము కాదు' రాజగోపాల విలాసములోనఁగల గ్రంథావతారికా భాగము లేఖకులు ప్రత్యేకముగ నామకరణము చేసి వ్రాసినదిగాని యది ప్రత్యేకగ్రంథము కాదు. ఈ విషయమును నేనిప్పటి కిరువదిమూడేండ్ల క్రిందట ననఁగా క్రీ. శ. 1936 లో వ్రాసిన "తంజాపురాంధ్ర వాఙ్మయము" అను వ్యాసమునఁ దెలిపియుంటిని. చూడుఁడు. ఆంధ్ర సాహిత్య పరిషత్తు రజతోత్సవసంచిక (పుటలు 151 – 164) ముద్రితమైన రాజగోపాల విలాసగ్రంథము చూచిన నీ విషయము స్పష్టము. పీఠికయందును నీ విషయముఁ దెలిపితిని

గ్రంథావతారిక యందుగల విషయములేవో తెలియక గ్రంథస్వామి, గ్రంథము నాల్గాశ్వాసములలో నున్న యష్టమహిషుల విషయమైనను స్పృశింపక, కవిత్వమును గూర్చి యొకవాక్యమును వ్రాసిన పై గ్రంథకర్తలు గ్రంథమును నొకసరియైన నామమాలాగ్రముగ చదివిరా యను యనుమానము గలుగుచున్నది. ఇట్టి సందర్భమున సీతారామ భట్టాచార్యులవారి యభిప్రాయమే 'సత్యమునకు దాపుగ' నున్నదను నభిప్రాయము ప్రకటించిన దాక్షిణాత్యాంధ్ర సాహిత్య కర్తయభిప్రాయము సత్యేతరమనుటలో సందేహము లేదు. రాజగోపాల విలాస సందర్భమున గాళియకవిని గూర్చియే గాక, మఱియొక కవయిత్రినిగూర్చి సీతారామ భట్టాచార్యులవారు వ్రాసినది చూచిన, వారందలి పద్యములను సరిగా నర్థము చేసికొనలేదని చెప్పవలసి వచ్చినందులకు చింతిల్లుచున్నాఁడను. కాళియకవి శిష్యురాలగు "కృష్ణమాంబను" గూర్చి యిట్లు వ్రాసియున్నారు.

హాస్యరస నన్ని వేశములుండుననియు నాకారణమున నాయాసందర్భమున జరుగు సంభాషణాదికము లసభ్యముగఁ బరిగణింపఁబడవనియు, విమర్శ కులు గ్రహింపకుండుట చిత్రము! పై వానిలో మొదటిదగు తంజా పురాన్నదాన నాటకమునందలి హాస్యమునగల సభ్యతా సభ్యతలను గూర్చి యీ వఱకే గ్రంథమునందు చర్చింపబడియున్నది. ప్రస్తుతము రెండవది యగు పార్వతీపరిణయమును గూర్చి విమర్శించుచున్నాను.

---

సీ. "........................................

యిరువదారును ఛందంబు లెరిగియిట్లు కవిత చెప్పినవారు లోకమున గలరె,
యనుచు వినుతింప వినిపించి ఘనతగాంచ గీర్తనీయ గుణాలంబ కృష్ణమాంబ

ఈ కృష్ణమాంబ రచియించిన గ్రంథమెద్దియు దొరకలేదు. ఈమె రావినూతల తిరుమలయ్యకు కూతురని మరియొక పద్యములో చెప్పబడి యున్నది రావినూతల యనుగ్రామము గుంటూరి మండలమున ఒంగోలుతాలూకాలో నున్నది. ఈగ్రామమున రావినూతల వారను నియోగిబ్రాహ్మణ కుటుంబములున్నవి, కావున నీయమ యట్టి కుటుంబమునకుజెందిన యువతి కావచ్చును. ఇంటిపేరునుబట్టి జాతిని నిర్థారణము చేయుట సుసాధ్యము కాదు. ఈమెను కృష్ణాజి యనికూడా పిలుచుచున్నట్లు తెలియును. (పుట. 179 – 180)

ఈ యుదాహృత భాగమున "ఈమె రావినూతల తిరుమలయ్య కూతురని మఱి యొక పద్యములో చెప్పబడి యున్నది." అనునొక వాక్యముగలదు. ఆ పద్యమందు దాహృతము కాలేదు. పద్యమిది.

సీ. శ్రీవత్సగోత్రుండు శ్రీకరపాక నాటార్వేల బంధుజనాతి శాయి
కాళయమంత్రి పుంగవునకు గంగమాంబకు నుదయించు తపఃఫలంబు
రణరంగ గంధవారణ బిరుదాంకిత స్వకులజ శ్రీకంఠ సచివశాళి
పార్వతీపరిణయ ప్రముఖ ప్రబంధ నిబంధ ధురంధర ప్రౌఢఫణితి

గీ. యైన చెంగల్వ వేంకటయ్యయును, రావినూతుల తిరుమలయ్య తనూజ కృష్ణ
మాంబమును గన్ననిధి కాళహస్తిగిరిశ కవితలలితోక్తి భారవి కాళనుకవి

ఈ పద్యమున 'కృష్ణమాంబ' యను పేరును చూచి ఈ కృష్ణమాంబయే కాళకవి శిష్యురాలగు 'కృష్ణమాంబ' యని భట్టాచార్యులవారు భ్రమించి వ్రాసిరి. కాని పద్యమును సరిగానవగాహన చేసికొనలేదు. ఇందు దాహృతమైన 'కృష్ణమాంబ' కాళయకవి తల్లిగాని, కవయిత్రియగు కృష్ణమాంబ కాదు.
చూడుడు.

## పార్వతీపరిణయము

శహాజీకాలమున, వాసుదేవకవిరచియించినపై నాటకమునుగూర్చి సమీక్షలో నిట్లుకలదు.

2. "శివుడిందుపార్వతితపోదీక్షను పరీక్షింపగోరి వృద్ధబ్రాహ్మణ రూపమున వచ్చును......ఈ వృద్ధుడా బ్రహ్మచారిణి ప్రత్యంగవర్ణన చేయును. ఇది కేవలమనుచితము. అతని విరహావర్ణనము యింకను అనుచితముగానడచును...

6. పర్వతరాజసప్తర్షులు పార్వతీపరమేశ్వరుల వివాహవిషయమై నిశ్చయతాంబూలములు జరిపిన సంకల్పము.

"అస్యశమమోది ద్రావిడస్య......అస్మిన్ వర్తమాన వ్యావహారిక చాంద్రమానే......అషడ్డాళనామ సంవత్సరే అభాసమాసే... పార్వతీదేవి శర్మణాపికన్యయాః పరమేశ్వరనామ్నేవరాయ నిశ్చల తాంబూలం కరిష్యే.

ఇంకొక శుద్ధానౌచిత్యమిది. గ్రంధకర్తకు సప్తర్షుల సంకల్పమును ఎంత చులకనమైపోయినది !

---

శ్రీవత్సగోత్రమున పాకానాటార్వేల వంశీయుడైన వెలసినాడు.

కాళయమంత్రి – భార్య గంగమాంబ

|

వెంగల్వ వేంకటయ్య – భార్య కృష్ణమాంబ ఈమె రావినూతల తిరుమలయ్య తనూజ

|

కాళయకవి

రాజగోపాలవిలాస కర్త

పై పద్యమున వంశవృక్షమునుబట్టి యిందున్న కృష్ణమాంబకు కవయిత్రి కృష్ణమాంబకు నేమాత్రము సంబంధములేదు. కాని భట్టాచార్యులవారు మాత్ర మీకృష్ణమాంబయే, కృష్ణాజియని వ్రాయుటచేతను, ఇంటిపేరునుబట్టి జాతిని నిర్ధారణ చేయుట సుసాధ్యము కాదని వ్రాయుటచేతను, నిరువురు నొక్కరేయని భావించినట్లు స్పష్టము. ఇంత యవ్యవస్థితమగు గ్రంథమును ప్రమాణీకరించుచు విమర్శించుట యెంత సమంజసమో విజ్ఞులు తెలుపుదురు గాత !

7. మంగళాష్టకము. కల్యాణవేళమున ప్రోక్తమైన "కావేరీయమునానదీచ...కుర్వంతువామ్మంగళమ్" అనునది. చెంబూకంబళి, నంబివానిదిగదా చేంతాడుమందేగదా! గంతల్ బొంతలులోభివానివి గదా గార్ధంబు చాకింటిదే. అన్నాదమ్ముడు యిద్దఱున్ కూడుకొని యొక్క్రైన్ కుర్వంతువాంమైధునమ్." అని 'పేరడీ' చేయబడినది. ఈ రెండవది మంగళాష్టకముగాదు-శుద్ద-అమంగళాష్టకము. అత్యంత అసభ్యమైనది.

కవి విదగ్ధుడేకాని రచనలో ఇతి వృత్తమునకు తగిన యుదాత్తత ప్రదర్శించలేక పోయినాఁడు. కోరి అనౌచిత్యమున కొడిగట్టినాఁడు. ఇది పురాణదంపతుల పుణ్యకథ అన్నమాటే మఱచిపోయి నట్లు వ్యవహరించినాఁడు. హాస్యముకోసమసభ్యత నాదరించినాఁడు."

పై సమీక్షావాక్యములు చదివినవారి కీ నాటకమంతయు, ననౌచితికి, అసభ్యతకు నొక యుదాహరణగా కన్పట్టవచ్చును. కాని యీ సమీక్షను జాగరూకతతో సమీక్షించిన వారి కీ సమీక్షా రచన యంతయు, నసంబద్ధము, అజ్ఞాన నిరుద్ధము, లోకానుభవవిరుద్ధముగాఁ గన్పట్టకపోదు. గ్రంథవిమర్శనమునకు, కేవలము విషయ సేకరణ మేకాక లోకానుభవము, సంప్రదాయ పరిజ్ఞానముకూడ చాలగానావశ్యకము. ఇవి రెండును, రెండు నేత్రములవంటివి. ఈ రెండింటిలో నేది లోపించినను, నట్టి విమర్శనము గ్రుడ్డెద్దుచేన బడ్డగతిమడ్డి యగును.

ఏకరాత్రములు, లేఖ్యారూఢములు. పరస్పర ముద్రికాగ్రహణములు, పుష్పహారాలంకరణములు, తపాలా, తంతిమూలకములు దూరశ్రవణయంత్ర సంభాషణా పూర్వకములు. ఇత్యాదిగా వివాహప్రక్రియలు జరుగు నేటికాలమాన పరిస్థితులలో నయిదు దినములు జరుగు పూర్వకాల వివాహసంప్రదాయములు, (అయిదువ కయిదు దినములు పెండ్లి జరుపుట సమంజసమే కాక శాస్త్రీయము.) వివాహకాలమున నడచు,

వ్యంగ్యసంభాషణా చమత్కారములు నూతన వైవాహిక మంత్రప్రతి కల్పనలు విస్మృతప్రాయమైనవి. ఈనాటి యువకమాణవక లోకమున కిట్టివి యశ్రుతపూర్వములు నపరిచితములు కావచ్చును. కాని యిప్పటి కొకటి రెండు తరముల క్రిందటి వారికి పై సమీక్షయందసభ్యము, అమంగళము, అనౌచిత్యముగల ప్రతికల్పలన్నియు, సుపరిచితములే! 'శుద్ధ అమంగళాష్టకమని' పేరొకొన బడినవానాటివి రెండు వినుఁడు.

"గూనాబల్లాచాకలాడిదైతే బట్టయితేమంచేగదా
ఉతికేటందుకువాడి యిష్టమేకదా కుర్వంతు వాంమంగళమ్
సుముహూర్తస్సావధాన శుభలగ్నస్సావధాన.

"ఇల్లూవాకిలి యింటివాడిదైతే యిల్లాలుమంచేగదా
వచ్చేటందుకు దాని యిష్టమేకదా కుర్వంతువాంమంగళమ్
సముహూర్తస్సావధాన శుభలగ్నస్సావధాన.

పై మంగళాష్టకము లాంధ్రదేశమున కుత్తరపు చివరనున్న కళింగ దేశము. (విజయనగము, విశాఖపట్నం, శ్రీకాకుళం, సోంపేట ప్రాంతము) నందు [1]ప్రచారమున నున్నవి.

ఇట్టి సందర్భములో, నాంధ్రదేశమునకుసుదూరమున దక్షిణ దేశమున దక్షిణప్రాంతమునున్న తంజావూరియందు వాసుదేవకవి, యిట్టి సంప్రదాయమును నాటకమునఁ దెలియఁజేసినందులకు కవిని ప్రశంసించు టకు బదులుగా నిది "శుద్ధ అమంగళము అనౌచిత్యము"అని సమీక్షించు టయే "శుద్ధ అనౌచిత్యము."

---

1. ఆనాఁడు—అనఁగా నలుబదేండ్ల క్రిందట జరిగిన నా వివాహ కాలమున చదివిన పైమంగళాష్టకములు, నాచెవిలో నేఁటికిని మాఱుమ్రోఁగుచున్నవి.

నాటకకర్త వాసుదేవకవి వ్రాసిన వ్రాఁతను సరిగా నర్థము చేసికొనకయో లేక సంప్రదాయము నెఱిఁగిన పెద్దల నడిగి మనము తెలుసుకొనుటా ? అను నహంభావముచేతనో, సమీక్షాకర్త "అన్నాదమ్ముఁడు...... యొక్క_రైః కుర్వంతు వాంమైథునమ్" అను పాదము నత్యంతమున సభ్యమని వ్రాసియున్నాడు. కాని యన్న చనిపోయిన వెనుక తమ్ముఁ డన్నయొక్క భార్యను పెండ్లియాడు నాచార ముత్కళదేశమున నున్న దని యతని కెఱుకలేదు. మఱియు టిబెట్టుదేశమున నేఁటికి సోదరు లిరువురికి నొక్కతే భార్యయుండునను విషయము (వివేకానందస్వామి వంటి మహనీయుఁడు తెలిపినది) వ్యాసకర్తకు, కలలోనైన కనుపింపలేదు.[1] వాసుదేవకవి వివాహసంకల్ప సమయముననే సందర్భశుద్ధిగా యిట్టి యాచారమును, సంప్రదాయమును తెలిపినందులకు కవిని ప్రశంసింప వలసినదే కాని, అసభ్యమని విమర్శించుట విమర్శకుని సభ్యతా లోపము.

ఇఁక సంకల్పముమాట - సప్తఋషుల సంకల్ప మెంత చులకన మైనది ! యని యొక యాశ్చర్యార్థక చిహ్నితవాక్యము. ఇచట విమర్శ కుని జ్ఞాన మెంతచులకనయో మనమాశ్చర్యపడవలసినదే కాని వేఱొండు కాదు.

మన వివాహములలోని మహాసంకల్పమునకు బదులుగా, కొంత కాలము క్రిందటనే అనఁగా నింగ్లీషువారి పరిపాలన బాగుగనాఁటుకొనిన

---

1. అన్నయొక్క భార్యను తమ్ములనుభవించు సంప్రదాయము, దక్షిణ హిందూదేశమున నీలగిరిప్రాంతమున "తోదువ" రను కొండజాతివారి యందునున్నట్లు "నీలగిరి యాత్ర" యను వచనగ్రంథమున నిట్లు గలదు. ఈ గ్రంథము క్రీ. శ. 1846 లో వ్రాయఁబడినది. "ఏక కుటుంబముననుండు సోదరులందఱు నగ్రజు భార్యంగూడు వాడుకగలదు. అగ్రజుండు వార్ధకంబు నొందియుండుతఱి నేనిం దత్కళత్రంబు కాలధర్మంబు నొందిన నయ్యగ్రజునకు పరిణయం బొనరించి తత్కళత్రంబుతోన మఱందులందఱుం గూడెదరు. జ్యేష్ఠుండు జీవింపఁ గనిష్ఠులు పరిణయంబు చేసికొనరు. (పుట 41.) మద్రాసు ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగార ప్రకటితము. గ్రంథసంఖ్య 65.

కాలముననే [1]లండర్ సంకల్పముదయించినది. ఇది "ఓం లార్డ వే స్వాహా, ఓం జీససే స్వాహా మమ ఉపాత్తధనవ్యయద్వారా......అని మొదలిడి ఉభయకుల కామర్ గోత్రస్య మిస్టర్ అండ్ మిస్సెస్సు నామధేయస్య ......ధేమ్సునదాహానద్యాం, జ్ఞానకల్యాణ స్నానమహంకరిష్యే" అని పూర్తి యగును.

ఈ లండర్ సంకల్పము నీనాఁ డేసాంఘిక నాటకముననో నిమిడించి ప్రకటించిన కొంతకాలమునకు సమితాకర్తవంటి విమర్శకులు దీనిని 'పేరడీ' యందురో లేక సాంఘిక వ్యవస్థలో, పాశ్చాత్యులగు నాంగ్లేయుల, దేశ భాషాప్రభావమెంతవఱకుఁ బ్రాకెనకో తెలిసికొనుటకు నవకాశము గల్పించిన 'సూచన' యందురో యూహింపవలసియున్నది.

"కవి విదగ్ధుఁడే కాని...కోరి యనౌచిత్యమున కొడిగట్టినాఁడు. ఇది పురాణదంపతుల పుణ్య కథయను మాటయే మఱచిపోయినట్లు వ్యవహరించినాఁడు." అని విమర్శ. పురాణదంపతుల పుణ్యకథయని ఎందు శతాబ్దులనాఁటి వాసుదేవకవియే మఱచుటయేమి? కవికులగురుఁడగు కాళిదాసకవియే యిప్పటికి పదమూఁడు శతాబ్దులక్రిందట, మఱచినాఁడన వచ్చునా? "జగతః పితరౌ వందే" అని రఘువంశము ప్రారంభించిన మహాకవి కుమారసంభవమున, దంపతీరతిని బట్టబయలుగా నెట్లు వర్ణించెను? ఇంతయేల? ఇప్పటికయిదు శతాబ్దులు క్రిందట దివ్యతిరుపతి క్షేత్రమున, సంకీర్తనాచార్యులు తాళ్ళపాక అన్నమయగారు "అన్నమకు తాళ్ళపాక ఘనుఁడన్నఁడు పద్యశతంబుఁ జెప్పెఁ గోకొమ్మని వాక్ప్రసూనముల కూరిమితో నలమేలుమంగన్" అని "అమ్మకు" సమర్పించిన పద్యశతము (వేంకటేశ్వర శతకము) సంభోగ శృంగార వర్ణనాత్మకము.

---

1. ఏదైన గ్రంథమునుగూర్చి వ్రాయునపుడు, ఆ గ్రంథముద్రణమునుగూర్చి యింతకుముందు వ్రాసిన పరిశోధకులనుగూర్చి "వీరికి గ్రంథమెన్ని పరియాయములు ముద్రితమైనది తెలియలేదు" అని యవహేళనముచేయు వ్యాసకర్త, పైలండన్ సంకల్పమెచ్చట నున్నదో, కనుగొనుటకు పరిశోధన చేయునని, సంకల్పమంతయు నాకుఁదెలిసినను నిందుదాహరింపనైతిని.

అన్నమయ్యగా తలమేలుమంగ వేంకటేశ్వరులు, పుణ్యదంపతులను మాట మఱచినారని చెప్పనగునా! పై యిరువురునుకోరి యనౌచిత్యమున నొడిగట్టినారా?

కవిహృదయము రీతి, కావ్యవిమర్శనగతి కవియైన వానికేగాని, కలముపట్టిన వారికెల్ల నవగతముకాదు. వ్యాసకర్తయే యీ పట్టున వాసుదేవకవి వ్రాసినది 'నాటకము' ను మాట అనౌచిత్య, అసభ్య అమంగళీత్యాది పదప్రయోగ వ్యవహారములలో మఱచినాడేకాని, అసలు గ్రంథకర్త మఱువలేదు.

ఆ నాటకరచన కంతరార్థము సంకల్పించియే కవియీరీతి నితి వృత్తము సాగించినాడు. ఆయంతరార్థము గ్రహించుటకు నీ విమర్శకుని హృదయాంతరాళమున నావంతయును, తావులేదు. అది యట్లుండనిండు. ఈ నాటకమున వినాయకుని నర్చించుటకుముందు పూజారివచ్చియున్నను పరిచారికుఁడు వచ్చినవెనుక జరిగిన సంభాషణ "ఇక్కడ హాస్యము" అను శీర్షికక్రింద చూపఁబడినది. ఆ సంభాషణ సూత్రధారునికి పరిచారకునకు జరుగును. "పరిచారిక గాడిదముండాకొడుకు" రాగానే, సూత్రధారుఁడు "ఇంతసేపు స్వయంపాకం సేయక యెక్కడికిబోయి యుంటివిరా?" అని ప్రశ్నించును. "దినము సల్దివంటకముపిడిచి తళిగెనేసుకవత్తును. ఈ పొద్దుసల్ది మిగులలేదు. వండుకొంచు వచ్చేటందుకు యింతసేపు పట్టెను." అని జవాబిచ్చును.

సూత్ర. ఓరి! తిష్ఠన్మూత్ర ముండాకొడుక! ఓరీ! దేవునికి సల్దివంటకము పెట్టుదురటరా!

పరి. ఇప్పుడు పదినాళ్లనుంచి స్నీ పిళ్లారికన్నీ (వినాయకునక) పూజారి కిన్ని కడుపు సెగయెత్తింది. అందునుంచి సల్దివంఠం నైవేద్యాం పెట్టుతున్నాము.

సూత్ర. ఓరోరి వెర్రివాడా! రేపటినుంచి స్వయంపాకంచేసి వేడితళిగను గొంచురార!

పై విధముగానే, శహాజీ రచితమైన శచీపురందరము అను నాటకమున, సూత్రధారునికి అర్చకునికి సంభాషణ.

సూత్ర. ఓహోయి అర్చకుండెవరోయి! విఘ్నేశ్వరుండు వచ్చి యింత తడవాయెనే. యింత సేపు పూజసేయక యెక్కడికిపోతిర దుక్క ముండాకొడక!

అర్చ. ఏలరా! ఊరకే వదరుతున్నావు వెట్టి పెత్తాకొడక ... అర్చకుని శపాలుమాత్రం తెంచుకొని వత్తువురా. నీవాండ్లను దండించేది లేదు. ఏమిన్ని లేదు.

అందే పూజారి పరిచారకునిచూచి "ఓరి పరిచారిక భ్రష్టు ముండాకొడక ...... నైవేద్యమైన పదార్థాలు యివన్నీ నెత్తిమీద పెట్టుకొని, మణివగాని గుత్తలంజ తోత్తుకుయిచ్చి, దానిదగ్గఱ పండుకో ఉండి స్నానమున్ను చేయకనే తడిబట్టతో ఒళ్లుతుడుచుకొని తారుమారుగా విభూతిపూసుకొని, విఘ్నేశ్వరమూర్తికి పరిచారికము చేయవస్తివి. విఘ్నేశ్వరుని సొమ్మంతాను తిని తోత్తులకున్ను ముండమోపులకున్ను ...... క్రొవ్విపోయెను.

ఈ నాటకమునసే, వక్రదంతుడు "ఓరి తిష్టమాత్ర ముండా కొడుకుల్లారా!" అని సూత్రధారుని సంబోధించును.

శచీపురందరము, శహాజీమహారాజు కృతము. ఆతడేతనరచనలలో పై విధముగ వ్రాసినపుడు శహాజీస్థానకవియైన వాసుదేవకవియు నట్లే రచియించి రాజాదరణము గాంచినాడు.

ఇట్టి రచనలయం దంతరార్థము, సుంతయేని పరిశీలించినగాని చింతనీయముకాదు.

తంజావూరి నాయక రాజులవలె, మహారాష్ట్ర రాజులు దేవాలయములలో, నిత్యనైమిత్తిక పూజావిధానములు సక్రమముగా జరిపించుటయందు శ్రద్ధవహించినవారు. వారి కాలమున సాధారణముగా కొన్నిచోట్ల పూజారులు దేవాలయములలో, నైవేద్యపదార్థములు, పూవులు, పండ్లు పదుపుకత్తెల యిండ్లకుగొనిపోవుట, పూజా సమయమునకు శుచిగా రాకుండుట, మున్నగు నరాజకములు జరుగు

చుండెడివి. అట్టివానిని తొలగించి, [1]పూజారులకు గుణపాఠము నేర్పుటకు నాటకప్రదర్శనముల నట్టి యకృత్యములను బైటపెట్టుటకంటె, వేఱు మార్గములేదని వారీపథకముఁ ద్రొక్కిరి. నగరిలో బహిరంగముగా నాటకము ప్రదర్శించునపుడిట్టి యకార్యములను స్పష్టముగా ప్రజానీకమునకుఁ జూపునపుడు నిజముగా నట్టి యకార్యములను చేయువారికంతకంటె శిక్ష యేమున్నది? వారితప్పు నడవడికలను వారేదిద్దుకొందురు. మఱియొకవారిని దండనలచే శిక్షించిన లాభమేమి? ఇట్టి ప్రయోజనము నభిలషించియే, యానాటి నాటకరచయితలు తమనాటకముల నిట్టి హాస్యరసప్రధానరచనలు గావించిరి.

పూజారులవలెనే వైదికులు వివాహకాలమునందు, సంస్కృత భాషాజ్ఞానములేక సంకల్పము చెప్పునపుడు చేయులింగ వ్యత్యాసములు, అపభ్రంశములు మొదలగునవి మృదువుగా విమర్శించుటకు, వాసుదేవ కవి యిట్టి నూత్నసంకల్పరచన కావించినాఁడేకాని వేఱుకాదు. అట్టి సందర్భములు, పార్వతీ పరిణయమువంటి వివాహకథావృత్తమున్న నాటకములయందేగాని తక్కిన వానియందతుకు కొనఁజాలవు. కవి యాశయమును సిద్ధింపదు.

---

1 పూజారులుగాని యర్చకులుగాని యిట్టివిచేయుట పరిపాటియైనట్లు తూర్పు గోదావరీ మండలమున పలివెల కొప్పు లింగేశ్వరస్వామి కథ తెలుపుచున్నది. పలివెల యందలి, ఈశ్వరాలయమున, లింగమునర్చించు పూజారి ప్రతిదినము తనవేశ్యయింటివద్ద పూదండలుంచి, యవి యాలయమునకు దెచ్చి యర్చించువాడు ఆ వేశ్య వానినొకమారు ధరించి, యశ్లేయేమియు నెఱుఁగనట్లు వానినుంచెడిది. ఒకనాఁడు పూజారిమామూలుగా దండలను తీసికొని దేవునికిసమర్పించెను. అప్పుడే దేవదర్శనమునకు వచ్చిన రాజుగారి కాదేవునికర్పించిన దండనిచ్చెను. వారాదండను కొనిపోయి నగరిలోచూడగా నందు వెంట్రుకలుండెను. ఇదియేమి లింగాకారుండైన ఈశ్వరుని పూజాపుష్పములలో వెంట్రుకలెట్లు వచ్చినవియని పూజారిని గద్దించియడిగిరి. ఈశ్వరునికి కొప్పు (వెంట్రుకలు) గలవు. తాము బరీక్షించవచ్చునని యాతఁడు చెప్పెను. మఱునాఁడు రాజుగారు వచ్చిచూచుసరికి యశ్లేయుండెను. కావుననే యా లింగమూర్తి కొప్పు లింగేశ్వరుఁడయ్యెను.

మంగళాష్టకములలో, తెలుఁగు సంస్కృతపదములను కలిపి రచనచేయుట (మణిప్రవాళరచన) తొలుదొల్త వైదికులవలననే, ప్రారంభమైనది. వారు కర్మకాండలో సంస్కృతమునే నుపయోగించుట విధియై యున్నది. కాగా నిత్యవ్యవహారమున తెనుఁగున నున్నప్పుడు సంస్కృత పదము వానితో సంయుక్తీకరించి, వ్యవహరింపక తప్పదు.

" ఆషాఢ శుద్ధపంచమ్యాం వచ్చెనే వృద్ధగౌతమా
అథవాతప్పిదారేణ ద్వాదశ్యామదితప్పదూ "

ఇత్యాదిరచనలు, మనకు పరిచితములే. కాని తరువాత తెలుఁగు కావ్య రచనలో నీ పద్ధతి యుండకూడదను నను శాసనము వెలసినది. అట్టిమణిప్రవాళరచనను తలపింపఁజేయుటకు నీ మంగళాష్టక మణిప్రవాళరచన యావశ్యకమైనది.

మన మత, సాంఘిక, భాషాసంప్రదాయములీ నాఁడుమఱుఁగు పడినను, మన సాహిత్యరచనలలో నవి గర్భీకృతమై యున్నవి. కావున నట్టిరచనలు విమర్శించుటకు ముందు, మనపరిశోధక క్షీరకంఠులింక యెంతవరకో పెరిగిపెద్దవారైనగాని యర్హత గడింపలేరని తెలిసికొనవలసి యున్నది.

## క్షేత్రమాహాత్మ్యములు

దక్షిణాంధ్ర వాఙ్మయమున ప్రత్యేక శాఖగా నెన్నఁదగినవానిలో క్షేత్రమాహాత్మ్య శాఖయొకటి. ఇది నాయకరాజుల కాలమునకుముందే దక్షిణదేశమున ప్రారంభమైనది.

౧. చొక్కనాథ చరిత్ర - ఇది క్రీ. శ. 1540 ప్రాంతమున, వెలసిన పచ్చకప్పూరపు తిరువెంగళకవి రచితము " హాలాస్యక్షేత్ర మాహాత్మ్యము" అనఁబడు మధురాపురక్షేత్ర మాహాత్మ్యమును నిది వివరించును. ద్విపద కృతియగు దీనినే, మైసూరి పరిపాలకుఁడగు నంజరాజు వచనకృతిగా రచియించియున్నాఁడు.

౨. మన్నారుగుడిక్షేత్ర మాహాత్మ్యము - ఇది తంజావూరునకు సమీపమున నున్నది. నాయకరాజులకు ముఖ్యక్షేత్రము. దీనికి "దక్షిణ ద్వారక" యనియు, "చంపకారణ్యక్షేత్ర మాహాత్మ్యము" అనియుఁ బేళ్లుకలవు. ఇచ్చటి రాజగోపాలస్వామి యపరావతారమగు విజయ రాఘవ నాయకుఁడు. తానీ దివ్యస్థలవర్ణన రచించినట్లుగా ప్రహ్లాద విజయ నాటకావతారికలో నిట్లు చెప్పుకొన్నాఁడు.

"దక్షిణ ద్వారకాస్థలవర్ణనాభాగ
మ ద్ధరించిన సుప్రసిద్ధచరిత"

కాని, యిది కానరాలేదు. ఇఁక చెంగల్వ కాళకవి విరచిత[1]రాజ గోపాల విలాసమునందలి మొదటియాశ్వాస మీ మన్నారుగుడియను చంపకారణ్య క్షేత్రమాహాత్మ్యమే. ఇది సంస్కృతమున, బ్రహ్మాండ పురాణమున విష్ణుక్షేత్ర ఖండమున, నుత్తరభాగమున, నరువదియొకటి మొదలు నరువదియెనిమిది యధ్యాయములలో నున్నది. మన్నారుగుడిక్షేత్ర మాహాత్మ్యము వచనములోఁగూడ నొకటియున్నది. కాని యత్కర్తృక తెలియరాదు.[2]

3. పంచనదస్థలపురాణము - దీనినే 'తిరువాడి' క్షేత్రమందురు. ఈ స్థలపురాణమును తులజాజీరాజుకాలమున నాబూరి కుప్పనకవి తెనిఁ గించినట్లు తన శంకరవిజయమున నిట్లు చెప్పుకొని యున్నాఁడు.

సీ. "లీలఁబంచనదీస్థలీపురాణము తెనుఁ
గించితి వారూఢకీర్తి మెఱయ"

కాని యీ గ్రంథమలభ్యము.

---

1. నాచే సంపాదితమై ప్రకటితమైన రాజగోపాల విలాసమున గ్రంథాంతమున తెలుఁగు లిపిలోను, నాగరలిపిలోను, పైని తెలిపిన మూలసంస్కృత భాగము ముద్రితమై యున్నది.

2. మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారము మన్నారుగుడి కైఫీయతు.

౪. శ్రీరంగమాహాత్మ్యము-సుప్రసిద్ధ వైష్ణవ క్షేత్రమగు శ్రీరంగము యొక్క మాహాత్మ్యమును, వచనరూపముగ మధురాపురాధీశుఁడు విజయరంగ చొక్కనాథుఁడు రచియించినాఁడు.

౫. వృద్ధాచల మాహాత్మ్యము - వృద్ధాచలక్షేత్ర మాహాత్మ్యమును ప్రబంధముగా శేవూరి అనంతయ రచించియున్నాఁడు. ఇది యముద్రితము. తురయూరు ప్రభువగు లింగారెడ్డి కంకితము.

౬. శ్రీముష్ణమాహాత్మ్యము - ఇది దక్షిణ దేశక్షేత్రమే. పై యనంతయ పౌత్రుఁడు బాలకవి యనంతయరచించెను. ఇది వెంగుళము కృష్ణభూపతి యానతిచేఁ దెనిఁగింపఁ బడినది. అయిదాశ్వాసముల పద్య ప్రబంధము. అముద్రితము.

౭. సేతుమాహాత్మ్యము-అనఁగా రామేశ్వర క్షేత్రమాహాత్మ్యము వెలఁగపూడి కృష్ణయామాత్యుఁడు, భానుమద్విజయావతారికలోఁ దన పూర్వులలో నొక రీకృతిని రచించినట్లు చెప్పుకొని యున్నాఁడు.

క. భూనుత గాంగేయో పా
ఖ్యాన సుమంతోదయాంధ్రకర్ణామృతముల్
మానితవజ్రభుజో పా
ఖ్యానము శుభహేతుసేతు మాహాత్మ్యంబుల్

కాని యీ కృతి లభ్యమగుటలేదు.

భాస్కర వేంకటాచలకవి యను దక్షిణాంధ్రకవి సేతుమాహాత్మ్యమును రచియించియున్నాఁడు. ఇది నాల్గాశ్వాసముల పద్యకృతి. అముద్రితము.

౮. చిత్రకూటమాహాత్మ్యము-తిరుమలకవి కృతము. ఇది ద్రవిడ భాషలో "తిల్ల" అనఁబరగుచున్న చిదంబర క్షేత్రమాహాత్మ్యము. అముద్రితము.

౯. గజారణ్యక్షేత్రమాహాత్మ్యము - గజారణ్యక్షేత్ర మనఁగా జంబుకేశ్వరము - ఈ స్థలమాహాత్మ్యమును, కవిఘాటి బలభద్రకవి "గజారణ్యసంహిత" అను పేర పద్యకృతిగా రచించియున్నాఁడు. గ్రంథము ముద్రితము.

౧౦. కాశీ మహిమార్థ దర్పణము - ఇది జగత్ప్రసిద్ధమగు వారాణసీ క్షేత్రమహాత్మ్యము. సంస్కృతకాశీ ఖండమునుండి నంజరాజు వచన రూపముగాఁ దెలిగించినది. గ్రంథ మముద్రితము.

పైని వివరించిన వానిలో మొదటి తొమ్మిది క్షేత్రములును దక్షిణదేశమునకు సంబంధించినవే. ఒక్క కాశీక్షేత్రముమాత్రమే యుత్తరదేశమునకు సంబంధించినది. ఈ సందర్భమున మనము, వాల్మీకిచరిత్రలో రఘునాథనాయకుఁడు మూలమున లేకున్నను క్షేత్రములను వర్ణించెనన్న మాట మఱువరాదు.

## వేదాంత గ్రంథములు

దక్షిణాంధ్ర వాఙ్మయమంతయుఁ గేవలము శృంగార పదమే యనియు నందును తంజావూరియందు శృంగారరస ముప్పొంగి, విశృంఖలముగ విహరించినదనియుఁ దలంచు, వాఙ్మయవిమర్శకులకు, తంజాపూరి రాజ్యమునందే వేదాంతగ్రంథము లుద్భవించుట వింతగాఁ దోచక మానదు. చంపకారణ్యక్షేత్ర వాసియగు పరమానందతీర్థుఁడీ శాఖలోఁ బెక్కుగ్రంథములు రచించియున్నాఁడు. ఈతఁడు దత్తాత్రేయ సంప్రదాయ ప్రవర్తకుఁడై, అద్వైత వేదాంతమునుగూర్చి, యీ క్రింది గ్రంథములు రచించియున్నాఁడు. బ్రహ్మవిద్యా సుధార్ణవము, వివేకచింతామణి ఉపదేశక్రమము, అనుభవదర్పణము, ముక్తికాంతాపరిణయము, శివజ్ఞాన మంజరి, సంపంగిమన్న, శివముకుంద పరమానందశతకములు.[1] ఈగ్రంథములన్నియుఁ దంజావూరునకు సుదూరముననున్న యాంధ్రమండలములందు వ్యాప్తిగలవన్నచో వీనిప్రచారము గ్రహింపవచ్చును.

---

1. ఈ పుస్తక వివరణమునకు నీ గ్రంథమున పుటలు. 296 – 300 పుటలు చూడుఁడు.

తులజాజీ కృతమగు 'రాజరంజన విద్యావిలాసము', ప్రబోధ చంద్రోదయమువంటి వేదాంతనాటకము. గాత్రపురిని జీవుండు సత్య ధర్మాదుల సంగతివలన కామాదిమాయలను తఱుముగా, నవి యాత్మేశునితోఁ దెలుప, మోహాన యోగి విద్యలనాడి జీవునితపఃస్థితునిగాఁ గావించును. జీవునకీశ్వరుఁడు ప్రసన్నుఁడగును. జీవేశ్వరులు రతీమన్మథ వివాహమొనర్తురు.

చల్లాసూరయకవి వివేకవిజయనాటకము నిట్టిదే. ఇందు వివేకేంద్రుఁడుపనిషత్కాంతఁ గూడి ప్రమోదమునందుట ప్రతిపాదితము. జీవేశ్వరుఁడు ముక్తికాంతనుగూడి యమందానందము నొందుననువిషయముగూడ నిందు పొందుపఱుపఁబడి యున్నది.

## నల్లందిగళ్ వంశావళి (సీసమాలిక)

విజయరంగ చొక్కనాథుని కాలమున వెలసిన యీ చారిత్రక సీసమాలిక[1] నల్లందిగళ్ వారను నొకసుప్రసిద్ధ వైష్ణవ వంశమును గూర్చి తెలుపునది. ఈ మాలిక యందు వారివంశమిట్లు తెలుపఁబడినది.




పై వంశావళి యీయయ్యవారయ్యకుఁ గృతి.

1. దీనిని తొలుత శేషార్యోదాహరణమునుగూర్చి తెలుపుసందర్భమున పేర్కొని యుంటిని. (చూడుఁడు. ఉదాహరణ వాఙ్మయచరిత్ర. పుట 157, 158 1950) ఆవెనుక నిది క్రీ. శ. 1952 మద్రాసు ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారమువారి బుల్లెటెను (సం. 5. సం. 1) లో శ్రీమల్లంపల్లిశరభేశ్వరశర్మగారి సంపాదకత్వమునఁ బ్రకటితమైనది.

౧. పై వారిలో నారాయణ జియ్యరు శ్రీరంగక్షేత్రమున జియ్యరై యుండెను. తురకల దండయాత్రవలన శ్రీరంగనాథస్వామి మళయాళ దేశమున వలసకుఁ గొంపోఁబడి యరువది సంవత్సరములు పొడవడగి యుండ, స్వామినిమఱల సంస్థానమునఁ బ్రతిష్ఠించి తనమంత్రశక్తివలన యనేకాద్భుత క్రియలనొనర్చెను.

౨. నారాయణ జియ్యరునకు నాలుగవతరమువాడగు తిరుమలాచార్యుఁడు గానాభినయుల విద్యలయందారితేఱి, అపరవారదుఁడని ప్రఖ్యాతివహించెను. ఆతఁడు విజయనగర రాజ్యాధీశుఁడగు శ్రీరంగరాయల వారిచేతను, తుపాకుల లింగభూపతిచేతను, పాండ్య రాజ్యాధీశుఁడగు ముద్దు వీరప్పనాయని వారిచేతను సమ్మానితుఁడయ్యెను.

3. తిరుమలాచార్యుని నలువురు కొమారులును, పాండ్యదేశాధీశుఁడగు [1]విజయరంగ చొక్కనాథ నాయకునికి (1704 - 1732)యాప్తులై యున్నట్లుగా నీ గ్రంధమున నిట్లు తెలుపఁబడినది.

" సీ. ................ మన్మథమన్మ
ధాకృతి నిన్నంటె డెనుక (అయ్యవారయ్య)
శ్రితజన సంస్తుత్య శేషయామాత్య ప
ర్వతధైర్య వేంకటరాఘవార్య
ఘనకీర్తి నిస్తంద్రుఁ గస్తూరిమంత్రీంద్రు
వారు తేజోరూప వైభవములఁ
దులవేక సకలవిద్యలు నేర్చి నానాఁట
నభివృద్ధిఁ బొందుచు నహరహంబు
నీమాటజవదాట కామోదమునుగూర్చు
చలరామచంద్రుని కనుజులైన
శత్రుఘ్న భరతలక్ష్మణుల చందంబునఁ
దమ్ములై నీకుఁ జిత్తమ్ములలర

1. ఈ వేంకట రాఘవాచార్యుఁడు మధుర నాయకరాజచరిత్రలో నొకప్రసిద్ధ పురుషుఁడు. విజయరంగ చొక్కనాథుని వెనుక రాజ్యముపాలించిన మీనాక్షి కాలమున (1732 - 1737)కూడ రాజ్యతంత్రమునఁ బాల్గొన్నవాఁడు.

సేవసేయుచుఁ బాండ్యసింహాసనస్థుఁడై
దక్షిణరాయలై తనరువిజయ
రంగచొక్కనృపాలు రత్నసమ్ముఖమునఁ
నాప్తులై, మిత్రులై యధికులగుచుఁ
గొలువఁగా వారిలో గుణఖనియని యైనవేం
కటరాఘవాచార్యుఁ గదనశౌర్య "
జేపట్టి ..............................
సకలాధికారములే చక్కఁగా దయచేసి
ప్రతిలేకపాలింఁ బ్రబలెనతఁడు "

పై యన్నదమ్ములలో శేషార్యుని పేరనే శేషార్యోదాహరణము రచిత మైనది. అందు శేషార్యుని వంశమును గూర్చియిట్లు చెప్పఁబడినది.

శా. శ్రీనల్లందిగళన్వవాయ మవనిన్ జెన్నొందు నేవంశమం
దానారాయణజియ్యరంచనఁగఁదా నారాయణుండుద్భవం
బైనాఁడందు జెలంగు తిర్మలసుధీయాదోధిచంద్రుండు దా
నానూనస్థిరకీర్తి శేషఘనుఁడు ద్యద్ధర్మశర్మాన్యుఁడై

శా. రాకేందుద్యుతి తిర్మలార్యసుతు భారద్వాజగోత్రున్ దయా
లోకశ్రీకరుఁడయ్యవారయకు మేలుంగూర్చు నాతమ్మునిన్
జోకన్వేంకటరాఘవార్యునకుఁ గస్తూరయ్యకున్ పెద్ద నా
లోకైకస్తుత కీర్తిశేషఘను సుశ్లోకున్ బ్రశంసించెదన్.

ఈ శేషార్యోదాహరణము రచించిన కవి బాలకవియనంతయ్య కావున నల్లందిగళ్ వంశావళి కృతికర్తయు యనంతయ్యయే. యగుట స్పష్టము.

ఈ వంశావళి చారిత్రకాంశములతో సమన్వయించి [1]ప్రకటించిన నది దేశచరిత్రకు నెంతయో యుపకరించును.

---

1. ఈ సందర్భమున చారిత్రక సంబంధములైన మాలికల ముద్రణమునుగూర్చి విమర్శకులకట్టి యభిప్రాయములున్నవో గమనింపుఁడు. గణపవరపు వేంకటకవి రచించిన 'పెదళ్గిరివిజయము' ను గూర్చి "దాక్షిణాత్యాంధ్ర సాహిత్యము" న నెట్లున్నదో చూడుఁడు. "పెద్దళగిరివిజయము చారిత్రకముగను వాఙ్మయదృష్టియందును ముఖ్యమైనది. భాషాభిమానులెవ్వరైనను దీని ప్రతినివ్రాయించి ప్రచురింతురుగాక! పుట. 38." కాని గ్రంథకర్తలు కొంచెము పరిశోధన చేసిచూచిన 'పెదళ్గిరివిజయము' తమ గ్రంథ రచనాకాలముకంటె (1955) మూడేండ్లు ముందుగనే ముద్రితమై ప్రకటితమైనది.

Bulletin of the Government Oriental Manuscripts Library. Vol. V. No. 2. 1952. P P. 50–68.

దండకములు

దక్షిణాంధ్ర వాఙ్మయమున దండకములు చాలతక్కువగనున్నవి. ఉన్నవానిలో నొకటి రెండు భక్తిపరముగనున్నవి. తక్కినవన్నియు శృంగారపరములే! ఆంధ్రవాఙ్మయమున దండక రచన నన్నయతో ప్రారంభమైనది. నన్నయ రచించిన దండకము, కావ్యమధ్యమున నున్నది. దండకము, కావ్యగ్రథితము గాక, ప్రత్యేక గ్రంథరూపమున రచితమైనది పోతనామాత్యుని భోగినీ దండకము. దండకములను భక్తి పథకమునుండి తప్పించి శృంగారపరముగాఁ జేసినదీ భోగినీ దండకమే.

దక్షిణాంధ్రవాఙ్మయమున శృంగారమునకుఁ బ్రాధాన్యముకలదు. కావున శృంగారదండకములే చాలఁగా వెలువడినవి. ఒక రాజు స్వారి వెడలుట, అ సందర్భమున నొక స్త్రీనిఁ జూచి మోహించుట, ఆమె రాజుపై విరాళిగొనుట, రాయబారములు, తుదకు వారి సమాగమము ఇదియే దండకముయొక్క యితి వృత్తము.

భక్తిపరముగ నున్న దండకములలో వాల్మీకి చరిత్రమున ప్రథమాశ్వాసమున మునీశ్వరులు విష్ణుమూర్తిని స్తుతించునపుడున్న దండకము మొదటిది యని చెప్పనొప్పును. విజయరాఘవ నాయకుఁడు రాజగోపాలదండకమును రచించినట్లు చెప్పుకొన్నాఁడు. "ధరరాజగోపాల దండక సందర్భవైదర్భిగన్న విద్వత్కవీంద్ర!" ఇందలి వైదర్భి శబ్దముచే దండకము 'వైదర్భి రీతిని' రచితమైనదని యెంచ వచ్చును. ఈ దండకము లభ్యముకాలేదు.

## రాజగోపాల దండకము

తంజావూరి పుస్తకశాలలో రాఘవకవి ప్రణీతమగు నొక రాజ గోపాల దండకముగలదు. కాని యది విజయరాఘవనాయకుని రచన కన్న భిన్నమైనట్లుగా దండకమునందలి చివరభాగము తెలుపుచున్నది. ఇది ముద్రితము గానందున నిందలి శైలి తెలియుటకును నాద్యంతముల నిచ్చుచున్నాను.

మొదలు - శ్రీ రుక్మిణీసత్యభామాకుచద్వంద్వ విన్యస్త కస్తూరికాసార
భోదార భూరిప్రభావిస్ఫుర త్కౌస్తుభప్రోల్లసద్వత్స, వత్సా
భిరక్షానముత్సాహవేళా వినిర్వాహితాఖర్వ దోర్గర్వదుర్వార
పూర్వామర గ్రామణీవార వారాశిరాట్కన్యకాధీశ.

తుది - మాధుర్యముం జెందు సంస్కారముంజేయఁగానెంచి నానేర్చి
నట్టుల్ల సన్మాధురీసాధురీ రీతిన్విడంబించు మీదివ్యలీలావిలా
సాబ్ధిలోనన్ లవాంశంబు లీ దండకస్ఫూర్తిగావించి యర్పించి
తిన్ సత్కృపాశీల సంసేవితాదిత్య దైత్యాహితారాణ్మని
జాలాంశుభావాల శ్రీరాజగోపాలకైకొమ్మటంచున్న హిన్మించు
నీ దండకంబున్న తిన్ జెప్పె...నాపాకనాఁటన్ గడున్ మేటియౌ
కావటూరన్ విరాజిల్లు వృద్ధాచలా మాత్యపౌత్రుండు,
సత్సంస్కృతాంధ్ర ప్రబంధైక సందర్భలీలా కళాశారదా
మూర్తియౌ మూర్తివిద్వత్తనూజాతుఁడౌ రాఘవాఖ్యుడతి
ఖ్యాతి నాచంద్రతారార్కమై - మించఁగాన్.

పై దానిని బట్టి యీ దండకకర్త రాఘవకవి, మూర్తికవి పుత్రుఁడు, వృద్ధాచలామాత్యుని పౌత్రుఁడు - పాకనాటినియోగి - కావటూరునివాసి యని తెలియుచున్నది. [1]ఇది యముద్రితము.

## విజయరాఘవ దండకము

రసవత్కవయిత్రి రంగాజమ్మ, విజయరాఘవ నాయకునిపై నొక దండకమురచించినది. కాని దానిని 'మోహిని' యను నామెు సంగ్రహించి, అల్లాడ విజయభూపతి పేర సమకూర్చినది. దానికి 'మోహినీ దండకము' అని పేరు. వివరములకు గ్రంథములోని పుటలు చూడుఁడు. ఇది యముద్రితము.

---

1. సంఖ్య 423.

## విద్యావతీ దండకము

ఈ ప్రశస్తదండకము, మధురనాయకరాజ సోదరుఁడగు ముద్దళగిరిపై, గణపవరపు వేంకటకవి రచించినది. ఇదియు నొక పెద్దదండకము. ఈ దండకము వేంకటకవి కాలనిర్ణయమునకుఁ జక్కఁగ దోడ్పడుచున్నది. ఆ విషయమంతయుఁ బాఠకలోకమునకు దెలిసియేయున్నది. అయినను "దాక్షిణాత్యాంధ్ర సాహిత్యమున" పై విద్యావతీ దండకమునుగూర్చి, వేంకటకవి కాలమును గూర్చి పరిశోధకులకీ వఱకు తెలియనట్లుగా నిట్లు వ్రాసిరి.

పుట 43 "చిరకాలము నుండియు వేంకటపతికవి యొక్క వాస్తవ కాలము దెలియక వాఙ్మయ విమర్శకులును జరిత్రకారులును దిప్పలు పడుచు పలువిధముల నూహించుచుండిరి." అని యిదివఱకు విమర్శకులు కవిచరిత్రకారులు వ్రాసిన వానిని యనువదించి చివఱకు "ఈ విద్యావతీ దండకప్రతి" యొక్కటి ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారమునందున్నది. అందు "శ్రీ విశ్వనాథాన్వయాంబోధి......శ్రీ ముద్దళ్గరి క్ష్మాతలాధీశు పేరన్......వేంకటార్య ప్రణీతంబుగా బొల్చునాపుష్పకోదండకంబైన విద్యావతీ దండకంబుర్వినా చంద్రతారార్కమై యొప్పెడున్" ఇందువలన "గణపవరపు వేంకటకవి చొక్కనాథుని తమ్ముఁడైన ముద్దళగిరికి సమకాలికుఁడని స్థిరపడుచున్నది" అని తమ చిన్నగ్రంథమున ముప్పతిప్పలుపడి, మూఁడు పుటలు వ్రాసి గ్రంథకర్తలు కాలనిర్ణయ మొనర్చినారు.

విద్యావతీ దండకము క్రీ. శ. 1948 లో ననఁగా తమ గ్రంథమింక నాలేండ్లకు ప్రకటిత మగుననఁగా ప్రకటిత[1]మైనది. దానిని గ్రంథకర్తలు చూచియుండిన నింత శ్రమపడియుండరు.

---

1. Bulletin of the Government Oriental Manuscript Library Madras Vol. I No. I PP. 89-102, 1948.

## శహారాజ దండకము

పై శీర్షికతో నొక దండక రచన తంజావూరి పుస్తకశాలలో గలదు. (గ్రంథ సంఖ్య 426). ఇది యసమగ్రము. అయినను నుపలబ్ధభాగ మును బట్టి చూడనిది శహాజీ యాస్థానకవి యగు గిరిరాజకవి రచియించి యుండవచ్చునను నూహ పొడముచున్నది. ఇది శృంగారపరమే.

మొదలు – శ్రీశంభుపాదాబ్జ భృంగాయమానాంత రంగుండు, రంగత్కృపా పూర్ణనిర్నిద్రలక్ష్మీ కటాక్షప్రవేశాస్పృతానేక నిత్యాంకుర శ్రీసముద్రుండు, భద్రాసనాధ్యాసి, చోళక్షమాశాసి, తంజా పురీవాసి, భూచక్రధౌరంధరీ భావభృన్నిర్జరేంద్రార్చిత శ్రీ పురీవాసత్యాగేశ పాత్రుండు. ...... శ్రీ శాహాభూపాలుం డెంతేరహిన్......యేరీతినే రేయి యారాజకంసర్పువింగూర్కు చందంబునూహించు ... కేశ్వరుంజేరి, యోరాజదేవేంద్ర ! యోరక్షణోపేంద్ర ! యోయాటపాంచాల ! యోసత్కృ పాశశీల ! యోదానసంతాన !......

## బృహన్నాయికా దండకము

నుదురుమాటి వేంకనార్యకృతము. అనర్గళధారకలది. తొండమాన్ రాజులకిష్టదైవమగు బృహదాంబాదేవిపై రచితమైనది. భక్తిశృంగార పరమగుగ్రది.

## చంద్రాననా దండకము

వేంకన ప్రపౌత్రుఁడు సాంబశివకవి రచించినది. శృంగారపరము.

### శాస్త్రగ్రంథములు

భావప్రధానములై రస నిష్యందములగు కావ్యములేగాక, శాస్త్రీయ గ్రంథములుగూడ చాలినంతగా నీ యుగమున పుట్టినవి. వీనిలోఁ బేర్కొనఁదగినవి.

1. ఖడ్గలక్షణ శిరోమణి-నవనప్పరచితము. పుదుక్కోటలోఁ బుట్టి నది. కత్తులకు సంబంధించిన యట్టి శాస్త్రగ్రంథము తెలుఁగున వేఱొకటి లేదు. దీనివివరములీ గ్రంథమున (438-443) పుటలలోఁ జూడనగును.

2. మల్లుపురాణము - వెంకనార్య రచితము - మల్లుల పుట్టు పూర్వోత్తరములను దెలుపునదియుఁ బుదుకోఁటలోఁ బుట్టినది.

3. గణిత దీపిక - గణితశాస్త్రమునకు సంబంధించిన యేకైకకృతి.

4. సంగీతశాస్త్ర సంబంధరచనలు.

భరతసంగీత విద్యలపారముగఁ బ్రవర్తిల్లిన దక్షిణాంధ్ర వాఙ్మయమున సంగీత నాట్యములకు సంబంధించిన లక్షణగ్రంథములు, రాగతాళ చింతామణి - అభినయదర్పణము - తాళదశ ప్రాణప్రదీపిక మొదలగునవి లభించుటలో నాశ్చర్యమేమియును లేదు. కాని వాస్తవముగాఁ జూచిన, లక్షణగ్రంథములకన్న, లక్ష్యగ్రంథముల బాహుళ్యమే ఆయాశాస్త్ర ప్రాభవ పరిపూర్ణతను, ప్రచారమును దెలుపును. నాయక మహారాష్ట్రరాజుల కాలమున వ్యాప్తిలోనికి వచ్చిన గీత, నాట్యప్రాధాన్యములగు, నాటకకృతులు, స్వరజతులు, ననంఖ్యాక ములగు పదరచనలు, వీనికి మూలభూతములైన సంస్కృత గ్రంథములకు వ్యాఖ్యానములు మొదలగునవి తెలుఁగుననే యుండుటచేత, భరతసంగీత శాస్త్రములు రెండింటికి లక్ష్యలక్షణ సమన్వయము కుదిరిన సన్నివేశ మాంధ్ర సాహితీప్రపంచమున, నొక్క దక్షిణాంధ్ర వాఙ్మయముననే, యందును తంజాపురాంధ్ర వాఙ్మయముననే యని చెప్పనొప్పును.

మహారాష్ట్రరాజగు శహాజీ కాలము సంగీతశాస్త్ర చరిత్రలో నొక చిరస్మరణీయఘట్టము. అతఁడు సంస్కృతమునగల సంగీతశాస్త్ర గ్రంథములన్నిఁటిని, సేకరించి, యొక బృహత్ సంగీతకోశమును నిర్మించు టయే గాక, కొన్ని సంస్కృత గ్రంథములకు తెలుఁగుటీక వ్రాయించి యున్నాఁడు. తాను ప్రత్యేకముగ రాగములనుగూర్చి "రాగమేళ వివేకము" అను గ్రంథము రచించినాఁడు. ఇదియముద్రితము. గ్రంథాదిని శ్రీ భోసలకులతిలక శ్రీశాహరాజేంద్ర......తత్తద్రాగ మేళ సముద్భూత రాగాః క్రమేణాలిఖ్యంతే" అని కలదు. గ్రంథాంతమున "ఇతి శ్రీభోసల కులావతంస శ్రీశాహరాజ శశాంకప్రకాశితః రాగమేళవివేకః అష్టమః" అని కలదు. ఈ సంస్కృత గ్రంథమునకుఁ దెనుఁగు వివరములు గలవు.

సంస్కృత భాషలోనున్న ప్రామాణికములగు భరతనాట్య శాస్త్రాది గ్రంథములకు తెలుఁగు భాషలో టీకలు వ్రాయించి యా శాస్త్రజ్ఞాన మును తెలుఁగువారి కందించిన కీర్తి తంజావూరి మహారాష్ట్రరాజులదని చెప్పనొప్పును. అభినయ దర్పణము, అర్జునభరతము, ఆది భరతము, భర తార్ణవము మున్నగు గ్రంథములకు నందఱకు సుబోధకముగనుండు రీతిని టీకలు వ్రాయించిరి. మఱియు 'తాన నిఘంటువు' అను సంగీతశాస్త్ర నిఘంటువును తయారుచేయించిరి. ఇది తానము నాలాపించునపు డెన్ని రీతుల నక్షర విన్యాసముండునో, యన్నింటికి నర్థము వ్రాయఁబడి యున్నది.

తాన – ఇంద్ర, శక్ర, వజ్రి, విష్ణు

తానా – స్వారాట్

తన – హరి, వృష

తనానా – మరుత్వాత్, బిడౌజస్, వలద్విట్, వలద్రుట్, వలచ్ఛిత్ తుషారాట్

తాననా – పాకజిత్, పాకభిత్, జంభజిత్, జంభభిత్, వృత్రజిత్, గోత్రభిత్, వజ్రభిత్, దేవరాట్, స్వర్గరాట్, నాకరాట్.

ఇట్లు దేవతల పేర్లు కాక, నీటి మనుష్యులయొక్కయు మత్స్య ముల యొక్కయు నర్థము లీయఁబడియున్నవి.

తనతాన – జలమర్త్య – అపూరుష, పాథోనర

తానాతాన

తనతన – జలనర, పయోమర్త్య.

తనతనన – జలమనుజ.

తాన – మీన, మత్స్య, అండజ

తానన,

తనఝుష – తనతన, అనిమిష

ఇట్లే గ్రంథమంతయు గలదు. ఇట్టిలోకోత్తర [1]గ్రంథము నింత వఱకే భాషయందును నుద్భవిల్ల లేదు.

శహాజీకృతమగు త్యాగరాజవినోద చిత్రప్రబంధనాటకము – సంగీత సాహితీ కల్పనా శిల్పమునకుఁ బరమావధి – ఆతని పంచరత్న ప్రబంధ కృతియందును కొన్ని యపూర్వ దేశి సంగీతశాస్త్ర ప్రక్రియలు దాహృతములైనవి.

## పంచరత్న ప్రబంధము

ఇందొక కథగాని సన్నివేశముగాని లేవు. నాట్యోపయోగి గీత ప్రబంధ విశేషము లనేకములు గలవు. భాష తక్కువ. స్వరతాళముల విన్యాసముగలదు. కొన్ని యుదాహరణములు.

### ౧. మోహారం

తత్తక్కార్రం ఝుకఝుక తత్తతత్తతాం దత్తత్తా తోధికితా
తీరమానం......తందక తకతక తందక తకతక

### ౨. గణపతి కవుత్తం

ధీత్తత్తై ధీత్తత్తై తద్దాదిద్ధితోనంతా

### 3. నెలకట్టు

తెయితెయిందత్త తా హత్తతెయితెయిం

### ౪. సొల్లుకట్టు

తాంధి తద్ధిమి తక ఝుం గణక ఝుగ తత్తోంగుడు

### ౫. జతి

తాంధిధితాందాం ధిద్ధితాంతాం

### ౬. ప్రబంధదరువు

ఇందు కళాధర సుందరవదన పు
రందర వందిత చరణురె

---

1. చూడుఁడు తంజావూరి తెలుఁగు పుస్తకముల కేటలాగు ద్వితీయ సంపుటము. సంఖ్య. 909 – 910.

౭. త్రికాలస్వరం

సారిగ గారిస రీగప పామ్మగ గపధస సానిసీధ

౮. పదాభినయము దరువు

దేవదేవేశ నన్నేప్పు గావుమహేశ

౯. వర్ణత్రికాల సొల్లు

ధిమిధిమికిట తకఝుణు తతకిట

౧౦. సాదనకాండ్ల సలాముబదము

సల్లాము, సల్లాము, సల్లాముల్ మీకే

### భాషాలక్షణ గ్రంథములు

అచ్చ తెనుఁగు నిఘంటువులు. దక్షిణాంధ్ర వాఙ్మయము తంజాపూరిలో రఘునాథనాయకునితో ప్రారంభమగు నాఁటికిఁ గొంచెము ముందుగా నుత్తరాంధ్ర ప్రాంతమైన తెలంగాణమున, గోలుకొండలో "యయాతి చరిత్ర" అను నచ్చ తెనుఁగు కావ్యముద్భవించినది. అంతకు ముందు తెలుఁగులో తత్సమ భాషాసహితములగు కావ్యములే గాని, కేవల మచ్చ తెనుఁగుతోఁ జెప్పఁబడిన కావ్యములులేవు. నాఁటినుండి గ్రంధమునకు విశేషవ్యాప్తి కలిగినది. అయినను దక్షిణాంధ్ర వాఙ్మయ యుగమునఁ గవులెవ్వరును నొక్క యచ్చ తెనుఁగు కబ్బమును వ్రాయ లేదు. దీనినిఁబట్టి దాక్షిణాత్యకవులు, ప్రబంధకవులను గతానుగతికముగ ననుసరింపలేదనియుఁ దమ ప్రత్యేకత నిరూపించిరనియు తెలియనగును.

అచ్చ తెనుఁగున ప్రత్యేకరచనలు గావింపక పోయినను, నది కావ్యభాషగా పరిణమించుటచేత, తరువాతికవుల కుపయుక్తమగునట్లు నచ్చ తెనుఁగు పర్యాయపద నిఘంటువులను దాక్షిణాత్యకవులు నిర్మించిరి.

అందు మొదటిది గణపవరపు వేంకటకవి వేంకటేశాంధ్రము. ఇది నూఱు సీసపద్యములతో నున్నది. రెండవది, కస్తూరి రంగకవి సాంబ నిఘంటువు. మూఁడవది, నుదురుపాటి వేంగనార్య కృతమగు నాంధ్రభాషార్ణవము. ఇది సంస్కృతమున నమరనిఘంటువు పద్ధతిని,

మూఁడు కాండములుగా విభక్తమై సీసపద్యములతో నున్నది. మఱియుఁ దెలుఁగు పదమునకు సరియగు సంస్కృతపదమును చూపఁబడి యున్నది. ఇది యాంధ్ర నిఘంటుపుకారుల కెల్లరకును పరమోపాదేయమైన ప్రామాణికమగు కృతి.

ద్విరూపకోశము - సంస్కృతమున ద్విరూపకోశము ననుసరించి యచ్చతెనుఁగు పదమునకుగల రెండేసిరూపము లిందు చూపఁబడినది. ఇందుపయుక్తములైనవి సీసములే. ఇది కవులకు నిఘంటు రయిచతలకు నుపయోగించు కృతి. అముద్రితము.

## ఛందోలక్షణ గ్రంథములు

ఛందోలక్షణ గ్రంథములయందు, కొన్ని ప్రశస్త గ్రంథములు దక్షిణాంధ్ర వాఙ్మయమున వెలసినవి. వానిలో మొదట పేర్కొనఁ దగినది.

ఆంధ్ర ప్రయోగరత్నాకరము. ఇది గణపవరపు వేంకటకవి కృతము. ఇది తెలుఁగు దేశమునఁ బ్రచారములోనున్న అప్పకవీయ ముతో సమకాలికమగు గ్రంథము. అప్పకవీయమునందుకంటె, ప్రయోగ రత్నాకరమున, మనకిపుడు లభ్యముగాని, భీమన నృసింహపురాణము రంగనాథుని వనమాలి విలాసము, మున్నగు కృతులయందలి పద్యములు దాహృతములై యున్నవి. ఇదివఱకు వాఙ్మయ చరిత్రకారులకుఁ దెలి యని, మల్లికార్జున పండితారాధ్యుల వారి శివతత్త్వసారము మొదట బయలుపడినప్పుడందలి పద్య మొకటి యంతకుముందే, ఆంధ్రప్రయోగ రత్నాకరమున నుదాహృతమైయుండుట సాహిత్యచరిత్రకారుల కత్యా శ్చర్యము గలిగించినది. ఇందు "స్వానశబ్ద యతి" మున్నగు శాబ్దిక విషయములు చాల చర్చింపఁబడినవి. గ్రంథ మముద్రితము. రెండవది "ఆనంద రంగరాట్ ఛందస్సు" ఇది కస్తూరిరంగకవి రచితము. ఆనంద రంగపిళ్ల కంకితము. లక్షణ చూడామణి యను నామాంతరము గలది. ఇదియును నప్ప కవీయము తరువాత ప్రామాణికముగ నెన్నఁదగినది.

మైసూరిరాజ్యమున, కళువె వీరరాజునకుఁ గృతిగా "వీరనఛందస్సు" అను నొక లక్షణ గ్రంథమును, శ్రీకృష్ణరాజ వొడయరునకుఁ గృతిగాఁ "కృష్ణభూపాలీయము" అను నొక లక్షణ గ్రంథమును నుద్భవిల్లినవి. కాని యవి యంత ప్రసిద్ధినిఁబడయలేదు.

## అలంకార గ్రంథములు

ఈ శాఖకు సంబంధించిన రెండుగ్రంథములు పుదుక్కోటయందే పుట్టినవి. ఒకటి నుదురుపాటి వెంకనార్య కృతము. రఘునాథీయము. రఘునాధరాయ తొండమాన్ పేర రచితమైనది. ఇందర్థాలంకారములు మాత్రమే గలవు. రెండవది [1]రసమంజరి. ఇది సంస్కృతమున భానుకవి రసమంజరికి తెలుఁగుసేత.

## వచనరచనలు

### నంజరాజు చరిత్రము

ఆంధ్రవాఙ్మయమునఁ బ్రసిద్ధుఁడైన నంజరాజు, సంస్కృతకర్ణాట వాఙ్మయములఁగూడ బ్రసిద్ధుఁడే. సంస్కృతమున, నాలూరి నరసింహకవి "నంజరాజ యశోభూషణము" అను నలంకార శాస్త్రమును రచియించి నంజరాజునకే కృతినిచ్చియున్నాఁడు. నరసింహకవికి "అభినవకాళిదాసు" అని బిరుదముకలదు. ఇది ప్రతాప రుద్రయశో భూషణము" ననుసరించి రచితమైనది. ఆ గ్రంథమునందువలె నంజరాజ యశోభూషణమున, నంజరాజు కథానాయకుఁడు, మఱియు నందువలె, నీ గ్రంథమున నాటకప్రకరణముగలదు. సంస్కృతమున నంజరాజ యశోభూషణమున గల నాటక

---

1. ఇది గొననూరి నారాయణయ్య రచితము. దీనినిగూర్చి దాక్షిణాత్యాంధ్ర సాహిత్యమున (61 పుటలో) విట్లు గలదు. "ఇతని యాంధ్రరసమంజరి గుడిపాటి కోదండకవి యాంధ్రీకరణమువలె. నింకను నముద్రితమే. కాని, గుడిపాటి కోదండకవి రసమంజరి యముద్రితము కాదు. ముద్రితమే క్రీ. శ. 1873 నాటికది ముద్రిపమైనది. చూడుఁడు బ్రిటిషుమ్యూజియము గ్రంథాలయము తెలుఁగు కేట్లాగు.

ప్రకరణమునకు నరసింహకవియే యొక యాంధ్రానువాద మొనర్చి యున్నాఁడు. ఆదివచనకృతి. నంజరాజచరిత్ర[1] మని దానికి పేరు.

ఈ గ్రంథశైలినిఁ దెలియుటకై యాద్యంతభాగముల నిందుదాహరించుచున్నాను.

"శ్రీరఁగపట్టణము ప్రభుత్వముచేసిన నంజరాజచరిత్రము శ్రీరంగపట్టణమని యొక, పట్టణము నాదీయమై కావేరీతీరమందు ఉండెను. ఆ పట్టణమందు అనేకదినములుండి బహుభాగ్య వంతుడున్నూ అయిన నంజరాజు అనే రాజు ప్రభుత్వము చేస్తూ ఉండెను. ఆయనకు శ్రీరంగనాథస్వామి ప్రత్యక్షమై సకలభాగ్యంబు లిచ్చుచుండెను. దేవతావరలబ్ధసామర్థ్యుఁడై తన పరాక్రమముచేత సకలదేశములు జయించి సకలదేశములు తన స్వాధీనమం దుంచుకొనెను.

అటుతర్వాత ఆ విద్వాంసులలో సకలశాస్త్రములను ఎఱిగినవాడగు శివరామశాస్త్రుర్లు అని పేరుగలిగి ఉండెను. ఆయన కుమారుడు నవీనకాళిదాసు అని పేరుగలిగిన నరసింహశాస్త్రుర్లు నేను మీ విషయముగ ప్రబంధమును నిర్మాణముచేస్తానని మందలించినాడు. అతరవాత ప్రభువు బహుసంతోషపడి సకల బహుమానములుచేసి, తాంబూలము చేతికియిచ్చి ప్రబంధము నిర్మాణించుమన్నాడు. ఆ శాస్త్రుర్లు ప్రబంధముచేసి యీ ప్రబంధమునకు నంజరాజ యశోభూషణమని నిశ్చయముచేసెను. ఆ తర్వాత నొకనాడు ప్రభువు బహుసంతోషపడి యుండేటప్పుడు యీ ప్రబంధమును తీసికొనిపోయి కచ్చేరీలో ప్రభువుచేతికిచ్చెను. ఆ తర్వాత ప్రభువు ఆ పుస్తకముతీసికొని నరసింహశాస్త్రుర్లుకు తొమ్మిదిఅంబారీలు పన్నెండుహాయ రత్నములు, ముత్యాలపల్లకి, లక్షవరహాలున్ను పన్నెండు వేలవరహాలుమొత్తే జాగీరులున్ను యిచ్చినాడు. తరువాత ఆ ప్రబంధమును అనేకమందిశిష్యులకు పాఠముచెప్పినాడు. అందరున్ను ఈ నాటకమును నేర్చుకొని సుఖంగాఉండిరి.

---

1. ఈ గ్రంథమముద్రితము, మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారమున R, 731. అను సంఖ్యతోనున్నది

ఈ రాజు ప్రభుత్వము చేస్తూఉండేటప్పుడు నిత్యమొకగజదానమున్ను, పది గోదానములున్ను విద్వాంసులకు ఇచ్చుచు వచ్చినవాడాయెను. గజదానమునకు వేయివరహాలుదక్షిణ. గోదానమునకు నూటపదహారు వరహాలుదక్షిణ. ఈ ప్రకారము బ్రాహ్మణులకిచ్చుచుండెను.

## హాలాస్యమాహాత్మ్యము నంజరాజుకృతము. గ్రంథవిషయము

### ప్రారంభము

కైలాసనగవర్ణన - సూతమహామునిని ఋషీశ్వరులు ముఖ్యమైన శివస్థలమాహాత్మ్య మెఱింగింపుమని కోరుట. అగస్త్యసంహితయని దీనికి నామాంతరము గలదని హాలాస్యమాహాత్మ్యమును గూర్చి యొకటి పలుకుట. స్కాందంబందు సంహితతో గూడిన సందేబది ఖండమ్ములు బొదలు. అవి 1. సనత్కుమార సంహిత 2. సూతసంహిత 3. శంకర సంహిత. చతుర్వేదసారము - దీనికే అగస్త్యసంహిత యని నామాంతరము.

### గ్రంథాంతము

పుణ్యప్రపంచంబగు యీ ప్రశ్నాధ్యాయంబు స్పష్టపఠించిన వినిన యతండు గంగాస్నాన ఫలంబు చెంది సమస్తపాప పరమ్ములవలన విముక్తుండగు. గద్యము : ఇది శ్రీ భారద్వాజగోత్రాభిరామ ఋక్శాఖానువర్తిమహీశూర సేనాధిపతి కళువెదొడ్డ మహీపాల పౌత్ర వీరరాజపుత్ర విద్వజ్జన కల్పభూజ నంజరాజ ప్రణీతంబైన స్కాందోక్తంబును యగస్త్య సంహితా ప్రతిపాదకంబునగు హాలాస్య మాహాత్మ్యంబునందు ప్రశ్నకథ యనునది ప్రథమాధ్యాయము.

ఇందు శివుని యరువదినాలుగు లీలలు వర్ణితములైనవి. అవి యీ గ్రంథమున 20, 21 పుటలలో తెలుపఁబడినవి. గాన ప్రత్యేకముగ తెలుపఁబడ లేదు.

ఫలశ్రుతి

ఓయిమునిశ్రేష్ఠులారా ! మీరాదియందు శ్రేష్ఠంబగు లింగంబును అద్భుతంబగు తీర్థంబును యుత్తమంబగు శివక్షేత్ర మహిమంబును నెఱింగించితి. సకలజగమ్ములు గష్ట బతిక్రమింతురు గాక ! ఎల్లవారు భద్రమ్ములుం బొందనిమ్ము. అందఱు సద్గతిం బొందుదురు గాక ! సమస్తమైన వారికి శ్రేయస్సు గాకమ్మనుచుం బ్రార్థించినవాఁడై సర్వజ్ఞుండైన సూతపౌరాణికుండు శంభు భక్తాదిమునిశ్రేష్ఠుల కృపాదృష్టిచేత నను గ్రహించినవాఁడై శివధ్యానపరుండై యుండె"

భాషావ్యవస్థ

దక్షిణ దేశీయాంధ్ర వాఙ్మయమున వెలసిన కృతులయందలి భాష సలక్షణముగాదనియు, నాంధ్ర వ్యాకరణ నియమముల నుల్లంఘించి, విశృంఖలముగా భాషను వాడిరనియు, నీవఱకు విమర్శకులందఱును వ్రాసియున్నారు. కాని, ప్రాచీన కాలమునుండి పరంపరాయాతముగా వచ్చుచున్న మన భాషాసంప్రదాయములను బరిశీలించిన నవి రెండువిధములుగాఁ గోచరించును. ఒకటి నన్నయభట్టారక భాషారచనా సంప్రదాయము. ఇది సుసంస్కృతమైన భాష. దీనిని మార్గ సంప్రదాయమని చెప్పవచ్చును. రెండవది నన్నెచోడ పాల్కురికి సోమనాథాది శివకవులచే ప్రతిపాదితమైన భాషారచనా సంప్రదాయము. దీనిని దేశియని చెప్పవచ్చును. ఈ దేశి సంప్రదాయమున, లక్షణములు మార్గపద్ధతికన్న విలక్షణములై యుండును. కారణమేమనఁగా, తెనుగు భాషలో వ్యాకరణములు వ్రాసిన లాక్షణికులందఱు, నన్నయభట్టారక భాషాసంప్రదాయము ననుసరించియే వ్రాసిరి. కాబట్టి యట్టి వ్యాకరణముల ననుసరించి, శివకవుల గ్రంథములఁ బరిశీలించిన నవి వ్యాకరణ విరుద్ధములగుటనే గన్పట్టును. కాని, కాలక్రమమున కొంద ఱుత్తరాంధ్ర కవులు నట్టి ప్రయోగములు గావించిరి. అట్టివి ప్రాచీన భాషాలక్షణములకు సరిపోకపోవుటచే, నర్వాచీన లాక్షణికులిట్టి విరుద్ధప్రయోగములకు గతికల్పింపవలసి వచ్చెను. శివకవుల గ్రంథములామూలాగ్రముగఁ

పరిశీలించిన నర్వాచీన ప్రబంధకవులు చేసిన ప్రయోగములను నంతకు చాలకాలమునకు ముందే శివకవులు వానిని లాక్షణికముగా నంగీకరించిరని తెల్లమగును. ప్రసిద్ధముగా ప్రచురముగా నుండెడి దేశభాషా సంప్రదాయమును విస్మరించి, మార్గసంప్రదాయము ననుసరించుటచేతనే మన భాషావిమర్శన నిట్టి యవ్యవస్థకు నపోహకుఁ బాల్పడినది.

ప్రస్తుతము దక్షిణాంధ్ర కృతులలో లక్షణవిరుద్ధములని విమర్శకులెత్తిచూపినవానికి ప్రాచీన ప్రయోగములు చూపుచున్నాను.

## సంధి.

౧. అత్వసంధి విజయవిలాసము.

లేనెలంత – ఈ బిడారు. (1 – 195) ఇచట లేనెల యంత – ఈ బిడయారు అని యుండవలెను. అట్లున్న గణభంగము.

చీరెల్ల = చీర + ఎల్ల – బసవపురాణము, పాల్కురికి సోమనాథుఁడు పుట. ౭౪

కోకమ్మి = కోక + అమ్మి – ,, ౧౧౪

ప్రాంతప్పు = ప్రాంత + అప్పు – ,, ౧౩౩

దుగ్గళవ్వనియె = దుగ్గళవ్వ + అనియె ,, ౧౧౧

౨. ఇత్వసంధి.

బంతి + అనన్ = బంతనన్ – విజ. వి. ౧. ౫౯

బంతి + ఇది — బంతిది – ,, ౨. ౧౦౭

మఱఁది + ఇంత = మఱదింత – ,, ౩. ౧౭౦

ఒగితి + ఏడ బగితేడ — పా. సో. బసవపురాణము. పుట. ౨౩౭

కాకి + అఱవులు — కాకఱవులు ,, ౧౧౨

తిత్తి + ఒలిచి — తిత్తొలిచి ,, పండితా. ౧. ౯౧౭

౩. క్త్వార్థకసంధి.

అడిగి + ఇచ్చునో — అడిగిచ్చునో విజ. వి. ౧. ౫౯

అనవలసి + అంటి — అనవలసంటి ,, ౧. ౧౯౧

చూపి + ఇటు — చూపిటు

తెలిచి + ఉండుము — తెలిచుండుము బస. ౩౧ పు.
కూడి + ఉండు — కలిగుండు ⎫
కలిగి + ఉండు — కూడుండు ⎭ ,, ౧౫౫ పు.
ఎగిరి + ఆడువారు — ఎగిరాడువారు పండి ౧. ౧౯౦

౪. ఉదంతమగు కుషష్ఠియందు నగాగరాము.

వాదుకు — వాదునకు యని యుండవలెను. విజవి. ౧. ౧౩౪
సిగ్గుకు — సిగ్గునకు ,, ,, ,, ౨. ౩౦
మంతుకు— మంతునకు ,, ,, ,, ౨. ౭౭
కానుకు...........నన్నెచోడని కుమారసంభవము ౭. ౧౬
నభముకెగయు.... ,, ౯. ౭౩

దీనికి శ్రీనాథాది మహాకవుల ప్రయోగములులు గలవు.

౫. షష్ఠీసమాసమున నుదంతమునకు నజాదిపదము పరమైనప్పుడును గాగముదాము.

తెన్నుని యన్ననన్న — తెన్నుని యన్ననన్న యని యుండవలెను విజవి ౧. ౧౪౭
కూడటకులు — కూడు + అడుకులు కూడు నడుకులు కాలేదు బస. ౭౧ పు.
జిల్లెడాకులు — జిల్లెడు + ఆకులు జిల్లెడు నాకులుకాలేదు. ,, ౭౭ పు.

౬. స్వరలోపము.

ఎట్గి — ఎటిగి యనుటకు విజవి. ౨. ౧౪౭
చాల్నిలుండు — చాలునిలుండు అనుటకు ౩. ౬౧.
ఎట్గి బసవు. ౭.
కన్నెట్గి ,, ౭.
తెల్లిదియు — తెల్లి + ఇదియు ,, పండి. ౨. ౪౦౦
(ఇత్వ, ద్విత్వలోపములు)

౭. సంస్కృతాంధ్ర మిశ్రసమాసములు.

[1]దినచల్వ — విజవి. ౨. ౧౪౪
ఇతరవేల్పులు — బసవు. ౨౦౧
అధమపాటులు — పండి. ౧. ౧౩౧

---

1. దీనిని దుష్టసమాసమని వే. వేంకటరాయ శాస్త్రిలవారు. విజవి పీఠి 6. ఇట్టివి వైరిసమాసములుగావు, ప్రాచీన లాక్షణికుల ననుసరించి యివిసరియైనవి. చూడుండు. నా వ్యాసము బసవపురాణ ప్రయోగాలసమర్థన. ఆంధ్రపత్రిక సంవత్సరాది సంచిక వికారియుగాది. (1959)

౮. ఆత్మనేపదమున ననుప్రయుక్తమగు 'కొని' కి 'కా' వచ్చుట (కొను ధాతువు క్త్వార్థకరూపము)

యనుదానికి 'క' వచ్చుట.

పట్టుకొని — పట్టుక పుచ్చుకొని పుచ్చుక

తెచ్చుక — విజవి. ౧. ౪౮

ఊదుక — ,, ౧. ౧౨౪

తప్పించుక — ,, ౬. ౧౯౮

కట్టుక — ,, ౩. ౧౮౪

ఎత్తుక — భాస్కర రామాయణము. ,, ౧. ౩౧

కూడుక — పద్మపురాణము. ,, ౧. ౧౦౦

సంధించుక — ,, ౩. ౭౬

కూడుక — అనంగుని ఛందస్సు

తప్పించుక — తప్పించుక తిరుగువాఁడె ధన్యుఁడు సుమతీ!

(సుమతీశతకము)

ఇట్టివి చాలఁగలవు.

దక్షిణాంధ్ర కృతులలో ధారాళముగా వ్యవహారిక భాషా పదములు, రూపములు - వచ్చేవేళ, చూచేవు, అయినా మొదలగునవి మస్తు, వజీరు, అవుల్నా, బంగళా మొదలగు నన్య భాషాపదములు ప్రయుక్తములైనవి. ఆ వాఙ్మయమున ప్రత్యేక విశిష్టత గడించిన నాటకములయందు పాత్రోచితముగ వ్యావహారిక భాష సంభాషణలలో ప్రయుక్తమగుటయు, నిట్టి రచనలకు దోహదము కలిగించి యుండవచ్చును. విశేషమేమనఁగా నాటక సంభాషణలయందు పాత్రోచితభాష తెనుగున నేగాక సంస్కృతమున, స్థానికమగు ద్రావిడ భాషయందుఁ గ్వాచిత్కముగ కన్నడమున గలవు. మహారాష్ట్రరాజ పరిపాలన ప్రారంభమైనవెనుక నాటకరచనలలో మహారాష్ట్రభాషకూడ ప్రయుక్తమైనది. ఆయాభాష లేవిధముగ ప్రయుక్తమైనవి యీ క్రింది యుదాహరణములను బట్టి గ్రహింపవచ్చును.

సంస్కృతము.

చిట్టాబళ సోమయాజులు - మాట. అహో సభ్యాః అలమేతైః కవిత్వప్రసంగైః శాస్త్రప్రసంగ। కవేరుచ్చాటన మంత్రసః। రే గోవింద భట్ట శ్రూయతాంమయా తర్కప్రసంగః క్రియతే। త్వయాక్షిప్యతాం.

అనన్యథా సిద్ధనియత పూర్వభావిత్వం కారణత్వం

గోవిందభట్టు :- అన్యనథా సిద్ధనియత పూర్వభావిత్వం కారణత్వమితి కిమర్థముచ్యతే। పూర్వభావిత్వం కారణత్వ మిత్యేవాలం.

చిట్టాబః- హేశ్రూయతాం ఘటాదికార్యం ప్రతిదైవాదాగతస్య రాసభస్య పూర్వభావిత్వమస్త్యేవ. రాసభః కారణంవా!

గోవిందభట్టు - గర్దభం కిముదాహరణముచ్యతే।

సోమయాజులు - ఏవం పృథాకథనేన త్వమేవగర్దభః

గోవిందభట్టు - ఏవం పృథాకథనేన త్వశునకః,

సోమయాజులు - త్వం శూకరః

విప్రనారాయణ చరిత్రనుండి

విప్రనారాయణుఁడు దేవదేవినిఁజూచి

హేతరుణి! కిమేతదత్రాగమనం! కిమావాసస్థానం కింభవదీయం నామధేయమ్? కాషాయాంశుకాది విశేషధారణం కింకారణమ్! కిమేతా దృశదీనతయా? మయాయాదవశశాంక కింకరేణ తవకింకరణీయం తావకీనం కథయవృత్తాంతమఖిలమ్.

దేవదేవి ఆకర్ణయమాని జనవరేణ్య! దేవదేవీనామ్న్యాహం దేవదాసీలోభాదిదుర్గుణ సమేతాం మాతరం విహాయవైరాగ్యేణ సమాగత్య భవద్దివ్య సందర్శనం లబ్ధ్వాస్వామినాం చరణారవింద సేవాం కరోమి కరుణాకటాక్ష వీక్షణేన పరిరక్షణం కర్తవ్యమ్.

కన్నడము

ఇది క్వాచిత్కముగ నుపయుక్తమైనది,
శహాజీ రతికల్యాణ నాటకము (పుట 69).

గేయము

బసవయ్య నిన్న-పదగళ జేరగెదను
వళవానితం దసరతనకోడుననగే
హుల్లూ నీరుగళు - పుష్పిన అవరుగళు
కోశై యాగినిన - కోరెనుదాసలహు.

(రఘునాథాభ్యుదయము నుండి)

కస్తూరిమాట - ఎనయ్య రంగయ్య ధర్మాసన మొదలాద వెక్క సముఖదల్లి హేళిదెల్ల రాణువెలి అవరవరు హిడిదలంచ పరిధానవహేళి బేడాయందు నినగె అవరవరు ప్రియహేళిద్దు నానరియినే.

అట్టవణరంగయ - నేనేను బల్లెయయ్య. అంధాద్దు ఉంటాదరె దూపిసు. యేను బగులు తిద్దియ.

అరవభాష - నాయకరాజులు పాలించినది ద్రవిడదేశమగుటచేత రాజభాష తెలుఁగేయైనను ప్రజావ్యవహారములో స్థానికమగు ద్రవిడభాషయే యుండెడిది. అందుచేత రాజకీయ వ్యవహారములు, మణియము, లెక్కలు, సంభాషణ అరవములోనే జరిగెడివి. నాయకరాజుల కాలమున నాటకకృతులలో నరవమచ్చటచ్చట వాడఁబడినది.

రఘునాథాభ్యుదయము నుండి :—

చిదంబరనాథ మొదలారి :- సముఖత్తిల నీంగ శేన్ అడిచ్చిపద్రీక్ ఎల్లాంక రక్కాళ్ చిత్తమరియుం సుమ్మాయిరుంగో

విప్రనారాయణ చరిత్రనుండి

పూజారి - ఓహోహో ! యిదెన్నడా ! యిదెన్నడా ! పంచపాత్రంగళిళె వొరు పొన్నుకిణ్ణి కాణోం. మోసంవందుదే. అడ కూరత్తాళ్ వాశే !

కూర - అడియేన్

పూ - అడ యెంబరుమాన్ !

ఎం - అడియేన్

పూ - అడ పరాంకుశా !

పరా - అడియేన్

పూ - సన్నిధియిలే వారుపాన్నుకిణ్ణం యేన్ కాణోం. యిదెన్నపిళ్లాయి ?

పరా - ఇదెన్నమయ్యా ! నమ్మైకేళ్‌క్కురీర్. నాంగళెల్లాం దేవరీర్ ఫిరఘే అన్నోవందోం

పూ - ఆనాక యిండైక్కుపంచపాత్రంగళ్ శుద్ధిపణ్ణినవరార్ ?

పిళ్లాయి - ఉమ్మైత్తవిర నాంగళెన్న తిరుక్కాప్పు పూట్టువాంగినోమో కిణ్ణంగళై తొట్టమో నమ్మైకేళ్ పాప్పనేన్ యిండ్రైక్కు పుమ్ముడయ వరిశైయండ్రో

పూ - ఆమాం అప్పడి శెల్లుంపిళ్లాయి నమ్ముడయ మేశేదానే శొప్పత్తినీర్‌గళ్ ఆనాలే ఉంగళై కేళ్క్క కార్యమెన్న యిన్నైరత్తిర్క్కు తిరువారాధనం సంక్షేపమాకప్పణ్ణువోం

మహారాష్ట్రరాజుల పాలనలో, నరవము వ్యవహారమున నున్నను, వారికృతులలో వారిమాతృభాషయైన మహారాష్ట్రభాష కానవచ్చును.

## మహారాష్ట్రభాష

చంద్రశేఖర విలాసమున దరువు - మహారాష్ట్రాంధ్ర మిశ్రమము.

అంతా తాగితె అబ్బాయ తాలి తాలి తా లెల్లలో
మీరు మాతరులు మేము మీబిరలం
బిరలుంతరులుం గూడుకొని ఆడవారితల్లి ఆడినమ్మ
గోకుడుపకళ్లనో వాక్కుమం కొండాడాయో
తాలి తాలి తా లెల్లలో - తాలి తాలి తాలి తా లెల్లో

దరువు - హెనుబాణు మేరబిమేరుడా అకదిల్లి జాణుమేరె బెమేరుడ అల్లకు జాణు మెరబిమేరుడ అకదిల్లి జాణురబిమేరుడ. త్యాగరాజవినోద చిత్ర ప్రబంధము అను నాటకమున మహారాష్ట్రభాష హెచ్చుగా వాడఁబడి యున్నది.

## పాత్రోచిత భాష

నాటకములలో సంభాషణములయందు పాత్రోచితభాష వాడఁబడుటచేత వా కాలమున బ్రాహ్మణాది నానావర్ణములవారును, స్త్రీలును నేవిధముగా మాటలాడు కొనుచుండిరో తెలుసుకొనుటకు చక్కటి యవకాశము లభించుచున్నది.

విద్వాంసుల సంభాషణ (మన్నారుదాస విలాసమునుండి)

మల్లుభట్టు - అవునోయి: యెషువంటి భ్రాంత్యుక్తైనా యిషువలె భ్రమనుకొనునా! భుజిధాతువుకు అనుభవమర్థమని యెషువలె చెప్పుచున్నావోయి?

ఇంకొక పండితుడు - వజ్రశుంఠ మల్లుభట్టిగాండు యేమోయి అనే అట్టు ఆయునా నాబ్రదుకు.

మల్లుమట్టు - యిషువంటి బ్రహ్మిష్ఠో బ్రహ్మకొడును యేమోయి అన వచ్చునా.

ఇంకొక - వోరి! నీవలె వుభయతో బట్టి ప్రాయశ్చిత్తం చేసుకోక వుంటివటరా

మల్లు - వోరీ నీవుపుట్టి మూండాయిత్తారాలులే నిన్నటి సుమపడవు నావంటి యోగ్యుణ్ణిచూచి యేమి వచ్చేవురా సునకంవలె పాదరక్షలుతీసి రెండు ప్రహరింతురేమో.

జోస్యుల సంభాషణ ఈ గ్రంథమున చూడవలెను. 13[?] – 1[?]7 పుటలలో
పురోహితుల సంభాషణ ,,
ముత్తైదువుల ,, ,,

గొల్లలమాటలు - ఒరే! ఒరే! దీన్నిపారేసి మనముంవరం యిక్కడ పండుగ సేతాం.

గొల్లలభాష - ఒరే ఒరే చిన్నొంక! ఒరే ఒరే పెద్దొంక! ఒరే ఒరే

ఒకడు - నూక! ఒరే గుడ్డిబొమ్మ! ఒరే అమాసపెద్దు! ఒరే మాంచాకతిమ్మ! ఒరే గంగ! మన కిచ్చమ్మకు వచ్చిన గాచారం తీరెనే మనకాయిసారం వద్దురారోరి.

మఱొకడు - కిచ్చెమ్మగు ఏంగాచారం వచ్చెరా

మఱొకడు - మఱి నువ్వేడ నుంటివంట

మఱొకఁడు - ఒరే! నేనే పోసపోసపోనా కోడెమ్మగుంటకాడ గొఱ్ఱెల
మంద యుండదే ఆ గొఱ్ఱెలమందకాడ ఒక గుడ్డిమానిసి
మరకపోతా వుండగా ఆలంటూ చుస్తూఉంటిరా!

పై రీతిగా దక్షిణాంధ్ర నాటకరచనలలో చైతన్యము, తొణికిస లాడుచుండును. ఇవి నాటకరంగమున రసస్ఫూర్తి గలిగి ప్రేక్షకులను నపారముగ రంజింపఁ జేసినవనుటలో సందేహము లేదు. ఇంకొక విషయము గూడ నీ సందర్భమున చెప్పవలసి యున్నది. పద్యకృతుల యందలి భాషనుగూర్చి విమర్శించినట్లుగా తంజావూరి నాటకములయందలి భాషను మనము పరిశీలింపవలయును.

నాయక రాజులు పాలించిన దేశమున స్థానికమైనది యరవభాషయే యైనను, వారు తెనుఁగును రాజభాషగా చేసినట్లు వారి శాసనములు తెలుపుచున్నవి. తంజావూరి నాయకరాజులు తెలుఁగుభాషలో శాసనములు వేయింపలేదు. విజయరాఘవనాయకుఁడు, వలాందా వారికిచ్చిన నమ్మిక శాసనము (వెండితేకుపై నున్నది) తెనుఁగుభాషలోనున్నది. దానిని నీ గ్రంథమున చివఱ నిచ్చియున్నాను. నాయకులవెనుక పాలనచేసిన మహారాష్ట్ర రాజులును తెలుగు భాషనే రాజభాషగా నొనర్చిరి. ఈ విషయమున మధురనాయకులను మనము హెచ్చుగా మెచ్చుకొనవలసి యున్నది. వారుచాల తెలుఁగు శాసనములను వెలయించిరి. వారి శాసనములలో చేవ్రాలు స్పష్టముగా తెలుగు పరిపాటిననుసరించి "విశ్వనాథ నాయనయ్యవ్రాలు." విజయరంగ చొక్కనాథ నాయనయ్యవ్రాలు "అని యుండును, వీరి శాసనములు రెండు గ్రంథాంతమునను దాహరింపఁబడియున్నవి. ఈ శాసనములన్నింటిని క్రోడీకరించి ప్రకటింప వలసియున్నది. పుదుకోట రాజులు వేయించిన శాసనములలో నొకటి మాత్రమే తెలుఁగు భాషలోనున్నది. ఇక మైసూరి పరిపాలకులును, వారి సామంతులును తెలుఁగుభాషలో వెలయించిన శాసనములు, వందల కొలదిగాయున్నవి. ఇవియును వేఱుగా ప్రకటితముకాలేదు,

ఇక శాసనములయందలి భాషయంతయు వ్యావహారిక భాష. శాసనములు సర్వప్రజానీకమునకు తెలియవలసినవిగాన నవి యెప్పుడును ప్రజావ్యవహార భాషలోనుండును. కాబట్టి దక్షిణదేశమున నన:గా ద్రావిడ, కర్ణాటక దేశమునలభ్యమైన తెలు:గు శాసనములన్నియు ప్రకటితములైన నవి తెలు:గుభాషా పరిణామమును తెలుసుకొనుట కెంతయేని యుపకరించును. ఇట్లు శాసనములేకాక ఉత్తర ప్రత్యుత్తర ములు, వ్యావహారిక భాషలోనే జరుగుచుండెడివి. అందుల కుదాహరణ ములుగా, తంజావూరి మహారాష్ట్రరాజుల కాలమున వ్రాయబడిన యుత్తరములను మూడింటి నిందు ప్రకటించుచున్నాను.

[1]అమరసింహుడు శంకరాచార్యుల వారికి వ్రాసినది.

"తత్రైసు స్వహస్త్యలైన శ్రీమదమరసింహ్మ భూపాలకులు అన్కే దండవత్ప్రణామ ములుచేసి శాయంగల విజ్ఞాపనములు శ్రీవారు చెన్నపట్ణప్రదేశాన్కి దిగ్గి చాలాదినము లాయను గన్క శ్రీవారి చరణారవింద్ద దర్శనా పేక్ష చాలవున్నదిగన్క అచ్చటి ప్రదేశపు సంచారం శ్రీఘ్రంగా చేసుకొని అషాడ శుధపౌర్ణమి యీవలో కుంభకోణప్రదేశానికి వచ్చి చేరితే చాలా సంతోషంగ్గా వుండును. హరిభట్టు ధవళీకర్ అనే బ్రాహ్మణు డ్కి ని కొంచ్చెం అపవాదం వచ్చింది తమ్మసముఖానికి విశదంగ్గా శ్రుతమైవుండునుగద. ఆ బ్రాహ్మడు ధర్మశాస్త్ర విధాయకుడు గన్క వారి బంధువులు మరిన్ని వుండే బ్రాహ్మ ణులు నగరి వారివద్ద వచ్చి చాల అర్జుచేసిరిగన్క మనకున్ను ఆ బ్రాహ్మణ్ణి పునీతుడు శాయవలెనని శ్రీవారి సముఖాన్ని విజ్ఞాపనము వ్రాసుకొన్నది. హరిభట్టు చెన్నపట్టణ ములో వున్నాడు. అతడు శ్రీవారి సముఖాన్కు వచ్చును. వాడి యందు శ్రీవారు దయచేసి ప్రాయశ్చిత్త రూపంగా యేమైనా చేయించ్చివారిని పునీతుడుగా శాయ తగ్గది. యీ కార్యంనిమిత్య మనవక్కీలు త్రియంబక సంభాజీ బావావారు శ్రీవారి సన్నిధానమందు విజ్ఞాపనము చేస్తురు. ఆలాగున దయచేసి శాయతగ్గది.

పుదుచ్చేరి నవాబు ఆమరసింహ మహారాజునకు వ్రాసిన జాబు

"షహామతు అవాలిమర్త బతుషవుకతు వమూవీమంజాలతు మలాజూ పెంహారు బాన్ మొకర్రం మొకలీసాన్ మహారాజ అమరసింహ్మరాజే సల్లమ్మల్లాహుతాలా

---

1. ఈ అమరసింహుఁడు క్రీ. శ. 1797_1798, సంవత్సరమున తంజావూరి నేలిన మహారాష్ట్రరాజు తులజాజీ సోదరుఁడు. రెండవ జాబుకూడ నీతనికి సంబంధించినది.

మేమునిన్నా ఖుషీని వుంన్నాము మీఖుశాలినామా హామేశా వ్రాయించ్చి పంప్పింన్తూ రావలెను. తII విలాయితీ హుకుం ప్రకారం పుదుచేరినగయిరా యీప్రదేశాలను ప్రాంసువారి తాలూకాలును మంమ్మును గవునరుహోదా మొకర్రరు చేసి రవాణా చేసినారు గనుక యిక్కడ దాఖలు అయినాము పూర్వ పూర్వంనుంచ్చి ప్రాంసు సర్కాంన్ను త్మసంస్థానానకున్ను నడచుకొని వస్తూవుంన్నదోస్తి యత్తిపాకు దినేదినే మాదినముల యందు అధిక అభివృద్ధి కాగలందుకు మావల్లనయ్ని ప్రయత్నములు చేసి మీస్నేహం సంపాదించ్చవలెనని మామనస్సున పూర్తిగా వున్నది. త్మ అంతఃకరణములోనున్ను అదేమేరకు వున్నదనే అభిప్రాయంమాకు ముందుగావున్న గవునరుగారి వుత్తర ప్రత్యుత్తరాల వల్లను మాకుబాగా తెలిసి అధికసంతోషగా వున్న మొదలయ్ని అభిప్రాయములు శేతురాయలు త్మకు తెలిపించ్చగన్కు జ్యాదాప్రాయగలది యేమి వున్నది. హామేషామీఖుయి రాఖీయతు సమాచారలు వినకోరివున్నాము. ఖాతీర్కు తేవలెను.

## ఒక వేశ్యవ్రాసినది

అఖిలాండకోటి బ్రహ్మాండనాయకులయ్ని మహారాజ ఛత్రపతివారి పాదపద్మములకు పుష్పగంధ కస్తూరి పంన్నీరు పరిశాదుల చాతపూజా చాయబడిన షునంట్టి పాదపద్మములకు ౹

విన్నపములు—శేవకురాలు వెంక్కటరాఘవు నిరంత్తరమున్ను అనేక సాష్టాంగ దంణ్నములుబెట్టి శాయంగల విజ్ఞాపనములు॥ తర్వా॥ సముఖానను శెలవుతీస్కుని కటాక్షతీక్షణం చొప్పునను యిల్లు ప్రవేశించ్చినాము. సముఖమున శెలవుతీస్కుని బయలుదేరిన నాటనుంచ్చి దివ్యపాదారవిందముల మీద అచంచ్చల ప్రతిభక్తి జ్ఞానమే కాని యితరములేదు. అది అట్లావుండగా సముఖ చేసినషువంటి మేలుంన్నా ఆదరణానున్ను యిది నాశరీరంమున వున్నమట్టుకు మరవవలస్నిది లేదు. అది యెట్లాగంట్టె చంద్రుంణ్ణి యడబాశ్ని కలువలు యేరీతునవుండునో అటువలెనే సూర్యుంణ్ణి యడబాశ్నికమలములు యేరీతున వుండునో అటువలెనే దీనత్వాంన్ని జెంద్ది వుంన్నాను. ఇంతటికింన్ని తమపాదారవింద్ద దర్శనంవల్లను నాకుస్కల పాపవిమోచనం అయినద్ని అక్కడనుంచి వచ్చిన నాటనుంచ్చి సముఖసంగున్ను కొలువు మనస్సుకు కోరుతున్నాను గాని మరికఖటిలేదు. యేదినాన్ను అయ్ని శీఘ్రిముగ సముఖమంద్ను పావచాయంగలందుకు వచ్చి చేరుతుంన్నాను పదివేల కోట్లదంణ్నములు.

సీ. వుండండి మేమే మొవ్వూరకె చింత్తింత్తు
. చింత్తించ్చినాలోనె చిన్నంబోదు
చిన్నబోయి యొకింత శేపు తెల్వ్యగనుంద్దు
తెలివివ్యాళను మిమ్ముతలవువచ్చు
తలచినంతనెవచ్చి నిలిచి నట్లనెతోచు
తోచినేదిగ్గునలేచి జూతు
జూచివేగమె బారజాచి కౌంగిటగృత్తు
గృచ్చికౌగిటలేక వెచ్చనోర్తు
గీ. వెచ్చనోర్చియు తపియింత్తు వెతలనింత్తు
సఖులగద్దింత్తు తెగునయోచన తలంత్తు
నీదుమనసింత్తు అంత్త నంన్నియు శమింత్తు
భవ్యగుణహారి వెణుగోపాలశౌరి

దాక్షిణాత్యసాహిత్యము - సాంఘికవ్యవస్థ

బ్రాహ్మణ ప్రభావము :

తంజాపురాంధ్ర సాహిత్యమున మునకుఁగానవచ్చు విశిష్టసంప్రదాయములలో బ్రాహ్మణప్రభావము; అన్నదానము అను నీరెండును ప్రశంసనీయములైనవి. ప్రాచీన వైదికమత సాంఘికవ్యవస్థ సడలిన యీ కాలములో నిట్టి సాహితీ సంప్రదాయములు హాస్యాస్పదములుగా గానవచ్చును. కాని యాంధ్ర సాహిత్య చరిత్రలో, బ్రాహ్మణ ప్రభావమును, అన్నదానమును వర్ణించు నట్టి ఘట్టము వేఱొకచోట నింతవిశదముగాఁగానరాదు-నన్నయభట్టారకుఁడాంధ్ర మహాభారత భాగమున సంస్కృతమూలమున లేని వైదికమత సంప్రదాయములు, బ్రాహ్మణ మాహాత్మ్యము నచ్చటచ్చట సూచించినను, ప్రత్యేకముగ, తత్ప్రోషణమును గూర్చి, వర్ణనలేదు-ఇక నన్నదానము, ప్రాచీనకావ్యములలో దానప్రశంస సందర్భముననే వర్ణితమగునుగాని ప్రత్యేకముగ వర్ణితము కాదు-కావున నీరెండింటి యందీ దక్షిణదేశీయ వాఙ్మయ మగ్రస్థానము వహించినది.

---

1. ఈ ఛత్రపతి తంజావూరి నేలిన కడపటి మహారాష్ట్ర రాజు శివాజీ. ఈతఁడు క్రీ. శ. 1833 నుండి 1855 వఱకు నేలెను.

తంజావూరి నాయకులు విశిష్టాద్వైత మతమునను సరించిన వైష్ణవ సార్వభౌములు, అయిన పరమతసహనము గలవారు, విశేషించి బ్రాహ్మణ భక్తులు-ఇది వారిగ్రంథములయందంతటను గలదు.

రఘునాథనాయకుఁడు. ఈతని బ్రాహ్మణ భక్తిని, పోషణను గూర్చి చేమకూర వెంకటకవి యిట్లు చెప్పియున్నాఁడు.

" సీ. రత్నాకరాంతోర్వరా విహారుండాట నగ్రహారములసంఖ్యముగ జేసె "

గీ. అతఁడు ప్రభుమాత్రుఁడే బహుళాగ్రహార
నిత్యసత్యమహాదాన నికరపోషి
తాహిమాచలసేతు ద్విజాభిగీర్ణ
పుణ్యవిభవుండు, రఘునాథ భూవిభుండు (విజవి. ౧ - ౨౩.)

చ. త్రికరణశుద్ధి నచ్యుతుని శ్రీరఘునాథనృపాలు వైఖరిన్
సకల మహీసురావళికి సత్రము లెప్పుడు పెట్టలేఁడకా
యొకదొర, యందు లెక్కవిని

" యొక్కొక నాటికి యింత రొక్కమింతపుఁడెగసాగనా
యనక తా ముదమందినఁ జాలు నెమ్మదిన్ " ౧ - ౨౭

" అమ్మహీపోక్తి ధర్మజునంత వాఁడౌనెకా
యునత్త్రిఖ్యాతి నంతవాఁడె
దయాదృకధు శేష ధాత్రీమరున్నిస్స్వతా. ౨ - ౨౦౬

(దయాదృక=కరుణగల చూపుచేత ధుత--పోగొట్టఁబడిన అశేషధాత్రీ మరుత్ = సమస్తమైన బ్రాహ్మణులయొక్క నిస్స్వతా. దారిద్ర్యము గలవాఁడా. అనఁగా "బ్రాహ్మణులలో దారిద్ర్యము" అను మాట లేకుండ చేసిన వాఁడని తాత్పర్యము.

## అన్నదాన మహత్త్వము

రఘునాథుఁడు ప్రతిదినములకు భూసురులకు సకుటుంబముగ నన్న దానము చేసెడు వాఁడని యగ్రహారములు, నిలిపినవాఁడని విజయరాఘవ నాయకుఁ డిట్లు చెప్పియున్నాఁడు.

"ద్వి. శతసహస్రాధిక సకుటుంబవిప్ర
సతతాన్నదాన దీక్షాధురంధరుఁడు."

"ద్వి. అవనిఁజంపక వల్లికాభిదానమున
వివిధాగ్రహారముల్ వెలయించుమేటి"

రంగాజమ్మ మన్నారు దాసవిలాస ప్రబంధమున నిట్లు చెప్పినది.

"సీ. దినమొక్కలక్ష భూదేవతోత్తములకు
సత్రంబుఁ బెట్టుచే స్వామివ్రతము."

ఇంతయేల? రఘునాథుఁడే తన వాల్మీకి చరిత్ర గద్యలో నిట్లుచెప్పుకొని యున్నాఁడు.

"నిరతావారి తాన్నసత్ర సంతోషిత ప్రతిదివస పంచాశత్ సహస్ర భూసుర బహువారావర్తిత, మహాదానవైభవానర్తిత భూసుర నిజనామాంకిత అకళంక వస్తుసమగ్ర బహుళాగ్రహార భూషిత చోళధరా మండల"

ఇతరులు, రఘునాథుఁడు లక్షభూసురుల కన్నదానము చేసినట్లు చెప్పిరి. రఘునాథుఁడు తాను మాత్రము "ప్రతిదినము నేఁబదివేల మంది భూసురులకు" అని చెప్పి యున్నాఁడు. ఇచట మనము సమన్వయించుకొట్లనఁగా, ప్రతిదినము రఘునాథుఁ డేబదివేలమంది విప్రులకుఁ దక్కువ కాకుండ నన్నదానము చేసెడి వాఁడని యర్థము.

బ్రాహ్మణ పోషణయందు, నన్నదానము నందు తండ్రిని మించిన కొడుకు విజయరాఘవనాయఁకుడు పూతనాహరణ నాటకకైవారగద్యలో. "ప్రతిదిన బ్రాహ్మణ బహుళ సహస్రాభీష్ట మృష్టాన్న దానదీక్షా ధురీణ" అని యున్నది.

చెంగల్వకాళకవి రాజగోపాల విలాసమున నీతని యన్నదాన జనిత కీర్తి యావద్భారత వర్షమున వ్యాపించినదని నీక్రింది సీస పద్యమున వర్ణించి యున్నాఁడు.

సీ. కాశికాపట్టణ ఘంటాపథంబుల
విప్రకోటుల వల్లవినుతిఁగాంచి
రామేశ్వరస్థల రాజమార్గంబుల
బ్రహ్మసంఘము లెన్నఁ బ్రబలికెక్కి
ద్వారకాయుత పురద్వారసీమలయందు
మహిసురల్ నుతియించ రహివహించి
మధురాపురో.త్తమ మధ్యవీథులయందు
వసుధామరస్తుతి వన్నెమీఱి

గీ. నలరుసీయనయని, వారితాన్నదాన
మక్షిమ భూత భవిద్భావి మహిమహేంద్ర
ముఖులకరుదనిపొగడ దిఙ్ముఖములందు
ఘనతఁజెలువొందు విజయరాఘవ విభుండు

పై దానినిఁబట్టి తంజాపురాన్నదాన మహిమ యాసేతుహిమాచలము మాఱుమ్రోఁగినది.

విజయరాఘవుని కాలమున పురుషోత్తమ దీక్షితుని తంజాపూరన్నదాన మహానాటకము'' నాయక రాజుల యన్నదాన ప్రశస్తి కాచంద్రార్కము నాంధ్ర సాహిత్యవీథిని నిలిపిన పతాక.

అన్నదాన కార్యము నొకమహా నాటకమున కితివృత్తముగ గ్రహింపఁబడినదనిన నాయకరాజుల కాలమున, నా దానమున కెట్టి ప్రాముఖ్య ముండెడిదో తెలియనగును. కావేరీ వారిపూరముచే ముక్కాఱుఁబండు చోళదేశమునకు రాజధాని తంజాపూరు. అది దేశమున కంతటికిని ధాన్యాగారము, ఎల్లప్పుడు సస్యశ్యామలమై యుండుట చేతనే చోళదేశమును రామ భద్రాంబయిట్లు వర్ణించినది.

"అస్తి ప్రభాభైరతి మాననీయా
చోళావనీశాలివనీనిచోళా
సహ్యాత్మజాపూర సరస్సమీర
సంపర్కపుణ్యా జనతాశరణ్యా"

శాలివసీ ని-వాశ్యమైన చోళదేశమును పాలించిన ప్రభువులు, తంజావూరిని నిరతావారితాన్న దాన సత్రముగ నిర్మాణించిరి, అందును విజయరాఘవ నాయకుని యన్నదాన పరాకాష్ఠ గూర్చినొక కథ వినుఁడు.

“విజయరాఘవ నాయకుని కాలములో [1]తంజావూరి నగరి సత్రమున ప్రతిదినముఁ బన్రెండు వేలమంది బ్రాహ్మణుల కన్నదానము జరిగెడిది. ఒకయేడు వర్షము లధికమైనవి. దేశములో నొక చోటనుండి వేరొక చోటికి రాకపోకలకు నిరోధ మేర్పడినది, ధాన్యము తంజావూరిలో పండినను, వానిని పచనము చేయుటకు వంటచెఱకు ముఖ్యముగదా, రాకపోకలకు నడ్డంకులు గలుగుటచే వంట చెఱకు వచ్చుటకు వీలులేకుండ నుండెను. వంటలు సాగకపోయినవి. సత్రమధికారులు విజయరాఘవునితో నావృత్తాంతముఁ విన్నవింపఁగా నాతఁడు నగరిలోని ప్రాఁతకట్టడ ములను పగులగొట్టి యందలి కలపను వంటకట్టెయలుగా నుపయోగింపుఁ డని యాజ్ఞనిచ్చెను. అట్లు కట్టడములను కొట్టి చేర్చిన కలప మూడు దినములకంటె హెచ్చు సరిపోలేదు. మరలసత్రమధికారులు వంట స్థితి గతి తెలిపిరి. విజయరాఘవుఁడు నగరిలోని వస్త్రములన్నింటిని దెప్పించి బజారులోని నూనెకుండలతో తడిపించి. అగ్నిని రగులఁ బెట్టించి, అన్నము వండ నాజ్ఞాపించెను, కాని యీతంతు మఃగియునప్పటికి కొంతకాలము పట్టుటచే వంట భోజనములు చాల యాలస్యమయ్యెను. అంత వఱకును విజయ రాఘవనాయకుఁడు నగరి జనమంతయు, నల్లే యుపవాస ముండిరట!” అన్నదాన విషయమున విజయరాఘవుఁడెంత భక్తి శ్రద్ధలు గలిగి యుండు వాఁడో పై కథ తేట పఱచుచున్నది. (తంజావూరి రాజుల చరిత్ర.)

సాంఘిక పురోభివృద్ధికి బ్రాహ్మణుఁడు మూలమని నాయాటి నాయకరాజులు చక్కఁగా గుర్తించిరి. బ్రాహ్మణులా కాలమున, రాజకీ

1. నేఁటికిని, నేయింటియందైన, నెడతెగకుండ, వంటలు, భోజనములు సాగు చున్నట్టియింటికి “ఇదొక తంజావూరి సత్రం” అని సామెతయేర్పడినది. ఇది సర్వాంధ్రదేశమున నున్నది. దీనినిబట్టి నాయకరాజుల అన్నదానమహిమ యెంతవ్యాప్త మైనది యూహింపవచ్చును.

యముగా నేవృత్తినవలంబించినను, నితర విధములుగా జీవయాత్ర సాగించినను నిప్పటివలె బ్రాహ్మణ మత ధర్మములను పరిత్యజించి, నామమాత్ర బ్రాహ్మణులై యుండలేదు. వారే వృత్తినున్నను నిత్యనైమిత్తికకర్మలను విసర్జింపలేదు- "నానాటికి తీసికట్టు నాగంభట్టూ" అన్నట్లుగా నేడు పూర్తిగా వృత్తిలో బ్రాహ్మణధర్మము లేకున్నను ప్రస్తుత కాలమునకు, ముప్పది నలువ దేండ్లకు ముందు, బ్రాహ్మణులు పాశ్చాత్యుల కొలువు చేసినను, పెద్దయుద్యోగులేమి, చిన్న గుమాస్తాలేమి సంధ్యావందనాది నిత్యకృత్యములను విసర్జించిన వారు కారు. కొందఱు లౌకికులైనను, వేషభాషలలో వైదికులట్లనేయుండి బ్రాహ్మణత్వ ముట్టిపడుచున్నట్లుండెడివారు. అట్టిచో సర్వవిధముల బ్రాహ్మణులకు పోషణ జరుగుచున్నప్పుడు, లౌకికులైన బ్రాహ్మణులు తమ విధ్యుక్త ధర్మములను నెఱవేర్చుకొనుచు, అట్టి రాజపోషణకర్తృత గడించిన వారనుటలో సందేహములేదు.

రాజగోపాల విలాసమున పంచమాశ్వాసమున రాజశేఖరుఁడను రాజు, బ్రాహ్మణునికి చూపిన కృతఘ్నతవలన రాజ్యమును కోలుపోయి, తిరిగి బ్రాహ్మణుని యాశీస్సుచే రాజ్యమును బడసెను. ఈసందర్భమున కాళయ విరచించిన యీక్రింది పద్యము, నాయక రాజుల కాలమున బ్రాహ్మణ ప్రభావమెంత యుండెడిదో తెలుపును.

సీ. చతురంగబలములై సంరక్షణము సేయు
బ్రాహ్మణాశీర్వాద పాటవంబు
ధనధాన్యరాసులై తనుపు సంతతమును
బ్రాహ్మణాశీర్వాద పాటవంబు
ప్రాకారము లగాధపరిఖలునైగాచు

ప్రాసాదములు రత్నభవనంబులై యుండు
బ్రాహ్మణాశీర్వాద పాటవంబు
గీ. బ్రాహ్మణులఁ బూజచేసి సద్భక్తితోడ
నన్నపానాదు లొనఁగూర్చు నవనినేత
నాయురారోగ్య భాగ్యంబులనుభవించు
సత్యమిదినమ్ము నమ్మనాసత్యరూప !

వైదిక కర్మాచరణము,

నాయకరాజులిట్లగ్రహారముల నిచ్చి, యన్నదానముచేసి బ్రాహ్మణులను పోషించుటయే గాక వైదిక కర్మ కలాపమును యథా విధిగా నెఱవేర్చి. పురోహితులకు, భూరి సంభావన లొసంగి పోషించు వారు. వివాహసమయమున సంకల్పములు కూడ, నాయకరాజుల కాల ముల కొన్ని కృతులలో గాన వచ్చుచున్నవి. విజయరాఘవ కల్యాణ మున, మన్నారు దాసవిలాసమున హేమాబ్జనాయికాస్వయం వరమున, వివాహసంకల్పము లుదాహరింపఁబడి యున్నవి. సంకల్పములలో దేశ కాల నిర్దేశముండును గాన, వీనివలన నాయకకృతుల కాల నిర్ణయము చేయుటకు నెంతయో యనుకూలముగనున్నది, చూడుఁడు.

విజయరాఘవ కల్యాణము.

సంకల్పము – శుభేశోభనే ముహూర్తే ఆద్యః బ్రహ్మణః ద్వితీయ పరార్థే, శ్వేతవరాహకల్పే, వైవస్వతమన్వంతరే, కలియుగే ప్రథమపాదే, జంబూద్వీపే, భరతవర్షే, భరతఖండే అస్మిన్వర్త మానే, వ్యావహారిక చాంద్రమానే సౌమ్యనామ సంవత్సరే, ఉత్తరాయణే వసంతర్తౌ వైశాఖమాసే శుక్లపక్షే ఆద్యశుభ నక్షత్ర, శుభయోగ, శుభకరణ యుక్తాయాం అస్యాంశుభతిథౌ అచ్యుతభూపాల కుమారస్య, విజయరాఘవ భూపాలస్యవివా హాఖ్యం కర్మ కరిష్యమాణ స్తదాదౌ.

పైని నిర్దేశింపఁబడిన కాలము వలన నీ నాటకము. క్రీ. శ. 1669 ఏప్రియలు-21-వ. 7-తేదీలలోపున రచితమైనట్లు స్పష్టము.

మన్నారుదాస విలాసము–

సంకల్పము – శుభే శోభనముహూర్తే..............శుభకృన్నామ సంవత్సరే, ఉత్తరాయణే, వసంతర్తౌ, చైత్రమాసే శుక్లపక్షే ఆద్య పంచమ్యాంశుభతిథౌ గురువాసరయుక్తాయాం.........అస్యాం శ్రీ రఘునాథభూపాల కుమారస్య అచ్యుత విజయరాఘవ భూపా లస్య ఉద్వాహాఖ్యం కర్మకరిష్యమాణ తదాదౌ."

పై సంకల్పము వలన మన్నారుదాస విలాస నాటకము, క్రీ. శ. 1662 ఏప్రియలు 18 తేదిని రచితమైనట్లు తెలియుచున్నది.

రంగాజమ్మ తన నాటకమున నిట్లు రచనా కాలము నిర్దేశించుట యేగాక, వివాహప్రక్రియలో నాద్యంతము జరుగు కార్యకలాపము నంతయు సంగ్రహముగా నిట్లు పేర్కొనినది.

"సుముహూర్తోస్త్విత్యనుగృహ్ణంతు సముహూర్తమస్తు సుప్రతిష్ఠితమస్తు

వా. అని యీవిధాన, దేవతాహ్వాన, నాంద్యగ్నిముఖ, స్నాతకవ్రత, పునఃపుణ్యాహవాచన, అంకురార్పణ, కన్యావరణ, మంగళాష్టక, నవ వస్త్రధారణ మంగళ సూత్రధారణ వివాహప్రధాన హోమాది శుభకర్మంబులాచరింపఁ జేయుసమయంబున" అనియు "మఱియు పురోహితులు వివాహశేష హోమంబులు శేఖరించుకళ" అనియు వివాహ విధానమున చేయఁదగిన కృత్యములను విస్పష్టముగా, చక్కఁగా రంగాజమ్మ యెఱింగించినది.

మన్నారు దేవుఁడు హేమాబ్జనాయికాస్వయంవరమున

సంకల్పము - శుభేశోభనే ముహూర్తా......సౌమ్యనామ సంవత్సరే, ఉత్తరాయణే, వసంత ర్తే, చైత్రమాసే శుక్లపక్షే, అద్యశుభ అద్య శుభనక్షత్ర.

రక్తాబ్జనాయికా రాజగోపాలయోః ఉద్వాహాఖ్యం కర్మకరిష్యమాణ." అనికాలనిర్దేశము గావించియున్నాఁడు దీనివలన నీ నాటకము-క్రీ. శ. 1667-మార్చి 21-ఏప్రియల్ తేదీలమధ్య రచితమైనదని చెప్పవచ్చును.

విజయరాఘవ కల్యాణ రచనకు, దీనికిని మధ్యనొక మాసకాలము వ్యవధియుండఁ గూడును.

ఇంకవిజయ రాఘవనాయకుండే పూతనాహరణమున, కాలనిర్దే శము కావించి యున్నాండు ఇచట వివాహము లేదుగాని, స్వస్తివాచ నము అనువైదిక ప్రక్రియ యున్నది.

స్వస్తివాచనమనంగా, శుభసమయములను శుభసమయముల యనంతరమునందు సర్వారిష్ట శాంత్యర్థము, చేయువైదిక కర్మ. ఇచట నందుండు పురోహితులం బిలిపించి, తనకుమారుండగు శ్రీకృష్ణునికి స్వస్తి వాచనం బాచరింపుడని కోరును-వారును.

శుక్లాంబరధరం విష్ణుమ్
శశివర్ణం చతుర్భుజమ్
ప్రసన్నవదనం ధ్యాయేత్
సర్వవిఘ్నోపశాంతయే

అని మొదలిడి,

"శుభేశోభనముహుర్తే ఇత్యాదిగా ప్రారంభించి అస్మిన్ వర్త మానే, వ్యావహారికే, చంద్రమాన ఖరనామ సంవత్సరే ఉత్తరాయణే వసంతర్తే చైత్రమాసే, శుక్లపక్షే ఆద్య పంచమ్యాం శుభతిథౌ గురు వాసర సంయుక్తాయాం......అస్యకుమారస్య సర్వారిష్టశాంత్యర్థం కలశపూజాంకరిష్యే. అనేనకలశోదక మార్జనేన అస్యకుమారస్య సమస్త పీడాపరిహారోస్తు...అస్మిన్ గృహేశోభన పరంపరావాప్తిరస్తు" ఖర సంవత్సరము క్రీ. శ. 1658 తో సరిపోవుచున్నది. తేదీ ఏప్రియల్ 18.

ఇచట పుణ్యాహవాచన విధానము చెప్పంబడినది. కలశములలో నీరమునుంచి, మామిడి కొమ్మలు పైనుంచి, కలశజలమును మంత్ర సంస్కారము గావించి కలశపూజయైన వెనుక నాజలమును గృహామంతయుం జల్లుదురు. దానివలన, గృహములో నుండువారికి, ప్రత్యేకముగా స్వస్తి పుణ్యాహవచనము కావలసినవారికి సమస్త పీడాపరిహారమగును.

విప్రనారాయణ చరిత్రమున-తిరువారాధన సమయమున సంకల్ప మున్నది.

శుభేశోభనే ముహూర్తే ...... అస్మిన్ వర్తమాన వ్యావహారిక చంద్రమానేన నందననామాసంవత్సరే ఆయనే, శుభమాసే శుభకరణే ఏవంగుణ విశేషణ విశిష్టాయాం, శుభతిథే చంపకారణ్యా పుణ్యక్షేత్రే శ్రీరాజగోపాలస్వామిసన్నిధౌ.

విజయరాఘవ భూపాలస్య సర్వాభీష్ట సిధ్యర్థం శ్రీరాజగోపాల స్వామి పూజాంకరిష్యే."

ఇందుదాహృతమైన సంవత్సరము-నందన-ఇది విజయరాఘవుని రాజ్యకాలమున క్రీ. శ. 1652 లో వచ్చినది గావున నీ నాటకమానంవత్సరమున రచితమైనది[1].

పై యుదాహృతులనుబట్టి వైదిక కర్మలనాచరించుట యందు, నాయకరాజు లెంతశ్రద్ధ వహించెడివారో మనము తెలుసుకొనవచ్చును. మఱియు నీ సంకల్పములలో 'చాంద్రమానము' వ్యవహరింపఁబడినది. దీనిని బట్టి నాయకరాజులు, మానపరిగణనమున తెలుఁగు దేశపద్ధతియే యవలంబించి రనుట స్పష్టము, ఏలననఁగా, వారు పాలించిన ద్రవిడ దేశమున ప్రచారములో నున్నది, 'సౌరమానము'-ఈ కారణము చేతనే, తమిళసంవత్సరాదియు, తెలుఁగు సంవత్సరాదియు కొన్నిదిన ములవ్యత్యాసములో వచ్చుట జరుగుచున్నదని గ్రహింప వలెను.

---

1. నాటకాదులలో నిట్టిసంకల్పము నిచ్చుటయు నీ కాలమున కొందఱికి ఛాందసముగాఁ దోచవచ్చును. కాని చారిత్రముగఁజూచిన నాయకరాజులిట్టి సంప్రదాయమును కృతులలో నెలకొల్పి గ్రంథరచనా కాలనిర్ణయమున చిక్కులుండకుండ వాఙ్మయచరిత్రకారుల శ్రమనెంతయో తగ్గించియున్నారు. వారికి వాఙ్మయచరిత్రకారులెల్లరుఁ గృతజ్ఞులుగా నుండనగును. మన ప్రబంధములలో వివాహమును వర్ణించునపుడిట్టిపద్ధతి నవలంబించిన కవి కాలనిర్ణయమున కెంతయో తోడ్పడియుండెడిది, నన్నెచోడకవి కుమారసంభవ కావ్యమున పార్వతీవివాహ సందర్భమున నిట్టి సంప్రదాయమును పాటించిన, మనకాతని కాలనిర్ణయము చేయుటయందింత కష్టపాటు సంభవింపదుగదా !

వివాహాదిప్రక్రియలతో, వైదికులకు పురోహితులకు-పేరటాండ్రకు ముత్తైదువులకు ప్రాధాన్యము హెచ్చయినది. పేరటాండ్ర యొక్క, ముత్తైదువుల యొక్క సంభాషణలు హృద్యముగ నాటకముల వర్ణితములైనవి. తక్కిన బ్రాహ్మణులకు సంభావనలు విశేషముగముట్టు చుండెడివి.

నాయకరాజుల కాలమున నిదియు నొక విశేషమే. ఏమనఁగా —

నాయకరాజుల కాలమున నాటకములలో నిట్టి బ్రాహ్మణ ప్రాభవ వైదిక కర్మ విధానములు వర్ణితములైనను- బ్రాహ్మణాభిమానులైన మహారాష్ట్రరాజులు వ్రాసిన కృతులలో నీ విషయము కన్పట్టదు. ఇది యొక్కటియే నాయక రాజులకు బ్రాహ్మణుల యెడగల భక్తి గౌరవములను తేటపఱుపగలదు.

యజ్ఞ యాగాదిక్రతుపోషణము

నాయకరాజులు, దానశీలతచేత నేగాక, యజ్ఞయాగాది కర్మల యందును శ్రద్ధవహించిరి.

రఘునాథ నాయకుఁడు పంచమహా యజ్ఞములు ప్రతిదినము చేయువాఁడని రఘునాథా నాయకాభ్యుదయమిట్లు చెప్పుచున్నది.

" ద్వి. కడుపేడ్కఁ గొలువుసింగారమ్ము సొమ్ము
సడలించి, సరిగంచు చలువలుగట్టి
చిన్నారియొంట్లును శ్రీరామతాళి
సన్నవజ్రముల చేసరులుధరించి
యావేళ పంచమహాయజ్ఞములను
గావించిపతి యున్నగతి విలోకించి

పై దానిని బట్టి ప్రత్యేకముగ కొలువునకు వేసికొనిన యాభరణములు తొడుగుట తీసివైచి, చలువలుగట్టి, యనఁగా మడిబట్టకట్టుకొని పంచయజ్ఞములను రఘునాథుఁడు నిర్వర్తించెడు వాఁడు.

ఇకమహా యజ్ఞములను నాకాలమున చేయుటకు తగిన వసతులను నాయకరాజుల కల్పించిరి. యజ్ఞదీక్షితుఁడైన వానికి దీక్షిత నామ ముండును. నాలుగుతరములుగా నాయక రాజులకు మంత్రియైయున్న గోవింద దీక్షితులవారు బ్రహ్మాండమైన యజ్ఞము నొనర్చిరి. కావేరి తీరమున యజ్ఞయాగాది క్రతువులు విరివిగా జరుగుచుండెడివి.

విజయరాఘవుని గురువైన తిరుమలతాత యాచార్యుఁడు.

"జనవిలక్షణ సలక్షణ చతుర్వేది
జనవిచక్షణ గుణ స్తవనీయ చర్య
దీక్షాదినియమవైదిక మంత్రతంత్ర
దక్షిణాసాంగ శతక్రతుయాజి"

యని రఘునాథ నాయకాభ్యుదయమునఁగలదు. కావున నాతఁడు నూఱు క్రతువు లొనర్చినాడని యర్థము. విజయరాఘవ చంద్రికా విహార కృతికర్త కామరసు వెంకటపతి తన్ను [1]సోమయాజిగా వ్యవహరించు కొనినాడు. సోమయజ్ఞము చేసిన వారే యానామముతో వ్యవహరింపఁబడుదురు. కావున వెంకటపతి సోమయజ్ఞము చేసియుండును.

విజయరాఘవ కల్యాణ కృతికర్తయగు కోనేటి దీక్షితుఁడును తంజావురాన్నదాన నాటకకర్త పురుషోత్తమ దీక్షితుఁడును యజ్ఞ దీక్షితులేయని మన మూహింపవచ్చును.

యజ్ఞయాగాది సంప్రదాయము లీనాఁడుత్సన్నములైనవి. యజ్ఞము చేయుటయన్న సామాన్యముకాను. యజ్ఞదీక్షితుఁడు, వేదము చదువుకొనినగాని వాని కాయర్హతలేదు. ఇక యజ్ఞశాలానిర్మాణము యజ్ఞసంభార సంగ్రహణము యజ్ఞముల నన్నదానము, అధ్వర్యులకు

---

1. ఈ కాలమున శాస్త్రి సోమయాజి, మొదలగు శబ్దములు నామమాత్రములై వ్యవహారములో వాని వ్యుత్పత్త్యర్థములు గోల్పోయినవి. కాని యా కాలముననట్లు కాదు. తండ్రి సోమయాజాయైన, కొడుకును సోమయజ్ఞము చేసిన కాని యాతనిని సోమయాజియని వ్యవహరించెడివారు కారు. ఉదా. తిక్కనసోమయాజి, తండ్రి కొమ్మన కొమ్మనయే గాని సోమయాజికాడు.

దక్షిణ మొదలగువాని కమితవ్యయమగును. కావుననే యజ్ఞము చేయు వారు రాజులను యజ్ఞమునకై ధనము నర్థింతురు.

యజ్ఞహోమ ధూమముచే, మేఘములుత్పన్నములై వర్షము కురియునని వైదికశ్రుతి యుండుటచేతను, భూమి సస్యశ్యామల మగుటకు, వర్షము ముఖ్యమగుటచేతను రాజులీ యజ్ఞములు చేయువారికి సకల సౌకర్యములొసగ కూర్చువారు-అందును నాయకరాజు లీవిషయమున నెంతయో శ్రద్ధ వహించినట్లు పైయుదాహృతులు తెలుపుచున్నవి.

ఆహవనీయము, గార్హపత్యము. దక్షిణాగ్నియను త్రేతాగ్నుల ధూమముచే తంజావూరి రాజ్యమున వీధికాంగణములు పరివృతములై యుండెడివని ధర్మరాజాధ్వరి తన "తత్త్వ చూడామణి ప్రకాశ" వివృతి యందిట్లు చెప్పియున్నాఁడు.

> త్రేతాగ్నిధూమకుల వీథికాంగణే
> గృహేగృహే యత్రవసంతినూరయః
> అధీతసర్వశ్రుత కథాంతరో
> వినిర్జిత ప్రత్యనుమాన వేదినః

దానశీలురై అగ్రహారములు నొసంగి, యన్నదానము చేయుట చేతనేకాక నాయకరాజులు తమ యఖండ దానపరతచేత, బ్రాహ్మణ మతధర్మము లను బోషించిరి.

రఘునాథనాయకుని తండ్రి యచ్యుతప్పనాయకుఁ "డర్థితతికిందిన మిచ్చిన యీవుల లెక్కలు, చూడ, కోటికర్ణులఁ దలపించు" నని విజయ విలాసకర్త వ్రాసియున్నాఁడు. ఇఁక రఘునాథుఁడు "అమిత దానవినోది," అని విజయవిలాసము. రఘునాథుఁడే తనగద్య యందు "నిత్యవితీర్ణిధారా రాధేయ," అని చెప్పుకొని యున్నాఁడు. ఇందతిశయోక్తి లేదనియే చెప్పవచ్చును. రఘునాథునియన్నదాన ప్రసిద్ధి యీవఱకుఁ దెలియఁ జేసితిని.

## షోడశ మహాదానములు

ఇఁక విజయరాఘవనాయకుఁడు, దానశీలతలో తండ్రి తాతలను మించినవాఁడు. శాస్త్రోద్దిష్టములైన షోడశమహాదానములు (పదియాఱు దానములు) నొక్క సమయముననే చేసినాఁడట! ఈ విషయమును కాళకవి యిట్లు వర్ణించినాఁడు.

సీ "...... దక్షిణద్వారకను, కృష్ణతీర్థమందు నియమమున
స్నానంబుఁగావించి సంకల్పపూర్వము
గాను షోడశమహాదానములను

గీ. ఘనతమీఱఁ గళావతీగర్భశుక్తి
మౌక్తికధనంబు రఘునాథ మహీపసుతుఁడు
విజయరాఘవమేదినీ విభుఁడొసంగె
వేద వేదాంతవిదులైన విప్రులకును. (౧. ౭౯.)

ఈవిషయమునే విజయరాఘవనాయకుఁడు రఘునాథనాయకాభ్యుదయములో నిట్లు చెప్పియున్నాఁడు.

" ద్వి. తడయక పదియాఱు దానంబు లొక్క
గడియలోఁ జేసిన ఘనదాన పరుఁడు "

పైని చెప్పిన దానములు కృష్ణతీర్థ మందొక సమయమున చేసినట్లు కాళకవి చెప్పఁగా, విజయరాఘవుఁ డా సమయ మొక గడియ యని స్పష్టపఱచినాఁడు.

షోడశదానములొక్కగడియలో చేయుట యన్నయది యతి దుర్ఘటకార్యము. రాజులైనను నంతకు ముందెంత కాలమునుండియో వానిని సేకరించి యాసమయమునకు సిద్ధముచేసి యుంచవలెను. షోడశ మహాదానములననివి.

శ్లో. బ్రహ్మాండం విశ్వచక్రం ఘనముదితమహాభూతకం రత్నధేనుం
సప్తాంభోధించ కల్పక్షితిరుహలతికే కాంచనీం కామధేనుమ్
స్వర్ణక్ష్మాం హేమహిరణ్యాశ్వరథ మపితులా పూరుషంగోసహస్రం
హేమాశ్వం హేమగర్భం కనకకరిరథం పంచమాంగల్యతానీత్

(1) బ్రహ్మాండదానము[1] (2) విశ్వచక్రదానము (3) ఘటదానము (4) మహాభూతదానము (5) రత్నధేనుదానము (6) సప్తసముద్ర దానము (7) కల్పవృక్షదానము (8) కాంచనకామధేను దానము (9) స్వర్ణభూమి దానము (10) హిరణ్యాశ్వరథ దానము (11) తులాపురుష దానము (12) గోసహస్రదానము (13) హేమాశ్వదానము (14) హేమ గర్భదానము (15) కనకకరిరథదానము (16) పంచలాంగలీదానము. పై వానిలో 1, 2, 4, 6, 7 - వీనిలో నాయాదానములకు తగిన ధనము దానమీయఁబడును. తక్కినవి బంగారుతో చేసిన యాయా వస్తువుల నీయవలెను. తులాపురుషదానమనఁగా తాను తులాభారము తూఁగి, త్రాసులోఁ నొకవైపు తాను, వేఱొకవైపు తన యెత్తుధనమునుంచి ఆ ధనమంతయు దానముచేయుట.

రఘునాథ నాయకుఁడీ తులాపురుషదానమును చేసియున్నాఁడు. ఆతఁడు తన యెత్తు రత్నముల నొకవైపు, తానొక వైపుతూఁగి, యారత్నములను దానము చేసినాడు - చేమకూర వెంకటకవి యిట్లుచెప్పి యున్నాఁడు.

తోటకము- అతులాగమశాస్త్ర నిరస్త సురే
జ్యతులాది కవిద్వదవాప్త శత
క్రతులాభ శుభోదయ కారణ ర
త్నతులాపురుషాదిక దానచణా

మఱియు నీదానములన్నియు సంకల్పపూర్వకముగ ధారాదత్తము చేయఁబడిన వగుటచేత వైదికమతాను సారముగ నీయబడినవనుట స్పష్టము. వేదవేదాంగ విదులైన బ్రాహ్మణులకు తక్కతక్కిన వారికివి పరిగ్రహించుట కర్హతలేదు.

విజయరాఘవుఁడు ప్రతిసంవత్సరము హిరణ్యగర్భదానము గావించువాఁడని రఘునాథనాయకాభ్యుదయమునఁ గలదు.

" నిర్భరభక్తితో నీవు హిరణ్య
గర్భ దానంబులు గావించువేళ "

---

1. Vide T. T. Devastanam Inscriptions. Vol. III No. 65 Inscriptions in Krishnaraya's Time Page 153.

గోమాహాత్మ్యము

"గోబ్రాహ్మణేభ్యః శుభమస్తు నిత్యమ్" అనుసూక్తి ననుసరించి బ్రాహ్మణ మాహాత్మ్యముతో గోమహాత్మ్యము, దక్షిణాంధ్ర వాఙ్మయమున వ్యక్తమగుచున్నవి. మధుర చొక్కనాథనాయని వారికిఁ గృతిగా లింగనమఖి శ్రీకామేశ్వరకవి 'ధేనుమాహాత్మ్యము' అను నావుల మహాత్మ్యమును రచియించి యున్నాఁడు. ఆంధ్ర వాఙ్మయములో గోవు యొక్క సత్యసంధత నిరూపించుకథ యొకటి భోజరాజీయము నందున్నది కాని, ప్రత్యేకముగా నావుల మహాత్మ్యము నిరూపించు గ్రంథములేదు. అట్టిరచన దక్షిణదేశ వాఙ్మయముననే వెలయుట విశేషము.

కార్తిక మాహాత్మ్యము

మాఘమాహాత్మ్యము,

మాసములలో కార్తిక, మాఘమాసముల యందు చేయు స్నానములకు నొక విశేష ప్రభావముగలదు. ఆస్నానములు జన్మాంతర కర్మాంతర, పాప కృత్యములను విశేషముగాఁబాఱఁద్రోలి, యాయుర్వృద్ధి కరములగుటయేగాక, మోక్షమును సంఘటించును. ఈ స్నానములు వైదిక కర్మానుసారముగ సంకల్ప పూర్వకముగ ప్రతిదినముచేయఁదగిన వియేగాని నేటి గజస్నానములవంటివి కావు, ఆకాలమున, భక్తి శ్రద్ధలతో నీస్నానములు, జనులాచరించు వారు కావుననే, వాని విశిష్టతను దెలుపు గ్రంథములును నావశ్యకములైనవి.

పై రెండు కృతులును, దక్షిణదేశమునందలి ప్రజలలో వైదిక కర్మానుష్ఠానత్వమును విశదీకరించుచున్నవి.

[illegible] - దేవతాభక్తి

నాయకరాజుల కాలమున దేవాలయములు క్షేత్రస్థలములు, నుచ్ఛదశయందుండెడివి. విజయనగర రాజుల వలెనే, తంజావూరి నాయక రాజులు, దేవాలయములకు శాశ్వతానేకకైంకర్యములొనర్చిరి.

నాయకరాజులయందాద్యుఁడగు చినచెవ్వన్నృపతి శ్రీశైలమందున ప్రాకారసోపానపాళి నిర్మించెను. వృద్ధాచలమున ప్రాసాదమండపముల నిర్మించెను. అరుణాచలమున గోపురము సంఘటించెను. గోపర్వత మున పూజావిశేషాదికముల నేర్పాటుచేసెను. చెవ్వన్నృపతి కుమారుఁ డచ్యుతప్ప నాయకుఁడు శ్రీరంగపతికి సింహాసనము ప్రణవమయంబగు పసిఁడిసజ్జ దేవాలయమున కష్టమప్రాకారము – గోపురము సమ ర్పించెను. మఱియు రత్నాంగద కిరీటము, అభయహస్తము నిచ్చెను. అచ్యుతప్ప నాయకునిఁగూర్చి చేమకూరకవి యేమనుచున్నాఁడో చూడుఁడు.

శా. శ్రీరంగేశుఁడువచ్చి, యచ్యుతధరిత్రీభర్తయై, భాగ్యరే
ఖారూఢిన్విలసిల్లి తాన తనకుం గైంకర్యముల్ చేసెఁగా
కేరాజైనను జేయఁగాఁ గలిగెనే యిట్లే విమానంబహో
భూరిస్నిగ్ధముగా మహామణి మయంబుల్ గాఁ గిరీటాదులున్.

అచ్యుతునికి శ్రీరంగనాథుఁ డిష్టదైవము, కుమారుఁడగు రఘునాథునికి రాజ్య మప్పగించి, అచ్యుత నాయకుఁడు తన చరమదశను శ్రీరంగ క్షేత్ర మందే గడపినాఁడని సాహిత్య రత్నాకరాది గ్రంధములు సాక్ష్యము నిచ్చుచున్నవి.

రఘునాథనాయకుఁడు కృతయుగ రఘునాథుని యపరావతార ముగాఁ గీర్తిఁగన్నవాఁడు. రఘునాధ నాయకుడు తన కిష్టదైవమగు రామచంద్రుని రమణీయ వాగ్రచనాపుష్పములఁ బూజించినాఁడు రామాయణమునేకాక, రామాయణ కర్తయగు వాల్మీకి చరిత్రమును రచించి, రామునకే యంకితమొసగి యున్నాఁడు, ప్రత్యేకముగా జానకీ కల్యాణ చాటుకావ్యమును రచియించి యున్నాఁడు. తనకు సంభవించిన సాహితీసౌష్టవము, రచనాశక్తి శ్రీరాముని ప్రసాదముచేతనే యని తన గద్యలోనిట్లు మొదలనే చెప్పుకొనినాఁడు.

"ఇది శ్రీరామచంద్ర సాంద్ర కరుణా కటాక్షలబ్ధసిద్ధ సారస్వత విశేష నిరర్గళ వాగ్వైభవాశేష సరససాహిత్య కళాభోజ"

ఇట్లు సాహిత్యము మూలమున నేగాక సభక్తి మూలకముగ రామభద్రునికి శాశ్వత కైంకర్యము గావించినాఁడు - శ్రీరామ విగ్రహము లను, రామసేతు, శ్రీరంగ, విజయ రాఘవపుర, కుంభ కోణాది స్థలముల ప్రతిష్ఠాపించి నట్లుగా నాతని గద్య నలనఁ దెలియుచున్నది. (రామసేతు, శ్రీరంగ విజయరాఘవపుర కుంభకోణాది దివ్యస్థల ప్రతిష్ఠాపిత రామ భద్ర-)

క్షేత్రస్థలములు

ఇఁక క్షేత్రస్థలములయందును దద్వర్ణనలయందును రఘునాథుని కెంత మక్కువయో, యాతని వాల్మీకి చరిత్రమునుండి తెలియనగు చున్నది. వాల్మీకి చరిత్రలో సంస్కృత మూలములోలేని క్షేత్రముల వర్ణన, తెలుఁగున ప్రత్యేకముగా వ్రాసియున్నాఁడు, సప్తర్షులు వైకుంఠమున శ్రీనారాయణుని సేవించి, తిరిగి, హిమవత్పర్వత ప్రాంతమునకు వెడలునప్పుడు, భారతవర్షమున తొలుత దక్షిణ ప్రాంతమునుండి, ఉత్తర ప్రాంతములకు వెడలిరని రఘునాథుఁడు వ్రాసి యున్నాఁడు. అందు మొదట వారు దర్శించినది.

1. గజతీర్థము - ఇది తామ్రపర్ణి నది సంగమస్థలమునఁ గలదు. గజేంద్ర మోక్షణకథ జరిగిన పవిత్రస్థలము.
2. బాలకృష్ణ తీర్థము - ఇది గజతీర్థము తరువాత నున్నది.
3. రామసేతువు - జగత్ప్రసిద్ధమగు రామేశ్వరము - ఇచట గల పవిత్ర స్థలములు - చక్రతీర్థము - భేతాళ వారిధి - పాపవినాశిని - సీతా సరస్సు-మంగళ తీర్థము - అమృత వాటిక - లక్ష్మణతీర్థము. రామ తీర్థము, శంఖ చక్ర జటా తీర్థములు - వీని నన్నింటిని రఘు నాథుఁడు తెలిపియున్నాఁడు.

ఇంతియేగాక, హనుమత్కుండము - బ్రాహ్మకుండము - కోటి తీర్థము - ధనుష్కోటియందు గ్రుంకులిడి, సప్తర్షులు రామలింగముఁ గొలిచిరని తెలిపియున్నాఁడు. రామసేతువర్ణనమున పదునాలుగు

పద్యములున్నవి - రఘునాథునకభిమత క్షేత్రములలోనిది యొకటి. ఇచట రామభద్రుని రఘునాథుఁడు స్థాపించి యున్నాఁడని మనము ముందఱ తెలిసికొంటిమి గదా!

4. మధురాక్షేత్రము, ఇచట నీపవనము, హేమపుష్కరిణి ప్రశంసగలవు హాలాస్యక్షేత్రము, హాలాస్య నాథుని చతుష్షష్టి లీలావినోదములను వర్ణించి రఘునాథుఁడు తన శైవ వాఙ్మయ వేత్తృతమును వెల్లడించినాఁడు.
5. శ్రీరంగము - ఇదియు రఘునాథుని కభిమతక్షేత్రము. ఈక్షేత్ర ప్రశంస పది పద్యములలోనున్నది.
6. తంజాపూరు తనరాజధాని. అచ్చటి బృహదీశ్వరస్వామిని నృసింహస్వామిని, విష్ణుస్వామిని, యానందవల్లిని సుందరేశ్వరుని పేర్కొన్నాఁడు.
7. దక్షిణద్వారక - మన్నారుగుడి - రాజగోపాల స్తుతి. కమలాపురము, త్యాగేశస్థలము రెండు నందుట్టంకింపఁబడినవి.
8. కుంభకోణము - అచట దైవతములు - చక్రపాణి శార్ఙ్గపాణి, కుంభేశ్వరుఁడు. సోమనాథుఁడు, నాగనాథుఁడు విశ్వనాథుఁడు, అవిముక్త శివుఁడు.
9. శ్రీముష్ణము - శ్వేతవరాహస్వామి,
10. చిదంబరము - కనకసభ : తిల్లగోవిందరాజులు : నటరాజవర్ణన.
11. అరుణాచలము - అరుణాచలేశ్వరుఁడు.
12. కంచి - వరదరాజు, ఏకామ్రేశ్వరుడు.
13. వేంకటాచలము - తిరుపతిక్షేత్రము వేంకటేశ్వరుని వర్ణన 7 పద్యములు.
14. అహోబలము - నృసింహస్వామి.
15. శ్రీశైలము - శ్రీశైలమును గూర్చి మల్లికార్జునుని గూర్చి - 7 పద్యములు గలవు.
16. శ్రీకాశీక్షేత్రము - విశ్వనాథుని వర్ణన.

విజయరాఘవనాయకుఁడు, రాజగోపాలస్వామి కతిప్రియతముఁ డైన భక్తశిఖామణి - మన్నారుగుడి యందలిరాజ గోపాలస్వామికి రత్నాంగి, రత్నకిరీటము, దివ్యరత్నభూషణములు నవ్వారిగా నొసఁగి నాఁడు. మఱియు, గోపుర ప్రాసాదములు, ప్రాకారము, నాలయమున గట్టించినాఁడు - వైకుంఠ సభనందు నిర్మాణముచేసి, పుష్పవనతటా కాదులచే, మన్నారుగుడిని భూలోక వైకుంఠము కావించి యున్నాఁడు ఇట్లు రాజగోపాల దేవునికి సకల శాశ్వతానేక కైంకర్యములు గావించి యున్నాఁడు. ఆదేవునకు ప్రతివత్సరము జరుగు ఫాల్గునోత్సవ తిరు నాళ్లకు, తాను స్వయముగాపోయి కైంకర్యము చేయువాఁడు - మఱియు నాయుత్సవ సందర్భమును, 'రగడతోను చౌపదములతోడను వర్ణించి యున్నాఁడు. మఱియు రాజగోపాలుని గూర్చి, యొక దండకము గూడ రచించినాఁడు. సంపగిమన్నారుపై, యక్షగానరచనా భేదమగు నొక సాంగత్యము రచియించినాఁడు. వేఁకోలువిన్నపములు, దరువులు నాదేవునిపై వ్రాసినాఁడు - తాను మన్నారుదాస భక్తుఁడనని ప్రజా నీకమునకుఁదెల్పుటకు, తన విగ్రహమొకటి, రాజగోపాలదేవుని కెదురుగా కైమోడ్పుతో నిలిచినట్లు నిర్మింపఁజేసి యున్నాఁడు.

ఇట్లే, విజయరాఘవ నాయకుఁడు శ్రీరంగనాథస్వామికిని భక్తుఁడు, ఆతఁడు ప్రతిదినముచు ముప్పదిమైళ్ల దూరమున స్వయముగా శ్రీరంగ నాథుని దర్శించి తిరిగి తంజావూరునకు వచ్చుట చరిత్ర ప్రసిద్ధమైనది.

నాయకరాజుల వెనుక పాలించిన మహారాష్ట్ర రాజులలో శహాజీ మహారాజు త్యాగేశభక్తుఁడు. ఈత్యాగేశుఁడు తిరువారూరు క్షేత్రమున వెలసిన శివమూర్తి. శహాజీ కృతులన్నియు నీ దేవున కంకితము. అందు ముఖ్యముగా నీ దేవుని యుత్సవములకు సంబంధించిన శంకరపల్లకి సేవా ప్రబంధము అనుగేయ నాటకము రచించి, యది శాశ్వతముగా నాదేవుని యెదుట ప్రదర్శించుటకు, పదిపుట్ల భూమిని దానముచేసి యున్నాఁడు.

తంజావూరి రఘునాథనాయకుఁడు, వాల్మీకి చరిత్రమున సంస్కృత మూలమునందు లేకున్నను, తెలుఁగున క్షేత్రవర్ణనకుఁ బ్రత్యేకముగా ప్రసక్తి కల్పించినట్లుగా శహాజీరాజు, శచీపురందరము, అనునాటకమున క్షేత్రములను గూర్చి ప్రశంసించుటకు నొకసన్నివేశము గల్పించినాఁడు.

"కపిల కణ్వాదులగు ఋషులు తపస్సు చేయుటకు ననువగు స్థలముచూచి రమ్మని తమశిష్యుఁడగు వక్రదంతుని కా[illegible]తురు. వక్ర దంతుఁడును కమలాపురియను క్షేత్రమును గనిపెట్టి, గురువులకుఁ గపిల కణ్వాదులకు, మార్గమధ్యమున క్షేత్రములను జూపుచు నక్కడకు తీసికొని వెళ్లును - పంచనదీ క్షేత్రము - (తిరువారూరు) - కుంభకోణము మధ్యార్జునము - శ్రీవాంఛము - వేదవనము - ఇచ్చట నున్న వనమాలి సూర్య మూర్తములను రెండు తీర్థములు - ఆపైని కమలాపురము చూపును. కమలాపురము (తంజావూరివద్ద నున్నది) నే వారు తపస్సు చేయుస్థలముగా నెన్నుకొందురు - ఇచట - కమలాలయ తీర్థము, త్యాగ రాజుసన్నిధి - వాల్మీకేశ్వరుని సన్నిధి - ఉత్తమ స్థలములు. దీనినిఁబట్టి క్షేత్రస్థలములయందు శహాజీ రాజునకుఁగల భక్తిప్రపత్తులను గ్రహింప నగును.

మధుర నాయకులలో విజయరంగ చొక్కనాథుఁడు శ్రీరంగ నాథుని భక్తుఁడు - అతఁడు శ్రీరంగమాహాత్మ్యము" అను నాక్షేత్ర మహాత్మ్యము, చక్కని వచనముగా రచియించి యున్నాఁడు. సముఖము వెంకట కృష్ణప్పనాయకుఁడు, విజయరంగ చొక్కనాథుని, "శ్రీరంగపతి పదాంబుజ సారంగుని" గాఁ బేర్కొని యున్నాఁడు.

ఇట్లు క్షేత్రములయందు దేవతలయందు నత్యంతభక్తి శ్రద్ధలు చూపుటయేగాక దేవాలయమునందలి నిత్య నైమిత్తిక కర్మలు క్రమముగా జరుగుటకు, నాయకరాజు లత్యంత శ్రద్ధ వహించిరి నిత్యో త్సవములేగాక, వారోత్సవ, పక్షోత్సవ, మాసోత్సవ, వర్షోత్సవము లను, నిర్ణీతకాలమునందు సక్రమముగా జరుగుటకు శాశ్వతస్థితుల నేర్పాటు [illegible]. దక్షిణదేశమున, దేవాలయములన్నింటి యందు

రాగభోగములు నేటికిని క్రమముగా జరుగుచున్నవన్న యాకీర్తి యంతయు, తంజావూరు నాయకమహారాష్ట్ర రాజులది యనిచెప్పుట యతిశయోక్తి కానేరదు.

కనకాభిషేక సత్కారము :-కవిగౌరవము

కనకాభిషేక మనగానే మనకు శ్రీనాథమహాకవి జ్ఞాపకమునకు వచ్చుచుండును. విజయనగర రాజ్యము చాపచిటిగి చదరలైన తర్వాత దక్షిణమునకు తర్లిపోయి, స్వతంత్ర రాజ్యముల నేర్పాటు చేసికొనిన తెనుగు నాయకరాజులు, అందు ముఖ్యముగా తంజావురి రఘునాథవిజయ రాఘవులు మహదైశ్వర సంపన్నులై ప్రాచీన హైందవరాజ మర్యాదలను పాటించుచువచ్చిరి. తమకు పూర్వులైన విజయనగర సార్వభౌములు కదన వీరులేగాక [illegible]పోషకులై యశఃకాములైరి. వారి చలువచేత సంక్రమితమైన రాజ్యమును స్థిరపఱచుకొని, వైరి రాజుల విప్లవములనడచి, శాంతియుతులై, వారివలెనే తాముకూడ కవిపండిత పోషణము, స్వయముగా కవన మల్లగల నేర్పును సంపాదించుకొనిరి. ఇందులకు నిదర్శనము వారు కవిపండితులపై జూపిన యాదరణమే! రఘునాథుడు తనతండ్రిచే కనకాభిషేక సత్కారము బడసినాఁడు.

ఏవమ్ వదమ్ స్తనయమేష కృపారసార్ద్రైః
జాతాభిషేక మపితం జగతీబిడౌజః
తత్రాభిషించిత మణీభిరసౌ సభాయామ్
అసీత్స ఏవ వసుధేశ పటాభిషేకః

(సాహిత్య రత్నాకరము. 5. 35

తన యాస్థానమున గీర్వాణ వాణిని మధురవాణిగా నొనర్చిన మధుర వాణికి కనకాభిషేక మొనర్చి యున్నాడు, "ప్రౌఢ శ్రీరఘునాథ నాయక కృత స్వర్ణాభిషేక క్రియాదీవ్యోద్యన్మతి" యని మధురవాణి రామాయణమే కాదశసర్గ గద్యలో తన యేలికకు కృతజ్ఞతను జూపుకొన్నది.

సుధీంద్రుడను మధ్వయతీంద్రునకు కనకాభిషేక గౌరవము రఘునాథ నాయకుని కొల్వుకూటమున జరిగినట్లు నారాయణకవి రాఘవేంద్ర విజయమున చెప్పినాడు.

> అతులవివిధ విద్వన్మండ లీలాస్వమానః
> ప్రభుమణి రఘునాథ ప్రౌఢభూపాల కేన
> నిహిత నిఖిల విద్వన్మౌళి పాదస్సుధీంద్ర
> పరజన దురవాపం ప్రాపహేమాభిషేకమ్ ॥

తండ్రివలె విజయరాఘవుఁడు గూడ నిట్టి మర్యాదకులోటు కలుగ జేయలేదు. శృంగార రస తరంగితములైన పదములను చెప్పించుకొని, తన వృత్తాంతమును మన్నారుగుడి యందలి దేవర వృత్తముతో నభేద వ్యవసాయ మొనర్చిన కావ్యములను స్వీకరించి, 'నావిభుండని' తనపై మరులుగొన్న రంగాజీకిని కనకాభిషేక సత్కారముతో సంతృప్తి నొందించినాడు. మహారాష్ట్రనాయకులు గూడ నిట్టి విషయమున దీసి పోయిన వారుగారు. సంగీతసాహిత్య విద్యాలోలుడైన శహాజీ మహారాజు తన యాస్థాని నాంధ్రపాణిని బిరుదాంకితుని, శేషాచలకవిని, కనకాభిషిక్తునిగా జేసినాడు. ఆంధ్ర మాగాణమును వీడి శుద్ధద్రవిడ దేశమైన తంజావూరును చేరిన కవులకు నది రాజా శ్రయముచే రమానటీ రంగస్థలమైనది. కాబట్టియే తెలుగు కవులకు పండితులకు నాకాలముననెల్ల ఋతువులందును కనకవర్షము కురిసినది.

దాక్షిణాత్యాంధ్ర వాఙ్మయమును నింకను కూలంకషముగఁ బరిశీలించిన యెడలనింకనెన్నియో విషయములు మన తెలుఁగు భాషకు, తెనుఁగు వాఙ్మయమునకు, తెలుఁగు సంస్కృతికి సంబంధించినవి లభింపగలవు. గ్రంథవిస్తర భీతిని నిందు స్థాలీపులాకన్యాయమున వివరించితిని. ప్రాజ్ఞులు మేలేర్చి కొందురు గాక !

---

# విషయసూచిక


| | | పుట. |
|---|---|---|
| అవతారిక | ... | 1 |
| గోపన | ... | 4 |
| భద్రకవి లింగకవి | ... | 10 |
| పచ్చకప్పురపు తిరువెంగళకవి | ... | 17 |
| తంజాపురాంధ్ర వాఙ్మయము | ... | 24 |
| నాయకరాజయుగము – రఘునాథనాయకుఁడు | ... | 26 |
| రామభద్రాంబ | ... | 27 |
| మధురవాణి | ... | 30 |
| రఘునాథనాయకుని రచనలు | ... | |
| రఘునాథ రామాయణము | ... | 42 |
| శృంగార సావిత్రి | ... | 47 |
| వాల్మీకి చరిత్ర | ... | 48 |
| చేమకూర వేంకటరాజు – విజయవిలాసము | ... | 56 |
| సారంగధర చరిత్ర | ... | 69 |
| కృష్ణాధ్వరి | ... | 76 |
| కవి చౌడప్ప – క్షేత్రయ | ... | 86 |
| విజయరాఘవ నాయకుడు | ... | 87 |
| చరిత్ర | ... | 90 |
| సాహిత్యరాయ పెండేరము | ... | 92 |
| శారదాధ్వజము | ... | 93 |
| చంద్రరేఖ | ... | 94 |
| రచనలు – విజయరాఘవ నాయకునివి | ... | 96 |
| విప్రనారాయణ చరిత్ర | ... | 98 |
| పూతనాహరణము | ... | 104 |
| కాళియమర్దనము | ... | 106 |
| ప్రహ్లాదచరిత్ర | ... | 108 |
| శ్రీకృష్ణవిలాసము | ... | 109 |
| చెంగల్వకాళకవి – రాజగోపాలవిలా | ... | 111 |
| కోనేటి దీక్షితచంద్రుఁడు | ... | 123 |

| | | పుట. |
|---|---|---|
| పురుషోత్తమ దీక్షితుఁడు | ... | 126 |
| కామరసు వెంకటపతి సోమయాజి | ... | 129 |
| పసుపులేటి రంగాజమ్మ | ... | 133 |
| మన్నారుదాస విలాసము (నాటకము) | ... | |
| ఉషాపరిణయము | ... | 139 |
| మన్నారుదాస విలాసము (ప్రబంధము) | ... | |
| పదకర్తలు - క్షేత్రయ | ... | 162 |
| పెద్దదాసు | ... | 164 |
| మన్నారుదేవుడు | ... | 167 |
| తంజావూరి మహారాష్ట్రరాజ యుగము | ... | 175 |
| వంశవివరములు | ... | |
| శహాజీ - సంస్కృత వాఙ్మయము | ... | 177 |
| ఆంధ్రవాఙ్మయము - కృతులు | ... | |
| కిరాత విలాసము | ... | 182 |
| కృష్ణలీలా విలాసము | ... | 183 |
| గంగాపార్వతీ సంవాదము | ... | 187 |
| జలక్రీడలు | ... | 188 |
| త్యాగరాజ వినోద చిత్రప్రబంధము | ... | 189 |
| ద్రౌపదీ కల్యాణము | ... | 190 |
| పంచరత్న ప్రబంధము | ... | 191 |
| పార్వతీపరిణయము (వాసుదేవకవి) | ... | 192 |
| రతికల్యాణము | ... | 194 |
| రామపట్టాభిషేకము | ... | 195 |
| రుక్మిణీసత్యభామా సంవాదము | ... | 196 |
| వల్లీకల్యాణము | ... | 197 |
| విఘ్నేశ్వర కల్యాణము | ... | 198 |
| విష్ణుపల్లకి సేవాప్రబంధము | ... | 199 |
| శంకరపల్లకి సేవాప్రబంధము | ... | 201 |
| శచీపురందరము | ... | 204 |
| శాంతాకల్యాణము | ... | 205 |
| పతిదాన శూరము | ... | 206 |
| సతీపతిదాన విలాసము | ... | |

| | | పుట. |
|---|---|---|
| సీతాకల్యాణము | ... | 207 |
| భక్తవత్సలనాటకము | ... | 208 |
| సరస్వతీకల్యాణము | ... | 211 |
| **శహాజీ యాస్థానమందలి యాంధ్రకవులు** | | |
| ఆంధ్రపాణిని శేషాచలకవి | ... | 212 |
| గిరిరాజకవి | ... | 219 |
| వేంకటగిరి లేక కవిగిరి | ... | 226 |
| బాలకవి సుబ్బన్న | ... | 230 |
| ఆక్కానామాత్యుఁడు | ... | 233 |
| అష్టావధానికవి | ... | 234 |
| పోలూరి గోవిందకవి | ... | 235 |
| చల్లాపల్లి వేంకనార్యుఁడు | ... | 236 |
| సోమకవి | ... | 238 |
| గ్రంథవిలేఖకులు – రాజపోషణము | ... | 239 |
| మొదటి శరభోజీ | ... | 240 |
| తులజాజీ (తుక్కోజీ) | ... | 243 |
| ఆలూరి కుప్పనకవి | ... | 247 |
| కస్తూరి రంగకవి | ... | 251 |
| రెండవ ఏకోజీ | ... | 253 |
| జయసింహుఁడు – నెల్లూరి శివరామకవి | ... | 257 |
| ముద్దుపళని | ... | 261 |
| అమరసింహుఁడు – మాతృభూతకవి | ... | 272 |
| రెండవ శరభోజీ | ... | 278 |
| త్యాగరాజు | ... | ,, |
| శివాజీరాజు (తంజావూరు) | ... | 280 |
| వెంకటకృష్ణకవి | ... | 286 |
| శృంగారకవి తిరుమలనాథకవి | ... | 289 |
| బడగలనాటి నరసకవి | ... | 291 |
| చల్లా సూరయకవి | ... | 293 |
| శ్రీ నారాయణ తీర్థులు | ... | 595 |
| పరమానందతీర్థుఁడు | ... | 296 |
| పల్లవి గోపాలయ్య – రాజగోపాల వాగ్గేయకారాగ్రణి | ... | 302 |
| సభాపతయ్య | ... | 306 |
| మేలత్తూరి వేంకటరామశాస్త్రి | ... | 308 |

| | | పుట. |
|---|---|---|
| మధురాపురాంధ్ర వాఙ్మయములు | | |
| వంశవివరములు | ... | 310 |
| రాయవాచకము | ... | 313 |
| లింగనమఖి శ్రీకామేశ్వరకవి | ... | 319 |
| గణపవరపు వేంకటకవి | ... | 326 |
| రాణిమంగమ్మ | ... | 329 |
| విజయరంగ చొక్కనాథుఁడు | ... | 330 |
| సముఖము వేంకటకృష్ణప్పనాయకు | ... | 333 |
| శేషము వేంకటపతి | ... | 357 |
| కుందుర్తి వేంకటాచలకవి | ... | 364 |
| మిత్రవిందా పరిణయము | ... | 366 |
| కార్తిక మాహాత్మ్యము | ... | 368 |
| తురయూరారి రెడ్ల చరిత్ర | ... | |
| రేపూరి కవికుటుంబము | ... | 373 |
| అనంతకవి – గాధేయోపాఖ్యానము | ... | 374 |
| వృద్ధాచల మాహాత్మ్యము | ... | 377 |
| రేపూరి అనంతయ్య (బాలకవి) | ... | 378 |
| శేషార్యోదాహరణము | ... | ,, |
| శ్రీముష్ణ మాహాత్మ్యము | ... | 379 |
| శివరహస్యఖండము | ... | ,, |
| బద్దెపూడి రుద్రభూపతి | ... | 380 |
| వెలగపూడి కృష్ణయామాత్యుఁడు వంశవివరములు | ... | 383 |
| భానుమద్విజయము | ... | 390 |
| శ్యామరామకవి | ... | 392 |
| వెలిదండ్ల అళఘురికవి | ... | 396 |
| తిరుమలకవి | ... | 398 |
| శ్రీపతి రామభద్రకవి | ... | 400 |
| కవిఘాటి బలభద్రకవి | ... | 401 |
| భాస్కర వేంకటాచలకవి | ... | 402 |
| సీనయకవి | ... | 403 |
| ధూర్జటి వేంకటరాయకవి | ... | 404 |
| ఎల్లయ | ... | 406 |

| | | పుట. |
|---|---|---|
| హోసూరి సాకమ్మ | ... | 407 |
| పుదుకోట - ఆంధ్రవాఙ్మయము | ... | 409 |
| వంశవివరములు | | |
| సీతారామయ్య | ... | 410 |
| రాయరఘునాథరాజు | ... | 414 |
| పార్వతీపరిణయము | ... | 415 |
| కవిసంజీవని | | |
| నుదురుపాటి వెంకన్న | | |
| ఆంధ్రభాషార్ణవము | | |
| రఘునాథీయము | ... | 427 |
| పార్వతీకల్యాణము | ... | 428 |
| తొండమాన్ వంశావళి | ... | ,, |
| బృహన్నాయికా దండకము | ... | 429 |
| మల్లుపురాణము | ... | 430 |
| మన్నారయ | ... | 434 |
| నవనప్ప - ఖడ్గలక్షణశిరోమణి | ... | 436 |
| నుదురుపాటి సాంబశివకవి | ... | 444 |
| **మైసూరు - ఆంధ్రవాఙ్మయము** | | |
| చికదేవరాయవిలాసము | ... | 447 |
| శృంగారనీపపద్యశతకము | ... | 449 |
| కంఠీరవరాజు యక్షగానకృతులు | ... | 450 |
| బెంగుళూరి నిర్మాత, పెదకెంపరాయఁడు | ... | 464 |
| కళువె వీరరాజు - భారతవచనము | ... | 470 |
| నంజరాజు | | |
| బద్దెపీటి దత్తప్పకవి | ... | 489 |
| కోడూరి వేంకటాచలకవి | ... | 490 |
| పొన్నతోట బొబళకవి | ... | 492 |

| | | పుట. |
|---|---|---|
| సుగుటూరి ముమ్మడి తమ్మభూపతి | ... | 494 |
| తలమల - విశ్వేశ్వరపండితుఁడు | ... | 497 |
| ప్రళయకావేరి - వెలిదండ్ల వేంకటపతి | ... | 498 |
| శైయ్యూరు - మారుపెద్ది చెంగల్వరాయకవి | ... | 510 |
| ఎట్టియాపురము - సుబ్బరామదీక్షితులు | ... | 513 |
| తి. సు. మురుగేశంపిళ్లె | ... | 516 |

అనుబంధము

| | | |
|---|---|---|
| అముద్రిత గ్రంథములు | ... | 520 |
| చాటువులు | ... | 528 |
| శాసనములు | ... | 542 |
| సవరణములు | ... | 552 |
| శుద్ధపత్రము | ... | 558 |
| ప్రత్యేక వ్యాసముల సూచికలు | ... | 560 |
| పదానుక్రమణిక | ... | 561 |

# దక్షిణదేశీయాంధ్రవాఙ్మయము



## అవతారిక

ఆంధ్రవాఙ్మయ చరిత్రమున క్రీ. శ. 1600 నుండి క్రీ. శ. 1775 వఱకును వర్ధిల్లిన వాఙ్మయ యుగమును "దక్షిణాంధ్ర వాఙ్మయ యుగము" అను పేర వాఙ్మయ చరిత్రకారులు వ్యవహరించుచున్నారు. ఈ యుగముయొక్క స్థానమును, ప్రత్యేకతను నిరూపించుటకు ముందుగా నీ యుగమునకుఁ బూర్వమందు [1]వెలసిన వానిని గూర్చి తెలిసికొనవలసి యున్నది. ఆ యుగము లివి :

| | | | | |
|---|---|---|---|---|
| 1. | నన్నయకుఁ బూర్వయుగము | క్రీ. శ. | 800–1000 | తూర్పు చాళుక్యులు. |
| 2. | నన్నయ యుగము | ,, | 1000–1100 | |
| 3. | శివకవి యుగము | ,, | 1100–1250 | చోళులు. |
| 4. | తిక్కన యుగము | ,, | 1250–1330 | కాకతీయులు. |
| 5. | ఎఱ్ఱాప్రెగ్గడ యుగము | ,, | 1330–1400 | 1. రెడ్డి రాజ్య స్థాపన. 2. విజయనగర రాజ్యస్థాపన, రెడ్డి రాజుల యుచ్చదశ. |
| 6. | శ్రీనాథ యుగము | ,, | 1400–1500 | |
| 7. | కృష్ణరాయ యుగము | ,, | 1500–1600 | విజయనగర రాజుల యుచ్ఛ్రియదశ. |

---

1 చూడుఁడు తెనుఁగు కవుల చరిత్ర. మదరాసు విశ్వవిద్యాలయ ప్రకటితము (1953) పుట 2–4.

పై వానిలోఁ బ్రధానముగా యుగముల పేళ్లన్నియు యుగకర్త లైన ప్రసిద్ధ కవుల నామములతో వెలసినవి. ఒక్క శివకవి యుగమునకు మాత్రము ప్రత్యేకముగ నా కాలమునఁ బ్రచుర ప్రచారమును గాంచిన వీర శైవమత వాఙ్మయము ననుసరించి యీ నామకరణము చేయఁబడి నది. వీరశైవమతస్థు లయిన కవుల పేర నా యుగమెట్లు వ్యవహరింపఁ బడినదో, ఆ రీతిగనే, వాఙ్మయము వర్ధిల్లిన ప్రదేశమునుబట్టి యీ యుగము "దక్షిణాంధ్ర వాఙ్మయము" అని వ్యవహరింపఁబడినది. దేశ కాలపాత్రము లనియెడి యుపాధులలో మిగిలిన యుగములు పాత్రల ననుసరించి ప్రాధాన్యమును బడయఁగా నీ దక్షిణాంధ్ర యుగము దేశము ననుసరించి ప్రత్యేక ప్రాధాన్యముఁ బడసినది. ఏలయనఁగా నింతకుముందు వెలసిన వాఙ్మయమంతయును శ్రీశైల కాళేశ్వర దాక్షారామములను శివస్థలములకు మధ్యనున్న యాంధ్ర దేశముననే వెలసినది. ఇది తెలుఁగు భాష మాతృ భాషగాఁగల తెలుఁగుదేశము. దీనికి దక్షిణపు సరిహద్దు నేఁటి కర్నూలు మండలమునఁగల శ్రీశైల క్షేత్రము. దీనికి దగ్గఱగ దక్షిణ పశ్చిమభాగమునఁ గర్ణాటప్రాంతమగు మైసూరును, దక్షిణ ప్రాంతమున ద్రావిడదేశము లేక తమిళదేశమును గలవు. ఈ ద్రావిడ దేశము దక్షిణ భాగమునకుఁ జివరనున్న కన్యాకుమారి వఱకును వ్యాపించియున్నది. ఇచ్చట వ్యవహారముననున్న భాష తమిళము (అఱవము) ఈ దేశముననే, బహు ప్రాచీనకాలమున ద్రవిడ నాగరికతకుఁ బట్టుఁగొమ్మలైన పాండ్య చోళ రాజ్యములు వర్ధిల్లినవి. అందు చోళ రాజ్యమునకు తంజావూరును, పాండ్యరాజ్యమునకు మధురయును ముఖ్య పట్టణములు. ఈ రెండు రాజధానులేకాక పుదుక్కోట, తురయూరు, సేలము, తిరునవ్వేలి మొదలగు ప్రదేశములన్నియు నీ ద్రావిడ దేశమునకు సంబంధించినవే. కేవలము తమిళము మాతృ భాషగాఁగల యీ ప్రదేశములలోనే గాక మైసూరు మొదలగు కన్నడ ప్రాంతములలోఁ గూడ క్రీ. శ. పదునేడవ శతాబ్ది ప్రారంభము నుండియు వర్ధిల్లిన తెనుఁగు వాఙ్మయమును "దక్షిణాంధ్ర వాఙ్మయము" అని మనము వ్యవహరించుచున్నాము.

ఈ ప్రదేశములు తెలుఁగు దేశమునకు సుదూరమున నున్నను క్రీ. శ. 11-వ శతాబ్ది ప్రారంభమునుండియు ననఁగాఁ దూర్పు చాళుక్య వంశీయుఁడగు రాజరాజ నరేంద్రుఁడు (1019-1061) తంజాపూరు రాజధానిగాఁగల చోళసామ్రాజ్యమునకుఁ జక్రవర్తియగు రాజేంద్ర చోడ చక్రవర్తి కూఁతురయిన అమ్మంగ దేవిని వివాహమాడిననాఁట నుండియు రాజకీయముగ సంబంధములును రాకపోకలును దొలుత నేర్పడినవి. ఈ కాలముననే పెరియారు, కావేరీనదీతీర ప్రాంతములనుండిన యరవలు రాజు యొక్క యాహ్వానము ననుసరించివచ్చి గోదావరీతీర ప్రాంతముల నివాసములు గల్పించుకొనిరి. * శ్రీ రాజేంద్రుని వెనుకఁ జోళరాజ్య ప్రతినిధులే యీ దేశమును బాలించుచుండిరి. కాని యావెనుకఁ, దెనుఁగునాటి నేలిన వెలనాటి రాజులయుఁ, గాకతీయులయు కాలమున (1132-1323) నీ సంబంధము చాలవఱకు సడలినది. ఆంధ్ర భాషాపోషణము, ఆంధ్ర సంస్కృతి దేశమున విస్తరిల్లినది. కాకతీయ సామ్రాజ్య విచ్ఛిత్త్యనంతరమున క్రీ. శ. 1336 లో విజయనగర సామ్రాజ్య మేర్పడినది. హరిహరరాయల బుక్కరాయల కాలమునఁ గుమారకంపన దక్షిణ దేశముపై క్రీ. శ. 1356 లో దండెత్తి యా ప్రదేశమును వశపఱచుకొనెను. కాని క్రీ. శ. 1370 ప్రాంతములో మహమ్మదీయులు దక్షిణ దేశముపై దండెత్తి శ్రీరంగనాథస్వామి దేవాలయము కొల్లగొట్టినపుడు గోపన యను ప్రసిద్ధ దండనాయకుఁడు, శ్రీ వేదాంత దేశికుల నియోగమున వారినిఁ దఱిమి, వేఱొకచోటికిఁ దరలింపఁబడిన శ్రీరంగనాథుని విగ్రహమును దిరుగ యథాస్థానమునఁ బ్రతిష్ఠఁ గావించెను. ఈవిజయము తాత్కాలికమే. ఆంధ్ర నాయకత్వ మా ప్రదేశమునఁ బ్రవర్తిల్లనేలేదు. ఈ గోపనయే దక్షిణాంధ్ర వాఙ్మయమునకు సంబంధించిన మొదటి తెలుఁగు కవి.

* వీరు ఆరామములు లేక తోఁటలకు నిలయమైన కోనసీమ ప్రాంతమునే నివాసముగఁ జేసికొనుటచే, వీరిని ఆరామ ద్రావిడులని మనము వ్యవహరింతుము.

# గోపన - సింధుమతీ విలాసము

ఆంధ్ర సాహిత్య పరిషత్కార్యాలయమున గ్రం. సం. 1660 'సింధుమతీ విలాసము' అను గ్రంథము గలదు. ఇది రెండాశ్వాసముల ప్రబంధము. దీనిని రచించిన కవి 'గోపనమంత్రి' యని యీ క్రింది గ్రంథాంత గద్యవలనఁ దెలియుచున్నది.

"ఇది శ్రీ మదాపస్తంబసూత్ర, భారద్వాజసగోత్ర, నరసనామాత్యపుత్ర శ్రీ వేంకటేశ్వర కరుణాకలితకవితా విలాస శ్రీమత్ప్రతివాది భయంకర వేదాంత దేశికోపదేశ విమలీకృత శిక్షిత శ్రీమదష్టాక్షరీ మంత్రరాజ జపవిరాజమాన నిజహృదయ కమలకర్ణికార సుకవిజన విధేయ గోపన నామధేయ ప్రణీతంబైన సింధుమతీ విలాసం బను శృంగారరస ప్రధాన ప్రబంధంబునఁ బ్రథమాశ్వాసము."*

శ్లో. యోయం సింధుమతీ విలాస మఖిలం శృంగార సంపత్కరం
వాచామంజు ద్రవీయకం సకుముదం నానావిధోద్వాహకం
పశ్యస్సాధు జన స్సుకార్య రచనః కోవాత్తుమ స్వాపిచన్
బంధుర్వాయది గీతివా బహువిధాః పాత్రర్మమైవా యది.

పద్య రచన.

చ. కడు భ్రమఁజెంది కొంకుచు వికారము నొందుచు ఖిన్నమూర్తియై
పొడమిన నెవ్వగ న్విభుఁడు భూరి దయారహితాత్ముఁడైనఁ దా
నడఁచెడు పద్మినీ ముదిత యందము నాఁబటు సాంద్రనాదమై
కడువడిఁ గేకి సంఘము కెకారవమంటి చెలంగె దిక్కులన్.

ఈ ప్రతిని ప్రమోదూతనామ సం. శ్రావణ బ. ౫ భౌమవారము సంపూర్ణముగా చందానాగలింగము వ్రాసికొనెను.

---

*"పై గద్యమువలన గోపన పోడుశా సహస్రంబు రచించిన వేదాంతదేశికాచార్యుని శిష్యుఁడగుట స్పష్టము. కవిత్వము మిగుల శృంగార మన నొప్పును. మధురాపురమునందుండు జయుఁడను నానికిని సింధుమతి యను నొక వేశ్యాంగనకును గల సంబంధమే యిందు వర్ణింపఁబడినది. మధ్యమధ్య సంస్కృత శ్లోకములు గూడ గలవు."

(ఆంధ్రసాహిత్య పరిషత్పుస్తక భాండాగారము సంపుటము 5 పుటలు 396–397.)

ఈ గోపన కవినిగూర్చియు, గ్రంథమునుగూర్చియు గోలుకొండ కవుల సంచికలో పూర్వకవి పరిచయము అను శీర్షిక క్రింద 398 పుటలో నిట్లు వ్రాయఁబడి యున్నది.

“35 గోపమంత్రి. ని: (నివాసము) గార్ల. కా. (కాలము) క్రీ. శ. 1700 ప్రాంతము. ర. (రచన) సింధుమతీ విలాసము. పద్య కావ్యము.

వి. (విశేషములు). కవి భారద్వాజ గోత్రుడు. సింధుమతి యను వేశ్యకు, జయుఁడను యువకునకుఁ గల సంబంధముఁ దెలుపు శృంగార కావ్యము. ఇందు సంస్కృతాంధ్రకవిత కలదు.”

దీనినిబట్టి పై నుదాహరించిన పరిషత్తులోని గ్రంథమును, నిది యును నొకటియే యనియుఁ, గవి యొకఁడేయనియు, గ్రంథవిషయము కూడ నొకటియే యనియు మనకు స్పష్టమగుచున్నది. మఱియు గోపన కవి తెలింగానా ప్రాంతము వాఁడనియు క్రీ. శ. 1700 ప్రాంతము వాఁ డనియుఁగూడఁ దెలియుచున్నది. కాని గద్యమందలి ‘శ్రీ మత్ప్రతివాది భయంకర వేదాంత దేశికోపదేశ విమలీకృత శిక్షిత శ్రీమదష్టాక్షరీ మంత్రరాజ జపవిరాజమాన నిజహృదయ కమలకర్ణికార’ అను విశేషణ వాక్యమును జూచిన గోపనకవి విశిష్టాద్వైత మతమునఁ బ్రత్యేక విశిష్టత గడించిన శ్రీ వేదాంత దేశికుల వారిచే స్వయముగా నుపదేశము నొందిన వైష్ణవాగ్రేసరుఁడనియు నాతఁడుకూడ శ్రీ వేదాంత దేశికుల కాలమువాఁడే యనఁగా క్రీ. శ. 1370 ప్రాంతమువాఁడే యనియు మనము నిశ్చయింపవచ్చును.

ఈ గోపన, విజయనగర సామ్రాజ్య స్థాపనమైన మొదటి ఘట్ట ములో, మహమ్మదీయులను దక్షిణదేశములోఁ గాలు నిలుపకుండ నరికట్టిన చారిత్రక మహాపురుషుఁడు. ఈ క్రింద వివరించిన చారిత్ర కాంశములవలనఁ జారిత్రక పురుషుఁడగు గోపనయే సింధుమతీ పరిణయ మును రచించిన కవియని నిశ్చయింపవచ్చును. ఇందులో నుదాహ

రింపఁబడిన శాసనములలోని విషయములు పై గ్రంథమునందలి గద్య లోని విషయములతో సమన్వితము లగుచుండుటవలనఁ బ్రాచీనాంధ్ర కవులలో గోపన యొకఁడని నిర్వివాదముగాఁ దేలుచున్నది. మఱియుఁ గృష్ణమాచార్యుల వెనుక నాంధ్రవైష్ణవ వాఙ్మయమున నితఁడు రెండవ వైష్ణవ కవియని యెన్ననగును.

దక్షిణదేశముపై క్రీ. శ. 1327 ప్రాంతమున మహమ్మదీయులు దండెత్తివచ్చి తొండమండలమును జయించి శ్రీరంగ క్షేత్రమును గొల్ల గొట్టవచ్చినప్పు డా దేవాలయమునందలి యర్చకులు శ్రీ రంగనాథుని విగ్రహమును మైసూరు మండలమునందున్న తిరునారాయణపుర మను నామాంతరము గల మేల్కోటయందుఁ గొన్ని దినములు భద్రముగా దాఁచిరి. ఆ వెనుక నా విగ్రహమును శ్రీ తిరుపతి క్షేత్రమునకుఁ దీసికొని పోయి శ్రీ వేంకటేశ్వర స్వామివారితోఁగూడ నచ్చట నే దానికి నిత్య పూజాదికములను నెఱవేర్చుచుండిరి.

క్రీ. శ. 1336 లో విజయనగర సామ్రాజ్య మేర్పడిన వెనుక సంగమ వంశీయుఁడగు హరిహరరాయలు తన సోదరుఁడును, సైన్యాధి పతియు నగు వీరకంపరాయని మహమ్మదీయుల నివారించి తొండ మండలములను జయించుటకు పంపెను. ఈ వీరకంపరాయనికి సహాయ భూతుఁడుగానున్న సేనానాయకులలో సింధుమతీ పరిణయ ప్రబంధకర్త యగు గోపన యొకఁడు. ఈతఁ డాకాలమునాఁడు 'చెంజీ' దుర్గమునకుఁ బరిపాలకుఁడుగా నుండెను. మధురనుగూడ వశపఱుచుకొన్న మహమ్మ దీయులను జయించి[1] కంపరాయఁడు దక్షిణదేశాంతర్గతమగు పాండ్య చోళరాజులను విజయనగర పాలనక్రిందికిఁ దెచ్చెను.

---

1. ఈ జయవృత్తాంతమే 'కంపరాయ చరిత్ర' లేక మధురా విజయము అను సంస్కృత కావ్యమున వర్ణితమైనది. కంపరాయని రాణులలో నొకతెయు, కమనీయ కవయిత్రియునగు గంగాదేవి లేక గంగాంబ రచియించినది. ఇందులో సంస్కృత కవిస్తుతిలోఁ దెలుఁగుకవి తిక్కయజ్వస్తుతి గలదు. ఈ కావ్యము క్రీ. శ. 1924 లో ముద్రితమైనది. దాక్షిణాత్య కవయిత్రులు రచియించిన కృతులలో నిదియుఁ బరిగణింపఁదగియున్నది.

చెంజిదుర్గమునుండి యొకనాఁడు గోపన సేనాని శ్రీ వేంకటేశ్వర స్వామిని దర్శించుటకై తిరుపతి క్షేత్రమునకు వెడలి యచ్చట వేంకటేశ్వర దేవుని ప్రక్కనున్న మఱియొక విగ్రహముఁ గాంచి యచ్చటి యర్చకులను బ్రశ్నించెను. వారును నది శ్రీరంగనాథుని విగ్రహమనియు, మహమ్మదీయుల బారినుండి తప్పించి, యచ్చట భద్రపఱచుచుంటి మనియు నాతనికిఁ బ్రత్యుత్తరమిచ్చిరి. అంత గోపన, రంగనాథుని విగ్రహమును దిరిగి శ్రీరంగమునఁ బునఃప్రతిష్ఠ చేయుటకు వారి యనుమతిని బడసి, యా విగ్రహమును, దిరుపతినుండి తీసికొనిపోయి తన రాజధాని యగు చెంజి దుర్గమునకుఁ జేరువనున్న సింగవర గ్రామమున రాతి దేవళములో నిలిపెను.

ఇంతలో మహమ్మదీయులు శ్రీరంగము నాక్రమించుకొనిరి. కాని మహమ్మదీయ సైన్యాధ్యక్షుని కా ప్రదేశము సరిగా నుండకపోవుటచే, శ్రీరంగమును విడిచి యాతఁ డచ్చటి కాఱుమైళ్ళ దూరముననున్న సమయవరమును రాజధానిగాఁ జేసికొనెను. తురుష్కులిట్లు దేవాలయ ప్రదేశమునుండి తొలఁగిపోవుట, కంపరాయలు మధురా పట్టణమును జయించుట, గోపన్న వైష్ణవభక్తి గలిగియుండుట శ్రీరంగమునందలి యర్చకు లెఱింగి, గోపన్నతో నుత్తరప్రత్యుత్తరములు జరుపుచుండిరి. గోపన్నయు సరియగు సమయము చూచుకొని, క్రీ. శ. 1371 లో బ్రహ్మాండమగు సైన్యమును గూర్చికొని, మహమ్మదీయులను బూర్తిగ నోడఁగొట్టి, సింగవరములో వేంచేసియున్న శ్రీరంగనాథుని విగ్రహమును మహావైభవముతో శ్రీరంగమునఁ బ్రతిష్ఠించెను.

ఈ మహాకార్యమున కత్యంతానందము నొంది, మహాప్రసిద్ధులగు శ్రీ వేదాంతదేశికులవారు గోపనను స్తుతియించుచు రెండు శ్లోకములను జెప్పిరి. అవి రెండును, శ్రీరంగము దేవాలయమునఁ దూర్పు ప్రాకారమున శిలాశాసనరూపమున వెలయుచున్నవి.[1] ఆ శ్లోకము లివి. ఈ శాసనకాలము. "క్రీ. శ. 1371 స్వస్తిశ్రీ బంధుప్రియే శాకాబ్దే.

---

1. Ranganatha Inscription of Gopanna S. S. 1293—Epigraphica Indica, Vol. VI No. 33, Page 322-330.

"౧. ఆనీయా నీల శృంగద్యుతి రచిత జగ ద్రంజనా దంజనాద్రే
శ్చేంచ్యామారాధ్య కాంచిత్సమయ మథు స్తే హనుష్కాన్ తురుష్కాన్
లక్ష్మీక్ష్మాభ్యానుమాభ్యాం సహనిజ నిలయేస్థాపయన్ రంగనాథమ్
సమ్యగ్వర్యాం సమర్ప్యాం కురుతనిజ యశోదర్పణో గోపణార్యః.

౨. పీఖేశం రంగరాజం వృషభగిరి తటాత్ గోపణ క్షోణిదేవో
నీత్వాస్వాం రాజధానీన్ని జజలనిహతాత్ సిక్తతౌలుష్కసైన్యః
కృత్వా శ్రీగంగభూమిం కృతయుక నిహితాన్తస్తు లక్ష్మీమహీభ్యామ్
సంస్థాప్యం సరోజేత్ భవ ఇవకుంతే సాధుచర్యాంసపర్యామ్."

ప్రతివాది భయంకర బిరుదము ధరించిన వారిలోఁ బ్రథములు వేదాంతదేశికులే. వీరు శతాధిక గ్రంథకర్తలై శతవర్షాధికముగ జీవించిరి. (క్రీ. శ. 1270-1382)

ఈ శాసనములోని మొదటి శ్లోకము గురుపరంపరా ప్రభావము అను తమిళ వైష్ణవ మతగ్రంథమున నుదాహృతమై యున్నది. మఱి యును వైష్ణవ దేవాలయములను గూర్చి తెలుపు "కోయిళ్ళొలుగు" అను చారిత్రిక గ్రంథమునఁగూడ నీ గోపన మహాత్కార్యము విశదీకరింపఁ బడియున్నది. ఆ గ్రంథమున గోపన, శ్రీ రంగనాథుని ప్రతిష్ఠించు సమయమున నా దేవునికి ౫౨ గ్రామములను సమర్పించెనను విషయము కూడఁ గలదు.

గోపన యాంధ్రబ్రాహ్మణ నాయకుఁడైనను, నాతఁడు ద్రవిడ దేశమునందుఁ బరిపాలన మొనర్చుటచే నాతనిఁగూర్చిన శాసనము లఱవ భాషలో నున్నవి. అచ్చారపాకము శాసనమున[1], గోపన బ్రాహ్మ ణుఁడును, ఆపస్తంబ సూత్రుఁడును, భారద్వాజ గోత్రుఁడు నైనట్లు తెలుపఁ బడి యున్నది. కాంచీపురము శాసనములలో మూఁడింటియందును,

1. Epigraphical Report, (Achchara-pakam No. 250 of 1901)

గోపన పేర్కొనఁబడి యున్నాఁడు. అందొక దానిలో గోపనకు 'అయ్యన' యను కుమారుఁ డున్నట్లు తెలియుచున్నది.[1]

ఇఁక 'సింధుమతీ పరిణయము' ముద్రితమై ప్రకటితమైనచో, నది యాంధ్ర సాహిత్యమున కొక యమూల్యాలంకారమే యగును.

సంగమ సాళువ వంశీయుల యనంతరము తుళువ వంశీయుఁ డగు శ్రీకృష్ణదేవరాయలు క్రీ. శ. 1509 లో రాజ్య మధిరోహించెను. అతఁడు దక్షిణదేశమును జయించి, యా ప్రదేశములలోఁ దెనుఁగు నాయకులను బరిపాలకులుగా నియమించుటయే తెనుఁగు వాఙ్మయ మానాటఁ బ్రవర్తిల్లుటకు హేతువైనది. దీనిఁబట్టి దక్షిణదేశాంధ్రవాఙ్మయ మేర్పడుట రాజకీయపరిస్థితుల మూలముగనే యని గ్రహింపనగును. మధుర తంజావూరులలో నియమితులైన తెనుఁగు నాయకులు తమతోఁబాటు, తమ భాషనుఁ దమ సంస్కృతినిఁ దమ పరివారమును నచ్చుటకుఁ దీసికొనిపోయి, తెనుఁగు యశస్సును స్థిరముఁ గావించిరి. పూర్వ మేనాఁడో తెలుఁగువారైన యాంధ్రులు స్వరాష్ట్రేతరమగు మగధదేశమును బాలించిన విషయము మన కంతఁగాఁ దెలియలేదు. కాని దక్షిణదేశమును బాలించిన యాంధ్రనాయకు లాంధ్రేతర రాష్ట్రములయందు నాంధ్రత్వము, నాంధ్రసాహిత్యము శాశ్వతముగ నిల్పిన విషయముమాత్రము మనకు స్పష్టముగఁ దెలియవచ్చుచున్నది.

శ్రీకృష్ణదేవరాయలయుగమున తెనుఁగుభాష యుచ్ఛస్థితిని బొందినది. ఆ యుగమున—తెనుఁగు రాష్ట్రభాషగా నేర్పడుటచే 'దేశభాషలందుఁ దెలుఁగు లెస్స' యైనది. అట్టి రాయల యాస్థానమున

---

1. South Indian Inscriptions Vol. 1 (No. 86-88 & E. P. R No. 33 of 1890.)

[illegible] వేదాంతదేశిక వైభవ ప్రకాశికలో గోపననుగూర్చి యిట్లు గలదు :

శ్లో॥ జిత్వాతులుష్కాన్ భువిగోపణేంద్రో రంగాధిపమ్ స్థాపితవాన్ స్వదేశే
ఇత్యేవమాకర్ణ్యగురుః కవీంద్రో హృష్టోభవద్యస్తమహం ప్రపద్యే.

వెలసిన నాయకులును నట్టి భాషాభిమానమే యాలంబనముకాఁగాఁ దాము పాలించిన ప్రదేశములలోఁ గవులను పోషించి, గ్రంథములు వ్రాయించి, తాము స్వయముగఁ గృతికర్తలై కృతిభర్తలై, యాంధ్ర వాఙ్మయ చరిత్రమున నొక ప్రత్యేకయుగము నేర్పఱుచుటకుఁ గారణ భూతులైరి.

కృష్ణదేవరాయల యనంతరమున నచ్యుతదేవరాయల కాలమున (క్రీ. శ. 1530–42) దక్షిణదేశములో నిద్దఱు తెలుఁగు కవులు రచనలు గావించి యచ్చటి నాయకులకుఁ గృతి నిచ్చిరి. వారినిఁ గూర్చిన వివరము లిచ్చుచున్నాను.

## 1. భద్రకవి లింగకవి
(క్రీ. శ. 1530–40)

శ్రీకృష్ణదేవరాయల యుగమున నచ్యుతదేవరాయల కాలమున వెలసిన ద్విపద కవులలో నొకఁడగు నీ లింగకవి చరిత్ర మింతదనుకఁ గవిచరిత్రల కెక్కలేదు. మఱియు నీతఁడు వీరశైవుఁ డగుటచేఁ గేవల వైష్ణవ యాగమనఁ దగిన రాయల యుగములోఁ బ్రసిద్ధుఁడైన యీ కవి కాల మెఱుంగుట యావశ్యకమే యగును.

**వంశవృత్తాంతము :** ఈతఁడు రచించినవి రెండు ద్విపద కావ్యములు 1. దేవాంగపురాణము, 2. సానంద చరిత్ర. వీనివలన నీతని వంశవృత్తాంతమును గాలమును నెఱుకపడుచున్నవి. ఈతఁడు కూడలి సంగమక్షేత్రనివాసి. ప్రసిద్ధ శైవభక్తుఁడగు దేవరదాసుమయ్య వంశీయుఁడు. రామయప్రభునికిని నమలాంబకును బుత్రుఁడు. ఈతని వంశవర్ణనముఁబట్టిచూడ నీతఁడు రాజ్యాధికారి యని తోఁచుచున్నది.

"ధరణి పై దేవర దాసయ్య వంశ
వరనిధి సంపూర్ణ వార్ధి చంద్రుండు
దురిత దూరుఁడు శివద్రోహరగండ
బిరుద ప్రతాప గంభీర వర్తనుఁడు

చరితార్థ చరితుండు సత్య సంధుండు
సరసుండు శివ ధర్మ శాస్త్ర కోవిదుఁడు
పరమశివజ్ఞాన భరితాత్ముఁ డనఁగఁ
బరఁగిన రామయ ప్రభు కూర్మిసుతుఁడు. ”
(దేవాంగపురాణావతారిక)

“ జంగమ కులవార్ది చంద్రోదయుండు
లింగైకనిష్ఠా విలీన మానసుఁడు
... ... ...
భాసిల్లు రామయ ప్రభువరేణ్యుండు
తనదు పాతివ్రత్య ధర్మమార్గమున
ననసూయ కెనయైన యమలాంబ వలనఁ
గనిన పుత్రుఁడు భద్రకవిలింగవిభుఁడు ”
(సానంద చరిత్ర యవతారిక)

ఈతని గురువు శ్రీ కాళహస్తి సంగమేశ్వరుఁడై నట్లు—
“ చిరభవాంబుజ హస్తి శ్రీ కాళహస్తి
గురుసంగమేశ్వరుఁ గొనియాడి పాడి ”
అని తన గ్రంథములోఁ జెప్పియున్నాఁడు.

**కాలము :** లింగకవి తన దేవాంగపురాణమును రచియించు నాఁడు పడవీడున కధిపతియగు శ్రీ కాళహస్తీశుఁడను నొక మహా పురుషుఁడున్నట్లుగా నిట్లు చెప్పినాఁడు.

“ భూనారికిని శిరోభూషణంబైన
మానిత ద్రావిడ మధ్య దేశమున
నడరు మర్త్య స్వర్గమగు మధుర రస
పడవీడు సకల సంపదలకు వీడు
ఇర వొప్పఁ గాళహస్తీశ్వరుఁ డనెడి
పురుషాగ్ర గణ్యుఁ డప్పురి కధీశ్వరుఁడు
పట్టణంబుల కెల్లఁ బరఁగిన తల్లి
పట్టణంబయినట్టి పడవీటియందు. ”

పైనిఁ జేర్కొనఁబడిన కాళహస్తీశ్వరుఁడు కృష్ణదేవరాయని వెనుక విజయనగర సామ్రాజ్యమును బరిపాలించిన యచ్యుత దేవరాయల

కాలమువాఁడు (క్రీ. శ. 1530-1542). ఈతఁ డాకాలమునఁ బడవీడును బాలించుచుండిన ట్లీక్రింది శాసనములు తెలుపుచున్నవి :—

ఉత్తరార్కాడు జిల్లా, దేవకీపురమున బృహదంబాదేవి యాలయమున శాసనములు.

శా. శ. 1452 (క్రీ. శ. 1530). పడవీడు తిరుమలేశ్వరుని వసంత మంటప నిమిత్తము భూదానము.

శా. శ. 1452 (క్రీ.శ. 1530). దేవకీపురము దేవాలయము - ధర్మకర్తృత్వము (శ్రీ కాళహస్తి నాయకుఁడు)

శా. శ. 1454 (క్రీ.శ. 1532). ఇందులో స్పష్టముగాఁ గొండమ నాయకు డనువాఁ డా కాలమున గొల్లలను దేవాలయమునకు సేవకై విని యోగించుటకుఁ బడవీడును బాలించుచుండిన కాళహస్తీశ్వర నాయకుని యనుమతిని బొందెనని కలదు.

శా. శ. 1454 (క్రీ.శ. 1532) దేవాలయమునకుఁ బ్రతిమగ్గముపైని 11 పణములు పన్ను కట్టుటకు శాసనము. ఇందు కాళహస్తీశ్వరుఁడు పేర్కొనఁబడినాఁడు.

(E.P. Reports 1913, pages 44, 45 Nos. 364, 374, 373, 377)

పై శాసనముల ననుసరించి లింగకవి యచ్యుత దేవరాయల కాలము వాఁడనుట నిశ్చితము.

కవిత్వము, కావ్యములు: ఈతఁడు శివకవి కావునఁ గృత్యాదిని బండిత త్రయమును, పాల్కురికి సోమనాథుని, పిడుపర్తి బసవేశ్వరుని, శేషయోగీంద్రుని (నాగులూటి శేషనారాధ్యుఁడు - పర్వత పురాణ కర్త), రంగనాథుని స్తుతించియున్నాఁడు. ఈతని కాలము క్రీ. శ. 1530 ప్రాంత మగుటవలన పిడుపర్తి బసవన, శేషయోగీంద్రుఁడు ననువారి కాలములు గూడ స్పష్టముగా దెలిసికొనుటకు వీలు కలుగుచున్నది. ఈతఁడు తన కవిత్వమును గూర్చి:-

" తెనుఁగునకు నెఱవాది ద్విపదకు రాజు "

" వినుత శబ్ద బ్రహ్మ విద్యా నిరూఢి
ఘనత మించిన భద్రకవి లింగ విభుఁడ-
రమణీయ శివకవి రాజన్య హృదయ
కమల మిత్రుఁడు భద్రకవి లింగ విభుఁడు
నెఱయ నాతని కంటె నేర్పరి గలఁడె "

అని తెలుపుకొనినాఁడు. మఱియుఁ గృతిపతి యీతనిఁ బిలిపించి,

" అనఘాత్మ ! సంతోషమయ్యెడి మాకు
మాకులమునకు నీ మహనీయచరిత
శ్రీకరాభరణమై చెలువుదీపించుఁ
గావున దేవాంగ ఘన చరిత్రంబు
వావిరి ద్విపద కావ్యంబుఁ గావింపు.
నగజాధినాథుఁ డున్నతకులదైవ
మగు రామలింగంబు నధిపతిఁజేసి
స్థిరముగాఁ, గీర్తిమందిరముగాఁ బుణ్య
కరముగా, నవరసాకరముగాఁ, జారు
తరముగా, నర్థసుందరముగా, దురిత
హరముగా, జనమనోహరముగా ననుచు "

గ్రంథముసేయు నాజ్ఞాపించెను. ఈ ద్విపదకృతియు నట్లే మనోహరముగా నుండును.

దేవాంగ పురాణము : ఇది యేడాశ్వాసముల ద్విపదకావ్యము. దీనికి మూలము బ్రహ్మాండ పురాణము. ప్రథమాశ్వాసమున దేవాంగ మహర్షి జననమును దేవతా వస్త్రనిర్మాణమును వర్ణితములైనవి. రెండవ యాశ్వాసమునుండి యాఱవ యాశ్వాసము వఱకు నాతఁడు విద్యాధర, పుష్పదంత, బేతాళ, వరరుచి, దివసాళి, దేవరదాసి యవతారముల నెత్తిన కథ వర్ణితము. సప్తమాశ్వాసమున దేవాంగకులమున జన్మము,

తత్కాల ప్రశస్తి చెప్పఁబడినది. దేవరదాసి జైనులను ఖండించి శైవమును బెంపొందించెను. ఈ గ్రంథము చివరఁ గొమరేంద్రుఁడను నొక దేవాంగుని వంశ క్రమము వర్ణితమైనది.

ఈ కృతిలో నింద్రజాల, రస, వైద్యాదివిషయములు పెక్కులు వివరింపఁబడినవి. ఈ గ్రంథము ముమునూరి రామేశ్వరస్వామి కంకితము.

సానంద చరిత్ర : ఇది సానందుఁడను శివభక్తుని చరిత్రమును దెలుపును. మూఁడాశ్వాసముల కృతి. ఇది యరుణాచలమున కుత్తరముననున్న యరుణాద్రి మంగళ మను గ్రామముననున్న వీరభద్రయ్య యను జంగమదేవర కంకితము. ఈతఁడు సంగయదేవర కుమారుఁడు. ఈ ద్విపదరచనమునకును కోట శివరామకవి రచిత పద్య సానందోపాఖ్యానమునకును జాలచోట్లఁ బదసాదృశ్యము గలదు. లింగకవి శివరామకవికంటె ముందువాఁడు కావున, యీతని ద్విపద గ్రంథమే పద్య గ్రంథమునకు మూలమని చెప్ప నొప్పును.

## లింగకవి సానందోపాఖ్యానము - ప్రథమాశ్వాసము

ద్వి. ఫలవిశేషంబులు పరిమళద్రవ్య
కలితోదకంబులు కలవంటకములు
పసమించు చక్కెర పానకంబులును
మిసిమించుకమ్మని మీఁగడ పెరుగు
అరిశలు బూరెలు నతిరసంబులును
కరణమణింగలు గారెలు నమృత
కలశంబులును చంద్రకళలు సేవియలు
అలరుగుత్తులు రసాయన మప్పడములు
పూసనఁబులు నుండ్రములు మంచివెన్న
దోసెలు మీఁగడ దోసెలు వడలు
సారెసత్తులు మేలు జంతిక చుట్లు
పూరణంబులు రసపూర్ణంబులైన
కడియంపుటట్టులు గంగ నురుగులును
కడునొప్పురస ఘటికలును చాపట్లు
లడ్డువంబులు చక్కిలంబులు మఱియు

నిడ్డియల్ మోరుండలివి యాదిగాఁగ
కలపిండివంటలు కమ్మని ఘృతము
నెలకొనివడఁ దీర్చు నీరుమజ్జిగలు
చారపప్పును పాయసములు తేనియలు
చారుతరంబైన శాకపాకములు
.....................కలవు.

## శివరామకవి - పద్యకృతి ప్రథమాశ్వాసము

గారెలు బూరె లిడ్డెనలు కమ్మని దోసెలు చక్కిలంబులున్
చారులు కూరలున్ ఫలరసంబులు తేనెలు పానకంబులున్
సారెలు పాయసాన్నములు చక్కెరలుక్కెర లప్పడంబులున్
పేరిన నేతులున్ చెఱుకు బిళ్ళలు చల్లని నీరు మజ్జిగల్.

సీ. కలవంటకంబులు కజ్జాయములు మనో
హరములు తీయని యానవాలు
మీఁగడ పెరుగు మామిడి పండ్లరఁటిపండ్లు
ఖండశర్కరలు టెంకాయపాలు
పనసపండులు ద్రాక్షపండులు ఖర్జూర
ఫలములు గజనిమ్మపండ్లు దోస
పండ్లు కమ్మని చారపప్పులు గసగసాల్
శీతలోదకములు చెఱుకురసము

భక్ష్యభోజ్య లేహ్యపానీయముల నిట్లు
తృప్తఁ బొందఁజేసి దివ్యవిభవ
మలరఁగొంచు బోయి యర్కజాపుర బహి
ర్ద్వార దేశమందు వారిడించి.

## ౧. దేవాంగ పురాణము

ఈతని గద్యలు :

" ఇదివీరభద్ర మహిష్ఠప్రసాద
విదితసత్కావ్య ప్రవీణధురీణ
సంగమేశ్వరగురు చరణారవింద
సంగతగంధ పుష్పంధయమాన
ఘనయశోనిధి భద్రకవిలింగధీర
వినుతమాధుర్య వాగ్విరచితంబైన
ప్రకటదేవాంగ పురాణంబునందు
నలంకముగ...ఆశ్వాసము య్యె. "

ఈ గ్రంథమునకు వ్రాఁతప్రతి యొకటి గలదు. (మద్రాసు ప్రాచ్య లిఖిత పుస్తకశాల సంఖ్య D. 94)). ఇది క్రీ. శ. 1879 లో నారాధ్యుల వీరేశలింగముగారిచేఁ జెన్నపురిలో ముద్రితమైనది.

## ౨. సానంద చరిత్ర *

"ఇదివీరభద్ర శ్రీ హేలాప్రసాద
సదమలసత్కావ్య సందర్భనకళల
చిరపుణ్యశోభిత శ్రీకాళహస్తి
గురుసంగమేశ్వర కోమలచరణ
జలజాతగంధ పుష్పంధయమాన
కలితమానసభద్ర కవిలింగధీర
విరచితసానంద విమలచారిత్ర
మనదైనధవలతాయతలవిత్రంబు
సకలపవిత్ర మీ సత్కథయందు
నకలంకగతిఁ దృతీయాశ్వాసమయ్యె."

పల్నాటి వీర చరిత్రమునఁ గోళ్ల పోట్లాట యను భాగమును రచించిన మల్లనకవి తల్లిదండ్రులు కూడ అమలాంబ, రామనలే. కాని వారు కౌండిన్య గోత్రులగుటచే లింగకవి తలిదండ్రులు కారని యెఱుంగునది. (ప్రా. సంఖ్య. D. 1112).



*దీనికిఁ వ్రాఁతప్రతులు తొమ్మిది కలవు. (సంఖ్య D. 1164–92) అందు రెం కాగితపుఁ బ్రతులు. తక్కినవి తాళపత్రప్రతులు. ఈ గ్రంథము కూడ క్రీ. శ. 1885 ల నారాధ్యుల వీరేశలింగముగారిచే ముద్రితమైనది. తంజావూరి పుస్తకశాలలో దీ నాలుగు తాళపత్ర ప్రతులు గలవు. సంఖ్య 364–367.

## 2. పచ్చకప్పురపు తిరువేంగళకవి

(క్రీ. శ. 1530-ప్రాంతము)

అచ్యుతదేవరాయల కాలమునఁ బ్రసిద్ధుఁడైన యొక ద్విపద కావ్యకర్త తిరువేంగళకవి. ఈతఁడు భట్టుకులజుఁడు. మనకుఁ దెలిసి నంతవఱకు భట్రాజులలో నితఁడు మొదటి కవి యని చెప్పవచ్చును. ఈతఁడు రచించిన చొక్కనాథచరిత్ర యను గ్రంథమున నీతని వంశ వృత్తాంత మిట్లు కలదు:

కృతిపతి యీతనిఁ గూర్చి ప్రస్తావించుచు:

"అనఘుండు మీ తాత యగు తిమ్మరాజు
తన తమ్ముఁ డయ్యలు దాను నిమ్మహినిఁ
బ్రౌఢుఁడై చదువులఁ బరఁగ మెప్పించె
ప్రౌఢ రాయలచేతఁ బచ్చ కప్పురము
రాజనఁగా దిమ్మరాజుకుఁ దిప్ప
రాజుదయించె విరాజితమ్ముగను
రాజుల మెప్పించె రసికుఁ డాతని త
నూజుఁ డవార్య సన్నుత కవీంద్రుఁడవు"

అని చెప్పినాఁడు. తిరువేంగళుని తండ్రి తిప్పరాజు. అతని తండ్రి యగు తిమ్మరాజును నాతని తమ్ముఁ డయ్యలరాజును దమ విద్యా విశేషముచేఁ బ్రౌఢదేవరాయలను మెప్పించి, పచ్చ కప్పురము బహుమతిగాఁ బడసిన నాఁటినుండియు పేరు పచ్చ కప్పురము వారైరి. ఈ ప్రౌఢదేవరాయలు క్రీ. శ. 1422 నుండి 1446 వఱకు విజయనగర సామ్రాజ్యమును బాలించిన యిమ్మడి దేవరాయలు కాఁదగును. మనుమఁడు క్రీ. శ. 1538 ప్రాంతమున నుండుటచే, తాత క్రీ. శ. 1450-60 ప్రాంతముననుండుట విరుద్ధము కానేరదు.

కాలము : తిరువేంగళకవి తన చొక్కనాథ చరిత్రను "నన్నా వందలి" పురాధ్యక్షుఁడగు గోళ్ల పెద్దరామనాయకునికిఁ గృతిగా రచించెను. ఈతఁడు గోళ్ల చిన్న రామనాయకుని యన్న. అన్న దమ్ము లిరువురును నచ్యుతదేవరాయ ప్రతాప కార్య ధురంధరులై దక్షిణ దేశమున రామనాథపురము జిల్లాయందలి తిరుపత్తూరి సీమను బరిపాలించు చుండెడివారు. వీరు కమ్మ కులస్థులు; బసవనాయకునికిఁ దిప్పమ్మ వలన జన్మించినవారు; పిప్పాలగోత్రులు; సుప్రసిద్ధ మధ్వ మతా చార్యుఁడగు వ్యాసతీర్థుని శిష్యులు. వీరికి ఉపనూరి సింహాములను బిరుదు కలదు. వీరిలో గోళ్ల పెద్ద రామనృపాలుఁడు అచ్యుతదేవ రాయల పుణ్యమునకై శా. శ. 1460 (క్రీ. శ. 1538 లో) విళంబి సంవత్సర దక్షిణాయన పుణ్యకాలమున తిరుపత్తూరు నందలి తిరుత్తళి నాయనారు దేవాలయమునకు శాంత మంగళ మను గ్రామమును దాన మొసర్చి శాసనము వేయించినాఁడు.[1] మఱియు నీ పెదరామనృపాలుఁడు (రామప్పయ్యనాయని వారని వ్యవహారము) సదాశివరాయల కాలమునఁ గూడ నున్నట్లు వేఱొక శాసనమువలనఁ దెలియుచున్నది. ఈతఁడు శా. శ. 1472 (క్రీ. శ. 1550) సంవత్సరమున తిరునల్వేలి జిల్లా అంబ సముద్రము తాలూకా బ్రహ్మదేశమను గ్రామమును కైలాసనాథ నాయినారను దేవునకు సమర్పించి యొక శాసనము వేయించియున్నాఁడు.[2]

గోళ్ల చిన్నరామప్పయు, నాతని యన్న పెద తిమ్మయ్యయుఁ దిరుపతి వేంకటేశ్వరునికిఁ దిరువీధి యుత్సవముల నిమిత్తము 15,000 పణములు శ్రీ భాండారమున కర్పించినట్లు తిరుపతిలో శాసనము గలదు. ఈ శాసన కాలము శా. శక. 1462 శార్వరి (క్రీ. శ. 1540). [3]ఈ శాసన కాలమునఁ జినరామప్ప రామనాడు జిల్లానుండి చంద్రగిరి రాజ్యమునకు నాయకుఁడుగా మార్పఁబడెనని నివేదికయందు సూచింపఁ బడినది.

1. (E. P. 1790 of 35-36).
2. (A R 373 of 1916).
3. (Epigraphical Report of T.T. Devasthanams-Pages 244-245)

దీనిఁ బట్టి తిరువేంగళకవి క్రీ. శ. 1530 ప్రాంతమున నున్నటుల స్పష్టమగును.

చొక్కనాథ చరిత్రమున నీ క్రింది పంక్తులు పై వాని కాధారములు:

“ చెలఁగుచు నుపనూరి సింహంబు పేరఁ
బురుషోత్తమధ్యాన పూర్ణాత్ము పేరఁ
దగుగోళ్ళ బసవేంద్రు తనయుని పేర
సుగుణాఢ్య పరసతీ సోదరు పేర
ఘనత స్వామి ద్రోహ గండని పేరఁ
జినరామ విభునికి జ్యేష్ఠుని పేర
దీపించు నచ్యుత దేవరాయ ప్ర
తాప దక్షిణ బాహు దండాంకు పేరఁ
జతురత నీ కావ్య సారంబునకును
బతియైన పెదరామపార్థివు పేర ”

“ అరుణాచలేంద్ర పూజామోద విభవ
ధరమించు నన్న నందలి పురాధ్యక్షు
ప్రియబంధు వనచైత్ర పిప్పాల గోత్ర
దయసత్య దాక్షిణ్య ధర్మ స్వరూప
తగ మించు వ్యాస తీర్థ ప్రియశిష్య
సుగుణాఢ్య పరసతీ సోదర చరిత
అయతోన్నత బాహ యచ్యుత దేవ
రాయ ప్రతాప కార్య ధురంధరుండ
అంచిత కోదమనాయంకర గండ
మించి వర్తించు స్వామి ద్రోహగండ
చేకొన్న నుపనూరి సింహద్భుజాంక
కాకిటి చిన్న భూవర సహితుండ
బసవ భూవర తనుః ఫలసత్కుమార
వసుధఁ గల్గిన తిమ్మ వంశ వర్ధనుఁడ
బాగొప్పఁ దిప్పమాంబాదేవి గర్భ
సాగర సంభవ సంపూర్ణ చంద్ర
చిరకీర్తి యుతుఁడైన చిన్నరామప్ప
పురుష రత్నంబనఁ బొగడంగ విలచి
విలసిల్లు పెదరామ విభవసుత్రామ. ”

చొక్కనాథ చరిత్ర తొమ్మిది యాశ్వాసముల ద్విపద కావ్యము. ఇది స్కాందమున, మధురా ఖండమున, హాలాస్య క్షేత్రమున వెలసిన సుందరేశ్వరుని (చొక్కనాథుని) యఱువదినాలుగు లీలలను దెలుపు హాలాస్యక్షేత్ర మాహాత్మ్యమునకుఁ దెలుఁగు కృతి. దీనికి చౌషష్టి లీలా విలాసమను పేరుకూడఁ గలదు. ఆ చౌషష్టి లీలల వివరముల నీ క్రింద నిచ్చుచున్నాను *

తిరువేంగళకవి చెయ్యేటి దరిని (బాహుదానదీతీరమున) వెలసిన ఓరుగంటమ్మను, ఏకవీరాదేవిని స్తుతించినాఁడు. కవి స్తుతిలో:

“ బిరుదు వేములవాడ భీము నన్నయను
అరయఁ దిక్కన నెఱ్ఱనార్య శ్రీ నాథు
నిలఁగల్గు కవులను నెల్ల సద్భక్తి ”

వినుతించినాఁడు. ఈతఁ డల్లసాని పెద్దనకు సమకాలీనుఁడగుటచే నాతని నుతింపలేదు. ఈ తరువాతి కవులు పెద్దనను బెద్దగా స్తుతిం

---

* 1. వృత్రాసురుని జంపినందువలన యింద్రునకుఁ జుట్టుకొన్న బ్రహ్మహత్యా పాతకమును శివుఁడు పోఁగొట్టుట. 2. ఐరావతమునకుఁ గల శాపమును నివారించుట. 3. కదంబవనమున మధురాపురిని ప్రతిష్ఠించుట. 4. తటాతకా లేక మీనాక్షీదేవిజననము. 5. మీనాక్షీ సుందరేశ్వరుల వివాహము. 6. సుందరేశ్వరుఁడు వ్యాఘ్రపాదునికి పతంజలికి తన నాట్యకౌశలము చూపుట. 7. గుండోత్తరుని కపరిమితాహారమును జీర్ణించుకొను శక్తి నిచ్చుట. 8. పర్వతమంత యెత్తుగల యన్నరాశిని గుండోత్తరునికిఁ జూపుట 9. ఏడు సముద్రములను నొకదగ్గఱ చేర్చుట. 10. మలయధ్వజుఁడు స్వర్గంబునుండి వచ్చు నవకాశము కల్పించుట. 11. ఉగ్రపాండ్యుని జననము. 12. సుందరేశ్వరుఁ డుగ్రపాండ్యునకు నాయుధమును నొసఁగుట. 13. శక్తివలన సముద్రమును తఱిమి వేయుట. 14. ఇంద్రుని కిరీటమును దీసికొనుట. 15. మేరు పర్వతమునుండి బంగారముఁ దెచ్చుట. 16. ఋషులకు సుందరేశ్వరుఁడు వేదార్థము నెఱింగించుట. 17. రాజునకు వజ్రముల నొసఁగుట. 18. సముద్రోదకములను మేఘములు త్రాగునట్లు చేయుట. 19. మేఘముల ఖండముగా వర్షించునపుడు వాని నడ్డుపెట్టుట. 20. సుందరేశ్వరుఁడు సిద్ధునివేషము వేయుట. 21. రాతి యేనుగుచే చెఱకు గడలు నమలించుట. 22. దిగంబర జైనుల కృత్రిమకుంజరమును సంహరించుట. 23. బ్రాహ్మణ కన్యకకు వరమిచ్చుట. 24. అనేకాద్భుతకృత్యము లొనరించుట. 25. బ్రాహ్మణ స్త్రీ వధ నడ్డగించి యామెను రక్షించుట. 26. దుష్టుఁడగు బ్రాహ్మణుని క్షమించుట. 27. మల్లయుద్ధమున జయమందుట. 28. జైనులు పంపిన మహోరగమును సంహరించుట,

చిరి. కాని కృష్ణరాయ యుగమున కవులెవ్వరు నీతని స్మరింపలేదు. తిరువేంగళకవి గద్యలోఁ జెప్పుకొనినట్లుగా, నీతని కవితయుఁ బచ్చకప్పుర సౌరభ్యమును గుబాళించుచున్నది.

> " ఇది సర్వ ఘనసత్కవీంద్ర పాదాబ్జ
> విదితపూజామోద విమలుండు. పచ్చ
> కప్పుర సౌరభ్య కలితనామాంక
> తిప్పరాజు సుపుత్ర తిరువేంగళేంద్ర
> విరచితంబుగ లోక విఖ్యాతమైన
> సరస లక్షణ కావ్య సత్కవీంద్రాభి
> నందిత శ్రీ చొక్కనాథ చరిత్ర
> మందును నిది నవమాశ్వాస మయ్యె "

హాలాస్య మాహాత్మ్యమును దెలుఁగులోఁ జెప్పుటకుఁ దిరువేంగళకవియే తొలివాఁడు. ఈ ద్విపదకృతి వెలసిన తరువాత 18,

---

29. జైనుల కృత్రిమపు గోవును వధించుట. 30. పాండ్య సేనానాయకునికి, అసంఖ్యాకములైన సైన్యములను కనఁబఱచుట. 31. పాండ్యరాజునకు నిధి నిక్షేపములు బహుమతిగా నొసఁగుట. 32. గాజుల వర్తక వేషము ధరించి వైశ్యవాడలో స్త్రీలకు గాజులు తొడిగి, వారల గర్భవతులుగ నొనరించుట. 33. యక్షకన్యలగు నా స్త్రీలకు అష్టసిద్ధుల నొసఁగుట. 34. చోళులకు ద్వారములు తెఱచుట. 35. పాండ్యరాజుపై వేడినీరును పోయుట. 36. పుష్పవాటికలో బంగారముచేయు విద్య ప్రదర్శించుట. 37. చోళరాజును జయించుట. 38. ఎల్లప్పుడు నిండుగానుండు నొక బియ్యపుసంచి నొక సిద్ధున కిచ్చుట. 39. వ్యాసుని కుమారునకు జయము నిచ్చుట. 40. పాండ్య రాజునకు గలిగిన బ్రహ్మహత్యాదోషమును నివారించుట. 41. సుందరేశ్వరుఁడు కట్టెలను మోయు భారము వహించుట 42. చేరరాజునకు నుత్తరములు పంపుట. 43 భద్రునకు వజ్రసింహాసన మిచ్చుట. 44. భద్రుని భార్యకు విజయము చేకూర్చుట. 45. అడవి పందిపిల్లలకు పాలిచ్చి సాకుట. 46. ఆ పందిపిల్లలకు మంత్రిత్వ మొసఁగుట. 47. భారద్వాజ పక్షికి కాకులపై విజయము సమకూర్చుట. 48. నీటి కాకికి ముక్తి ప్రసాదించుట. 49. మధురాపట్టణపు సరిహద్దులను నిర్ణయించుట. 50. శివుని పేరిట చోళరాజును జయించుట. 51. మధురరాజు నాస్థానమునందు " సంగమ కవీశ్వరులు " కూర్చుండు " శంఖపీఠము " ప్రతిష్ఠించుట. 52. స్వరచితపద్యమును బ్రాహ్మణున కొసఁగుట.

19, 20 శతాబ్దములలో దీనికిఁ బద్య గద్యాత్మకకృతులు వెలసినవి. మైసూరు దొడ్డరాజు దళవాయి యగు కెళువె నంజరాజు దీనిని వచన కావ్యముగ రచియించి యున్నాఁడు. మల్లంపల్లి బుచ్చికవీంద్రుఁడును, వెంకటగిరి సంస్థానమునఁ దిరుమలసెట్టి జగన్నాథ కవియు, శ్రీ 'కళా ప్రపూర్ణ' జనమంచి శేషాద్రి శర్మయుఁ బద్యకావ్యములుగ రచించిరి. పై వానిలో వచన కృతిమాత్రము ముద్రితము కాలేదు.

ఇందలి శైలిఁ దెలుపుటకుఁ గొన్ని పంక్తుల నుదాహరించు చున్నాను,

" ద్వి. ఘనమైన యొక మహా కమలాకరంబు
ఫురణింప వైకుంఠపురమునుఁ బోలె
నరుదైన వేడ్క శ్రీ హరి యుక్త మగుచుఁ
గమలనాభుని దివ్యకరములఁబోలె
రమణీయ శంఖ చక్ర స్థిత మగుచు
సన్నుత విహగేంద్ర చరితంబుఁ బోలె
పన్నగ గజ కచ్ఛపంబులు గలిగి
వినుతింప దేవేంద్రు వీడును బోలె
యనిమిషాహార విహారంబుగలిగి
ప్రకటిత నక్షత్ర పథమునుఁబోలె
మకర కర్కట మీన మండలి గలిగి
యనుపమ రాజ చిహ్నంబులఁబోలె

---

53. నక్కీరుని సంరక్షించుట. 54. నక్కీరునకు ద్రావిడసూత్రముల ననుగ్రహించుట. 55. కవీశ్వరుల రచనలను పరీక్షించుట. 56. సుందరేశ్వరుఁడు ఉత్తరహాలాస్యక్షేత్ర మునకుఁ దరలుట. 57. జాలారి కన్యను వివాహమాడుట. 58. వాతప్రకీశ్వరుని సంస్థాపించుట. 59, నక్కలను గుఱ్ఱములుగా మార్చి మాణిక్యవాచకుని కిచ్చుట. 60. వైగ నదియందు వరదలు కల్పించుట. 61. పిట్టవ్వకై మట్టితట్టలు మోయుట. 62. కూని పాండ్యునకు జ్వరమును గూనిని పోఁగొట్టుట. 63 కఱ్ఱశూలములతో జైనులను సంహరించుట. 64. జమ్మిచెట్టుక్రిందనున్న లింగములను సాక్షులుగా నొనరించుట.

ఘనతర పుండరీకంబులు గలిగి
యమృతాబ్ధి మథన విహారంబుఁబోలె
రమణీయ సుమనసరాగంబుఁ గలిగి
దారుణంబైన కాంతారంబుఁబోలె
సారంగ పటల సంచారంబుఁ గలిగి
యరుదైన శైల గహ్వరములఁ బోలెఁ
దిరముగాఁ గేసరోదీర్ణంబు గలిగి
మహనీయ పుణ్యాశ్రమంబునుబోలె
నహరహంబును మేటి హంసలు గలిగి
కలిత భూపాంగనా కరములఁబోలె
పొలుపొందఁ గంకణ స్ఫురణంబుఁ గలిగి
జన నుతంబగు దివ్య శరధియుఁబోలె
మునుకొని బహు శిలీ ముఖములు గలిగి
కడునుత్త మాశ్వ లక్షణములుఁబోలె
వడిమించు ఘనతరావర్తమ్ము గలిగి
చెన్నొందు నాసరసీరుహా కరము.” —చొక్కనాథచరిత్ర*

---

*ఈ గ్రంథము మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తకశాలవారిచే సంపూర్ణముగ, ముద్రితమైనది. (సంఖ్య - 25 - 1954)

చొక్కనాథ చరిత్రకుఁ బ్రాచ్యలిఖిత పుస్తకశాలలో మూఁడు ప్రతులు గలవు 1. కాగితము, 2. తాళపత్రములు.

**D. 1051** సంఖ్యగల వ్రాఁతప్రతియందు బ్రౌనుదొరవారీ గ్రంథమును గూర్చి యీ క్రిందిరీతిని వ్రాసియున్నారు.

“This is a collection of 64 Tales or Legends (లీలలు) intended to describe the miracles or pranks of the God Siva. — It pretends to be translated from Sanskrit. It is also met with in Tamil. The Telugu style is low and easy enough.”

**D. 1053** సంఖ్యగల వ్రాఁతప్రతి, ఆరాధ్య కులశేఖరుఁడు శరభేశ కృపగల సత్కవీంద్రుఁడు, ఏగంటి పెదసోమయ్య కుమారుడు సోమన, కీలక శ్రావణ బ॥ ౧౩ నాఁటికి పెడిపాటి రాచయగారికొఱకు వ్రాసెను.

# తంజాపురాంధ్రవాఙ్మయము

క్రీ. శ. 1565 లో నననఁగా బదునాఱవ శతాబ్ది మధ్యమున విజయ నగర సామ్రాజ్య విచ్ఛిత్త్యనంతరము, చిరకాలమునుండి దాక్షిణాత్య రాజ్యములని పేరెన్నికగన్న పాండ్య చోళరాజ్యము లాంధ్ర వాఙ్మయ మునకుఁ బట్టుఁగొమ్మ లయినవి. ఆంధ్రసాహిత్యాభివృద్ధి కనుకూలము లగు పరిస్థితు లేర్పడినకతన - తంజావూరు - మధుర - పుదుక్కోట - సేలము - మైసూరు మున్నగు రాజ్యాస్థానము లాంధ్రవాఙ్మయ రంగము లైనవి. అందు తొలిరంగమగు తంజావూరిని క్రీ. శ. 1535 మొదలు క్రీ. శ. 1673 వఱకుఁ బరిపాలించిన నాయకరాజుల కాలమున నాంధ్ర వాఙ్మయ మెంతేని యభివృద్ధిగాంచినది.

నాయకరాజుల వెనుక క్రీ. శ. 1674 నుండి క్రీ. శ. 1850 వఱకును మహారాష్ట్రరాజులు తంజాపురమును పరిపాలించిరి. వారును ప్రాంతీయ మైన తమిళభాషనుగాని, తమ మాతృభాషమైన మహారాష్ట్రభాషను గాని యాదరింపక సంస్కృతమును, నంతకంటె విశేషముగ తెలుఁగు భాషను బోషించి తమ పేరు వాఙ్మయచరిత్రలో శాశ్వతముగ నిలుపు కొనిరి కాబట్టి యీ తంజాపురాంధ్రవాఙ్మయమును రెండు యుగములుగ విభజింపవచ్చును: 1. నాయకరాజులయుగము, 2. మహారాష్ట్రరాజుల యుగము. ఈ రెండింటిలోఁ గాలక్రమమున మొదటిది నాయకరాజుల యుగము.

## నాయకరాజ యుగము

తంజావూరను పేరుతో వెలయు నాయకరాజ్యమును సంస్థాపకుఁడగు చినచెవ్వప్పనాయకుఁడును, నావెనుక నాతని కొమరుఁడగు నచ్యుతప్పనాయ కుఁడును క్రీ.శ. 1614 వఱకుఁ బరిపాలించిరి. అచ్యుతప్ప నాయకుని వెనుక రాజ్యమునకు వచ్చినవాఁడు తంజాపురాంధ్ర నాయక రాజశిరోమణి రఘు నాథనాయకుఁడు. ఈతఁడే తంజావూరి రాజ్యమునఁ దొలుత దక్షిణదే శాంధ్రవాఙ్మయమునకు శ్రీకారము చుట్టిన రాజకవి. కాఁబట్టియే యీ వాఙ్మయ యుగము పదునాఱవ శతాబ్దినుండి ప్రారంభమైన దనవచ్చును.

## తంజావూరి నాయకరాజుల వంశవృక్షము




(రఘునాథ నాయకాభ్యుదయము పీఠిక 11 పుట.)

ఈ నాయకరాజుల పాలనమున వర్ధిల్లిన వాఙ్మయ యుగమునకే నాయకరాజ యుగమని పేరు.

# నాయక రాజయుగము

## రఘునాథ నాయకుఁడు

దక్షిణ హిందూదేశ సారస్వత చరిత్రమునఁ గృష్ణదేవరాయల వెనుక రఘునాథ నాయకుఁడు మిక్కిలి ప్రసిద్ధుఁడు. ఇతఁడు కృష్ణదేవరాయలవలె, మహాపరాక్రమశాలియై, సంగీతసాహిత్య విద్యావిశారదుఁడై, కవిపండిత పోషకుఁడై, కృతికర్తయై, కృతిభర్తయై తెనుఁగు వారికిఁ జిరస్మరణీయుఁడైన నాయకరాజు-విజయనగరమున కృష్ణరాయల నాఁటి వైభవము, తంజాపురమున మఱి నూఱేండ్లకుఁ బునరుద్ధరణముఁ జెందినది. వారిరువురి చరిత్రలలో నీ క్రింది సమానాంశములను గమనించితిమేని, కృష్ణదేవరాయలే రఘునాథరాయలై తిరిగి జన్మించెనా యను నూహ కలుగక మానదు.

| కృష్ణరాయలు | రఘునాథరాయలు |
|---|---|
| అల్లసాని పెద్దన మనుచరిత్ర | చేమకూర వెంకటకవి విజయ విలాసము |
| భువన విజయసభారంగము | [1]విజయభవన సభారంగము |
| తిమ్మరసు మంత్రి | గోవింద దీక్షితుఁడు |
| ఆముక్తమాల్యద తెలుఁగుకృతి | వాల్మీకి చరిత్ర రామాయణాది బహుకృతులు |
| మదాలస చరిత్రాది సంస్కృత కృతులు. | భారత సంగ్రహాది బహుకృతులు |
| వైష్ణవ మతాభి నివేశము పరమత సహనము | వైష్ణవమత ప్రవిష్టత – పరమత సహనము |
| సంగీత విద్యాభిజ్ఞత | [2]సంగీత శాస్త్ర వైదుష్యము– శాస్త్ర గ్రంథ కర్తృత్వము |

---

1. విజయ విలాసమను నీ సభా భవనమున, రఘునాథరాయలు నేపాళ చోళగుల జయించిన వెనుక, కృతినిచ్చి యుండుటచే వేంకట కవి భావస్ఫోరకముగఁ దన రచనకు విజయ విలాసమను పేరు పెట్టియున్నాఁడు.

2. కృష్ణదేవరాయఁడు సంగీత విద్యా ప్రవిష్టుఁడు. బండారు లక్ష్మీనారాయణ యను కవీశ్వరుఁడు "సంగీత సూర్యోదయము" అను సంగీత శాస్త్రగ్రంథమును సంస్కృతమున రచియించి రాయలకుఁ గృతిగానిచ్చి యున్నాఁడు. మఱియు రాయలు మధ్వయతి శ్రీ కృష్ణాచార్యుల వారి యొద్ద వీణావాదనము నేర్చెను. రఘునాథుఁడు ప్రవీణుఁ డనుట (ప్ర – వీణ) సార్థకమే.

శ్రీకృష్ణరాయల కాలమునకంటె, రఘునాథనాయకుని కాలమునఁ గవయిత్రులు పెక్కురు విలసిల్లిరి. వారిలోఁ దొలుతఁ బేర్కొనఁదగినది రామభద్రాంబ.

# రామభద్రాంబ

సాహితీ భోజుఁడగు తంజావూరి రఘునాథరాయని కాలములో (క్రీ. శ. 1614-1633) విలసిల్లిన ప్రఖ్యాత కవయిత్రి రామభద్రాంబ. ఈమె రచించిన గ్రంథములలో సంస్కృతమున "రఘునాథాభ్యుదయము" అనునది మాత్రము లభ్యమై ప్రకటితమైనది. (మదరాసు విశ్వవిద్యాలయము - ప్రాచ్య పరిశోధనాలయము - సంస్కృతశాఖాప్రచురణము - సంఖ్య 2) తెలుఁగుగ్రంథము లేవియు లభింపలేదు. అయినను నీమె తెలుఁగు కవయిత్రి యని విజయరాఘవనాయకుని కాలముననున్న చెంగల్వ కాళకవి రచితమైన రాజగోపాల విలాసమునందలి యీ క్రింది పద్యమువలనఁ దెలియుచున్నది. విజయరాఘవనాయకుఁడు కాళకవి కవిత్వమును బ్రశంసించుచుఁ జెప్పిన పద్యము:

సీ. ఘుటికాశతగ్రంథ-ఘటనోత్కట నవీన, పాండిత్యగరిమలు-భళి యనంగ
నోష్ఠ్యనిరోష్ఠ్యాది - శోద్దామ రసగర్భ, సందర్భ మానని-సన్నుతింప
మాకందమంజరీ-మధుఝరీ మాధుర్య, రచనావిశేష మా-రా యనంగ
పరిహృతేతరయుక్తి-భాగ నూతనకథా, చాతుర్య ధుర్యత-సన్నుతింప

గీ. అయ్యె దినముల "రామభ-ద్రాంబ" వారు
నేఁడు "కృష్ణాజి" కవితచే-నేర్పు మెఱసి
కవితసేయుట లెల్ల మీ-ఘనత గాదె
కవివినుతచర్య! చెంగళ్వ-కాళనార్య!

(రాజగోపాల విలాసావతారిక ముద్రితము.)

పై పద్యమువలనఁ జెంగల్వ కాళకవి రామభద్రాంబ గురువనియు, నామె యాతని యనుగ్రహామువలననే తెలుఁగు కవిత్వము చెప్ప నేర్చినదనియు మనము గ్రహింపవలయును. తెలుఁగున నీమె కవిత్వము నెఱుంగుటకు నీమె కవితాగోష్ఠిలో రఘునాథుని యాస్థానమునఁ బూరించిన సమస్య యొక్కటియే కన్పట్టుచున్నది. సంస్కృత కవిత్వమం దీమె యతిప్రాసలు మొదలగు నాంధ్రకవితా ప్రత్యేక లక్షణములను బాటించుటచే నీమె తెలుఁగు కవయిత్రియేయని చెప్పనగును. మచ్చునకు,

కటాక్షజాతాః – కరుణా రసోన్మయే, నకేవలం తే – నతతాపహారిణః,
ప్రవర్ధయంతే – ఫలభార సంగతః, సమస్త సంప – ల్లవలీశ్చ సంతతమ్.

ఏకాదశసర్గము శ్లో. 72.

దళత్ప్రసూనాంకిత – దామసౌగభీ, ర్మిళన్మి ళిందారవ – మేదురోదరామ్,
సలీలలాస్యాక్రమ – చంక్రమోచిత ప్రకష్టకర్పూర పరాగ భాసురామ్.

ద్వాదశసర్గము శ్లో. 3.

ఈ రఘునాథాభ్యుదయ కావ్యమున సుగృహీతనాముఁడగు తంజావూరి రఘునాథనాయకుని చరిత్రము వర్ణితమైనది. రాజాస్థానమున రాజసన్నిధానమున మెలఁగిన విద్వత్కవయిత్రి రచన మగుటచేఁ గేవల సాహిత్య విషయముననేకాక చారిత్రకముగఁగూడ నీ గ్రంథ ముపాదేయమైనది. కావుననే విజయనగర సామ్రాజ్య చరిత్రకారులు, తమ చారిత్రకసాధనములలో నీ గ్రంథము నొక ముఖ్యాధారముగ క్రీ. శ. 1917 లో గుర్తించిరి. (Sources of Vijayanagar History. S.K. Iyengar. 1917).

ఈ సంస్కృతకావ్యమునఁ బండ్రెండు సర్గలు కలవు. ప్రతీసర్గాంతముసను నొక గద్యగలదు. ఇందులో 900 శ్లోకములు గలవు. తృతీయ, దశమైకాదశ సర్గాంతములలో శార్దూల వృత్తములు, మాలినియు, ద్వాదశమున స్రగ్ధరయుఁ గలవు. తక్కిన భాగములయందెల్ల రఘువంశమునందువలె నొకే వృత్తము వాడఁబడినది. ఇదియు రఘునాథుని చరిత్రమే యగుటచే రామభద్రాంబ రఘువంశము నాదర్శముగఁ గొని యుండును.

రఘునాథాభ్యుదయము. సర్గలవిషయములు : ప్రథమసర్గ-చోళ దేశ వర్ణనము, 2. తంజాపుర వర్ణనము, 3. రఘునాథనాయక వర్ణనము, 4. రఘునాథుని దినచర్య - కమలావిలాసము, 5. సభా వర్ణనము, 6. రఘునాథుని వంశావళి, 7. రఘునాథుఁడు, యువరాజు, వివాహము, తుండీరదేశజయము, 8. చోళగుని జయము, 9. నేపాళ (జాఫ్నా) జయము, 10. పాండ్యరాజుల జయములు, 11, 12. రఘునాథరాయని కాలమున స్త్రీ విద్య-స్త్రీల సంస్కారము, సంగీతవిద్య, రావణహస్తము, నాటకరచన, రాగములు, నృత్యములు, వాని విశేషములు చెప్పఁబడినవి. ఈ సర్గలన్నియుఁ జదువఁదగినవి.

ఇందలి గద్య :

" ఇతి శ్రీ రామభద్ర కరుణాకటాక్ష లబ్ధ సారస్వత ప్రవర్ధమాన శతలేఖినీసమ సమయ లేఖినీ యాష్టభాషాకల్పిత చతుర్విధ కవితాను ప్రాణిత సాహిత్య సామ్రాజ్య భద్రపీఠారూఢ రామభద్రాంబా విరచితే రఘునాథాభ్యుదయే ప్రథమస్సర్గః "

ఇట్లే తక్కిన సర్గలయంతములందును గల గద్యల నూహించుకొనునది.

ఈ క్రింది సమస్యను రామభద్రాంబ యాశువుగాఁ బూరించినది. సమస్యా సందర్భము విద్యాగోష్ఠిలోఁ జూడనగును.

" కింతే సంతాన పాదపాయంతే "
కతికతినః క్షితిపతయః
కింతే రఘునాథ నాయకాయంతే,
భువి బహవః కిల తరవః
కింతే సంతాన పాదపాయంతే.

రసవత్కవితా సామ్రాజ్య భద్రపీఠాదిరూఢ యగు రామభద్రాంబకావ్యము తెలుఁగు భాషలోనికి ననువదించిన నామె వైదుషీ విశేష మింకను బ్రస్ఫుటము కాఁగలదు.

# మధురవాణి

రఘునాథనాయకుని కాలమున విలసిల్లిన కవయిత్రులలో మధుర వాణి మకుటమని చెప్పనొప్పును. ఈమె సంస్కృతమున రచించిన రామాయణ కావ్యము సుందరకాండమువఱకు 14 సర్గలుగల భాగము లభించినది. తెలుఁగున నీమె రచించిన కృతులు లభింపలేదు. కాని యీమె సంస్కృత ప్రాకృతాంధ్ర భాషలలోఁ బ్రఖ్యాత కవయిత్రియై రఘునాథ భూపాలునిచే స్వర్ణాభిషేక మహాగౌరవము నొందిన దని యీమె గద్యములవలనఁ దెలియుచున్నది.

తత్తాదృక్ ఘటికార్ధ నిర్మిత శతశ్లోకీ ఫణిగ్రామణీః,
వాణీ ప్రాకృత శాస్త్ర నైపుణ సమున్మీల ద్యశః శ్రీ జుషా,
దివ్యోద్యన్మతి సఖ్యయా మధురవాణ్యాంబాఖ్యయా నిర్మితే
శ్రీ రామాయణసార కావ్యతిలకే సర్గస్తృతీయో భవేత్.
ప్రస్తారాభి నవాత్త వృత్త కవితాధాటీ కథాశుక్రియా,
షడ్భాషారచనా విశేష బహుధా విఖ్యాత కీర్తి శ్రియా,
దివ్యోద్యన్మతి ... ... ... ...
... ... ... సర్గస్తురీయో (సమస్యా) గమత్.
వీణా వాదకళా వినోద సమయే ధృత్వా సమస్యాః శతం,
సద్యస్సంసది సాధుపూర యతయా దత్తా కవీంద్రైస్తయా,
దివ్యోద్యన్మతి ... ... ... ...
... ... ... సర్గోఽభవత్పంచమః,
ప్రఖ్యాతార్జవ యా పదార్థగమక వ్యాఖ్యాన పక్షౌన్వయ
ప్రాగల్భ్యస్ఫుద నైషధ ప్రతివిధాసానంద సూరీంద్ర యా,
దివ్యోద్యన్మతి ... ... ... ...
... ... ... సర్గోఽత్రషష్ఠోఽభవత్,
సద్యోవిస్మయకృన్నిరోష్ఠ్య కవితా సందర్భ ధారాసుధా
సారోర్మి పరిపూరిత శ్రుతి సుధీ సంభావితాభిఖ్యయా,
దివ్యోద్యన్మతి ... ... ... ...
... ... ... సర్గోఽజనిష్టాష్టమః.
మాధుర్యైకధురంధరాంధ్రకవితా నిర్మాణ సమ్మాన్యయా,

దీవ్యోద్యన్మతి సఖ్యయా మధురవాణ్యంబాఖ్యయా నిర్మితే,
శ్రీ రామాయణ సారనామని మహాకావ్యేతి భవ్యేసుధీ,
షడ్గోల్లాస విశేషధామ్ని నవమస్సర్గో మనోజ్ఞోఽభవత్.
మూర్తిస్తవ్య కుమారసంభవ మహాకావ్య ప్రతిగ్రన్థన,
ప్రాగల్భ్య ప్రకటక్రియా పదపదః ప్రఖ్యాతవైదుష్యయా,
దీవ్యోద్యన్మతి ... ... ... ...
... ... ... దశమస్సర్గోఽత్ర కావ్యేఽభవత్.
ప్రౌఢ శ్రీ రఘునాథ నాయకకృత స్వర్గాభిషేకక్రియా,
దీవ్యోద్యన్మతి సఖ్యయా ... ... సర్గస్తథైకాదశః.

రఘునాథుఁడు రచించిన తెలుఁగు రామాయణము నాతని యాస్థానములోని విదుషీమణులు పఠించుచుండఁగా నొకనాఁ డాతఁడు "తన యాంధ్ర రామాయణమును సంస్కృతీకరింపఁగల కవయిత్రు లెవ్వ రైనఁ గలరా?" యని ప్రశ్నించెనఁట. ఆ ప్రశ్నకు జవాబుగా శ్రీరామ చంద్ర మూర్తియే రఘునాథునికి స్వప్నములో దర్శనమిచ్చి యిట్లు చెప్పెనఁట.

చతుర మధురవాణీం సమ్యగాకర్ణయస్యాః
సదసి మధురవాణీ నామదత్తం త్వయైవం
సరస కృతివిధాయాం సాధుమేధా విశేష
స్వధిక పటురశేషా స్వంబుజాక్షీషు సైషా.

"నీకు మధురవాణి యను బిరుదముపొందిన మేధావతి, సరస కృతి నిర్మాణ నైపుణిగల కవయిత్రి గలదు. ఆమెచే నీ గ్రంథము రచితమైన దివ్యముగ నుండు"నని చెప్పి యంతర్హితుఁ డయ్యెను. రఘు నాథుఁడును నామెను బిలిపించి రామాయణమును సంస్కృతీకరించుట కాజ్ఞయొసఁగెను.

రఘునాథుని రామాయణముకూడ మనకుఁ బూర్తిగ లభ్యము కాలేదు. గ్రంథాదినుండి నాలుగాశ్వాసములదాఁకఁ గల గ్రంథము దొరకుచున్నది. (రఘునాథ రామాయణము అను పేరఁ బ్రకటిత

మైనది. ఆంధ్రసాహిత్య పరిషత్పత్రికటితము, కాకినాడ.) దొరకినంత వఱకు సంస్కృతాంధ్ర రామాయణములనుబట్టి చూడఁగాఁ దెలుఁగున కన్న సంస్కృతమునఁ గొంత విస్తృతి కలదని చెప్పనొప్పును. మధురవాణి తెలుఁగు కవయిత్రి గావున సంస్కృత కవితలో నచ్చటచ్చట యతిమైత్రిని బాటించినది. మంగళశ్లోకములో,

లక్ష్మీం దిశే - ల్లక్ష్మణ పూర్వజన్మా
  వీరోరఘూణాం - విజయం ప్రయచ్ఛేత్
ఆరోగ్యమర్కా - భి జనశ్చదద్యాత్
  రతీశమూర్తే - రఘునాథ నేతుః
ప్రకృతి మధురకావ్య - ప్రౌఢ సందర్భ విద్భి
  ర్వ్యపతి జనమణీభి - ర్వ్యక్త పార్శ్వద్వయోఽసౌ,
అథసవిధ ముపేతాం - సౌహృదాహ్వయ మన్మా
  మవపసరివృఢానా - మగ్రణీ రిత్యభాణీత్.
అజహ దలంకృతిక్రమ - మనేకరసోల్లసితం
  సరసపదార్థ సంగతి - సమగ్రగుణానుగుణమ్,
రఘురమణ ప్రబంధతిలకం - రసికాభిమతం
  సుదతి విధీయతామితి - సుధీరగదీన్నృపతిః.

ఇట్లే యతులు పాటింపఁబడినవి. [1]పై యుద్ధకృతాంశములఁబట్టి యీామె యాంధ్రభాషా కవితా పాండిత్యము నూహింపనగును.

వీరి విద్యాగోష్ఠి :

ఆ రఘునాథభూపాల చంద్రుండు విద్వత్కవీంద్రులంజూచి యే మనుచున్నాఁడు.

రఘునాథరాయని వారిమాట : వింటిరా ! కవులార ! ఈ పదుచు లాంధ్రగీర్వాణ ప్రాకృతసమస్యలు పూరింపఁగోరుచున్నారు. వీరినిఁ బరీక్షింపరయ్యా !

---

1. భారతి ధాతమార్గశీర్షమునఁ బ్రకటితమైన శ్రీరామకృష్ణ కవిగారి మధురవాణి అను మధురవ్యాస మిందుల కుపజీవ్యము.

వా: అన విని యమ్మహారాజుతోఁ గవిరాజు లేమనుచున్నారు.

అమ్మయ్యా! స్వామినగర లక్ష్మీసరస్వతులు సాక్షాత్కరించి యుండఁగఁ బరీక్షయేలయ్యా? అయినను మీ రానతిచ్చిన మీఱరాదు గదా. ఈ కమలాస్యలకు సమస్య లిచ్చెదమయ్యా! అని సమస్యలు యిచ్చిరట యెటువలెను.

సమస్య: రారాజని యచ్యుతేంద్ర రఘునాథనృపా!

వా: ఔరా! రామభద్రమ్మవారు ఆ సమస్య పూరించి చదివిరట యెటువలెను.

క. ఏరీనీసరిరాజులు, భూరమణులు నిన్నుఁ జాలఁ బొగడుదురు భళీ!
స్వారాజని శేరాజని, రారాజని యచ్యుతేంద్రరఘునాథనృపా!

వా: ఔరా! ఈ పద్యంబు విని యాంధ్రకవితా నిర్వహణంబునకు మెచ్చి చదివెనట యెటువలెను.

సమస్య: కింతే సంతానపాదపాయంతే

వా: అవురా! ఆశుకవితావాణి యగునాశుకవాణి యీ సమస్య పూరించి గీర్వాణభాషను సమస్య నిచ్చిరట యెటువలెను.

శ్లో. కతికతిన క్షితిపతయః, కింతే రఘునాథనాయకాయంతే,
భువి బహవః కిలతరవః, కింతే సంతానపాదపాయంతే.

వా: అవురా! యీరీతి సంస్కృత సమస్య పూరించి చదివిన విని మెచ్చి ఆ రామభద్రమ్మకు మధురవాణమ్మకు వేర్వేర ప్రాకృత సమస్య లిచ్చిరట యెటువలెను.

౧ సమస్య: రహుణాహక్కితి చందికోవిహఇ

౨ సమస్య: వడ్డఇ రహుణాహరాయసాహహోహి

వా: అవురా! ఈ రెండుసమస్యలు వారు పూరించి చదివిరట యెటువలెను.

## రామభద్రాంబ

శ్లో. పరిపుణ్ణకళాహి సోహమాణో, అహియంసకువలఅ ణిచ్చ సెవ్వమాణో
సహిఅ (స?) చెందిఆఇ, రహుణాహఖ్కిదితి చందిరోవిహాఇ.

ఛాయ: పరిపూర్ణకళాభిశోభమానః, అభితస్సత్కులనిత్య సేవ్యమానః
సఖియ (శః?) చంద్రికాఢ్యో, రఘునాథక్షితి చంద్రోవిభాతి.

వా: అవురా! ఆ రెండవ సమస్య పూరించి చదివెనట యెటువలెను.

## మధురవాణి

తేల్లొక్కెక్కసుహావహాసుహాయర వియయరాహవంస ఇణం
దెత్తూణణియతణూయం వడ్డయిరహుణాహరాయపాహోహి.

ఛాయ: త్రైలోక్యైకసుఖావహా, శుభకర విజయరాఘవం శశినం
దృష్ట్వానిజతనూజం, వర్ధతే రఘునాథరాజపాథోధిః.

వా: భళి! భళి! మేలు! మేలు! సాహిత్యసామ్రాజ్యపట్టభద్ర! ఈ మహామహిమంబు స్వామినగరగాక తక్కినరాణుల కెక్కడిదయ్యా?

(రఘునాథాభ్యుదయమునుండి)

# రఘునాథనాయకుని రచనలు

## 1. పారిజాతాపహరణము

ఈ ప్రబంధమును రఘునాథుఁడు రెండుజాములలో నత్యాశువుగ రచించెనని యజ్ఞనారాయణదీక్షితుఁడును రాజచూడామణి దీక్షితుఁడును జెప్పియున్నారు. ఈ రచనకు మెచ్చి తండ్రి యచ్యుతప్పనాయకుఁడీతనికిఁ గనకాభిషేకము గావించినాఁడు. దీని నాతని యాస్థానములోఁ జదివినట్లు రఘునాథనాయకాభ్యుదయములోని యీ క్రింది పంక్తులవలనఁ దెలియుచున్నది.

“ విరిబోఁడ్లు కొందఱు వినిపించి రపుడు , హరుసైన పారిజాతాహరణంబు ’

ఇదియు నేఁడు లభ్యముకాలేదు.

## 2. గజేంద్రమోక్షము, 3. రుక్మిణీకృష్ణవివాహము, 4. జానకీపరిణయము

ఈ మూఁడును యక్షగానకృతులు. వీనిలో గజేంద్రమోక్షము, రుక్మిణీకృష్ణవివాహరచనలు, సాహిత్యసుధలో యక్షగానములుగాఁ జేర్కొనఁబడినవి. జానకీపరిణయము రఘునాథనాయకాభ్యుదయమున 'చాటుకావ్యము' అనఁగా యక్షగాన మని చెప్పఁబడినది. ఇవియును లభ్యములుకాలేదు. వీనినిగూడ నాస్థానములోఁ ... పై గ్రంథము నుండి తెలియుచున్నది.

> " జానకీకల్యాణ చాటుకావ్యంబు
> తా నిర్వహించిన తక్కిన కృతులు ; కొందఱు వినిపింప "

## 5. అచ్యుతాభ్యుదయము (నాయకాభ్యుదయ రచనలు)

రఘునాథుఁడు తన తండ్రియగు నచ్యుతప్పనాయకుని జీవితచరిత్రను రచియించి నాయకాభ్యుదయ రచనలకు మార్గదర్శకుఁడయ్యెను. రఘునాథుఁడు తన తండ్రి చరిత్ర రచియించినట్లే, యాతని కుమారుఁడగు విజయరాఘవనాయకుఁడు తన తండ్రియగు రఘునాథుని జీవితచరిత్రను 'రఘునాథనాయకాభ్యుదయ' మనుపేర రచించినాఁడు—విజయరాఘవ నాయకుని కుమారుఁడు మన్నారుదేవుఁడు తన తండ్రి చరిత్రమును 'విజయరాఘవనాయకాభ్యుదయము' అనుపేర రచించియున్నాఁడు. వీనికి నాయకాభ్యుదయ రచనలని పేరు.

రఘునాథుఁ డీ గ్రంథమును ద్విపదగా రచించినట్లు నలచరిత్రయందలి యీ క్రింది పంక్తులు తెలుపుచున్నవి:

> " భూషించి యచ్యుతాభ్యుదయ ప్రబంధ
> నిర్మాణమున మాకు నిఖిలదేశముల
> నిర్మలసత్కీర్తి నెగడుఁ గావునను
> నటువలె ద్విపదకావ్యము వేఱొకటి
> ఘటియించి సత్కీర్తిఁ గైకొమ్ము ననుచు
> ముదిని పెంచి................ "

అచ్యుతాభ్యుదయ రచనమును గోవిందదీక్షితులవారు సాహిత్య సుధలో నుట్టంకించి యున్నారు. రఘునాథుని రామాయణమున నిది పేర్కొనఁబడినది. ఈ ద్విపదకృతిని రఘునాథనాయకుని యాస్థానమున విద్యావతులైన వెలఁదులు చదివి వినిపించినట్లు రఘునాథనాయకాభ్యుదయమునందలి యీ క్రింది ద్విపదవలనఁ దెలియుచున్నది:

"విరిఁబోండ్లు కొందఱు వినిపించిరపుడు
భువి మెచ్చ నచ్యుతాభ్యుదయ కావ్యంబు"

ఈ కావ్యమును, మన్నారుదేవుని విజయరాఘవనాయకాభ్యుదయమును నేఁడు లభ్యములు కాకయున్నవి.

## 6. నలచరిత్ర

అచ్యుతాభ్యుదయరచనానంతరము రఘునాథుఁడు నలచరిత్రమును ద్విపదకృతిగా రచియించెను. ఇందెనిమిది యాశ్వాసములు గలవు. మహాభారతారణ్య పర్వమునందలి కథను, శృంగారనైషధకథను జోడించి రఘునాథుఁ డీనలోపాఖ్యానమును రసోల్లసితముగా సంతరించినాఁడు. రఘునాథుని తక్కిన గ్రంథములతోఁబాటు దీనినిగూడ నాస్థానమున సాహిత్య విద్యాచతురలగు సారసాక్షులు చదివి వినిపించినట్లు రఘునాథ నాయకాభ్యుదయమునందలి యీ క్రింది పంక్తులనుబట్టి తెలియుచున్నది:

"విరిఁబోండ్లు కొందఱు వినిపించి రపుడు, నవరసచిత్రంబు నలచరిత్రంబు
హరుసైన పారిజాతాహరణంబు, మెఱవడిఁ జూపు వాల్మీకిచరిత్ర
జానకీకల్యాణచాటు కావ్యంబు, తా నిర్వహించిన తక్కిన కృతులు

గోవింద దీక్షితులవారు "సాహిత్యసుధ" లో నీ గ్రంథరచనమును నిట్లు ప్రశంసించిరి :—

"శ్రీ పారిజాతాహరణప్రబంధ, చిత్రం చ వాల్మీకిచరిత్రకావ్యమ్
తథాచ్యుతేంద్రాభ్యుదయం గజేంద్ర, మోక్షం చరిత్రంచ నలస్యచిత్రమ్.
నిర్మాయ వాగ్భి ర్విబుధార్థభాగ్భిః"

తెనుఁగుభాషలోని ప్రశస్తద్విపదకృతులలో నీ నలచరిత్రము పరిగణింపఁదగినది. ఇది శ్రీరామున కంకితము. గ్రంథావతారికలో నలమహారాజుకథను దనకుముందు రచించిన నన్నయ శ్రీనాథులను నిట్లు పొగడియున్నాఁడు.

" శిలలలోపల వెన్న చిలికినకరణి
నలఘుసంస్కృతముల యర్థంబులెల్లఁ
దెలుఁగుమాటలఁ దేట తెల్లంబుగాఁగఁ
జెలువొందఁ బల్కనేర్చిన నన్నపార్యుఁ
దిక్కయజ్వను నెఱ్ఱధీమణిఁ దలఁచి
యక్కజంబుగ నిటు లౌనను నుభయ
భాషల నానార్థభంగులింపార
నైషధాదిక ప్రబంధంబు లెన్నేని
భువి నిల్పి సత్కీర్తిఁ బొందినయట్టి
నవరసనాథు శ్రీ నాథునిఁ బొగడి "

శ్రీనాథుని " తల్లి మదేకపుత్రక " యన్న పద్యము ననుసరించి వ్రాసిన యీ క్రింది ద్విపదలు హృద్యములై యున్నవి.

రఘునాథుఁడు :-

" ఒంటిగాఁడనె నాకు నూరఁతబలగ
మింటి కెల్లను గర్తనే నొక్కరుండ
నాతల్లి యెంతయైననూ గలదయ్య
నాతల్లి మాటికి నవయ దెన్నఁడును
నూఁకొండ్లపండు కన్నులుగాన దిపుడు
గారాబుపట్టి నొక్కఁడనే నరయ
నిల్లాలు కడుగోల యెండ కన్నెఱుఁగఁ
దల్లడిల్లఁగ నుండునట్టిది యేను
కొడుకులు గుడ్డలోఁ గూనలు నన్నుఁ
బెడఁబోయ రెన్నఁడు పెంచిన మమత
భిక్షుకులు తెచ్చి పెట్టుసందాక

దెసలఁజూచుచు నోరు తెఱచియుండుదురు
కన్నవారికిఁబోలె కాన్పించునయ్య
విన్నవారల కట్టి వేదనలెల్ల
దయఁ జూడుమయ్య సంతపనీయచరిత !
నయ మెంచవయ్య యోనవనీతభావ !
నిగ్రహింపకుమయ్య నిషధేశ ! నన్ను
నుగ్రహింపుము చాల నుతులు గాంచెదవు. ” —ద్విపద నలచరిత్ర

శ్రీనాథుఁడు :-

సీ. తల్లిమదేకపుత్రక, పెద్ద, కన్నులుఁ
గాన దిప్పుడు మూఁడుకాళ్ళ ముసలి
ఇల్లాలుఁ గడుసాధ్వి నేమియు నెఱుఁగదు
పరమపాతివ్రత్య భవ్యచరిత
వెనుక ముందఱ లేరు వెనరైన చుట్టంబు
లేవడి యెంతేని జీవనంబు
కానక కన్న సంతానంబు శిశువులు
జీవనస్థితికేన తావలంబ

గీ. కృపఁదలంపఁగదయ్య యోనృపవరేణ్య !
అభయమీవయ్య యోతుహినాంశువంశ !
కావఁగదవయ్య యర్థార్థి కల్పశాఖ !
నిగ్రహింపకుమయ్య యో నిషధరాజ !

—నైషధము 1-108.

ఇందలి శైలి జాతీయమైనది. “ మఱి [illegible], ఇనుపదబ్బన ముల జుంజురులు, చక్కిలమువలెఁ జిక్కుట ” మొదలగు పలుకుబళ్లు; “నల్లమంది - ఏనుఁగుఁ గంబాన కెలయించినట్లు-ఆనాలు చవిచూచుట-” మొదలగు జాతివార్తాచమత్కారములు నిండు నిండుకొనియున్నవి. అచ్చటచ్చట శ్రీనాథుని నైషధ పద్యములకు ద్విపదానువాదము లెట్లుండునో పైని చూపితిని ఈ గ్రంథములోని యాశ్వాసాంత గద్యయిది

"ఇది శ్రీరామచంద్ర మహిత దయాసాంద్ర
విదిత సాహిత్య నవీన సాహిత్య
చినచెవ్వయాచ్యుతక్షితిపాల తనయ
వినయాది శుభగుణ విభవ సనాథ
రఘునాథ భూపాల రమ్యవాగ్జాల
సుఘటిత నవరసస్ఫుట శబ్దమహిమఁ
దనరెడు నలచరిత్రము ప్రబంధ
మునఁ బ్రథమాశ్వాసమును దగు శ్రీ ల"

రఘునాథుఁడు పూర్వోత్తర కథాసందర్భములను గమనించి కొన్ని సముచితవర్ణనలు కావించినాఁడు. ప్రథమాశ్వాసమున నలుని యశ్వకళా నైపుణ్యము, చతుర్థాశ్వాసమున సంగీతశాస్త్రవివరణము. షష్ఠాశ్వాసమున నలదమయంతుల కష్టదశ, కలివర్ణనము, రఘునాథుని కవితాచాతుర్యమును, శాస్త్రవైదుష్యమును బ్రస్ఫుటీకరించుచు నీ గ్రంథరచనను బ్రత్యేకించుచున్నవి. ఇందలి రచన కొకమచ్చుతునుక : (హంసను నలుఁడు పట్టుకొనినప్పుడు చెప్పిన మాటలు.)

"మొదలకుండఁగఁ బట్టె మేదినీశ్వరుఁడు
నదిగని విడువఁడీ యవనీశుఁ డనుచు
నలువంకలును జూచి నలువంకఁ జూచి
తలఁపునఁ గడునద్భుతము పిక్కటిల్ల
మనుజభాషల నంచ మనుజేశుఁ బలికె
వినవయ్య ! యోరాజ వీరశేఖరుఁడ
ధరణి నాజాడ మేఁతకుఁగాఁగఁ దిరిగి
తిరిగి బడలికలెల్లఁ దీర నీయోర
వంచన నయమార్గవర్తన చించి
పొంచిపట్టితి వేమి పుణ్యంబు గలిగె ?
రాజహంసుఁడవయ్యుఁ బ్రొఢిఁ నెంచకయ
రాజహంసము ముట్టరాదయ్య నీకు
ద్విజరక్షణంబు సంధిలఁజేయుచేత
ద్విజశిక్షణంబు సంధిలఁజేయఁదగునె

పక్షిని గాని యోఁ బ్రతిపక్షిఁ గాను
భక్షింపఁ దలఁచి నన్ బట్టితే నీవు
పట్టఁడైనను లేదు పలలంబు నీవు
పుట్టినక్షతమున పాణియుగంబు
కొట్టుచే నదియును జేవేగఁ గరఁగెఁ
బుట్టవే పులుఁగులు భూమిలోపలను
గాంచనపక్షముల్ గలవంచు నెంచి
యుంచలదినువార లవనిలోఁ గలరె?
పొమ్మని విడువుమో పుణ్యచారిత్ర!
నమ్మి నిద్రించితి నా కెక్కుతుదల
బంగారమున కాసపడితివో రాజ
సింగారమే కాని చేతికి రాదు."

నలోపాఖ్యానము ప్రత్యేక ప్రబంధరూపమున వెలువడుట కిదియే మొదలు. దీని వెనుక చక్రపురి రాఘవాచార్యుఁడు ద్విపదగను, సిరిప్రగడ ధర్మనామాత్యుఁడు, బెహరా రామకృష్ణకవి పద్యకావ్యములుగను రచించిరి. ధర్మవరము రామకృష్ణమాచార్యులవారి 'చిత్రనళీయము' చాల వ్యాప్తమైన గ్రంథము.*

నలచరిత్రమున నేడాశ్వాసములును, నెనిమిదవ యాశ్వాసములోఁ గొంతభాగమును గలదు. ఋతుపర్ణుఁడు కుండిన నగరమునకు గుఱ్ఱముల నాయత్తపఱుపుమని చెప్పఁగా నలుఁడు (బాహుకుఁడు) చిక్కిన గుఱ్ఱములను సిద్ధముచేసిన యీ క్రింది పంక్తులతోఁ నాగ్రంధము ముగియుచున్నది:

"సింధుజంబులగు తేజీల నేర్పుటెచి
తెచ్చితి ముందఱ దేవ! నామనసు
వచ్చినవీ వారువములని పలుక
ఋతుపర్ణవిభుఁ డాగ్రహించి 'మేల్ మేలు'

*ఇది తొలుత కీ.శే. చెలికాని లచ్చారావుగారి 'ఆంధ్రభాషావిలాసిని' అను పత్రికలోఁ బ్రకటితమై యావెనుక క్రీ. శ. 1929 లో గ్రంథరూపమున వెలువడినది. ముద్రితప్రతి డెమ్మీసైజున నూటయిరువది పుటలలో నున్నది. ద్విపద లొకే పంక్తిగా చిన్న యక్షరములతో ముద్రితములైనవి. పై రఘునాథుని నలచరిత్ర తత్క్షణమే సమీచీనముగఁ బునర్ముద్రితము కాఁదగినది. దీని ప్రాఁతప్రతి తంజావూరిలో లేది పోవుట విశేషమే. ద్విపదకృతులు పెక్కులు ముద్రితములగుచున్న కాలమున నిక యును సుముద్రితమై వ్యాప్తిచెందఁదగియున్నది.

మతిమంతుఁడని నిన్ను మున్ననఁ జేసి
బుడిగివండుల కిట్లు హాస్యాస్పదములు
బడుగుగుఱ్ఱములఁ జూపఁగఁ బాడియగునె ?
చిక్కలంబులఁ బోలె చాలఁదూలంగఁ
[illegible] చేరుసేయొక్క
నాఁటనెయాకుండినమునకు నేఁటి
మాటలు చాలింపుమా ! యని పలుక
బాహుకుండనియె నాపార్థివు తోడ
వాహంబులివి కృశత్వముఁ బొందియున్న
నుండనీ యివియేఁగు నొకనాఁటిలోనె
కుండినంబునకు నిక్కువము నాపలుకు
కండలు పెరిగిపై గదలంగ లేక
కొండలవలె నుండు గుఱ్ఱంబులేల ?
పంచకంబులు నున్నఁ బాటినవెల్ల
కొంచఁగ నేఁగునే క్రోశమాత్రంబు
బక్కచిక్కిన నేమి బలసిననేమి
యుక్కళింబగు మనసుండంగ వలయు
కోటాసపడక, బల్విడి జగ్గుఁగొనక
కాటుఁజూపక యసంగంబుగా వెనుక
జిహ్మక కరసంజ్ఞ చేతనె మదికి
సమ్మతంబగు మహాజవమున మెలఁగు
హయరత్నముల నేలునట్టి రాజునకు
జయముగల్గుటకు సంశయమును గలదె ?
కడుఁజిక్కి యున్నవిగా యనిమఱచి
వడినేఁగి యాడంగవశమె యశ్వములు
పచ్చికస్త్రులఁగానె పరికించి వాని
యిచ్చ నెఱుంగుచు నెక్కుడ వలయు
... ... ... ... ... ”

దీని తరువాతి కథలో, నలుఁడు నిజరూపము నొందుట, దమయంతితోఁగూడి రాజ్యము పాలించుట యను నంశములు మాత్రమే యుండుటచేత నీ కథయంతయు నెనిమిదవ యాశ్వాసముతోఁ బూర్తియైనదని నిశ్చయింపవచ్చును.*

* పై నలచరిత్ర వివరణమునుబట్టి యది రఘునాథనాయకునిదని నిర్వివాదముగ నిశ్చితమైనది కాని 'దక్షిణాంధ్రవాఙ్మయ చరిత్ర' యను గ్రంథమున 60–65 పుటలలో తద్గ్రంథకర్త వేరొక ద్విపద నలచరిత్ర నుదాహరించి రఘునాథరాయని కృతి లభ్యముకాలేదని వ్రాయుట దురూహ్యముగా నున్నది. అతని నలచరిత్రకృతి యిప్పటికి నిరువదెనిమిదేండ్ల క్రిందటనే ముద్రితమై విమర్శకులచే నుదాహృతమైనది. కావున రఘునాథరాయని గ్రంథమును గూర్చి శంకించుటకు ఆస్కార మేమియును గన్పట్టదు.

## 7. రఘునాథరామాయణము

శ్రీరామచంద్ర భక్తుఁడగు రఘునాథుఁడు వాల్మీకి చరిత్రమును రచియించుటయేగాక, వాల్మీకిమహర్షి ప్రణీతమైన శ్రీమద్రామాయణ మును జంపూకావ్యముగా రచియించెను. ఈ గ్రంథమంతయు నాతఁడు పూర్తిచేసెనో లేదో కాని నేఁడు లభ్యమగుచున్న భాగమున బాల కాండమున మూఁడాశ్వాసములు సంపూర్ణముగను, నాల్గవ యాశ్వాస మున **26** పద్యములు మాత్రమే గలవు. ఇది ముద్రితమైనది. లభ్యమైన భాగము రఘునాథరాయని రసవత్కవితకు చక్కని యుదాహరణమై యొప్పుచున్నది. ప్రథమాశ్వాసమున అవతారిక, సంగ్రహరామా యణము, వాల్మీకి శోకము శ్లోకమగుట; రెండవయాశ్వాసమున కోసల దేశవర్ణన, అయోధ్యాపురవర్ణన, దశరథమహారాజువర్ణన, పుత్రుని కొఱకుఁజింత, పుత్రకామేష్టిచేయు ప్రయత్నము, ఋష్యశృంగచరిత్ర; మూఁడవయాశ్వాసమున ఋష్యశృంగుఁడయోధ్యకువచ్చుట, దశరథుఁ డశ్వమేధయాగముచేయుట, దశరథునకుఁ బుత్రప్రసాదము లభించుట యను వృత్తాంతములు కలవు. నాల్గవయాశ్వాసము శ్వేతద్వీపవర్ణనతోఁ బ్రారంభమైనది.

ఇందలికవిత జాతివార్తాచమత్కారములు గలిగి రసభావగర్భితమై యలరారుచున్నది. రసస్ఫోరకముగ వ్యావహారికపదము లుపయోగించి రఘునాథుఁ డొక క్రొత్తవన్నె కవితకుఁ గూర్చినాఁడు. ఋష్యశృంగునిఁ జూడఁగానే యప్సరస లను కొనుమాటలు

“ సీ. కొమ్మరో నడునెత్తి కొప్పేమ్రంది యాచుట్టు
జడలు చెంపల వ్రేలఁబడుట యేఁది
పెడమట్టుఁజల్లుల చిడిపిరాల్గూర్చిన
తీరునఁ బూసలపేరు లేంది
బుసి గప్పుకొన్న చొప్పున మేన నిండఁగ
మేదించినట్టి యీబూది యేంది
కసవు ముప్పిరి త్రాటఁ బోసగంగఁ గట్టిన
పొడచింకతోలు కచ్చడమదేంది

గీ. నోసల మసిబొట్టిదేంది యొక్లిసలనిట్టి
జూచి గనుగొను మమ్మక్క జూచినపుడె
తెలుపడరె యంచుఁ జేతొమ్ము పలుచికొనుచుఁ
గడఁగి దగ్గఱఁ జేరక కడవ యుండి." (2-145)

దశరథుఁడు పుత్రులు లేరని చింతించు సమయమున పలికిన పలుకులు బాల్యచేష్టలనుఁ జక్కఁగ నిరూపించుచున్నవి.

"చ. కలుగునొకో చకోరహితుఁ గన్గొని తెమ్మని పోరుపెట్ట దా
దులు గికురించి యద్దమునఁ దోఁచిన చందురుఁ జూప రెండుచే
తులఁగొని పట్టి సంతసముతోఁ దనచేతికిఁ జిక్కె నంచు న
గ్గలికఁ జెలంగుబాలకుని కన్నులఁ జూడఁగఁ గల్గుభాగ్యముల్." (2-52)

రాజులెంత సర్వజ్ఞులైనను రమణులకు లోఁబడుదు రని యీ క్రింది పద్యమునఁ జక్కఁగాఁ దెలిపియున్నాఁడు.

"సీ. షడ్దర్శనీ పరిశ్రమ సమంచిత బుద్ధి
వాసిఁగన్నట్టి విద్వాంసులకును
కర్ణామృతస్యంది కవితా నిరూఢిచేఁ
బ్రౌఢిమించిన కవిరాజులకును
గాంధర్వ సర్వస్వకళఁ గళంకము లేక
జాణలౌ జగజెట్టి జాణలకును
దత్తిలభరత మతంగాది మతముల
వలెదెడినాట్య తత్త్వజ్ఞులకును
గీ. నిచ్చు యీ కొల్వులంజెల కీయఁ దగునె
పల్లకీలను హెచ్చు సంబళము బిరుదు
వాద్యములు జూడ నృపులు సర్వజ్ఞులయ్యుఁ
దెలియలేరని కొందఱు వలికె రఘుడు." (2-125)

విజయనగర సామ్రాజ్య కాలమునఁ బుట్టిన ప్రబంధములవలె నిందును సమకాలిక జాతీయ జీవితము ప్రతిబింబించియున్నది. కోసల దేశవర్ణనయందలి ప్రాసంగులు, సన్నవంకలు, బంగారు తీగెలు

మున్నగు ధాన్యములను గూర్చి చెప్పుట, పొలములకు నీటిపాఱుదల జల సమృద్ధి ప్రత్యేకించి వర్ణించుట యీనాఁడు తంజావూరి రాజ్యమండల మెంత సుక్షేత్రఖండముగా నుండెనో తెలియఁగలదు.

సీ. పుష్పమంజరు లిప్ప పువ్వు రాజనములు
కస్తూరి నిగరాలు గంధసరులు
గంగాజలంబులు బంగారు తీగియ
లేనుంగు దంతముల్ దీనసరులు
సన్నవంకలు ముత్తెసరులు ప్రాసంగులు
రాయమెచ్చులు నీశ్వరప్రియములు
నయములు రామబాణములు సీతాభోగ
ములు బాలకేసరుల్ మోసనములు

గీ. కఱియమేనులు సన్నబక్కుండ మఱియుఁ
గలుగు ధాన్యంబులెల్ల ముక్కారుఁబండి
నిండి యెల్లెడఁ జూచిన నెగడుచుండు
క్షామ మనుపేరి నెఱుఁగరా భూమిజనులు (2-11)

మఱి యీ క్రిందిది దశరథుని కొల్వుకూటములోని వేత్రధరుల వర్ణనము :

సీ. జొన్నముద్దలువోలె సన్నసుగ్గడితంపుఁ
జెలిచల్వబటువు పాగలు బొసంగ
నునుపారి యుఱఱచట్టలును జాని కొనరిన
జలిపెపచ్చడములు జెలువ మెసగ
కొండొంట నొరవచ్చుచున్న చెంపలగొప్ప
నీలాలప్రోగుల నిగ్గుదొలఁక
నృపముద్రలఁ జెలంగు నపరంజి ముద్దుటుం
గరములు కరములఁ గరము మెఱయ

గీ. శుద్ధవేషంబుతోడఁ బ్రసిద్ధులైన
సచివు లధిపుహజారంబు సరణి దఱిసి
క్రమమొనరి కొన్ని కక్ష్యాంతరములు గడచి
యంత హెగ్గళ్ళువచ్చి రమ్మనుచుఁ బిలువ. (2-60)

వీరు రఘునాథనాయకుని కొలువులోని హెగ్గళ్లేగదా !

ఇందలి శ్వేతద్వీపవర్ణనలోని కొన్ని భావములు ప్రవరసేనుని సేతుబంధ మహాకావ్యమునుండి గ్రహింపఁబడినవి. ఇది రఘునాథుని వస్తుకవితాసామర్థ్యము (అనగా వర్ణితవిషయము నొక్కదానినే బహు రీతులు, బహుభంగిమములు నొప్పునట్లుగా రచించుట) నిరూపించు చున్నది. కొన్ని స్వతంత్రభావములును గలవు. రెండింటినిమాత్ర ముదాహరింతును.

" సీ. రమ పెండ్లినాటిముత్తెములప్రాల్ నిండిన
విధుకాంతమణికాంతవేది యనఁగ
జలవారణములపోరులు సూచు సలిలభ
ర్తకు నొనర్చిన పెండితమక మనఁగ
జలశాయి హరినాభిచతురాస్యు గొలువ వ
చ్చిన వాహనమరాళసేన యనఁగ
మున్నీటిరాయని ముంజేతివజ్రపు
యంపుహంపీరుతాయత యనంగఁ

గీ. బాలసంద్రంబు ఘనయాచకాళి కెల్లఁ
దొరహత్తుగాఁ దీరసపూర మిత్తు
ననుచు నెత్తినధవళపట్టాంబరధ్వ
జంబనఁగ పాండురాంతరీపంబు వెలయు.

గీ. నీరుపాపలు గుమిగూడి నింగి కెనయ
వీచికారజ్జువులఁ గట్టి విడిచినట్టి
రాగితపు గాలిపటము నిష్కంపలీల
నున్నదో యన [illegible] మీఱు. " (4–11)

ఇట్లు తెలిదీవిని నలువది విధములుగా వర్ణించిన రఘునాథుని కవితావైశద్య మెట్టిదో పాఠకు లూహింపఁగలరు. ఇందులో 467 గద్యపద్యములు గలవు. (1–138, 2–192, 3–111, 4–26) ఆశ్వాసాంత గద్య వాల్మీకి చరిత్ర గద్యవలెనే యుండును.

ఆంధ్ర సాహిత్యపరిషత్ప్రచురణము సంఖ్య 40.

రఘునాథనాయకునికి శ్రీనాథునికవితయం దెక్కువ మక్కువ. రామాయణమునను, వాల్మీకి చరిత్రమునను, నలచరిత్రమునందును శ్రీనాథుని ప్రత్యేకముగఁ బేర్కొనుటయే యిందులకుఁ దార్కాణము.

రామాయణమున :

క. నానా శాస్త్రపురాణ
జ్ఞానము సందర్భమునఁ బొసంగఁగఁ గృతులన్
నెన్నియొనరించి మించిన
శ్రీనాథుని వచన వైఖరిన్ మదిఁ దలఁతున్. (1-12)

వాల్మీకిచరిత్రమున :

శా. సందర్భంబు నవార్థగర్భమగుచున్ సాహిత్యక్రియాన్వితంబుగన్
జిందుల్ ద్రొక్కుచు నింపియంతట నెల్ల మెప్పొంద నొప్పుగా నా
నందాంభోధి తరంగముల్ బలెఁ బ్రబంధంబుల్ ఘనవిన్నాణ్యవా
నంచెల్లంబుగఁ గీర్తి గాంచుచు శ్రీనాథ కవీంద్రుఁ గొల్చెదన్. (1-13)

నలచరిత్రమున శ్రీనాథస్తుతి ముందుదాహరించితిని. (పుట. 37.)

పద్యముల యెత్తుగడలు :

ఉ. పంచమ వేదమై పరఁగు భారత సంహిత ప్రభూతిఁ గాంచె
భీమ, ఖండము. (1-5)
పంచమ వేదమై పరఁగు భారత మంత్రధ్వజో విలాసముల్ మించి
రామాయణము. (1-11)

ఉ. కప్పుర భోగివంటకము కమ్మని గోధుమపిండి సొజ్జయున్
క్రీడాభిరామము. (1-11)
కప్పుర భోగివంటకము కమ్మని సేవడియున్ను బంచిమేల్. (3-13)

“ సీ. తన దానమహిమ చింతామణి కామధు
క్సంతానముల కోజబంతిగాఁగ ” రామాయణము. (1-38)

“ సీ. తన దానమహిమ సంతాన చింతారత్న
జీమూత సురభుల సిగ్గుపఱుప ”, నైషధము (1-9)

ఈ క్రింది పద్యము కృష్ణరాయుల యాముక్తమాల్యద యందలి రెడ్ల హేళన వర్ణనకుఁ బ్రత్యుత్తరము.

"కప్పుర భోగివంటకము కమ్మని నేవడియన్నుజించి మేల్
దుప్పటు లట్లు మూరగల తోరపుఁ బచ్చడము ల్చెలంగఁగా
గొప్పగ దాని పైఁడి జగిగుత్తపుటుంగరముల్ గరమ్ములన్
ద్రిప్పుచు రచ్చ సేయుదురు రెడ్డిదొరల్ తమి హెచ్చునచ్చటన్." (2-13)
-ఆంధ్రసాహిత్య పరిషత్ ప్రచురణము. 40. 1937.

ఆముక్తమాల్యద యందలి పద్యమిది.

మ. గురుగుం చెంచలిఁ దుమ్మి లేఁదగిరి సాకుం ద్రింత్రిణీ పల్లవో
త్కర ముంగూడఁ బొరంటినూనియలతోఁ గట్టావి కుట్టారు గో
గిరము ల్మెక్కి, తమింబసుల్ పాలు మోవుఁ గ్రేపుల్ మెయి న్నాకమే
దురవుం గుంపటి మంచ మెక్కి రి ప్రభుత్వైకాప్తి రెడ్లజ్జడిన్. (4-134)

## 8. శృంగార సావిత్రి

ఇది రఘునాథభూపాలునికృతిగాఁ బ్రకటితమైనది. ఇందలి కవితా సౌకుమార్యమును, రాజస్థాన సంప్రదాయములును రచనారీతులును రఘునాథనాయకుని కృతిగాఁ బట్టియిచ్చుచున్నవి. కాని యాశ్వాసాద్యంత పద్యములుగాని గద్యగాని కన్పట్టుట లేదు - రఘునాథుని కృతులలో నెవరును నీ గ్రంథము తడవియుండలేదు - భావిపరిశోధనము నింతకన్న వివరము లిచ్చుటకు వీలుగలుగునేమో గమనింపవలసి యున్నది.

ఈ కృతి క్రీ. శ. 1928 లో శృంగార గ్రంథమాలలో గంటి సూర్యనారాయణ శాస్త్రిగారిచే ఇండియా ముద్రాక్షరశాలలో ముద్రితమై ప్రకటింపఁబడినది. ఇందుగల పీఠికలో 5, 6 పుటలలో నిట్లున్నది:

### సావిత్రీ చరిత్ర

"రసవంతమగు నీ ప్రబంధమునుఁగూడ నా మహారాజ కవియే (తంజావూరి రఘునాథుఁడు) రచించియుండునని మేమనుకొనుచున్నాము. దీని మూలము తంజావూరి సరస్వతీ పుస్తకశాలలో నున్నది. అది ప్రాఁత

పుస్తకము. గ్రంథారంభ మొక యాశ్వాసము లేనట్లున్నది. ఆశ్వాసాద్యపద్యములు లేవు. నడుమఁగూడ నొకచోఁ గొంత గ్రంథపాత మున్నది. ఈ గ్రంథమును ముగియ రచింపకపూర్వమే గ్రంథకర్త స్వర్గస్థుఁడై యుండునని యూహాము. ఆ ప్రతినిఁబట్టి తత్కర్తను గుర్తింపఁ గుదురదయ్యెను. కాని శ్రీరఘునాథరాయ మహాకవి రచియించిన రామాయణమునందలి పద్యములు (ఋష్యశృంగ తపోభంగము పట్టునను్నవి) ఈ గ్రంథమునందును నుండుటచే తత్కర్త యేతత్కర్త యని మేమూహించితిమి.'' కాని నేఁడు ముద్రితమైన పై రఘునాథ రామాయణమున ఋష్యశృంగ తపోభంగముపట్టున 'శృంగార సావిత్రి' లోని యొక్క పద్యమైనను గానరాదేమ. కావున నీ గ్రంథకర్తృత్వ మింకను నిశ్చితము కాలేదని చెప్పనగును.

## 9. వాల్మీకి చరిత్ర

ఆంధ్రవాఙ్మయమునఁ గవిరాజశిఖామణి నన్నెచోడదేవుఁడును, సాహితీసమరాంగణ సార్వభౌముఁడు శ్రీకృష్ణదేవరాయలును, సంగీత సాహిత్య విద్యారసజ్ఞుఁడు రఘునాథనాయకుఁడును రాజకవిత్రయముగాఁ గీర్తింపఁదగినవారు. ఆంధ్రవాఙ్మయచరిత్రమునఁ బ్రత్యేకవిశిష్టతఁ గలిగిన తంజాపురాంధ్రవాఙ్మయమునకు మూలపురుషుఁ డీ రఘునాథనాయకుఁడే.

ఈ ప్రబంధమునఁ గథావస్తువు కవితావతార ప్రశంసమీదుగా వాల్మీకి చరిత్రము. పరమపవిత్రమగు నా రఘునాథుని చరిత్రము జగదాదిమకావ్యముగ సంస్కృతభారతిని వాల్మీకి రచియించి కవియై కీర్తినందగ, నా వాల్మీకి చరిత్రమును నీ రఘునాథుఁడు సమాజసామ్యధురీణమగు నాంధ్రభాషలోఁ బ్రబంధరూపమున రచియించి, రఘునాథునికే యంకితమొసంగి, కవిరాజై కవితాచరితార్థత గాంచినాఁడు. రఘునాథనాయకుఁ డీ ప్రబంధమును రచియించినట్లు గోవిందదీక్షితుల వారు తమ సాహిత్యసుధయం దిట్లు చెప్పియున్నారు.

శ్రీ పారిజాతాపహరణ ప్రబంధ, చిత్రంచ వాల్మీకి చరిత్రకావ్యం
తథాచ్యుతేంద్రాభ్యుదయం గజేంద్ర, మోక్షం చరిత్రంచ నలస్య చిత్రమ్
శ్రీ రుక్మిణీ కృష్ణవివాహ యక్ష, గానం ప్రబంధానటనైకభేదాన్
నిర్మాయవాగ్భిర్బహుణార్థభాగ్భి, ర్విద్వత్కవీనాంవిదధాసి హర్షమ్.

గ్రంథమున నాశ్వాసాంతగద్యలో రఘునాథునిపేరే యుండుట చేత నిది రఘునాథకృత మనియే నిస్సంశయముగఁ జెప్పనొప్పును.

## గద్య

"ఇది శ్రీరామచంద్రసాంద్ర కరుణాకటాక్షలబ్ధ సిద్ధసారస్వత విశేష, నిరర్గళ వాగ్వైభవాశేష, సరససాహిత్యకళాభోజ, సత్య సంభూషిత ముఖాంభోజ, సకలసామ్రాజ్యధౌరేయ, నిత్య వితీర్ణిధారారాధేయ, నిరతావారితాన్న సత్రసంతోషిత ప్రతిదివస పంచాశత్సహస్రభూసుర, బహువారావర్తిత మహాదానవైభవావర్తిత కీర్తిభాసుర, [illegible]లంకవస్తుసమగ్ర, బహుళాగ్రహారభూషిత, చోళధరామండల నిఖిలభోగవిభవ నిర్జితాఖండల సాధిత సముద్రాంతరద్వీప, పర నృపాలసంస్తుతప్రతాప, నేపాల భూపాలస్థాపనాచార్య, కర్ణాటరాజ పూజనీయధౌరంధర్య, రామ సేతు శ్రీరంగవిజయరాఘవపుర కుంభకోణాది దివ్యస్థల ప్రతిష్ఠాపిత రామభద్ర, సర్వజనసంభావిత, గాంభీర్య ముద్రావినిర్జిత సముద్ర, సదాశ్రితభరణ దీక్షాదక్ష, దక్షిణసింహాసనాధ్యక్ష, రాజాధిరాజ సన్నుతాసాధారణశౌర్య, దిగంత ప్రసిద్ధత రౌదార్య, స[illegible]జనక, సతతసంసేవితజనక, పోషితవిద్వత్కవియూధ, భువనశోభితగుణసనాథ, బలవత్పరిపంథిగృహీత సామంతమహీ కాంత విమోచన శ్లాఘనీయబాహాబల, మూర్తిమాంబాగర్భ శుక్తిముక్తాఫల, చిన చెవ్వయాచ్యుత నృపాలపుత్ర సజ్జనస్తోత్రపాత్ర, రూపరేఖావిజిత కుసుమసాయక, సకలధర్మసంధాయక, రఘునాథనాయక ప్రణీతంబైన వాల్మీకిచరిత్రంబను మహాప్రబంధంబునందుఁ దృతీయాశ్వాసము."

## కథావిమర్శనము

వాల్మీకిచరిత్ర మూలము సంస్కృతమున ధర్మఖండమున నున్నది. మరియు వాసిష్ఠ రామాయణము, భక్తవిజయము మున్నగు గ్రంథములలో నీకథ యున్నట్లు తెలియుచున్నది. ఈ రెండింటియందును గథలు కొంచెము భిన్నముగ నున్నవి. ధర్మఖండమున వాల్మీకి కిరాతకులుఁడనియు, దోపిడివృత్తిచే జీవించుచుండె ననియు, సప్తర్షి దర్శనముచే రామ మంత్రోపదేశమునుబొంది మహర్షియై విలసిల్లెననియుఁ గలదు. వాసిష్ఠరామాయణ భక్తవిజయములలో నీతఁడు పొంటెత నుత్తము బ్రాహ్మణుఁడై, యౌవనమునఁ గిరాతవనితాలోలుఁడై సాధుపురుష సందర్శసాంగత్యములచే మహాపురుషుఁ డయ్యె ననియుఁ జెప్పఁబడి యున్నది. పై రెండింటిలో *ధర్మఖండములోని కథయే వాల్మీకి చరిత్రమునఁ బ్రపంచితమై యున్నది. రమారమి మూఁడు పంక్తులలోఁ జెప్పఁదగిన యీకథను మూఁడాశ్వాసముల మహాప్రబంధముగా రచియించుటయే రఘునాథరాయని కవితాప్రతిభను జాటుచున్నది. వాల్మీకి చరిత్రకథా సూత్రము గమనించిన నీవిషయము మఱియు స్పష్టమగును.

ముక్తిసుందరీ యౌవనమగు బదరీవనమున శౌనకాదిమహర్షులు హరిస్మరణచిత్తులై యుండ నారదుఁ డచటికి వచ్చెను. మునులు నారదుని విష్ణుకథలను దెలుపఁగోరిరి. నారదుఁడు వైకుంఠమునకుఁ బోఁదలంచి తన సఖుఁడగు పర్వతమునిని వారికిఁ జూపి యీతనివలనఁ విష్ణుకథ లెఱుంగుఁడనిచెప్పి వెడలిపోయెను. పర్వతుఁడు వారల కిట్లు చెప్పెను:

తెలిదీవియందు శ్రీ మహావిష్ణువును సేవించి సప్తర్షులు తిరిగి వచ్చుచు సప్తద్వీపములు, సప్తకుల పర్వతములు గడచి తామ్రపర్ణిఁ

* ధర్మఖండము క్రీ. శ. 1700 సంవత్సర ప్రాంతమున గోదావరీమండల ప్రాంతవాస్తవ్యుఁ డీమరుపల్లి భవానీశకవి ఆంధ్రమున బదియాశ్వాసముల మహాప్రబంధముగా రచియించి యున్నాఁడు. ఈ గ్రంథమును అభినవాంధ్రభోజులు శ్రీ పిఠాపురాధీశ్వరులు క్రీ. శ. 1931 లో నచ్చువేయించిరి.

జేరిరి. ఆ తామ్రపర్ణి చెంగటఁగల[1] గజతీర్థము నీక్షించి, తన్మాహాత్మ్య మెఱింగి సేతువునొద్ద ధనుష్కోటియందుఁ గ్రుంకి, రామలింగేశ్వరు దర్శించి మధుర కేతెంచిరి. అచ్చట సోమసుందరు సేవించి యాపై శ్రీరంగపతికిఁ గైంకర్యముగావించి, తంజావూరుచేరి, దక్షిణద్వారకయగు మన్నారుగుడి వీక్షించి, [illegible]ము, శ్రీముష్ణము, చిదంబరము దర్శించి, శ్రీతిరుపతి క్షేత్రమున శ్రీ వేంకటేశునికి సపర్యలొనర్చి, శ్రీశైలముఁజేరిరి. అచ్చట మల్లికార్జును సేవించి, వింధ్యదాఁటి శ్రీవారణాసీ క్షేత్రమున విశ్వనాథు సంభావించునంతలో గ్రీష్మము వచ్చెను. ఆ గ్రీష్మబాధ కోర్చి వారు తమసానిమ్నగఁ జేరఁగనే యొక కిరాతుఁ డడ్డపడి వారిని హింసించెను. వారును వానికి తత్త్వబోధచేసి రామమంత్ర ముపదేశించిరి. కిరాతుఁడు బహుదీక్షతోఁ దపమునల్ప, నా తపోభంగము సేయ నింద్రుఁడు రంభోర్వసులఁ బంపిన వారు విఫలమనోరథలై తిరిగిపోయిరి. అప్పుడు మహర్షు లరుదెంచి యాతని తపోనిష్ఠ కాశ్చర్యమనస్కులైరి. ఆతని చుట్టుపుట్ట పెరిగెను. వల్మీకమునుండి వెడలుటచే వాల్మీకి యయ్యెను. అప్పుడు శ్రీరాముఁడు ప్రత్యక్షమై తన కథను గావ్యముగాఁ జేయుమని యానతిచ్చెను. వాల్మీకి యట్లే రామాయణము రచించి యశశ్శరీరుఁ డయ్యెను.

ఇందు మొదటి రెండాశ్వాసములలో క్షేత్రవర్ణనము, తృతీయాశ్వాసమున రంభోర్వశీ వివాదఘట్టమున నాట్యవర్ణనము కవికల్పితములు. ఈ క్షేత్రము లన్నింటిని రఘునాథరాయలు దర్శించినవాఁడు. రామసేతు శ్రీరంగ కుంభకోణాది దివ్యక్షేత్రముల శ్రీరామభద్రుని ప్రతిష్ఠించినవాఁడు. తంజావూరు తన రాజధాని. దానిని వర్ణించి తన స్వదేశాభిమానముఁ గనఁబఱచియున్నాఁడు. సంగీతనాట్యకళ రఘునాథరాయని కాలమున నత్యున్నత స్థితిలో నుండెడిది. కావునఁ గథాభాగమున వీనికిఁ బ్రసక్తిఁగల్పించి రఘునాథుఁడు తన కవితాచాతుర్యముఁ

1. గజతీర్థ మనఁగా గజేంద్రమోక్షస్థలము. భాగవత గజేంద్రమోక్షణ కథ యిందు సంగ్రహింపఁబడినది.

జూపినాఁడు. రఘునాథుఁడు క్రొత్తగాఁ గనిపెట్టిన "రఘునాథమేళ"ను నిట్లు వర్ణించినాఁడు:

"సీ. ఆదితాళము ద్వితీయక మంతరక్రీడ
జయమంగళంబును జంపె లీల
చాచపుటంబు చంచత్పుటంబును షష్టి
తాపుత్రకంబు విద్యాధరంబు
రతిహంస లీల శ్రీరంగంబు రంగంబు
కంకాళ ఖండ కాకాథములును
కోకిలప్రియము విలోకితంబుహు డుక్క
డెంకి త్రిభంగి మట్టిగ విజయము

గీ. నంది నందన జయసింహ నందనములఁ
మొదలు గాఁగల తాళముల్ మొనసియున్న
గూడి కవచట్టముగఁ గొని యాడి లేని
బిరుదు లిచ్చితి నీవు నే బిరుదటంచు" (3-72)

కథయం దిట్టిపట్టులు మొత్తముమీఁద మనోహరములై యున్నవి.

ఈ రాజకవి కవిత్వము మృదుమధురపదగుంఫితమై ధారాశుద్ధి గలిగి ప్రసన్నగంభీరమై యొప్పుచున్నది. కావ్యమంతయు స్వతంత్రముగ రచియింపఁబడినదయ్యు నచ్చటచ్చటఁ గొన్ని ప్రాచీన శ్లోకముల కనువాదములును, ప్రాచీనకవికృత పద్యముల కనుసృతులును లేకపోలేదు. మచ్చునకు:

### హనుమంతుని వర్ణన - కృత్యాది

ఉ. ఎక్కడ రామకీర్తన మొకించుకయే విన్నసైన వేడ్కఁ బా
నక్కడ వచ్చి రంజిలికృతాంజలియై ప్రమదాశ్రుపూరముల్
పిక్కటిలంగ మైఁబులకబృందము జాదుకొనంగఁ బాడుచున్
జొక్కుచు నాడు నయ్యనిలసూను ప్రభానతభానుఁ గొల్చెదన్. (1-3)

ఇది "యత్ర యత్ర రఘునాథకీర్తనం తత్ర తత్ర కృత మస్త కాంజలిమ్, బాష్పవారి పరిపూర్ణలోచనం మారుతిం నమత రాక్షసాంతకమ్."

అను శ్లోకమునకుఁ దెలుఁగుచేఁత.

సీ. పంకజబిందు బింబస్థాయి త్రైలోక్య
మంగళదాయి శ్రీరంగశాయి
సకల జనానంద సంధాయి గరుడ తు
రంగమయాయి శ్రీ రంగశాయి
సహ్యకన్యాతటాంచలకులాయి ప్రపంచ
రక్షణోపాయి శ్రీరంగశాయి
అఖిలదైవతసంసదతిశాయి యగణిత
బ్రహ్మాండశాయి శ్రీరంగశాయి

గీ. నిఖిలజగదింద్రజాలంబు నెఱపుమాయి
అచ్చులకునెల్ల మొదల నచ్చైనద్రాయి
కొలుచువారలపాలిటి తలఁపురాయి
రావణానుజదాయి శ్రీరంగశాయి. (2-30)

పై పద్య మనుప్రాసఘటితమైయున్నను నిది చదివినతోడనే సంకుసాల నృసింహకవి కవికర్ణరసాయనములోని యీ క్రింది పద్యము స్మరణకు రాకమానదు.

సీ. అపవర్గకాంక్షచే నాకొన్నవారికిఁ
దంగేటిజున్ను శ్రీరంగశాయి
నిర్వాణదారిద్ర్య నిర్విణ్ణుఁడగువాని
మ్రుంగిటిసేవధి రంగశాయి
సంసారమల విమోచనము సాకాంక్షించు
పంగువు పై గంగ రంగశాయి
పరమార్థలాభతత్పరుఁ డైనవానికి
ముంగొంగు పసిఁడి శ్రీరంగశాయి

గీ. బెదరకాకఁటి యమృతంబుఁ బిదికికొనఁగ
శృంగములు లేని మొదవు శ్రీరంగశాయి
కో[illegible] లీఁగోరివచ్చు
జంగమామరతరువు శ్రీరంగశాయి. (1-91)

సీ. కమల గర్భాండభాండముల ఖండ జ్యోతి
నెనయు బంగరు బొమ్మరిండ్లుగాఁగ
నీరేడులోకంబు పెడ నెడఁ జెన్నారు
పన్నారు దొంతుల బాగుగాఁగ
........................ (1-2)

ఈ పద్యమున రెండవపాదముయొక్క భావము చిత్రభారతము (5-134) నుండి గ్రహింపఁబడినది.

సీ. "తన వినోద క్రీడకును పద్మసంభవాం
డంబులు చిన్నిపన్నాళ్లుగాఁగ."

అచ్చటచ్చట శబ్దాలంకారములు హృదయంగమములై కవితకుఁ గణన కూర్చుచున్నవి.

క. లోపలఁ జని వెని హరిన్
లోపలకువిందకందళోజ్జ్వల కనరా
లోపల సద్రచనాజా
లోపలలితమైన యొక్క యున్నత శేషన్. (1-75)

మ. తమసానిమ్నగదాఁటి తజ్జలసముద్యద్వాల శైవాల...
తమసారద్యుతి తీరభూరుహ విభాఘట్టంబుతోఁగూడి సం
తమసానీకముఁబోలె నద్దెసలు నిండం జూచి యోహో! మఱి
తమసానీరము నిండెఁ జెల్లదని చింతంజాలఁ బల్కెఁ బృథున్ (2-83)

వాల్మీకిచరిత్రము స్వతంత్ర ప్రబంధముగా నెన్నఁదగినది. కవితా ప్రౌఢిమయందేమి, కావ్యనిర్మాణమునందేమి, కళాప్రదర్శనమునందేమి, ఆంధ్రప్రబంధములలో నున్నతస్థాన మాక్రమించుచున్నది. రసౌచిత్య విషయమున దక్షిణాంధ్రవాఙ్మయమున నీ కావ్యమునకుఁ బ్రత్యేకవిశిష్టత కలదు. రఘునాథభూపాలుఁ డుపయోగించిన శబ్దజాల మాతని,

నన్నిచోడని కుమారసంభవముతోడను, శ్రీకృష్ణదేవరాయలవారి యాముక్తముతోడను బరిచయమున్నట్లు తెలుపుచున్నది. 'తృణజ్యోతి, ఓహరిసాహరి' మున్నగు పదము లిందులకుఁ బ్రమాణము. 'ఉగము' మున్నగు నపూర్వపద ప్రయోగము లిందు కానఁబడుచున్నవి. రఘునాథభూపాలుఁడు శ్రీరామభక్తుఁడయ్యును, బరమత సహిష్ణుతకలవాఁడు. వాల్మీకి చరిత్రమున క్షేత్రవర్ణనమున శైవక్షేత్రములఁగూర్చి చేసినప్రశంస లాతనికిఁ బ్రాచీన శైవవాఙ్మయమునఁగల పాండితిని సూచించుచున్నవి. చూడుఁడు. మధురయందలి సోమసుందరుని వర్ణనము:

సీ. మునులకందగరాని మోక్షంబు పక్షికి
దయచేసె నెవ్వాఁడు నయమొనర్ప
వివిధార్థములుగ ద్రావిడసూత్రములు సల
క్షణముగా నెవ్వాఁడు సంగ్రహించె
జంబుకంబులు తురంగంబులుగాఁజేసి
యమ్మె నెవ్వాఁడు పాండ్యాధిపతికి
శ్రుతినిందలకుఁ బామసుల శూలవిద్ధులఁ
గావించె నెవ్వాఁడు ఘనత మెఱయఁ

గీ. దట్టఁదలఁబెట్టపట్టెఁడు పిట్టొసంగు
ముసలియవ్వకునై మన్ను మోసె నెవ్వఁ
డట్టి లింగస్వరూపున కఖిలపతికి
సోమసుందరునకు నీడు జోడు గలదె. (2-20)

జంబుకంబులు తురంగములు చేయుట, పిట్టవ్వకుఁ దట్టలు మోయుట మున్నగుకథలు దాక్షిణాత్యశైవవాఙ్మయముతోఁ బరిచయమున్నఁగాని సాధారణముగఁ దెలియనట్టివి. ఇట్లే తంజావూరు, అరుణాచలము, శ్రీశైలము మున్నగు శివక్షేత్రముల వర్ణనములు రఘునాథుని పరమతసహనముఁ దెలుపుచున్నవి. ఇట్లు పరమతసహనము గలిగినవాఁడయ్యుఁ, దన రామభక్తిని గ్రంథమునందుఁ బ్రస్ఫుటముఁ గావించినాఁడు. గజతీర్థమును వర్ణించుపట్టున భాగవత గజేంద్రమోక్షణ కథను సంక్షేపముగ భావగర్భితముగఁ జెప్పియున్నాఁడు. కథయందుఁ బ్రసక్తి లేకపోయి

కను, దన కాలమునఁ దానత్యున్నత స్థితికిఁ దెచ్చిన నాట్య సంగీతకళా విశేషముల నీగ్రంథమునఁ దృతీయాశ్వాసమున వివరించినాఁడు. పుట్టతేనియపోలిక నిట్టలంపుఁ దీయఁదనముఁగలిగిన తెలుఁగుభాషయందుఁ బుట్టఁబుట్టువు మనుగడను నీరాచకయిసరి వ్రాసి, తనుఁ గొల్చు వేల్పునకు నీకబ్బపుఁగన్నె నిచ్చి యెల్లకడల నెల్లవేళలఁ దెలుఁగువారిలో నెలకొనిన పేరుగడించినాఁడు. మహాదాతయై, శత్రుజేతయై, కృతిప్రణేతయై శరణాగతత్రాతయై, గాంధర్వ విద్యాధిష్ఠాతయై కవిపండిత హృదయ సంస్థాతయగు నీరఘునాథభూనేత చరిత్రము సువర్ణాక్షరములతో లిఖింపఁదగినది. రాజకవీంద్రకృతమై కవిరాజసమ్మానితమగు నీతని కృతు లాంధ్రమహాజను లాదరింతురుగాత !*

ఈతని యాస్థానమండలి కవులు :

## చేమకూర వేంకటరాజు

ప్రబంధవాఙ్మయమున బహుళ ప్రచారములోనుండి తెలుగువారికి తొలినుండి తెలిసిన దాక్షిణాత్యకృతి విజయవిలాసము. ఈ రసవత్తర ప్రబంధము రచియించినకవి చేమకూర వేంకటరాజు. కృతిభర్త అభినవ భోజరాజ బిరుదాంకుఁడు రఘునాథరాయలు. రఘునాథనాయకుఁడు పాండ్య, తుండీర, [1]నేపాళ [2]చోళగులను జయించినవెనుక, క్రీ. శ. 1516 ప్రాంతమున విజయభవన మను సౌధము లనేకములు గొని యుండును. ఈ విజయభవనరాజము రఘునాథనాయకునిచేఁ దాను బొందిన విజయములకుఁ జిహ్నము (పుట 18-41-424-25) గాఁ గట్టింపఁ బడినట్లు, రఘునాథనాయకాభ్యుదయమున నిట్లు చెప్పఁబడినది.

---

* వాల్మీకి చరిత్ర - ప్రతుల వివరము. తంజావూరి పుస్తకశాల సంఖ్య. 247 – 248, ముద్రితము – సరస్వతీ పత్రిక. కొంత భాగము రామవిలాస గ్రంథమాల 1911 – 1921. ఆంధ్రవిజ్ఞానసమితి గ్రంథమాల. 1940 విజయనగరము. (సంపాదకుఁడు, పరిష్కర్త-ప్రస్తుత గ్రంథకర్త)

1. నేపాళమనునది - నేటి జాఫ్నా (Jaffna) అరవమున దీనిని 'యాప్పాణము' అందురు.

2, 'చోళగ' అనునది, దేవికోట ద్వీపమును పాలించు నొక నాయకునిపేరు.

" విజయచిహ్నములచే వెలయుచు నున్న,
విజయభవనరాజ వేదికాస్థలిని "

విజయవిలాసమునఁగూడ నీభవనము పేర్కొనఁబడియున్నది.

" క. చెలులు ప్రసంగవశంబున
నలరెం గడు విజయభవన మనినన్ " (3-26)

ఇచ్చటి కథాభాగమున విజయుఁడు(అర్జునుఁడు)న్న భవనమని యర్థము. రఘునాథరాయలు పై విజయములను బొందినవెనుక, నాతనికి నీ భవనమునఁ గృతి నిచ్చుటచేతనే, భావస్ఫోరకముగ నీ గ్రంథమునకు విజయవిలాసమని పేరుపెట్టియున్నాఁడు. దీనికి 'సుభద్రాపరిణయ' మని నామాంతరము. ఇదియును పై విషయమును స్పష్టపఱచుచున్నది.

క్రీ. శ. 1656 లోఁ బ్రసిద్ధలాక్షణికుఁడగు నప్పకవి తన గ్రంథమున విజయవిలాసమునుండి పద్యము లుదాహరించుటనుబట్టి చూచినచో నీ కృతి రచితమైన ముప్పది, నలువదేండ్లలో నెంత ప్రఖ్యాతిగన్నదో తెలియఁగలదు.

మఱియుఁ బల్లాటిలోని తంగెడసీమ కాపురముగాఁగల యప్పకవి దక్షిణదేశమున సుదూరమున నున్న తంజావూరిలో రచితమగు కృతి నుదాహరించుట చూడఁగా నప్పటికి రెండింటికి నడుమ రాకపోకల వ్యవహారము లెంత నిరంతరాయముగా సాగుచుండినవో తెలియఁగలదు.

కులభేదముచేత లోకోత్తరమగు వసుచరిత్రమునుండి పద్యము లుదాహరింపని యప్పకవి, విజయవిలాస రచయిత వేంకటరాజు కులము తెలియకపోవుటచే 5 పద్యము లుదాహరించినాఁడు. చేమకూర వేంకటరాజు కులమునఁ గళంకముగలవాఁడే యనుటకు శ్రీ వాసిరెడ్డి వేంకటాద్రి నాయనివారి కాలమున నడచిన యీ ప్రసంగమువలన దెలియవచ్చుచున్నది.[1]

1. చాటుపద్యరత్నాకరము శ్రీ దీపాల పిచ్చయ్యశాస్త్రి గారిచే సంపాదితము, పుట. 162.

కులమునఁ గళంకముగల బుచ్చివెంకు అను నొకకవింగూర్చి వేఱొకకవి, ప్రభువుయొక్క యభిప్రాయమును :

"కులమునఁ గళంకు కలదనుకొంచుఁ గొంకు
బాసజనాలుక్యవర్యుఁడగు బుచ్చివెంకు."

అనెనఁట. అంతట [illegible] లేచి,

కొంకక తమరాడిన యది
బొంకేలగు వేంకటాద్రిభూపాలక యీ
వ్యంకేల వానికిం గల
రంకే యిప్పాటి నిలుప రసవంతమునన్.

అని చమత్కరించెనఁట. అందుల కా బుచ్చివెంకు :

ఉ. పన్నినసత్ప్రబంధమున బాగునుబోగును జూచి కేసుచే
మన్ననమాలి మా కులముమాటఁ దలంతురె ! చేమకూర వెం
కన్నకు లోప మేమి ? కులమా కవనానకు ? వేంకటాద్రిరా
జన్న గణించి మీగలు దయామతిఁ బ్రోచిన మాసఁ జాలదే !

చేమకూర వేంకటకవి తాను లక్ష్మీకామాత్యనందనుఁడని చెప్పుకొనుటచేత, అప్పకవి యాతఁడు నియోగి యని భ్రమించియుండును గాఁబోలు !

ఉత్తమ సాహితీరంగమున జాతిమతభేదములు లేవుగదా ! అప్పకవి యిందలి రచనానైపుణికి ముగ్ధుఁడై పద్యము లుదాహరించియుండును. అప్పకవియే యననేల, అఖండకవితా సాహితీసంపన్నుండును, అనుపమాన వైదుషీ భూషణుండును, అభినవభోజరాజ బిరుద విరాజమానుండును నగు రఘునాథరాయలే వేంకటకవినిగూర్చి "వాఙ్నియమహాఢ్యుఁడు నీయంతవాఁడికేఁడి"[1] అనియు, "ప్రతిపద్యమునందుఁ జమత్కృతి గలుగం జెప్ప నేర్తు"వనియు, క్షితిలో నీమార్గ మెవరికిన్ రాదుసుమీ"[2] అనియు, ప్రశంసింపఁగా నిఁకఁ దక్కినవారి ప్రస్తావనయే యనావశ్యకము. నాఁటినుండియు దక్షిణాంధ్రవాఙ్మయముననేగాక నా యుగమునం బ్రభవించిన ప్రబంధము లన్నింటికి నిది తలమానికమై వెలయుచున్నది.

1. విజయవిలాసము : 1-48. 2. విజయవిలాసము : 1-50.

విజయవిలాసమున మూఁడాశ్వాసములలో క్రమముగా 228, 206, 238 ; మొత్తము 672 పద్యములు గలవు. ఇందు వచనము లెనిమిది మాత్రమే యుండుటచేత నిది కేవల పద్యకృతియనియే చెప్పనగును. ఇందు ప్రతిపద్యచమత్కృతి యిట్లు సాధింపఁబడినది :

1. జాతీయముల కూర్పు, 2. యమకము (గమకము)ల పేర్పు, 3. శ్లేషల నేర్పు, 4. సామెతల చేర్పు.

1. "ఆనతియిచ్చెనాయది 'శిలాక్షరము', దానమిచ్చెనా 'ఏనుగు పాఁడి', కంకణముగట్టు పంచబంగాళమైపాఱు, పెట్టనికోట, దెబ్బదీయుట, చిదిమిపెట్టినబంటులు, ఉక్కుతునకలు, కొంగుఁబసిండి, నడుమంత్రపుఁ గల్మి, జాడులు ప్రసాదములు, కాలుద్రొక్కు, పెట్టనిసొమ్ములు" మొదలగు జాతీయము లిందుఁ జక్కఁగఁ బ్రయుక్తములైనవి. వీని సార్థక్యము నెఱుకపఱచుట కొకపద్య ముదాహరించుచున్నాను.

చ. జలరుహగంధివీనులపసల్ నవసంఖ్య నదేమి లెక్కనున్
చెలియ నఖాంకురాళి నెలచేడియసైకము దానుజొక్కనుఁ
బొలఁతుక గబ్బిచన్నుఁ గవపువ్వులచెండ్లను లేదు బంతనుఁ
కలికిముఖారవింద మల కల్వలరాయనిఁ దోసిరాజనున్. (1-102)

2. సామెత లచ్చటచ్చట ముచ్చట గూర్చుచుండును :

"వంటయింటికుందే లిది యెందుఁబోఁగలదు (1-71). ఏఁటికివచ్చె నమ్మ తాఁబిలువని పేరంటమునకు (1-78). ఈఁతకు మిక్కిలి లోఁతుగల్గునే (1-167). మోక్షమునకుఁబోవ మొసలెత్తుకపోయె (2-43). పెద్దలున్నారు వారెర్గి పెండ్లిసేయఁగలరు (2-187). విండ్లమ్ములుగల వారికిఁ దోడుచల్లకడవలవారే (3-44). శోభనముమీఁద నె శోభనము (3-138)."

3. యమకము లప్రయత్నముగనే యర్థస్ఫురణను గలిగించున :

"ఆపురమేలుమేలు భళియంచు (1-84). యమునాతరంగిణీతో యమునా (1-121). తియ్యనివింటివాని వెనుదియ్యక (1-143). గోష్ఠి

నుండెడు పద్మరాగోష్ఠి (2-100). చొక్కమగు దీనిఁజూచినఁ జొక్కమనం (2-133). కలశస్తని మణికంకణ కలశస్త నినాదము (2-79).

కొన్ని పద్యములలో నన్నిపాదములం దిట్టి చమత్కృతియుండును:

గీ. నలినలీలసంచు నలినలి గావించు
నించుమించులాడు నించుమించు
లేమ నగవుఁజూపు లే మన నగు! బాపు!
జగ మెఱుఁగుదాని జగ మెఱుఁగు. 1-101.

గీ. హిమకరసైకసైకతమునందు విహరించు
కైరవేషువేషు ఘననిభాంగు
నెనరుఁదవుల దవులనే చూచి క్రీడిగా
నెఱఁగి యార! యారగేందువదన. 2-121.

గీ. ముదితచేతులఁ దలఁబ్రాలముత్తియముల
ముదితచేతులగుచు.............. 2-21.

ముదితచేతస్కులగుచు అని యుండఁదగును.

క. మంగళయాత్రంబు చతురిమం గళ సీమణ్.[1] 2-22.

మనశ్శబ్దము తుది సకారంబునకుఁ దత్సమమునఁ ద్విత్వాలోపంబగుటకు నీ క్రింది పద్యములోన (మనసు) ప్రయోగము లక్ష్యములు:

గీ. మనసు భద్రసుకృత మహిమ యేమనవచ్చు
మనసు భద్రమయ్యె మనకు నెల్ల. 3-87.

ఒక్కొక్కచో రేఫ, శకటరేఫముల సాంకర్య మీ ప్రవాహమునఁ గొట్టుకొనిపోవుచుండును. అయిన నివి రసోత్పాదకములే.

"కురువీరవసింపఁగ నీకురు (కుఱు) వీర (1-145). వేమఱున్ మఱున్ మరున్మృగాంక (3-42)."

---

1. (చతురిమణ్ + గళ) సీమణ్.
సరళపరత్వమున ద్రుతము పూర్ణబిందువగుటకు లక్ష్యము.

వశ్యవాక్కగు చేమకూర వేంకటకవికిఁగాక యొరుల కింతటి సామర్థ్యము కలుగుట యరిది. ఇట్లింక నెన్నో పద్యము లుదహరింప వచ్చు. (అనుప్రాసములకు చూ. 1-130, 1-1໕5, 196)

4. శ్లేషలు - యమకానుప్రాసములు మొదలగు శబ్దాలంకార ముల చిత్రణమందేకాక శ్లేష మొదలగు నర్థాలంకారముల రచనయం దును నీకవి యందెవేసినచేయి.

గీ. పోఁకబ్రాఁకులమహిమ కప్పూరపుటనఁటి,
యాకుఁదోఁటలసౌభాగ్యమంచె గలదు
ప్రబలు వౌక్తికసౌధ సంపదల మహిమ
వీటిరహి మెచ్చవలయుఁబో వేయునోళ్ళ. 1–82.

ఇందు పోఁక - కప్పూరము - ఆకు - మౌక్తికము - వీటిరహి అనుచో, శబ్దశ్లేషలవలన కర్పూరసహితమైన వీడియము (తాంబూలము) వ్యక్త మగుచున్నది.

ఉ. ఊఁదుకపో[illegible] నహో ! గళరేఖ, శరాసనమ్ములన్
వాదుకుఁబట్టి కన్బొమలవైఖరి వంకలుఁ దీరుచున్, గటా
క్షోదయ లీలసాయకసమూహములన్ విషమాస్త్రు గెల్చుఁబో
యేదొరసాటి యీ నరున కెన్నఁగ వీరవిలాససంపదన్. 1–34.

ఈ పద్యమున ఊఁదుకపోవుట - వాదుకుఁబట్టుట - వంకలుతీర్చుట మొదలగు తిరస్కార పదములకు నాయా యుపమానవాచకముల స్వభావమునకు చక్కని యర్థభావసమన్వయము శ్లేషమూలమున సమకూడినది.

5. జాతీయధ్వనులు : ఊఁత - (Accent) మనోభావ వ్యక్తీకరణ మునకు :

క. మీరింద్రప్రస్థముఁ గ
న్నారా ? పాండవులఁ జూచినారా ? సుఖులై
వారందఱు నొకచో ను
న్నారా ? వీరాగ్రగణ్యు నరు నెఱుఁగుదురా ? (2–163)

తెనుఁగున ఊఁత (Accent) యున్నదని చెప్పుటకు నీ గ్రంథమునఁ జక్కని యుదాహరణములు గలవు. ఒకటి:

క. అరచందమామనేలిన,
దొరగా [1]నెన్నుదురు, నెన్ను[2]దురు నిద్దరికిం
బరువంపు మల్లెమొగ్గల,
సరిగా[1]బల్కుదురు, బల్కు[2]దురు జవ్వనికన్. * (2-78)

ఇట్టి మనోహర కావ్యమున పాతాళలోకమున గల నాయిక యులూచిని, మర్త్యలోకమున గల నాయిక చిత్రాంగదను దివ్యాంశ సంభూతురాలగు నాయిక సుభద్రను (సుభద్ర శ్రీకృష్ణుని చెల్లెలు) చిత్రించి చేమకూర వేంకటకవి సిద్ధహస్తుఁడైనాఁడు. 'విజయవిలాసము' దక్షిణ దేశీయాంధ్రకవితా విజయవిలాసము.

విజయవిలాసకర్త తన కృతిపతి మహానాయకుఁడైన యీ క్రింది విశేషణములచే సూచించియున్నాఁడు:

1. కావ్యగీతి ప్రియత్వము:—అభినవ భోజరాజ బిరుదాంకుఁడు (1-53). అభినవ భోజరాజవర బిరుదాంకా. (1-225) విద్యాధిక (1-1). స్నిగ్ధసారస్వతా (2-266). విరాజద్భాషాషట్క విద్యాప్రసంగా (3-228). క్షోదక్షమ రసభావ సుకవితా ... (1-61). సరసాగ్రేసర (1-225). భరత శాస్త్ర ప్రౌఢమార్గైక లాస్య రసాస్వాదన కోవిదా (1-225). కర్ణాటక చిత్రాంగీ వదన కందళిత హర్షలోలుప హృదయా (1-227). అనులాగము శాస్త్ర నిరస్తసురేజ్య (1-227).

---

*పై పద్యమున 1 యని సూచించినచోట నూఁదిపలికిన ఒక యర్థమును, 2 సూచించినచో నూదిపల్కిన మఱియొకయర్థమును దెలుపును. మొదటి నెన్నుదురు=గణింతురు; రెండవ నెన్నుదురు=నెఱి+నుదురు. మొదటి పల్ + కుదురు = పలుచాలుకుదురు, చాలు అనఁగా దంతపంక్తి. రెండవ పల్కుదురు = చెప్పుదురు.

2. కులీనత :—అచ్యుతేంద్ర రఘునాథనృపా (2-1). అచ్యుతేంద్ర రఘునాథ (3-1). మూర్త్యంబా గర్భశుక్తి ముక్తామణి (1-63). అచ్యుత రఘునాథ వసుంధరాధిరాడ్వర్య (1-64)

3. ధార్మికత్వము :—వాసరప్రభుతనూజ స్థూలలక్షా (1-225). తులాదిక విగ్రహవాప్త శతక్రతులాభ (1-228). శుభోదయకారణ రత్నతులాపురుషాదిక దానచణా (1-228) షోడశమహాదానాఢ్య పుణ్యక్రియాదక్షా (2-204). దయాంధృగ్ధుతాశేషధాత్రీమరున్నిష్ప్వతా (2-206). ఘనావేలగరిష్ఠ దానపదవీ పరితోషిత కాశగాతమిా చోళకవిద్విజస్తుతవచోలగ (3-237).

4. గుణాఢ్యత్వము:—సత్యాదిమ చక్రేశ్వర (1-226). శ్రీజానకీ మనోహర పూజాంచిత హృత్సరోజ (3-1). రామసేవాధురీణా (3-238). సీతాదృక్సోమహానాంఘ్రి సేవాధని (1-60). సకలాస్థానప్రణుత వరగుణాభరణు (1-62). అఘటన ఘటనా చాతుర్యఘనోర్జిత కార్యనిర్వహణ ధుర్యహధీమఘు వాచార్య (1-64). దక్షిణ సామ్రాజ్య విభవధారేయు (1-61 షష్ఠ్యంతములు.)

5. సౌభాగ్యము :—పురందర జిద్భోగధురంధరా (2-225). విభవభృత్తంజాపురీవల్లభా (1-225). ఆదిగర్భేశ్వర (2-1). శాశ్వత కీర్తివైభవ రమాభృచ్చోళసింహాసనాధ్యక్షా (2-204). దుగ్ధవారాశి విద్యోతికీర్తి (3-238). సుధాభుగ్ధురీణామ నాగభోగవర్తీ (3-238). పోష్యాఖిలదిగ్రాజ (3-1). శ్వేళగశైకలాంఛన విజిత్వర శుభ్రయశో విశాల (3-237). ధారాళగళన్మదద్విరద రాజవిరాజి సభాంగణా (3-237).

6. వైదగ్ధ్యము :—తరుణీమన్మధ (1-226). శ్రవణభూషా దివ్యరత్నత్విషాతరణి శ్రీకరగల్లభా (1-225). వనితాసేచనక మనోహరాంగ (1-227). శృంగార కళాసూచన (1-227). నరాధీశ్వరాకార నాళీకబాణా (2-237). స్థిరానందనా (3-238). సాక్షాన్మనోజా (1-69). దాక్షిణ్యాగణేయున (1-61). కీర్త్యాద్యార్యా ధరితామర్త్య మహీరుహాసుధాబ్ధి మహికాఘృణి (1-63).

7. ఔదార్యము:—ఆశ్రితభరణ గుణాభరణ (1-226). యాచకకవినుత (1-227). దాక్షిణ్యాకర మూర్తి (2-204). ఆశ్రిత ధీరరక్షణ కళాధౌరంధరీ సత్కృపావీక్షా (2-204). సకలార్థిజన నిర్వ్యాజ కృపా (3-1).

8. ప్రతాపసుభగత్వము:—శౌర్యబహుళరాజ్య ధురంధర (1-226). శ్రీధుర్య శౌర్య (2-1). ధైర్యక్ష్మాధర మూర్ధన్య (2-1). మద్దుమరాట్ కిరీట దళనైకాక్షేయ కౌక్షేయకా (2-204). కలహారంభణ కౌతూహల పులకిత భుజపరాక్రమార్జిత నానాజల దుర్గవనదుర్గస్థల దుర్గాహార్య దుర్గ సామ్రాజ్యనిధీ! (2-205). చోళగమానభంజనా (2-237). ఆరాతి క్షమాభృద్భిదాంచత్ కృపాణా (2-237). శాతాసి కలిత బాహాస్ఫీతాసికవి మతరాజ నిఖిలావని (1-60). దేశాధ నృపాల స్థాపన చణు (1-62). శాత్రవదరికరిసృణి (1-63).

9. కవితాశక్తి:—కృతిపతియగు రఘునాథనాయకుని కవిత్వమును గూర్చి, వేంకటరాజు,

> " ఉ. తారసపుష్టిమైఁ బ్రతిపదంబున జాతియు వార్తయుం జమ
> త్కారము నర్థగౌరవముఁ గల్గ ననేక కృతుల్ ప్రసంగతిం
> ధీరగతిన్ రచించి మహిమించిన నీకెనఁ గర్త లెవ్వరా
> య్యా! రఘునాథ భూప రసికాగ్రణికిన్ గవిసేఁతఁ జెప్పఁగన్ "(1-31)

అని వ్రాసిన పద్యము ప్రత్యక్షరము సత్యము.

రఘునాథుఁడే తన కవితఁగూర్చి యిట్లు చెప్పుకొన్నాఁడు:

> క. "చెప్పవలెఁ గప్పురంబులు
> కుప్పలుగాఁ బోసినట్లు కుంకుమ పైపైఁ
> గుప్పిన క్రియ విరిపొట్లము
> విప్పినగతి ఘుమ్మనం గవిత్వము సభలోఁ

> క. చెవులకుఁజవులై చల్లఁగఁ
> గవులకుఁదవులై సమస్త కావ్యకళాబం
> ధువులైన రససింధువులై
> యవురా! యనఁ గవితలవని నలరఁగవలదా?" వాల్మీకి చరిత్ర.1–12,13.

రఘునాథుఁడు తనకృతులయందు పేర్కొనని కవితాగుణవిశేషములను వేంకటరాజు పేర్కొనుటయే పై పద్యమున విశేషము.

విజయవిలాసకర్త వేంకటరాజు తన పూర్వులనుండి గ్రహించిన పట్టులు.

అర్జున వర్ణనము

సీ. ఎగుబుజంబులవాఁడు మృగరాజమధ్యంబుఁ
బుడికి పుచ్చుకొను నెన్నడుమువాఁడు
నెటిచంద్రుకలవాఁడు నీలంపు నికరంపు
మెఱుఁగుఁ జామన చాయమేనివాఁడు
గొప్ప కన్నులవాఁడు కోదండ గుణకిణాం
కములైన ముంజేతు లమరువాఁడు
బవిరిగడ్డమువాఁడు పన్నిదంబిడి డాఁగ
దమ్ము వందపువెన్ను మచ్చువాఁడు

గీ. గరగరనివాఁడు నవ్వు మొగమ్మువాఁడు
చూడఁగలవాఁడు మేలైన సొబగువాఁడు
వావి మేనత్తకొడుకుఁ గావలయు నాకు
నర్జునుండు పరాక్రమోపార్జనుండు. విజయ. (2-164)

పై వర్ణనము క్రీ. శ. 1450 ప్రాంతముల విలసిల్లిన ప్రసిద్ధ సంకీర్తనాచార్యులు తాళ్లపాక అన్నమయ్యగారి సతి తిమ్మక్క రచించిన సుభద్రా కల్యాణములోని యీ క్రింది మంజరీపాదముల ననుసరించియున్నది.

మం. "ఎగుబుజంబులవాఁడు మృగరాజు నడుము
నడచి ప్రచ్చుకొను నెన్నడుము గలవాఁడు
గరగరనివాఁడు చక్కనివాఁడు నతఁడు
గొప్ప కన్నులవాఁడు కోదండగుణకి
ణాంకంబులౌ బాహు లమరినవాఁడు
వెన్నున మచ్చుగల విభవంబువాఁడు
బవిరిగడ్డమువాఁడు పన్నిదంబిడిన
వెన్నుపగడసాల వెసనాడవచ్చు
చిగురొత్తు చెంద్రిక చెలఁగు పాదములు."

సుభద్రాకల్యాణము పుట. 32.

" అయ్య మీరేదేశ మరసి చూచితిరో ?
ఎయ్యది మీనామ ? మెచట నుందురో ?
పంగ నింద్రప్రస్థ పట్టణమ్మునను
బహుళ సంపదలతోఁ బరగుచున్నార
ధీరమానసులు కుంతీసుతుల్ ? వారు
నారయఁ గడుసుఖులై యున్నవారె ? "
సుభద్రా కల్యాణము. పుట 28.

క. మీరింద్రప్రస్థముఁ గని
నారా ? పాండవులఁ జూచినారా ? సుఖులై
వారందఱు నొకచో ను
న్నారా ? వీరాగ్రగణ్యు నరు నెఱుఁగుదురా ?
విజయ. (2–163)

" అమరఁగాఁ బలికెను నరివతో నపుడు
కోమలి యిద్దరము గోకర్ణమందు
....................
చెలియ యుంటిమి మేము చెలికాండ్రవలెను
అతనికి నాకును నరమర లేదు
అతనికి నాకైక్యమతిఁజరో వినవె "
సుభద్రాకల్యాణము. పుటలు 31, 32.

ఉ. కోమలి యీ గతిన్మదిఁ దగుల్పడిఁ బల్కిన నవ్వి నిర్జర
గ్రామణిసూను మీరెచటఁ గంటిరో యంటివి కన్నమాత్రమే
ఏమని చెప్పవచ్చు నొకయింతుక ఖేదములేక యాయచే
మేమయి యున్నవారము సుమీ ! వికచాంబుజపత్రలోచనా !
విజయ. (2–168)

ఆ. వె. తీర్థములనుఁ గ్రుంకి దేవతాసేవలు
చేసికొనుచుఁ బెక్కువాసరములు
కూడి యతఁడు మేము గోకర్ణమునయందు
నుంటి మనిన మచ్చెకంటి యలరి. విజయ. 2–169.

ఇది ముద్రితమున 'గీ.' అని యుండుటవలన స్వారస్యము చెడినది. అది సుభద్ర చెప్పుచున్నదిగాన ఆఁటవెలది.

ఇంకను పూర్వకవి యనుస్మృతులను జూపుచున్నాను.

ఉ. తియ్యని వింటి వాని వెనుదియ్యక డగ్గర
జాలునయ్యాసాహాయ్య తనూవిలాసి విజయ. (1-143)

ఉ. తీయని వింటనే వెనుక త్రీయని బీరము న
న్మనోభవా ... ... చిత్రభారతము† (2-80)

సీ. చిన్నిప్రాయపు వేడిచెవులు వట్టాడించు
గతి నున్నదీరాము కన్నుదోయి విజయ. (2-106)

సీ. తే. గరుడ గంధర్వ యక్షకిన్నరులఁ గన్నఁ
జెవులు వట్టియాడించు నశేషలోక
భీకరములగు విధములు................
తిక్కన - నిర్వ. రా. (4-22)

క. చెఱకు విలుఁ బూనఁజూచిన
చెఱకున్ లోనైరి సకలసిద్ధులుఁ దలఁపఁ. చిత్రభారతము. (1-81)

గీ. చెఱకు విలుకాని బారికి వెఱచినీవు
మఱుఁగుఁ జేరితి.......... విజయ. (1-158)

(చెఱకు - కన్య చెఱకు - ఇప్పటికి - కన్నె చెఱవిడిపించుట. వ్యవహారములో గలదు.)

గీ. మన సుభద్ర...... మనసు భద్రమయ్యె విజయ 3-87.
మనసుతో దారసంగమమున. (రాఘవ పాండవీయము - పింగళిసూరన.)

క. నీకైతపంబుఁ జేసెద
నీకైవడిఁ దాపనేల యేనర్జునుఁడఁ, విజయ. (3-175)

ఈ కైవడి - ఈ ప్రకారము - ఈ వేషము, నీకైవడి - నీయొక్క - కై - చేతిని. వడి = వేగము - దాపనేల.

నీ చేయి వెనుక త్రిప్పనక్కరలేదు. నేను చెప్పగానే నా చేతిలో చేయి వేయుము - అని భావము.

---

† చిత్రభారతకర్త చరికొండ ధర్మన. విజయవిలాసకర్త కంటె నూరేండ్లు పూర్వుఁడు - క్రీ. శ. 1530 ప్రాంతమువాఁడు.

అప్పకవీయమున విజయవిలాసమునుండి యుదాహృతములైన పద్యములు :

| | | | |
|---|---|---|---|
| ప్రథమాశ్వాసము | - | 1-83 | ఆణిముత్యంబు... |
| ,, | - | 1-85 | దేవబ్రాహ్మణ... |
| ,, | - | 1-114 | తాసైరింపక...... |
| ,, | - | 1-158 | చెలువిలుకాని... |
| ద్వితీయా ,, | - | 2-4 | అనిన స్త్రీమది...... |
| తృతీయా ,, | - | 3-15 | చిత్తజుడల్లి తూపు... |
| ,, | - | 3-56 | కొమ్మపయిసీవు...... |

## వ్యాకరణ విశేషములు

అత్త్వసంధి :—లేనెలంత, ఈబిడారు (1-185).

ఇత్త్వసంధి :—బంతనున్ (1-102) బంతిది (2-107) తంద్రే (3-165) మఱందింత (3-107).

క్త్వార్థేకారసంధి :—అడిగిచ్చునో (1-59) దీనిని గవిసంశయ విచ్ఛేద కారుడు 'ఇడగవచ్చు నల్యప్పూసై నిత్యసంధి...లనుచుదంపం గోరిందుశేఖరు నన్నయట్లు కవిజనానుమతిని' అని సమర్థించి నాడు. అనవలసంటి (1-161), చూపిటు (2-202), ఉదంతంబు

విజయవిలాసము తాళపత్రప్రతులు, మదరాసు ప్రాచ్యలిఖితభాండాగారము: విజయవిలాసము. 769 నుండి 781 వఱకు తాళపత్రప్రతులు 782, 783, 784. సవ్యాఖ్యానము.

785. Note of C. P. Brown· This Commentary on the Vijayavilasam, a very Celebrated Telugu poem written by the learned Zuluri Appaya, on a Comparison of six manuscripts under the direction of C. P. Brown at Masulipatam in 1831.

N. B:—The preface is wanting in this Copy and must be supplied from my first manuscript when the book is Copied fair.

The name of the Commentator and the date of the Completion of Commentary are expected as given at the end of the M. S.

"ఈ విజయవిలాస ప్రబంధమునకు టీకరించేలాగున చార్లీసు ఫిలిప్ బ్రౌన్ దొరవారు సెలవిచ్చినందున మచిలీపట్టణమందు జూలూరి అప్పయపంతులు రచించబడినది. ఇంగ్లీషుసంవత్సరము 1830 డిశంబరు తే 11 ది వికృతినామసంవత్సర మార్గశిర బ॥ 12 ॥

నకు షష్ఠీకువర్ణకంబు పరంబగుచో నగాగముౌామి: వాడుకు (1-134), సిగ్గుకు (230), వంతుకు (2-37), స్వరలోపము: ఎత్తి (2-187), చాల్నిలుఁడు (3-61), మిశ్రసమాసములు: దినచలువలు (2-144). ఆత్మనేపదార్థమునందనుప్రయుక్తమగు కొను ధాతువు యొక్క క్త్వార్థక రూపమగు 'కొని' కి 'క' ప్రత్యయము వచ్చును: ఊఁదుక (1-134), కట్టుక (-3 154).

లఘ్వలఘురేఫలకు మైత్రి :—రూపము తారతమ్యము నెఱుంగు.

పై విశేషములన్నియు శివకవుల జాను తెనుఁగు సంప్రదాయము ననుసరించి సరియైనవియే. అద్యతన వైయాకరణ సంప్రదాయము ననుసరించినచో సరియైనవి కావు.

## సారంగధర చరిత్రము

చేమకూర వెంకటరాజు రెండవకృతి సారంగధరచరిత్ర, ఇదియును విజయవిలాసమువలె మూఁడాశ్వాసముల ప్రబంధము. ఈ ప్రబంధమున నవతారిక లేదు. ఆశ్వాసాద్యంతముల నున్న పద్యములు విజయవిలాసమునుండి గైకొనబడినవి. గద్య విజయవిలాసమందలి గద్యయే. 'ఇది శ్రీ సూర్యనారాయణ వరప్రసాద లబ్ధప్రసిద్ధ వాగ్విభవ సుధాసార జనిత యశోలతాంకూర చేమకూర లక్ష్మణామాత్య కుమార సమారాధితబుధసమాజ వేంకటరాజ ప్రణీతంబైన ...... తృతీయాశ్వాసము.' ఇందు ప్రథమాశ్వాసమున 136 గద్య పద్యములును, ద్వితీయాశ్వాసమున 283 ను, తృతీయాశ్వాసమున 270 యును,

---

వరకు సంపూర్ణమైనది." తంజావూరి పుస్తకభాండాగారము 251–255. 5 ప్రతులు 1 సమగ్రము, 4 అసమగ్రము.

ముద్రితప్రతులు :— 1860 వివేకకళానిధి ముద్రాక్షరశాల. 1883 బహూరి త్యాగరాయ శాస్త్రిగారి టీకతో ముద్రితము. 1894. అముద్రిత గ్రంథచింతామణి మూలము మాత్రమే. 1900. కొచ్చర్లకోట రామచంద్ర వేంకటకృష్ణారావుగారిచే ముద్రితము. 1911. వేదము వేంకటరాయ శాస్త్రిగారి టీకతో ముద్రితము. 1952. శ్రీ బులుసు వేంకటరమణయ్యగారి టీకతో ముద్రితము (వావిళ్ల.)

మొత్తముమీఁద 689 గద్యపద్యములు గలవు. దీనికి వ్యాఖ్యగలదు. వ్యాఖ్యతో నీ గ్రంథము ముద్రితము.[1]

## మూలకథ

తెనుఁగు దేశమున జనరంజకములగు కథలలో నొకటియగు నీ సారంగధర చరిత్రకథను గౌరన 'నవనాథ చరిత్ర'మను ద్విపద కావ్యమునఁ జెప్పియున్నాఁడు. ఈతఁడు క్రీ. శ. 1480 ప్రాంతము వాఁడు. అందు 'చౌరంగి' అను సిద్ధుని కథయే సారంగధరుని కథ. ఇది మహారాష్ట్ర దేశమున వెలసిన 'నాథపంథీయ' సంప్రదాయమునకుఁ జెందినది. మాళ్వాదేశమున జరిగినది. గౌరనకృతిలోఁ గథారంగము మాళవదేశమనియు, మాంధాతపురమనియు రాజు రాజమహేంద్రుఁడనియు నున్నది. మాళవదేశమునుండి యీ కథ కాంధ్రదేశముతో సంబంధముఁ గల్పించినవాఁడు దోనూరి కోనేరునాథుఁడు. ఇతఁడు క్రీ. శ. 1549 లోఁ దాను రచించిన ద్విపద బాల భాగవతమునకుఁ జివర నార్వీటి రాజుల పూర్వులను వర్ణించుచు నందులో విమలాదిత్యునికి భానుమతికిఁ దనయుఁడైన రాజరాజనరేంద్రుఁడు, రాజమహేంద్రనగరమను పురము గట్టించి వేఁగిదేశమేలెననియు, నాతని పెద్దకొడుకు సారంగధరుఁడనియుఁ బినతల్లియైన చిత్రాంగి చేసిన యపకృతిగడచి చౌరంగి (సారంగధరుఁడు) అను సిద్ధుఁడయ్యెననియుఁ జెప్పినాఁడు. క్రీ. శ. 1620-30 ప్రాంతముల నీ కథనే తొలుతఁ బ్రత్యేక పద్యకావ్యముగ వ్రాసిన చేమకూర వేంకట రాజు, మాళవ మాంధాత నామములుజ్జగించి, రాజమహేంద్రనగరము రాజధానిగాఁజేసి, మహాభారత కృతిభర్తయగు రాజరాజనరేంద్రునితో నీ కథకు సంబంధము దృఢపఱచియున్నాఁడు. చేమకూర వేంకట కవి కృతి ననుసరించి యీ కథను రచించిన, బొణాల శంభుదాస కూచి

---

1. (a) బరూరివారి ప్రతి 1855. b. వేదమువారి ప్రతి. c. వావిళ్ళవారి ప్రతి. d. కొండపల్లివారి ప్రతి. e. శ్రీ దీపాల పిచ్చయశాస్త్రిగారి ప్రతి 1942. జితకాశి వ్యాఖ్యా సమేతము. ఇది నవీనపథకము ననుసరించి కూలంకషముగా వ్యాసంగము చేసి ప్రకటితమైన ప్రాచీన కృతులలోఁ బ్రత్యేకముగఁ బరిగణింపఁదగినది. ఈ గ్రంథము నుండి యనేక విషయములిందు సంగృహీతములైనవి.

మంచి తిమ్మకవ్యాదులందఱును నీ కథ యాంధ్రదేశమున జరిగినట్లే వ్రాసినారు. క్రీ. శ. 1656 లో నప్పకవి యీ కథకు స్థిరత్వము గల్పించుటకు సారంగధరునికి నాంధ్రశబ్ద చింతామణికి ముడిపెట్టినాఁడు. ప్రజాసామాన్యమున బహుళ ప్రచారమందిన యీ కథకు సంబంధించి నవి ముప్పది రచనములు వివిధ వాఙ్మయ శాఖలలో గలవు.

వేంకటరాజు గౌరన గ్రంథమునందువలె చిత్రాంగి యుంపుడుగత్తె యని చెప్పఁగా, బాణాలశంభుదాసుఁడు పైకోనేరునాథుని వ్రాఁతకు భంగమువచ్చునని రాజనరేంద్రుని భార్యగా నొక చిత్రకథ కల్పించి నాఁడు. తిమ్మకవి దాని ననుసరించినాఁడు. కాని యీ మార్పు సరసముగ నుండలేదు. గౌరన కృతిలో సారంగధరుని భార్యపేరు మంగళాంబయని యుండగా వేంకటరాజు 'మంజువాణి' యని మార్చినాఁడు. ఇది సరస ముగ నున్నది.

## కథాసంగ్రహము 1

ప్రథమాశ్వాసమున రాజనరేంద్రుని సంతానచింత - ఈశ్వర ప్రసాదమువలన సారంగధరుఁడు జన్మించుట - అతఁడు దినదినాభివృద్ధి నంది యౌవనవంతుఁడగుట - చెంచుల విన్నపమునసుసరించి రాజువేఁటకుఁ బోవుట-సారంగధరుఁడు పావురాల పందెము నాడుట - ఆ పందెములో సారంగధరుని పావురము చిత్రాంగి మేడపై వ్రాలుట - అను విషయ ములు గలవు.

ద్వితీయాశ్వాసమున సారంగధరుని చిత్రాంగివద్దకుఁ బోవలదని సుబుద్ధి నివారించుట - సారంగధరుఁడు వినక వెడలుట - చిత్రాంగి వలపు- సారంగధరుని నిగ్రహము - చిత్రాంగి సారంగధరుని హింసించుటకుఁ బ్రతినపూనుట - రాజు చిత్రాంగికై విరాళిగొనుట - విరహబాధ సహింపలేక రాజధానికి వెడలుట - చిత్రాంగిసాంత్వనము - చిత్రాంగి సారంగధరునిపై నేరము మోపుట - రాజు మంత్రులతోఁ బెద్దలతో

1, జితకాశి, పుట 55 పీఠిక.

నాలోచించుట - యను విషయములు గలవు. తృతీయాశ్వాసమున చిత్రాంగి వదలింప నామె చేకముష్టీకరించుట - రాజు సారంగధరునికి కాలుసేతులు ఖండించు శిక్షవిధించుట - తలారులు కొనిపోవుట - రత్నాంగి చిత్రాంగి సంవాదము - రత్నాంగి రాజుతో మొఱపెట్టు కొనుట - ఆమె సారంగధరుని జూచి దుఃఖించుట - సారంగధరుఁడామె నోదార్చుట - తలారులు సారంగధరుని కాలుసేతులు నఱికి పొంచి యుండుట - మత్స్యేంద్రనాథుఁడు వచ్చి సారంగధరునితో నాతఁడు దోషికాఁడని చెప్పుట - ఆమాటలు తలారులు రాజున కెఱింగించుట- రాజు చిత్రాంగిని బిలిపించ నామె యబద్ధమాడుట - ఆకాశవాణి నిజము చెప్పుట - రాజు చిత్రాంగిని బావిలోనికిఁ ద్రోయించుట సారంగధరుఁడు మత్స్యేంద్రనాథుని యనుగ్రహంబున కాలుసేతులు వచ్చి సిద్ధుఁడగుట - అను విషయములు గలవు.

వేంకటకవి కథాభాగముననుసరించుటయేగాక, గౌరన ద్విపద పంక్తులకుఁ బద్యానువాదములఁ గూర్చియున్నాఁడు.

గౌరన :

ద్వి. తల్లి ! నాయెడ నీకుఁదగునె కోపంబు
పల్లడిఁగొనుమన్న మన్మథు వెతకుఁ
గాక నీపలుకు విఘాతమాటలకుఁ
జీకాకుపడి ధర్మశీలంబువదలి. (పుట. 51)

వేంకటకవి :

క. తల్లీ ! నాపైనీకుం
జెల్లునె కోపంబు మదనశితశరపాళీ
హల్లకనిహతి వ్యథచేఁ
దల్లడపడి పట్టిదూఱ తగవా పూనన్ ? (2-140)

గౌరన :

ద్వి. పలికితినోరి ! నాపతిలేనివెనుక
నలుకక కనుఁబెట్టి యంతఃపురంబు
వన్నెలుపచరించి వడిఁజొచ్చివచ్చి
నన్నుఁజేపట్టి మన్మథ వికారమున

జడమాటలాడెదు విభునికేఁగూర్తు
నొడలుఁ బ్రాణంబులు నుర్వీశుసొమ్ము
పాపాత్మ ! పినతల్లిఁ బట్టియీరీతి
చేపినకష్టూలే యెడ్గ్మైనఁ గలరె. (పుట 85)

**వేంకటకవి :**

శా. ఓరీ ! నాపతిలేనిచో భయములేకొక్కింత శుద్ధాంత మె
య్యారం బేర్పడఁ జొచ్చినన్నుఁగని కామాంధుండవై ప్రేలెదీ
వారాజన్యుని సొమ్ముప్రాయమును నా ప్రాణంబుఁ బామ్మారకే
యీరీతిన్ పినతల్లిఁ బట్టిన ఖలుండెచ్చోఁ గలండేమహిన్ ? (2-228)

ఇట్లనువాదములున్నను చేమకూరకవి సిద్ధహస్తుఁడగుటచే, నీ ప్రబంధమున నొక ప్రత్యేక వ్యక్తిత్వము నొడఁగూర్చినాఁడు. సారంగధర చరిత్రలోఁ దెనుఁగు నుడికారము పెంపునింపు నింపుచున్నది.

లోకోక్తులను వాడుటలో నీకబ్బమునఁగవి చాల నేర్పు చూపినాఁడు. "కొండంత దేవరకు కొండంతపత్రి - గ్రామోనాస్తికుతస్సీమా - ఏటావలి గిలిగింతలు - తలప్రాణము తోఁకకువచ్చె - మేనమామపోలిక" మొదలగునవి యితరకవులు వాడినను నీతని పాడుకయందవి యన్వర్థమైనవి.

జాతీయోక్తులతో శ్లేషార్థమును సమర్థించుట- "శకునమడ్డగించిన పని, బొట్టుపెట్టినట్లు, పులుసువిఱుగు, బుజాలు మూఁడయి" మొదలగునవి.

శ్లేషబిగింపులు "మనసెఱుఁగని కల యొడలు మఱచిన శివము - మెత్తనిచోటనె గుద్దలివాడు - మూడుత్తరవులు."

శబ్దాలంకారమున యమకమున కీతఁడు పెట్టినదిపేరు. అవి మప్రయత్నముగనే వచ్చిపడుచుండును : "జనవరుకేలన్ - మనసరులన్- పరియలుగా - మురియలుగా - నురియలుగా." ఇక తెనుగునఁ బదముల విఱుపులలో నర్థాంతరములు గలుగునట్లు రచించునేర్పితని కలవడినట్లు వేఱొక కవి కలవడలేదు. "సారంగధరునకు న్మనసారంగను - సెలవిండు లెక్కపెట్టుచు సెలవిండు నృపాలయనుచు - మేదినీవరేణ్యా నీ వరణ్యామునకు" ఇట్టివి ఎచ్చటఁజూచిన నచ్చట గన్పట్టుచు ముచ్చట లొదవించుచుండును.

ఇట్టి లోకోత్తర శిల్పనైపుణిం జూచియే, కవితా మర్మజ్ఞుఁడగు రఘునాథ నాయకుఁ డీతని "క్షితిలో నీమార్గ మెవరికిన్ రాదు సుమీ" యని ప్రశంసించినాఁడు. సారంగధర చరిత్రమునందలి కవితాశిల్పమునుగూర్చి ప్రసిద్ధ విమర్శకుల యభిప్రాయముల నిందు పొందుపఱచు చున్నాఁడను.

బ్రౌనుదొరగారు :—"విజయవిలాసము a poem in three books describing the marriage of Arjuna – సారంగధర పద్యకావ్యము This poem is greatly admired for the beauty of it's style, which is very intricate."

వేదము వేంకటరాయశాస్త్రిగారు :—"ఇందు పూవుమొగ్గలవోలె తామే విచ్చు శ్లేషలును, ద్రాక్షాపాకంబున [illegible] రసములుం రచనలును పదాచారాభిమానం బుట్టికొల్పు ఛందశ్శిల్ప నిబంధన నైపుణియు విసిగింపని వర్ణనలును, బరువులు బరువులుంగాని [illegible] వులును ఈ ప్రబంధమును భారతీ భాండారమునందు [illegible]స్థానమందు నెలకొల్పుచున్నవి."

విద్వత్కవి దీపాల పిచ్చయ్యశాస్త్రిగారు :—"సారంగధర చరిత్ర చక్కని జానుతెనుగు కావ్యము, వెంకటకవి తెలుగు పొలము నాలుగంచులు తిరిగి, ఆటలు, పాటలు, ఆచారములు, అలవాటులు, సంప్రదాయములు, సాంగెములు మున్నగువాని తీరుతీయము లెఱింగి, సీమసీమలలోని జాతీయములైన పలుకుబడులను, నానుడులను (లోకోక్తులను) సంతరించి అందు మేల్తరము లేల్చికూర్చి, నుడికారపు సొంపుతో, ప్రతిపద్య చమత్కృతితో నీ కమ్మని కావ్యము తీర్చినాఁడు. విజయవిలాసమునను శబ్దశిల్పము గలదు గాని శ్లేషాది చమత్కృతు లింత ప్రౌఢములైనవి లేవు. శిల్పనైపుణిచే చెన్ను మిగిలినను కవితా కమనీయతయందును రచనా సౌష్ఠవమునందును సారంగధర, విజయవిలాసమున కించుక వెనుకపడిన మాట నిజము"

## సారంగధర చరిత్ర - వచనానువాదము

చేమకూర సారంగధర చరిత్ర పద్యకృతికి సముఖము వేంకట కృష్ణప్పనాయకుఁడు తూ. చా. తప్పక వచనానువాదమును గావించి యున్నాఁడు. దాని వివరముల నాతని గ్రంథమునఁ జూడనగును.

ప్రసిద్ధ లాక్షణికుఁడగు నప్పకవి సారంగధర చరిత్రనుండి యొక సీస పద్యపాదమును నొక చంపకమాలను నుదాహరించి యున్నాఁడు.[1]

వేంకటకవి విజయవిలాస సారంగధరచరిత్రలలో సారంగధర చరిత్రయే యాతని తొలికృతి యను నూహ కాధారముగ నీ క్రింది కథను వీరేశలింగము పంతులుగారు వేంకటకవి చరిత్రమున నుదాహరించి యున్నారు.

"రసికావతంసుఁడైన కృతిపతి తన కంకితము చేయఁబడిన సారంగధర చరిత్రమునంతను విని యందు శోకరస మత్యద్భుతముగా వర్ణింపఁబడుట చూచి యది నిజముగా నేడిచినట్టే యున్నదని పలికెననియు, ఆపైని కవి తన శక్తినంతయుఁజూపి ప్రతి పద్య రసాస్పదముగా విజయవిలాసమును చేసి తీసికొనివచ్చి వినిపింపఁగా నతని యింటిపేరునుబట్టి శ్లేషించి చేమకూర మంచి పాకమునఁ బడెనని మెచ్చుకొనెననియుఁ జెప్పుదురు." (ఆంధ్రకవుల చరిత్ర ద్వితీయభాగము 246 పుట).

సారంగధర చరిత్రలో కృత్యాది పద్యములు లేకపోవుటగూడ నైపై కథ సత్యమనియే స్థాపించుచున్నది[2].

---

1. సీ. ఉమ్మెత్తపువ్వునా నొరపైక కుచ్చెళ్లు చెలఁగి మీఁగాళ్ళపై చిందులాడ. (1-120)
చ. తలఁదు లేఁగలేఁగ ... ... ... ... ... (3-117)

2. మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారమునయున్న M. Nos. 13-10-20, 14-3-4, 14-19-4. సంఖ్యలుగల తాళపత్రప్రతులలో కృత్యాది పద్యములున్నను నవి చేమకూర వేంకటరాజకృతములే యని చెప్పుట కేయాధారమును లేదు.

# కృష్ణాధ్వరి

ఈతఁడు నైషధపారిజాతీయమను శ్లేషప్రబంధమును రచించి రఘునాథ భూపాలుని కంకితముఁ గావించియున్నాఁడు. ఈ గ్రంథము నీనాఁటి పరిశోధకులు కిన్ను తెలుపక పూర్వము [illegible] సలోపాఖ్యాన పీఠికలో[1] 'సముద్రితగ్రంథ చింతామణ్యాది సంపాదకులు' పూండ్ల రామకృష్ణయ్యగారును, ప్రథమ కవిజీవిత రచయితలగు గురుజాడ శ్రీ రామమూర్తి పంతులుగారు తమ [2]ద్వ్యర్థి కావ్య కవుల జీవితములలోను దీనినిగూర్చి తెలిపి యీక్రింది పద్యము నుదాహరించిరి :

ఉ. శ్లేషము లేమియుం గన [illegible]
దుర్భాషణ భాషితంబులను [illegible]
శ్లేషకృతుల్ ప్రసిద్ధిగని శ్రీ రఘునాథ [illegible]
నైషధ పారిజాతకృతి నాయకు [illegible]

ఈ గ్రంథము నేటివరకు నముద్రితము. తంజావూరి పుస్తకశాలలో M. 215 సంఖ్యగల యొక్క తాళపత్ర ప్రతి మాత్రము దీనికిఁ గలదు. వేఱొక ప్రతి లేదు. తంజావూరి పుస్తక సూచికయందు నందులో నైదాశ్వాసము లున్నట్లు తెలుపఁబడియున్నది. కాని గ్రంథాంత గద్య- 'ఇది శ్రీమద్రఘునాథ పాలనానుభవ [illegible] కృష్ణాధ్వరి విరచితంబైన నైషధ పారిజాతీయంబను పుణ్యశ్లోక శ్లేష ప్రబంధంబునందు చతుర్థాశ్వాసము' అనునది పరిశీలించినను, గ్రంథము చక్కఁగాఁ బరికించినను నిందు నాల్గాశ్వాసములే యున్నట్లు నిశ్చయింపవచ్చును.

రఘునాథనాయకుఁ డీకృతికి ముందు పెక్కు కృతు లందినట్లు కృష్ణాధ్వరి యిట్లు తెలుపుచున్నాఁడు.

సీ. నవరస 'శ్రీరఘునాథ భూపాలీయ'
నామభామాభీష్ట నాయకుండు
సరస 'నైషధ పారిజాత' కాహ్వాయ కావ్య
వర్యా స్వయంవర వల్లభుండు

1. పీఠిక 12 పుట. క్రీ. శ. 1892.

2. ద్వ్యర్థి కావ్య కవులు—పింగళి సూరన. పుట 314. క్రీ. శ. 1892.

కళ్యాణ 'కౌముదీ కందర్ప' నాటక
కన్యోద్వాహన బద్ధకంకణుండు
అమరు కాలంకారహారి భంగ్యైక శృం
గార సంజీవనీ కాముకుండు.

గీ. తాళచింతామణీ వస్తూతస్పకుండు
మంచి జామాత రఘునాథమనుజనేత
తెలియ నైషధపారిజాతీయ కృతియు
నేవురక్కల చెల్లెలై హెచ్చుననుచు.

ఇందు పేర్కొనఁబడినవన్నియు సంస్కృతగ్రంథములు - కృష్ణాధ్వరి తెలుఁగుకృతి నిచ్చుచున్నాఁడు గాన నేవురు సంస్కృత కన్యలకు నీ తెలుఁగు కృతికన్య చెల్లెలుగా విలసిల్లునని చక్కఁగాఁ జెప్పియున్నాఁడు.

## కృతిరచనా సందర్భము

కృతిపతి రఘునాథుఁడు పారిజాతాపహరణ కావ్యమును, నల చరిత్రమును తెనుగున రచించియే యున్నాఁడు. ఇందులో పారిజాతాపహరణము లభింపలేదు కాని నలచరిత్రము లభించుచున్నది. అది ద్విపద కావ్యము. ముందుదాహృతమైనదే - కృష్ణాధ్వరియుఁ గృతిపతి రచించిన కథలనే గ్రహించి, యసమాననైపుణ్యముతో నాకథలను జోడించి యేకైక కృతిగా రచించి, యాతని కంకితము గావించినాఁడు. ఈ విషయమే గ్రంథాదిని.

ఉ. నైషధ పారిజాతహరణ ద్వికథార్థ సమర్థన (క్షమా)
*శ్లేషగతి ప్రబంధము ఫలించిన మా రఘునాథశౌరి సం
తోషముఁ బొందునట్లడకతో దశదిగ్జయ శోభిసద్యశో
భూషణమైన యీకృతికిఁ బూనితి ప్రౌఢనిరూఢిఁ జెందఁగన్.

---

* తంజాపురాంధ్ర నాయకరాజ చరిత్రమున పుట 237 లో "కృష్ణయజ్వ కూడా తెనుగున శృంగారనైషధ పారిజాతమను ద్వ్యర్థి కావ్యమును రచించెను." అని కలదు. గ్రంథనామమునం దెక్కడను ముందు శృంగార పదము గన్పట్టుటలేదు. ఇది శ్లేషప్రధానమగు ద్వ్యర్థి కావ్యము - గ్రంథములో "నైషధపారిజాత హరణద్వికథార్థసమర్థన క్రియా శ్లేషగతి ప్రబంధము" అనియు, గద్యలో 'నైషధపారిజాతీయంబను శ్లేషప్రబంధంబు' అని కలదు.

తనకు నీ రచనయందు మార్గదర్శకులగు సూరన, రామరాజభూష ణులను స్తుతించు పద్యము "ప్రేమముతేక" ముందు చూహరించితిని. కృష్ణా ధ్వరికూడ నసామాన్య ప్రతిభగలవాండగుటచేత నీ రచన ముత్తమ శ్రేణికిం జెందినదిగా విలసిల్లినది :

## కథాసంపుటీకరణము

ఈ ప్రబంధ కథలలో నలకథ మహాభారతారణ్య పర్వమునను, సంస్కృతాంధ్ర నైషధములయందును గలదు. పారిజాత కథ భాగవత మున నున్నది. ఇందు మహాభారతమున నలుని కథలో నలదమయంతీ వివాహానంతరము రాజ్య వినాశమును బునఃప్రాప్తియుం గలవు. తెనుంగు నైషధమున వివాహముతో గ్రంథము పరిసమాప్తమగుటచే, నా భాగ మునే కృష్ణాధ్వరి గ్రహించినట్లు లీ క్రింది పద్యమువలనం దెలియుచున్నది:

క. శ్రీహర్ష శ్రీనాథ
వ్యాహార ప్రతిభ సంస్కృతాంధ్ర నిబంధ
వ్యూహాని నాకువోవుట
యోహాను వృథయా (ద్వికీన) హేరిక కనుమణ్ణా."

## ప్రథమాశ్వాసము

నలకథ :-"చారులమూలమున దమయంతీ సౌందర్యగుణ విశేష ముల నెఱింగిన నలుండామెయందు బద్ధహృదయుండై ప్రొద్దుంబుచ్చుటకు నుద్యానవనమున కేంగి యందు హంసనుబట్టుకొని యమాత్యుడై వేండిన దాని కభయంబిడెను. ప్రత్యుపకార మొనర్ప నెంచిన హంసయు దమయంతి యొద్ద కప్పుడె యేగియామె నలునియందను రక్తయగునట్లొనర్చెను.

పారిజాత కథ :- శ్రీకృష్ణుండు, చారులవలన నరకాసురుని దుష్ట వర్తనము విని యొకనాండు వనమున విహరించుచుండ నరకపీడితులైన దేవతలాతని శరణుంబొచ్చిరి. ఆర్తులైనవారికభయంబిడి యాతండు నరకునివధియింప నిశ్చయించెను. దేవేంద్రుండంత నాతనికి నరకుని

కారాగారముననున్న రాజకన్యల వార్త నెఱింగించి వారి నాతనితోఁ గూర్చువాఁడై యప్పుడ రాజ కన్యలయొద్ద కేగి వారు శ్రీ కృష్ణునియందు బద్ధహృదయలగున ట్లొనరించెను.

## ద్వితీయాశ్వాసము

నలకథ :- నారదుఁడు దేవలోకమున కేగి దిక్పాలురతోఁ గొలువున్న యింద్రునకు దమయంతీరూపమును వర్ణించిచెప్పి యింద్రాదిదిక్పాలకు లామెను వరింప భూలోకమున కేగఁ బ్రతిన సల్పునట్లొనరించెను. విదర్భపురమున భీమరాజు దమయంతీ స్వయంవరసన్నాహ మొనరించెను.

పారిజాత కథ :- నారదుఁడు ద్వారక కేగి శ్రీకృష్ణుఁడు రుక్మిణితో నుండ నొక పారిజాత పుష్పమును గృష్ణునకిచ్చి యాతనిచే దానిని రుక్మిణి కిప్పించెను. ఆ వృత్తాంతము విని యాగ్రహించిన సత్యభామకు శ్రీకృష్ణుఁడు దేవలోకమునుండి పారిజాత వృక్షమును దెచ్చియిచ్చుటకుఁ బ్రతినఁజేసెను. అనంతరము శ్రీకృష్ణుఁడు నరకాసుర వధకై ప్రాగ్జ్యోతిషమున కేగ సన్నాహ మొనర్చి సంసిద్ధుఁడై యుండెను.

## తృతీయాశ్వాసము

నలకథ :- ఇంద్రాగ్ని యమవరుణులు స్వయంవరమునకై భూలోకమున కరుదెంచి స్వయంవరమునకుఁబోవు నలుని మార్గమునఁ గాంచి యాతనిఁ బ్రార్థించి దమయంతియొద్దకు దూతగాఁ బంపిరి. భీమరాజు స్వయంవరాగతుల నెదురుకొని గారవించెను. నలుఁడు దమయంతి యందమును వర్ణించి యనంతరము దౌత్యమును నెఱవేర్చెను.

పారిజాత కథ :- శ్రీకృష్ణుఁడు బలదేవసాత్యకి కృతవర్మాదులతో నరకునిపై వెడలి మార్గమధ్యమునఁ దన్నుఁగాంచిన యింద్రాదులఁ బంపి నరకునిపురమును ముట్టడించి సకలబల సహితముగ నాతని నని( దునిమెను ఆనంతరము ప్రాగ్జ్యోతిషమును బ్రవేశించి నరకుని* కారాగారముననున్న రాజకన్యల రూపమును వర్ణించి వారితో సంభాషించెను.

## చతుర్థాశ్వాసము

**నలకథ :-** భీమరాజు ప్రార్థింపఁగా సాక్షాత్కరించిన సరస్వతీదేవి రాజకుమారుల నొక్కొక్కరిని దమయంతికి వర్ణించి చెప్పుచు నామె వారిని వరింప నిచ్ఛగింపకుండ వేఱొక్కని వర్ణించుచు నిట్లు షోడశ సహస్ర రాజకుమారుల వర్ణించెను. అనంతరము నలకూబరాదులగు నింద్రాదుల మంచెల డాసి వర్ణించి యనంతరము నలుని వర్ణించెను. అప్పుడు దమయంతి యుత్సుకత నొందఁ సరస్వతి యామెను కొనియాడెను. దమయంతియు నలుని కంఠమునఁ బుష్పదామము [illegible] యాతని వరియించెను. ఆ యుత్సవ సమయమున [illegible] గంధర్వులు [illegible]. నలుఁడు దమయంతిని వివాహమాడి స్వరాజ్యమునకేగి యామెతో వివిధ భోగములఁ దేలి పుత్రపౌత్రయుక్తుఁడై సుఖముగా రాజ్యమేలుచుండెను.

**పారిజాతకథ :-** కృష్ణునిచేఁ బ్రార్థితుఁడై [illegible] సత్య [illegible] యొక్కొక్క రాజపుత్రికిఁ గృష్ణుని వర్ణించి చెప్పి [illegible] కృష్ణుని వరించిన యభిప్రాయ మెఱింగి యన్యరాజకుమారులఁ [illegible] నిట్లు షోడశ రాజకుమారికలకును గృష్ణుని వర్ణించి చెప్పెను. అంతఁ దనయందు బద్ధానురాగలగు వారిఁ గృష్ణుండు ద్వారకకనిచి సత్యతో స్వర్గమునకేగుచు మేరువును డాసి యామె కింద్రాది నివేశంబులు వర్ణించి [illegible], స్వర్గప్రవేశ మొనరించి యదితికిఁ గుండలములర్పించి [illegible] యింద్రోద్యానమందలి పారిజాత [illegible] నిలిచి యడ్డగించిన దేవతలనదిమి సత్య [illegible] ద్వారక కేగి యామె యుద్యానమున నా వృక్షరాజమును బ్రతిష్ఠించి [illegible]త్తమున రాజకన్యా సహస్రంబుఁ జేపట్టి దక్షిణనాయకుఁడై మెలంగుచుఁ బుత్రపౌత్రయుక్తుఁడై సుఖముగా రాజ్యము చేయుచుండెను.”

కృష్ణాధ్వరి పై రెండు కథలయందును నే కథలను బూర్ణముగా మూలమునుండి గ్రహింపక రెండింటిని నిపుణముగా మేళవించెను. భాగవత కథయందలి యింద్రాదులు శ్రీకృష్ణునితో నరకుని దుష్కృత్యములు దెల్పుటయు నాతనినరకుఁడు వధింపఁబ్రతిన వట్టుటయునను కథతో

ప్రారంభించి దానికిఁ దిమ్మన (పారిజాతాపహరణములోని) కథకుమాత్రమె యగు కథలోని నారదాగమనమును, అతఁడొసఁగిన పుష్పమును శ్రీకృష్ణుఁడు రుక్మిణి కిచ్చుటయు నందులకు సత్య యాగ్రహింప నామె కాతఁడు దేవలోకమందలి పారిజాత వృక్షమునే తెచ్చి యిచ్చుటకు బాసయిచ్చుటయు ననుకథ నతుకు వెట్టి యనంతరము నరకవధయు నదితికుండలము లిచ్చుటకు స్వర్గమున కేగి మరలివచ్చునపుడు దేవపారిజాతమును హరించుటయు, షోడశ సహస్రరాజకన్యలఁ బరిణయ మగుటయు నను భాగవత కథాభాగముతో ముగించెను. ఈ కల్పనచే నారదుఁ డింద్రాది దిక్పాలకులకు దమయంతీ రూపగుణములు వర్ణించిచెప్ప వారామె పాణిగ్రహణమునకై విదర్భాపురమున కేగఁ బ్రతినసల్పిరను నైషధ కథ కనుకూలకథ యేర్పడుటేకాక మిక్కిలి రసవంతమై భాగవతకథకు వన్నెవచ్చినది.

ముఖ్యమగు నీ మార్పేకాక నైషధ కథానురోధముచేఁ బారిజాత కథయందును, బారిజాతకథానురోధముచే నైషధకథయందును గవిచేసిన మార్పులనేకము కలవు. శ్రీకృష్ణుఁడు తన్ను వలచిన పదునాఱువేల రాచకన్యలను మన్నించి యందలమున నిడి ద్వారకకుఁ బంపినట్లు భాగవతముననుండఁ గృష్ణాధ్వరి దమయంతీస్వయంవరానురోధముచే శ్రీకృష్ణుఁడుదన్ను రాచకన్నియలకు వర్ణించి చెప్ప సత్యను బ్రార్థించె ననియు నామె యొక్కొక్కతెకు వేర్వేర నాతని గుణరూపములు వర్ణించి చెప్పెననియుఁ గల్పించెను. ఇట్లే సత్యకింద్రాదిని వేశంబులు వర్ణించి చెప్పుట మొదలగునవి కూడ కల్పింపఁబడెను. పారిజాత కథయందలి కృష్ణనరకాదుల యుద్ధమున కనుకూలముగ భీమరాజు స్వయంవరాగతుల నెదుర్కొనుటయు శ్రీకృష్ణుఁడింద్రాదులతో యుద్ధముచేయుట కనుకూలముగ నలవరణ సమయమందలి సమ్మర్దమును గంచుకులు వారించుటయు[1] లోనగునవి కల్పింపఁ బడినవి.

---

1 సీ. ప్రాసఖడ్గాదిసంబాధులౌ యోధుల దండకురాకుండఁదరిమితరిమి, ప్రస్ఫురత్ఖురరజోభ్రాజులౌ వాజులదొమ్మిఁగ్రమ్మరకుండఁదోలితోలి, రజ్జన్మదస్రవారంభులౌ కుంభులకోటిదూరంబుగాఁ గొట్టికొట్టి, పటురయాక్రాంతసత్పథములౌ రథములఁగనుచూపుమేరనేగదిమిగదిమి. తే. కంచుకేశలధికారివక్షమునడవ (?), రాజమార్గంబుసర్వతోరణము గనుచు, నావధూవరులతి మాత్రహర్షులైరి, దైవతావనిపత్రచూతముల నీడ క. అమ్మహీపాలకుమారుల, యొమ్మికదెలుపంగనేర ఁడొరుఁడనివిశ్వా, భూపతి, నెమ్మదిఁబ్రార్థింపవచ్చెనరుదయింపఁ

వ. సారసనాభురాణియమ్మహాబాహు నెదిరి ప్రత్యక్షమయ్యె.

ఈకవి వర్ణనలకును మృదుపదరచనా నైపుణ్యమునకును సులభగ్రాహ్యశ్లేషకు నీక్రిందిపద్యముల నుదాహరణములుగా గ్రహింపనగును.

## ఉభయకథాపక్షములను జంద్రోదయవర్ణనము

" సీ. అంధకారము గొంచు మలకమనూకిన నేమి
వెన్నెలకుబ్బఁ గావింపలేదె
అంభోరుహశ్రీల నాహరించిన నేమి
కైరవంబుల నెల్లఁ గావలేదె
కోకంబులకు మేలుఁ గూర్పకుండిన నేమి
నెరిఁ జకోరముల మన్నింపలేదె
విరహిదంపతులకు వేఁడి చూపిన నేమి
సుఖితులకును జల్లఁజూపలేదె

గీ. మేలుదలఁచినవారికి మేలుచేయుఁ
గీడుదలఁచినవారికిఁ గీడుచేయు
వీఁడు గాఁడిల్లె నెత్తి దీవించనేల
ధర్మమిది రాజమాత్రసాధారణాలకు."

## పురవర్ణనము, స్త్రీవర్ణనము

సీ. రంగానుకరణచన్నా రంగానుకంపల
నోఁచుయుచు నుండు పయోధరములు
కంటికిదూరమౌ కాంతాపటంబు
నధఃకరించు మధ్యమునుఁదవి
మాలిన్యమెఱుఁగని మణిదర్పణంబులఁ
గపఁకొత్తుముఖ చంద్రకాంతకాంతి
మించురత్నాకర మేఖలకును భూష
ణంబైన నాఁడు నితంబభాగ

తే. మానవర్ణింపఁ బ్రబద్యమ్ము హర్మ్యమిట్టి
దంతిరోయని మరినిశ్చయింపరాని
నుమాననటించెరా ... ...
నృపతి పుత్రికలు జూచి హృదయమలర."

నొరయుచునుండు (పు)[1] రాచుకొనుచుండు (స్త్రీ) పోటీచేయుచుండు పయోధరములు (పు) మేఘములు (స్త్రీ) స్తనములు.

రత్నాకరమేఖల (పు) సముద్రము నొడ్డాణముగాఁగల భూమి (స్త్రీ) రత్నముల కాకరమగు నొడ్డాణము.

వ. సత్యాయత్తచిత్తానుపర్వకార్య నిర్వహణంబుకై వచ్చితి నంటివి తత్సాక్షికంబుగా నిన్ను వరించెద ముదితస్వయంవరోత్సవంబున ననుచు రాజకన్యలక్షణంబున విన్నవింప ననుకంపమానుండై విని శేషు సోమశ్రవణంబు శోభనకృత్యంబులకనిశిరంబు ప్రవేశించి హర్షోత్కర్షంబున సమస్త రాజలోక సాధారణ నాగరిక సౌవస్తిక సంభాషణంబుల విదర్భభూపతి పూజ్యమానుండై సముద్య దద్యశ్విన వివాహశోభ నలుండు నగరిశృంగారంబు గావింపగా మించుచుండునప్పుడు.

సత్యాయత్తచిత్తా { (నై) [2]సత్యమునకధీనమైన చిత్తముకలవాఁడా / (పా) సత్యభామ కధీనమైన చిత్తముకలవాఁడా }

తత్సాక్షికంబుగా { (నై) సుపర్వులు సాక్షులై యుండఁగా / (పా) సత్యభామ సాక్షియైయుండఁగా }

రాజకన్యలు+అక్షణంబున (పా) రాజకన్య+లక్షణంబున (నై)
విదర్భభూపతి+పూజ్యమానుఁడై (పా)
విదర్భభూపతి (చేతఁ) బూజ్యమానుఁడై (నై)
వివాహశోభ (చేత) నలుండు (నై)
వివాహశోభనలు+ఉండు (పా)

క. ధృతిచే విదర్భభూపతి, సుతనుసమాజంబునెల్లఁ జొక్కించి శుభ
స్థితిఁ బెండ్లియాడె నధిగత, రతిభావనలుండు సానురాగ శ్రీలన్.

విదర్భభూపతిసుతను=విదర్భరాజుకూఁతురగు దమయంతిని (నై)
సమాజంబునెల్లన్=సదస్యులనందఱను (నై)
విదర్భభూపతి=రుక్మిణీపతియగు కృష్ణుఁడు (పా)
సుతనుసమాజంబున్=రాజకన్యాసమూహమును (పా)

1. పు=పురవర్ణన. స్త్రీ=స్త్రీవర్ణన.
2. పా=పారిజాతాపహరణకథ. నై=నైషధకథ.

సూరనాదు లుపయోగించిన యాంధ్రభాషా సంస్కృతాభిభాషా శ్లేషాదులగు నన్ని శ్లేషలను గ్రహించినట్లు పై యుదాహరణముల వలననే స్పష్టముగాఁ దెలియుచున్నది.

[1]అముద్రిత నైషధపారిజాతీయమునుండి మఱికొన్ని పద్యము లుదాహరించుచున్నాను.

షష్ఠ్యంతములనుండి :

క. పరదోషాఽపరయోషా
పరభాషా రహిత భూమిపాలక బుషికన్
మరుమర్వీ ధరవర్వీ
కరగుర్వీవ్య ప్రతాప ఘనతేజానవ్ ("యేముషికిన్" అని పాఠాంతరము)

క. వాణీనిపుణసభాంత
ర్వాణీహితసు వస్తుమహిత నాదాన్యకృయు
క్పాణికిఁ బరగిరి భిదరక్షా
పాణికి రఘునాథభూమిపాలాగ్రణికిన్

కవి విజ్ఞప్తి :

చ. ఫణిపఫణీంద్రములార! రసభావ విశేషసు గానవాఘుణాం
ఘుణిత మనస్క గోచరులఁ గిగ్గి దివ్యుల విద్వదయ్య! స
ద్గుణమగుణంబు దూషణమదూషణవశాననునాదు గాక స
ద్గుణముగుణంబు దూషణము దూషణమౌనను వారలెత్తితే.

హంస వర్ణనము :

చ. సరసులలోననే మెలఁగు మాణికవృత్ మదిమెచ్చ పెద్దలా
నుమితగబుద్ధి జృంభణ వయోగణవ స్తృప్తి కాంతి మిత్త్వసం
భరణుఁడు రక్తిరంగనయుఁ బాటలవర్ణ స్ఫురత్ప్రచారణన్
బరగుఁ బదక్రమంబులను బ్రహ్మరథోచితుఁ డెంచి చూచినన్.

---

1 (నైషధ పారిజాతీయము సంఖ్య 172 – తంజావూరు పుస్తక భాండాగారము.) ఇట్టి యుత్తమకావ్య మింతవఱకును ముద్రితము కాకుండుట యాంధ్రుల దురదృష్టము. దీనినిగూర్చి మద్రాసు విశ్వవిద్యాలయ ప్రాచ్యపరిశోధన శాఖా పత్రికలో శ్రీ చల్లా సత్యనారాయణగారి వ్యాసము చూడఁదగినది. (1937.'38)

కవివాక్యము :

ఉ. ప్రాభవ భవ్యభోగగుణ భాగ్యదురంజన దుర్నిరీక్ష తే
జోభరఘోరబాణ జయశోభితపాదవినమ్రరాజద
త్తాభయవీరసేన తనయాహితరాజ్యధురీణ నీదయా
వైభవమే నెఱింగి నిటవచ్చితి నీకొకమేలుఁ గూర్పఁగన్

దమయంతి వర్ణన :

సీ. గమనవైఖరిఁగాంచె గాంగేయము యబిసా
హారాతిమదరాజ హంసవలన
వచనవైఖరిఁగాంచె వలదామ్రపల్లవ
గ్రాసతుందిల కలకంఠివలన
కుంతల ద్యుతిఁగాంచె ఘూర్ణమానపయోద
గర్జితోత్సవ నీలకంఠివలన
దృగ్విలాసముఁ గాంచె ధీరేతరత్రాస
శోభమానైణికి శోరివలన

గీ. గాత్రయష్టి ప్రభలుఁగాంచె గాఢతిమిర
వారివాహాన దిక్తటిద్వల్లికలన
శారదాప్తి ప్రసన్నవాక్సరణి నగుటఁ
గొంతఁ దెలిపితిఁ దల్లిల కువలయేశ !

రఘునాథుని గూర్చినవి :

శా. ఆలంకారిక హర్షమత్కృతి వరంబౌ జ్ఞాన సారస్వత
శ్రీలుండౌ రఘునాథశౌరిఁ గని హర్షింపంగ నన్యుల్ వృథా
స్థూలంభావుకులైన కొందఱు దృఢన్యూతోష్ఠతా సూచితో
పాలంభుల్ గనకున్ననేమి కుహనా హల్లోహలుల్ లోహలుల్.

ఉ. ఆజి జితారికోటి నవిసన్వహమన్న సువర్ణదాన సం
పూజిత విప్రకోటినుతిఁ బొందుచు నార్గురు చక్రవర్తులన్
రాజులఁ జేయునట్టి రఘునాథనృపాలుఁడె చక్రవర్తియా
నీజగమందు నేఁడు మొదలిర్వది యిద్దఱు రాజులెన్నఁగన్

ఉ. ఆయతశక్తి ఘాతహరిదంచలుఁ డంజన లక్షణాఢ్యుఁడు
పాయ దృఢప్రయోగ పరిపాటి కృతుల్ రఘునాథభోజ భూ
నాయకుఁ డందుఁ గాక విగుణస్ఫుట దోషము లౌ ఘుణాక్షర
న్యాయ జడప్రబంధముల నందు మనంగలనైన నందునే

మ. స్వయముక్తాత్మకృతిస్తుతుల్ జడులు భాషామాత్రరీతిన్ లింగని
ర్ణయమున్ గొంత సమాసచక్రము క్రియల్ నైఘంటు కావ్యోక్తుల్ నెఱ
న్వయతం గూర్చి కవిత్వమంచు సభలన్ వర్ణింప విద్వత్కవి
ప్రియమౌ నాపదవాక్యమానసుపదశ్రీమత్కృతుల్ చక్కఁగాన్

## కవి చౌడప్ప

ఆంధ్రవాఙ్మయమున హాస్యరసమును వెల్వరించిన కవి చౌడప్ప రఘునాథనాయకుని నెఱిఁగినట్లుగా నీ క్రింది పద్యమువలనఁ దెలియు చున్నది.

క. నేరుతునని మాటాడఁగ
వారిజభవునంత వానివశమా తంజా
వూరి రఘునాథ నాయని
గారెఱుఁగఁగఁ గుందవరపు కవిచౌడప్పా.

క్షేత్రయ: కీర్తనీయమును మధురభక్తి సంభరితమును నగు పద వాఙ్మయమును సృష్టించిన క్షేత్రయ రఘునాథనాయకుని గూర్చి చెప్పిన యీ క్రింది పద్యము 'ఆంధ్ర కౌముది' యందుదాహృతమై యున్నది:

క. "తముఁ దామె వత్తు రర్థులు,
క్రమ మెఱిఁగిన దాతకడకు రమ్మన్నారా
కమలంబు లున్న చోటికి,
భ్రమరంబుల నచ్యుతేంద్రు రఘునాథ నృపా."

ఈ పద్యము తప్ప క్షేత్రయ రఘునాథ నాయకునిపైఁ జెప్పిన పదము లేవియు గానరావు.

# విజయరాఘవనాయకుఁడు

విజయవిలాసకృతిభర్తయై, వాల్మీకిచరిత్రాదికృతికర్తయై సంగీత విద్యావిశారదుఁడని మహాప్రసిద్ధిఁ జెంది యాంధ్రులకుఁ, జిరస్మరణీయుఁ డగు తంజావూరు రఘునాథరాయని కొమారుఁడీ విజయరాఘవనాయకుఁడు. రఘునాథరాయని వెనుక క్రీ. శ. 1633 నుండి క్రీ. శ. 1673 వఱకును దంజావూరును బరిపాలించెను. ఈతని కాలముననే మహారాష్ట్రులు తంజావూరిరాజ్యము నాక్రమించుకొనిరి. ఈతని కొమారుఁడు మన్నారు దేవుఁడుకూడఁ దండ్రితోఁగూడి మహారాష్ట్రులతో యుద్ధమున మడియుటచే దంజావూరు నేలిన యాంధ్రనాయకరాజులలో నీతఁడు కడపటివాఁడు.

తండ్రివలె విజయరాఘవనాయకుఁడు కృతిభర్త, కృతికర్త. ఈతఁడు తెలుఁగున నాటకములు, ద్విపదలు, చౌపదలు మున్నగునవి, పెక్కు రచించినాఁడు.

అవి యన్నియుఁ బ్రహ్లాదచరిత్ర[1]మను నాతని నాటకము నందుదాహరింపబడి యున్నవి:

సీ. శ్రీవొందు 'రాజగోపాల విలాస నా
టకము' సంధర్భించు సుకవి వంద్య
మధురోక్తులను 'చెంగమలవల్లి పరిణయం'
బానతిచ్చిన ప్రతిభా నిధాన
కోవిదుల్ గొనియాడ 'గోవర్ధనోద్ధర
ణము' రచించిన కల్పనాధురీణ
'రతిమన్మథ విలాస' కృతిరాజ మొనరించి
పరగు ప్రాంబంధిక పట్టభద్ర
భువిని 'రాసక్రీడ నవనీతచోరంబు'
హవణించి వెలయు మహానుభావ

---

1. ప్రహ్లాదచరిత్రము (విజయరాఘవ నృపాల.) M. 692 తంజావూరు సరస్వతీ మహాలు పుస్తక భాండాగారము.

చాతురిచే 'పారిజాతాపహరణంబు'
రచనచేసిన మృదు వచన ధుర్య
ఘనమైన 'రుక్మిణీ కల్యాణ' మను కృతి
నిర్వహించిన బుధ సార్వభౌమ
వరుస 'రాధామాధవ వివాహము జనాభి
రామం' బొనర్చు సర్వజ్ఞతిలక
పాండిత్యమున 'సత్యభామా వివాహా' వ
ర్ణన యొనర్చిన కవిరాజరాజ
ప్రాజ్ఞతోనన 'నుషాపరిణయ నాటకం'
బమర జేసిన శారదావతార
'దక్షిణద్వారకా స్థలవర్ణనా' భాగ
ముద్ధరించిన సుప్రసిద్ధ చరిత
మహిమచే 'కాళియమర్దనం' బొనరించు
సరిలేని రాజుల చక్రవర్తి
ధర 'రఘునాథాభ్యుదయము' నాటకముగా
ద్విపదగా రచియించు శ్రీకరాత్మ
అల 'మోహినీ విలాసా' ఖ్య ప్రబంధకృతి
నాటకం బొనరించు కలగమాన
అతి పవిత్రంబు 'ప్రహ్లాద చరిత్రంబు'
సవరించు ఘనమనీషా ధురీణ
హాయిపున 'పూతనాహరణం' బనెడు నాట
కం బొనరించు శృంగారలోల
తగు 'మంజరీ ద్విపదప్రబంధము' నాట
కంబుగా హవణించు గానచణు
'విప్రనారాయణ విద్వత్కథా' సంవి
ధానం బొనర్చిన శ్రీనిధాన
బుధులు మెచ్చు 'సముద్ర మథన నాటక' రా
మొనరించు భువన మోహన చరిత్ర
లలితమౌ 'కృష్ణ విలాస నాటక' మణి
సల్పిన యష్టభాషా ధురీణ

ఘనతరంబగు 'పాదుకా సహస్రం' బెల్ల
ద్విపద జేయు కళావతీ తనూజ
రసికులు ప్రణుతింప 'ప్రణయకలహ' మని
కృతి యొనర్చిన చమత్కృతి ధురీణ
అతులిత ప్రౌఢిచే నల 'కంసవిజయంబు'
ఘటియించు భువన విఖ్యాత శీల
ఘనమైన 'జానకీ కల్యాణ నాటకం'
బమరించు వావధూ కాగ్రగణ్య
నవ 'పుణ్యకవ్రత నాటక' వైఖరి
సేకరించిన వాగ్విశేష శేష
కేళిమై 'గోపికాగీతలు భ్రమర గీ
తలు' తెనింగించు సద్యతనభోజ
సరిలేని 'ఫాల్గుణోత్సవ' మెల్ల రగడ చా
పదము లొనర్చిన భవ్యచరిత
ధర 'రాజగోపాల దండక' సందర్భ
వైదర్భి గన్న విద్వత్కవీంద్ర
సారమౌ 'వీరశృంగార సాంగత్యంబు'
మెరయించు రసికుల మేలుబంతి
'సంపంగి మన్నారు సాంగత్యము' నమర్చి
జగతిమెచ్చిన సెర జాణరాయ
గోపాలునకు 'వేడుకోలు విన్నపములు'
దరవు లొనర్చు నౌదార్యధుర్య
యెలలుపిడి పదాల్ హెచ్చు సంకీర్తన
లధ్యాత్మ లొనరించు నతుల చర్య
వాల్విచిగుజ్జరివిల్వేడుదండు లా
స్యము కంతుకక్రీడ యల్లికయును
కొరవంజి శుభలీల గుజరాతిదేశి చా
పదము జక్కిణి దురుపదము మదన
బదదూత్యమును జోగిపదచాళి శారదా
సామ్రాజ్యమును చిందు సవతిమచ్చ
రంబులు నాట్యకదంబు మొదలైన
నాట్యముల్ హవణించు నవరసజ్ఞ

... ... ... ... ... ... ... ... ...

దీనినుండి యితని కృతులను నిట్లు సేకరింపవచ్చును.

నాటకములు :— 1. రాజగోపాల విలాసము, 2. చెంగమలవల్లీ పరిణయము, 3. గోవర్ధనోద్ధరణము, 4. రతిమన్మథ విలాసము 5. రాసక్రీడానవనీతచోరము, 6. పారిజాతాపహరణము, 7. రుక్మిణీ కల్యాణము, 8. రాధామాధవము, 9. ధనాభిరామము, 10. సత్యభామావివాహము, 11. ఉషాపరిణయము, 12. దక్షిణద్వారకాస్థలవర్ణనము, 13. కాళీయమర్దనము, 14. రఘునాథాభ్యుదయము, 15. ప్రహ్లాద చరిత్రము, 16. పూతనాహరణము, 17. విప్రనారాయణ చరిత్రము, 18. సముద్రమథన నాటకము, 19. కృష్ణవిలాసము, 20. మోహినీ విలాసము, 21. జానకీ కల్యాణము, 22. ప్రణయ కలహము 23. కంసవిజయము.

ద్విపదలు :— 1. పాదుకాసహస్రము, 2. మోహినీవిలాసము, 3. రఘునాథనాయకాభ్యుదయము.

1. గోపికా గీతలు, 2. భ్రమర గీతలు, సంస్కృతమునుండి తెలిఁగించినవి.

చౌపదులు :— 1. ఫాల్గునోత్సవము వగడ - సోపాది.

దండకములు :— 1. రాజగోపాల దండకము.

ఇంకను, వేణుగోపాలు విన్నపములు, ధరువులు, పలుపాటలు, సంకీర్తనలు, కొరవంజి, మొదలగు యక్షగానములు, నాట్యము సేయునప్పు డాయా యభినయములకు రాగములుగా నమకాలములుగాను నాట్యములు నీతఁడు రచించినట్లు తెలియుచున్నది.

ఈతని గ్రంథములనుగూర్చి వివరించుటకు వీలుండదుగాన, నీతని యాస్థానమున విలసిల్లిన చెంగల్వ కాళకవి రచించిన రాజగోపాలవిలాసము నుండి యీతని చరిత్ర నుదాహరింతును.

## విజయరాఘవనాయకుని చరిత్ర

"శ్రీహరిపాదపద్మమున నాల్గవజాతి ప్రభవించెను. ఆ జాతిలోఁ గొందఱు రాజచంద్రు లుదయించిరి. వారిలోఁ గృష్ణరాజను నాతఁడు మొదటివాఁడు. అతనికిఁ దిమ్మరాజు జన్మించెను. తిమ్మరాజు గుణాతి

శయముచే శ్రీహరియే మానవుఁడుగా నవతరించినట్లు ప్రఖ్యాతిగాంచెను. అతనిభార్య బయ్యాంబ. వారలకు మహాప్రసిద్ధుఁడు చెవ్వనృపతి కొమారుఁడయ్యెను. ఆతఁడు శ్రీశైలమునకు సోపానపంక్తి కట్టించి, ప్రాకారమును నిర్మించెను. వృద్ధాచలమునఁ బ్రాసాద మండపములు గట్టించి గ్రామముల నాక్షేత్రపతికి దానమిచ్చెను. అరుణాచలమున దేవాలయమునకు గోపురము కట్టించెను. వృషభగిరియందుఁ బూజాదికము లేర్పాటుచేయించెను. చెఱువులు త్రవ్వించి, షోడశమహాదానములు కావించెను. ఈతనిని చిన చెవ్వప్పయనికూడ యందురు. చినచెవ్వప్ప మూర్తిమాంబను పెండ్లియాడి యామెవలన అచ్యుతప్పనాయకుఁడను పుత్త్రినిఁ బడసెను.

అచ్యుతప్పనాయకుఁడు శ్రీరంగనాథస్వామికి సింహాసనము ప్రణవమయమైన బంగారుసెజ్జ, రత్నాంగద కిరీటరాజము, అభయహస్తము నర్పించుటయేగాక దేవళమునకు నెనిమిదవ ప్రాకారమును గోపురమును నన్నశాలయును కట్టించెను. ప్రాకారములలో నారామములు నిలిపి, చైత్రరథారోహణోత్సవము జరిపించు నేర్పాటుచేసెను. అచటనున్న యర్చకకోటి క గ్రహారములిచ్చి, వివిధనాట్యసేవ, నివేదనములు ప్రతిదినము జరుగఁ గట్టడఁగావించెను, శ్రీరంగపతి సన్నిధానమున ముత్యాలతోఁదులాపురుష దానమును గావించెను. ఈతఁడు భక్తిపరుఁడేకాక పరాక్రమవంతుఁడని, సమర నిశ్శంకుఁడని కీర్తిఁగొనెను.

ఇట్టి యచ్యుతనాయకునికి మూర్తిమాంబకు రఘునాథనాయకుఁడు జన్మించెను. రణము పెండ్లిచవికెగా భావించిన మహావీరుండు రఘునాథుఁడు. అతఁడు పాండ్య, తుండీర, చేర, పారశీక, ఆంధ్ర దేశ రాజుల నందఱను జయించి, విజయలక్ష్మిని వరించెను. అతఁడపజయమన నెఱుఁగఁడు ఈతఁడు రణరంగ ధీరుఁడైనను శత్రురాజులు వెనుకకుఁ దగ్గినవారిని సంరక్షించి, వెన్నాడకయుండు నుదారుఁడు. ఈతని యేనుఁగుల శాలలో వింధ్యసింహాళపు టేనుఁగులు, గుఱ్ఱాలశాలలో శక, సింధు, బాహ్లీక దేశపు గుఱ్ఱములు నుండెడివి. భాండాగారములో కోట్లసంఖ్యకుమించు నవరత్నమయ కాంచనాభరణములు ప్రకాశించెడివి. నగరిలో మెఱపుదీగెలఁ

బోలినమొలఁతలు మొలఁగెడివారు. ఇవియన్నియు శత్రురాజుల కానుకలు. ఈతఁడు జయించిన పీరులకు లెక్కలేదు. వైరిరాజుల శిరస్సులనెడి పాషాణములతో నితఁడు కావేరినది కానకట్టగట్టినాఁడన వచ్చును. కృతులు మెచ్చంగఁ దగినసత్క్రతులు, ధరాదేవికి హారములనఁదగు నగ్రహారములు, సకల దేవాలయ ప్రతిష్ఠలు, సర్వవిధములైన దానములను జేసి రఘునాథనాయకుఁడు రాజ్యమేలెను.

రఘునాథరాయని భార్య కళావతి. ఆమె పరమపతివ్రత. వారికి అచ్యుతరామభద్రుఁడని, విజయరాఘవనాయకుఁడని యిరువురు కుమారులు గలిగిరి. అందు పెద్దవాఁడగు రామభద్రుఁడు మహావీరుఁడు. అతని నిలువెల్ల కరుణ. అతనిపలుకులు నీతిప్రచారములు. తలఁపులు ధర్మమునకు పుట్టినిండ్లు. నడకలు దాక్షిణ్యసంకేతములు. అతఁడు మన్మథునివంటి సుందరుఁడు. అతనిసోదరుఁడే విజయరాఘవనాయకుఁడు. ఇతఁడే కృతిభర్త.

ఈతఁడు మహాపరాక్రమశాలి. శత్రురాజుల నిగూఢ తంత్రంబు లెఱుఁగు నింగితజ్ఞత, వైరిరాజభూతములను నిగ్రహించు శక్తి, పరిపంథి వర్గమును స్తంభింపఁజేయు మగఁటిమి, పరరాజులను యంత్రపు బొమ్మల వలె నాడించు బుద్ధిసూక్ష్మత, యితని యందు మూర్తీభవించి యుండెను. ఒకనాఁడే మైదారు యోజనములమేర దాఁటి వెనలి తిరిగివచ్చు దండితనము, ఒక గుఱ్ఱముపైనుండి వేఱొక గుఱ్ఱముపైకి నాహసలాఘవము, మావంతు నెదిరించి యేనుఁగుపైకి నెగిరి దానినదలించు భుజశక్తి, ఎట్టి శూరునైన నెదుర్కొని వానిమర్మములు నాఁటునట్లు సూటిగాఁ గత్తి మీటు చాకచక్యము నీతనియందే కన్పట్టును.

## సాహిత్య రాయపెండేరము

ఈతని కాలికి 'సాహిత్యరాయ పెండేరము' అను బిరుదందె కలదు. అది వైడూర్యములతోను, పద్మరాగములతోను, ముత్యములతోను, నీలములతోను గూర్పఁబడి సామంతరాజులు మ్రొక్కుచున్నప్పుడు వారి

కిరీటముల కాంతు లీగండపెండేరమున కుపచారము సమకూర్చుచున్నట్లు మెఱయుచుండెడిది. సభయందు జరుగు తర్క-వ్యాకరణమీమాంసా చర్చలు, నవ్యకావ్యసాహితీ నైపుణ్య ప్రదర్శనములు, లక్ష్యలక్షణగ్రంథ సమన్వయ చాతుర్యములు, చమత్కారభాషాగోష్ఠీవినోదములు నీగండ పెండేరమున కుపచారముచేయుచున్నట్లు కన్పట్టెడిది. ఈపెండేరనినాదము బిరుదవాద్యములనాదమున కుత్కర్ష గలిగించుచు, విద్యావిషయిక సందేహ ములు గలిగినప్పుడు రాద్ధాంతనినదమును బ్రకటించుచు సకలవిద్యా సామ్రాజ్యసింహాసన మెక్కినట్లు విలసిల్లుచుండెను. మఱియు నీపెండేర మున నాతఁడు జయించినరాజులు బొమ్మలై వ్రేలుచుండిరి.

## శారదాధ్వజము

ఈతఁడు ‘ విజయరాఘవవిలాసంబున ’ విద్యాగోష్ఠి నున్నప్పుడు, పై పెండేరముగాక, యాతనిమ్రోల “ శారదాధ్వజము ” నొప్పుచుండును. ఒక్కయెడ చీనిచక్కెర పానముకవలె మధురమై, వేఱొకయెడ విరజాజి పూవుదండవలె పరిమళయుక్తమై, మఱియొక్కయెడ మలయమారుతము వలెఁ జల్లనై, యింకొకయెడ నిండువెన్నెలవలె నిరతిశయాహ్లాదకారియై వెలయునట్లు కవితచెప్పఁగల చాతుర్యము విజయరాఘవనాయకునికే కలదని, తనహస్తముచే నీ ధ్వజము చాటుచుండును.

“పద్యము నవనవోన్మేషమై వెలయవలెను. వాక్యవైఖరుల లంకారానుసారులు కావలెను. శబ్దము పతంజలీవ్యాకరణ ప్రామాణ్యమై యుండవలెను. కర్పూరమువలెఁ గవితాసందర్భము గప్పున గుబాళింప వలెను ” అని శారదాధ్వజము చాటుచుండెడిది.

విజయరాఘవనాయకుని సాహిత్యగోష్ఠిలోఁ దలిరుండీ వెలఁబోలిన పడఁతులు “ పాండ్యమండల విభాళా ” యంచుఁ గైవారము చేసెడివారు. భరతసంగీతసాహితీవిద్యలు భామాస్వరూపములు దాల్చినవో యనునట్లు తమతమబిరుదు వాద్యములు, చిహ్నములు, వెలయఁగాఁ దారుణ్యవతు లగు తరుణు లండు తనరారుచుండిరి. వారిలో నాటకత్తెలు, పాటకత్తెలు నుండిరి. ఆటకత్తెలలో చంద్రరేఖ అగ్రస్థాన మధిష్ఠించినది.

## చంద్రరేఖ

ఈమె విజయనగర సామ్రాజ్యాధిపుఁడగు శ్రీవేంకటరాయ పృథ్వీమహేంద్రునివలన బహువిధ బిరుదగౌరవముల నందిన నట్టువరాలు. ఈమెకాక ఈ క్రిందఁ జెప్పఁబడిన నాట్యకర్త్రు లాసభయం దెన్నికగన్నవారు. వారొక్కొక్కరొక్క నాట్యమున ప్రత్యేకవిశిష్టత గడించినారు.

| | | |
|---|---|---|
| రూపవతి | — [illegible] | నాట్యములు |
| చంపకవల్లి | — శుద్ధమార్గ[illegible] | ,, |
| మూర్తి | — జక్కిణి | ,, |
| కోమలవల్లి | — కొరవంజి | ,, |
| లోకనాయకి | — [illegible] | ,, |
| శశిరేఖ | — దేశి | ,, |
| రత్నగిరి | — [illegible] | ,, |
| భాగీరథి | — పేరణి | ,, |

ఇంకను శుద్ధపదములు, [illegible], సన్నిసాలికలు మున్నగువాని నితరు లభినయించెడివారు. అన్నియును శాస్త్రోక్తముగా సరిచేయుము లగుచు వారి నాట్యకళా నైపుణ్యమును సుస్పష్టము గావించెను.

సంగీతమును నీ విధముగనే పాటకర్త్రులు ప్రదర్శించిరి. ఒక భామ వీణ, ఒక లేమ కిన్నర, నొకముదిత మురళిని, నొకనారీమణి పిల్లనగ్రోవి, ఒక ధవళాక్షి తంబురా, ఒక సారసాక్షి స్వరమండలము చేకొని, ఎల్లరును సంగీతము వినిపించిరి. ద్విపదలలో నొకతె, తత్ప్రబంధముల నొకతె, యక్షగాన మొకతె యతివ, జోలసువ్వాలలో నొకసుందరి, [illegible] నొక సఖుని, ఏలలలో నొకయించుఁబోణి-దండె మీటులతో, రాగమహత్త్వములతో, ప్రౌఢములతో, చెంగులతో సకలహృదయ ద్రవీకరణకారణులై సకల సభాహ్లాదకారిణులై జంత్రగాత్రముల గాంధర్వవిద్య వినిపించిరి. కేవల శాస్త్రీయ మార్గమున నొక కీరవాణి, స్థాయిగమకము రక్తిగడలుకొన రాగాలాపన చేసెను. ఇఁక దక్షిణ నెలఁదులు వాద్యములతో విద్యుద్వల్లులవలె

గోష్ఠి సాగించునప్పుడు, ఆకాశమునుండి విద్యాధరులు మెచ్చఁగా విద్యు ద్వల్లులు రమణీ వేషములు ధరించి యీ విద్యలు నేర్చుటకై భూమికి వచ్చినవోయని భ్రాంతిగలిగించినవి. ఆ సభయందే కృష్ణమాంబ తన కవితాచాతుర్యమును జూపి, యందఱ నాశ్చర్యమునస్కులుగఁ జేసెడిది.

విజయరాఘవనాయకుఁ డిట్టి విద్యాగోష్ఠియందు మిగుల్చఁడైనను, నిరంతరదానశీలియై ప్రజలనేమఱక పోషించుచుండెను. కాశీనుండి రామేశ్వరమువఱకును, ద్వారకనుండి దక్షిణతీరమువఱకును, సీతని యన్న దానమును వినుతింపని బ్రాహ్మణులులేరు. ప్రతిదిన మేఁబది వేలమందికి నన్నదాన మొసఁగెడు మహాదాత.[1]

ఆతఁడు, శా. శ. 1555 నకు సరియగు శ్రీముఖ సంవత్సర శ్రావణ శుద్ధ ద్వాదశీ సౌమ్యవారమున దక్షిణద్వారమున కృష్ణతీర్థమున స్నానము చేసి, సంకల్పపూర్వముగా షోడశ మహాదానములుచేసి, బ్రాహ్మణులకు నగ్రహారాదికము లొసంగెను. ఇది క్రీ. శ. 1633 వ సంవత్సరము. ఈ నాఁడే విజయరాఘవుని రాజ్యారోహణ దినము. ఇట్టి మహావిద్వత్కవి రాజచంద్రునికిఁ గాళయకవి తన గ్రంథమును పై సభయందు నంకితము గావించెను. పైనిఁ జేర్కొనిన కాలమే 'రాజగోపాల విలాస' రచనా కాలమని యూహింపవచ్చును. అట్లయిన నిది విజయరాఘవనాయకుని రాజ్యారంభవత్సరముననే వెలసినదని చెప్పనగును. విజయరాఘవనాయకుఁడు నలువదేండ్లు పాలించినాఁడు. తరువాతి కాలమున సీతని యాస్థానమునఁ బెక్కురు కవులును, మహాప్రసిద్ధిఁ జెందిన కవయిత్రి రంగాజమ్మయు వెలసిరి. రాజగోపాల విలాసమున వారి ప్రశంసయే లేదు. ఇంతయేకాక, ప్రత్యాశ్వాసాంతమున సీ కావ్యము "చంద్రరేఖా" చిహ్నితమై యున్నది.

1. ఇప్పటికి నన్నదానములకు ప్రసిద్ధికెక్కిన యిండ్లకుఁగాని, సత్రములకుఁగాని "తంజావూరి సత్రములు" అను పేరు వాడుకలోనున్నది.

ప్రథమాశ్వాసము — దానవవల్లన వేష్టన
శేవతక "ముద్దుచంద్రరేఖా" కాంతా!
ద్వితీయా ,, — స్తపనాభ్యాంత ధ్వాంత
ద్విప్రియయూథా "ముద్దుచంద్రరేఖా" నాథా!
తృతీయా ,, — చతురానన చతురవచనా
శ్రితవదనా "ముద్దుచంద్రరేఖా" మదనా!
చతుర్థా ,, — "శ్రీముద్దుచంద్రరేఖా
ప్రేమక్షేమాభిరామ" (రాజగోపాలవిలాసము)

పై జెప్పఁబడిన సట్టువరాలు చంద్రరేఖయే. వీరవేంకటపతిరాయల వలన మెప్పుఁబొందిన యీమె క్రీ. శ. 1614 ప్రాంతమున తంజావూరిని జేరి విజయరాఘవ నాయకుని జేపట్టి యుండవలెను, కాని యప్పటికి నాతఁడు యువరాజగనే యీమె నొక మహిషిగాఁ బరిగణించుటచే, కాళకవి యిట్టీమె నామాంకితమును వెలయింపఁ జేసి యుండును. కావున రాజగోపాల విలాసము విజయరాఘవుని కాలమునఁ బ్రాథమిక కృతియే. మఱియు నిందు విజయరాఘవనాయకుని సాహిత్య విద్యావైభవము వర్ణితమైనను ససంఖ్యాకములైన యాతని గ్రంథరచనలేవియు నుదాహృతములు కాలేదు. అనఁగా నీకృతిరచనము నాఁటి కాతఁడింకను గ్రంథరచనము నారంభింపలేదని తెలియుచున్నది.

పై వానిలో లభ్యములైన గ్రంథముల వివరణము :

1. రఘునాథనాయకాభ్యుదయము, 2. రఘునాథాభ్యుదయము, (నాటకము) 3. కాళియమర్దనము – నాటకము, 4. ప్రహ్లాద చరిత్ర, 5. పూతనాహరణము, 6. విప్రనారాయణ చరిత్రము. ఇవి యన్నియు నాటకములే.

పై వానిలో రఘునాథాభ్యుదయము, రఘునాథనాయకాభ్యుదయము (ద్విపద నాటకములును[1]), విప్రనారాయణ చరిత్రమును నేఁడు

1. పై రెండు గ్రంథములును సుప్రసిద్ధాంధ్రదేశీయచారిత్రక పరిశోధకాచార్యులును ప్రశస్త విద్వాంసులునగు డాక్టరు నేలటూరి వేంకటరమణయ్యగారి విపుల పీఠికలతో తంజావూరి సరస్వతీ మహాలు పక్షమున ప్రకటితములైనవి.

ముద్రితములైనవి. ముద్రితములైన మూఁడు కృతులును జారిత్రకముగనే కాక సారస్వతదృష్టిని ముఖ్యములైనవి.

## రఘునాథాభ్యుదయము

ఇది తన తండ్రియగు రఘునాథనాయకునిఁ గూర్చి రచియించిన యక్షగాన నాటకము - శృంగార రస ప్రధానమగు నీ నాటకమున రఘునాథనాయకుఁడు చిత్రరేఖ యను వనిత మోహించుట, చిలుకచే రాయబారమంపుట, వారి సమాగమము వర్ణితములైనవి - మఱియు నందు రఘునాథరాయల కాలమున ప్రవర్తిల్లిన విద్యాగోష్ఠీ వినోదములు - రామభద్రాంబ, శుకవాణి కవయిత్రుల సమస్యాపూరణములు, రాజకీయముగా నాదాయవ్యయ విచారణలు, కమ్మవారి వక్కాణ, మున్నగునవి చక్కఁగఁ జిత్రింపఁబడినవి.

## రఘునాథనాయకాభ్యుదయము

ఇదియు పై విధమున రఘునాథనాయకుని చరిత్ర వర్ణించునదియే. ఇది ద్విపద కృతి. ఇందు మొదటి రెండాశ్వాసములు సమగ్రముగను, మూఁడవ యాశ్వాసము కొంతఁగనునున్నది. ముద్రితప్రతిలో (1-684, 2 - 484, 3-912) 2030 ద్విపదపంక్తులు గలవు. గ్రంథమింక నెంత యుండెనో తెలియరాదు. ఈ గ్రంథము నాయకాభ్యుదయ రచనలకు సంబంధించినది.

## నాయకాభ్యుదయ రచనలు

తమ తండ్రుల పూర్వవృత్తాంతమును దెలుపు నిట్టి రచనలకు రఘునాథనాయకుఁడే మార్గదర్శకుఁడు. అతఁడు తనతండ్రియైన అచ్యుతప్పనాయకుని చరిత్రము, అచ్యుతాభ్యుదయమను పేర రచియించియున్నాఁడు. అది ద్విపదకృతియే.

రఘునాథుఁడు ద్విపద నలచరిత్రములో :

"భూషించి యచ్యుతాభ్యుదయప్రబంధ
నిర్మాణమున మాకు నిఖిలదేశముల
నిర్మల సత్కీర్తి నెగడుఁ గావునను
నటువలె ద్విపద కావ్యము వేఱె యొకటి
ఘటియించి సత్కీర్తిఁ గైకొందునంచు, మదినెంచి"

అని చెప్పియున్నాఁడు. అచ్యుతాభ్యుదయము నేఁడు లభ్యము కాలేదు. విజయరాఘవుని కాలమున దానిని సభలోఁ జదివి వినిపించినట్లు పై గ్రంథమువల్లనే మనకుఁ దెలియుచున్నది. మఱియు నది రఘునాథ రామాయణమునందును సంగీతసుధ యందును బేర్కొనఁబడినది. దీని ననుసరించియే ద్విపదకృతిగా "రఘునాథనాయకాభ్యుదయము" అను పేర విజయరాఘవనాయకుఁడు రచియించి యున్నాఁడు. విజయరాఘవుని పుత్రుఁడగు మన్నారుదేవుఁడును, తన తండ్రి చరిత్రమును "విజయరాఘవ నాయకాభ్యుదయము" అనుపేర రచించినట్లు "హేమాబ్జ నాయికా స్వయంవరము" భరత వాక్యమున నిట్లు చెప్పఁబడినది.

"ఇవ్విధంబున ...... విజయరాఘవభూపాలక ప్రియపుత్రుండును ......"విజయరాఘవాభ్యుదయాది" ప్రబంధ నిబంధన చాతురీ ధౌరేయుండును, అతులిత పితృభక్తిగురుభక్తి భాగధేయుండును మహితానుభావుండగు మన్నారుదేవుండు హావణించిన హేమాబ్జనాయికాస్వయంవరము అను నాటకము[1]......

రఘునాథనాయకాభ్యుదయము రాజగోపాలస్వామి కంకితమై ప్రశస్తరచనతో నున్నది. ఇందు తంజావూరి కోటయందుఁగల భవనములు రఘునాథరాయని విజయవిశేషములు దినచర్య మొదలగునవి సంపూర్ణముగ వర్ణితములైనవి. వివరము ఉపోద్ఘాతముఁనఁ జూడనగును.

## విప్రనారాయణ చరిత్ర

పన్నిద్దఱాళ్వారులలోఁ దెనుఁగు వారికిఁ బ్రియతముఁడైన తొండరడిప్పొడి యాళ్వారుల చరిత్రమును బ్రశస్తమైన యక్షగాన నాటకముగ విజయరాఘవనాయకుఁడు సంతరించియున్నాఁడు. ఈ కథను బ్రబంధ రూపమునఁ దొలుతఁ దెలుఁగున వెలయించినవాఁడు చదలువాడ మల్లన కవి. [2]ఈతఁడు భారతకవిత్రయములో నొకఁడగు నెఱ్ఱాప్రెగ్గడ వంశీ

1. తంజావూరి పుస్తక సూచిక, M. 675. పుట 277–278.

2. ఆంధ్రసాహిత్య పరిషత్తు (కాకినాడ) వారి పక్షమున క్రీ. శ. 1940 లో నీ గ్రంథము విపులమైన పీఠికతోఁ బ్రకటితమైనది. పీఠిక కర్త నిడుదవోలు వేంకటరావు ఎమ్. ఏ.

యుఁడు. ఈతని విప్రనారాయణ చరిత్రము ముద్రితమై ప్రచారమున నున్నది. దీని తరువాత యావదాంధ్ర దేశమున విశేషముగ వ్యాప్తిని గన్నది సారంగుతమ్మయ్య రచించిన "వైజయంతీ విలాసము" అను ప్రబంధము. ఇవి రెండునుగాక, అముద్రితములగు పిడుగు వెంకటకవి రచియించిన "విప్రనారాయణచరిత్ర[1]" ప్రబంధమొకటియు ఉత్తరరంగకవి రచియించిన "భక్తాంఘ్రిరేణువిలాసము[2]" అను యక్షగాన మొకటియుఁ గలవు. కాని విజయరాఘవుని యక్షగానకృతి[3] వాని యన్నింటికన్న నొక వింతయగు విలక్షణత్వమును, ప్రత్యేకతయుఁ గలిగియున్నది. దాని నిట వివరించెదను.

| ఇతర కవికృతులు. | విజయరాఘవనాయకుని కృతి. |
|---|---|
| 1. విప్రనారాయణ చరిత్ర కథా సందర్భము జరిగినది. తిరుచనాపల్లి మండలములోని శ్రీరంగ క్షేత్రము. | తంజావూరి మండలములోని చంపకారణ్య క్షేత్రము మన్నారుగుడి. |
| 2. అతని యిష్టదైవము శ్రీరంగనాథుఁడు | విజయరాఘవుని యిష్టదైవము రాజగోపాలుఁడను మన్నారుదేవుడు. |
| 3. విప్రనారాయణుని బంగరుగిన్నె చౌర్యమునకు న్యాయ విచారణచేసిన రాజు చోళరాజు. | ఇచట కృతికర్త విజయరాఘవనాయకుఁడు. ఈతడు చోళమండలాధ్యక్షుఁడే కదా ! |
| 4. విప్రనారాయణుని భక్తప్రపత్తులు వ్యక్తిత్వము ప్రతిపాద్యము. | విజయరాఘవనాయకుని వ్యక్తిత్వమే యెల్లచోట్ల భాసించును. |

1. తంజావూరి సరస్వతీ మహలు పుస్తకభాండాగారము. సంఖ్య. D. 256. M. 226.

2. మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారము. సం. 1912. యక్షగాన దండక కేట్లాగు. సంపుటము. 8.

3. తంజావూరి సరస్వతీమహలు పుస్తక భాండాగారము. సంఖ్య. D. 617. M, 706. ఇది యచ్చట పండితులగు శ్రీ విఠలదేవుని సుందరశర్మ, శ్రీ అ. మహాదేవ శాస్త్రిగారలచే పరిష్కరింపఁబడి తంజావూరి సరస్వతీమహలు ప్రచురణలలో 15-వ సంఖ్యగా ప్రకటితమైనది.

విజయరాఘవనాయకుఁడు వీరవైష్ణవ భక్తశిఖామణి. అందును శ్రీరంగనాథుని కాంతరంగిక భక్తుఁడు. అతఁడు ప్రతిదినము నంచెలపై తంజావూరినుండి శ్రీరంగమునకు ముప్పదిమైళ్లదూరము వెడలి, స్వామి దర్శనముచేసి తిరిగి తంజావూరికివచ్చి భోజనాదికము నిర్వర్తించువాఁడు. కాలక్రమమున నట్లుచేయ వీలులేక ఏడంతస్తుల గోపురము, మన్నారుకోటలో నిర్మించి, అది యెక్కి శ్రీరంగదేవాలయ శిఖర దర్శనముచేసి, భోజనము చేసెడువాఁడని యాతని చరిత్ర తెలుపుచున్నది. అట్టి భక్తుఁడు శ్రీరంగమునందే ప్రసిద్ధికివచ్చిన విప్రనారాయణుని కథయంతయు తన రాజ్యమునందే జరిగినట్లు వర్ణించుట యసంభావ్యముకాదు. విప్రనారాయణుఁడు సేవించుటకువచ్చిన దేవాలయము "విజయరాఘవభూపాల కల్పితంబులై యుప్పరంబంటిన గొప్ప గోపురప్రాకారంబులు" గలది. అచ్చట యధిదైవమగు రాజగోపాలుఁడు "విజయరాఘవభూపాలుం డర్పించిన కిరీటి పచ్చల కిరీటంబు" ధరియించెను. ఏ వెనుక చోళ భూపాలుని ప్రశంస, విజయరాఘవనాయకుని ప్రశంసయే.

" ద్వి. శ్రీరాజగోపాల సేవచేఁజాల
పేరుగావించిన బిరుదుమన్నీఁడు
..............................
... ... ... ... ... ... ...
విజయరాఘవశౌరి విద్యావిహారి
భుజబల కంసారి పూర్ణసంసారి
యన్నింటనెఱధాని యారాజధాని
మన్నారుతోనేలు మహిమేలుమేలు. "

అను 38 పంక్తుల ద్విపదగలదు. ఇది కామరసు వేంకటపతి సోమయాజి రచించిన "విజయరాఘవచంద్రికావిహారము" అను యక్షగానములోనిది వేంకటపతి సోమయాజి తన పట్టంపుకవి కావునను, ఈ భాగమున తన పొగడ్త యుండుటచేతను విజయరాఘవనాయకుఁడు తన యాస్థానకవి రచనను తన గ్రంథమున నెలకొల్పెనని యూహింపఁదగియున్నది.

బంగారుగిన్నె పోయిన సందర్భమున అధికారి మాటలలో విజయ రాఘవనాయకుఁడు స్పష్టముగా గోచరించుచున్నాఁడు. తలారి "తూరుపు తేరిదాంక హలకులిశరేఖలు గలిగిన యడుగులజాడ కన్పించు చున్నది గాని మానసులు నడిచిన యడుగులు కానరావు" అని చెప్పి నప్పుడు అధికారి యిట్లు ప్రత్యుత్తర మిచ్చియున్నాఁడు.

"అటువంటి యడుగులు గోపాలునికి, విజయరాఘవభూపాలునికే గాని యితరులకు లేదుగదరా? చోరుని యడుగు లెత్తమంటే నవనీత చోరుని యడుగులున్ను, యతని కుమారుని యడుగులున్ను కంటినంటూ వచ్చేవు! మాకన్న నీవే భాగ్యశాలివిరా" పై యుదాహృతులనుబట్టి విజయరాఘవనాయకుఁడు విప్రనారాయణునికథను తంజావూరి క్షేత్ర మునకే సంబంధించినట్లు మార్పుచేసి రచించుట, యాతని వైష్ణవభక్తి పరాకాష్ఠవలననే యని స్పష్టమగుచున్నది.

పన్నిద్దఱాళ్వారులను ప్రసిద్ధిఁజెందిన వైష్ణవ భక్తులలో తొండ రడిప్పొడి యాళ్వారు చరిత్రయే యాంధ్రవాఙ్మయమున విశేష వ్యాప్తి గాంచినది. ఈ చరిత్రకు మూలము దివ్యసూరిచరితము మున్నగు సంస్కృత గ్రంథములోను, ద్రావిడదివ్య ప్రబంధములోను కన్పట్టుచున్నది. మూలకథకును, తెలుఁగుకవులు రచించిన కథకును నచ్చటచ్చట వ్యత్యా సములు కన్పించుచున్నవి.[1] కాబట్టి యీ కథ యాంధ్రభాషలో నవత రించినపుడే మొదట కొన్ని మార్పులు జరిగినవి. ఇది మొదటిఘట్టము. ఆపైని తెలుఁగుకవులలోనే ప్రబంధముగా నంతరించిన మల్లన, తమ్మయ్య, వెంకటకవి మున్నగువారు కథాసందర్భమున కొన్ని మార్పులు గావించిరి. ఇది యీ కథావతరణమున రెండవఘట్టము. ఇక విజయరాఘవ నాయ కుఁడు యక్షగానకృతియందు నారాయణచరిత్ర కథను మూలగ్రంథము

1. వీనిని చదలువాడ మల్లన-విప్రనారాయణ చరిత్ర పీఠికయందు నేను విపుల ముగఁ జర్చించితిని. చూడుఁడు విప్రనారాయణ చరిత్ర ద్వితీయముద్రణ - పీఠిక పుట. 35 - 36.

తోడను, తెలుఁగుకవులు ప్రపంచించిన కథాసందర్భములతోడను విపుల మగు విమర్శ గ్రంథము ప్రకటితమగుచో నది యాంధ్రవైష్ణవ వాఙ్మయమున కొక యమూల్యాలంకారము కాఁగలదు.

ఈ కృతి విజయరాఘవనాయకుఁడు నందన సంవత్సరమున రచియించినట్లు తిరువారాధన సమయమున సంకల్పములో "అస్మిన్వర్తమానే వ్యావహారికే చంద్రమానేన నందననామసంవత్సరే, అయనే, శుభమాసే, శుభనక్షత్రే, శుభయోగే, శుభకరణే, ఏవంగుణ విశేషణ విశిష్టాయాం శుభతిథౌ చంపకారణ్య పుణ్యక్షేత్రే శ్రీ రాజగోపాలస్వామి సన్నిధౌ విజయరాఘవభూపాలస్య సర్వాభీష్ట సిద్ధ్యర్థం శ్రీ రాజగోపాల స్వామి పూజాంకరిష్యే" అను వచనమువలన స్పష్టమగుచున్నది. ఈ నందన క్రీ. శ. 1652 లో వచ్చినది గాన విజయరాఘవుని రాజ్యకాలమున పందొమ్మిదవయేట నిది రచితమైనదని చెప్పవచ్చును. దీనినిఁబట్టి కామరసు వేంకటపతి సోమయాజి "విజయరాఘవచంద్రికావిహారకృతి రచనము" క్రీ. శ. 1652 నకు ముందే జరిగినట్లు నిర్ణయింపనగును.

ఇఁక గ్రంథమునుండి రెండు రసవత్ ఘట్టముల నుదాహరించుచున్నాను.

విప్రనారాయణుని వైరాగ్యభావ మీ క్రింది పదములో నెంత చక్కఁగ వర్ణితమైనదో చూడుడు

కాంభోజిరాగము ఆటతాళము :

చదివేది దివ్యప్రబంధము మాకు సైపమసంసారబంధము<br>
ఎదనుండు హరిభక్తిగంధము యోగీంద్రులతోనే మాకుసంబంధము<br>
మీతో మాకేటిమాటలు, విన<br>
బ్రాతిగాదు మీపాటలు<br>
భవనంబులు పర్ణశాలలు, మా<br>
పాటలు హరిమీఁదియేలలు<br>
తగిలియుందురు ముక్తిబాలలు మా

దాపురములు హరిలీలలు
మేమున్న యూరు శ్రీద్వారకా, ముక్తి
కామినిపైమాకు కోరికా
స్వామిభక్తిమాకు చేరికా వో
కోమలి నీవికపోవె యూరక
ఆలుబిడ్డలు పొందుకోరము, మేము
కోరేదీహరిభక్తిసారము
నీలవర్ణుని గొల్చువారము, మీ
యాలాపములు విననేరము
పరమాన్నములు కాయగూరలు మా
పరిధానములు నారచీరలు
సరిపోవుమీకు మామేరలు మా
సంగడివాండ్రు ఘకీరలు.

దేవదేవి విప్రనారాయణ సంవాద మీ యక్షగానమునందలి రసోత్తర రచనములలో నొకటి.

పదం - కాంభోజి ఆటతాళము :

విప్ర. ద్రావిడవేదము చదివినవాఁడనె ధవళాక్షి! నీవు నన్నేలవే
దేవ. ద్రావిడవేదము చదివినవారు కందర్పుని వేదము విందురా
విప్ర. అంగన! మన్నరు తళిగప్రసాదము పొంగలి చవిగొన్నాఁడనే
దేవ. పొంగలి చవిగొన్నవానికి వనితల యెంగిలిచవి మనసాయనా
విప్ర. ఆరామకైంకర్య మాచరించి మన్నారుని గొలిచినవాడనే
దేవ ఆరామకైంకర్య మాచరించువానికీరామకైంకర్యమేలయా
విప్ర. చెలువ! మన్నరుపాద తులసీదళములః శిరసునధరియించువాఁడనే
దేవ. తులసీదళములు ధరియించువానికీ తొలఁతటిముడిపువ్వేలయా

ఇందచ్చటచ్చటఁ బాత్రోచితభాష వాడఁబడినది. అప్పటి రాజకీయ వ్యవహారము ననుసరించి తమిళభాష బహుసరసముగ నుపయుక్తమైనది. ఈనాఁడును నీ నాటకమును బ్రదర్శించిన సభ్యులను సమ్మో

దాంబుధి నోలలాడించును. ఇట్లెన్నియేని రసవత్తర ఘట్టములకుఁ బ్రత్యేకముగ స్థానమై ప్రశస్తమైన రచనతోఁగూడిన యీ నాటకము దాక్షిణాత్య నాటకములలో మేటియని చెప్పనగును.

## అముద్రిత కృతులు

అముద్రిత కృతులలో నీ క్రింది పద్యము 'నాందిగా' ముందుగాఁ గాననగును.

సీ. భోజకన్యాముఖాంభోజ రాజమరాళ
సత్యాఘనస్తన స్తబకభృంగ
జాంబవతీవిలోచన చకోరశశాంక
మిత్రవిందాతటిన్మేఘరూప
భద్రవశావశ భద్రదంతావళి
వరసుదంతామనో వనమృగేంద్ర
లక్షణారూపకలాపినీపర్జన్య
భానుసుతాలతా పారిజాత

గీ. షోడశస్త్రీసహస్ర చ - క్షుఃప్రసార
హారసార మసార మో - హానశరీర!
విజయరాఘవ భూపాల - భజనలోల!
కేలుమోడ్చెద రాజగో - పాల! నీకు.

పై రచనము లన్నిటిలోను ప్రహ్లాదచరిత్ర యను యక్షగానము వివరికృతి. ఈ యక్షగానముననే విజయరాఘవనాయకుని కృతులన్నియుఁ బేర్కొనఁబడినవి. మఱియు నిందు పై సీసపద్యములేదు. గ్రంథములో నిది చాటుకావ్యముగాఁ బేర్కొనఁబడినది.

## పూతనా హరణము

ఇందు శ్రీకృష్ణుఁడు పూతనను సంహరించుట వర్ణితము. గ్రంథారంభమునఁ భోజకన్యా ముఖాంభోజమరాళ అను సీసపద్యము గలదు. తరువాత కైవారగద్యలో నీతఁడు "చతుర్విధ కవితా నిర్వాహక సార్వభౌమ బిరుదాంగద విరాజమాన చరణాంభోజుఁ" డని వర్ణితుఁడైనాఁడు.

కైవారగద్య[1] తరువాత రాజగోపాలస్తవము, చెంగమలమ్మ స్తవము, సూత్రవతీశస్తవము, పన్నిద్దఱాళ్వారులస్తవము మొదలైనవి కలవు. శ్రీకృష్ణుఁడు పూతన చనుబాలుద్రావి యామె ప్రాణములను హరించిన సంగతి కవి యిట్లు చెప్పియున్నాఁడు :

“ క. ఆలోన నయ్యశోదా
బాలుఁడు జగజంత వింత బాలెంత విష
జ్వాలాభీలంబగు చను
బాలానుచు దాని ప్రాణపవనం బెగిచెన్.”

ఇందు యశోదాదేవి మాతృవాత్సల్యము, పూతన “ బాలవర్ధని ”యను బిరుదము తనకుఁగలదని గోపకన్యలను మోసగించినతీరు చక్కఁగా వర్ణితములైనవి. మఱియు పూతన, శ్రీకృష్ణునికి బాలగ్రహాపీడ కలదని నందువలన బాలునికి పెక్కువిధముల యపాయములు రాఁగలవని యిట్లు చెప్పినది :

“ వనిత సర్పభయంబు వర్షభయంబు
ఘనతరాగ్ని భయంబు గజముచే భయము
జెట్టి వీరులపోరుచేఁ గొంత భయము
పుట్టంగనున్న దీ బుడుతని కింక ”

ఇచ్చట పూతనచే కవి వ్యంగ్యముగా శ్రీకృష్ణుఁడు బాల్యముననే సాధించిన ఘనకార్యములను ముందుగా సూచింపఁజేసినాఁడు. సర్పభయము- కాళియమర్దనము, వర్షభయము - గోవర్ధనోద్ధరణము, అగ్నిభయము- ఖాండవ దహనము, గజముచే భయము, [illegible] భయము - ముష్టికాసుర చాణూరమల్ల సంహారణము.

పై వానిలో ప్రస్తుత కథాంశమగు పూతనాహరణమునుగూర్చి విద్వదగ్రణులైన యొక విమర్శకు[2] లిట్లు విమర్శించినారు : “ పూతన యనునది బాలురకు సాధారణముగవచ్చు నొక రోగము. ఇది చరక

1. తంజావూరి సరస్వతీమహాలు పుస్తక భాండాగారము. సంఖ్య. 554. M.677

2. మహాభారత రహస్యము. కీర్తిశేషులు పెండ్యాల వెంకటసుబ్రహ్మణ్య శాస్త్రిగారు.

మున శృశ్రుతమునఁ జెప్పఁబడినది. శ్రీకృష్ణుఁడు శైశవమునుండియు బలశాలియగు బాలకుఁడు గావున నారోగమును నధిగమించినాఁడు. పూతన రాక్షసియనుట శ్రీకృష్ణునికి దైవత్వము నాపాదింపఁజేయుటకుఁ జెప్పినది. ఇట్లే తక్కినవియు సమన్వయము చేసికొనవలయును."

ఈ నాటకము ఖర సంవత్సరమున రచితమైనట్లీ క్రింది పురోహిత వాక్యమువలనఁ దెలియుచున్నది. "ఖరనామ సం॥ ఉత్తరాయనవసంతర్తు పంచమీ గురువాసరమున బాలగోపాలునికి స్వస్తిపుణ్యాహములు". ఈ ఖర సంవత్సరము క్రీ. శ. 1651 తో సరియగుచున్నది కావున నిది విప్రనారాయణ చరిత్రమునకన్న నొకయేడు ముందుగా రచితమైనది.

## కాళియ మర్దనము[1]

శ్రీకృష్ణుఁడు కాళియుని మర్దించుట యిందలి యితివృత్తము. ఇందు విజయరాఘవనాయకుఁడు కనకాబ్జనాయిక గన్న చిన్నకుమారుఁడుగా వర్ణితుఁడైనాఁడు.

ఈ నాటకమును "భోజకన్యాముఖాంభోజ రాజమరాళ సత్యాఘనస్తనస్తబకభృంగ" అను సీసపద్యముతో ప్రారంభము. విజయ రాఘవుఁడు తన నామాంకితమును కవితా వైశద్యమును తెలియఁజేసిన వెనుక, రాజగోపాలస్తవము చెంగమలవల్లి స్తవములుఁ గలవు.

"ద్వి. శ్రీరాజగోపాల చిరకీర్తిజాల
కారుణ్య గుణశీల కల్యాణలోల
... ... ... ... ... ... ...
దక్షిణద్వారకాస్థల కృతలీల
రక్షింపఁగదవయ్య! రాధికాలోల!
కలశాంబునిధి కన్య కల్యాణధన్య

---

1. తంజావూరి సరస్వతీమహాలు పుస్తక భాండాగారము. సం. 500, M. 707,

సలలిత సౌజన్య జగదేకమాన్య
... ... ... ... ... ...
శ్రీరంగపులవల్లి చెలువైనతల్లి
కాచి రక్షింపవే కనకాబ్జవల్లి !"

పై స్తవములు రెండును విజయరాఘవుని రఘునాథాభ్యుదయ నాటకము నందు కైవారగద్య తరువాత నున్నవి. రఘునాథాభ్యుదయము క్రీ. శ. 1643-44 సంవత్సరములమధ్య (పుటలు 2-3) రచితమైనదని గ్రంథ పరిష్కర్తలు పీఠికలో[1] వ్రాసియున్నారు. కాబట్టి కాళియమర్దనము క్రీ. శ. 1643-44 సంవత్సరముల వెనుకనే విజయరాఘవనాయకుఁడు వ్రాసియుండవచ్చును. పూతనాహరణమను నాటకము క్రీ. శ. 1651 లో రచితమగుటచేత ప్రస్తుతము మనకు లభించిన తేదీల ననుసరించి కాళియమర్దనము క్రీ. శ. 1643-1651 మధ్య రచితమైయుండునని నిర్వివాదముగాఁ జెప్పవచ్చును.

కథాప్రారంభమున దక్షిణద్వారకవర్ణనము శ్రీ రాజగోపాలస్వామి కొలువు ద్విపదలలో వర్ణితమైనది. గోభిల, గోప్రళయమునులు వచ్చి రాజగోపాలస్వామిని స్తుతించిరి. ఆవెనుక మునీశ్వరులు కాళియ భుజంగ నాట్యప్రసంగంబు మున్నొకసారిదైనను, మఱియొకసారి చూడవేడుక గలదని విన్నవించిరి. రాజగోపాలస్వామి కాళిందీతీరము జేరఁగనే కొంతవడి జలవిహార మైనవెనుక కాళియుఁడను ఫణిరాజందు గలఁడని, ఆతనివలన నపాయములు కలుగుచున్నవని తెలిసికొని, నీటిలోనికుఱికి, కాళియుని మస్తకముపై తన కాలూని, యాతని నణఁగఁ ద్రొక్కెను. కాళియుని యంతఃపురకాంత లప్పుడు శ్రీకృష్ణుని నిట్లు వేడికొనిరి :

ఆ వె. మమ్ము పెండ్లిసేయు మాప్రాణనాథుని
ప్రాణమిచ్చివేఁడు భక్తవరద !
నీవుసేయు పెండ్లి నిక్కంబు భద్రంబు
పిన్ననాటిపెండ్లి పెండ్లి కాదు.

---

1. రఘునాథనాయకాభ్యుదయము పీఠిక. పుట. 33.

శ్రీకృష్ణుఁడు కాళియునకభయమొసంగి, యాతని కాంతలతో నాతనిఁ బంపివేసెను. జలక్రీడానంతరము దక్షిణద్వారకయందుఁ బ్రవేశించి రక్తాబ్జనాయికఁగూఁడి నిండు కొల్వుండెను. గ్రంథాంతమున రాజగోపాల స్వామి తనకుఁగా నాటక చాటుకవితాకన్య నొసంగిన విజయరాఘవ నాయకునకు నవఖండమండలాధిపత్యనిత్యాయురారోగ్యభాగ్య దిగ్విజయములు గలుగునట్లాశీర్వాదముఁగలదు.

## ప్రహ్లాద చరిత్ర

[1] ఈ నాటకకృతి తక్కినవానివలె "భోజకన్యాముఖాంభోజరాజ మరాళ" అను సీసపద్యముతో ప్రారంభముగాక, విజయరాఘవనాయకుని రచనలు తెలుపు సీసమాలికతో ప్రారంభమగుచున్నది. "శ్రీలాంఛ రాజగోపాలవిలాస నాటకము సందర్భించు సుకవివంద్య" అను పాదముతో ప్రారంభమగు సీసమాలిక నీవల నుదాహరించియున్నాఁడను.[2] ఇందు విజయరాఘవనాయకుని రచనలన్నియు పేర్కొనఁబడియుండుటచే, నిది యాతని చివర కృతియని చెప్పవచ్చును.

ఈ సీసమాలిక వెనుక రాజగోపాలస్తుతి చెంగమలవల్లి స్తుతియుఁ గలవు, "శ్రీరాజగోపాల చిరకీర్తిజాల" అనియు, "కలశాంబునిధికన్య కల్యాణధన్య" యనియు మొదలుగాఁగల యీ స్తుతులు రెండును, విజయరాఘవనాయక ) కాళియమర్దనమునఁ గన్పట్టుచున్నది. కాళియ మర్దనము ప్రహ్లాదచరిత్రలో పేర్కొనఁబడినది గావున నందుండియే ప్రహ్లాదచరిత్రమునకు పై స్తవములు సంగ్రహింపఁబడియుండును. ఈ నాటకమున ప్రహ్లాదుని విద్యాభ్యాస సందర్భమున సంభాషణ చాల చమత్కారముగానున్నది. ఎఱ్ఱావధాని, సర్వావధానుల సంభాషణలో హాస్యరసము తొణికిసలాడుచున్నది. మఱియు నిందులో నానాఁటి వస్త్రాలంకారములుఁ బేర్కొనఁబడినవి. బ్రాహ్మణులు గంగమట్టిబెట్టి, నీరుకావిధోవతులుగట్టి, కెంగేల - దర్భముష్టి పంచాంగములఁబూని,

1. తంజావూరి సరస్వతీమహాలు పుస్తక భాండాగారము సం. 541., M. 692.
2. ఈ గ్రంథమున నే-పుటలు 87, 88, 89.

సభకు వచ్చువారు. వరుసలకు దిద్దిన వానరము వెంటరాగా, కఱకు మూఁపునఁ జిల్వ కావడిబూని, పరగ నాగవరాళిఁ బాడుచు పాముల జోగి సభకు వచ్చెడివాఁడు.

కథా విధానమున మార్పులేమియు లేవు, హాస్యరసము కొఱకు విదూషకుఁడును, శృంగారరసము కొఱకు రంభయు నీ నాటకమునఁ బ్రవేశ పెట్టఁబడిరి. గురుప్రహ్లాద సంవాదముతో నీ నాటక విమర్శ ముగింతును.

గురు : నమోహిరణ్యాయ! అనవోయి

ప్రహ్లా: నమోహిరణ్యాంబరాయ !

గురు : ఓయి! అటువలెగాదు అంబర శబ్దమేల చెప్పేవు నమోహిరణ్యాయ' అనవోయి

ప్రహ్లా: నమోహిరణ్యగర్భజనకాయ !

గురు : అయితే నీకీశబ్దం రాదు గంటివి. నమోదైత్యవరాయ ! యనవోయి

ప్రహ్లా: నమోదైత్యహరాయ !

గురు : ఓయి బాలకా! యీ ప్రతికూల వచనంబులేల? నమోదేవభయంకరాయ అనవోయి

ప్రహ్లా: నమోదేవాభయంకరాయ !

గురు : భళాభళా మహాలెస్సాయె

"నేనొకటి చెప్పితే నీ వొకటి చెప్పుచున్నావు. ఓయీ ఎట్టావధానులు చూస్తివా ! తన యద్వాతద్వాలు మానండు. దొరకుమారుండు గదవయ్యా."

## శ్రీ కృష్ణవిలాసము

విజయరాఘవనాయకునిచే రచితమైన యీ యక్షగాన మీ నడుమ ప్రకటితమైనది.[1] ఇయ్యది యింతకుముందు తంజావూరి పుస్తక వివరణ మునందున్నను, నిటీవలనే విజయరాఘవుని కృతిగా గుర్తింపఁబడినది.[2]

1. 1956 లో తంజావూరి సరస్వతీమహాలు పత్రికయందు ప్రకటితమై యా వెనుక ప్రత్యేక గ్రంథముగ వెలువడినది. గ్రంథపరిష్కర్తలు—సరస్వతీమహాలు పుస్తక భాండాగార పండితులు శ్రీ విఠలదేవుని సుందరశర్మగారు.

2. తంజావూరి సరస్వతీమహాలు గ్రంథవివరణ. సం. 2. D 843. M. 596.

ఈ యక్షగాన ప్రారంభమున, నాతని కృతులలో సాధారణముగాఁగన్పట్టు "భోజకన్యాముఖాంభోజరాజమరాళ! సత్యాఘనస్తనస్తబకభృంగ!" అను సీసపద్యము లేదు. అయినను పరిష్కర్తలు ముద్రితప్రతియందు దానిని చేర్చుట సమంజసమే. కైవారగద్య తరువాత రాజగోపాల, చెంగమలవల్లికా, గురు, పూర్వకవి స్తుతులుఁగలవు. భారతీ నేతను, శారదాదేవిని ప్రార్థించి కనకసరోజాంబికాస్తన్యపానజనిత సారస్వతసారతమీఱి, సకలసత్కవికోటి సంతసంబంద నీ నాటకమును రచియించెను.

కథాప్రారంభమున రాజగోపాలుఁడు నిండుకొలువై యుండగా బరాబరి వచ్చి, విలాసవతియను యువతి రాకను తెలిపెను. రాజాజ్ఞయైన వెనుక నా విలాసవతి వచ్చి, రాజునకు మ్రొక్కి-

"చూచేవురా నీవే చూచేవు - ఓ చెల్వమన్నారు నా చెల్లుబడికి
ఎచ్చుమానిసి వేర ఓరోరి! మన్న - యేమోయని యంటిర
గచ్చులు నాతోనె పోర - ముచ్చుకె మూరెడునోరా
ఏవేళను నామీదనుకంటూ - అయింతితో నన్నాడుకొంటూ
భావజుఁడు జేసిన జంటూ - పాయఁజేసేనంటూ
జాజమున నున్నగూడి - జోడుబాయనని నిలువనాడి
రాజమన్నా! యేచేది పాడి నీ - నైజము యిటువంటిమోడి."

అని యొక పదకేళిక వినిపించెను.

ఆసమయమున నచటికి రుక్మిణీదేవి దూతికవచ్చి, రాజగోపాలుని, యామెవద్దకు రమ్మని చెప్పెను. ఆతఁడును సముచితముగ శృంగారించుకొని బయలుదేరుచుండగా, సత్యభామ దూతికవచ్చి, రాజగోపాలుని సత్యయింటికివి రమ్మని చెప్పెను. ఆతఁడును మొదట సత్య యింటికే వచ్చెదనని చెప్పి యామెను పంపివేసి రుక్మిణీదేవి భవనమునకు వచ్చెను.

రుక్మిణీదేవియు, రాజగోపాలుఁడును కొంతసేపు ద్యూతకేళిని సలిపిరి. ఇంతలో రాజగోపాలుని రాకకై నిరీక్షించుచున్న సత్యభామ యాతఁడిక రాఁడని నిశ్చయించుకొని, విరహావేదనాదోదూయమానయై, యాతడున్న భవనమునకు వచ్చెను. ఇంతలో, రుక్మిణి చెలికత్తె వచ్చి

రాజగోపాలు డచ్చట రుక్మిణితో రహస్యక్రీడయందున్నాడనియు నిప్పు డాతనిఁ జూచుటకు వీలుపడదనియు చెప్పినది. ఆ వృత్తాంతము విన్న తోడనే సత్యభామయు నత్యంత రోషావేశపూరితయై, తన భవనము నకు వచ్చి, వాకిట కావలియున్న నెచ్చెలులతో రాజగోపాలుడు వచ్చిన తలుపులు తెఱవవద్దని యాజ్ఞపెట్టెను. అంత సత్యభామ తలఁపునకువచ్చి రాజగోపాలుఁడు సత్యామందిరోన్ముఖుఁడయ్యెను. కాని హెగ్గడికత్తెలచే నివారితుఁడయ్యెను. అంత సత్యభామకును రాజగోపాలునకును గొంత సంవాదము నడచినది. ఆపై నామె తలుపుఁదీయించి యాతనిని లోనికి రానిచ్చినది. అంత సత్యభామ తన్ను విడిచివెళ్లినందుల కాతని పలు విధముల దూరినది. ఆమె ననునయించుటకు రాజగోపాలుఁ డామెకు స్వయముగా కురులుదువ్వి, పూవులుపెట్టెను. కాని యామె కోప ముతో తన్నంటవద్దని దూరముగా తొలఁగినది. అప్పుడు రాజగోపాలుఁ డామె కాళ్లకుమ్రొక్కి యామె నెడబాయనని శపథముచేసెను. సత్య భామయు సంతోషితస్వాంతయై యాతని కౌఁగిటఁజేర్చెను. ఇదియే యిందలి యితివృత్తము. ఇందు ద్విపదలు, దరువులు గలవు. పద్యములు రెండుమాత్రమే గలవు. రచన యంతయు మనోరమముగా నున్నది.

విజయరాఘవనాయకునియాస్థానమునందు విలసిల్లిన కవులు,కవయిత్రులు పెక్కురు. కవులలోఁ దొలి పేర్కొనఁదగినవాఁడు చెంగల్వకాళకవి.

## చెంగల్వ కాళకవి

ఈతఁడు రచించినది రాజగోపాలవిలాసమను నొక ప్రబంధము. తంజావూరి పుస్తక భాండాగారమునఁదప్ప మఱెచ్చటను దీనికి వేఱుప్రతి కానరాలేదు. అచ్చట నున్నవాని వివరణము లీ క్రింద నీయఁబడినవి.[1]

1. తాళపత్ర ప్రతులు : సంఖ్య 222 రాజగోపాలవిలాసము (కాళయ) M. 256; S-18 × 1¼; L-52. 11. 6. G. 1300. గ్రంథప్రారంభము సరిగ నున్నది గాని గ్రంథాంతమున గద్యమందు సీసపద్యములోపించినది. సంపూర్ణము. వ్రాఁత చక్కనిది - 5 ఆశ్వాసమున నాలవ పత్రమున సగము భాగము మాత్రము కలదు. అదితప్ప గ్రంథపాతముఁ గన్పట్టదు. శైథిల్యము స్వల్పము. 223 - M 257 16 × 1½ 50 ఆద్యంతముల కొంతభాగము లేదు. 224 - M 398 18 × 1¼ 18 ఇందు విజయ రాఘవుని వంశము మాత్రము వర్ణితము.

## విజయరాఘవ వంశావళి

గ్రంథావతారికలో విజయరాఘవనాయకుని వంశమునుగూర్చి, యాతని వైదుష్యమునుగూర్చి విపులముగ నుండుటచేఁ జాలకాలము క్రిందటనే యీ భాగమును వేఱుచేసి, "విజయరాఘవ వంశావళి" యని నామకరణము చేసినట్లున్నది. క్రీ. శ. 1936 లో "తంజాపు రాంధ్ర వాఙ్మయము"ను గూర్చి వ్రాసినపు డాంధ్రసాహిత్య పరిషత్తున నే నీప్రతి నుపయోగించితిని[1]; కాని యిది గ్రంథభాగమేగాని వేఱుకాదు. తాళపత్రప్రతులలో వ్రాయసగాని పేరుగాని వ్రాసిన కాలముకాని తెలుపఁబడియుండలేదు. గ్రంథాంతమునఁ బద్యములలోని స్వల్ప లోపములు తప్ప ప్రతులన్నియు బాగుగనేయున్నవి. లేఖక దోషములున్నను వ్రాఁత స్ఫుటముగ నున్నది. ఇది గ్రంథమాతృకా వివరణము.

"రాజగోపాలవిలాసము" అను నీ ప్రబంధము తంజావూరి నాయక రాజును, మహాప్రసిద్ధుఁడును నగు రఘునాథనాయకుని పుత్రుఁడునగు విజయరాఘవనాయకుని కంకితముగా చెంగల్వ కాళయ కవిచే రచింపఁ బడినది. ఈ కాళకవి తన్నుఁగూర్చి యీ ప్రబంధమున నిట్లు చెప్పికొన్నాఁడు.

సీ. శ్రీవత్స గోత్రుండు శ్రీకరపాకనా
  టార్వేల బంధుజనాతిశాయి
కాళయమంత్రి పుంగవునకు గంగమాం
  బకు నుదయించు తపః ఫలంబు
రణరంగగంధవారణ బిరుదాంకిత
  స్వకులజ శ్రీకంఠ సచివమౌళి
పార్వతీ పరిణయ ప్రముఖప్రబంధ ని
  బంధ ధురంధర ప్రౌఢ ఫణితి

గీ. యైన చెంగల్వ వేంకటయ్యయును రావి
నూతల తిరుమలయ్య తనూజ కృష్ణ
మాంబ మునుగన్ననిధి కాళహస్తి గిరిశ
కలిత లలితోక్తి భారవి కాళసుకవి. (1-29)

1. చూడుఁడు. ఆంధ్రసాహిత్య పరిషత్తు రజతోత్సవ సంచిక. 1936 పుటలు 150-164.

పై పద్యమువలన నితఁడు పాకనాఁటి యాఱ్వేలనియోగి బ్రాహ్మణుఁడనియు, నితని తాత కాళయమంత్రి, పితామహి గంగమాంబయనియు, తండ్రి వెంకటయ్యయనియు, తల్లి కృష్ణమాంబయనియుఁ దెలియుచున్నది. మఱియు నితని తండ్రి రణరంగ గంధవారణ బిరుదాంకుఁడగు శ్రీకంఠునకు మంత్రియనియు, నాతఁడు పార్వతీపరిణయమను ప్రబంధమును రచించె ననియు, తల్లి రావిసూతుల తిరుమలయ్యతనూజ యనియు, నీతఁడు శ్రీ కాళహస్తీశ్వరుని ప్రసాదమునఁ గవితాసిద్ధిఁ బడసిన వాఁడనియుఁ గూడ స్పష్టపడుచున్నది.

ప్రస్తుత మీతని తండ్రి రచించిన పార్వతీపరిణయము లభ్యము కాదు. కాని యీతఁడు కవివంశములోనివాఁడేయని చెప్పనొప్పును. ఈతఁడు విజయరాఘవనాయకుని తండ్రియగు రఘునాథనాయకునికాలమున నుండినట్లుగ నా తరువాతి పద్యమువలనఁ దెలియుచున్నది.

సీ. ఘటికా శతగ్రంథ ఘటనోత్కట నవీన
పాండిత్యగరిమలు భళియనంగ
నోష్ఠ్యనిరోష్ఠ్యాది కోద్దామ రసగర్భ
సందర్భమౌనని సన్నుతింప
మాకందమంజరీ మధుఝరీ మాధుర్య
రచనావిశేష మౌరా యనంగ
పరిహృతేతరయుక్తి భాగ నూతనకథా
చాతుర్యధుర్యత సంస్తుతింప

గీ. అయ్యదినముల రామభద్రమ్మవారు
నేఁడు కృష్ణాజి కవితల నేర్పు మెఱసి
వినికిసేయుటలెల్ల మీ ఘనతఁగాదె
కవివినుతచర్య! చెంగల్వకాళినార్య! (1-30)

పై పద్యమునఁ బేర్కొనఁబడిన రామభద్రాంబ, సంస్కృత సాహిత్యసామ్రాజ్య భద్రాసనాసీనయని ప్రసిద్ధికెక్కిన విదుషీమణి. ఈమె సంస్కృతమున రఘునాథనాయకాభ్యుదయ మహాకావ్యమును

రచించినది. ఈమెకుఁ దెలుఁగుకవిత నేర్పినది కాళకవియేయని పై వానివలనఁ దెలియుచున్నది. కృష్ణాంబయను కవయిత్రి, విజయరాఘవ నాయకుని కాలమున నాస్థానములో నుండినట్లుగ నీగ్రంథమున తెలుపఁబడియున్నది. ఈమె ఛందశ్శా స్త్ర ప్రవీణ. సమస్యాపూరణమున, సంస్కృతాంధ్రకవితల నిపుణురాలని కాళకవియే యిట్లు చెప్పినాఁడు.

సీ. ప్రస్తారసంఖ్యను బరుమూఁడుకోటులు
నలువదిరెండు లక్షలు పదేడు
వేలు నేన్నూఱును వింశతియును నాఱు
వృత్తంబులందు నీవృత్తములకు
నీవర్ణన సమస్యనీవు గూర్పు మటన్న
నావృత్తమున సమస్యను రచించి
యందుకు శ్లోకంబు లాశువుగాఁ జెప్పి
యవి తెనుంగునను పద్యములు చేసి
గీ. యిరువదారును ఛందంబులెఱిఁగి యిట్లు
కవితఁ జెప్పిన వార లీభువిని గలరె?
యనుచు నందఱు వినుతింప ఘనతఁ గాంచె
కీర్తనీయగుణాలంబ కృష్ణమాంబ. (1–27)

పై శిష్యురాండ్ర సామర్థ్యము వర్ణించుచు, స్వోత్కర్ష యనిపించు కొనకుండ, తన సామర్థ్యమునే వ్యక్తపఱచినాఁడు కాళకవి. ఈతఁడు

1. ఘటికాశతగ్రంథ ఘటనుఁడు – ఘడియకు నూఱుపద్యములు చెప్పు సామర్థ్యముగలవాఁడు. అనఁగా ఆశుకవిత్వమునఁ బ్రవీణుఁడు.

2. ఓష్ఠ్య నిరోష్ఠ్యాది నియమములతోఁ గవిత చెప్పువాఁడు – అనఁగా చిత్రకవిత్వమున [illegible].

3. మాకందమంజరీమధురఝురీమాధుర్య రచనచేయఁగలవాడు – అనఁగా మధురకవితలో నారితేఱినవాఁడు.

4. పరిహృతేతరయుక్తిభాగ నూతనకథాకథకుఁడు – ఇతరుల మాటలు గైకొనక, క్రొత్తగా కథావస్తునిర్మాణము చేయఁగలవాఁడు. అనఁగా 'విస్తర' కవితావిశారదుఁడు. కాబట్టి కాళయ చతుర్విధకవితా విశారదుఁడని చెప్పనొప్పును.

ఇంక నీతఁడు సంస్కృతాంధ్రకవనమున, ఛందశ్శాస్త్రమున సంపూర్ణప్రజ్ఞ గలవాఁడని రెండవపద్యమే చెప్పుచున్నది. కాని యే కారణముచేతనో నీతఁడు రసికవతంసుఁడును, రాజకవీంద్రుఁడునగు రఘునాథనాయకుని యాస్థానమునఁ బ్రసిద్ధికెక్కలేదు.

"ఉ. భూనుతకీర్తులైన కవిపుంగవులందఱు మెచ్చనిచ్చలున్
తేనియసోనలై కసటుఁదేఱిన చక్కెరపానకంబులై
వీనులవిందులై రసికవేద్యములై యల వాగ్వధూటికిన్
గానుకలైన" (1–41)

యీతని కవిత రఘునాథుని నాకర్షింపవలసినదే. దీనికి, కాళకవి తొలుతనుండి విజయరాఘవనాయకునే యాశ్రయింపఁగా, క్రమక్రమముగా కాళకవి ప్రతిభగుర్తించి యాతని కేవలకవిగానేగాక స్నేహితునిగా సంభావించి విజయరాఘవనాయకుఁడు గౌరవించుచుండ, నాతఁడు రఘునాథనాయకుని యాస్థానకవిపదమునకుఁ బ్రయత్నముచేయు నావశ్యకత లేకపోవుటయే కారణముగాఁ గన్పట్టుచున్నది. విజయరాఘవనాయకుఁడు రాజ్యమునకు వచ్చినతోడనే గ్రంథ మాతనికిఁ గృతినొసంగుటకూడఁ బై యంశమును బలపఱచుచున్నది. మఱియును రాజైన విజయరాఘవనాయకుఁడు తన యింటికి తన భార్యలతోఁగూడవచ్చి, విందారగించి, యింటివారలనందఱను ననేకవిధముల గౌరవించెనని చెప్పిన యీ క్రింది సందర్భమునుబట్టి, వారిరువురి కెంత యన్యోన్యగౌరవస్నేహబాంధవము లుండెడివో గ్రహింపవచ్చును.

విజయరాఘవనాయకుఁడు గ్రంథమంకితము గోరుచు నిట్లు చెప్పినాఁడు.

మ. పక్షియార్వ్యాన్నె పసిండికికిన్ వలపు పైపైఁ జెందు చందంబునన్
చదురల్ మీఱు భవత్ప్రబంధమిల నిచ్చల్ దక్షిణ ద్వారకా
సదనాస్థాన కథానుషంగములచే సంభావ్యమై మించె నేఁ
డది మాకంకిత మీవొనర్పుమని యాహ్లాదంబు సంధిల్లఁగన్. (1–32)

సీ. అల సహ్యజాతటి నగ్రహారంబులు
బహురేకమించు నుంబళికయూళ్లు
బంగారు టనుసుల పచ్చల పల్లకి
పసిఁడికొమ్ముల కట్ల భద్రకరులు
పడివాగె తేజీలు బంగారుకాళాంజి
హడపంబు చామరల్ హంసకంబు
తరమైన చొకట్లు తారహారంబులు
నంగుళీయాది రాజార్హభూష

గీ. లెలమి నపరంజి హరివాణములును గిండ్లు
పెట్టెలకొలంది జాళెలు పట్టుమీఱి
... ... ... ... ... ... ... ... ఘనత
కనుగుణంబుగ దయచేసి యపుడు మఱియు. (1–33)

క. కేళాకూళుల సజ్జల
కేళీవనములను మించు గృహరాజంబున్
శ్రీలెసఁగ నొసగి లోకులు
మేలని కొనియాడ కరుణ మీఱఁగనంతన్. (1–34)

గీ. విందునకుఁ దాము గటితలు వేడ్కవచ్చి
వరుస సొమ్ములు తమయింటి వారికొసఁగి
యాత్మజాలకెల్ల చతురంత యానములను
మహితభూషణములు బహుమతులుసేయ " (1–35)

పై పద్యములవలన కాళకవి నెంతగ గౌరవించినది మనకు తెలియవచ్చును. కాళకవిని సామాన్యకవిగా నెంచక, రాజకవిగానెంచి యాతనికి వివిధరాజ చిహ్నములనొసఁగి విజయరాఘవుఁడు సమ్మానించెనని యాశ్వాసాంతగద్యవలన నెఱుకపడుచున్నది. "ఇతి శ్రీమత్కాళహసీ

శ్వర కరుణాకటాక్ష లబ్ధసిద్ధ సారస్వతనయ చెంగల్వ వేంకటార్యతనయ, విజయరాఘవభూపప్రసాదాసాదిత వివిధరాజచిహ్న చిహ్నితభాగధేయ కాళయనామధేయ ప్రణీతంబైన రాజగోపాలవిలాసంబను మహాప్రబంధంబునందు ప్రథమాశ్వాసము.''

కాళయ ప్రతిభావంతుఁడైనకవి. బంగారమునకుఁ బరిమళ మబ్బినట్లుగా, నీతనికి విద్వత్కవిరాజగు విజయరాఘవనాయకుని స్నేహబాంధవము సమకూడినది. ఈ రాజగోపాలవిలాస మొకటితప్పఁ దక్కిన యీతని కృతులేవియుఁ గానరాలేదు. అయినను కాళయ కవితాచాతుర్యమును బ్రకటించుటకు నీ ప్రబంధ మొక్కటియే చాలును. ఈ విషయమునుగూర్చి విస్తరించుటకుముందు కృతిపతియగు విజయరాఘవనాయకునిగూర్చి మనము తెలిసికొనఁదగును.

రాజగోపాలవిలాసమునఁ బ్రథమాశ్వాసమునఁ గృత్యవతరణికలో రమారమి డెబ్బది పద్యములలో విజయరాఘవనాయకుని యుదంతమంతయు వివరింపఁబడినది. అతని పూర్వులసంతతి సంగ్రహముగను, కృతిభర్తసంగతి సవిస్తరముగను నందు వర్ణితమైనది. ఈ భాగమునే 'విజయరాఘవ వంశావళి' యని వేఱుచేసి వ్రాసినట్లు మున్ను తెలిపియుంటిని.

ఇది దక్షిణద్వారకాస్థల మాహాత్మ్యమును దెలుపు నైదాశ్వాసముల ప్రబంధము. దక్షిణద్వారక యనఁగా తంజావూరి జిల్లాలోని మన్నారుగుడి. అచటనున్న స్వామి రాజగోపాలుఁడు. ఈ స్థల మాహాత్మ్యమునకు మూల మగ్నికల్పమని తెలుపఁబడియున్నది. సూతుఁడు శౌనకుని నడుగగా శౌనకుఁ డాతనికి "చంపక వనాంతరమున గోప్రళయమాని తపస్సుచేసి హరిని వేఁడఁగా నాతఁడు ప్రత్యక్షమై యాతని కోర్కెననుసరించి పదాఱువేల గోపికలతో, నష్టమహిషులతో నచ్చటనే నిలిచెను" అని చెప్పుట కథాబీజము.

## ప్రబంధమునందలి కథ

చంపక వనమున శ్రీకృష్ణుఁడు వనవిహారము సలుపుచు, అష్టవిధ శృంగారనాయికలవలెఁ జెలఁగుచున్న తన యష్టమహిషుల స్వభావములు తెలియఁగోరి వారివారి నాయాజాడలనుండ నియమించెను. తొలుత రుక్మిణీజాడకరిగి యామెకుఁ గనఁబడక పొంచియుండి, యామె యనుతాప మెఱిఁగి యెదుటఁ బ్రత్యక్షమై యానందాబ్ధిని నోలలాడించెను. ఆ వెనుక భద్రయొద్దకు నొక దూతినంపి సంకేతస్థలముచెప్పి తానచ్చటి కేగెను. కాని భద్ర యలిగి కృష్ణునిన్ కంతతడవు విరహవేదనకుఁ బాలుపఱచెను. అంత లక్షణ తన స్థలములో నొక చంద్రకాంతశిలపై కృష్ణునికొఱకు నిరీక్షించుచుఁ దన సౌధమునంతయు నలంకరింపఁజేసెను. అతఁడు రాకపోవుట చూచి యొక దూతినంపి రప్పించెను.

శ్రీకృష్ణుఁ డామెను సమ్మదాంతరంగిగ నొనర్చి తక్కిన కాంతలం దలంచుకొని వారి సమాగమము కాంక్షించుచుండెను. జాంబవతి తన దూతికతో విరహవేదన నివేదింప నామెవలన శ్రీకృష్ణుఁ డెఱింగి పొదల చాటున నామె యనురాగమ్ముగ్రహించి, యామెను మోదమునఁ దేల్చి, మిత్రవింద సౌధమున కేగి, యామెను ముదితురాలుగ నొనర్చి విరహ గ్లానిచేఁ గుందుచున్న సుదంతను సంతసపఱచెను. అపైఁ దనకొఱకు వ్యథ చెందు కాళింది నానందమునఁ దేలించి, సత్యభామను సకల సౌఖ్యముల సంభావించెను.

ఆపైని దక్షిణద్వారకానగరమును గవివర్ణించి చంపకవనమునకు దక్షిణద్వారకాసంజ్ఞ గలుగుట వివరించియున్నాఁడు.

చంపకవనమునఁ దపస్సుచేసెడు ఋషులలో వహ్నిముఖుఁడను సంయమిశ్రేష్ఠుఁడు గలఁడు. అతనికి గోప్రళయుఁడు, గోభిలుఁడు నను నిరువురు తనయులుఁగలిగిరి. వారిరువురిలో గోప్రళయుఁడు స్నాన సంధ్యాజపహోమకృత్యంబులు నిర్వహించుచు, నతిథ్యభ్యాగతులను పూజించుచు, నిరంతరభగవద్భక్తి సంప్లావితుండై శ్రీహరిఁగూర్చి తపస్సు

చేయ నారంభించెను. అతఁడు శీతవాతోష్ణస్థితుల లెక్కింపక నుగ్రరీతి తపస్సు చేయుటతోడనే శ్రీమహావిష్ణు వాతని తపశ్చర్యకు మెచ్చి ప్రత్యక్షమయ్యెను. గోప్రళయుఁ డాతనిఁ బలువిధములఁ బ్రణుతించెను. మహావిష్ణువు మిక్కిలి సంతసించి వరముఁ గోరుకొమ్మనెను. రుక్మిణి మొదలగు పట్టమహిషులతోడను పదారువేల గోపికా సమూహము తోడను విష్ణువు శ్రీకృష్ణావతారమున ద్వారకలో నున్నట్లుగా చంపక వనమునందు నివసింప గోప్రళయుఁడు కోరెను. అంత మహావిష్ణు వట్లే చంపకవనమునకు దక్షిణద్వారకా సంజ్ఞనిచ్చి యచ్చట కృష్ణావ తార రూపమున వసించెను. గోప్రళయుఁ డా క్షేత్రంబునఁ దొలుతఁ గృష్ణుని వరమువలనఁ గృష్ణతీర్థమును, నందుండి హరిద్రానదినిఁ గలుగఁ జేసెను. విష్ణు పుష్కరిణిని నిర్మించెను. అచ్చటనే బృందావన రూపమున వనమును బ్రతిష్ఠించెను. గోభిలుఁడుకూడ గోప్రళయున కీ క్షేత్రనిర్మాణ మునఁ దోడుపడెను. కొంతకాలమునకు గోప్రళయుఁడు వైకుంఠవాసి యయ్యెను.

ఇచ్చట బ్రహ్మ తొలుతఁ దపస్సుచేసెను. మహాలక్ష్మి విష్ణువును గూర్చి తపస్సుచేసెను. శ్రీమహావిష్ణువు వారివారి కోర్కెల నెఱవేర్చెను.

ఆపైని హరిద్రానదీ ప్రభావము వర్ణితము. ఏ పాపమునకైన నిష్కృతి గలదు గాని కృతఘ్నతకు నిష్కృతిలేదు. అట్టి కృతఘ్నతా దోషమును దొలగించిన హరిద్రానదీ ప్రభావమున కొక కథ యనుసం ధింపఁబడినది. గోదావరీనది యుత్తరమున సింధుసౌవీర మధ్యప్రదేశ మున సౌరాష్ట్ర దేశముగలదు. దానిని రాజశేఖరుఁడను రాజు పాలించు చుండెను. అతఁ డొకనాఁడు వేఁటకు ఒయలుదేఱి సాధన సామగ్రిచే నాటవికులతోఁ జాలతడవు వేఁటలాడి యనేక మృగములను జంపెను. అంత నొక వరాహము చెంచులకు వశముగాకుండఁ దన యెదుటనుండి పోవుచుండఁగా దానిని బట్టుకొనుటకై వెంటఁ దఱిమెను. కాని రాళ్ళు రప్పలు, గట్టులు పుట్టలు దాఁటినను జిక్కలేదు. అతఁడును మిగుల డస్సి, దాహము మిక్కుటముకాఁగా నక్కడ నొక యాశ్రమమ్ము గన్పడ

నందు ప్రవేశించెను. అచ్చట యజ్ఞశీలుఁడను ముని యాతని సేదదీర్చి యాదరించి, యన్నపానాదుల సంతుష్టుం గావించి పురమున కనిచెను. ఆ వెనుక నీ రాజునకుఁ గృతజ్ఞతాస్వభావ మెంతవఱకు నున్నదో పరీక్షించుటకై మునిరూపముననే దొంగవానివలెఁ, జీకటి పడఁగానే రాజుగారి ధనాగారములోని విలువగలవానిని గ్రహించి, పట్టుకొనిపోవుచుండెను. అంతఁ దలవర్లాతనిఁ బట్టుకొని కట్లుకట్టి రాజుగారి ముందఱ నిలువఁబెట్టిరి. అంత రాజు మునినిజూచి తన కుపకృతి చేసినవాఁడని గ్రహించియు సొమ్ముతీసికొని యాతని దుర్భాషలాడి యవమానపఱచి, యూరు వెడలఁద్రోయించెను. అంత కృతఘ్నతా దోషముచే, రాజు మతిభ్రాంతి కలిగి పిచ్చివాఁడై యడవులఁ దిరుగుచుండెను. తన యాశ్రమము ముందు రాఁగానే యజ్ఞశీలుఁ డతని పాపము పరిహరించెదనని యాతనిఁ జేరఁబిలిచి యిది వచ్చుటకు నాతని రాజ్యమదాంధతయుఁ గృతఘ్నతయుఁ గారణమని తెలుపును. మఱియును బ్రాహ్మణాశీర్వాదమువలన సర్వ శుభములును సమకూరవలయుననియు నచ్చట హరిద్రానదిలోఁ గ్రుంకినఁ బాప నివృత్తియై పూర్వరూపము వచ్చునని చెప్పెను. అట్లు చెప్పిన తోడనే హరిద్రానదిలో మునుఁగఁగానే తన పూర్వతేజస్సు రూపమును ధరించి విష్ణుభక్తుఁడై యచటి రాజగోపాలస్వామికి నంతయుఁ గైంకర్యము చేసి కృతార్థుఁడయ్యెను.

రాజగోపాలవిలాసము శ్రీకృష్ణుని యష్టమహిషులను సప్తవిధ శృంగార నాయికలనుగా నిరూపించి కవి యాలంకారిక శాస్త్రానుగుణముగ శృంగార రసపోషణము గ్రంథమున నిట్లనుసంధించినాఁడు.

| | | | |
|---|---|---|---|
| 1. | రుక్మిణి | – కలహాంతరిత | ప్రథమాశ్వాసము |
| 2. | భద్ర | – అభిసారిక | ద్వితీయా ,, |
| 3. | లక్షణ | – వాసకసజ్జిక | |
| 4. | జాంబవతి | – విప్రలబ్ధ | తృతీయా ,, |
| 5. | మిత్రవింద | – ఖండిత | |
| 6. | సుదంత | – విరహోత్కంఠిత | |
| 7. | కాళింది | – ప్రోషితభర్తృక | చతుర్థా ,, |
| 8. | సత్యభామ | – స్వాధీనపతిక | |

ప్రథమాశ్వాసమున మొదట నవతారికయుఁ, బంచమాశ్వాసము చివర క్షేత్ర మహాత్మ్యమును సంఘటించి గ్రంథముఁ బూర్తిచేసినాఁడు. గ్రంథమందంతటను శ్రీ రాజగోపాలనామమున వెలసిన శ్రీకృష్ణుని విలాస ముతే గావున నీ ప్రబంధమునకు "రాజగోపాలవిలాసము" అను పేరు సార్థకమగుచున్నది. "విజయరాఘవవిలాస" భవనమును రాజగోపాల విలాస మలంకరించుట విశేష సంఘటనమేగదా!

ఇందైదాశ్వాసములలో 454 పద్యములు గలవు. ఇది ప్రబంధ మని యనిపించుటకుఁ, జతుర్థాశ్వాసమున ద్వారకాపురవర్ణన, పంచమా శ్వాసమున వేఁట వర్ణన చేయఁబడినది.

కాళయకవి కవిత ధారాశుద్ధిగలిగి ప్రసన్నమై మృదుమధురమై వెలయుచున్నది. సంస్కృతసమాసము లుపయోగించిన నవి ప్రసాద గుణము గలిగి హాయిని గూర్చును. ఈతని సమాసరచన నన్నయ శ్రీనాథుల రచనఁ దలఁపించును.

మ. కలమంద్రోదిత రత్నకంకణ ఝణత్కారంబు తోరంబుగాఁ
దలిరుం దీవెల సంచలించు గతి హస్తన్యాసముల్ మీఱఁగా
లలనల్ "పాండ్య నృపాల మండల విభా!" యంచుఁ గైవారముల్
వలనొప్పన్ రచియించి రంత నుచిత వ్యాపార పారీణతన్. (1-20.)

చ. మలయతటీ పటీర తరుమాంసల సౌరభభార మందసం
చలన సమీర లోల జలజాత సుజాత పరాగరాగసం
కలిత మనోహరాస్తరణ కాంత నిశాకర కాంత వేదికా
తలమునసుండి యవ్వికచ తామరసాక్షిఁ దలంచి సెమ్మదిన్. (2-18.)

క. హరియించె వారి బడలిక
పరిసర కాసారతీర పరిచిత హంసీ
గరుదంచల హతిచంచల
సరసిజదళ తాళవృంత జాతా నిలముల్; (2-40.)

నన్నయవలె మత్తేభ వృత్తము నడిపించుటయందుఁ గాళకవి గట్టివాఁడు.

మ. సుమనస్సాయక లోలచాప మదఖర్జూశర్జనల్ సేయునీ
బొమపొల్పంబు తదీయబాణముల సొంపుల్ వంపు వాల్జూపులున్
ప్రమదాంభోనిధిఁదేల్చె సౌఖ్యముల నాపాదించె నూహించఁగా
రమణీ! కోపము సేయునట్టి యుపకారం బెన్నఁగా శక్యమే? (3-50.)

అచ్చ తెనుఁగు పదములతో నిట్లు:

మ. తొగరారా తెగమేడ యోవరులజోతుల్ జేటనిద్దంపులే
జిగురు న్వెన్నెల చల్వ చప్పరమునన్ జిన్నారి పూగుత్తులన్
నెగడం జేయఁగ బాటనుండి వలి తేనెల్ చిందు చందంబునన్
చిగురుం బోఁడి మురారిఁజేరి పలికెన్ జిత్తంబు రానత్తఱిన్. (2-6)

మ. కలలోనైనను నీదు మాటలకు నాఁగాదంచు మాటాడుటల్
గలవో? వాడలవాడలం దిరిగి రాఁగా నీకు మెండొడ్డుటల్
గలవో? చూచినవారలందఱు నగంగా నిన్ని విన్నాణముల్
గలవో? మానవతీవిలాస మకరాంకా! యింక నేమందురా? (1-99.)

ఇందు శృంగారరసము అమరుకకావ్యము నందువలె భావప్రధానమేగాని, యాంధ్రకావ్య సాధారణముగు వర్ణన ప్రధానముగాదు. వస్తువర్ణన గావింపక, భావస్ఫోరకముగ సంభాషణ మూలముననే శృంగార రసావిష్కరణము గావించిన కాళకవి ప్రతిభ యసమానమైనది.

రాజగోపాల విలాసమునకుఁ గొంచెము ముందుగఁ బుట్టిన విజయ విలాసముతో సరిచూచిన నీ విషయము స్పష్టము - విజయ విలాసమున శ్లేషలమూలమున, వర్ణనలమూలమున వేంకటకవి రససిద్ధిఁ గావించినాఁడు. జాంబవతీ లక్షణానాయికల ఘట్టములోని సంభాషణలు చూచినఁ గాళకవి కేవల శ్లేషవర్ణనల పొంతఁబోక యెంత భావప్రధానముగ రచించినదియుఁ దెలియఁగలదు.

ఈ గ్రంథము విజయరాఘవనాయకుఁడు సింహాసనమెక్కిన తొలి సంవత్సరముననే యనఁగా క్రీ.శ. 1633లో రచియింపఁబడినది. కాఁబట్టియే యీ మహారాజు కాలమున విలసిల్లిన రంగాజమ్మ మొదలగు కవయిత్రుల వృత్తాంతముగాని, విజయరాఘవనాయకుని రచనలుగాని యిందుండుట కవకాశములేదు. విద్వత్కవియు, విష్ణుభక్తాగ్రేసరుఁడునగు విజయరాఘవ నాయకుని కాలమునాఁటి విస్తృతమగు వాఙ్మయమునకు దలమానిక మగు[1] నీ కృతి నింకను మనము చక్కఁగాఁ జదువవలసియున్నది.

# కోనేటి దీక్షితచంద్రుఁడు

ఈతఁడు "[2]విజయరాఘవ కల్యాణము" అను నాటకమునకుఁ గర్త. రాజగురువగు శతక్రతు చతుర్వేది శ్రీనివాస తాతాచార్యుల శిష్యుఁడు. రామానుజాచార్యతనయుఁడు. విజయరాఘవనాయకునిచేత నగ్రహార తారహారాదిబిరుదవాద్య పారితోషికములందిన మనీషి. 'కందళద్రస గర్భసందర్భంబులు హావణించునట్లు' రచితమైన యీ నాటకమునుండి యుదాహృతమైన యీ క్రింది భాగమువలన పై యంశములు దెలియుచున్నవి.

"శ్రీమద్రామాయణోపదేశ సంతుష్టాంతరంగ భగవత్కృపాపాంగ వీక్షణానురక్షణప్రాప్త సూరాగ్రహార తారహారరచిత రత్నకంకణ కేదారతాను రూపమౌక్తిక కలాపహృద్యతర బిరుదవాద్యనానా వాహనాది సమ్మాన మాననీయ శాశ్వతైశ్వర్యధుర్యుండును, బహువారరచిత యాగ భాగసంతర్పితాఖిల దేవతావర్యుండును, సంగీతసాహిత్య విద్యా ధురీణవరేణ్యుండును, రామానుజాచార్య తనయాగ్రగణ్యుండును, భారత భాగవతాది శిక్షావైచక్షణ్య విజిత విబుధాచార్యుండును గురురాజ

1. ఈకృతి తంజావూరి సరస్వతీమహాలు వారిచే ప్రకటితమైనది. గ్రంథ సంపాదకుఁడు నిడుదవోలు వెంకటరావు ఎమ్. ఏ.

2. తంజావూరి సరస్వతీమహాలు గ్రంథ సంఖ్య. 701.

శతక్రతు శ్రీనివాసదేశిక ప్రతిష్ఠాపితోద్ధ్యాయ వైభవధుర్యుండును, సకల సద్గుణ సాంద్రుండునగు కోనేటి దీక్షితచంద్రుండు"; విజయరాఘవనాయకుఁడు "శ్రీరామాభిరామంబగు శ్రీరామసౌధంబు[1]న కలువరాచెలువంబు గల చలువరాజగతిపై నూత్నరత్న సింహాసనసుఖాసీనుండై" యున్నయపుడు,

చ. చతురవచో విశేషములు శాశ్వతవైభవ శోభనంబులుఁ
వితరణ గౌరవంబులు నవీనయశంబులు దారతేజముల్
క్షితి కవిరాజకోటికినిఁ జేరుచునుండ దృఢవ్రతంబుగాఁ
బ్రతిదినమున్ గృతుల్ విజయరాఘవభూపతినుతింపఁగాఁ.

అని కృతిపతిని వినుతించి గ్రంథమును రచించెను.

విజయరాఘవ కళ్యాణ మొక పెద్ద నాటకము నాటకప్రారంభమున రాజగోపాలస్తుతి, చెంగమలవల్లిస్తుతి గలవు. ఆపై చోళదేశ వర్ణనము, తంజావూరి వర్ణనము, విజయరాఘవనాయకుని కొలువు, చెంచులు వచ్చి రాజును వేటకు రమ్మని కోరుట, రాజు వేఁట కేగుట - మొదలగునవి వర్ణితములు. చెంచువారి జీవిత మిందు చక్కఁగా స్వాభావికముగా వర్ణితమైనది. విశేషమేమనగా నిందు కొన్ని యాటవికుల పాటలును పదములును నచ్చటచ్చట చొప్పింపఁబడియున్నవి. కాటమరాజుమీఁద పదము, కంబమురాయనిమీఁది పదము, కూవలమ్మ పాటలు, ధర్మరాజుమీఁది పాటలు - ఇందు కన్పట్టును. రాజు వేఁటకు నేఁగునప్పు డంగనలాతనిఁ జూచి మరులుకొందురు. వారిలో కళానిధియనురాజుగారి కుమార్తెయగు మదనమంజరి యనునామె విజయరాఘవుని చూచి మోహించి యాతని పెండ్లియాడఁ దలఁచెను. విజయరాఘవుఁడును నామెపై విరాళిగొని, యామె యెట్లు తనకు లభించునాయని చింతించుచు తన రాజధానికి మరలెను.

1 తంజావూరికోటలో శ్రీరామసౌధము వెనుక ప్రాంగణమున నీ చలువరాజగతి నేఁటికిని గలదు. జగతి యనగా వేదిక. ఇది రాఘునాథాభ్యుదయమునను పేర్కొనబడినది. దీని దగ్గఱనే మహారాష్ట్రరాజగు శరభోజి శిలావిగ్రహము కలదు.

విజయరాఘవనాయకుఁడు కొంతతడవు విద్వద్గోష్ఠి నెఱపెను. రాజసభలో సంస్కృతము ప్రాకృతము తెలుఁగు తమిళము నెఱిఁగిన విద్వాంసులుండిరి. శాస్త్రపండితులు వాగ్వాదముల నెఱపిరి. ఆయా భాషలలో పాండిత్యము, కవిత్వము ప్రదర్శించినవారిని రాజు సన్మానించెను. ఆవెనుక మదనమంజరి చెలి రాజువద్దకువచ్చి మదనమంజరి రూపరేఖా విలాసములు వర్ణించి యామెకు రాజుగారిపైఁగల యనురాగమును దెల్పెను. రాజును మదనమంజరిని వివాహమాడెదనని చెలితో మాట యిచ్చి యామెను సాగనంపెను.

ఇంతలో మదనమంజరికడకు, చెంగమలవల్లి యెఱుకతవేషముతో వచ్చి, యామె యభిలాష మీఁడేఱునని సోదె చెప్పెను. విజయరాఘవ నాయకుని వృత్తాంతమును నాతని యాచార్యులగు శతక్రతు శ్రీనివాస తాతాచార్యులవారెఱింగి వారే మదనమంజరి వద్దకు స్వయముగావెళ్లి వివాహమును రహితపఱచిరి. అనంతరము ముత్తైదువుల సువ్వాల పాటలతో శోభనపు పదములతో మదనమంజరీ విజయరాఘవుల వివాహము వైభవోపేతముగ జరిపించిరి. విదుషీమణి యగు మదన మంజరి పదకేళి భర్తకు వినిపించెను.

ఇందు ఎఱుకతవర్ణనము, ఆమె సంభాషణము స్వాభావికముగ నున్నవి. విజయరాఘవుఁ డీకృతియందు శ్రీకృష్ణుని యపరావతారముగ వర్ణితుఁడైనాఁడు. ఈ గ్రంథమున సంకల్పములో నీ వివాహము సౌమ్య సంవత్సరమున జరిగినట్లు చెప్పఁబడియున్నది. ఈ సౌమ్య క్రీ.శ. 1669తో సరిపోవుచున్నది గాన నీ కృతి యా సంవత్సరముననే రచితమైనదని చెప్పనొప్పును. ఈ కృతికిని రంగాజమ్మ మన్నారుదాసవిలాస నాటక మునకుఁ జాల పోలికలున్నవి. మన్నారుదాసవిలాస రచనకాలము క్రీ. శ. 1662 సంవత్సరము కాబట్టి యీ కృతి మన్నారుదాసవిలాస కృత్యనంతరమే రచితమైనదని చెప్పవచ్చును. కాబట్టి కోనేటి దీక్షితుఁడు

రంగాజమ్మ కృతి ననుసరించియే రచించెననుట నిర్వివాదము. ఈ విషయ మొకటియుఁగూడ రంగాజమ్మ కవితా నైపుణ్యమును ప్రత్యేక విశిష్టతయు నాకాలమున నామెకు సాహిత్యలోకమున గల గౌరవ స్థానమును దెలుపును.

## పురుషోత్తమ దీక్షితుఁడు

ఈతఁడు "తంజాపురాన్నదానమహానాటకము" అను పేర నొక కృతిని రచియించి యున్నాఁడు. తంజావూరి నాయకరాజు లన్నదానమునకుఁ జాల ప్రసిద్ధికెక్కినవారు. "నిరతావారితాన్నసత్రసంతోషిత పంచాశత్సహస్రభూసుర" అని రఘునాథనాయకుని వాల్మీకి చరిత్ర గద్యయందు గలదు. విజయరాఘవనాయకుఁడును నట్లే ప్రతిదినము నేఁబదివేలమంది బ్రాహ్మణులకు నన్నదానము చేసిన యన్నదాత. ఆకాలమున తంజావూరు దక్షిణదేశమందలి "యన్నపూర్ణసత్రము", అనినచో నది సత్యోక్తియేగాని యత్యుక్తి కానేరదు. ఈ నాటకమునం దచ్చటచ్చట పాత్రల సంభాషణములలో నరవభాష ప్రయుక్తమైనది. దీనికి సత్రమరులు అని అని నామాంతరము. అముద్రిత గ్రంథభాగము నుండి యీ క్రిందిభాగ ముదాహరించుచున్నాను.

"ఈ సత్రముల కధికారి నెల్లూరి వెల్లమరాజు ఏమనుచున్నాఁడు: మన యేలినవారు బ్రాహ్మణ్యప్రభువులు, వీరవైష్ణవ సార్వభౌములు అట్లుగనుక బ్రాహ్మణులకు అన్నపానాలపట్ల కొదువవచ్చినా తాళరు. ఎంతమాత్రపువాడైనా తంజావూర ఉపవాసము ఉండరాదు. అటుగనుక గడియలు పదెంట్రాయెను రామానుజకూటము, మధ్యకూటము, పెద్ద సత్రము పరామర్శిస్తిరా? పొడి అమరెనా? వంట అవుచున్నదా? తడి యాకులు అమరిస్తిరా? ఉప్పు, ఊరగాయలు, ఊరుబిండి, పప్పుపచ్చళ్లు వేపుడు కూరలు, తడిదాలు, పిండి మిరియాలు, పుల్లకూరలు, పాయసం, కజ్జాయాలు మొదలైన పదార్థాలకల్లా శోభనక్కారాలు అమరిఉండా"

ఇట్లు తంజాపురాన్నసత్రములు "వేంచేసియున్న సేతుకాశీస్థలాంతర నిరంతరితమతత్రయ ధరిత్రీసుపర్యులకు ఘృత గుడ పాయసాపూప దధ్యన్న మద్గవ్యంజనరతజీతం" బగుచుఁ దదీయారాధనంబున హర్షంబు నొందించెడివి.

ఈ కృతియందు నాయకరాజులకాలమున బ్రాహ్మణులకు గలుగు భోజన సదుపాయములు నిత్యాన్నదాన ప్రశస్తి చక్కఁగా వర్ణింపఁ బడినవి. నెల్లూరినుండి తరలివచ్చిన వారిలో ముఖ్యుఁడు నెల్లూరి యెల్లమరాజు. ఇందులో విశేషముగా తెలుఁగువారి వంటకములే వర్ణితములగుటచేత నా సత్రములలో నాంధ్రబ్రాహ్మణ భోజనము విశేషముగా లభించుచుండెడి దని గ్రహింపనగును.

ఈ నాటకము హాస్యరసప్రధానమైనది. కావున నిందసభ్యములైన ఘట్టములు గలవు. వీనిని మనము నవీనవిమర్శకదృష్టితో పరిశీలించిన యవి యశ్లీలతోచును గాని మన ప్రాచీన సంప్రదాయదృష్టితో పరిశీలించిన నవి సరియైనవిగా గన్పట్టును. అది యీ క్రింది వివరణమునఁ గాననగును.

ఈ నాటకరచయితయే, తాను "హాస్యాద్భుతరసప్రధానంబుగా" దీనిని సంతరించినట్లు వ్రాసియున్నాఁడు. పెట్టుట భోజన సమయముల యందు, ముఖ్యముగా వివాహములు మొదలగు శుభకార్యములందు, అసభ్యసంభాషణము తప్పక జరిగియే తీరును. ఆ సమయమునం దెవరును తప్పుపట్టరు. మన ప్రాచీన సంప్రదాయదృష్టితో నిట్టి సందర్భములు పరిశీలించిన, నవి లోకవ్యవహారమున సభ్యములే. ఇట్టి సంప్రదాయమును పురస్కరించుకొనియే శ్రీనాథమహాకవి నైషధకావ్యమున దమయంతీ వివాహమున భోజన సమయమున-

సీ. సర్వతోముఖపిపాసకుఁ జప్పి పడిరొదు
కామమోదనము నిక్కముగ వలయు
నీముఖమ్మున మాకు తెలియంగ సుఖమబ్బఁ
గాంచుగావుత నిన్నుఁ గవులయోని
యనులోమమున తెస్స పని చిసికొంటిష్ఠ
భగవదారాధన ప్రాప్తి విధిని
విద్వజ్జనులు నిన్ను విభయించి వత్తురు
కలమధురములు నీగళరవములు.

అను పద్యమునందలి యసభ్యార్థములు చదువరులకు విదితములే. ప్రతి దినము పంచాశత్సహస్రభూసురులకు భోజనము పెట్టుట శుభకార్యమే గదా! కాబట్టి యట్టి సమయములలో హాస్యప్రసంగములు (మన దృష్టిలో నీనాటి కసభ్యములుగా దోచునవి) సర్వసాధారణములే యని నవీన విమర్శకులు గ్రహింతురుగాత! మఱియు నీ నాటకమున రాగభోగాలవారు (వేశ్యలు) వచ్చుట, అచ్చట నొక బ్రాహ్మణుఁడు భార్యా సహితుఁడయ్యు వారిలో నొకతెను మోహించుట, సరసప్రసంగములు, మున్నగునవి ప్రాచీన సంప్రదాయ పరిపోషకములే. వెలకై యన్నము పెట్టు పూటకూటి యిండ్లకడనే వేశ్యవాటి యుండును. "అక్కలవాడ లోని వెలయాండ్రకు" అను క్రీడాభిరామవాక్య మిందులకు స్మారకము. తంజాపురమున వెలకు గాక, అన్నదానమే జరుగుచున్నది గాన, కవి యానాటి సంప్రదాయము ననుసరించి, రాగభోగాల వారిని రప్పించి యా సంప్రదాయము నిలిపినాఁడు. దీనివలన యాకాలమునాటి సామాన్య ప్రజానీకముయొక్క జీవిత విధానము చక్కగా నెఱుఁగుటకు మన కవకాశము కలిగినది. కేవల సంభాషణమూలమున నుత్పన్నమైన హాస్యరసమున సభ్యతాసభ్యతలను చర్చించుట సమంజసము కాదు. అందును భోజన సమయమున జరుగు సంభాషణాలందు సభ్యతను గూర్చి ప్రసంగించుట యొక్కొక్కప్పుడు విమర్శకుల యనుభవజ్ఞాన రాహిత్యమును విశదముచేయును. తంజాపురాన్నదాన నాటకము ఇతివృత్తము ననుసరించి సరసముగను హృద్యముగను నున్నదని విజ్ఞులగువారు వారు గ్రహింతురు గాక!

# కామరసు వేంకటపతి సోమయాజి

ఈతఁడు విజయరాఘవ చంద్రికా విలాస మనునాటకమును రచించిన మహాకవి, విజయరాఘవ పట్టభద్రుని పట్టపుఁగవి. ఈతఁ డీ నాటకమును 'విజయరాఘవచంద్రుని చంద్రికావిహార శృంగారలీలావిలాసంబు కవిజిహ్వారంగ శృంగాటకంబులధాటి నల్పుభారతి ఘోటకంబుగా' శృంగారరస గర్భావిర్భావంబునకు గర్భోటకంబుగా హావణించి యున్నాఁడు.

ఈ నాటకమునుండి చోళదేశ వర్ణనమును, విజయరాఘవనాయకుని వర్ణనము నుదాహరించుచున్నాఁడను. దీనివలన నందలి కవితా శైలి యెఱుకపడును.

### చోళదేశ తంజాపురవర్ణన - రగడ

కవులెంతురు చోళదేశము దివ్య - కావేరీవారి ప్రకాశము
నవరత్నములున్న కోశము సుర - నాయక రాజ్యసంకాశము
చెఱకు రాజనంపుఁబైరులు కాపు - సేమముగలిగినయూరులు
తిరముగాఁ బ్రవహించు సేఱులు చోళ - దేశంబున వెయ్యాఱులు
ఆ రాజ్యమునకు మంజీరము అల్ల - అమరావతి గన్నసారము
భూరమణీ మణిహారము తంజా - పురము సంపదలకొటారము
నవరత్నంబులపేటలు దివ్య - నారికేళంబుల తోఁటలు
సవరణ సేసిన కోటలు వీట - సరసులు నూఱాఱుకోటులు
వలరాయనిమీఁది యేలలు చాల - వర్ణింప నేర్చిన బాలలు
విలసిల్లు నాటకశాలలు అందు - వింతవింతలు కృష్ణలీలలు
పరులనుగెల్చిన పౌజులు మెచ్చఁ - జాలింతురు దినరాజులు
సరిలేని విద్యాభోజులు వీట - సడినున్న రాజాధిరాజులు.

## విజయరాఘవనాయకుని వర్ణన

ద్విపద. శ్రీరాజగోపాల - సేవచేఁ జాల
పేరుఁగాంచిన ఱేఁడు - బిరుదుమన్నీఁడు
లక్షణాన్వితుఁడు క - ళావతీసుతుఁడు
దాక్షిణ్యశాలి యు - త్తమరాజమౌళి
రణముల జగజెట్టి - రఘునాథుపట్టి
గుణరత్నముల దీవి - గురుజనసేవి
బహుదానపరుఁడు భూ - పాలశేఖరుఁడు
సహజగుణస్ఫూర్తి - సర్వజ్ఞమూర్తి
రతులకు రతిరాజు - రాజుల రాజు
వితరణగుణశౌరి - విభవజంభారి
జగదుపకారి వై - ష్ణవమతోద్ధారి
తగవులవీడు చిం - తామణిజోడు
నీతికిమాంధాత - నియమసంధాత
జాతివార్తల మేటి - శౌర్యకిరీటి
సరసుండు నెఱజాణ - చక్కనివాఁడు
పరమవైష్ణవుల చే - పట్టు కుంచంబు
బాహువిక్రమశాలి - భరతకోవిదుఁడు
సాహిత్యభోజుండు - సంగీతవేది
కోరినవారికిఁ - గొంగుబంగారు
చేరువమేరు హా - శ్రిత వర్గమునకుఁ
పేదల పాలింటి - పెన్నిధానంబు
వేదకోవిదులకు - వెలలేనిసొమ్ము
పలికిబొంకని రాజు - పరమవివేకి
నిలుకడగలవాఁడు - నిత్యాన్నదాత
పట్టభద్రుండు కృ - పాసముద్రుండు
చుట్టాలసురభి రా - జులమేలుబంతి
వరశరణాగత - వజ్రపంజరుఁడు
నరులపాలింటి పు - న్నమ చందమామ
ఏకవీరుఁడు జగ - దేకవదాన్యుఁ

డాకారమన్మథుం - డసమసాహసుఁడు
మానినీనూతన - మకరకేతనుఁడు
భానుసమానుండు - పరతత్త్వవేది
అనుమానమునఁదేలి - యావనమాలి
చనవరి యిల్లాలి - చనుఁబాలుఁగ్రోలి
పెరిగిన యన్న గో - భిల మానికన్న
పరతత్త్వరుచిఁగన్న - పాయంపుమిన్న
విజయరాఘవశౌరి - విద్యావిహారి
భుజబల కంసారి -పూర్ణసంసారి
అన్నిట నవధాని - యారాజధాని
మన్ననతోనేలు - మహి మేలుమేలు.[1]

కవయిత్రి - లీలావతి - ఈమెవ్రాసిన కమ్మవక్కణ యొకటి యీ గ్రంథమున లభ్యమైనది.

సీ. శ్రీరాజగోప కుమారులౌ విజయరా
ఘవ నాయనయ్యవారవధరింపఁ
గదరయ్యదేవర పదపద్మములకు మీ
పైటినాటకశాల పడుచునైన
లీలావతిని బదివేలు దండంబులు
పెట్టిచేయంగల విన్నపంబు
కలలోన నను మీరు కలిసినదాదిగఁ
గనుఁగొని స్వారిగాఁ గదలిరాఁగ

గీ. ఆసపడిచూచి నగరిసామ్మైన దాన
మా చకోరికఁ బంపితి మనవిఁదెల్ప
గట్టిగా నన్ను మీరు చేపట్టుకున్న
నించువిల్కాఁడు మదినిర్వహింప నుండె.

---

1. విజయరాఘవచంద్రికా విలాసము అముద్రితము-M. 686 తంజావూరి పుస్తక భాండాగారము సంఖ్య 603.

## ఇతి వృత్తము

విజయరాఘవనాయకుని విప్రనారాయణ చరిత్ర విమర్శ వ్రాయునపుడీనాటకమును గూర్చి కొంత తెలిపితిని. ఇందలికథ చాలస్వల్పమైనది. ముందు నే నుదాహరించిన కమ్మవక్కణ వ్రాసిన లీలావతిని విజయరాఘవనాయకుఁడు వివాహమాడుట యిందలి యితివృత్తము. కథ చిన్నదియేయైనను కవి దీని కొక నూతనత్వము నాపాదించుటకునాకు ఉషాపరిణయమునందు వలెనే స్వప్నవృత్తాంతమును ననుసంధించినాఁడు. ఉషాసుందరికివలె లీలావతికిఁగలలో నొకపురుషుఁడు కానుపించి 'పూర్వజన్మమున నీ వూర్వసివి, నే నర్జునుఁడను. ఆనాఁడు నేను నిన్ను నిరాకరించితిని. అప్పుడు దేవేంద్రుఁడు మఱు జన్మంబున మన యిద్దఱకు సమాగమము గలుగునని పల్కె'నని యంతర్ధానమయ్యెను. అప్పటినుండియు లీలావతికి నా పురుషునిపై యపారమగు వలపుగలిగెను. అంత నామె విజయరాఘవనాయకుని చూచినంతనే తనకు స్వప్నమున సాక్షాత్కరించిన పురుషుఁడు విజయరాఘవనాయకుఁడే యని గుర్తించి మోహపరవశయయ్యెను. అంత నామె చెలికత్తె విజయరాఘవనాయకునియొద్ద కేఁగి లీలావతి వృత్తాంతము నామూలాగ్రముగాఁ దెల్పెను. విజయరాఘవుఁడును దివ్యదృష్టి నీ విషయము నెఱింగి యామెను చేపట్టుట కంగీకరించెను. ఇంతలో రంభ ఊర్వశి లీలావతిగా భూలోకమున నవతరించిన సంగతి నెఱింగి తానొక యెఱుకత వేషముతోవచ్చి లీలావతికి, విజయరాఘవునితో సమాగమము కలుగునని సోదెచెప్పి యామెను సంతోషపఱచెను. విజయరాఘవనాయకుఁడును నాతని మొహరుంగరమిచ్చి యొక చెలిచేత లీలావతికి పంపెను. లీలావతియు విజయరాఘవుని తనయింటికి కాహ్వానింపఁగా నామె నాతఁడచట చేపట్టెను. గ్రంథాంతమున విజయరాఘవనాయకున కాశీర్వాచనము గలదు.

# పసుపులేటి రంగాజమ్మ

విజయరాఘవనాయకుని యాస్థానమునకు విద్యుత్కళికయగు రంగాజమ్మకు రంగాజీయని నామాంతరము. ఈమె యింటిపేరు పసుపులేటి వారు. తండ్రి వెంకటాద్రి, తల్లి మంగమ్మ. ఈమె రచించిన కృతులు,

1. మన్నారుదాసవిలాసము - ప్రబంధము.

2. మన్నారుదాసవిలాసము - నాటకము.

3. ఉషాపరిణయము - ప్రబంధము.

4. రామాయణ, భారత, భాగవత సంగ్రహములు - పద్యకృతులు.

ఇవియేగాక సంగీతమున నీమె 'లలితఫణితిని మృదురసాస్పదములగు' పెక్కు పదములు రచియించినట్లు తన యుషాపరిణయావతారికయం దిట్లు చెప్పినది. 'ఇంపుమీఱ నేనును శృంగారరసంబులఁ జెన్నుమీఱు మన్నారుదాసవిలాసంబు వినుపించుచున్న సమయంబున,

సీ. వేంకటేంద్రుని పుత్రి! వినుత సద్గుణధాత్రి!
ఘనియశోరాజి! రంగాజి! వినుము
మాధుర్యమున మించు మన్నారుదాస వి
లాస ప్రబంధంబు లలితఫణితిఁ
గావించి మిగులశృంగారంబు గన్పట్టఁ
బదములు మృదు రసాస్పదములగుచు
రాణింప రచియించి, రామాయణంబును
భాగవతంబును, భారతంబు

గీ. సంగ్రహంబుగ రచియించి సరసరీతి
మమ్ము మెప్పించితివి చాల నెమ్మిఁ దనరఁ
బరగ హరివంశమున నుషాపరిణయకథ
తెనుఁగుఁ గావింపుమిఁక నీవు తేటగాఁగ.'

పై కృతులలో ఉషాపరిణయమును మన్నారుదాసవిలాస నాటకమును ముద్రితములు. ఈమెచే రచితములగు పదములుకూడ మనకు లక్ష్యములు

కాలేదు. కాని యీమె తన కృతులలో వాని నచ్చటచ్చట కూర్చు కొనియుండుటచే నుదాహరణమునకు మాత్రమే మనకు దొరికినవి.

రంగాజమ్మ కృతులనుగూర్చి యెఱుంగుటకు ముందు నామె విద్యావైదుష్య మెఱుఁగఁదగినది. దాని నాయా గ్రంథముల కడపటఁ గూర్చిన గద్యలే తెలుపఁగలవు. దానినిట నుదాహరించెదను.

'ఇది శ్రీమద్రాజగోపాలకరుణాకటాక్షవీక్షణానుక్షణ ప్రవర్ధమాన సారస్వతధురీణయు, [illegible]ఖిత వాచికార్థావగాహనప్రవీణయు, తత్ప్రతిపత్రికాశత స్వహస్తలేఖన ప్రశస్తకీర్తియు, శృంగారరస తరంగిత పదకవిత్వమహనీయ మతిస్ఫూర్తియు, అతులితాష్టభాషాకవితా సర్వంకషమనీషా విశేషవిశారదయు, రాజనీతివిద్యావిశారదయు, విజయ రాఘవ మహీపాలవిరచిత కనకాభిషేకయు, విద్వత్కవిజన స్తవనీయ వివేకయు, మన్నారుదాసవిలాసనామ మహాప్రబంధనకృతలక్షణయు, మహనీయరామాయణ భారతభాగవత కథాసంగ్రహవిచక్షణయు, పసుపులేటి వేంకటాద్రి బహుజన్మతపఃఫలంబును, మంగమాంబాగర్భశుక్తిముక్తాఫలంబును, రంగద్గుణకదంబయునగు రంగాజమ్మ వచనరచనాచమత్కృతిం జెన్నుమీఱు ఉషాపరిణయ ప్రబంధమునందు తృతీయాశ్వాసము'.

పై గద్యవలన నీమె రాజగోపాలదేవుని దయవలన కవయిత్రి యయ్యెననియు, వాచకత్వమున నేగాక, చిత్రవిచిత్ర శతలేఖినీ విద్యయందుఁ బ్రవీణురాలనియు, ఎనిమిదిభాషలలోఁ గవనమల్లఁగల నేర్పఱియనియు, పదకవిత్వమునఁ బ్రౌఢిమగన్నదనియు, రాజనీతినెఱిఁగిన రమణియనియు, సరసశృంగార పదకవితయందు జాణయనియు, విజయ రాఘవమహీపాలునిచేఁ గనకాభిషేక మహాగౌరవమునుబొందిన విద్వత్కవయిత్రి యనియు తెలియుచున్నది. (కనకాభిషేకముచేయు విధానముగూర్చి చూడుఁడు: గౌరవముచేయు వ్యక్తిపై బిందెలతో బంగారు నాణెములు స్నానముచేయునట్లు వెలువరింపవలెను. క్రిందపడిన యీ నాణెములన్నింటిని తక్కినవారందఱకును పంచిపెట్టవలెను. ఇందు కవికి గౌరవమేగాని కనకము లభింపదు.[1]

---

1. చూడుఁడు శృంగారశ్రీనాథము - కనకాభిషేకము పుట 189.

కనకాభిషేక గౌరవముఁబొందుట యనునది సామాన్య విషయము గాదు. లోకోత్తర ప్రతిభాశాలియగు మహాకవికిగాని, విద్వల్లోకమకుటాయమానుఁడగు మహావిద్వాంసునికిఁగాని చేయఁదగిన మహాగౌరవములలో కనకాభిషేకమే ప్రధానమైనది. విజయనగర సామ్రాజ్యాధీశుఁడగు దేవరాయనిచే శ్రీనాథ మహాకవి యీ సత్కారమును గాంచినవాఁడు. వ్యాఖ్యాతృచక్రవర్తి మల్లినాథసూరి సర్వజ్ఞసింగ మహీపాలునిచే నీ సత్కారమును బొందినవాఁడు. కాని యింతవఱకు రంగాజమ్మ తప్ప స్త్రీ లెవ్వరును నిట్టి గౌరవమును బొందినట్లు మనకుఁ దెలియుటలేదు.

కవయిత్రియగు రంగాజమ్మ యిట్టిగౌరవమును బడయుట యాంధ్రలోకమును, నందును ముఖ్యముగా నాంధ్రమహిళామండలియు గర్వింపఁదగిన విషయము. అంతియకాదు, ఆంధ్రవాఙ్మయ చరిత్రమున నిది సువర్ణాక్షరములతో లిఖింపఁదగినది.

గద్యలో 'అతులితాష్టభాషాకవితా సర్వంకషమనీషా విశేష విశారద' అనునది నీమెయెడల సార్థకమే. అష్టభాషలనఁగా 1. సంస్కృతము. 2 ప్రాకృతము. 3. శౌరసేని. 4. మాగధి. 5. పైశాచి. 6. చూళిక. 7. అపభ్రంశము. 8. తెలుఁగు అనునవి. ఈ భాషలయందీమె కవితావైదుష్యము తెలుపుటకు మన్నారుదాసవిలాస నాటకము నుండి యీ క్రిందివాని నుదాహరించుచున్నాఁడను.

సంస్కృతము. ఔదార్యమంగనృపభంగవిధాన ధుర్యమ్
శౌర్యంచ ధైర్యమపి శౌర్యపలాలనీయమ్
రూపంచ పంచశరవీరవిలోభనీయమ్
యస్యాస్త్యహో విజయరాఘవ సార్వభౌమ.

ప్రాకృతము. భద్దదేయు పుణోతుహ చంపయరత్నప్పహేన సంచాళో
హరిద్దణం యితఉజ్జ్వల మందిర విహాయీ యరాయగోపాళో.

శౌరసేని. విదదయసో వత్తదిసో జయయివిహుద్దణ్ణదోహేసో
కణ్ణపదబత్తినీళో మణ్ణరుదాసో మహీపాళో.

మాగధి. పుశుప శరాసన శరిసే రూవేణ హరియ్య మహిమాయే
డాణేహంరాహేయే వియయి రహునాహశామి సంతాణే.

పైశాచి. సౌవజ్యోగునవంతో బమ్మనహచ్చాను పూళన్దమహానానో
అయ్యాపెన్నుసమానో ళోకవిళోకస్స పున్నెనిమచందో.

చూళిక. ఖమళవిలోచనమధనే యాచకఝున థావ్యపాదపోయేసో
భావాభళభళపద్దా ఆరవికారయ వియయరాఘవో విషయ.

అపభ్రంశము పుణు కావిగోడి తుంహో డత్థూణ మణేన్నరూపు అసమాణు
దూయి [illegible] పుహావు మణ్ణరుదాసు భూపాలు.

తెలుఁగున నామె గ్రంథకర్త్రియేగావున నుదాహరణమీయ లేదు. సంస్కృత [illegible] దీమె చతురయనుట నీమె రచించిన చూర్ణిక రూపకతాళ వర్ణములు మొదలగునవి తెలుపును. ఈమెకు సంస్కృత వ్యాకరణమున మంచిప్రవేశము గలదనుటకు, మన్నారుదాసవిలాసమున నొకచో నీమెవ్రాసిన వ్యాకరణశాస్త్ర ప్రసంగమే యుదాహరణము. గ్రంథవిస్తరభీతిచే వాని నుదాహరింపలేదు.

మన్నారుదాసవిలాసనాటకమున నీమె ప్రతిభ లోకజ్ఞత హాస్యరస సంవిధానము, సంగీత[illegible] నిండారవెల్లి విరియుచున్నది. ఈ నాటకము నందుఁ బాత్రోచితభాష వాడఁబడుటచే నిది మఱియు రసవత్తరమై హాస్యమననిదియేయని నిరూపించుచున్నది. ఇందులకుఁ గొన్ని యుదాహరణములు :

ముహూర్తము నిర్ణయించుటకు రాజాగారి యాస్థానముననున్న గణితజ్ఞులు చర్చలు, ఒకరిపైనొకరి వాక్యములు సంభాషణ :

భైరవజోస్యులు : మంచనభట్లుగారు పంచాంగం విప్రుడా ?

మంచనభట్లు ; భైరవజోస్యులు, నేరనిమాటలె అడుగుదువు. చక్కంగా అశ్విని భరణి కృత్తికలు గురుతెరుగవు నీకు పంచాంగం ప్రిష్పేదిన్నా నీ భవిష్టికి.

భై : మంచనభట్లుగారికి మూలానక్షత్రమే మాటాడకమునుపే మూలంరేగుతూ ఉన్నది.

మం : ఓరి భైరజోస్సిగా ! తిథివారనక్షత్రాల్లలో నొకటి గురుతెరు గవుగదా ! పంచాంగమనంగా నేందిరా ?

జ్యో: మంచనకు ముక్కుమీదనే వుండును కోపం. అమావాస్యనాడు గ్రహణమనిన్నీ ఆగ్నేయస్పర్శ అనిన్నీ దబ్బరలే వ్రాస్తివే! మేము గ్రహస్ఫుటంచేసి గ్రహాము లేదంటిమే.

మం: నీవు పోచన సోమయాజులవారింట మొగవాండు పుట్టునని ప్రశ్న జెప్పి యేకాక్షరప్రయోగం చేయించుకవస్తివే!

జ్యో: నీవు బుచ్చావధాని కొడుకు బుచ్చిగాండు పదహారోయేంట పల్లకి యెక్కునని జాతకంవ్రాస్తివే – ఇదిగో బిచ్చంయెత్తుక తిరుగుచున్నాండే!

మం: నే ఫలభాగం వ్రాసినవారు పదివేలమంది పల్లకిపదస్థులు నీక్కేం తెలుసు పోరా.

మధ్యస్థులు: వోయి, చాలించరోయి, మీ జగడాలు, నగరివారు ముహూర్తం నిర్ణయించమంటే ఏపాగాధా లాడుచున్నారు.

## పురోహితుల మాటలు.

కొండుభట్లమాట: అవునోయి యల్లుసోమయాజులు, నూరుతరాలనుంచి యీ యింటికి తగుకైన పురోహితుండ నేనుండగా నీ వెవ్వండి కొడకవు నా స్వాతంత్ర్యం కొంగుముడిరాక తీసుకపోయేటట్టుగా?

యల్లుసోమయాజులు: ఏమోయి కొండుభట్లా! మాతాతకు చవ్వపనాయనివారు పాకెన సంభావన కట్టడచేసివుండగా నీ వెవ్వండవోయి అపహరించుక పోయేటట్టు. మా అన్న కొడకవా!

## ముత్తైదువుల మాటలు.

యల్లమ్మ: అవునషే తిమ్మక్కా! నాకువక్కబ్రద్దా వకటి కొదవా? చాలుచాలు; నిన్న మావారు సుక్కురారం సంతలో పిండి కూరకంచున్నా గానుగపిండి దెచ్చేరు. నోరు మెదలించవలె నంచున్నానూ.

తిమ్మక్క: పొరుగింటి తిమ్మావధాని పెండ్లాం వీరమ్మ పాటలు పాడుతూన్నది, అందుకొని నీవున్నూ పాడ్రాదషవో.

యల్లమ్మ: ఇదేందో నీవు నాగపసానిలా పెత్తనంచేసును వుండేదానవున్నూ కడమ వారు పాటలుపాడేవారున్నా,

తిమ్మక్క: వోశమ్మా–మా యింటిఆయన యెందుకో యీవేల రమ్మంచున్నారు. పక్కడంతా మొగవారేవున్నారు. నీవు ధవళంయెత్తు నేనుంగూడాపాడేగాని

ఇట్లే లగ్ననిర్ణయసందర్భమున నీమె జ్యోతిషపరిజ్ఞానమును, విద్వ ద్గోష్ఠియందీమె విద్యావిశేషములును నీ నాటకము మూలమున వ్యక్తము లగుచున్నవి.

ఇందలి కథ విజయరాఘవనాయఁడు కాంతిమతియను నొక కన్యను వివాహమునాడు నట్టి వృత్తాంతము. ఒకనాఁడు రాజగోపాలస్వామి యుత్సవము చూడవచ్చిన యువతులలోఁ గాంతిమతి యనునామె విజయ రాఘవునిజూచి, మోహించి, విరహవ్యథతో వేగి, విలాసవతి యను నొకదూతిని రాజునొద్దకుఁ బంపెను. రాజును విలాసవతిచెప్పిన విషయము గ్రహించి తాను గాంతిమతిని వివాహము చేసికొందునని తెలియఁజేసెను. ఇంతలో నొక యెఱుకతవచ్చి ముందుగానే రాజు పెండ్లి కంగీకరించునని చెప్పెను. విలాసవతి వచ్చి యీ శుభవృత్తాంతము చెప్పఁగానే కాంతిమతి సంతోషముతోఁ గాలము గడపుచుండెను.

ఇక్కడ రాజు కాంతిమతి విరహముచే స్రుక్కుచుండఁగా రాజ గురువగు శతక్రతు తాతయాచార్యులవారీసంగతి గ్రహించి కాంతిమతి తండ్రియగు రాజచంద్ర మహారాజునొద్దకుఁబోయి యాతనితో కాంతి మతీ వివాహమునుగూర్చి ముచ్చటించెను. రాజచంద్రుండు నందుల కంగీక రింప వివాహప్రయత్నములు గావించిరి. రాజును భద్రగజముపై నెక్కి యూరేగిరాఁగా వధూవరులఁ బీఁటలపైఁ గూర్చుండఁబెట్టి పురోహితులు వివాహసంకల్పము నడిపి "దేవతాహ్వాననాంద్యగ్ని ముఖస్నాతకవ్రత పునఃపుణ్యాహవాచన అంకురార్పణ కన్యావరణమంగళాష్టక నవవస్త్ర ధారణ మంగళసూత్రధారణ వివాహప్రధాన హోమాదిశుభకర్మంబుల" సక్రమముగా నడిపించిరి. మత్తైదువలంత ధవళంబులు శోభనములు పాడిరి. విజయరాఘవ కాంతీమతీ వివాహము పూర్తియైనవెనుక నిజ నగరప్రవేశమైనది. నాయికానాయకులు సుఖస్థితినుండిరి.[1]

1. ఈ ప్రశస్తనాటకమును క్రీ. శ. 1926 లో నాంధ్రసాహిత్యపరిషత్తువారు కీ. శే. జయంతి రామయ్యపంతులవారి సంపాదకత్వమునఁ బ్రకటించినారు. వారి "ఆధునికాంధ్ర వాఙ్మయవికాసశేఖరి"యందీ నాటకముఁగూర్చిన విమర్శనము 29–40 పుటలవరకుఁ గలదు.

## ఉషాపరిణయము

ఉషానిరుద్ధుల వివాహము వర్ణితమైన యీ ప్రబంధమున మూఁడా శ్వాసములు సమగ్రముగను నాలుగవ యాశ్వాసములోఁ గొంతభాగ మును లభ్యమగుచున్నవి. కృత్యవతరణికలో విజయరాఘవనాయకుని వంశావళి సంగ్రహముగాఁగలదు. శృంగారరస ప్రధానమగు నీ గ్రంథము నుండి కొంతభాగము నుదాహరించుచున్నాను.

ప్రారంభము :

శ్రీవిజయాయురున్నతులచే నలరించెదఁ గొల్చువారలన్
ధీవిభవంబు మీఱునని తెల్పుచు హేమవనింజెలంగు రా
జీవదళాయతాక్షుఁడగు చెంగమలేశుఁడు మన్ననార గో
త్రావిభుధేంద్రుని న్విజయరాఘవ చంద్రునిఁ బ్రోచుఁ గావుతన్.

ఇష్టదేవతాప్రార్థనమును శతక్రతు శ్రీనివాసతాత గురువర్యు వంద నము నైనవెనుకఁ దంజాపురీశుఁడగు విజయరాఘవ మేదినీవిభువరుండు "రాజగోపాలవిలాసంబునందు నతులితవిలాసవతులైన కులసతులును విబుధసన్నుతమతియగు విజయవెంకటపతియు, మహితప్రభావుండగు మన్నారుదేవుండును, తతయశోధనుండగు తాతఘనుండును, రంగద్గుణ విలాసుండగు చెంగమలదాసుండును, మొదలగు నిఖిలజన మిత్రులైన పుత్రులును, నిరుపమచరిత్రపవిత్రులైన పౌత్రులును, నిరవద్యరూపరేఖా కనకపుత్రికలైన పుత్రికలును నింపుమెఱయం దామరతంపరమైనిండి యుండ" రంగాజమ్మ మన్నారుదాసవిలాసము నాటకము వినుపించు చుండ, విజయరాఘవనాయకుఁడు 'సంస్కృత హరివంశమున నుషాపరి ణయకథ తెనుఁగుఁ గావింపు' మని యాజ్ఞాపించినాఁడు. రంగాజమ్మయు కృతిపతియగు విజయరాఘవుని వంశము వర్ణించి గ్రంథము ప్రారంభించి పూర్తి చేసినది. కాని యీ కావ్యము సంస్కృత హరివంశమునకు తెనుఁగు గాదు. కథా సంవిధానమున మార్పేమియులేదు. తెనుగులో రంగాజమ్మ రచనకు ముందు ఎఱ్ఱన హరివంశమునను, నాచన సోమన ఉత్తర హరి వంశమునను, పోతన భాగవతదశమస్కంధమునను నీ కథ గలదు.

తాళ్ళపాక చిన్నన్న ప్రప్రథమున ప్రత్యేకముగ ద్విపద ప్రబంధముగ నీ కథను రచియించియున్నాఁడు. వీనివెనుకనుగూడ వాఙ్మయమున, ప్రబంధ యక్షగాన గేయ శాఖలలో నీ కథ వెలసినది.

రంగాజమ్మ కృతియందు కావ్యశిల్పముగాని, కథా కథనమున నైపుణిగాని కానరాదు. అయినను నిందలి శైలి సమాసాడంబరములేక, చక్కని పలుకుబడితో సులభగ్రాహ్యమై యున్నది. తంజావూరి నాయక రాజుల కాలమునాటి యాచారవ్యవహారములును, అంతఃపురమున జరుగు శృంగారక్రియాకలాపములును నిందు వర్ణితములగుటచే, నిది వాఙ్మయ చరిత్రకారులకు నుపయుక్తము. మఱియు నీ గ్రంథమునందు రంగాజమ్మ కృతిపతియు, తనభర్తయునగు విజయరాఘవనాయకుని కేవలము శ్రీకృష్ణావతారముగా వర్ణించినది. ఇట్టి వర్ణన మన్నారుదాసవిలాస నాటక ప్రబంధముల యందునుగలదు. ప్రస్తుత ప్రబంధమున నిట్టిపట్టులు చూపుచున్నాను,

1. క. ఇచ్చకములాడి మిక్కిలి
విచ్చలవిడి గొల్ల చెలుల వేడుకమీఱన్
దచ్చనలఁగూడి జాణిగాడు
నచ్చుతునకు మనుమఁ డనిన నడుగఁగ నేలా ? (3–102)

ఇట్టిచోట్ల తంజావూరి అచ్యుతరాయలకు మనుమఁడగు విజయరాఘవుఁడని యొక యర్థమును, అచ్యుతుఁడనగా ద్వారకయందలి శ్రీకృష్ణుని మనుమఁడగు అనిరుద్ధుఁడనిమఱియొక యర్థమును మనకు స్ఫురించును ఇది ద్వారకాపురమున, అనిరుద్ధుని వెదకు సమయమున చెలులు చెప్పుకొను సందర్భము లోనిది.

2. చెలువంబు వెలయంగ శ్రీరాజమన్నారు
పారిజాతముఁ దెచ్చు భావమునను (2–99)

ఇచట రాజమన్నారు – మన్నారుగుడియందలి రాజగోపాలస్వామి – ద్వారకలో కృష్ణుఁడు.

(ఇది చిత్రరేఖ యనిరుద్ధుని తోడ్తెచ్చునప్పుడు గల వాక్యము)

3. సీ. హరియప్డు మేల్కాంచి యద్దంబుఁ బువ్వులు
కపిలధేనువు క్షీర కలశములును
విప్రయుగ్మంబును వేడుక వీక్షించి
నిత్యకృత్యముఁ దీర్చి...... (3–112)

ఈ ప్రభాతవిధి విజయరాఘవనాయకుఁడిట్లే తీర్చుచుండెనని గ్రంథాంతరములనుండి మన కెఱుకపడుచున్నది.

4. విజయరాఘవనాయకుఁడు కొలువునకు వచ్చెడిముందుగా, నేవిధముగా, నలంకృతుఁడయ్యెనో, ఆదేవిధముగా శ్రీకృష్ణుఁడు కొలువునకు వచ్చుట యిందు వర్ణితమైనది. ఈ క్రింది సంవాదములను చూడుఁడు.

ఉషాపరిణయము :

సీ. అలరుక్మిణీదేవి యందంబుగనుపట్టు
నిలువుటద్దము పట్టె నేర్పుమెఱయ
... ... ... ... ... .. ... ...
మిత్రవిందాకాంత మేలైన చొకట్లు
వీనులఁ గీలించె వింతగాఁగ

గీ. కంఠమున భద్ర నిలిపెను కంటసరులు
జనవునకళింద కన్యచే సరులమర్చు
బిరుదు పెండెంబు లక్ష్మణపేర్మిఁ బెట్టె
(3-113)

సీ. పంచరత్నంబుల భాసురంబగువంకి
సుదతి యొక్కతె చెక్కె సొంపుమీఱ
(3-114)

రఘునాథనాయకాభ్యుదయము :

ద్వి. నిలువుటద్దం బొక నెలఁతుకదాల్చ
నిలువుటద్దము చెంత నీటుగానిల్వ
ద్వి నిద్దంపుఁ జెక్కుల నీటులుదేర
పెద్ద చేకట్టులు ప్రియముతోఁబూని
కంటె కింపై మించు కంఠమాలికలు
కంట సరంబును కడు వేడ్కఁబూని
చెలువైన వజ్రాలచే సరుల్ కెంపు
మురువైన నవరత్నములు దీర్చినట్టి
బిరుదపెండేరంబు పెరిమదీపింప
మొలకకెంపులపిడి మొలవంకిచెక్కి
(580-615. పంక్తులు)

ఇట్టి సంవాదములన్నియు, రంగాజమ్మకు భర్తయందుగల నిరవధిక ప్రేమభావమును, అనన్యసామాన్య భక్తిభావమును, సూచించుచున్నవి. కాని యీ గ్రంథమంతయు లభ్యముకాలేదు. చివరనొక యాశ్వాసము పట్టుఖిలమైనట్లు తోచుచున్నది. ఇందుండి కవితాశైలినిఁ దెలియుటకై కొన్ని పద్యము లుదాహరించుచున్నాను.

క. కుందకయుండఁగఁ గరముల
నిందుముఖికి బ్రహ్మయెట్లు సృజియించెనొకో
కుందంబు పొగడఁదరమా
ంచరప్పని రాజ్యలక్ష్మి క్రైవడిన కుశేశ. 3-14.

మ. ఘనసంఘంబు ప్రచండవాతమున వేగన్వీచు చందంబునన్
ఘనదంభోళి కఠోరఘోర పరిఘాఘాతంబునన్ నొంచియా,
దనుజానీకముసాఁ బెంటఁజని యుత్సాహంబు రెట్టింప న
య్యనిరుద్ధుండట పోకపోకఁడు నిలుండంచున్ వెసంబల్కుచున్. 3-71.

సీ. ముల్లోకములుమెచ్చ ముక్కంటిచేతను
వరములు గైకొన్న వరబలుండు
వేయికరంబుల వివిధాయుధంబులు
ధరియించి యనిసేయు ధైర్యశాలి
దేవేంద్రముఖులైన దిక్పాలకులనెల్ల
క్షణమాత్రమునగెల్చు సాహసికుఁడు
మాయాబలంబున మఁగటిమిచేతను
బగతురసాధించు బల్లిదుండు

గీ. ప్రమథగణములతోఁ గూడ భర్గునంత
వాఁడువాకిటిగొల్లయై వచ్చికొలువ
నల్లశోణితపురమేలు నట్టిమేటి
యమితతేజోఽధికుండు బాణాసురుండు.[1] 3-130.

## మన్నారుదాసవిలాసము.
### ప్రబంధము.

రంగాజమ్మరచనలలోఁ బ్రథమమును బ్రశస్తమును నగు నీ కృతి యింతదనుక ముద్రణభాగ్యము నందలేదు. ఈ గ్రంథ రచనాకాలము నాటికి రంగాజమ్మ కనకాభిషేక సన్మానములను బొందియుండలేదు. అందు విజయరాఘవనాయకునికి మన్నారుదేవునిపైఁ గల మక్కువయు, నా మన్నారుస్వామికి నేతద్దేవాలయమునకు విజయరాఘవుఁ డొనరించిన

1. రంగాజమ్మ ఉషాపరిణయము, తంజావూరి సరస్వతీ పుస్తకభాండాగారము వారి పక్షమున, శ్రీ వి. సుందరశర్మగారిచే పరిష్కృతమై ప్రకటితమైనది. ఆంధ్ర సాహిత్య పరిషత్తు (కాకినాడ) వారును దీనినిఁ బ్రకటించిరి. శ్రీ సుందరశర్మగారి పీఠికయందు యపూర్వ విషయము లనేకములు గలవు. రంగాజమ్మ కులమునుగూర్చి రసవమగు సిద్ధాంతము గలదు. పరిషత్తు ప్రకటించిన గ్రంథమునకు తంజావూరి ప్రకటిత గ్రంథమునకు కొన్నిచోట్ల భేదములు గలవు, ఒక యుదాహరణము చూపుచున్నాను;

దానధర్మములు, అచ్చట ఫాల్గునమాసమున జరుగు తిరునాళ్ల వైభవములు కాంతిమతీవివాహము మున్నగునవి వర్ణితములైనవి. ఈ గ్రంథమునకుఁగల రెండు ప్రతులలో నొకటి గ్రంథలిపిలో నున్నది. ఈ క్రింది గ్రంథావతారికవలన గ్రంథ రచనాసందర్భము తెలియఁగలదు.

గ్రంథావతారిక :

శ్రీరాజగోపాలాయనమః

ఉ. శ్రీరుచిరాంగియై యలయు చెంగమలాంబికఁ గూడి సంతత
శ్రీరమణీయవైభవవిశేషములన్ గను మన్నవారు తా
సారెసుపుత్రపౌత్రులను శాశ్వతలక్ష్మి లొసంగి వేడ్కన్ దు
ర్వారభుజాబలున్ విజయరాఘవభూవరుఁ బ్రోచు గావుతన్.

---

ఉషాపరిణయము ద్వితీయాశ్వాసము 48 పద్యము. – పరిషత్తువారు ప్రకటించి ప్రతిలో నిట్లున్నది.

సీ. కన్నెపాయముదాన గదిసి నా మోవిని
బలుగంటి సేతురా! బయములేక
ఆటపాయము దాన నగడుగాజన్నులఁ
గొనగోరలుంతురా! కొంకులేక
ముద్దరాలను నేను ముద్దు చెక్కిలినొక్కి
జీరలుసేతురా! చింతలేక
గోలను కౌఁగిటఁ గ్రుచ్చి నీ సరిపెన
గురుతులు నింతురా! సరకులేక

తే. గీ. ... ... ... ... ...
... ... ... ... ...
... ... ... ... ...
... ... ... ... ...

ఇందు తేటగీతి లేదు.

తంజావూరి ప్రతియందు పై సీసపద్యపు గీత మిట్లున్నది.

గీ. బాలికామణినైన నా పొన్నుఁ జేరి
పచ్చవిల్తుని కేళిని ముచ్చటగల
వేగుదనుకను ననుఁ గూడి వింతఁగాఁగ
గాసి సేతురే! నీ వింత కరుణలేక.

శా. శ్రీవిద్యానిధికొల్చువారి కపుడున్ క్షేమాయురారోగ్యల
క్ష్మీవాణీమతికాంతికీర్తి మహిమల్ చేకూర్చు శ్రీవత్సురా
జీవాత్మున్ సకమలామరేంద్రతిలకున్ శ్రీరాజగోపాలకున్
సేవింతున్ కృతి మత్ప్రతిప్రబలలక్ష్మీసిద్ధి ప్రార్థింపుచున్.

ఉ. బంగరుతమ్మిదోయి కరపద్మములన్ ధరియించి భామహే
మాంగనిభాభిరామ కనకాంచమునన్ గొలువున్న కొమ్మ మా
చెంగమలమ్మ సత్కరుణచేతను తామరతంపరైమహిన్
రంగలరంగ నీ విజయరాఘవభూవరుఁ బ్రోచుఁ గావుతన్.

చ. ఫణిపతితావహించు మహిభారము సర్వము నిర్వహించు నీ
ప్రణుతబలాఢ్యుఁడంచు నుతి పల్మరుసేయుచు వేమొగంబులన్
గణనకునెక్కు పద్యపదగద్య నిబంధన చారుసూక్తి ధో
రణులను సారెకున్ విజయరాఘవశౌరికి నిచ్చుఁ గావుతన్.

క. పక్షీంద్రుఁ డధిక శీతల
దాక్షిణ్యవిలోకనామృత స్ఫుటధారన్
పక్షంబు మిగుల నెప్పుడు
రక్షించుంగాత విజయరాఘవనేతన్.

ఉ. వేత్రముకేలఁ బూని యదువీరునికిందగు సైన్యపాలుఁడై
శాత్రవకోటిఁగీటడంచి చాలజయంబు లొసంగు మేటియా
సూత్రవతీప్రియుండు బలసూదనముఖ్యులనేలు నేత స
న్మైత్రి జెలంగ సంతతము మన్నరుదాసునిఁ గాచుగావుతన్.

గీ. విజయరాఘవమేదినీ విభునిఁ గన్న
తండ్రిగురువును దైవంబు తానెయగుచు
చెలువుమీరు శతక్రతు శ్రీనివాస
తాతయాచార్య చరణపద్మములు గొలుతు.

క. పన్నగశాయి చరిత్రము
పన్నగద్రవిడ ప్రబంధ ఫణితినుడువు నా
పన్నిద్దరాళువార్లప్ర
పన్నుల సన్నుతులు సేసి భావింతు మదిన్.

గీ. పన్నగారికరగ్రహ మహిమనహిత
చయములను గెల్చి హితులకు జయములొసఁగు
శంఖచక్ర గదాఖడ్గ శార్ఙ్గములను
వందనంబునుఁ జేతు నే వరుసతోడ.

కం. కేల్మోగిచెద మృదుసూక్తుల
కల్మికినై నెమ్మి (నమున) గడఁగెడుభక్తిన్
పల్మరు సుజనాధృతికిన్
వాల్మీకివ్యాసముఖ్యవరకవి తతికిన్.

కం. ఆదిమఫణీయన బుధుల
త్యాదరమున పాదుకాసహస్రముఖకృతుల్
వేదె (అఁగుల) రచియించిన
వేదాంతాచార్యవర్య వేట్కఁదలంతున్.

ఉ. ధారుణిపై పరాండు......రుహరింపుచునుండు దుష్కవుల్
ధీరసభాంతరంబులను తీరుపడంగ మెల(ంగనే)స్తురే
కోరిపదార్థజాలములె కొంకక త్రైకొనుచుండు చె......
శారద చంద్ర చంద్రికల శంక దొరంగి చరింపనేర్తురే.

వ. అని ఇష్టదేవతా వందనంబును సుకవిజనాభినందనంబును, కుకవిజన నిందనంబును, గావించి యే నొక్క ప్రబంధంబు సరసవచనరచనా చమత్కారంబుతోరంబుగా, ధీరజనంబుల కింపుమీఱ రచియింపుతలంపున నుండ నొక్క శుభదినంబున

సీ. ఏరాజ చంద్రుండు శ్రీరాజగోపాల
సేవాధురీణుఁడై చెలఁగుచుండు
నేరాజతిలకంబు హేమాబ్జనాయికా
వరతనూభవుఁడన వన్నెకెక్క
నేరాజ శేఖరుఁడిలలోన పదియారు
దానంబు లొక ముహూర్తమునఁ జేసె
నేరాజసింహుండు వీరాధి వీరుఁడై
పరవీరులం గెల్చె బాల్యముననె

యతఁడు రఘునాథభూపవరాత్మజుండు
మానినీజన మోహనమన్మథుండు
భూరికీర్తి ప్రకాశిత భువనతలుఁడు
శ్రీలవిలసిల్లు తంజాపురీవిభుండు.

వ. ... ... వెండియు నఖండనిజవైభవ నిర్జితాఖండలుండును, ఖండిత ప్రతి భూపాలమండలుండును మండలా[illegible]విరత్న రత్నరచిత పాదారవిందుండును, [illegible] బంధురప్రతాపభాసురుండును, సత్రపూరతాన్న సంతర్పిత భూదేవతాలక్షుండును మన్నారు దాస నామాంకిత ... ... వక్షుండును, శారదాధ్వజాంకుండును, సంగర రంగ నిశ్శంకుండును, కళావత్యంబికా గర్భసుధాంబుధిచంద్రుండును, నగు నవ్విజయరాఘవేంద్రుండు నిండువేడుకతో ... ... బలుగ రాణించు నాణెము(త్యం)బుల కుచ్చులను, మగరాల నిగరాల నీడలు దేరుగోడలును, బంగారు మెఱుంగుల రంగారు కంబంబులను, డంబుగల పగడంబుల బ్రోదికను దెలను గుంపులైన కెంపుల పిడిగలుగు కోడిగ లును, గప్పుగల నీలంబుల జాలంబులం బ్రకాశించు పద్మరాగాను బంధ(ంబు)గల ద్వారబంధంబుల ... ... రాగంబుల చెక్కడంబుల చొక్కటంబై వాటంబులైన కవాటంబులను హెచ్చుపచ్చలతీరునం గనుపట్టు రాకట్టునేలలను, మెండుకొను బొండుమల్లెల నుల్లసంబొడు తెల్ల [illegible]లను, శ్రీమద్రామాయణాది కథాసంవిధానంబులం బ్రకటం బులగు చిత్రపటంబులను సరిగకుట్టు పనులకును హాళింబట్టు మేలు కట్టులును రాజరాజ సభాతులితవిలాసంబగు రాజగోపాలవిలాసంబున యత్నంబునంబఱచిన నూత్నరత్న కంబళంబులమీఁద తద్దయు నొద్దిక యగు, రతనంపు గద్దియయందు తీరుగా పేరోలగంబై యొక పడంతి యడపంబును, నొక మంజువా(ణి) కాళాంజియు, నొక పువ్వుంబోణి పావడయు, నొక బిత్తరిబెత్తంబు, నొక వాలుగంటివాలును, ఒక యండజయాన గిండియునంబూని పరిసరంబునఁ గొలువుసలుప వామభాగంబున హేమపీఠంబున శతక్రతు శ్రీనివాసతాతయాచార్య

వర్యుండు, శ్రీమద్రామాయణ భాగవత భారతార్థంబు లుపన్యసిం పుచునుండ, నాజయలక్ష్మి యనందగునాజయమ్మయు, సంపదలసొంప (ల)రు చెంపకవల్లెమ్మయు, నిరుగడల సరసనొరసుకకూర్చుండ ప్రఖ్యాతనయులగు తనయులును సకలగుణపాత్రులగు పౌత్రులును, నెమ్మిగలమున్మనుమలును, అతులితాలాపవిజితశారికలగు కుమారికలును యథోచిత ప్రదేశంబులనిండియుండ, మరియు నా దండనిస్తుల గుణప్రశస్తయగు కస్తూరెమ్మయు, నతివిశాలనయనాంబుజయగు నంబుజవల్లెమ్మయు, విశదగుణరేఖయగు శశిరేఖకమ్మయు, ప్రఖ్యాత కీర్తిగల మోహనమూర్తమ్మయు సరసగుణ నిష్ణాతయగు కృష్ణాజమ్మయు, యిలమేలనందగు నాట్యచాతుర్య విఖ్యాతయగు సీతమ్మయు, మహనీయతరరూపయగు మదనరేఖమ్మయు, మొదలుగాగల కాంతామణుల సంతసంబున వసంతకేళిక విసుపింప, ముంగల మరికొంద రంగనామణులు రంగురక్తులుమీర సంగీతమేళంబుగావింప సమ్మదమ్మునం బొదలుచు, మరియు నందు కొందరిందువదనలు మధురసమరంజిమంజిలు కామమంజరియును, మఘువగురు శ్లాఘనీయంబగు రఘునాథాభ్యుదయంబును, సంగతులంగనుపట్టు చెంగమలవల్లి పరిణయాది నాటకంబులును హృద్యంబులగు గద్యపద్యంబులును, రువారంబులగు కైవారంబులును దండకంబులు తారావళులు మొదలుగా తాము రచియించిన సరసబంధురంబులగు ప్రబంధంబులును మన్ననారున కంకితంబుగా నెన్నికమీర నానాంట విన్నవించిన విన్నపంబులును, దండనుండి వినికిసేయుచునుండు నయ్యవసరంబున,

గీ. అతులకవితాప్రసంగసంగతులు (జెల)య
ప్రౌఢిననుఁజూచి యమ్మేటి పసపులేటి
వెంకటేంద్రుని సత్పుత్రి! విమలగాత్రి!
కలితసద్గుణ రాజి! రంగాజి! వినుము.

సీ. కుందముల్ వికసించు నందముల్ మీఱంగ
కందముల్ రచియించు కౌశలంబు
ప్రాసముల్ బహు యతిన్యాసముల్ వెలయంగ
సీసముల్ భాషణించు చిత్ర మహిమ

జాతు లలంకార రీతులు దనరంగ
గీతులు రచియించు చాతురియును
పదములు మృదురసాస్పదములౌర ! యనంగ
పదములు జెప్పెడు ప్రౌఢిమంబు

గీ. సుచితవైఖరి ద్విపదలు రచన సేయ
ననిశమును రాయసములు వ్రాయంగ చదువ
సమయ ...... గుచ్చు కార్యభాగములు దెలుప
నిపుణభావంబు జగతిలో నీక చెల్లు.

గీ. అయ్యదినముల రామభద్రమ్మ మధుర
వాణికాంబయు సరసగీర్వాణభాష
నిట్టి కృతులను రచియించి యిలనుఁ గీర్తి
చాలగాంచిరి సుకవులు సన్నుతింప.

శా. శృంగారైకరసంబు(లౌ) ...... పదములన్ జెల్వొంద మెప్పించితౌ
సంగీతజ్ఞుల మేలునా నుభయ భాషాచాతురిన్నీవికన్
రంగత్ప్రౌఢి ప్రబంధ మొక్కటి యొనర్పం గావలెన్మత్కృతన్
రంగాజీ! భవదీయవాగమృతధారా వైఖరుల్ మీఱఁగన్.

వ. అట్టి ప్రబంధంబును శ్రీరాజగోపాలున కంకితంబుగావింపుము, మరియు నేతత్ప్రబంధంబునకు నత్యధికమహాత్వంబు గలుగ మనవీటం జెన్నారు మన్నారుల ఫాల్గుణమహోత్సవాది దివ్యవైభవంబులు వ(ర్ణి)ంపుమని యానతిచ్చి, మెచ్చువచ్చు జాంబూనదాంబర తాంబూల మాల్యంబులు నమూల్యంబులగు మణిభూషణంబులునొసంగ, నెంతయు నంతరంగంబున సంతసింపుచు నేదలంచు తలంపునకు మద్భర్తవు మహీభర్తవునైన స్వామి సకల విద్యావిశేషంబుల సవతులేని నాసవతులైన యిందరిందుముఖుల ముందరనుం గటాక్షించి యింపుమీర కృతి నిర్మింపుమని యానతిచ్చిరి గనుక ధన్యనేమాననైతి నా హృదయసదనంబున ముదంబున నెలకొనియుండు నాథుండవు గావున కొదవలు దీర్చి నావచన కుసుమార్చనలు గైకొమ్మని నెమ్మితో మ్రొక్కున

మిక్కిలి నన్ను లాలించి సన్నిధినున్న శతక్రతు శ్రీనివాసతాతయాచార్యవర్యులకు దండప్రణామంబు లాచరించి యమ్మహామహుని యాశీర్వాదంబును ననుమతియును గైకొమ్మని యేనుంగావున నా మనంబున జాజులుం బ్రసాదంబు(న)య్యెనని యుప్పొంగుచు చెంగటం గనకాసనంబుననున్న యయ్యాచార్యవర్యు సేవించిన చేరరావించి, సంభావనమ్ముమిూఱ దీవించి యిట్లనియె.

క. చతురాస్యుం డనఁదగు నీ
పతియిటు నిను గారవించి బహుమతిమిూఱన్
కృతి రచియింపుమనన్ భా
రతికిన్ బ్రతివత్తు వమ్మ! రంగాజమ్మా!

క. నీవు రచియించు నీకృతి
భూవలయమునం బ్రసిద్ధిఁబొందంగ చాలన్
దీవించెద మిప్పుడు స
ద్భావముతోఁ బూను మిటు ప్రబంధ మొనర్పన్.

వ. అని యానతిచ్చి, మరియు నేతత్కథాసంవిధానంబునకు ప్రధాన నాయకుండును నగు నవ్విజయరాఘవచంద్రుని వంశంబు ప్రశంసించెద నని యిట్లనియె,

సీ. మహనీయతరమైన మణికిరీటమువాఁడు
మకరకుండలకాంతి మహిమవాఁడు
కరముల [illegible] దాల్చినవాఁడు
కౌస్తుభశ్రీగల్గు గళమువాఁడు
వైజయంతి ధరించి వన్నెకెక్కినవాఁడు
శ్రీవత్సమున మించి చెలఁగువాఁడు
నీలంపుచాయల నెమ్మేను గలవాఁడు
కనకాంబరము గట్టి గల్గువాఁడు

గీ. సకల కల్యాణగుణముల సాటిలేని
లక్ష్మినురమున నెలకొల్పు లక్షణాఢ్యుఁ
డఖిలజగములఁ గరుణచే నరయువాఁడు
వేదవేదాంత వేద్యుఁడై వెలయువాఁడు.

వ. మరియును,

సీ. నెమ్మొగంబున నవనీసురాన్వయమును
చెలువొంద నుదయింపఁజేయు ఘనుఁడు
బాహుకాండంబుల పార్థివ సంతతి
వినుతికెక్కఁగఁ గనిన మేటి
యూరుయుగంబున నొనర వైశ్యకులంబు
నవనిపై వెలయించు నమర విభుఁడు
చరణపద్మంబుల జగతి నాలవజాతి
ప్రబలఁజేసిన జగత్పావనుండు

గీ. నాభి పంకరుహాంబు(ల)ననలు మొగముల
ఘనతకెక్కిన తనయుని గన్నప్రోడ
భవ్యగుణహారి రాజగోపాలశౌరి
చెంగమలవల్లితోఁగూడి చెలఁగుచుండు.

ఈ ప్రబంధమున :

## రఘునాథ నాయకునివర్ణన

ఉ. సారభుజాబలంబునను జక్కఁదనంబున సద్గుణంబులన్
ధీరనుత ప్రతాపముల పెక్కులమిక్కిలి నిండుకీర్తులన్
ధారణిఁ బ్రోచునేర్పున నుదారదయం గవితాచమత్కృతిన్
శ్రీరఘునాథభూమిప ఫణీమణికిన్ సములేనృపాలకుల్.

సీ. దినమొక్కలక్ష భూదేవతోత్తములకు
సత్రంబుఁబెట్టుటే స్వామివ్రతము
ప్రతివత్సరంబుఁ దప్పకయె షోడశ మహా
దానముల్ చేయుటే ధన్యపూన్కి
అనిశంబు శ్రీవైష్ణవావళికిని నగ్ర
హారంబు లిచ్చుటే యధిపుమతము
కవులవిద్వాంసులఁ గనకపక్షమ్ములఁ
గాఁచిరక్షించుటే ఘనునిరీతి

గీ. ఆ మహామహుఁడచ్యుత క్ష్మామహేంద్ర
తనయవర్యుండు రఘునాథ ధరణివిభుఁడు
సర్వగుణయుక్తి శ్రీరఘునాథుఁడగుచు
ధాత్రిఁబాలించె విబుధ సంతతులువొగడ.

ఈతఁడు రాజగోపాలదేవుని వేఁడుటచే మన్నారను పేరుగల విజయరాఘవుఁడు జన్మించెను. రాజగోపాలుఁ డిట్లనెను:

గీ. తీవి విజయాఖ్యసుతుని వేఁడితివిగనుక
లీల మము రాఘవునిగఁ గొలిచితి గనుక
విజయరాఘవనామంబు వెలయఁదాల్చి
చెలఁగి వేయేండ్లు పుడమిరక్షించుచుండు.

విజయరాఘవనాయకుఁడు:

సీ. తొలుదొల్తపసిఁడి యుయ్యేలలూఁగువేళనే
తోరహత్తుగఁదులఁ దూఁగనేర్చె
దాదిపల్కులు నేర్చు తఱినె శ్రీరాజగో
పాలనామంబును బలుకనేర్చె
అక్షరాభ్యాసంబు నప్పుడె గ్రామముల్
వేడ్కనొప్పంబులు వెట్టనేర్చె
గరిడిలోపల సాముదొరకొన్న వేళనె
తునెలుగా వైరులఁ దునుమనేర్చె

గీ. జనకుఁడీతఁడు సుజ్ఞానజనకుఁడనుచు
ననుదినము తండ్రిసేవసేయంగ నేర్చె
మన్నారులభక్తుఁడై చిన్ననాఁడె
ఇతఁడు మన్నారుదాసాఖ్య నెసఁగనేర్చె.

సీ. శ్రీరాజగోపాలశౌరి కంకితముగా
మంజరీముఖకృతుల్ మహినొనర్చె
రాయలసాహిత్య రాయపెండేరంబు
శారదాధ్వజము నెసంగనెగడె,

... ... ... ...

విజయరాఘవుని వర్ణన, మన్నారు (రాజగోపాల, విజయరాఘవుల కభేదాధ్యవసాయము).

సీ. వక్షస్థలంబున వన్నె కెక్కినమచ్చ
లాలితంబగు వనమాలికయును
సరిలేనికరముల శంఖచక్రంబులు
నవరత్నమయమైన నవ్యనేత్ర
మనుపమంబైమించు కనకాంబరంబును
రమణమైమీఱు వజ్రములవంకి
ముంజేతులను బొల్చుముత్యాలకడియముల్
చరణపద్మమునందు బిరుదుపెండె

గీ. మమరె నిద్దఱియందును నందముగనె
నెంతభావించినను భేదమెఱుఁగరాదు
కావునను రాజగోపాలదేవుఁడిప్డు
తనరరూపద్వయంబును దాల్చెనేమొ !

పురవర్ణనలో నొకపద్యము :

ఉ. కన్నులు గండుమీలు తొలుకారు మెఱుంగులు మేనులయ్యెడన్
గన్నవి కావుకొనులలకంబులు చొక్కపుటింద్రనీలముల్
చన్నులు కుంభికుంభములు సారసముల్ పదముల్ దలంపఁగా
నన్నగరంబు కామినుల కన్యవధూటులు సాటివత్తురే.

గ్రంథాంతమున :

సీ. నావిభుండైన మన్నారుదాసునిచేత
*ముదమున మంజరీముఖకృతులను
పొగడొంద నంకితంబుగఁగాంచు శ్రీరాజ
గోపాలశౌరికిఁ గోర్కిమీఱ
నేనంకితము సేయ నిటువంటి మన్నారు
దాసవిలాసంబు ధరణిలోన
పరమభాగవతుని చరితంబుగావున
వినినవ్రాసినఁజదివిన జనులకు

గీ. నాయురారోగ్యపుత్ర పౌత్రాభివృద్ధి
ధనకనక దివ్యవస్తువాహన సమృద్ధి
నిరుపమానకవిత్వ పాండిత్యమహిమఁ
గలుగు నాచంద్రరవి తారకంబుగాఁగ.

మన్నారుదాసవిలాస ప్రబంధమున కథ మన్నారుదాసవిలాస నాటకమునందలి కథయేగాని, మార్పేమియు లేదు. విజయరాఘవనాయకుఁడు రాజచంద్రుని కూఁతురగు కాంతిమతిని వివాహమాడుటయే యిందలి యితివృత్తము. ప్రథమాశ్వాసమున తంజాపురాదివర్ణనము, నాయకవర్ణనము రాజగోపాలోత్సవ ప్రసంగము గలవు. ద్వితీయాశ్వాసమున రాజగోపాలుని తిరువీధి మహోత్సవమునఁ గాంతిమతి విజయరాఘవునిఁజూచి వలచుటయు నారాత్రి యామెకు విజయరాఘవుఁడు స్వప్నమున సాక్షాత్కరించుటయు నామె మరులుకొనుటయు, శిశిరోపచారములు వర్ణితములైనవి. తృతీయాశ్వాసమున విలాసవతి దూత్యము గలదు. చతుర్థాశ్వాసమున శతక్రతు శ్రీనివాసతాతయాచార్యులవారు విజయరాఘవుఁడు కాంతిమతియందనురక్తుడగుట యెఱింగి, యాతని పూర్వజన్మవృత్తాంతమును వివరించుట తెలుపబడినది. పంచమాశ్వాసమున కాంతిమతీ విజయరాఘవుల వివాహము వర్ణితమైనది.

## మన్నారుదాసవిలాసము - (ప్రబంధము) - చిత్రకథ - సౌందరి.

రంగాజమ్మరచించిన యీకృతి తంజావూరి పుస్తకశాలలోఁ గలదు కాని, ఈ గ్రంథమే మఱియొక కవయిత్రి 'సౌందరి' అనునామె దీనిని రచించినట్లుగా నందలి గద్యములు కూర్పఁబడి 'అల్లాడ విజయసింహభూపతి విలాసము' అనుపేర మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తకాగారమున నున్నది. దాని సంఖ్య 786. ఇది తాళపత్రగ్రంథమే. వ్రాఁత నవీనముగ స్ఫుటముగ నున్నది. ఒక్కొక్క దానియందు 14 పంక్తులు గలవు. ఈ గ్రంథము చదివినవారి కిదియొక కూటసృష్టియని తోఁపకమానదు. ఏలయనఁగా రంగాజమ్మ గద్యయందలి పేళ్లుమాత్రమే యిందు మార్పుచెందినవిగాని తక్కినవియన్నియు సమానమే! ఇప్పుడు ముద్రితమైన

మన్నారుదాసవిలాస నాటకములోని పద్యము లిందున్నవి. కాఁబట్టి యిది రంగాజమ్మకృతియే యగుట నిశ్చయము. 'సౌందరి' అనునామె రంగాజమ్మ కృతినెట్లో సంగ్రహించి(ఆమెయు సంగీతసాహిత్యములు నేర్చినది కాఁదగును) గ్రంధకర్తృత్వము నభిలషించి, ఈరీతిమార్పులు గావించియుండును. రంగాజమ్మ గద్యలో 'విజయరాఘవ' అని యున్నచో నిందు 'విజయసింహభూపతి' అచట 'పసుపులేటి' ఇచట 'రాచవేటి' అచట 'మంగమాంబ' ఇచ్చట 'మార్తికాంబ' యిత్యాదిగా వెలసినవి.

పై విషయములు స్పష్టముగాఁ దెలియుటకు నా గ్రంథమునుండి యీ క్రిందిభాగ ముదాహరించుచున్నాను.

## అల్లాడ విజయభూపతి సింహవిలాసము

ప్రారంభమున నిట్లున్నది:

క. శ్రీవిజయభూపతినృప
భూవలయప్రాజ్యరాజ్యపోషణ దక్షా
శ్రీవత్స కలితవక్షా
శ్రీవరమహేంద్రపురీశ శ్రీలక్ష్మీశా!

వ. అవధరింపుము.

ఉ. ఎంతటివేడ్కఁ గాంచె నవనీశు మహోత్సవముం గనుంగొనన్
కాంతలుఁ దాము లోకమునఁ గల్గు బుధోత్తము లేఁగుఁదేర న
త్యంత మనోహరాకృతిని దానును వచ్చె వసంతమంతనే
కాంత సుగంధవాసిత దిశాంతలతాంతము సంతసంబునన్

దీనిలో ప్రథమాశ్వాసము లేదు. గ్రంథము చతుర్థాశ్వాసముతో ముగియుచున్నది. గ్రంథాంతమునగల గద్య యీ క్రిందివిధముగ నున్నది. ఈ గద్య రంగాజమ్మ మన్నారుదాసవిలాసమునందలి గద్యతో నెట్లు సరిపోవుచున్నదో చూపుటకు, నా రెండింటిని నొకదాని కొకటి సంవాదముగా నీ క్రింద నిచ్చుచున్నాను.

విజయసింహాభూపతి సింహ
విలాస గద్య.

ఇది శ్రీమన్నారాయణ కరుణా కటాక్షవీక్షణానుక్షణ ప్రవర్ధమాన సారసారస్వతధురీణయు, విచిత్రతర పత్రికాశతలిఖిత వాచికార్థావగాహన ప్రవీణయు, అతులితాష్ట భాషా కవితా సర్వంకష మనీషావిశేష శారదయు, విజయభూపతి సింహనరేంద్ర విభునిత్య సంభావితయు, విద్వత్కవి స్తుతగుణసేవితయు, రాచవీటి నరపతి బహుజన్మతపః ఫలంబును, మాక్తికాంబాగర్భశుక్తిముక్తాఫలంబును సరస సద్గుణ కదంబయు నగు సౌందరి వచనరచనా చమత్కృతిం జెన్ను మీఱు అల్లాడభూపతి సింహవిలాసం బను మహాప్రబంధంబునందుఁ జతుర్థాశ్వాసము.

రంగాజమ్మ మన్నారుదాస
విలాస గద్య.

ఇది శ్రీమద్రాజగోపాల కరుణా కటాక్షవీక్షణానుక్షణ ప్రవర్ధమాన సారస్వతధురీణయు, విచిత్రతర పత్రికా శతలిఖితవాచికార్థావ గాహనప్రవీణయు, తత్ప్రతి పత్రికాశత స్వహస్తలేఖన ప్రశస్తకీర్తియు, శృంగారరసతరంగిత పదకవిత్వమహనీయమతిస్ఫూర్తియు, అతులితాష్ట భాషాకవితాసర్వం కషమనీషా విశేషవిశారదయు, రాజనీతి విద్యావిశారదయు, విజయరాఘవ మహీపాలవిరచిత కనకాభిషేకయు, విద్వత్కవి జనస్తవనీయ వివేకయు, మన్నారుదాస విలాస నామ మహాప్రబంధనిబంధన కృతలక్షణయు, మహనీయ రామాయణ భాగవత భారత కథాసంగ్రహ విచక్షణయు, పసుపులేటి వెంకటాద్రి బహుజన్మతపః ఫలంబును, మంగమాంబా గర్భశుక్తి ముక్తాఫలంబును, రంగద్గుణ కదంబయునగు రంగాజమ్మ వచనరచనా చమత్కృతిం జెన్నుమీఱు మన్నారుదాస విలాసంబను మహా ప్రబంధంబునందు పంచమాశ్వాసము.

గ్రంథాంతగద్య వెనుక నీ క్రింది పద్యము గలదు.

సీ. శ్రీరామచంద్ర నిర్మితమైన యాసేతు
వెన్ని వేలేండ్లు తా నెసగుచుండు
నలవిభీషణుఁడు నత్యకలంక మతిలంత
నెన్ని వేలేండ్లు తా నేలుచుండు
... ... ... ... ఇల నెన్ని వేలేండ్లు
సొంపు మీఱఁగ భరియింపుచుండు
మహేంద్రనాథు చరిత్ర మహి నెన్ని వేలేండ్లు
విబుధులుగొని యాడ వెలసియుండు

గీ. నన్ని వేలేండ్లు పుత్రపౌత్రాభివృద్ధి
రాజ్యలక్ష్మి సమృద్ధి నిరంతరముగ
విజయమున్ జాలఁ గైకొని వెలయఁగలఁడు
విజయభూపతిసింహ నరేంద్ర ? (పృథ్వీ) విభుండు.

అముద్రితమగు నీ గ్రంథమునుండి కవిత్వశైలి తెలియుటకు 'వసంతవర్ణన' నుండి కొన్ని పద్యము లుదాహరించుచున్నాఁడను.

మ. పరగన్ జైత్రుఁడు నవ్యసూత్రతిలకా పాణిగ్రహం బందుచున్
మెఱయన్ మల్లికలున్ దరువ్రజములు స్మైచ్ఛందఁగా నిత్తరిన్
తెఱఁగొప్పన్నిడి సాణిపల్లవములన్ దివ్యన్నవామోదముల్
నెఱయన్ దాల్చిన సేసఁబ్రాలనఁగఁ గన్పించెన్ బ్రసూనావళుల్.

క. బాహుబలశాలి మరుఁడు
త్సాహంబున జగము గెలువఁదరలెడుచో స
న్నాహంబుసెప్ప తత్ఘన
కాహళ రావములన నళికధ్వను లెసగెన్.

గీ. కొమరుమీఱిన నవపల్లవముల కాంతి
గాణవకాసాంధ్యరాగంబు కరణిమించ
నపుడు గనిపించె నందందు నందముగను
తారకంబు లనంగను గోరకములు.

క. తరుణీజన మానమద
ద్విరదంబుల మదమడంపఁ జివురుమరునికిఁ
దరమగు రత్నాంకుశముల
మురువుగఁ గనుపట్టినపుడు మోదుగమొగ్గల్.

గీ. మలయనిలయానిలం డను మంత్రవాది
యచట భ్రమరాక్షరము ద్రిప్పుచును మఱియు
పొసఁగు కుసుమ పరాగంబు భూతిఁ జల్లి
సల్పె యువతి మానగ్రహోచ్చాటనంబు

ఈమన్నారుదాస విలాసమునసే రంగాజమ్మ యొకదండకము గూడ విజయరాఘవుని పేర రచించినది. అదియుఁ బైవిధముగా మార్పు చెందినది. అల్లాడ విజయసింహభూపతిపై "మోహిని" అను నామె మరులుగొనుట, పొందుట యిందలి విషయము. ఇదియు మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తకశాలలో [1]"మోహిని దండకము" అను పేర గలదు. ఈ దండకమెట్లున్నదో తెలిసికొనుటకు క్రిందిభాగమందుండియుదాహరించుచున్నాను.

## మోహినీ దండకము

శ్రీమన్మహారాజరాజాధిరాజా మహేంద్రపురి లక్ష్మినారాయణా సేవాధురీణాదిదాసుండు కిరీట సింహాసనాధీశ్వరుండుస్ మహాదానకర్ణావతారుండు అష్టభాషావిశేషాతిజ్ఞాన ప్రవీణుండు వీణాది సంగీతసాహిత్య పాండిత్య భోజుండు తమ రాజరాజ అల్లాడ విజయభూపతి సింహానరేంద్ర శౌరీనాయకా తేజోమహానాయ ప్రధానాగ్రగణ్యుండు, పుణ్యుండు నానా జగన్మోహనాకార సౌందర్యకందర్పుఁ డానందచిత్తావధానుండు శ్రీరాజ్యలక్ష్మి ప్రసన్నుండు మూర్ధన్యధన్యుండు శృంగారలీలావినోదుండు ......

... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ...

సూర్యహర్మ్యం బట్టుతోయం పురీవిన్ విలాసంబుగాఁగట్టి హర్మ్యాన హేమంపుదల్లడల్ కులుకగా నున్న మోహినీరత్నమున్ గాఁగిటిలఁ

1. మోహినీదండకము సంఖ్య 2001.

జేర్చి మన్నించె కర్పూరసమ్మిశ్రతాంబూలముల్ సేయుమారున్ని నున్ గెలుచు సన్నాహముల్ మీఱి నానాకళాశాస్త్ర సన్నాహమమర్మంబులన్ సోలి సొంపెక్కుచుం గొంతసేపు ప్రొద్దుచ్చి నిద్రించి మేల్కాంచి సూర్యోదయంబయ్యె విజయభూపతిసింహాసనేంద్రశౌరినా.

నిత్యమున్ భోగభాగ్యంబులన్ పుత్రపౌత్రాభివృద్ధిన్ యశస్వంతుండై భాగ్యశ్రీమంతుండై ధాత్రిని నానాశ్రితానేకసంరక్షణాధ్యక్షుండై యుండె నాచంద్రతారార్కమై యిట్టి చందంబునన్ మోహినీదండకం బొప్పగాఁ గటాక్షించవే రాజమహేంద్రపురి లక్ష్మీనారాయణా నమస్తే నమస్తే నమః. సంఖ్య. 2001.

మన్నారుదాసవిలాసకావ్యము, నాటకము రెండును విజయరాఘవనాయకుని చరిత్రాత్మకము లేగాని వేఱుగావు. రంగాజమ్మ కృతు లిట్టితరుల కృతులుగా మార్పుచెందు నవకాశమున్నదనుటకు మఱియొక వృత్తాంతము గూడ నిటఁ దెల్పెదను.

"విజయరాఘవనాయకుఁ డెల్లప్పుడును నీమెతో (రంగాజమ్మతో) నానందించుటచూచి, యాతని పట్టమహిషి యాగ్రహము నాపుకొనఁజాలక యొక దూతికముఖమున దూషణోక్తులతో నొకవార్త నంపెనఁట! దానికి విదుషీమణియగు రంగాజమ్మ దూతికీపద్యము జవాబు నిచ్చెనఁట!

ఉ. ఏవనితల్ మముం దలఁప నేమిపనో? తమ రాదువారు గా
రో? వలపించు నేర్పెఱుఁగరో? తమకౌఁగిటిలోన నుండగా
రావదియేమిరా? విజయరాఘవ! యంచిలుదూరిబల్మిచేఁ
దీవరకత్తైనై యిటులఁ దీసుక వచ్చితినా తలోదరీ!

మఱియు నంతఃపురములో నిట్టి సందర్భములోఁ జెప్పిన చాటువులు :

ఉ. 'రాజనిభాననా! సరసురాలవు; జబ్బుగ నిల్చినావదే
మే జడ?' 'యింతకంటె వలెనే' వలనొప్ప బిగించియల్లవే
ఒజవరాల! వేఱెపనియున్నది' 'దోసమె' దోసమే! మహా
రాజగునట్టి యవ్విజయరాఘవుమై చిగురాకుకోమలీ!

చ. కలుకెద వేఁటికే చెలియ! కంచెఁడు మానెఁడు గాను నెల్లవా
రలు వినినారలే! విజయరాఘవనాయఁడు నిన్నుఁ జూడుటల్!
వలపులె చాటుచున్నవి; జవాదియు నల్లవు; విఱ్ఱవీఁగఁగా
వలెనటె? చూచి యోర్తురటె వంతులుజంతు లవేఁటియెమ్మెలే?

క. ఇంతిపొనుపుపై నిదె
కంతుడు కూర్చున్నవాఁడు; గనుగొను!" "వహవా,
కంతుఁడనంగుఁడు; నీ తెలి
వింతేనా? విజయరాఘవేంద్రుఁడె, చెలియా!"

పై పద్యములు "విజయరామ" అను మార్పుతో విజయనగర రాజు (కళింగదేశమున) విజయరామరాజుపై అడిదము సూరకవి చెప్పినట్లు కీర్తిశేషులు గురుజాడ శ్రీరామమూర్తి పంతులుగారు సూరకవి చరిత్రలో వ్రాసియున్నారు. ఆ వైపున నీ పద్యములు సూరకవివనియే వాడుక. పైపద్యములు చాటుపద్య మణిమంజరి (ప్రథమభాగమున) 63, 60, పుటలలో బ్రహ్మశ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు ప్రకటించి యున్నారు.

## రంగాజమ్మ కులము

రంగాజమ్మ వారాంగనయని పూర్వచరిత్రకారు లభిప్రాయపడి యున్నారు. వీరుజన్మముచే వేశ్యలుగానుండియు, సంస్కార విశేషము చేత జాణలై, సాంఘికజీవిత మాధుర్యము చవిఁజూపిన సరసురాండ్రై యత్యున్నతస్థానము నాక్రమించినవారు. రఘునాథరాయలకాలమున రామభద్రాంబ, తిరుమలాంబ, మధురవాణి, విజయరాఘవుని కాలమున రంగాజీ, కృష్ణాజీ మున్నగువారు కులమున వేశ్యలేయైనను, నేక చారిణీవ్రతము ననుసరించినవారు (అనగా జీవితకాలమంతయు నొకే

నాయకుని ననుసరించియుండువారు.) కావుననే వీరిలోఁగొందఱు, తమ నాయకులకు ధర్మపత్నులుగాఁ జెప్పికొన్నారు. రంగాజమ్మయు నట్టి యేకచారిణీవ్రత సంపన్నురాలై [illegible] నధిష్ఠించిన పూజ్యురాలు. [illegible]మణులు, విద్వద్వర్యులు కీర్తిశేషులు శ్రీ మా. రామకృష్ణకవిగారు 'మధురవాణిని' గూర్చి వ్రాయుచు నీ విషయమునఁ బై యభిప్రాయమునే వ్యక్తపఱచినారు.

ఏనాఁటిసాంఘికపరిస్థితుల కానాఁటిసాంప్రదాయముల ననుసరించి విమర్శింపవలెను. నేఁడును నీ కులజలు సంగీతసాహిత్య విద్యాసంస్కార సంపన్నలై, ఉత్తమశ్రేణిలోఁ జేరిన తారాగణములై ప్రకాశించు చున్నారు. కావున రంగాజమ్మయు, సర్వాంధ్రలోకమునకు సంతత స్మరణీయయుఁ బూజ్యయు నగుట నిర్వివాదాంశము.

రంగాజమ్మ మన్నారుదాసవిలాసనాటక ప్రారంభమున నామె "అచ్యుత విజయరాఘవసార్వభౌమ ధర్మపత్నియైన రంగుమీఱు రంగాజమ్మ" అని చెప్పుకొన్నది. కాని యామె, వివాహాది వృత్తాంతము గాని, తంజాపురాస్థానమున నామె కెట్లు ప్రవేశముకలిగిన సందర్భములు గాని మనకు తెలియవచ్చుటలేదు. రంగాజమ్మ విజయరాఘవుని యాస్థానమునకు వచ్చినప్పటికే యాతని కొక పట్టమహిషి యుండెననియు విజయరాఘవనాయకుని ప్రవర్తనవిషయమై యా పట్టమహిషికిని, రంగాజమ్మకును వాదోపవాదములు జరిగినవనియు, చివఱకు రంగాజమ్మ "ఏవనితల్ మముందలఁప నేమిపనో" అన్న పద్యము మూలమున నామెను నిరుత్తరురాలుగా నొనర్చెననియు నీవఱకే తెలిపియుంటిని. దీనినిఁబట్టి యీ మె ధర్మపత్నిస్థానము నలంకరించుటకు కొంతకాలము పట్టెనని యూహింపవచ్చును. ఆపట్టమహిషి యనంతరము రంగాజమ్మను విజయరాఘవుడు ధర్మపత్నిగా పరిగ్రహించి యుండవచ్చును. విశిష్ట కవితా విలాసలాలసుఁడును నగు విజయరాఘవనాయకుఁడు సౌందర్య వతియు, సంగీతసాహిత్యవిద్యాసరస్వతియు రాజనీతి విద్యావిశారదయు నగు రంగాజమ్మను ధర్మపత్నిగాదు చేకొనుటలో వింతలేదు. ఈ కార్యము

వలన నాతనికి తీర్థమును స్వార్థమును కలిసివచ్చినవి. మాననీయమగు తంజావూరీ కవితాసామ్రాజ్యమును, మధురభక్తిరస భావనాపూరితమగు వైష్ణవభక్తి సామ్రాజ్యమును నీ ధర్మపత్నిమూలముననే, విజయరాఘవ నాయకుఁ డేకైకభోగముగా నేలి యశశ్శరీరుఁ డయ్యెనని నిర్వివాదముగాఁ జెప్పవచ్చును. మఱియు మన్నారుదాసవిలాసప్రబంధమున రాజగురువులును, వైష్ణవాచార్యులు నగు శతక్రతు శ్రీనివాసతాతయాచార్యుల వారు, రంగాజమ్మను దీవించుచు చెప్పిన యీ క్రిందిపద్యముగూడ రంగాజమ్మ ధర్మపత్నిత్వమును సార్థకపఱచుచున్నది.

క. "చతురాస్యుండనఁదగు నీ
పతి యిటు నిను గారవించి బహుమతిమీఱన్
కృతిరచియింపు మనన్ భా
రతికిన్ బ్రతివత్తువమ్మ! రంగాజమ్మా!"

రంగాజమ్మ విజయరాఘవనాయకుని కాలమున నాతని రాజ్యపాలనాప్రారంభమున ననఁగా క్రీ. శ. 1633 లో నింకను తంజాపురాస్థానము నలంకరింపలేదని, రాజగోపాలవిలాస రచనాసందర్భమునఁ దెలిపియుంటిని. (పుట 123) ఆమె కృతులలో కడపటి కృతియగు మన్నారుదాసవిలాస నాటకమున[1], వివాహసంకల్పములో "శుభకృన్నామసంవత్సరే, ఉత్తరాయణే, వసంతర్తౌ చైత్రమాసే, శుక్లపక్షే, అద్యపంచమ్యాం శుభతిథౌ గురువాసరయుక్తాయాం, శుభనక్షత్ర, శుభయోగ శుభకరణయుక్తాయాం, అస్యాం శ్రీరఘునాథభూపాలకుమారస్య, అచ్యుత విజయరాఘవభూపాలస్య ఉద్వాహాఖ్యం కర్మకరిష్యమాణ తదాదావృద్ధ్యర్థం శుభ్యర్థమభ్యుదయాంచ, మహాజనైస్సహః పుణ్యాహవచనం కరిష్యే" అని యీ నాటకరచనా సంవత్సరము పేర్కొనఁబడినది. ఈ శుభకృత్తు సంవత్సరము విజయరాఘవనాయకుని రాజ్యపాలనకాలమున క్రీ. శ. 1662 సంవత్సరమున వచ్చినది. కాబట్టి మన్నారుదాసవిలాస నాటకము విజయరాఘవనాయకుని యిరువదితొమ్మిదవ రాజ్యపాలన

1. మన్నారుదాసవిలాసనాటకము. పుట 47.

సంవత్సరమున రచితమైనది. కావున రంగాజమ్మ క్రీ. శ. 1635 – 40 ప్రాంతముల నాస్థానమునకువచ్చి, క్రీ. శ. 1662 వఱకును విలసిల్లెనని యూహింపవచ్చును.

## పదకర్తలు - క్షేత్రయ

ఆంధ్రసంగీతప్రపంచమున మూర్తిత్రయమని చెప్పఁదగినవారు తాళ్లపాక అన్నమయ్య, క్షేత్రయ్య, కాకర్ల త్యాగయ్య, అను ముువ్వురు. వీరిలో తొలివారు శ్రీ దివ్యతిరుపతిక్షేత్రమున సంకీర్తనాచార్యులు. వీరి కాలము (1424-1508). వీరాంధ్రదేశీయులై యాంధ్రప్రాంతములకు సంబంధించినవారు. తక్కినవారిలో క్షేత్రయ్య యాంధ్రదేశీయుఁడయ్యు దక్షిణదేశమున తంజావూరితోనెకాక మధురతోకూడ సంబంధము కలవాఁడనుటకాతని చరిత్రము కొంత సాక్ష్యమొసఁగుచున్నది. ఇఁక త్యాగయ్యగా రచ్చముగా దక్షిణాదిని తంజావూరి మండలము వారే. క్షేత్రయనుగూర్చి కొంచెము వివరించెదను.

ఈతఁడు సంగీతవిద్యాచక్రవర్తియగు రఘునాథనాయకుని దర్శించినట్లుగా మండ నరసింహాకవి తాను రచియించిన "ఆంధ్రకౌముది" అను గ్రంథమున నీక్రిందిపద్య ముదాహరించియున్నాఁడు.

"మువ్వగోపాల భక్తేన క్షేత్రజ్ఞకవినాఽఽ క్తత్వాచ్చ"

క. తము దామె వత్తు రర్థులు
క్రమమెఱిఁగిన దాతకడకు రమ్మన్నారా
కమలంబులున్న చోటికి
భ్రమరంబుల యచ్యుతేంద్ర రఘునాథనృపా!

కాని రఘునాథనాయకునిపై క్షేత్రయ చెప్పిన పదములు కానరావు. రఘునాథనాయకుని కుమారుఁడగు విజయరాఘవనాయకునిపై క్షేత్రయ్య వేయిపదములు చెప్పినట్లుగా మనకు తెలియవచ్చినను నందు పదిమాత్రమే లభించినవి. ఇవి శృంగారరసవత్తరంగములై యొసగుచున్నవి. ఇందుండి యొకపదము నుదహరించుచున్నాను.

కాంభోజి - ఆది.

పల్లవి : సుదినమాయెనే యీ ప్రొద్దు సుదినమాయెనే యీ

అనుపల్లవి : మదనావతారుని సేవ మనకుఁ గలిగినే

చరణములు : ప్రొద్దుట నిలువుటద్దము పొడగన్న ఫలము - ఈతని
ముద్దుమోముఁ జూడఁ గలిగె ముద్దులగుమ్మ
ఈ ప్రొద్దు పూర్ణకుంభము యెదురైనఫలము ఈ
భూపాలకుంజరుని నేఁ బొడఁగంటినమ్మ
ద్విజరాజుల సేవించిన దివ్యశకునము అచ్యుత
విజయరాఘవేంద్రుని యీ విడిదిలోఁగంటి సుదిన.

ఈతఁడు తన పదములలో నొక పదమున చేమకూర వేంకటకవి విజయవిలాసమునందలి పద్యపాదము ననుకరించియున్నాఁడు.

" ఎగు బుజంబులవాఁడు మృగరాజమధ్యంబుఁ
బుడికిపుచ్చుకొను నెన్నడుము వాఁడు
నెతి చంద్రుకలవాఁడు నీలంపునికరంపు
మెఱుఁగుఁ జామన చేయ మేనివాఁడు" విజయవిలాసము. 2-164

[1] క్షేత్రయ : " ఎంతచక్కనివాఁడే నాసామి వీఁ
డెంత చక్కని వాఁడే "

అను పదములో,

" మెఱుఁగుఁ జామనచాయ మేనమరువాఁడే "

అని యనుకరించినాడు.

క్షేత్రయ మధుర తిరుమలేంద్రునిపైని రెండువేల పదములు చెప్పినట్లు తెలియుచుండుటచే నీతఁడు దాక్షిణాత్య వాఙ్మయమునకు సంబంధించిన వాఁడగుట నిర్వివాదాంశము. ఈతఁడు గోలుకొండ పాదుషాను దర్శించి వేయినేనూరుపదములను చెప్పెనట. మొత్తముమీఁద యీతఁడు

1. క్షేత్రయపదములు - ముద్రణము :- 1 ఆచార్య విస్సా అప్పారావుగారు. 2 వావిళ్ళవారు. 3. శ్రీ పిఠాపుర మహారాజావారు. " క్షేత్రయ సంచిక " లో నీ గ్రంథకర్త " క్షేత్రయ పదములలోని భాష " ను గూర్చి యొక వ్యాసమును వ్రాసియున్నాఁడు. అది శ్రీ అప్పారావుగారిచేఁ బ్రకటితము.

నాలుగువేల యైదువందలపదములు రచించినట్లు తెలియుచున్నది. వీనిలో నేటికి నాల్గువందల పదములు మాత్రమే లభ్యమగుచున్నవి.

ఈ పదములు మధురభక్తి సంప్రదాయమునకుఁ జెందిన శృంగార కృతులు. వీనిలో కొన్నింటికి నాలంకార శాస్త్రానుసారముగ రసమంజరి వ్యాఖ్యగలదు.[1]

## పెద్దదాసు

విజయరాఘవనాయకుని కాలమున వెలసిన భక్తులలో, పదకర్తలలో పెద్దదాసొకఁడు. ఈతని భక్తిప్రపత్తిని, పదరచనను విని, విజయరాఘవనాయకుఁ డీతని పిలిపించి, తన పూర్వులనుగూర్చి, తన రాజ్యవైభవమునుగూర్చి, తన్నుగూర్చి వర్ణించి పాటలుపాడమని కోరినాఁడు. పెద్దదాసు మన్నారుదాసైన విజయరాఘవుని కోరికకు చాల ఖిన్నుఁడై, నిర్భయముగా,

> నారసింహుని పాడిన నోటను
> నూరసింహమును పాడఁగ

అని స్పష్టముగాచెప్పి పాడుటకు నిరాకరించినాఁడు. అంతియేకాక తిరుమణిదాల్చిన పంచమదాసులనైనను కీర్తించెదను గాని మానవనాధులను స్తోత్రముచేయను అని మఱియు ముక్తకంఠముగా చెప్పినాడు. అప్పుడు రాజుగారి యనుచరులు, సభవారును ఒక గాడిదకు పట్టెనామముతీర్చి దానికి దండము పెట్టుమని పెద్దదాసును కోరినారు. పెద్దదాసు ప్రదక్షిణముచేసి దండముపెట్టి దానిముందు సాగిలబడినాఁడు. సభవారును, రాజుగారును అతనిని పరిహాసించినారు. అంతేకాకుండ "గాడిదకు దండము పెట్టిన గాడిదవుకావా" అని నిందించి ప్రశ్నించినాఁడు – "ఈ గాడిదె తిరుమణిదాల్చిన నీవంటిదే. నీకు దండముపెట్టినపుడు గాడిదకు పెట్టు

---

1. క్షేత్రయపదములలోని శబ్దప్రయోగములను కీ. శే. బహుజనపల్లి సీతారామాచార్యులవారు ప్రామాణికముగ నంగీకరించి తమ "శబ్దరత్నాకరము" అను నిఘంటువున వానిని జేర్చిరి.

టలో తప్పేమున్నది" అని పెద్దదాసు ప్రత్యుత్తర మిచ్చినాడు. విజయ రాఘవునికి వెంటనే కోపమువచ్చినది. ఆతని బల్లెములతో కత్తులతో పొడువుడని ఆజ్ఞాపించినాఁడు. పెద్దదాసు హరినామసంకీర్తనము, చేయుచు, ఆనాడు ప్రహ్లాదునివలె, వాని నన్నింటిని నిగ్రహించినాఁడు. నీట ముంచినను, నిప్పునఁ ద్రొక్కించినను, చెక్కు చెదరలేదు పెద్దదాసు. రాజునకు పెద్దగా కోపము వచ్చినది - తలారివారి కితని కొఱత వేయింపుమని యాజ్ఞాపించి నాఁడు. పెద్దదాసు కళ్లువిప్పి, తేఱిపాఱి కొఱత చూడగనే యది భస్మీభూతమైనది. కొఱతయొద్ద

"ఇదిగో వేళ, వేణుగోపాలా,
నామది గర్వమెంచక, మన్నించి రక్షింపు
మదన జనక, తంజాపురీసదన గోపాలా"

అని కీర్తనతో హరినామస్మరణ చేసినాఁడు.

భక్తపరాధీనుఁడగు గోపాలుఁడు మన్నారు కడకు మాఱు వైష్ణవ భక్తుని వేషముతో నేగి "దాసుని మిక్కిలి దండిస్తివిరాధగిడీ, నాదాసుల నక్కట దండిస్తివిరాధగిడీ!" అని కొరడా దెబ్బలు కొట్టినాఁడట. బాధకు తాళలేక నాయకరాజు చారులని పంపి, పెద్దదాసుని పిలిపించి కాళ్లుపట్టు కొని, చేతులు జోడించి, తన్ను క్షమింపుమని కోరినాఁడు. భక్తుల కప చారము గలిగినదిగాన, రాజ్యము పరులపాలగుననియును తనకుకూడ ప్రత్యక్షముగాని పురుషోత్తముఁడగు శ్రీగోపాలదేవుఁడు, రాజునకు ప్రత్యక్ష మగుట యాతని పూర్వపుణ్య విశేషమనియు చెప్పి యాతని వీడ్కొనెను.

పెద్దదాసు శ్రీరంగమునకుఁ బోవుచుండగా, నొక ముసలి బ్రాహ్మణరూపము ధరించి శ్రీరంగేశ్వరుఁడాతని స్వయముగా తన సన్నిధికిఁ దీసికొనిపోయెను. ఐహిక మంతయు మఱచి, పెద్దదాసు రంగనిలో నైక్యము గాంచెను.

పెద్దదాసు మాటలు ప్రత్యక్షరము సత్యమైనవి. విజయరాఘవ నాయకుఁడు తన కుమారుఁడగు మన్నారుదేవునితో క్రీ.శ. 1674లో మహా

రాష్ట్రరాజగు నేకోజీతో యుద్ధముచేసి మడసెను. నాఁటినుండియు నాయక రాజపాలన మంతరించి తంజావూరిలో మహారాష్ట్రరాజ్యపాలన ప్రారంభ మైనది.

పెద్దదాసు కీర్తనలు భక్తితన్మయత్వమును గలిగించునవి. అపర ప్రహ్లాదుఁడగు నీ దాసుని చరిత్ర[1] మాంధ్రుల కనవరతస్మరణీయమైనది.

ఈతని పదములను రెంటిను దాహరించుచున్నాఁడను.

నాదనామక్రియ - ఆదితాళము

పల్లవి : కొంచాన దొరకదు శ్రీహరిస్మరణ వంచనమతి జనులకు.

అనుపల్లవి : హెచ్చుమించు నారాయణకథలు సచ్చరితము విన నైపనివారికి

చరణములు : పరనిందా పరధనములు రోసీ పరభామల బాసీ
అరిషడ్వర్గము లంటఁగఁజేసే మాఁడాళలరోసీ
సరసిజనాథుని పరమభక్తులెడ
కొలతలుమొటిగే కుక్కను దినవలె. కొం॥

మందమతా మోహము పోగొట్టవలెను సుజ్ఞానము చేతన
యింద్రియములచే పట్టవలెనుముదమున గెంటవలెను
నిందను పలికే పందిని దినవలె. కొం॥

లోన వెలుపట సరియై యుండవలెను
నానా కర్మలు శ్రీనాథు నకు ప్రీతి సేయవలెను
దీనుల కిడవలెను శ్రీశుమించి శ్రీవేంకటవిఠలుని
ధ్యానముసేయని యేనుఁగు దినవలె. కొం॥

ఆనందభైరవి - ఆటతాళము

పామరుల చెంతఁ జేరము శ్రీరామనామమే నమ్మినారము
ఈమహి సంసారహీనులతో చెలిమి
సేయక శ్రీహరి శరణుఁ జొచ్చి యున్నారము. పా॥

1 పెద్దదాసుచరిత్ర తెలుఁగుదేశమున చాలగా వ్యాప్తినిఁ గాంచినది. క్రీ. శే. 1870 నుండియు నిది పండ్రెండు పర్యాయములు ముద్రితమైనదన్నచో దీనిప్రచారము గ్రహింపవచ్చును. ఈ చరిత్రను రచియించిన కవి సింగరిదాసు.

చపలచిత్తుల చెంతఁ జేరము
శ్రియః పతిని మతిని నమ్మినారము
కపటమానసులతో కలిసి వర్తించము
నిపుణులైనవారి కృపఁ గాచుచున్నాము. పా॥
దూషణ భూషణసేయము ని
ర్దోషులమై యున్న వారము
పాషండులైనట్టి పతితుల కూటమి
రోసివేసి హరిదాసులైయున్నాము. పా॥
ఇందుముఖుల పొందుఁ గోరము పర
నింద కొడిగట్టి తిరుగము
పొందుగ నరసింహు పెద్దదాసును జూచు
ఇందిరేశు భజనానందులై యున్నాము. పా.

## మన్నారుదేవుఁడు

ఈతఁడు విజయరాఘవనాయకుని కుమారుఁడు. మహారాష్ట్రుల పైఁ దండ్రితో యుద్ధమునకు వెడలి, వీరస్వర్గమలంకరించిన వీరుఁడు. ఇతఁడును తండ్రితాతలవలె గొప్పకవి. 'విజయరాఘవాభ్యుదయము' అను ప్రబంధమును[1] రచించెను. అది నేఁడు కానరాకున్నది. మనకు లభ్యమైనది హేమాబ్జనాయికాస్వయంవరము.

విజయరాఘవనాయకుఁడు రక్తాబ్జనాయిక లేక హేమాబ్జనాయిక అను చెంగమ్మను, మన్నారుఁడను రాజగోపాలునకు వివాహము చేసిన కథ యిందు వర్ణితము. ఇదియును యక్షగాననాటకమే. రాజగోపాలస్వామి స్తుతితో నీక్రింది విధమున ప్రారంభమగుచున్నది.

సీ. శ్రీరమణీ సముజ్జృంభమాన కటాక్ష
హారమణీల సద్భూరివక్ష
వార్తాచమత్కార వైభవప్రదనామ
మార్తాండ మండల మహితధామ
మాణిక్యకేయూర మండితభుజదండ
చాణూరగర్వశిక్షా ప్రచండ
తంజాపురాధిప స్తవనీయచారిత్ర
కంజాతపత్ర సంకాశనేత్ర

1. ఇది తన తండ్రియగు విజయరాఘవనాయకుఁడు రచించిన "రఘునాథనాయకాభ్యుదయము" వలె ద్విపదకృతియైయుండనోపును. ఇట్టి యభ్యుదయ కావ్యరచనలు వెలసినవి తంజావూరి నాయకరాజుల కాలమునాఁడేయని యెఱుఁగఁదగును.

గీ. ద్వారకాధీశ కాంచన వననివాస
పాకరిపుమిత్ర చెంగమలాకళత్ర
మము(గటాక్షించి శుభలీల మనుపు(జాల
రాజగోపాల రాధికారతివిలోల.

ఆ వెనుక యనంతగరు(డులకు, పంచాయుధములకు( బన్నిద్దఱాళ్వారులకు నమస్కరించి, ఆదిమకవుల( గీర్తించి ప్రపితామహ పితామహ జనకులైన అచ్యుత రఘునాథ విజయరాఘవుల వినుతించి గ్రంథము ప్రారంభించెను.

దక్షిణద్వారకలో రాజగోపాలు(డు కొలువై యుండగా బ్రహ్మాది దేవతలువచ్చి యా భగవంతునితో క్షీరాబ్ధినిమథించి యమృతమును లోకమున కొస(గవలయునని విన్నవించిరి. వారలతో రాజగోపాలు(డు పాలసముద్రమున కేగి దేవదానవుల రప్పించి, మంథరపర్వతము కవ్వపుం గొండగా( జేసి, వాసుకిని తరి(త్రాడుగానొనర్చి క్షీరాబ్ధినిమథింప( జేసెను. అంతట మొదట హాలాహలముద్భవిల్లెను. పరమేశ్వరుడు దానిని భక్షించెను. ఆ వెనుక పారిజాతము, ఉచ్చైశ్శ్రవము, కామధేనువు, కల్పవృక్షము, కౌస్తుభము, కంజారి కామదమణితో అమృతకళలము పుట్టెను. అదేసమయమున నా సముద్రమునుండి చెంగమలమ్మ యుద్భవించెను. శ్రీరాజగోపాలస్వామియు చెంగమలమ్మయు,పరస్పరము మోహావేశపరవశులైరి. అమృతమును పంచుకొనుటయం(దు, దేవదానవుల వాగ్వివాద మణ(చుకొనుటకు శ్రీ రాజగోపాలు(డు మోహినీరూపము దాల్చి, యమృతము దేవతలకొసంగి తన రాజధాని చేరెను. హేమాబ్జనాయికయు, విరహవేదనచే మిగుల(దపించి రూపవతి యను తన చెలిని మన్నారుయొద్దకు రాయబారమంపెను. మన్నారైన రాజగోపాలస్వామి యామెను స్వయంవరమున( బెండ్లియాడెదనని మాటుపల్కెను. కాని వివాహము కాకపోవుటచే చెంగమలా రాజగోపాలులు విన్నదనముతో ఖిన్నమనస్కులైరి. తంజాపురాధీశు(డగు విజయరాఘవనాయకు(డు రాజగోపాలుని సేవకై వచ్చి యాత(డు ఖిన్ను(డగుట గనిపట్టి కారణ మడిగెను. రాజగోపాలు(డు తనకు, హేమాబ్జనాయికకు వివాహము చేయించ మని యాతనికోరెను. విజయరాఘవు(డప్పుడు సముద్రరాజు యొద్దకు వెడలి హేమాబ్జనాయికా, రాజగోపాలుల వివాహము నేర్పఱచి, వివాహము జరిపించి, వారి యనుగ్రహమునకు( బాత్రు(డయ్యెను. ఈ కథను మన్నారుదేవు(డు బహురసవంతముగా సంతరించియున్నా(డు.

మన్నారుదేవుఁడు వైష్ణవభక్తియందు, పితృభక్తిభాగధేయమునందు తండ్రి తాతలతో సమానుఁడని చెప్పఁదగును.

కవితారచనయు కమ్మెచ్చుతీగతీసినట్లుండును. ఈగ్రంథమున కొన్నిచోట్ల తన తండ్రి రచించిన విప్రనారాయణ చరిత్రను ననుసరించి యున్నాఁడు. మచ్చునకొకటి యుదాహరింతును.

## రాజగోపాల సభావర్ణన

**విప్రనారాయణ చరిత్ర**

"ఆవేళ చోళభూపాలతిలకంబు సంగీతభంగితాంతరంగుండై యంగనామణులం గనుంగొని సరసవిలాస వాఙ్మాధురీ మంజరీధౌరంధర ధురీణుండై,

ఒక్క జక్కవగుబ్బెతకు పుక్కిటి విడెమొసంగి, కెంగేలనొక్క శృంగారవతికి కేలు జడగీలించి, బోటవ్రేల నొక్క కుటిలకుంతల నీవీబంధంబు జాఱమీటి, ఒక్కబిబ్బోకవతి నిబ్బరంపు గబ్బిగుబ్బలుబ్బరంబుగా ఘనతరనఖరేఖలఁ జీఱి, యొక్క యంబుజనయన మధుమధురస మధురాధర సుధారసధారలఁ గ్రోలి, ఒక్క పంకజాక్షి బింకంపుఁ జాలిండ్లు సంకుమదకుంకుమ పంకంబున నలంది, ఒక్కరంభోరువు పరిరంభణం బొనర్చి, ఒక్క కుంకుమగంధి నంకంబుననుంచి యుచితంబుగాఁ గొలువై యున్న యవసరంబున"

**హేమాబ్జనాయికాస్వయంవరము**

"ఈదారి రాజగోపాలశౌరి చెలువుబొంగార కొలువుసింగారమై పదాఱు వన్నె బంగారు కొలువుకూటంబునకు వచ్చి యందు చెన్నొందువినూత్న నవరత్నసింహాసనంబుచేరి చెలువుమీఱి సుభువు పట్టుగద్దియపైఁ గూర్చుండి యిరుగడల పదియాఱువేవురు చెలువలు గొలువ,

ఒక్క చక్కనికొమ్మను చక్కెరమాటలఁ దేలింపుచు, నొక్క జక్కవగుబ్బెతకు పుక్కిటివిడెము చాలింపుచు, నొకముద్దుల గుమ్మ సుద్దులకు సొక్కుచు, నొక యిందుముఖిమోవివిందుకై వ్రొక్కుచు, నొక్కమిటారి చెక్కిలిగోరఁజీఱుచు, నొక్కజవ్వనితో నవ్వుచుఁ జేరఁజేయుచు నిత్తెఱంగున శృంగారలీలలఁ దేలుచున్న బంగారుమన్నారు తన చెంగటనున్న యొకయంగననుఁ జూచి యేమనుచున్నాఁడు."

పై సంవాదమునుఁ జూచిన మన్నారుదేవుఁడు విప్రనారాయణ చరిత్రము ననుసరించియు, నందు నౌచితినిమీఱిన కొన్ని వాక్యములను పరిహరించె

ననియు స్పష్టమగుచున్నది. ఇది మన్నారుదేవుని లోకజ్ఞతను, సరసత్వ మును వెల్లడి చేయుచున్నవి.

గ్రంథమధ్యమునుండి నొక ముఖ్యభాగము నుదాహరించు చున్నాను :

పదం – పంతువరాళి – ఆది

తలిరుబోణి! [illegible]
చెలువుమీఱినయట్టి చెలువమన్నఁడితఁడే
తెలఁదిరో! పదియాఱు వేవురు జవ్వనుల
వలపించిచేకొన్న వన్నెకాఁడేయితఁడు
కనకాంగి! విజయరాఘవునింట వెలయుచు
దినదినము పూజలందు దేవుఁడే యితఁడు.
... ... ... ...... ... ... ...

“ఈరీతిం జేరి యప్పుడా కప్పురగంధి యప్పురంబున విజయరాఘవ పట్టభద్రుండు కట్టించిన గుజరాతికెంపు చెక్కడంపుపనుల మిటారించు నతిదిర్ఘ్రారంబులగు గోపురప్రాకారంబులు, శ్రీవైష్ణవపుంగవ గేహంబులు, శృంగార వనసమూహంబులు, హరిద్రానదిమొదలు పొదలు ననేక తటాకంబులు హాటకమయంబులైన మంటపానీకంబులు నాలోకింపుచు సొంపునంది యా సంపంగి మన్నారునగరి వాకిలిం జేరి యామిటారి యచ్చట నున్న యవసరంపు మచ్చెకంటినిం జూచి మందరధరుని సమయంబు దెలుపుమని మందలింప నాకాంత లప్పుడే కాంతసమయమని పరిహరింప ......అనిన విని యా చిగురుబోణి నగధరుని నగరు ప్రవేశించి యచ్చట హెచ్చులగు పచ్చల గచ్చులనిచ్చలంబులగు శాతకుంభ స్తంభ సహస్రం బుల మించు విజయరాఘవభూపాల మంటపరాజంబు చేరువ......... రాయసంపు చెలువ చదివే పద్యం. స్వయంవరాహ్వానము కమ్మవక్కాణ.’

సీ. శ్రీమన్మహాగుణస్తోమ సంపన్నుఁడై
భానిల్లు రాజగోపాలశౌరి
పాదంబులకు మ్రొక్కి పాలకడలిరాజు
నేఁడు సేయంగల విన్నపంబు

[1]సౌమ్యసంవత్సర చైత్రశుద్ధాష్టమి
మాపట్టియగు చంగమలు స్వయంవ
రోత్సవంబొనరింప నుద్యుక్తులైనాము
తామిటవిచ్చేసి యీమహోత్స
గీ. వంబునెఱవేర్పఁగావలె స్వామి సమ్ము
ఖానకును నారదుని వెంట మా నియోగి
నంచితిమి వారిపల్కులాలించి మీరు
వేగనిటు సాగి రాఁగ నీవిన్నపంబు.

ఈ యాహ్వానమునకు రాజగోపాలస్వామి చాలసంతోషించి విజయరాఘవనాయకునితో నిట్లనియె.

క. రారమ్మ విజయరాఘవ !
ధారణి నీవంటి ముద్దుతనయులు గలుగన్
సారెకు మామదిలోఁగల
కోరిక లొనగూడుటరుదె ? గుణ రత్ననిధీ !

ఆ వెనుక రాజగోపాలరక్తాబ్జనాయికల వివాహము వర్ణితమైనది. రంగాజమ్మ మన్నారుదాసవిలాసనాటకమువలె నిందును, పురోహితుల మాటలు, ముత్తయిదువుల మాటలు, వాడుక భాషలో రచితములైనవి. సువ్వాల, ధవళము, శోభనము మొదలగు దేశీయగేయములే కాక, చూర్ణిక, మంగళశ్లోకపంచకమును గలవు.

హేమాబ్జనాయికా రాజగోపాల వివాహానంతరమున, రాజగోపాలుఁడిట్లు విజయరాఘవుని ప్రశంసించెను:

గీ. విజయరాఘవ ! వత్స ! యీపెండ్లినీవు
సంఘటింపంగ మామది చల్లనయ్యె
ప్రబలి సర్వంసహారాజ భాగ్యములను
ధరణివర్ధిల్లు మాచంద్రతారకముగ.

## భరతవాక్యము

ఇవ్విధంబునఁ జినచెవ్వయాచ్యుతాధిపప్రపౌత్రుండును, రఘునాథజననాథ పౌత్రుండును, విజయరాఘవభూపాలక ప్రియపుత్రుండును,

1. పైవక్కణయందు జెప్పఁబడిన సౌమ్యసంవత్సరము క్రీ. శ. 1664 తో సరిపోవుచున్నది గావున నది యే గ్రంథ రచనా కాలము.

...పాలాంబికా గర్భకలశజలధి కువలయమిత్రుండును, అతులకనక ...ప్రముఖనిఖిల మహాదాన దీక్షాధురీణుండును, అనేకాగ్రహారప్రతి ...ప్రవీణుండును, విజయరాఘవాభ్యుదయాది ప్రబంధనిబంధన ...శేయుండును, అతులిత పితృభక్తి గురుభక్తి భాగధేయుండును, ...ను భావుండునగు మన్నారుదేవుండు భువనస్తవనీయంబుగా ...బిన హేమాబ్జనాయికా స్వయంవరంబను నాటకంబునకు కథా ...లగు రక్తాబ్జనాయికా రాజగోపాలకులు తమప్రియపుత్రుండై ధాత్రి ...ను చాలవర్ధిల్లుచున్న విజయరాఘవ భూపాలునకు సర్వసర్వంస ...నిత్యాయురారోగ్య భాగ్యంబులుపాలించి రక్షింతురుగాత.”

...పితృభక్తి పరాయణుని తండ్రియగు విజయరాఘవనాయ ...పాలయం దుంచెననియు నా చెఱసాలయందే మన్నారు ... హేమాబ్జనాయికాస్వయంవరమును రచించెననియు నైతిహ్య ...గాథలు తెలుపుచున్నది. మన్నారుదేవుని కారాగారబద్ధుని ...గల కారణ మీ క్రింది వృత్తాంతమట.

“...మంత్రియగు గోవిందదీక్షితులయొక్క కుమార్తెలలో నొక తెను ...దేవుండు ప్రేమించెను. ఈ విషయమును గోవిందదీక్షితుండు ...రాఘవుని దృష్టికి తేగా నాతఁడు కోపోద్రిక్తుండై మన్నారుదేవుని ...బంధించెను.”[1] ఇదియంతయు కల్పితమే. ఏలననఁగా గోవింద ... విజయరాఘవుని తండ్రియగు రఘునాథనాయకుని కాలమున ...యం దున్నవారు. కావున నిది పొసగదు. ఇక నిట్టి వృత్తాంత ...యుండిన నది విజయరాఘవనాయకుని కులగురువైన శ్రీనివాస ...ర్యులవారి తనయయై యుండునని యూహింపఁదగియున్నది - ... కేవలమూహామే. ఒకవేళ నిట్టిది జరిగియున్నను విజయరాఘవుని

1. మా. హేమాబ్జనాయికా స్వయంవరము పీఠిక, పుట. 11. పీఠికాకర్త: ...శ్రీ సుందరశర్మగారు. పీఠికాకర్త యభిప్రాయముతో గ్రంథకర్త సంపూర్ణ ...ఏకీభవించుచున్నాఁడు. ఈ గ్రంథము క్రీ. శ. 1956 లో తంజావూరి సరస్వతీ ... లైబ్రరీ వారిచే ప్రకటితమైనది.

వంటి రసికశిఖామణి, యింత కఠినశిక్ష విధించుట యన్నదికూడ యనుమానాస్పదము. మన్నారుదేవుఁడు చెఱనుండి విముక్తుఁడుకాఁగానే, తండ్రినిఁ జూచి యీ క్రిందివిధమునఁ బల్కెనట:

క. మణిక్రిందుపఱచి జలనిధి
తృణమున్ బైనుంచె నతనిదేకొఱవ సుమీ!
మణిమణియె తృణము తృణమే
రణవిజయదిలీప! విజయరాఘవభూపా!

పై పద్యమును వినగానే విద్వద్వతంసుఁడగు విజయరాఘవనాయకుఁడు పుత్రునిఁ గౌఁగలించుకొని యానందబాష్పములతో నభిషేకించెనఁట. పై పద్యము తెలుఁగునాట చాలఁగా వ్యాప్తిలోనుండుటచే, మన్నారుదేవుని కారాగారవృత్తాంత మెంతవఱకు సత్యమో నిర్ణయింపఁ జాలము. మన్నారుదేవుని కారాగార నివాసమునకు, రాజకీయ సంబంధమైన దేదో ప్రబలకారణ ముండియుండునని యూహించుటయే సమంజసమైయున్నది.

పితృవాక్యపరిపాలనా ధురంధరుఁడగు మన్నారుదేవుఁడు తండ్రియగు విజయరాఘవనాయకునితో గలిసి మధురనాయకుఁడగు ముద్దళగిరితోఁ బోరాడి క్రీ. శ. 1674లో వీరస్వర్గముఁగాంచెను. మన్నారుదేవుని మరణముతో తంజావూరి నాయకరాజులపాలన మంతమొందినది. ఆవెనుక మహారాష్ట్రరాజులపాలన ప్రారంభమైనది. తంజావూరి సారస్వతచరిత్రమున మహారాష్ట్రరాజుల పాలన ద్వితీయఘట్టము.

---

# తంజావూరి మహారాష్ట్ర రాజయుగము

నాయక రాజుల వెనుకఁ దంజావూరును మహారాష్ట్రులు పరిపాలించిరి. క్రీ. శ. 1674 మొదలు క్రీ. శ. 1857 వఱకును వీరి పరిపాలనాకాలమని చెప్పనొప్పును. ఈ రాజులును తమకుముందు పాలకులైన నాయక రాజుల ననుసరించి, సంస్కృతాంధ్రభాషలఁ బోషించి, కృతికర్తలై, కృతిభర్తలై యాంధ్రవాఙ్మయమున నాచంద్రార్కమగు యశస్సునందిరి. వారి మాతృభాష మహారాష్ట్రము, పాలించిన దేశము శుద్ధద్రవిడదేశము, ప్రజల భాష తమిళము - అయినను వారు సంస్కృతాంధ్రభాషల యందత్యంతాభిమానము వహించి యా భాషల ద్రావిడదేశమునఁ జిరస్థాయులఁ గావించిరి. అట్టి మహారాష్ట్ర ప్రభువు లాంధ్రుల కృతజ్ఞతకు నెల్లప్పుడుఁ బాత్రులు. అట్టి రాజన్యులకాలమున వెలసిన కవులఁగూర్చియు గ్రంథములఁ గూర్చియు నాంధ్రలోకమున కెఱిఁగించుచున్నాను.

ఆ యా రాజుల కాలమున వెలసిన కవులఁగూర్చియు, గ్రంథములఁ గూర్చియు, సుగమముగఁ దెలిసికొనుటకై మొదటఁ దంజావూరు మహారాష్ట్రరాజుల వంశవృక్షము నీక్రింద నిచ్చుచున్నాఁడను.[1]




1. ఈ వంశవృక్షమును నేను మొదట తయారుచేసి క్రీ శ. 1934-35 మధ్య "చంద్రిక" అను పత్రికలోఁ బ్రకటించితిని. ప్రస్తుత మా పత్రిక ప్రచారమున లేదు.

వివరణము :—




(సర్వస్వామ్యములు గ్రంథకర్తవి)

## మొదటి ఏకోజీ (1676-1683)

తంజావూరును పరిపాలించిన మొదటిరాజన్యుఁడేకోజీ. ఈతఁడు మహారాష్ట్రరాజ్య సంస్థాపకుఁడగు శ్రీ శివాజీ చక్రవర్తికి సవతితమ్ముఁడు

---

(1) తంజావూరు మహారాష్ట్రరాజుల వంశముఁ గూర్చిన వివరములు తెలుఁగున నీ గ్రంథములవలనఁ దెలియనగును:

(1) నెల్లూరి శివరామకవి–కామకళానిధి (2) ఏకోజీ–ద్విపద రామాయణము (3) మాతృభూతకవి–పారిజాతాపహరణము (4) శివాజీ మహారాజు–అన్నపూర్ణా పరిణయము. వీనిలోఁ గామకళానిధి తక్కఁ దక్కినవి యముద్రితములు. ఇవియే గాక గంగాధరుని భోసలవంశావళి, శ్రీధర వేంకటేశార్యుని శాహేంద్రవిలాసము, శేషాచలపతి - కోసలభోసలీయమునను, సంస్కృత గ్రంథములయందును, The Maratah Rajahs of Tanjore అను నాంగ్లేయ గ్రంథమునందును గలవు. వీనిలో నేను వ్రాసినరీతి వంశవృక్ష మెచ్చటను వ్రాయఁబడలేదు. ఆ గ్రంథములయందలి విషయములు విమర్శించి నేనీ వంశవృక్షముఁ దయారుచేసితిని.

(2) ఒక పేరుగల రాజు లిద్దఱుండుటచే వారిపేర్ల కెదురుగ నొకటి రెండను నంకెలు వేయఁబడినవి.

(3) మొదటి తులజాజీని తుక్కోజీయని పిలుతురు.

(4) హరిశ్చంద్ర జయసింహులు రాజ్యమును బరిపాలింపకపోవుటచే వారి రాజ్యకాల పరిమితి తెలుపలేదు ; ఇందు జయసింహుఁడే 'కామకళానిధి' కృతిభర్త.

ఈతఁడు తంజావూరున మహారాష్ట్ర రాజ్యమును స్థిరముగ నెలకొల్పి నాఁడు. ఈతఁడు తెలుగున ద్విపద రామాయణమును రచియించినట్లు ప్రొఫెసరు సుబ్రహ్మణ్యముగారు తమ తంజావూరు మహారాష్ట్రరాజుల చరిత్రమున వ్రాసినారు. [1]ఇచ్చట ప్రొఫెసరుగారు పొరపాటు పడినారు. ఏకోజీ వ్రాసిన ద్విపద రామాయణావతారికను బట్టిచూడ నితఁడు తులజాజీ (లేక) తుక్కోజీ కుమారుఁడని స్పష్టముగఁ దెలియుచున్నది. కావున నితఁడు శ్రీ శివాజీ చక్రవర్తి సోదరుఁడగు నీ యేకోజీ కాఁజాలఁడు. ద్విపద రామాయణమునందలి గద్యను జూచిన నీ విషయము స్పష్టము కాగలదు.

“ అని భోసలాబ్ధిసుధాంశుఁ డుత్తముఁడు
ధననాథతుల్యుఁ డుదార విక్రముఁడు
సరససాహిత్య లక్షణ చక్రవర్తి
కరుణాసముద్రుండు కవికల్పకంబు
విలసిల్లు తుళజభూవిభు కుమారకుఁడు.

పాలుపొందు యేకోజి భూమిపాలకుఁడు
తనతండ్రి తుళజేంద్ర ధరణీశు పేర
పెనుపొందుమకరాంక బిరుదాంకు పేర
రమణీయమైన యీ రామాయణమున
కమనీయ సుందర కాండంబుఁజెప్పె.”

దీనింబట్టి యీ యేకోజీ క్రీ. శ. 1736 సంవత్సరమునఁ దంజావూరును బరిపాలించిన రెండవ యేకోజీ గాని క్రీ శ. 1680 సంవత్సర ప్రాంతమున నున్న మొదటి యేకోజీకాఁడు. కాని యీ సందర్భమునఁ దంజావూరు తెలుఁగుగ్రంథముల సూచికఁ బ్రకటించినవారు కూడ మొదటి యేకోజీయే యీ రామాయణగ్రంథకర్తయని వ్రాయుట మఱియు వింతగ

1. Ekoji himself is said to have composed in Telugu a Dwipada Ramayana and several other works in Telugu were written in his reign (Page 22. The Maratha Rajas of Tanjore, 1928)

నున్నది. గ్రంథసూచికఁ దయారుగావించినవారే రామాయణ గ్రంథావ తారికయందుఁ గల రాజుల నామములను నధోరేఖాంకితములు గావించియే యున్నను గ్రంథ ప్రకాశకు లాంగ్లేయభాషలో నిది మొదటి యేకోజీ వ్రాసినట్లు వ్రాసిరి.[1]

ఈ మొదటి యేకోజీ స్వయముగ గ్రంథకర్త గాకపోయినను గవి పండిత పోషకుఁడై యుండెనని మన మూహింపవచ్చును.

## శహాజీ (లేక) శహామహారాజు (1684 - 1712)

ఏకోజీతరువాత నాతని కుమారులు ముగ్గురును గ్రమముగా రాజ్యమును బాలించిరి. వారిలోఁ దొలివాఁడు శహాజీ. ఈ రాజచంద్రుని కాలము తంజావూరు మహారాష్ట్రరాజ్య భాషా వాఙ్మయ చరిత్రమున సువర్ణయుగమని చెప్పఁదగినది. సంస్కృతాంధ్రము లందేమి, ద్రావిడ భాషయందేమి లెక్కలేనన్ని కృతు లీ రాజేంద్రునికాలమున వెలసినవి. కృతికర్తయై, కృతిభర్తయై, యపరభోజుఁడై విరాజిల్లిన శాహాజీరాజేంద్రుఁడు, శ్రీకృష్ణదేవరాయ, రఘునాథరాయాదులవలె నాంధ్రులకుఁ జిరస్మరణీయుఁడు.

## సంస్కృత వాఙ్మయము

సంస్కృతవాఙ్మయము శహాజీకాలమున విశేషముగా నభివృద్ధి నందినది. శహాజీ సంస్కృతమున శబ్దరత్నసమన్వయము శబ్దార్థ సంగ్రహామునను రెండు నిఘంటువులు రచియించినాఁడు, ఇంతియకాక క్రీ. శ. 1693 లో తిరువశనల్లూరు (Tiruvasanallur) అను గ్రామమునకు శహాజీ రాజపుర మను నామకరణముఁ గావించి దానిని నలువదియారుగురు విద్వాంసులకు ధారాపూర్వకముగ నొసఁగెను. అందలి విద్వాంసు లందఱును సుప్రసిద్ధులే. వారిలోఁ గొందఱఁగూర్చి యిందు వివరించుచున్నాఁడను.

---

1. A Descriptive Catalogue of Telugu Manuscripts in the Tanjore Maharaja Serfoji's Saraswathi Mahal Library (Pages 122, 123)

1. రామభద్రదీక్షితుఁడు—శహాజీ రాజపుర విద్వన్మండలికి భూషణప్రాయుఁడు. అభినవపతంజలి బిరుదాంకుఁడు. అప్పయదీక్షితుని మనుమఁడగు నీలకంఠ దీక్షితుఁడును, చొక్కనాథ దీక్షితుఁడను బాల కృష్ణ భగవత్పాదుఁడును నీ విద్వద్వరేణ్యుని గురువులు. పతంజలి చరిత్రము, జానకీపరిణయము, శృంగారతిలకభాణము. పరిభాషావృత్తి వ్యాఖ్య, షడ్దర్శనసిద్ధాంతసంగ్రహవ్యాఖ్య మున్నగునవి యీతని కృతులు[1].

2. శ్రీధర వేంకటేశార్యుఁడు— ఈతనికి ఆయ్యావాళ్ అను నామాంతరము. దాక్షిణాత్య మండలముల నేఁటికిని మహావిద్వాంసుఁడుగా బూజింపఁబడుచున్నాఁడు. ఈతని స్తుతిగ్రంథములు పదునాలుగు ముద్రితమైనవి[2]. ఈతఁడు శహాజీ రాజపురాగ్రహార ప్రతిగ్రహీతలలో నొకఁడు. శహాజీరాజుపేర శహేంద్ర విలాసకావ్యమును రచియించియున్నాఁడు. ఇది యెనిమిది సర్గల కావ్యము. శహాజీ జీవితముఁ దెల్పును. ఇది యముద్రితము. ఈ వేంకటేశార్యునిఁగూర్చి శృంగారరాధామాధవ సంవాద పీఠికయందు గలదు.[3]

3. భాస్కరదీక్షితుఁడు — వేదాంత గ్రంథమగు సిద్ధాంత సిద్ధాంజనమునకు రత్నమాలిక యను వ్యాఖ్యానము వ్రాసిన విద్వాంసుఁడు. ఈ సిద్ధాంత సిద్ధాంజనమాతని శిష్యుఁడగు కృష్ణానంద సరస్వతిచే రచి

---

1. రామభద్ర దీక్షితునిఁగూర్చి వివరములు తెలియఁగోరినవారు Indian Antiquary అను పత్రికయందు 33 సంపుటముఁ జూడఁదగును.

ఈతని జానకీ పరిణయ నాటకమును తెలుఁగున శ్రీ పాలెపు వేంకటసూర్యగోపాలముగారు గద్య పద్యాత్మకముగాను, శ్రీ నడుపల్లి వీరరాజుగారు, "విభ్రమతరంగిణి" అను పేర వచనముగను వ్రాసిరి.

2. దయాశతకము మున్నగునవి శ్రీరంగము వాణీవిలాస ముద్రాలయమున ముద్రితములు.

3. శృంగార రాధామాధవము: పీఠిక 3-4 పుటలు (శృంగార గ్రంథమాలా ప్రకటితము ౧.)

యింపఁబడినది. తన శిష్యుఁడు వ్రాసిన గ్రంథమునకు వ్యాఖ్యవ్రాసి వ్యాప్తికిఁ దెచ్చిన గురు వీతఁడు. ఈతఁడు లలితాసహస్రనామావళీ వ్యాఖ్యాత.

4. పెరియప్పకవి—— ఈతఁడు శృంగారమంజరీ శాహాజీయమను నాటకమును శహాజీ జీవితమును జిత్రించుచు వ్రాసినాఁడు. ఈతఁడు పైని వివరించిన కృష్ణానంద సరస్వతి శిష్యుఁడు. ఈతని పాండిత్యమునకు మెచ్చి కృష్ణానందయతి యీతనికిఁ గవితార్కిక సార్వభౌముఁడని బిరుద మిచ్చెనట. విశ్వనాథార్యదీక్షితుఁడును వైనతేయ సూరియు నీతని యన్నదమ్ములు. విశ్వనాథుఁడు సిద్ధాంతసిద్ధాంజనముపై వ్యాఖ్య రచియించెనఁట. ఈతనితండ్రి యన్నశాస్త్రి వేంకటపతిరాయల సభయందుఁ గామదేవకవిని జయించి యీతనివలన బంగరుపల్లకిని ఏరాకరమను గ్రామమును బహుమానముగా గొనెనఁట.

5. వేదకవి——ఈతఁడు విద్యాపరిణయము జీవానందమునను నంతరార్థ కథా సమన్వితములగు రెండునాటకముల రచియించినాఁడు[1]. ఇవి రెండు వేదాంతవిషయములఁ బ్రతిపాదించుచుఁ బ్రబోధచంద్రోదయమును బోలియుండును. విద్యాపరిణయ మీతని పోషకుఁడగు నానంద రాయమఖి కృతిగాఁ గానవచ్చుటచే నీతఁడీ నాటకము రచించి తన పోషకుని కారోపించెనని విజ్ఞులు తలంచుచున్నారు.

6. మహాదేవకవి——ఈతఁడద్భుతదర్పణమును ప్రబోధచంద్రోదయము మాదిరిని రచియించియున్నాఁడు. ఇది కావ్యమాలయందు ముద్రితము. ఈతఁడు శుకసందేశమను నొక సందేశకావ్యమును రచియించినాఁడు[2].

---

1. Triennial Catalogue of Manuscripts. Oriental Manuscripts Library 'Madars' Vol. II Part I. Sanskrit (Pages 2575-2577).

2. సంస్కృత దూతకావ్యోత్పత్తి వికాసములు - శ్రీమాన్ యీ యాజ్ఞి వీర రాఘవాచార్యులవారు, ఎమ్. ఏ. ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక. 18-వ సంపుటము 5 - 6 సంచికలు.

7. వీరరాఘవకవి—ఈతఁడు వల్లీపరిణయము, రామరాజ్యాభిషేక నాటకము, పార్వతీస్తోత్రములను రచియించినాఁడు. ఈశ్వరునికిఁ గామాక్షికిఁ బుత్త్రుఁడు. కౌండిన్యగోత్రుఁడు.

8. నల్లదీక్షితుఁడు—ఈతనికి భూమినాథకవి యని నామాంతరము. ఈతఁడు రామభద్రదీక్షితుని శిష్యుఁడును బంధువునై ప్రఖ్యాతిగాంచినవాఁడు. ఈతఁడు సుభద్రాపరిణయమను నాటకమును ధర్మవిజయమను నాలుగు స్తబకముల చంపూకావ్యమును రచియించెను. ఇందు రెండవది [illegible] చరిత్రమును దెల్పు కావ్యము. ఈకవి శహాజీని నభినవ భోజునిగాఁ జెప్పియున్నాడు.

“[illegible]జరాజ శహామహీమహేంద్ర సుందరముఖ చంద్ర సందర్శన మహిమ సాంద్రీకృతవాగ్విలాసస్య, రామభద్రాద్రివరప్రియ శిష్యస్య, తదీయవంశజన్మనో భూమినాథవిద్వత్కవేఃకృతౌ ధర్మవిజయే చతుర్థ స్తబకః”

ఇట్టి ప్రసిద్ధ సంస్కృత పండితకవులు శహాజీరాజు పురమందున్నవారు గాక శహాజీ యాస్థానమును నలంకరించినవా రెందఱేని గలరు. శహాజీ మంత్రియగు త్రియంబకరాయమఖి మొదటి యేకోజీ మంత్రియగు గంగాధరమఖి తనయుఁడు. ఏకోజీ త్రియంబకరాయమఖిని దన కాలము నందే తన కొమరుఁడగు శహాజీకి మంత్రిగాఁ జేసెను. గంగాధరమఖి చెంగల్పట్టుమండలమునందలి తిరువలంగాడు గ్రామవాస్తవ్యుఁడయ్యు మహారాష్ట్ర రాజుల కోరికపై తంజావూరు నివాసముగా నేర్పరచుకొనెను. గంగాధరమఖి యప్పయదీక్షితుని వంశమువాఁడు. అప్పయదీక్షితుని కువలయానందమునకు రసికరంజనివ్యాఖ్యవ్రాసి గ్రంథావతారికయందు భోసల వంశావళి యనుపేర మహారాష్ట్రరాజుల వంశచరిత్రము వర్ణించినాఁడు, గంగాధరమఖికి ముగ్గురు కొడుకులు. ముగ్వురును గ్రంథకర్తలు, విద్వాంసులు, రాజకార్యనిపుణులు, అందు తొలివాఁడు —

1. నరసింహరాయమఖి :— ఈతఁడు తండ్రి వెనుక సేకోజీకి మంత్రిగానుండెను. ఈతఁడు త్రిపురవిజయచంపువును రచియించెను.

2. త్రియంబకరాయమఖి :— ఈతఁడు శహాజీయొద్దను, శహాజీ వెనుక రాజ్యమును బరిపాలించిన మొదటి శరభోజీవద్ద మంత్రిగా వ్యవహరించినవాఁడు. రామాయణమునకు ధర్మాకూతమను వ్యాఖ్యానమును, స్త్రీధర్మమును రచియించినవాఁడు. ఈతఁడు శహాజీ ప్రోత్సాహముచే క్రీ. శ. 1696 సంవత్సరమున కుంభకోణముయొద్ద స్వామిమలయందు బ్రహ్మాండమగు యజ్ఞముఁ గావించినాఁడట. ఆ విషయము గ్రంథస్థమై యున్నది.

3. భగవంతార్యమఖి :– ఈతఁడు తన యన్నగారివెనుక మొదటి శరభోజీయొద్ద సచివస్థాన మలంకరించినవాఁడు. రాఘవాభ్యుదయ నాటకము, ముకుందవిలాసకావ్యము, ఉత్తరచంపువు నీతనికృతులు.

వీరిలోఁ దొలివాఁడగు నరసింహరాయమఖి తనయుఁ డానందరాయమఖి గూడ మిగుల బ్రఖ్యాతిఁగాంచిన మంత్రిసత్తముఁడు. ఈతఁడును శహాజీయొద్దను మొదటి శరభోజీయొద్దను మంత్రిగానుండెను. ఈతఁ డాశ్వలాయన గృహ్య సూత్రవ్యాఖ్యను రచియించెను. వేదకవిఁగూర్చి వ్రాయునపుడు విద్యాపరిణయనాటకము నానందరాయమఖి కారోపింపఁబడినదని తెలిపియున్నాను, ఇట్లే అప్పాధ్వరి విరచితమైన యాచారనవనీతమను పెద్ద ధర్మశాస్త్ర గ్రంథముగూడ నానందరాయమఖి [illegible]రని చెప్పుచున్నారు. ఆనందరాయమఖి మంత్రియై, విద్వాంసుఁడై యుండుటచే నాతని యనుగ్రహమును నాతనిద్వారా రాజానుగ్రహమును సంధించుట కా కవులిట్లు చేసియుందురని యూహ పొడముచున్నది. వీనిలో విద్యాపరిణయము నిశ్చయముగ నానందరాయమఖి కృతియనియు, నాచారనవనీత మప్పాధ్వరి విరచితమనియు నీమధ్య నొక విద్వాంసుఁడు వ్రాసియున్నాఁడు. [1]వీరుగాక కోసల భోసలీయమును శహాజీపేర రచిం

1. Journal of Oriental Research Vol. III Part I (1929) Pages 68 – 73-v. A. Ramaswami Sastri, B. A. (Honours).

చిన శేషాచలకవి[1]యు, శహారాజాష్టపది వి రచించిన శ్రీనివాసకవియు, నటేశవిజయమును రచియించిన వేంకటకృష్ణకవియు శహాజీరాజీయము, శహారాజసభాసరోవర్ణన రచియించిన లక్ష్మణకవియు, సుమతీంద్రజయ ఘోషను రచియించిన సుమతీంద్రుఁడును, శహారా[illegible]క్షేత్రమాలను రచియించిన నారాయణుఁడును నీ రాజచంద్రు నాస్థానము నలంకరించిన విద్వత్కవులు.

## ఆంధ్రవాఙ్మయము

శహాజీమహారాజు పరిపాలనకాలమున నాంధ్రభాషావృద్ధి మనకు విస్మయముగలిగించును. ఈ విద్వత్ప్రభువు రచియించిన యాంధ్ర గ్రంథములను బోషించిన యాంధ్రకవులను మన మెఱిఁగితిమేని యీతఁ డాంధ్ర భాషాపోషణకే కేవలము జన్మించినట్లు తలంపవలసియున్నది. మఱియు నీ మహారాజుకాలము తెలుఁగునాటక వాఙ్మయ పరిణామమును దెలిసికొనుటకు నెంతయేని తోడ్పడుచున్నది.

## ఈతని కృతులు

### 1. కిరాత విలాసము

ఇది. "జయపార్వతీరమణ, [illegible], జయ అంతకదమన, జయమధుసూదనా, [illegible]హారణ, జయ వేదోద్ధరణ, జయ అఖిలనుతచరణ, జయ జనాభరణ." అను శివస్తవముతో ప్రారంభమగుచున్నది. ఈ క్రింది సూత్రధార వచనమువలన నిందలి సందర్భము తెలియవచ్చును.

సూ. ఈ విధంబున సకలదేవతాప్రార్థనంచేసిన యాతదనంతరం శ్రీశాహమహారాజప్రణీతంబైన కిరాతవిలాసంబనెడు నాటకంబునందు తొలుత కథాక్రమం వినిపించేమార్గం.

---

1. ఈతఁడే నివృత్తి శేషాచలకవి. శేషసుమతి యని నామాంతరము. ఈతఁడు కామకళానిధి కృతికర్తయగు నెల్లూరి శివరామకవికి గురువు. వివరములు ముందుగలవు

ద్వి. శ్రీసదాశివుఁడు రాజితగిరీశుండు,
భాసిల్లుచున్న యీ పార్వతితోడ
పన్నిద మొనరించి పగడసాలాడి,
విన్నైన చెంచుల వేషంబుఁబూని
వెడలెరుద్రాణి యీవిధముపహించి,
పుడమిని చరియించి భూతేశుఁజూడ
సరసంబులను కొంత సయ్యాటములను,
ఇరువురుగావించి యేకమకాటయును
అనుకతలనుజాలనమరుకిరాత
ఘనవిలాసము శాహఘనుఁడుగావించె
సరససత్కవివరుల్ సన్నుతిసేయ,
ధరణిలోనాచంద్ర తారార్కముగను.

సూ. ఈవిధంబున కథాసంవిధానంబుండు నాటకం వినిపించిన యీ తద నంతరంబున శ్రీశాహమహారాజ ప్రణీతంబునందు తొలుత వినా యక ప్రార్థనంశాయగా విఘ్నేశ్వరుండు వచ్చేమార్గం పరాకు .................

తుది :—సూ.వ. ఈ విధంబున పార్వతిపరమేశ్వరు కూడియుండు సమ యంబున నారద కిన్నర కింపురుషులు మంగళంపాడేమార్గం. మాయాకిరాతహరునికి మంగళం. నిత్యం మాయాకిరాత దేవికి మంగళం అమరవందితుని.....శాహమహారాజ దేవునికి మంగళం.[1]

## 2. కృష్ణలీలా విలాసము

ఇది :- జయ దేవకీపుత్ర, జయదివ్యనుతపాత్ర, జయకృష్ణసుచరిత్ర, జయజగ న్మిత్ర, జయశుభావహగాత్ర, జయజగత్కృతి సూత్ర, జయ భాను శశినేత్ర, జయజితామిత్ర, జయజయా, అను కృష్ణస్తుతితో ప్రారం భము – కథాసందర్భము తుది వచనమువలనఁ దెలియును.

---

1. దీనికి 501 (M. 616) మొదలు 504 వఱకును నాలుగు ప్రతులు కలవు.

సూ. వ. అవురా యీ విధంబున అభీష్ట దేవతావందనంబు గావించి సభా నాయకాదుల నభివర్ణించి యాతదనంతరంబున శ్రీశాహమహారాజ ప్రణీతంబైన కృష్ణలీలావిలాసంబు కథాక్రమంబుగా వినుపించేము విన నాదరింపవయ్యా.

తుది వ. అవురా యీ విధంబున యా కన్యవచ్చిన యా తదనంతరంబున సుముహూర్తమందు కృష్ణునికి సత్యభామకు వివాహంసేయు సమ యంబున నారదకిన్నర కింపురుషులు మంగళంపాడే మార్గం పరాకు.

శోభనగేయము

మందరధరునికి మాధవునికి నందకుమారునికి నరహరికి పొందుగా సత్యభామను పెండ్లాడిన గోవిందునికి యశోదనందనునికి శోభానమే, శోభనమే.

గద్య. ఇది శ్రీమద్భోసలకుల శాహమహారాజ విరచితం శ్రీకృష్ణలీలా విలాసనాటకం సకలవిద్వజ్జన ప్రీతయే సకలశ్రేయసే శ్రీత్యాగేశ సాంబశివ పూర్ణానందార్పణమస్తు :[1]

ఈ కృష్ణలీలా విలాసనాటకమునకు ముందుదాహరించిన నాలుగు ప్రతులుగాక, మఱి యైదుప్రతులున్నట్లు తెలియుచున్నది.[2] కాఁబట్టి యీ నాటకమునకు తొమ్మిది ప్రతులున్నవి. సం. 506 గల ప్రతిలో మాత్రము, ముందుదాహరించినట్టి

“ఇతి శ్రీ మద్భోసలకుల శాహమహారాజ విరచితం శ్రీకృష్ణలీలా విలాసనాటకం, సకలవిద్వజ్జన ప్రీతయే, సకలశ్రేయసే శ్రీ త్యాగేశ సాంబశివ పూర్ణానందార్పణమస్తు” అను గద్యయున్నది. గాని తక్కిన ప్రతులలో దేనియందును లేదు.

---

1. 505 (M. 17) 506 రెండుప్రతులు.

2. చూ. తంజావూరి సరస్వతీ మహాలు పుస్తక భాండాగారము. తెలుఁగు కేటలాగు, రెండవ సంపుటము. సంఖ్య 838 - 842.

తక్కినవానియందు, కథాసంగ్రహద్విపద, విఘ్నేశ్వర స్తుతి, శ్రీకృష్ణావతారము, ఆతని చిన్ననాటి లీలలు, ఆతని యౌవనప్రారంభము, సత్యభామపెండ్లి వర్ణితములైనవి. 842-వ సంఖ్య. గల ప్రతియందీ నాటకము సంపూర్ణముగా నున్నది. ఇందు సూత్రధారవచనములు, పురోహిత వచనములు, వాడుక భాషలో నున్నది. అవి యన్నియు పాత్రోచితములే.

తక్కిన రచనయంతయు శహాజీ నాటకరచనాక్రమము ననుసరించి యున్నవి.

ఈ నాటకకృతియందు శ్రీకృష్ణుని జననము – బాల్యక్రీడలు – సత్యభామా వివాహము వర్ణింపఁబడినవి. తొలుత కృష్ణస్తుతి, వెనుక శంకర స్తుతి, మహిషాసురమర్దనిస్తుతి దానివెనుక విఘ్నేశ్వరప్రార్థన యిట్లు గలదు.

" శ్లో. లంబోదర స్సర్వవిద్యాలంబోదర లసన్ముఖః
బంధురస్తుత్వనుగుణై బంధురస్తుభవన్ముదే."

ఈ స్తుతి వెనుక సరస్వతీస్తుతి :

" శ్లో. నృత్యాకారగతైః కరాబ్జవలనై స్తాళాయతఃకంకణః
ప్రక్వాణై శ్శ్రుతితాంగతైర్ముఖవలల్లోలంబమాలారుతైః
వీణాయామృదుగీతిభిః పరవశాంనాళీజనాంకుర్వతి
వాగ్దేవీవదనాంబుజేనివసతు శ్రీశాహపృథ్వీపతే.

ఆపై విష్ణుస్తుతి దానివెనుక తాండవ శివస్తుతి :

" శ్లో. చండస్తాండవ కాండ శౌండ మహిమాశుండాలతుండోన్నమ
శ్చుండాదండపిచండ భాండవిహారత్కుండల్వ ... దక్షిణే
తండుర్దండిత చండడిండమముఖో డిండీరషండేర్వహా
త్కాండేర్మండిత గండమండల జటాఖండోఽస్తుచండీపతే.

కథాసంగ్రహ మీ క్రింది ద్విపదవలనఁ దెలియును.

ద్వి. శ్రీదేవకీగర్భ చిహ్నాలు దనర
మోదమ్ముతోడుత మును వచ్చుటయును
గరిమను కృష్ణుని గైకొను మేటి
బాలింతరాలు యింపారవచ్చుటయు
బాలకృష్ణుఁడు గొల్లభామలయిండ్ల
లీలలుసేయనాలించి దేవకియు
లాలించి కృష్ణుని రమ్మని సత్య
భామను నతనికి బాగుగా పెండ్లి
శ్రీమించగావించు చెలువైన కథల
లలితమౌ కృష్ణలీలావిలాసంబు
వెలయ శాహేంద్రుఁడు వేడ్కతోనిపుడు
విరచించె కవులెల్ల వినుతి సేయగను
ధరణిలో నాచంద్రతారార్కముగను.

కథాప్రారంభమున విఘ్నేశ్వరుని ప్రార్థించినమీఁదట ఆతడు రంగస్థలమునకు వచ్చును. విఘ్నేశ్వరు డిట్లు వచ్చెను.

ద్వి. పాశాంకుశంబులు పరగహస్తములు
భాసురకనక ప్రభలువిలసిల్ల
పొసఁగ లంబోదరంబున నాగవితతి
యసమాన కాంతితో నాడుచుండంగ
వలనొప్పుమూషక వాహనం బెక్కి
వెలయు విఘ్నేశుండు వేడ్కతో వెడలె

అప్పుడు పూజారి పూజసేయును. ఇచ్చట హాస్యప్రసంగము కొంత గలదు. దేవకీదేవికి గర్భచిహ్నాలు గలుగుట, మంత్రసాని వచ్చుట, ఆమె ప్రసంగము, సర్వసాధారణముగ నా ఘట్టములో నాడుకొను మాటలు (నేనప్పుడే చెప్పలేద - మొగుడిదగ్గర పండుకోవద్దని, అప్పటికి సుఖమనుభవిస్తే యిప్పటికి బాధపడక తీరునా?) విపులముగా వర్ణితములైనవి. శ్రీకృష్ణుడు జన్మించిన వెనుక, తొట్లలో నున్నప్పు డొక దినమున

నిద్రపోక పోరుపెట్టగా రక్షకట్టేటందుకు ఒక జోగిని పలువనంపినారు. ఆ జోగి తెలుగు, అరవము, మహారాష్ట్రము, హిందూస్థానీ భాషలలో మాట్లాడును. ఈ సంభాషణవలన శాహజీ బహు భాషాపాండిత్యము స్పష్టమగును. (జోగి తానుగుజరాతులోని గుదాపురివాడనని చెప్పును.) తరువాత గొల్లెతలు కృష్ణునెత్తుకొనుటకు వచ్చుట వారి యసభ్యసంభాషణము. కృష్ణుని బాల్య క్రీడలు - పాలు వెన్న దొంగలించుట - యశోదతో వారు మొఱపెట్టుకొనుట. యశోద కృష్ణుని నాజ్ఞపెట్టెదనని చెప్పుట సరసముగా రచితములైనవి. శ్రీకృష్ణుడు క్రమముగా వర్ధమానుఁడై గొల్ల చేడియలతో కోడిగములు సల్పుచుండ యశోద కనిపెట్టి సత్యభామను పెండ్లి సేయును. ఇదియే యిందలికథ. ఇందలి ద్విపదలు, దరువులు, కలవు. భాషాపాండిత్యమున, రచనాపాటవమున నిది శహాజీ యితర నాటకములకు తీసిపోదు. అచ్చటచ్చట వృత్తములుకూడ నుపయుక్తము లైనవి. మచ్చునకొక పద్యము నుదాహరించు చున్నాను.

ఉ. మేలగు వోరకొండె పయిమిన్నులుదేర మయూరపింఛముల్
నీలపయోదవర్ణముములనెంచఁగ మించఁగ మేని కాంతులన్
బాలురఁగూడి జాలములు బాగుగఁ జేయుచు నంద నందగో
పాలుఁడు వచ్చె గోపవరబాలురఁగూడుక యాటలాడఁగన్.

## 3. గంగాపార్వతీ సంవాదము

ఇది :- జయరమాపురవాస, జయచంద్రికాహాస, జయసుమేరుశరాస జయకృత్తివాస, జయజయ అను శివస్తుతితో మొదలిడుచున్నది. కథ గ్రంథనామమునుబట్టి గ్రహింపనగును.

సూ. ఇత్తైఱంగులైన పలుకాకులైన కాకవి నికరంబులం బక్షంబులను గ్గాడి కవనవనసుకవులకు జోహారుచేసి, చతురదధి వసనవలయిత రసాతలరాజమాన్య రాజన్యమస్తకమణిముకుట మసారమరీచి మంజరీ పుంజబిందుమాలికా మనోహరపాదార విందుండును... భోసకులజలధి శశాంకుండును.....

గుణభరితసకల భాషాచతుర్విధ సాహితీ నిర్వాహకుండును దీపాంబికా గర్భశుక్తిముక్తాఫలుండును నగు శ్రీశాహావసుంధ రాపురందరుండు రచియించిన శృంగారంబున పొంగారు గంగాపార్వతీ సంవాదంబనియెడు నాటకంబునకు కథాక్రమం బెట్టిదనిన వినిపించెదము వినన వధరింపుము స్వామీ!

తుది :- ద్వి. శ్రీగిరీశుని పేర సితతను పేర
భోగిభూషణు పేరఁ బురహరు పేర
కైలాసపతి పేర గౌరీశు పేర
ఫాలలోచను పేర భవహరు పేర

గద్య. అంకితంబుగ భోసలాన్వయజలధి
పంకజవైరి దీపాంబికాసుతుఁడు
సరససద్గుణుఁడగు శాహభూవిభుఁడు
తెరల గంగాపార్వతీ వివాదంబు
విరచించె రసికులు వినుతులు సేయ
ధరణిలో నాచంద్ర తారార్కముగను.[1]

## 4. జలక్రీడలు

మొదలు :—జయ దేవకీపుత్ర జయ దివ్యసతిపాత్ర జయ కృష్ణసుచరిత్ర జయ జగన్మిత్ర.

సూ. వ॥ అవురా! యీ విధంబున అభీష్ట దేవతావందనంబు గావించి సభానాయకాదుల నభివర్ణించి శ్రీశాహామహారాజ ప్రణీతంబైన జలక్రీడలనియెడు నాటకంబు కథాక్రమంగా వినిపించేము అవధరించరయ్యా,

తుది :—మంగళంబులు పాడేమార్గంబుపరాకు. దరువు మందరధరునికి మాధవునికి, నందకుమారునికి సరహారికిపొందుగ గోపకన్యలను పెండ్లాడిన గోవిందునికి, యశోదనందునికి శోభానమే, శోభానమే భోసలశహాజీ, భూవిభునిభాసిల్లు ప్రేమనుపాలించు వాసిగ శోభన వైభవసంతతి ధీసంపదలిడు దేవునికి శోభానమే.[2]

1. దీనికి 515 (M. 491) నుండి 518 వఱకు నాలుప్రతులు గలవు.
2. 521 (M. 498) మొదలు 527 వఱకు 7 ప్రతులు.

## 5. త్యాగరాజవినోద చిత్రప్రబంధ నాటకము

ఇది :—ఏవంకవినాట్యారంభే ఇష్టదేవతా ప్రార్థనంకరోమి. చూర్ణిక. ఇహాఖిలుచరాచరవందితపాదారవిందే. అను వాక్యములతో ప్రారంభమగుచున్నది. ఈ క్రింది సూత్రధారవచనమువలన నాటకోద్దేశము తెలియనగును.

సూత్ర. అవురా యీ విధంబున పగరను కొనియాడి త్యాగవినోదచిత్రప్రబంధంబునందు సరససకలవిద్యాపారంగత సకలభాషాభిజ్ఞ మృదుచిత్ర విస్తారకవితా నిర్వాహకవిద్వాంసులకు కర్ణరసాయనంబుగా త్యాగేశనామాంకిత విద్యాసుధావారిధిజనిత సంగీత సాహిత్యతరంగంబులలో యథోచితంబుగా తోఁచిన అణుమాత్రంబుగా కవివిస్తరించను, నిష్కపటు లా తప్పులు దిద్ది విననాధరించరయ్యా,

"ఇది సంస్కృతము, తెలుఁగు, మహారాష్ట్రము అను మూఁడు భాషలతో వ్రాయఁబడిన నాటకము. ఆయాపాత్రలీ మూఁడుభాషలను గూడ నుపయోగింతురు. ఏ పాత్ర యే సందర్భమున నే భాషను వ్యవహరించునను విషయము నిర్ణయించుటకు శక్యముగాకున్నది. దీననాలంకములుగలవు. అయ్యంకముల నచ్చటచ్చట తెలుగు వ్యవహరింపఁబడెను. సంస్కృతబహుళంబుగానుండుటచే సంస్కృతనాటక సమాఖ్యకుఁదగియున్నది. తెనుఁగునకుఁగూడ నిద్దానప్రవేశ ముంటదీనఁ బ్రసక్తికలిగినది."[1]

ఈ నాటకము శహాజీరాజుయొక్క సంగీత, సాహిత్య శాస్త్ర ప్రతిభావిశేషమునకు నికషోపలమువంటిది — సాహిత్యప్రబంధములయం దెట్లు ఏకాక్షర, ద్వ్యక్షర, త్ర్యక్షర, చిత్రకవితలు వెలయింతురో, అట్లే సంగీతమున స్వరకల్పనయందు రాగతాళములయందు శాహజీమహారాజు చిత్రకవిత నద్భుతముగ నిందు ప్రదర్శించియున్నాఁడు.

---

1. దీనికి 530 (M. 572) మొదలు 531 వఱకు 5 ప్రతులు గలవు.

ఇందాఱంకములున్నను గ్రంథవిషయము స్వల్పము. శాహావనీంద్రునిష్టదైవమగు త్యాగేశునియొక్క మహాత్మ్యమును ప్రతిపాదించును.

"నాట్యకళానైపుణ్యమునఁ దనయంతవారులేరని విఱ్ఱవీగెడు భద్రకాళి గర్వముడుపఁదలఁచి నారదుఁ డందులకు నటరాజమూర్త్యంతరమగు త్యాగేశునిఁ బురికొల్పును. భద్రకాళీశివులకు వాదోపవాదములు నడచుట అవి వివిధ నృత్యప్రక్రియల ద్వారమున ప్రదర్శనరూపములుదాల్చుట తుదకు భద్రకాళి యోడుట త్యాగేశుఁడు విజయసూచకముగాఁ దత్పణప్రాయమగు కాళీ పాణిగ్రహణముచేయుట యిందలివిషయము"[1]

## 6. ద్రౌపదీకల్యాణము

ఇది :— తోడ్యం. జయపార్వతీరమణ జయమనోభవహరణ, జయ భుజంగాభరణ, జయలోకశరణ, జయజగదేకమహీతలేశ్వర తనూజ జయజయోదార భోసలశాహరాజ. అను రచనతో ప్రారంభము - పాండవులు ద్రౌపదిని పెండ్లియాడుట యిందలి యితివృత్తము.

తుది :— అవురా యీ విధంబునవచ్చిన వ్యాసులకు నెదుర్కొని వందన మాచరించి యుచితాసనంబుం కూర్చుండ నేమించి యావ్యాసులం జూచి ద్రుపదభూపాలుండు పలికేమార్గం.

క. వరముని సందోహపురం
దర ! ధరమీకెఱుఁగనట్టి ధర్మముగలదే
పెరవేమికన్యకకునే
గురుపెనిమిటులనుచు పలికె కుంతి 'పెద్ద' కొమరుతోన్ ?

సూ. అవురా యీవిధమునపలికిన ద్రుపదుని వాక్యంబు.[2]

---

1. దీనినిఁ గూర్చిన సమీక్ష - చూడుఁడు. భారతి సం. 33. సం. 7. శహాజీ ప్రబంధములు పుటలు 79-87.

2. దీనికి 535 (M. 551) నుండి 538 వఱకు 4 ప్రతులు.

## 7. పంచరత్న ప్రబంధము[1]

మొదలు :— జయరమాపురవాస జయచంద్రికాహాస

జయసమేరుశరాస జయకృత్తివాస

సర్వగుణాభరిత సకలభాషాచతుర్విధ సాహితీనిర్వాహకుండును దీపాంబా గర్భశుక్తిముక్తాఫలంబగు శ్రీ శాహవసుంధరాపురందరుండు రచియించిన పంచరత్నప్రబంధంబునందు తొలుత విఘ్నేశ్వర ప్రార్థన చేయగానే విఘ్నేశ్వరుడు వచ్చేమార్గం. దరువు.

తుది :- ద్వి. శ్రీకంధరునిపేర సితదేహుపేర
లోకదాయకుపేర రుద్రునిపేర
పురుహూతనుతుపేరఁ, బురహరుపేర
కరుణాంబునిధిపేర గౌరీశుపేర
... ... ... ... ...
సాహితీపుంభావ శారదయైన
శాహభూపాకశాసనుఁడు రచించె
నాగకన్యకలెల్ల సన్నుతి సేయ
ధరణిలో నాచంద్ర తారార్కముగను.

సూ. ఇత్తెఱంగున ఉదార వేషభాషాభూషితంబగు శ్రీ శాహమహారాజ ప్రణీతంబైన పంచరత్న ప్రబంధంబునందు, రసికజనమనోహరమై సకలకవికర్ణ భూషణమై రాణించు మహాప్రబంధంబు త్యాగేశ్వర ప్రీతికరమై విలసిల్లుంగాత.[2]

## 8. పార్వతీ పరిణయము

ఇది :— జయపార్వతీరమణ, జయమనోభవహరణ, జయభుజంగాభరణ, జయలోకశరణ" అను రచనతో ప్రారంభము. ఈ క్రింది సూత్రధారి వచనమువలన గ్రంథ రచనాసందర్భము తెలియనగును.

---

1. దీనినిఁగూర్చి భారతి సం. 33 సం. 7 (జూలై 1956) చూడఁదగును.
2. దీనికి 540 M 685 అను సంఖ్యగల యొక్క ప్రతి గలదు.

సూత్రధారి. వ. అవురా ఈ విధంబున మరిన్నె విధానన మంటేను,

సీ. సకలవిద్యావిలాసముల చేరంజిల్లు
శాహభూపాలుని సన్నుతించి
అతనిసభాసీమనమరుధీరుల చతు
శ్వేదవేదాంతార్థవిదులు పొగడి
అందు నానందించు ననవద్యసాహిత్య
పరులుమహాకవీశ్వరుల వేడి
సంగీతభరతశాస్త్రకళాధురీణుల
నేర్పులమదినెంచి యేర్పరించి

తే. ఆమహారాజుపరమేశ్వరాంకితముగ
పరగి చేసిన పార్వతీపరిణయాఖ్య
మనెడు నాటకమారాజు ననుమతమున
వేషభాషాదియుతముగా విస్తరింతు.

వ. అన్నండుగనక, అవురా యీ విధంబున అభీష్టదేవతావందనంబు గావించి, సభానాయకాదులను అభివర్ణించి శ్రీశాహమహారాజ ప్రణీతంబైన పార్వతీకల్యాణం బనియెడు నాటకంబు, కథాసం విధానంబుగా వినుపించెదము వినవవధరించిరయ్యా, కథాసం విధానం.

తుది :- సూ : ఈ విధంబున బ్రహ్మేంద్రాది దేవతలు పార్వతీపరమేశ్వ రుల వివాహమహోత్సవంబుశాయంగా ఆ సమయంబున గంధర్వ కిన్నరకింపురుషులు పుష్పవర్షంబులు వర్షించియా మహోత్సవం బున తుంబురనారదాదులు మంగళంబులు శోభనంబులు పాడే మార్గంపరాకు. * * *

మహేంద్రశాహరాజాయమంగళం నిత్యమహితకల్యాణమంగళం

* * * *

శ్రీచోళనాయకాయ శ్రీవాసుదేవకవి వచస్సంతుష్టాయమంగళం[1]

---

1. 545 (M. 508) మొదలు 553 వఱకు 9 ప్రతులు గలవు.

## పార్వతీపరిణయము - వాసుదేవకవి.

పైనిచూపిన గ్రంథాద్యంతములనుబట్టి, సూత్రధారవచనమున నిది శాహాజీరచితమైనట్లును గ్రంథాంతశ్లోకమునుబట్టి వాసుదేవకవిరచితమైనట్లును స్పష్టపడుచున్నది. ఈ వాసుదేవకవి శహాజీ మంత్రి ఆనందరాయమఖి శిష్యుఁడు. ఈ విషయ మాతఁడు రచించిన సిద్ధాంతకౌముదికి వ్యాఖ్యయైన బాలమనోరమా గ్రంథాంతగద్యవలనఁ దెలియుచున్నది. కాఁబట్టి యాతఁడు శహాజీకాలమువాఁడని (1684-1712) నిర్వివాదముగా నేర్పడుచున్నది.

ఇక యీ నాటకము పార్వతీపరిణయ మేయైనను, నిది యంతయు హాస్యధోరణిని నడచినది. సప్తఋషులు - అరుంధతి వారిరాక, సంభాషణము కొంత యుదాత్తముగ నడచినది. కథయందు కామదహనఘట్టము లేదు. కాని పార్వతిని పరీక్షించుటకు శివుడు వృద్ధబ్రాహ్మణ రూపముతో వచ్చు కథగలదు. మహాసంకల్పమునకు మంగళాష్టకములకు లోకవ్యవహార రీతిని ప్రతిబింబములు కల్పింపఁబడినవి. ఇరువదవశతాబ్దమునకూడ యిట్టివి లేకపోలేదు. లండన్ సంకల్పము - సివిలు కోర్టు మంత్రము మొదలగునవి. ఇవి[1] ముద్రితమై ప్రకటితమైనవికూడ. కాబట్టి రెండు శతాబ్దులక్రిందట నిట్టి రచనలు కావించిన కవిని మనము తీవ్రముగ విమర్శింపరాదు[2] ఇందు నాందిలో, శివ, గణపతి, పరమభాగవత వాల్మీకి కాళిదాస నన్నయ భట్టారకాదుల స్తుతిగలదు.

ఇందుదరువులు, సీసములు, ద్విపదలు గలవు. సంస్కృత శ్లోకములుగలవు. కవి సంస్కృతమున రచన నేయుటలో 'ఘట్టివాఁడు' ఈ క్రింది శ్లోకము దానికొక మచ్చుతునక.

శ్లో. రంగత్తుంగతరంగ వారిధిమిళద్భ్రుంగద్యు గంగాజల
ప్రోదంచత్తిమిశంఖశుక్తి పటలీ మిశ్రీభవత్తారకం
భ్రస్యచ్చంద్రకళా సమూహమఘునీభూతేందు చంచజ్జటా
జూటార్చిఃపునరుక్త సాంధ్యరుచితంనాట్యే శివస్సేవతు.

---

1. వీనిని "తమాషాపంచాంగము" అను పేర కల్యాణీసంపాదకులు కీర్తిశేషులు గంటి సూర్యనారాయణశాస్త్రిగారు. ప్రకటించియున్నారు.

2. ఆంధ్రపత్రిక సారస్వతానుబంధము (15-4-'56) "యస్వీ"

## 9. రతీకల్యాణము

ఇది : జయదేవిశర్వాణి జయవినుతగీర్వాణీ, జయకీరపరవాణీ, జయ మృదులపాణీ జయశుభగుణశ్రేణి జయగౌరికల్యాణి, జయవిభవని శ్రేణి జయఘనశ్రోణి. అను గౌరీస్తుతితో ప్రారంభము. రతీ కల్యాణ మిందు వర్ణితము.

సూ. ఈ రీతిని నాంద్యారంభమందు ఇష్టదేవతావందనంబుగావించి సభానాయకుని అభివర్ణించి శ్రీశాహమహారాజప్రణీతంబైన రతీ కల్యాణ నాటకం కథాక్రమంబుగా వినుపించేము విన నవధరించ రయ్యా.

తుది : సూ. ఈ విధంబున సకలదేవతలు వచ్చిన తరువాతను వివాహో త్రయంగా మంగళంపాడేమార్గం ॥ మంగళం ॥ గౌరికి రమ్యవిహారి ణికి, సారకృపారసహారిణికి, మీరిన ప్రేమను ధీరులప్రోచుచు కోరికలొసగెడు గుణనిధికి, దేవునికి మహాదేవునికి, దేవాధిపనుత భావునికి, శ్రీవైభవములు తగపావనుండై తగు సేవకనిధియగు శివునికిని, భోసలశాహజిభూవిభుని, భాసిలుప్రేమను పాలించు, వాసిగశోభన వైభవసంతతి ధీసంపదలిడు దేవునికి, శోభానే, శోభనమె,

గద్య : ఇతి శ్రీమద్భోసలకుల శాహామహారాజ విరచిత రతీమన్మథవిలాస మహానాటకం సకలవిద్వజ్జన ప్రీతయే సకలశ్రేయసే శ్రీత్యాగేశ సాంబసదాశివ శ్రీపూర్ణానందార్పణమస్తు.[1]

## 10. రామపట్టాభిషేకము

ఇది : జయదశరథపుత్ర జయరామ సుచరిత్ర జయదివ్యనుతిపాత్ర జయ జగన్మిత్ర జయ జయ జయశుభావహగాత్ర, జయజగత్కృతి సూత్ర జయభానుశశినేత్ర జయజయా. అను రామస్తుతితో మొదలు.

---

1. దీనికి 561 (M 587) మొదలు 567 వఱకు 7 ప్రతులు గలవు.

## శ్రీరామపట్టాభిషేకమిందు వర్ణితము

సూ. అపురా యీ విధంబున అభీష్టదేవతావందనంబుగావించి సభానాయకాదుల నభివర్ణించి శ్రీశాహామహారాజప్రణీతంబైన రామపట్టాభిషేకమనెడు నాటకంబు కథాక్రమముగా వినుపించేము వినవవధరించవయ్యా.

తుది : సూ. వ. అపురా యివ్విధంబున యీ దేవేంద్రాది దేవతలు యీ రామస్వామిని కనకసభయందు నవరత్నఖచిత సింహాసనంబున కూర్చుండ నియమించి సకలమైన తీర్థములచేత పట్టాభిషేకంబు సేయుసమయంబున, నారద కిన్నర కింపురుషులు, మంగళంబు పాడేమార్గంబు పరాకు. మా రామభద్రునికి మంగళం, మా సీతాదేవికి మంగళం, వనజాతనేత్రునికి, శ్రీశాహామహీపాలదేవునికి మంగళం.

గద్య. శ్రీశైలయంగనాశ్రితరక్షకుండు
భావజాకారుండు పరమపుణ్యుండు
భోసలకులసింధుపూర్ణ చంద్రుండు,
శ్రీశాహాభూపాల శేఖరుండిపుడు
శ్రీరామపట్టాభిషేకనాటకము,
కోరిగావించె నెక్కు—వభక్తిమీర
నెవ్వరుచదివిన నెవ్వరువిన్న,
నెవ్వరాడినను మరియెవరుచదివినను
ధనధాన్యములు...... తరుచైనసతులు,
ఘనమైనసంపదల్ కరిరథాశ్వములు
అరుదైనభక్తి నానతిశోభనములు,
గరుడవాహనుడిచ్చు గరిమమీరగను
ధరణిలో నాచంద్ర తారార్క—ముగను.[1]

---

1. దీనికి 572 (M. 591) నుండి 577 వఱకు 7 ప్రతులు గలవు.

577 : ఈప్రతితుది నిట్లుగలదు, "తారణనామసంవత్సరే భాద్రపద కృష్ణపక్షే ఏకదశ్యాం సౌమ్యవాసరే తంజాపుర్యాం చేళువభాండాస్థానే ప్రసన్నానంత శ్రీనివాస ముఖోద్గతే లేఖనం ప్రతాపరాయోపనామ్నా తుక దేవసుతవిఠ్ఠలేన లిఖితం."

## 11. రుక్మిణీసత్యభామా సంవాదము

[1]మొదలు :

ద్వి. చెలువొందరుక్మిణి శ్రీసత్యభామ
తొలుతవచ్చుటయు ముద్దులకృష్ణుఁడంత
నరుదెంచి, రుక్మిణిసాదరంబునను
నరయుచు సరసములాడుచుండుటయు
చక్కనికృష్ణుని సత్యభామపుడు
పెక్కువచెలిచేతఁ బిలువనంపుటయు
చెలువునివితమెల్లఁ జెలిదెల్పఁదెలిసి
కలఁగుచురుక్మిణి కాంతారమునను
పాదరింటికరుదెంచి పొంచియుండుటయు

సూ: వ. అవురా ఈ విధంబున తొలుత కథాసంవిధానం వినిపించి యా తదనంతరంబున శాహామహారాజ ప్రణీతంబైన రుక్మిణీ సత్యభామా సంవాదంబనెడు నాటకంబునందు తొలుత నిర్విఘ్నంబుగాను విఘ్నేశ్వర ప్రార్థనచేయగా విఘ్నేశ్వరుండు వచ్చేమార్గం.

తుది : ఈరీతిని పలుకగా వారు కృష్ణునితో నేమన్నారు వృత్తదరువు.

చెలువగానీపాద సేవచేసెదము నీ
పలుకులువినిమేము పరగనడిచెదము
పొలుపొందయిదినిజము పూవిల్తుపదమాన
హాళింకజెలయంగ మమ్మేలరా శ్రీకృష్ణ
వేడుకమీఱగరారా.

## 12. వల్లీకల్యాణము

మొదలు :

జయపార్వతీరమణ, జయమనోభవహరణ
జయభుజంగాభరణ, జయలోకశరణ
జయజాహ్నవీధరణ, జయజితాంతఃకరణ
జయసరోరుహచరణ, జయజగత్తరణా, జయజయా.

1. దీనికి 583 (M. 605) మొదలు 586 వఱకు నాలుగుప్రతులుఁ గలవు.

అవురా యీ విధంబున విఘ్నేశ్వరుని పాదపద్మంబులకు వందన మాచరించి యా తదనంతరంబున మరిన్నే విధానసం జేసెను.

శ్లో. నృత్యైకారగతైః కరాబ్జవలనైః తాలాయతఃకంకణః
ప్రక్వాణైఃస్ఫుతితాంగతైర్ముఖవలల్లోలాంబమాలారుతైః ।
వీణాయామృదుగీతిభిఃపరవశానాళీజనాన్ కుర్వతీ
వాగ్దేవీవదనాంబుజేనివసతిశ్రీశాహపృథ్వీపతేః ॥

సూ : వ. అవురా యీ విధంబున కుమారస్వామికి వల్లీదేవికి వివాహంబు సేయుసమయంబున నారద కిన్నర కింపురుషులు మంగళంబులు పాడేమార్గం పరాకు.

మంగళం : గౌరీశరమ్యవిహారునికి సారెకృపారసహారునికి మీరినప్రేమను ధీరులబ్రోచుచు కోరికలొసఁగెడుగుణనిధికి దేవునికి మహాదేవునికి దేవాదిపనుతభావునికి శ్రీవిభవములపావనుఁడై తగు సేవకనిధి యగు శివునికిని భోసల శాహజిభూవిభుని భాసిలుప్రేమనుపాలించు వాసిగ శోభనవైభవ సంతతిధీసంపద లిడు దేవునకు.

## ఫలస్తుతి

ద్వి. ఖండేందుధరపాదకంజంబులందు
మెండైనభక్తిచే మీరినవాండు
శ్రీవాసవవిభుఁడు చిరయశోధనుఁడు
భోసలకలశాబ్ధి పూర్ణచంద్రుండు
సత్యసంధుఁడు సదాచారసంపన్నుఁ
డత్యంత దయశాలి యతిమానసుండు
సరసశిరోమణి శాహభూవరుఁడు
ఇరవొందఁగా రచించిన శక్తిధరుని
కల్యాణంబు (ధరణిలో సెవ్వఁడుచదివిన
సెవ్వఁడువినిన సెవండాడిన సెవరుచూచినను)

సుతులుధనంబులు శుభములుమిగుల
అతులితమైనట్టి యైశ్వర్యములును
పొందుగా కృపను పాలుపొందవారలకు
ఇందుశేఖరుఁడిచ్చు నీప్సితార్థములు.[1]

## 13. విఘ్నేశ్వర కల్యాణము

మొదలు : తోడెం రాగం నాట, తాళం ఝంపె
జయపార్వతీరమణ, జయమనోభవహరణ......

సూ : వ. అవురా యీ విధంబున నిష్టదేవతా ప్రార్థనసేసిన యాతదనంతరంబున శ్రీశాహామహారాజ ప్రణీతంబైన విఘ్నేశ్వర కల్యాణమనెడు నాటకంబు కథాసంగ్రహంబుగా వివిపించెదము విననాధరించరయ్యా !

తుది : దరువు ఆదితాళం. గుమ్మకాంబోదిరాగం మాతృక

మాగజముఖునికిమంగళం నిత్యం
మదనహరసుతునికి మంగళం
రంజితభక్తునికి రాజశిరోమణికి
మంజులరూపునికి మంగళం
శాహజీరాజేంద్రుపాల సతతము మెలంగు
సామికిమహనీయరూపునికి మంగళం

గద్య : సూత్రధార వచనం

ఇతి శ్రీమద్భోసలకుల శాహామహారాజ విరచితం విఘ్నేశ్వర కల్యాణ నాటకం సకల[2]రసిక విద్వజ్జనప్రీతయే శ్రీ త్యాగేశసాంబశివార్పణమస్తు.

---

1. 530 (M. 466) కెండలు 596 వఱకు 7 ప్రతులు.

596 సంఖ్యగల తాళపత్రగ్రంథముచ చివర నిట్లుగలదు. "శారణనామ సంవత్సరే, ఆశ్వయుజమాసే, శుక్లపక్షే, షష్ఠిస్థిరవాసరే, నవరాత్రే, విశ్వలోపనామ్నా ప్రతాపరాయ ఉశేలేఖనం పరిపూర్ణమస్తు." దీనినిబట్టి ప్రతాపరాయఁడను నాతఁడీ గ్రంథమును శారణసంవత్సరమునందు లిఖించినట్లు తెలియుచున్నది. ఇది క్రీ. శ. 1704 తో సరిపోవుచున్నది గాన యీ నాటక మా సంవత్సరమున వ్రాయబడినది.

2 దీనికి 610 (M. 523) కెండలు 616 వఱకు 7 ప్రతులు, గలవు 610 లేఖరి వెంకటరంగయ్య.

## 14. విఘ్నపల్లకి సేవాప్రబంధము[1]

నాటరాగము - జంపతాళము.

మొదలు :

జయ రమా పురవాస, జయ చంద్రికాహాస,
జయ సుమేరుశరాస, జయకృత్తివాస.

సూ : ఇత్తెరంగున పలుగాకులైన కాకవినికరంబులనుగ్గాడి కవనవనసుకవులైన సుకవులకు జోహారుచేసి, చతురుదధివసన వలయితరసాతల రాజమాన రాజన్య మస్తకన్యస్తమణిముకుట మసారమరీచిమంజరీపుంజమిళిందమాలికా మనోహర పాదారవిందుండును, సుందరీబృందమకరంద సాయకుండును మకరమకరంద ఝుషముఖప్రముఖ బిరుదాంకుండును, భోసలకులజలనిధిశశాంకుండును, పరాశరప్రభవకణాశనఫణినసుత పతంజలిగవీగుంభన జరీజృంభదుట్టంకన సముద్ధృతరాద్ధాంతకలనా ద్వితీయుండును, మహారాజవిలాసనివాసనిబరీసనికు వేలవందనమాలికా రచనాచణకటాక్షులక్ష్మీశ్రవశంవదుండును, కలితసంగీతతాన శ్రుతిస్వరస్థాన రాగాంగగాన క్రియాస్థాయి గమక ప్రబంధధాతుగాయనగుణతతానద్ధ ఘనసుషిర గాత్రభేదక్రియా గ్రహజాతి మార్గతాళ దేశితాళ తత్త్వజ్ఞుండును, సర్వగుణభరిత సకలభాషా చతుర్విధసాహిత్య నిర్వాహకుండును, దీపాంబికాగర్భశుక్తిముక్తాఫలంబగు శ్రీశాహవసుంధరా పురందరుండు రచియించిన పల్లకిసేవ ప్రబంధమున తొలుత విఘ్నేశ్వర ప్రార్థన సేయుగా విఘ్నేశ్వరుండు వచ్చేమార్గం.

తుది : సూ. ఇత్తెరంగున స్వామి మేలుకొన్న తదనంతరంబున శోభనము నుడివే క్రమము పరాకు.

---

1. ఈ ప్రబంధమును శంకరపల్లకిసేవ ప్రబంధముతోఁగూడ మదరాసు విశ్వవిద్యాలయ సంగీతశాఖాధ్యక్షులు శ్రీ పి సాంబమూర్తిగారు తే॥ 20-12-1955 దిని ముద్రించి ప్రకటించియున్నారు. కాని జూలై 1955 లో వెలువడిన (సం. 33 సం. 7) భారతిలో "శహాజీ ప్రబంధములు" అను వ్యాసమున నీ విఘ్నపల్లకిసేవ ప్రబంధముగాని శంకరపల్లకిసేవ ప్రబంధముగాని ముద్రితమైనట్లు తెలుపఁబడకుండుట శోచనీయము.

శోభానమే శ్రీహరికి శోభానమె శ్రీపతికి శోభానమె శోభానమే శౌరికిని శోభానమె లక్ష్మికిని శోభానమె నగవరోద్ధారునికిన గనన్ని భకుచయుగకు గగనవర్ణునికి గగనమధ్యకును శోభానమె శంబరహాపునకు శంబరనయనకు అంబుజ నాభునికి అంబుజగేహకును శోభానమె త్యాగేశ మిత్రునికి త్యాగేశసోదరికి భోగీశశాయికిని భోగేశవేణికిని శోభానమె మంగళం

గద్య :- ద్వి. శ్రీలోలుపేర నాశ్రితపాలుపేర
నీలవర్ణునిపేర నిరుపముపేర
నారాయణునిపేర నగధరుపేర
వారిజోదరుపేర వైకుంఠుపేర
పల్లకిసేవ ప్రబంధరత్నంబు
పల్లవాయుధసమ ప్రభగలవాఁడు
భూపాలమణియేక భూధవపత్ని
దీపాంబగర్భాబ్ధి దివ్యరత్నంబు
సత్యభాషా హరిశ్చంద్రుఁడుత్తముఁడు
సత్యాగరాజాంఘ్రి సన్నుతిపరుఁడు
వాసుదేవచరిత్ర వర్ణనారతుఁడు
భోసలకులశాహ భూపాలమౌళి
విరచించెసత్కృతుల్ విస్మయమంద
ధరణిలోనాచంద్ర తారార్కముగను.[1]

విష్ణువియోగదుఃఖితయైన లక్ష్మీదేవిని సంతోషింపఁజేయుటకై ఆమె చెలికత్తెలేఁగి నిండుకొలువున్న విష్ణువును, పల్లకిలోఁ బిలుచుకొని వచ్చుట యిందలి విషయము. ఇందు కల్పనాచాతుర్యము, వర్ణనావైశద్యము చాలగాఁ గన్పట్టుచున్నది.

పై సూత్రధారవచనమునుబట్టి కవియొక్క సంగీతసాహిత్య వివిధ శాస్త్రప్రావీణ్యమును నెఱుఁగవచ్చును. ఇందలి ప్రస్తావనలో బహుదేవతావర్ణనము, సుకవిస్తుతి, కుకవినింద మొదలగు ప్రబంధపుఁ బోకడలు

1. ఇంద్రజిత్తుగ్రావాలు (618 ప్రతి) దీనికి 618 (M. 651), 619 రెండు ప్రతులు గలవు.

గలవు. ఇందు 38 దరువులు, 1 చూర్ణిక, సీస, ద్విపద, కందములు, ఉత్పలము, లయగ్రాహి, తోదకము మయూరగతివృత్తములు – వృషభగతి రగడ, లాలి, ధవళము, శోభనము. మొదలగు పాటలు గలవు. ఇందు నాట, ఆరభి, పంతువరాళి, ముఖారి, కేదారగౌళరాగములు ప్రయుక్తములైనవి. ఇది ప్రౌఢకృతి.

## 15. శంకరపల్లకి సేవ ప్రబంధము

మొదలు :

ద్విపద. శ్రీకరిముఖుని బోషిత చతుర్ముఖుని,
ఏకదంతుని దురితేభ కేసరిని
తారకదైత్య విదారినిగుహుని,
గారవంబునఁ గన్న గౌరిశంకరుల
పల్లకి సేవప్రబంధంబు గాను,
ఉల్లాసమునఁ జతురవధుల మెలయు
సర్వసర్వంసహాచక్రంబునేలు,
శర్వపాదాంబుజ సన్నుతిపరుఁడు
వాసరవల్లభాన్వయరాజమౌళి,
భోసల శ్రీశాహభూ పురందరుఁడు
విరచించెఁగవులెల్ల వేనోళ్లఁబొగడ
ధరణిలో నాచంద్ర తారార్కముగను.

తుది : మాపాలి దేవునికి మంగళం మముగన్నతల్లికి మంగళం.
పల్ల. గంగాధరునికి కరుణాబ్ధికి దివ్యమంగళదేహునికి మంగళం సంగీతరసికకు జలజాక్షికి సర్వమంగళకు దేవికిమంగళం ముదిత శంకరునికి మోహనాకారునికి మదనసంహారునికి మంగళం సదయాపాంగకు స్మరజవనదాయినికి మదవతిగిరిజకు మంగళం రహిగలత్యాగేశుకు రాజమౌళికి శాహమహీపాలదేవునికి మంగళం గజముఖులను కూరిమితోగన్న మహితగుణాఢ్యకు మంగళం.

గద్య. శ్రీశంకరుని పేర శ్రీగౌరి పేర
వాసవార్చితు పేరఁ బార్వతి పేర
కేశవనుతి పేర గిరిసుత పేర
ఈశుని పేర సర్వేశ్వరి పేర
భోగిభూషణు పేరఁ బూఁబోణి పేర,
త్యాగేశు పేరఁ గాత్యాయని పేర
పల్లకిసేవాప్రబంధంబు దివస
వల్లభాన్వయుఁడేక వసుధేశధర్మ
పత్ని దీపాంబగర్భస్నిగ్ధ పేటి,
రత్నంబు శ్రీశాహరాజదేవేంద్రుఁ
డొనరించెఁగవులెల్ల నుల్లసిల్లంగఁ,
దనరుచు నాచంద్ర తారార్కముగను.

విష్ణుపల్లకిసేవ ప్రబంధమువలె నిందును గౌరిదేవి శంకరునియొద్దకు చెలికత్తెలను పంపును. వారు స్వామి దర్శనముకొఱకు, గంగను, భృగమును, కుండలీంద్రుని గోరుదురు. కాని వారేమియు చేయకపోవుటచే చెలికత్తెలే స్వయముగా నేగి పల్లకిలో శివుని తీసుకొనివత్తురు. ఇదియే యిందలి కథ.

ఈ ప్రబంధమున 22 దరువులు, ఒక చూర్ణిక, ఎనిమిదికందములు, ఒక సీసము, రెండు ఉత్పలమాలికలు, మూఁడు చంపకమాలలు, నాలుగు ద్విపదలు, రెండు తేటగీతలు కలవు. ఇందు, ఘంటా, పున్నాగ, వరాళి, నాదనామక్రియ, సావేరి, సౌరాష్ట్ర, భైరవి, సైంధవి, మధ్యమావతి, మోహన, శంకరాభరణ, కురంజి, పంతువరాళి అను పంద్రెండు రాగములు ప్రయుక్తములైనవి.

ఇందు పంతువరాళి సదరిపాన్ - అని తేవారమునఁగూడ ప్రసిద్ధ మఁట. కావుననే నాలుగు పాటలీకృతియందారాగముతోఁ గలవు.

---

1. దీనికి 650 (M. 620) నుండి 524 వఱకు 5 ప్రతులు గలవు. 623 అనంతయ్య లిఖితము

ఇది క్రీ శ. 1896 సంవత్సరమున సుప్రసిద్ధ వాగ్గేయకారకులు శ్రీసుబ్బరామదీక్షితులవారిచే పరిష్కరింపఁబడి ముద్రితమైనది.[1] మఱి యిరువదేండ్లకు శ్రీసాంబమూర్తిగారివలన పునర్ముద్రణమందినది.

కృతి చాల రసవంతమైనది. ప్రారంభమున గల యీక్రింది సీస పద్యమున అచ్చతెనుఁగు పదములు ముచ్చటఁ గొల్పుచు శహాజీరాజు యొక్క అచ్చతెలుఁగుకవితా నిపుణత్వమును విశదముచేయుచున్నవి.

సీ. పూవువింటి వజీరు బూతిపేరిటి బుక్క
నోఱపుగ్రొన్నెలమొక్క నోడలు జడలు
బువ్వపేరిటి వాని కవ్వంబు నెలమిని
సురగాలి చెలికాని చూపుతూపు
తొలిచేఁప్రల యీలువులనెల్లగొను చెల్వ
విలసిల్లు పెనుచిల్వ విన్నమేను
పదిమొగంబుల వాని బడలించు నెఱలావు
నెఱతూపు దొరరావు నిల్లువిల్లు

---

1. పైని యుదాహరించిన ప్రథమ ముద్రణప్రతి సాధారణముగ లభ్యము కాక పోవుటచేతను, పరిశోధకుల కట్టి ప్రతులయందలి ముఖపత్రవిశేషము తెలుఁగుట యావశ్యకమగుటచేతను, ఆ గ్రంథముయొక్క ముఖపత్రము నీక్రింద నిచ్చుచున్నారు.

"శ్రీవిథీవిటంక త్యాగరాజ సోమాస్కంధ పదారవిందేందింది రాయమానమాన సుండును. భోసలకులావతం చోళమండలాఖండలుండును అగు తంజాపూరినుండును శాహామహారాజుచే సుకవి నికర మనోల్లా సకరంబగునటుల వివరింపఁబడిన

పల్లకిసేవా ప్రబంధము.

ఇది తిరునెల్వేరి జిల్లా వేళాకురిచ్చి మఠాధి కర్తలును తిరువారూర్, తిరుపగ లూర్ మొదలైన దేవస్థానములకు అధ్యక్షులును, సంస్కృత ద్రావిడ భాషా విచక్షణు లును అగు శ్రీ ఆజపానటేశ పండార సన్నిధివారి అనుమతిచే ఎట్టి యపుర సంస్థాన సభాస్థులును, సంగీత సాహిత్య విద్యాసంపన్నులును అగు బ్రహ్మశ్రీ సుబ్బరామదీక్షి తుల వారిచేతను సంస్కృతాంధ్రహూణభాషావిశారదులగు బ్రహ్మశ్రీ కాకర్ల సుబ్బయ్య పంతులుగారి చేతను పరిష్కరింపఁబడి ఆ ౘ మరియా ముద్రాక్షరశాల యందు ముద్రిం పించి ప్రచురింపంబడియె. 1896."

గీ. సారెవహియింప శోభిల్లు చక్కనయ్య
కరిముఖునికయ్య బూచులగముల జియ్య
సుధలవెదఁజల్లు కడగంటి చూడ్కిచేత
బుడుతనెలఁ దాల్పుమము నెప్డు బ్రోచుఁగాత.

## 16. శచీపురందరము

మొదలు : తోడె. నాటరాగం. ఝంపెతాళం.

జయపార్వతీరమణ జయమనోభవహరణ,
... ... ... ... ...
జయలోకసంహరణ జయజాహ్నవీతరణ
జయజితాంతఃకరణ జయసరోరుహాజయ
జయ జగత్తరణా జయజయా.

తోడె మంగళమైనవెనుక నాందియందు త్యాగేశవందనమును, వాల్మీకి వ్యాస కాళిదాస, మయూర దండిప్రముఖ సంస్కృతకవి వందనమును గలవు. ఆ పై సూత్రధారవచనము.

సూ : వ. అవురా యీ విధంబున నభీష్టదేవతావందనంబు గావించి సభానాయకాదుల నభివర్ణించ శ్రీశాహమహారాజ ప్రణీతంబైన శచీపురందరంబనెడు నాటకంబు కథాక్రమంబుగా వినుపించేము విననవధరించవయ్యా.

గ్రంథమధ్యమున హరిహరబ్రహ్మాదులువచ్చి దేవేంద్రునికి శచీదేవి నిచ్చి పెండ్లిచేయించిన వృత్తాంతము వర్ణితము. నారదకిన్నరకింపురుషులు మంగళములు, శోభనములు పాడిరి.

తుది : పావనుండై, తగుసేవకనిధియగు శివునికిని, భోసలశాహజి భూవిభునిభాసిలు ప్రేమలుపాలించు వాసిగశోభనవైభవసంతతి ధీసంపదలిడు దేవునకున్ శోభనమే.

గద్య : ఇతి శ్రీభోసల శాహమహారాజ విరచిత శచీపురందరకల్యాణ మహానాటకం సకలరసిక విద్వజ్జనప్రీతయే సకలశ్రేయసే శ్రీత్యాగేశ సాంబశివ పరిపూర్ణసచ్చిదానందార్పణమస్తు.[1]

## 17. శాంతాకల్యాణము

మొదలు :- జయపార్వతీరమణ జయమనోభవహరణ * * *
అనియెడి కథలచే నమరి వేడుకను, దనరుచుండు శాంతాపరిణయము ఘనుడు శాహేంద్ర ... చెభువిని, పనివడి యానంద భరితుండైన చాల సరససత్కవివరుల్ సన్నుతిచేయ, ధరణిలో నాచంద్రతారార్కముగను.[2]

తుది. సూ. వ. అవురా యీ విధంబున ఆ ఋష్యశృంగ మునీశ్వరునికిన్నీ శాంతాదేవికిన్నీ వివాహంబుచేసే సమయంబున ఆ నారదకిన్నర కింపురుషులు మంగళంబులు పాడే మార్గంపరాకు మంగళంపాడేది. మన్నారు దేవికి మంగళం.

## 18. సతిదాన శూరము

మొదలు :- తోడం. జయపార్వతీరమణ జయజానకీరమణ×జనాభరణ
... ... ... ... ... ...

అనియెడికథలచే నమరిరాజిల్లు
చునుమించు సతిదానశూరనాటకము
వివిగా శాహభూవిభుడు గావించె
ధరణిలో నాచంద్ర తారార్కముగను.

సూ. అవురా యీ విధంబున శ్రీశాహమహారాజ ప్రణీతంబైన సతిదాన శూరనాటకంబునందు.

---

1 "ఈయ లేఖమునందు ప్రథమనాటకం గణపతి రెండోది సరస్వతి మూడోది పార్వతి నాలుగోది సీత అయిదోది రామపట్టాభిషేకం ఆరోది యీనాటకం దీనికి పేరు శచీపురందరం సంపూర్ణమగునట్లు వ్రాసిన తాటేకులు ౭౦ వెంకటరంగయ్య వ్రాసినా... 625 (M. 548) నుండి 647 వఱకు ప్రతులు. దీనికి 837 సంఖ్యగల మఱి యొక ప్రతికూడకలదు. చూ తంజావూరి కేటలాగు. రెండవ సంపుటము పుట 50.

2. దీనికి 628 (M 619) నుండి 630 వఱకు మూడుప్రతులు గలవు.

తుది: అపురా యీవిధంబునం బరమేశ్వరుండు బ్రాహ్మణునికి సాయుజ్యమును, మాదిగవానికి సారూప్యమును, మతంగభామినికి సామీప్యమున్ను విద్యార్థికి సాలోక్యమును యిచ్చిన యాతదనంతరంబున నారద కిన్నరకింపురుషాదులు మంగళంపాడేమార్గం.1

## 19. సతీపతిదాన విలాసము

మొదలు:- జయ దేవకీపుత్ర జయదివ్యనుతిపాత్ర × జయజితామిత్ర.

... ... ... ...

అనియొడి కథలచే నమరి వేడుకను
దనరు సతీపతి దాననాటకము
సరస శుభోక్తుల సంతసంబునను
విరివిగా శాహభూవిభుఁడుగావింప
వరకవీశ్వరులెల్ల వర్ణనసేయ
ధరణిలో నాచంద్ర తారార్కముగను.

తుది:- అపురా నీవిధంబున నీరీతి నారదుండు స్తుతిసేయుసమయంబున సురలు నారద కిన్నరకింపురుషులు మంగళంబులు పాడేమార్గం పరాకు.

దరువు. మందరధరునికి మాధవునికి
శోభానమే, శోభానమే
భోసలశాహాజీ భూవిభుని...
వాసిగశోభన వైభవసంతతి
ధీసంపదలిడి దేవునికి శోభానమే.

---

1. దీనికి 633 (M. 622) నుండి 643 వఱకు 7 ప్రతులు గలవు. 640 లేఖరి రామయ.

2. దీనికి 644 (M. 624) నుండి 650 వఱకు 7 ప్రతులు గలవు.

## 20. సీతాకల్యాణము

స్రగ్ధర. రామంశ్యామాభిరామం రవిశశినయనం కోటిసూర్యప్రకాశం
దివ్యందివ్యాస్త్రపాణిం శరముఖశరధిం చారుకోదండహస్తమ్
కాలంకాలాగ్నిరుద్రం రిపువనరహనం విఘ్నవిచ్ఛేదదక్షం
భీమంభీమాట్టహాసం సకలభయహరం రామచంద్రంభజేహమ్.

తోడె. నాటరాగం ఝంపెతాళం.

జయదశరథపుత్ర జయదివ్యనుతిపాత్ర
జయజయైక మహీతలేశ్వర జయజయోదార
భోసలశాహరాజ............

సూ. వ. అవురా యీ విధంబున నభీష్ట దేవతావందనంబుగావించి సభానాయకాదుల నభివర్ణించి, శ్రీశాహమహారాజ ప్రణీతంబైన సీతాకల్యాణంబనెడు నాటకంబు కథాక్రమంబుగా వినిపించేము వినవాధరించరయ్యా.

తుది. మా రామభద్రునికి మంగళం నిత్యం
మాసీతాదేవికి మంగళం
వనజాతనేత్రునికి వరకీరవాణికిని
మనసిజరూపునికి మంగళం
భానుకులేశునికి పరమకల్యాణికి
మానవేంద్రునికిని మంగళం
విహగవాహనునికి, విరిబోణికి శ్రీ
శహామహీపాలదేవునికి మంగళం.

సీతాకల్యాణనాటకం సంపూర్ణం[1]

పై నాటకప్రారంభమునగల 'రామం శ్యామాభిరామం' అను రామస్తుతి శ్లోకము, శహాజీరచితముగాక, వేఱొక కవీశ్వరునిదై యుండ వచ్చును. ఏలననఁగా, శహాజీకృతనాటకములన్నియు, జయజయశబ్ద పూర్వకమైన మంగళము (తోడెం లేక తోడ్యం) తో ప్రారంభమగు చున్నవి. కాబట్టి పై శ్లోకము లేఖకుఁడు చేర్చియుండవచ్చును.

1. దీనికి 631 (M. 515) నుండి 672 వఱకు 10 ప్రతులు గలవు.

## 21. భక్తవత్సలవిలాస నాటకము

ఇది శహాజీకృతముగా నీవరకు లోకమెఱుఁగదు. తంజావూరి పుస్తకశాలలోనున్నది.

ఇది "జయరమాపురవాస! జయచంద్రికాహాస
జయసుమేరుశరాస! జయకృత్తివాస"

అని శివస్తుతితో మొదలిడుచున్నది.

శివస్తుతియైనవెనుక నీ క్రింద నుదాహరించిన శ్రీదుర్గాస్తుతి గలదు.

సీ. మధుకైటభప్రాణ మరుదుగ్రకాలాహి
కాలాహివేణి జాగ్రత్కృపాణి
కాసరక్రవ్యాద కాదంబకాళికా
కాళికారూప విక్రమకలాప
రక్తబీజనిశాట రాజీవచంద్రిక
చంద్రికాహాస యుజ్జ్వలవిలాస
చండముండక్షపాచరశైలదంభోళి
దంభోళి కరినహస్తప్రకార
గీ. హారనీహారహారహారాగకీర్తి
గహనయోగీశ్వర ధ్యానగమ్యమూర్తి
పార్శ్వపరిచారికా భవద్భర్గదుర్గ
భూమిభృజ్జాత శాహేంద్రుఁ బ్రోచుఁగాత.

స్తుతియైనతరువాత సూత్రధారుని వచనము. సూత్రధారుఁడు,

వ. ఈ వితంబున నెమ్మనమ్మున ముమ్మరించిన భక్తిని యమ్మహిషాసుర మర్దనికి కేలుమోడ్చియనంతరంబ,

చ. ఋషభషలైన కొన్ని యపశబ్దములన్ కృతిఁజెప్పి కావ్యపా
రుషములకొల్లగట్టుకొని రూఢికి నెక్కఁదలంచి శేముషీ
ధిషణులమంచు వాదులకు దియ్యముగాఁ గవులాడువాక్యముల్
విషకబళంబుఁగాఁ దలఁచి వీనులఁ బెట్టరు సత్కవీశ్వరుల్

"వ. ఇత్తెఱంగున కాకుత్థైన కాకవినికరంబు
ల పక్షంబులనుగ్గాడి ... ...
... ... ... ...
... ... ... ...

దీపాంబికాగర్భశుక్తిముక్తాఫలంబగు శ్రీశాహవసుంధరాపురందరుఁడు.[1]"
పై పద్యము (పుట 208) తెనాలిరామకృష్ణకవి రచితమైన ఘటికాచలమహాత్మ్యమున కృత్యాదినున్నది. కాని యా గ్రంథావతారిక రామకృష్ణకవి రచితముకాదు. అది వేంకటగిరికవిప్రణీతము. వేంకటగిరికవి ఖండోజీయను మహారాష్ట్రరాజునకు ఘటికాచలమహాత్మ్యము అవతారిక గ్రాసికృతి నొసంగుటచేతను, నాతఁడు శహాజీయాస్థానకవియైన గిరిరాజుకవి పుత్రుఁడగుటచేకను, శహాజీరాజకృత పద్యమును తన గ్రంథమున నెలకొల్పెనని యూహింపనగును.

శ్రీశాహవసుంధరాపురందరుండు భక్తవత్సల విలాసంబను శృంగార నాటకంబునకు కథాసంవిధానంబు [illegible]. అని కథాసూచన యీ క్రింది విధముగా నొనరించియున్నాఁడు.

ద్వి. నెలఁదాల్పు చక్కని నెమ్మనితోడ
కొలువుండు వేళ నెక్కొనుభక్తిఁబూని
యరుదెంచి బాణుండు హరునకు మ్రొక్కి
వరుసమునొన్న సఁగిన వరముపద్ధతిని
వావిరినాకోట వాకిటనుండ
రావలెననివిని రాజశేఖరుఁడు
ప్రియఁబాసి దయతన్ను పేరువఁబెట్ట
నయమున బాణుని నగరుఁజేరుటయు
విరహిణియై గౌరి వెంబడిచెలిని
పెరిమిటి నప్పుడు బిలువనంపుటయు

---

1 ఇంతవఱకును గల పై వచనము 199-వ పుటలో నుదాహృతమైన, విష్ణుపల్లకి సేవ ప్రబంధముననున్నది. కావున సంగ్రహముగ నిచ్చట నీయఁబడినది. పై వచనమే కాక, 'జయరమాపురవాస" అను ప్రారంభ మంగళగీతమును," మధుకైటభప్రాణ" అను దుర్గాదేవస్తుతియు, "ఝషభషలైన" అను పద్యమును, విష్ణుపల్లకిసేవ ప్రబంధములోను, భక్తవిలాసనాటకములోను సమానముగా నున్నది.

ననితెల్సి బాణుండు హరుని ప్రార్థింప
మదనారి సతిఁజేర మగుడవచ్చుటయు
ననరయొడు సంవిధానాంకనంబులను
తనరిన భక్తవత్సలనాటకంబు
సాదరంబుగఁ జేసె శాహరాజేంద్రు
డాదివాకరచంద్రమై విలసిల్లు

పై దానినిబట్టి కథ వ్యక్తమగుచున్నది. తక్కిన శహాజీ కృతులవలెనిది, సంభాషణాది రూపకమై, సరసమై వెలయుచున్నది.

గ్రంథాంతమున,

శ్రీశంకరు''నిపేర చిన్మయుపేర
కాశవర్ణునిపేర గౌరీశుపేర
భోగిభూషణుపేర పురహరుపేర
త్యాగరాయనిపేర ధరచాపుపేర
నంకితంబుగ భోసలాన్వయాంబుధిశ
శాంకుండు చతురుండు శాహభూవిభుఁడు
గావించె కవులెల్లఁగని హరుషింప
భూవలయంబున పూజ్యమైనెగడ.

దీని ప్రతులును క్రీ.శ. 1933-వ సంవత్సరమున ప్రకటితమైన తంజావూరి కేటలాగు మొదటి సంపుటములో వర్ణితము కాలేను. ప్రస్తుతము ప్రకటితమైన రెండవ సంపుటములో 832, 833 సంఖ్యలుగా వర్ణితములైనవి. పై రెండు తాళపత్రప్రతులలో 832 సంఖ్యగల ప్రతి యందు లేఖనముంగూర్చి యిట్లున్నది.

ఈపుస్తకం నట్టువచింతామణిహస్తలిఖితం

గురుభ్యోనమః.

ఇంతవఱకును శ్రీ శహాజీ స్వయముగా రచించినకృతులు. ఈ క్రింది 'సరస్వతీకల్యాణ నాటకము' శహాజీమహారాజాస్థానకవియగు శేషాచలకవి రచించి గ్రంథకర్తృత్వము శాహాజీ కారోపించియున్నాఁడు, కావున శాహాజీ కృతులలోనిది చేర్పఁబడినది.

---

1. దీనికి రెండు ప్రతులు గలవు. (M. 578, 579) అనునవి వానిసంఖ్య. ఈ రెండు

# సరస్వతీ కల్యాణము

ప్రారంభము :- జయ దేవకీపుత్ర, జయదివ్యనుతిపాత్ర × జయజితామిత్ర. అన్నామగనుక అవురా యీవిధంబున నభీష్ట దేవతావందనంబు గావించి సభానాయకాదుల నభివర్ణించి శ్రీశాహామహారాజ ప్రణీతంబైన సరస్వతీకల్యాణం బనెడు నాటకంబు కథాక్రమం బుగా వినుపించేము విననాధరించరయ్యా.

అగు చొక్కనాథ మహామాత్యనాథు
సుగుణసత్పుత్రుండు సుజనమిత్రుండు
చిరపుణ్యవరమతి శేషాచలపతి
వరశాహావిభుపేర వహినిదైవార
చారుశృంగారరసంబులధీరు
లౌరాయనుచు మెచ్చ హర్షంబు హెచ్చ
మొల్లపువ్వుల పొట్లములువిప్పినట్లు
చల్లగా పన్నీరు చల్లినతీరు
పగగుసరస్వతీ పరిణయంబనెడు
సరసనాటకములాస్యములరంజిల్ల
భాసములతగు వేషభాషాదులమర
గావించెభరతులు గాయకుల్ మెచ్చ
అచక్రవాళా చలాచలాచక్ర

గ్రంథాంతము :—వాణికిపల్లవపాణికి వీణాప్రియకవివేణికిని, ఏణనయనకు నెలమిపద్మజునిరాణికి శ్రీకల్యాణికిని, భోసలశాహాజిభూవిభుని భాసిలుప్రేమనుపాలించు, వాసిగశోభనవైభవ సంతతిధీ సంపద లిడు దేవునకు, సకలజగములకు సంతసము అకలంకా ప్తత నమ రించు, సుకృతిసంతతి శోభననిధికిని అకలుషమతియగు అజునికిని ॥ శోభానమె.[1]

---

1 దీనికి 651 నుండి 657 వఱకును ఏడుప్రతులు గలవు. ఇందులో వేంకట రంగయ్యగాక, వేంకటనృసింహుఁడను వేఱొక లేఖకుఁడుకూడ గలఁడు.

# శహాజీ యాస్థానమందలి యాంధ్రకవులు

## ఆంధ్రపాణిని శేషాచల కవి

శహాజీరాజస్థానమున ప్రథమగణ్యుఁడు శేషాచలకవి. ఈతనిని నెల్లూరి శివరామకవి 'కామకళానిధి' యను గ్రంథమున తన గురువుగా నిట్లు పేర్కొనినాఁడు.

మ. సకలాంధ్రోక్తుల కాంధ్రపాణినియనన్ శాస్త్రంబుగల్పించి, తత్
ప్రకృతిప్రత్యయనిర్ణయంబుకొఱకై భాష్యంబుగావించి, దే
శికుఁడై రాజులచేతఁ బూజఁగొను నాశేషాచలర్షిన్ నివృ
త్తికులస్వామిని మద్గురున్ గొలుతు భక్తిన్ మానసాబ్జంబునన్.

పై పద్యమునుబట్టి 'ఆంధ్రపాణిని'యని పేర్కొనఁబడిన యాతఁడు నివృత్తికులజుఁడనియు, శేషాచల నామధేయుఁడనియు రాజులచేఁ బూజింపఁబడిన వాఁడనియు, సంస్కృతభాషకుఁ బాణినీయము వలె నాంధ్రభాషకు సూత్రములుగావించి, దానికి భాష్యముకూడ వ్రాసిన వాఁడని స్పష్టమగుచున్నది.

శహాజీమహారాజునకుఁ గృతిగాఁ గవి రచించిన "[1]భోసలకోసలీయము"అను నముద్రితసంస్కృత కావ్యమునందుఁ గవినిఁగూర్చి యీ క్రిందిరీతిని గలదు.

ద్వితీయ సర్గాంతగద్య.

శ్లో. నాయాసం కవనేతతోఽపి కఠినం కావ్యంతతో రూపకమ్
తస్మాద్ధ్వన్యమతం పదధ్వరసనైః వాగ్వైఖరీ జీవితమ్
తద్రామాయణభాని మజ్జయకథం జల్పాంధ్రవాక్పాణినే
శ్రీశేషాచలపత్యమాత్యకుశలోఽస్తి త్ర్యహాశాహాధిపః.

శ్లో. శాహేంద్రదత్త శిబికా కనకాభిషేక
సంభావనారుణబిధ ప్రతికారహేతోః
యత్సాహసంవిరచయే ననుతత్రవాణీ
త్వత్తోఽధికం ప్రతిభువం కలయేననూనమ్.

## ద్వితీయ సర్గాంత గద్య.

శ్రీభోజానిజగోత్రకారణ భరద్వాజానివృత్త్యాన్వయా
ద్యశ్రీ వేంకటపత్య [illegible] క్కాదేవీవిభో
శ్రీశేషాచలపత్యభిఖ్యకృతినాస్తస్యాంధ్రవాక్పాణినే
కావ్యేభోసలశోసలేంద్రచరితే సర్గేద్వితీయాఽభవత్.

పై యుదాహృతులనుబట్టి 'ఆంధ్రపాణిని' యనఁబరఁగిన శేషాచలకవి శహాజీమహారాజుచేఁ, గనకాభిషేక మహాసత్కారమును నాందోళికాది విశేషబహుమానములను బొందినవాఁడనియు, నీతనిది భారద్వాజగోత్రమనియు, తల్లి అక్కమ, తండ్రి వేంకటపతి యనియు స్పష్టమగుచున్నది. సంస్కృతాంధ్రభాషలయందేకాక, అష్ట భాషలయం దీతఁడు కవిత్వమల్లఁగలఁడని యీ క్రింది పద్యమువలనఁ దెలియుచున్నది.

గీ. లలితగతి శాహరాజవిలాసమనెడు
నాటకముసేయు బుధులుసంతసమునొంద
ధీచమత్కృతి వెలయ శేషాచలపతి
అష్టభాషావిశేషంబు లమరుసుకృతి.

ప్రస్తుత మీతని కృతులు మూఁడు కానవచ్చుచున్నవి. 1. శాహరాజవిలాసము 2. సరస్వతీకల్యాణము 3. ఆంధ్రవ్యాకరణము. ఇందులో మొదటి రెండు తెనుఁగు. మూఁడవది సంస్కృతము. సరస్వతీకల్యాణము తానురచించినను గ్రంథకర్తృత్వము శహాజీమహారాజు పేరఁ బెట్టినాఁడని తెలిపి యీ గ్రంథమునుగూర్చి ముందు వ్రాసియుంటిని. ప్రస్తుతము శహారాజవిలాసమును గూర్చి తెలుపుచున్నాను.

---

1. Descriptive Catalogue of Sanskrit Manuscripts, Tanjore Saraswathi Mahal Library Kavyas Vol. VIII Concluded No. 4238, Pages 3275-77.

## శాహరాజ విలాసము

### గ్రంథప్రారంభము

శా. శ్రీమద్గౌరికటాక్షమీశుముఖ రాజీవంబునన్ షట్పద
స్తోమంబాతరినిచ్చె నెచ్చెలియగ్రందున్ లజ్జయాతల్లికిన్
ప్రేమన్ సమ్మతిసేయసంగతముఖాప్తిన్ మీరు సాదంపతుల్
స్థేమన్ లబ్ధకుమారుఁజేయుతస్వరీతిన్ శాహభూవల్లభున్.

*　　*　　*　　*

సీ. శ్రీకరగుణశాలి యేకేంద్రసుతమౌళి
స్వైరిరాఁగానొక్క సరసిజాక్షి
చూచిమోహించుచు శుకముఖ్యదూతిక
లంపిమన్మథ వివశాత్మయగుచు
వనక్కేళిమీనకేతను పూజలొనరించి,
శుభసూచకంబైన సూక్తివలన
అవిలంబముగఁజెలుల్ ప్రాణేశుఁడౌశాహ
విభునితోఁగూర్చిన విభవమెల్ల

తే. లలితగతిశాహరాజ విలాసమనెను
నాటకమురచించు బుధులుసంతసమునొంద
ధీచమత్కృతివెలయ శేషాచలపతి
అష్టభాషాకవిత్వంబు అమరుసుకృతి.

*　　*　　*

" భవ్యపరమాయురస్తు దీపాతనూజ
సర్వసంపత్సదాస్తు తేశాహరాజ "

వ. ఈరీతి కథాసూత్రంబునకుఁ బాత్రంబగు భోసలగోత్రావతార చారిత్రంబెట్టిదనిన.

" శ్రీకరుండగు చంద్రశేఖరుకరుణ
చేకీర్తితములైన శ్రీకీర్తితులఁ
బరగిశంకరు పాదపద్మముల్ మోద
సరణిచేఁబూజించి సంపదల్ గాంచి

హారిమహారాష్ట్ర మనుమహారాష్ట్ర
ధారుణిభూషించఁ దనరజనించె
భోసలకులసింధు పూర్ణసచ్చంద్రుఁ
డైసదామించు ప్రఖ్యాతులుగాంచు
శ్రీశాహరాజు భాసితకీర్తితేజుఁ
డైసార్వభౌముఁడింపలరుశ్రీరాము
పగిదిదుర్నామాది పాపవిచ్ఛేది
సగుణశాసనుఁడతి చండశాసనుఁడు
ఆతనినందనుఁ డతులశౌర్యంగారుఁ
... ... ... ...
డార్జవగణోదారు ..........
... ... ... ...
డాతఁడీభూలోకమందుండుదాక
భాతిగానేకాతపత్ర సంజాత
శీతలచ్ఛాయ గాచి సుఖింపఁజేయ
నాతరిభూరాజులనిరి యీరాజు
ఏకమైధరలోన నిరవొందుగాన
నేకరాజనభూమి నెసగునాసామి
తనకులాంగనలందుఁ దగుఖ్యాతిఁజెందు
వినయావలంబ శ్రీవెలయుదీపాంబ
యందునందనుల శివాభివందనుల
మందరోన్నతుల సన్మార్గసన్నుతులఁ
గాంచెశాహనృపాలుఁ గమనీయశీలు
నంచితవిభవేంద్రుఁడగు శరభేంద్రు
తుళుజభూపాలు నిస్తులదానశీలు
చెలగిరివారలూర్జిత లక్ష్మిమీర
అందగ్రజుండును పర్యవితాగ్రజుండు
కందర్పరూపుఁడు ఖండితాటోపుఁ
డర్కప్రతాపుఁ డాహవదిలీపుండు
అర్కజసమదానుఁడ సమానమాను

* * *

యవనాసురుల సెల్లనరి మొనభల్ల
జవనత శిక్షించి జగతిరక్షించి
సంగమ్ముగాంచె ద్రవిణోర్వి నిగాంచె
మంద్రదంబాక్రమించె ... ... ...
వంగభూమిభరించె వపకాశిమించె
జాలిగలంజేలె పాంచాలోర్విఁబ్రాలె
సౌరాష్ట్రిమెట్టెను శకభూమికట్టె
నారట్టకముచేరె నాంధ్రోర్విమీరె.

## గ్రంథాంతము

సింగి. నల్లనిమేనును నారయుకొడవలి
పల్లవెండ్రుకలు బల్లికడుపును
కల్లుబుంగయును నల్లదట్టియును
చిల్లగోలయును చేయమర
వెంగలినడయును వేలచూపులును
కొంగటెక్కులును కుండబొజ్జయును
చొంగయుమీఱఁగ సంగిచేయుచును.[1]

## ఆంధ్రవ్యాకరణము

(సంస్కృతభాషయందున్నది)

శుభమస్తు. హరిఃఓమ్.

శ్లో. శ్రీశందేవముపాస్య శేషసుమతిస్సర్వాంశ్చభాషావిదః
కావ్యాదివ్యవిహారచారు చతురాంమత్వాంధ్రభాషాంచిరాత్ ।
తాంవ్యుత్పాదయదంధ్రప్రాణిని సమస్తజ్ఞోపకారీభవన్
ఆంధ్రవ్యాకరణంగ్రైర్మని మత్తైస్సాకంవ్యతానీద్ధ్రువమ్ ॥

శ్రీపాణినిముఖ్యేభ్యోనమః హరిఃఓం అఇఉణ్, ఋఌక్, ఏఓఙ్, ఐఔచ్, హయవరట్, లణ్, ఞమఙణనమ్, ఝభఘఢధష్, ఖఫఛఠథచటతవ్, కపయ్, శషసర్, హల్, ఇమానిత్రయోదశ, సూత్రాణిప్రత్యాహారార్థానివర్ణపరత్వాత్సంస్కృత ప్రాకృతస

1. దీనికి 632 సంఖ్యగల యొకప్రతి మాత్రమే కలదు.

మాసాన్యపిసంస్కృతమిత ప్రతిజ్ఞాస్యం తే. ఏషామంత్యమిత్సంజ్ఞం విధాస్య తే. హాకారిదిష్వకారస్సుఖోచ్చారణార్థః.

సూ. అథాంధ్రశబ్దానుశాసనమ్. అథశబ్దోమంగళార్థః ఆరంభాద్యర్థకోవా. ఆంధ్రశబ్దానామనుశాసనమారభ్యత ఇత్యర్థః.

శ్లో. నిషేదివాన్ కంసకృషస్స్పష్ట ఇయ్యచా లౌకికవాక్యానాం వక్తుర్వివక్షాధీనమ్. ఆంధ్రకృతౌ భావివస్వంతపాఠేన నిషేదివాంసుడుదూర్వాసస్సుప్రాగ్విధినాదుర్వాసనుండు ప్రచేతుల్ సదాగతుల్ ఇతిభావి, తత్సాద్విశక్త్యాచ ర్త్వస్థిత్యవ సానజశాంయవి సర్గస్యచనిరాసః, సుపికింవాగ్గాటి యశఃప్రతాపమఃతత్సమాసాన్యేవేహాపిప్రాతిపదికమ్వత్ ॥ వసుపథాయా దీర్ఘః ॥ వష్వంతస్య ఉపథాయాః దీర్ఘస్స్యాత్ విద్వాప్ × సుఇతిస్థితే ॥ తద్ధితనుక్ ॥ తద్ధితస్యాత ఉపథాయాః చాద్యసుపదాయాశ్చ సుక్ స్యాత్ అక్సిద్ధ ఏవసుపోపథాబలేన పరమేవ శ్రీమంత, బంధుమంత తథావిధ్యాంసజలగడగి ... ... ... ...

ఇదియే శేషసుమతి ప్రణీతముగాఁ దంజావూరి పుస్తకశాలలో నున్నది.[1] పై నుదాహరించిన శేషాచలపతి విషయములనుబట్టి యీ శేషసుమతి, శేషాచలకవియని స్పష్టమగుచున్నది. మఱియు నీ వ్యాకరణ గ్రంథరచనముచేత నే శేషాచలకవి 'ఆంధ్రపాణిని' అను బిరుదమువహించి యుండవచ్చును.

ఆంధ్రపాణిని శేషాచలకవియు, సరస్వతీకల్యాణ కృతికర్తయగు శేషాచలపతికవియును నొకఁడేయని సరస్వతీకల్యాణమునందలి యీ క్రింది పంక్తులచే నిర్ధారణచేయవచ్చును.

> " ప్రతిష్ఠైకపాత్ర భారద్వాజగోత్ర
> పతిసుచారిత్రుఁ డాపస్తంభసూత్రుఁ
> డనఘు నివృత్తి వంశాబ్ధిచంద్రుండు
> వినయనయశ్రీ వివేకసాంద్రుండు "

శహాజీ రతీకల్యాణనాటకమున నాతఁడు మొగలాయిచక్రవర్తియగు నౌరంగజేబును జయించినట్లును, ఆంధ్రపాణిని శేషాచలకవి నాదరించినట్లుగను నీ క్రింది పంక్తులవలనఁ దెలిసికొనవచ్చును.

1. దీనికి 773–774 సంఖ్యగల రెండు ప్రతులుగలవు.

"అని యిట్లు పార్వతీప్రాణేశుపేర
ననఘుఁడౌ సకలలోకాధీశుపేర
చంద్రశేఖరుపేర శంకరుపేర
నంకితంబుగ శ్రీమహాదేవుపాద
పంకజాలంకృత భవ్యమానసుఁడు
సలలితభోసల సంతానఫలము
కలితదీపాంబికా గర్భాబ్ధిచంద్రుఁ
డేకరాజకుమారుఁ డెల్లదేశముల
నేకాతపత్రుఁడై యేలుచునుండు
నెలమి భోసలకోసలేంద్రచంద్రుండు
...           ...           ...
నవ్యాంధ్రపాణిని నామాదిబిరుద
భవ్యశేషాచలపతి ముఖ్యబుధుల
హారకేయూరగ్రహారాహేమాశ్వ
వారణశిబికాది వాహనాలొసఁగి
నయలీల భావించు నయకీర్తిశాలి
...           ...           ...
యవరంగజేబాది యవనసంహారి
మగఁటిమిమకరంద మకరాదిబిరుదుఁ
డగు శాహభూమండలాఖండలుండు
పరగించు రతిదేవిపరిణయంబనెడు
సరసనాటకము ...     ...     ...
...          ...     భావాదులమరఁ
గావించె భారతుల్ గాయకుల్ మెచ్చ
నాచక్రవాళ చలాచలాచక్ర
మాచంద్రతారార్కమై యొప్పఁగాక

ఈ గ్రంథమున :

"పరువడి గిరిరాజపదములను, సరసుఁడైనట్టి
శాహేంద్రుని పరిపరివిధములఁ బాడుచును"
అని గిరిరాజకవికృతపదముల ప్రశంసగలదు.

## గిరిరాజకవి

శహాజీమహారాజాస్థానమునఁ బ్రసిద్ధికెక్కిన కవులలో గిరిరాజకవి యొకఁడు. ఈతని సోదరుఁడు వెంకటగిరికవి తన ద్విపద రుక్మాంగదచరిత్రమున వంశక్రమ మిట్లు తెలిపియున్నాఁడు.

ఆపస్తంభసూత్రము – లోహితగోత్రము దర్భవంశము. (వెలనాఁడు)

గోపాలమంత్రి – (భార్య చెంగమాంబ)

ఔబళన్న (భార్య జానకమ్మ)

గోపన | గిరిరాజు | వెంగన | కవిగిరి లేక వెంకటగిరి (విచిత్రరాయావతంసుఁడు)

పై వారిలో మొదటియాతని వృత్తాంతము మనకుఁ దెలియదు. రెండవవాఁడు ప్రసిద్ధుఁడగు గిరిరాజకవి. ఈతఁడు "మార్తాండకుల శాహిమహీపాలు సభను, కీర్తికెక్కినవాఁడు గిరిరాజసుకవి" యని కీర్తింపఁబడినవాఁడు. ఈతఁడు సంగీతసాహిత్యముల రెండింటను సిద్ధహస్తుఁడు. శహాజీ సోదరుఁడగు శరభోజీ యాస్థానమున కూడనుండినవాఁడు. తాళపత్రగ్రంథములలోఁ పదములను శీర్షికలో 448, 449, 451 సంఖ్యగల పదము లీతని రచనములున్నవి. 'గిరిరాజనుతుండు అందమునను,' 'గిరిరాజసుత నీరొమ్మున చెదరినగంధము అందము మనమున శాహేంద్ర' ముగుదలు గూడిన చందము ; 'కోపగత్తెగా గిరిరాజనుత శరభోజినృపా' అను ముద్రలు పై యంశమును రుజువుచేయుచున్నవి. ఈతని కృతులు.

## వాదజయము

ప్రారంభము :

ద్విపద. శ్రీగిరిజానాథు జితరిపుయూథు
నాగచర్మాంబరు నాగకేయూరు
ఈశుసర్వేశు త్యాగేశుసేషాందు
భాసురముగమవః పద్మంబునందు

తలఁచినసద్భక్తిచేఁ దనరినధీర !
జలనిధిగంభీర శత్రుసంహార !
రతిపతిసమరూప రవికులదీప !
సతతశుభాచార సద్గుణాసార !
చోళమహీపాల సురుచిరశీల !
లాలితకవిపాల రమణీయలీల !
వాసవసంపూర్ణ వైభవవిమల !
భోసలకులశాహ భూపాలచంద్ర !
పొంకంబుమీదఁ బెంపొందనీమీఁద
అంకితంబుగ నతులశైఖరిని
వాదజయంబను వరనాటకంబు
మోదంబుతోడుతమును కొనియిపుడు
గావించెదను నేను గవులునుతింప,
భూవలయంబునఁ బూజ్యమైపొగడ.

సూ. వ. అవురా యీవిధంబున గిరిరాజకవి శాహరాజ దేవేంద్రుపై అంకితంబుగ నొనర్చినవాదజయంబను నాటకమునందు కథా సంవిధానముగా వినిపించేము విననవధరించరయా.

తుది : సరిపాటిలేనట్టి శాహేంద్రునికిని శోభానెశోభానమే. మంగళం. మహారాజశాహేంద్రునికి మంగళం మిగుల, మహనీయశీలునికి మంగళం వనధిగంభీరునికి వనజలోచనునికి, మ న సి జ రూ పు న కు మంగళం తంజాపురీంద్రునికి తరుణీపాంచాలునికి, మంజులభాషణునికి మంగళం వాసవనిభునికి వరసాహిత్యభోజునికి, మారాజ శాహేంద్రునికి మంగళం.[1]

## సర్వాంగసుందరీ విలాసము

ప్రారంభము : తోడెం నాటరాగం జంపెతాళం.

జయదేవకీపుత్ర జయదివ్యనుతిపాత్ర.

---

1. దీనికి 598 (M. 648) నుండి 601 వఱకు 4 ప్రతులు గలవు.

వ. ఈ విధంబున నభీష్ట దేవతావందనంబుగావించి సభానాయకుల నభివర్ణించి సర్వాంగసుందరీ విలాసంబనెడు నాటకంబు కథాక్రమంబు గావినిపించెదమనిన నవధరించరయ్యా.

ద్విపద. అనియొడి కథలచే నమరిన శాహ
ధవుని సర్వాంగసుందరి వివాహంబు
ననవైఖరులు మీఱనాటకంబుగను
గరిమతో గిరిరాజకవిరచియించె
ధరణిలో నాచంద్ర తారకంబుగను.

తుది : సూ. అవురా యీవిధంబుగ పలికినకన్నెను శాహేంద్రుండు అంగీకారముచేసినభావం తెలిసి వద్దనున్న చెలులు మంగళంపాడే

మార్గం.

మంగళం శాహరాజాయ మంగళం నిత్య
మహితకల్యాణాయ మంగళం
భోగదేవేంద్రాయ భోసలకులదీపాయ
వాగీశపాండిత్యాయ మంగళం
భూధరధైర్యాయ భువనైకవీరాయ
మాధుర్య నిలయాయమంగళం
శ్రీచోళనాయకాయ శ్రీవాసుదేవకవి
వాచాసంతుష్టాయ మంగళం.[1]

లేఖకుడు మంత్రిమూర్తి వెంకటరంగయ్య కాలము తారణ సంవత్సరము.

## శాహేంద్ర చరిత్రము

ఇదియొక యక్షగానము. శాహాజీ యొక కన్యనువలచి యామెను పెండ్లియాడుట యందలి యితివృత్తము.

1. దీనికి 658 (M. 555) నుండి 662 వఱకు 5 ప్రతులు గలవు.

మొదలు :

కం. వాణీంద్రుకవశ్యాంత
ర్వాణీస్తుత మధురకీరవాణి సకింకు
ర్వాణీకృతనానాగి
ర్వాణియ విహరించుశాహావరుముఖవీథిన్.

... ... ... ... ... ...

ద్విపద. అప్పుడయ్యింతి కాయజుబాణవహ్ని
గప్పు దెప్పరమైన కాకసంగాక
శాహమహీపాలు చంద్రునిమీఁద
మోహంబుమిక్కిలి మోహరింపగ
అలుకుచుమిక్కిలి యసురుసురనుచుఁ
గలఁగుచుఁ జంద్రునిఁ గాంచి యిట్లనియె.

దరువు. చందమామపదము
వలనొప్పచల్లనివాఁడవు గదవోయి చందమామా
వలనున్న యింతులవలచనేటికి చందమామా

వ. యీరీతిని యాకలికి చంద్రుని దూఱుచుండు సమయంబున అంత ప్రభాతంబైన శాహమహారాజ దేవేంద్రుండు నామె మాతకు హేమాదులొసంగి సంతోషితురాలింజేసి యాకన్యనుగూడి విలాసంబుగా నుండునంత.

గద్య ద్వి. శ్రీకరుపేర నా శ్రితరక్షుపేర
ఏకేంద్రుసుతుపేర నినవంశ్యుపేర
సరససాహిత్యలక్షణవిదుపేర
నిరవొంద శాహదేవేంద్రునిపేర
కండచక్కెరలీల గల్పించురుచుల
గండుమీఱిన యక్షగానంబుమిగుల
గరిమను గిరిరాజకవిరచియించె
ధరణిలో నాచంద్రతారార్కముగను.[1]

1. దీనికి 496 (M. 649-a) ఏకప్రతి గలదు.

## రామమోహన కొఱవంజి

ప్రారంభము :

ద్విపద. శ్రీసుతతుల్యుఁడై చెలువొందునట్టి
భోసలకులశాహ భూపాలుమీఁదఁ
జెన్నుగామోహితచిత్తయైరాజ
కన్యకామణి సరికాంతలుగొలువఁ
గరిమతోడుతమున్న కదలివచ్చుటయు
విరహభరంబుచే వెతలఁ జెందుటయు
నెఱుకతవచ్చి దానెఱుకఁజెప్పుటయు
గుఱుతుగాశాహేంద్రుఁగూడి యుండుటయు
ననియెడిరాజమోహనకొఱవంజి
పనుపడిశాహేంద్రుపై నంకితముగ
ఘనతతో గిరిరాజకవిరచియింప
జనులెల్లమేలని సంతసిల్లఁగను.

తుది : సూ. ఈవిధంబున రాజకన్యక శాహమహారాజ దేవేంద్రుని కూడి యుండగా వద్దనుండే చెలికత్తెలు శోభానమంగళం పాడేమార్గం ఏకేంద్రసుతునికి భోసలేంద్రునికి శోభానమే, శోభానమే.

దీపాంతతనయునికి, గిరిరాజపాలునికి, సరసూనికి......
సరిసాటిలేనట్టి శాహేంద్రునికి
తంజాపురీశునికి, తరుణిపాంచాలునికి, మంజులభాషునికి మంగళం
వాసవనిభునికి వరసాహిత్యభోజునికి మా శాహరాజేంద్రునికి మంగళం.

పై యుదాహరణనుబట్టి యితివృత్తము స్పష్టము.[1]

## రాజకన్యా పరిణయము

ఇది యొక యక్షగాననాటకము. గ్రంథప్రారంభమునఁగల యీ క్రింది ద్విపదవలన కథాసందర్భమేగాక దీనిని గిరిరాజకవి రచియించెనని తెలియగలదు.

---

1. దీనికి 500 (M 524) నుండి 510 వఱకు 3 ప్రతులు గలవు. 570 సంఖ్య గల ప్రతియు నీ నాటకమే కాని యసమగ్రము 509 నాగమయ్యాలేకరి.

ద్వి. శ్రీకరంబుగ రాజశేఖరుండైన
యేకేంద్రసుతుఁడు శాహేంద్రుఁడు వింత
సారిరాఁగాఁ జూచి సఖినిఁదాఁగూడి
యారాజకన్యకయలరి మోహించి
వచ్చుటయును సఖివచ్చుట ముదము
హెచ్చు కన్యకు దాదికెలమిభాషణము
దనరంగ యాకన్య తలిదండ్రులపుడు
మునుకొనివచ్చుటముద్దు తనూజ
వితమెల్లదాదిచేవిని హరుషించి
సుతను శాహేంద్రుకు సొరిదినిచ్చుటయు
నన్నుపవితముల నమరినరాజ
కన్యాపరిణయంబు ఘనతతోఁడు తను
గరిమను గిరిరాజకవి రచియించె
ధరణిలో నాచంద్రతారమై పొగడ.

1 గ్రంథాంతమున శహాజీకి మంగళముకలదు.

## లీలావతీ కల్యాణము

ఇందు కల్యాణపురాధీశ్వరుఁడగు కీర్తిచంద్రరాజు కుమార్తెయగు లీలావతిని శరభోజీ పెండ్లియాడినకథ వర్ణితము.

ప్రారంభము :

ఉ. ... ... ... ...
ద్దేవకిరీటకోటిమణిదధితి దీప్తపదాంబుజద్వయిూ
పావనశేషతల్పు ......... తానువర్తిరా
జీవదళాక్షుఁడీవుత విశేషశుభాళిశరీభశౌరికిన్.

క. కవులాఘునికులు శరునాన్
కవితకుమాధుర్య ధుర్యగరిమముదీర్చున్
కవి కాళిదాస బిల్హణ
భవభూతిమయూర భట్టబాణులఁదలఁతున్.

---

1. ఈ గ్రంథమునకు 568, 569, 835 సంఖ్యగల మూఁడు ప్రతులు గలవు. ఇందు మూఁడవప్రతి (835 సంఖ్య తంజావూరి కేటలాగు రెండవసంపుటమున గలదు.

ఉ. పన్నగఁగానిపోని పదపద్యములూరకెయూరలేనియ
భ్యున్నతిఁగాంచి మంచిబుధులుండినచోటికి వచ్చు కాకవుల్
కన్నపుటచ్చరావళుల గంతలుగట్టి మహీశతాళికిన్
చెన్నగనమ్మఁజూచు జడచిత్తులకున్ సయిదోడులేకదా !

ద్విపద. శ్రీజన్మభూమియై చెలువంబుకలిమి
రాజిల్లునల మహారాష్ట్రదేశమున
ప్రజలపాలిటివాఁడు పరమపావనుఁడు
రజనీకరాన్వయ రాజరత్నంబు
తాలిమిఁగలవాఁడు ధర్మతత్పరుఁడు
మేలిమిగని మెచ్చు మేలైనదాత
కీర్తిచంద్రికలు మిక్కిలి తేజరిల్లు
కీర్తిచంద్రాహ్వయక్షితి పాలమౌళి
కలిమియుబలిమియుఁ గడలుకొనంగ
పాలుపారఁగల్యాణపురి నేలునపుడు.

దరువు. లీలావతివెడలె హొయలుమీఱ
పటువగుపయ్యెదఁ జనుఁగవపొదల
నటునిటుముత్యపుహారము గదల
సుచరితరమయని సుదతులఁజూడ
కచకుచభారము కౌనసియాడ
అందెలరొద రాయంచలఁబిలువ

ఉ. పూచెనుమాధవీలతలు పూవులతేనెలు త్రావిజుమ్మనన్
లేచెనుగండుతుమ్మెదలు లేమలయీలువుకొల్లలాడఁగా
చూచెనుపంచసాయకుఁడు సోమరితెమ్మెర పిల్లలెల్లెడన్
వీచెను మూడవమ్మ వనవీథులతొంతవసంతవైఖరుల్.

తుది : గిరిరాజనుత శరభోజిభూపాల సురతకేళినన్ను చొక్కఁజేసితివి.

యోగిని. ద్వి. శ్రీసద్గుణోదార ! సింధుగంభీర !
భోసలాన్వయచంద్ర ! భూమిదేవేంద్ర !
జననాథదినరాజ ! శరభోజిరాజ !
వినుమునీదాన నావిన్నపంబొకటి
... ... ...
ఆచంద్రతారార్కమై యుండవయ్యా.

1. దీనికి 587 (M. 630) ఒక ప్రతిగలదు.

### గిరిరాజకవి పదకృతులు

గిరిరాజకవిపై గ్రంథములే కాక పదకృతులు పెక్కులు రచించినాఁడు. అవి శాహరాజపదములు" అను పేర తంజావూరి గ్రంథాలయమునందు కలవు.[1] అవి రెండు సంపుటములు ఒకదానియందు 132 పదములు, రెండవదానియందు 28 పదములుగలవు. అన్నియుశృంగార రసప్రధానములు. ఈ పదములలో స్పష్టముగా "గిరిరాజ సన్నుత - అనియు గిరిరాజ వినుతుఁడు శాహభూకాంతుఁడు." అనియు కవినామము కన్పించుచున్నది.

---

## కవిగిరి లేక వేంకటగిరి

గిరిరాజకవి తమ్ములలోఁ బ్రసిద్ధుఁడు కవిగిరి లేక వేంకటగిరి కవి. తనయన్నవలెనే సంగీతసాహిత్యములలో మంచిప్రవేశము గలవాఁడు. శహాజీమహారాజు బంధువులలో నొకఁడును, విచిత్రరాయని కుమారుఁడును నగు ఖండోజీరాయని యాస్థానకవి. ఈతని కృతులన్నియు నాతని యాదేశానుసారము రచితములైనవి. విచిత్రరాయాపతంసుఁడని యాతని బిరుదునామము. ఈతని పోషకుఁడగు ఖండోజీ, యీ బిరుదునామముతో సంబోధించిన సన్నివేశమునుబట్టిచూడఁగా, కవిగిరి ఖండోజీ తండ్రినాఁట నుండియు నాతని యాస్థానమున నుండెననియు, నందుచేఁ దన తండ్రి పేరితోనున్న బిరుదముతో ఖండోజీ సంబోధించెననియు స్పష్టమగుచున్నది. ఈతని కృతులు :

### రుక్మాంగద చరిత్ర

ప్రహ్లాదాది పరమభక్తులలోఁ బ్రస్తుతుఁడగు రుక్మాంగదుని చరిత్ర మిందువర్ణితము. ఇది మూఁడాశ్వాసములుగల ద్విపదకృతి ముందు నేనుదాహరించినవంశక్రమమిాగ్రంథమునందలి దే. ప్రారంభమున

"శ్రీరుక్మిణీనాథు జితదైత్యనాథు
నారూఢకారుణ్యు నఖిలశరణ్యు
పారికాంక్షిస్వాంత పద్మసంచారు
చారుచమూరువాంఛకమితనేత్రు
ప్రణుతబర్హకలాపుఁ బ్రణవస్వరూపు"

నమస్కరించి, శ్రీరాజగోపాలసేవాధురీణుఁడు, ఆయతమాళివంశాబ్జ విచిత్రరాయ పుత్రుఁడు, ఖండోజీరాయఁడు ప్రార్థింపఁగా, రుక్మాంగద చరిత్ర రచియించినాఁడు, తరువాతవంశక్రమము, ఆ వెనుక కథాక్రమము. గ్రంథాంత గద్య.

"అనిలోకవినుత దర్భాన్వయ జలధి
జనితుఁడౌబళమంత్రి జానకాంబయును
క్రమమున మన్నింపఁ గడఁకఁ దీవింప
కమలాంబికాదేవి కరుణపోషింప
పంకజాక్షునిపాద భక్తియుక్తుండు
వేంకటగిరికవి విష్ణునిపేర ... ...
... ... ...
శ్రీసతీపతిపేర జిష్ణునిపేర
అంకితంబుగను రుక్మాంగదుచరిత
మంకురింపఁగఁ దృతీయాశ్వాసమయ్యె.[1]

ఈ కవికి ముందుగా నీరుక్మాంగద చరిత్రమును చదలువాడమల్లన ప్రశస్త ద్విపదకావ్యముగా రచించినాఁడు. *

## అభినయదర్పణము

ఇది నందికేశ్వరకృతమగు నభినయదర్పణమునకు పద్యానువాదము. ఇందలి భాగములకు 'అనుబింబములు' అని పేరు. ఇందు మూఁడనుబింబములుగలవు. ఇది ఖండోజీరాయనికికృతి. గ్రంథావతారికలో ఖండోజీరాయఁడు కౌశికగోత్రుఁడనియు, ఖండోజీరాయని పుత్రుఁడగు,

1. ఈ గ్రంథమముద్రితము. సంఖ్య 353.

* విప్రనారాయణ చరిత్ర పీఠిక, పుట 31. ఈ గ్రంథకర్తచే సంపాదితము ఆంధ్రసాహిత్యపరిషత్ ప్రకటితము.

విచిత్రరాయావతంసుని కొమరుఁడనియు, తల్లి భాగాంబయనియు, నాతని వంశమునకు సంబంధించిన విషయము తెలుపఁబడినది. ఇందలి యనువాద మున కొకయుదాహరణము.

కం. ఎనయఁబతాకయుఁగరయుగ
మునస్వస్తికమొప్ప రెండుభుజములనిడినే
ర్స [illegible] జూపఁగ
మనుహేమంతాభినయము మదగజయానా.

ఇందలి కవితాశైలినిఁ దెలుపుటకు గ్రంథమునఁ గల మొదటి పద్యము నుదాహరించుచున్నాను.

ఉ. శ్రీకలకంఠకంఠికుచసీమల నొక్క కరరబు దర్పణ
శ్రీకరగండపాళి నొకచేయిని తంబముమీఁద నొక్క కే
లాకల కంధరాప్తి నొకహస్తము సాఁచి సహస్రబాహుతా
స్వీకరణంబు గోరు హరిచెల్వుకఁ బ్రోవుత ఖండోజీప్రభున్.

అవతారికయందు కవికి ఖండోజీరాయ డర్ధసింహాసన మొసఁగెనని చెప్పఁబడియున్నది.

అనుబింబాంత గద్య :—ఇది శ్రీ కమలాంబికా విమలకృపాలబ్ధసాహిత్య కళావతంస లోహితగోత్ర యాబళార్యపుత్ర దర్భకుల పావన గిరిరాజకవివరానుజ విచిత్రరాయావతంస ప్రణీతంబైన యభినయ దర్పణంబను మహాగ్రంథంబున ద్వితీయానుబింబంబు సంపూర్ణము. తృతీయానుబింబమున గద్యకానరాదు. ఇందు గ్రంథకర్త బిరుదు నామముతో వ్యవహరించినాఁడు.[1]

---

1. గ్రంథసంఖ్య 718. ఇది యేకైకప్రతి. మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారమువారు "అభినయదర్పణము" అను గ్రంథము ప్రకటించినారు. అదియు సంస్కృతగ్రంథానువాదమే. మూఁడాశ్వాసములున్నవి. గ్రంథకర్త లింగమగుంట మాతృభూతకవి. కాబట్టి రెండును వేఱువేఱు గ్రంథములు.

## ఘటికాచల మాహాత్మ్యము - కృత్యాది

సుప్రసిద్ధుఁడగు తెనాలి రామకృష్ణకవి రచించిన కృతులలో ఘటికాచలమాహాత్మ్య మొక్కటి. ఇది నేఁడు చిత్తూరికి సమీపము ఉత్తర ఆర్కాడుజిల్లాలోని 'షోలింగర్' అను పేరంబరఁగు పుణ్యస్థలముయొక్క మహాత్త్వమును విశదీకరించును. ఇందలి దైవతము నృసింహస్వామి. ఈ మాహాత్మ్యమును నీ తరువాతఁ గీర్తిశేషులు కొక్కొండ వేంకటరత్నము పంతులుగారు పద్యకావ్యముగను, ఇటీవల [1]లాక్షణికకవులు శ్రీ రావూరి దొరసామిశర్మగారు పద్యగద్య కావ్యములుగను రచించియున్నారు.

రామకృష్ణకవి గ్రంథమును రచించి, తగిన కృతిభర్త లభింపక పోవుటచే నెవ్వరికిఁ గృతి నీయకుండ నుంచెననియు, నింతలో నాతఁడు గతించుటచేత, నాతని మనుమఁడు ఖండోజీరాయనికి నా గ్రంథము తెచ్చి యిచ్చెననియు గ్రంథావతారికలోనున్నది. అందు మనుమని పేరులేదు. అతఁడును రామకృష్ణుఁడేకావచ్చును. ఖండోజీరాయఁడు తన యాస్థానకవియగు వేంకటగిరికవిని గృత్యాది పద్యములును వంశావళియు వ్రాయుమని కోరినట్లుగా నీ క్రిందిపద్యములలోఁ జెప్పఁబడియున్నది.

[2]మ. పదసందర్భవిశుద్ధి, ప్రౌఢతరశబ్దప్రక్రియాబుద్ధి, సా
రదగంభీరచతుర్విధ ప్రథితధారాసిద్ధి, ప్రాపంచసం
పదభిద్యద్గిరిరాజ సోదరత హెచ్చన్ మించు పుంభావశా
రద వీవేగదవన్న వేంకటగిరీంద్రా! సాంద్రమేధానిధీ!

---

1. కొక్కొండవారి గ్రంథము అముద్రితము ; ఆంధ్రపత్రికా కార్యాలయమున దాని వ్రాఁతప్రతియున్నది. (రావూరివారి పద్యకృతి యముద్రితము ; గద్యకృతి ముద్రితమైనది ; గ్రంథకర్తవద్ద లభించును.) రామకృష్ణకవి ఘటికాచలమాహాత్మ్యము 'కళావతి' పత్రికలో క్రీ. శ. 1902 లో ముద్రితము.

2. ఈ పద్యము 'ఉదయంబస్తనగంబు ......... సరసార్థబోధఘటనాపాండిత్య పరిష్కారశారద నీ రూపము రామకృష్ణకవిచంద్రా సాంద్రకీర్తీశ్వరా!' అను పాండురంగమాహాత్మ్య పద్యమునకుఁ బ్రతిబింబము.

క. విదితప్రబంధములు వే
ద్యఁదనరఁగ మదంకితముగఁ గావించినన్
మొదలఁబవిత్రము చేసితి
సదయాత్మ! విచిత్రరాయ చంద్రవతంసా!

తే. ధరణిఁదొమ్మిదిలిబ్బులు దాఁచికొన్న
వానికైనను ధనకాంక్ష పోనియట్లు
కృతులుపదివేలుగైకొన్న కీర్తికాముఁ
డైనవానికిఁజనదు కావ్యాభిలాష.

ఉ. కావునరామకృష్ణకవి కల్పితకావ్యమొకండుదెచ్చి స
ద్భావముతోడనాకతని పౌత్రుఁడొసంగె మదంకితంబుగా
నీవిఁక హారనాయకమణిప్రతిమానముగా మదీయవం
శావళిచెప్పి కూర్పుము యశంబుభృశంబుగ సంఘటిల్లఁగన్.

గ్రంథావతారిక, వంశావళి వేంకటగిరికృతముగా ముద్రితగ్రంథమునఁగలదు. తక్కిన యాశ్వాసాద్యంత పద్యములు సక్రమముగా లేవు. ద్వితీయాశ్వాసాది నొకకందపద్యమును, గ్రంథాంతమున నొకమాలిని వృత్తమును మాత్రమే గలవు. కవిగిరి కవితాశైలి దెలియుటకుఁ బై పద్యములే చాలును.

---

# బాలకవి సుబ్బన్న

ఈతని కృతి 'లీలావతీశాహ రాజీయము' అనునది.

దాని ప్రారంభము :—

సీ. శ్రితజనస్వాంతవారిజమత్తరోలంబ
గురువరస్తవనీయగుణకదంబ
హారహీరపటీరశారదాభ్రనిభాంగ
విమలకృపాపాంగ వృషతురంగ
త్రిపురదానవ మదద్విరదమృగాధీశ
భాసురహాసకైలాసవాస
కరధృతశూలమార్కండేయనుతిజాల
వహ్నిలోచనఫాలవ్యాఘ్రచేల

తే. భుజగకేయూర దుష్కృతాంబుదసమీర
శైలరాట్చాప నూతనశశికలాప
అఖిలలోకేశ కోటిసూర్యప్రకాశ
నీకువందన మొనరింతు నీలకంఠ.

వార్తార౦॥ శ్రీమన్మహాదేవ సేవాధురీణ, సీమంతినీనూతనపంచబాణకన కనగధైర్య * * *
నిరుపమమహాదాన దీక్షాధురంధర దీపాంబికాగర్భశు క్తిస్ఫుర న్మౌక్తికాకార, దివ్యతర కేయూర, చోళభూమండలాఖండల, సుకవిరాజమండల, యేకమహారాజకలశ పారావారపూర్ణిమా సుధాకర, హితపరశ్రీకర, సంగీతసాహిత్య విద్యావిలోల శాహజీ మహీపాల, పరాకు సరికవులెన్న బాలకవిసుబ్బన్న మేలిమి మీరహావణించిన లీలావతీశాహరాజీయంబను నాటకంబు నటన పటిమవినుపింప వినుపించెదము దత్తావధానుండవై వినవవధ రింపుము.

తుది: ఇవ్విధంబున నాజవ్వనులు శోభానలుపాడునా సమయంబున భేరీమృదంగఢక్కాహుడుక్కాది వాద్యధ్వనులు నింగిముట్టిచెలం గనుప్పొంగిలీలావతిమంగళంబుపాడుచు నటియించెనెటువలెను.

శాహరాజేంద్రునికి జయమంగళం
సహజాలంకారునికి జయమంగళం
విలసితాకారునికి వీరాధివీరునికి
జలధిగంభీరునికి జయమంగళం,

ఇందలి యితివృత్తము శాహజీ లీలావతిని పెండ్లియాడుట.

గద్య: ఇవ్విధంబున మవ్వంబుమీర వార్తాచమత్కృతి వెలయ సరి కవులెన్న బాలకవి సుబ్బన్న మేలిమిమీర హావణించిన లీలావతీ శాహరాజీయంబును నాటకంబున కధీశ్వరుండు.......[1]

---

1. దీనికి 588 (M. 629) ఫ్లై9 రెండు ప్రతులు గలవు. గ్రంథ మముద్రితము.

## పంచకన్యాపరిణయము

బాలకవి సుబ్బన్న వేఱొకకృతి పంచకన్యా పరిణయము – ఇది యును యక్షగాన నాటకమే.

"శ్రీమంగళాకార శ్రీ......చోళమండలంబు... ..తంజాపురంబును......పాలించు యేక భూపాలుని కుమారుండైన శాహామహారాజు దేవేంద్రుం డొక్కనాడు......పేరోలగంబుననుండి.

ద్వి. మొదలసుదాముండు మురవైరితోడ
కదిసి కందుకమాడఁగానోడి మఱుది
నంబున గెలిచెదనని వచ్చుటయును
అంబుజాక్షుఁడు వాని యభిలాషఁదీర్ప
కదలిరాఁగాఁ బంచకన్యకామణులు
యెదురైన చూచి మోహించి హరుండు
భవనముల్ దెలియ పాపని నొక్కనినిచి
సవరణ మీఱఁదాఁ జనుదెంచి యాసు
దాముని గాంచి తద్దయువారి చెల్వ
వేమరు వానితో వివరించుటయును
నబ్బాలుఁ డటువోయి యాగృహంబరసి
నిబ్బరంబున వచ్చి నీరజాక్షునకుఁ
దెలుప సుదాముని దిక్కువీక్షించి
పలికె నెన్నఁడు వారిపైతమమనసు
నిలిచె కావున నేడెనీ నేర్పు మెఱయ
జలజాక్షులకు నాకు సంభోగమమర
జేయుమనుటయును మచ్చికవల్లె నతఁడు
నాయానతినిఁబూని యబ్బాలువెంట
తగఁబోయి చెలుల నుద్యానవనంబునకు
నేగువమున్న కొలంకు కేతేరవారి
సకిచేత కార్యంబు సమకూర్చివచ్చి
ప్రకటంబుగా రమాపతికిఁ దెల్పుటయు

నంత నందఱుఁగొల్వ నటకేగి సఖుల
చెంతకుఁబోయి యాస్త్రీల చేలములు
నంతయుఁగొని వారలడుగ వచ్చినను
జెదరించి పెండ్లాడి పిదపాకరొకరు
కదనమాడుచునుండగా మాన్చివారి
నతిశయముగఁ గృష్ణుఁడలరించెననెడి
కతముమించిన పంచకన్యలపెండ్లి.
బాలకవీంద్రాంధ్రభాషచేనీవు
మేలిమిఁగనుపట్ట మెఱియనీవేళ
మాకు మోదంబుగా మంజునాటకము
జోకగారచియింపు సుకవీంద్రు లెన్న

అని యాజ్ఞాపించినాఁడు.

కవి రాజాజ్ఞ ననుసరించి నాటకము రచియించెను. కథ పై యుదాహృతభాగము తెలుపుచున్నది.[1]

## అక్కనామాత్యుఁడు

ఈతఁడు బాలకృష్ణలీలావిలాసము అను నాటకము రచియించి యున్నాఁడు. ఈతఁడు బ్రాహ్మణుఁడైనట్లును భారద్వాజగోత్రుఁడైనట్లును సరబాదలింగోజీ పుత్రుఁడైనట్లును నా నాటకాంతమునఁగల ద్విపదలు తెలుపుచున్నవి.

"ద్వి. అని యిట్లు సకలలోకాధీశుపేర
... ... ... ...
విరివిగా మాయిష్టవేలుపుపేర
అంకితంబుగ వెంకటాధీశచరణ
పంకజవిశ్వాసపరుఁడు శోభితుఁడు
సలలితవనజాత సంభవశ్రేష్ఠ
కులుఁడు, భారద్వాజగోత్ర సంయుతుఁడు

1. గ్రంథ సంఖ్య. 539. అముద్రితము,

సరసవైఖరి మెఱయ సత్కీర్తియుతుఁడు
సరబాద లింగోజి సత్పుత్రుఁ డక్క
నామాత్యశేఖరుం డతిసంభ్రమమున
... ... ... ...
సరవితో భరతశాస్త్రప్రవీణతను ”

రచియించిన కృతి.

[1]ఈ కృతిలో ద్విపదలు, దరువులు పాటలు పద్యములు గలవు. కవితా రచన చూపుటకు నొకపద్య ముదాహరించుచున్నాను.

ఉ. నల్లనిమేనివాని చిఱునవ్వుఘటించెడుమోము వాని, శో
భిల్లెడుకాంతివాని, శిఖిపింఛముచే నమరున్నవాని, రా
జిల్లెడువేణువాని, సరసీరుహనేత్రములొప్పువాని, నో
మొల్లసుగంధులార ! నవమోహనుఁడైన కృపాళుఁ జూపరే ?

ఈ కవికాలము గ్రంథాంతముననున్న యీ క్రింది లేఖనమువలనఁ దెలియనగుచున్నది. అందు “ప్రమోదూతనామ సంవత్సర శ్రావణ బ॥ ౨ మద్దాలి వల్లభుండు వ్రాసినాడు” అని కలదు. అది క్రీ. శ. 1690 యగును.

## అష్టావధాని కవి

ఇతఁడు చంద్రశేఖరవిలాసము అను నాటకమును రచియించెను. అది సంస్కృతము, తెలుఁగు, మహారాష్ట్రము అను మూఁడు భాషలలో రచితమైనట్లు తెలియుచున్నది. “అష్టావధానికవి” అనునది బిరుద నామము. అసలు కవి నామ మేదియో తెలియవచ్చుటలేదు. గ్రంథము పేరునుబట్టి చంద్రశేఖరకవి యని యూహింపవచ్చును. ఇందలి రచన—

### సంస్కృతము

శా. శ్రీమచ్చంద్రకలాధరస్య చరితం శృంగారలీలాన్వితం
కేయుం కిన్నర(నాద)నారదముఖం కీర్త్యావహం జాయతామ్
ఆదోకీపచురం జహారజహితం ఆనందసందోహతాం
శ్రీర్మం నాటకమిష్ట ..నటితం అష్టావధానిః కవిః.

---

1. గ్రంథ సంఖ్య. ౕ౫౫. అముద్రితము.

తెలుఁగు

ద్వి. శ్రీకరాకారుండు సిద్ధసేవ్యుండు
లోకరక్షకుఁడు త్రిలోకాద్రినేత
ముక్కంటి జడదారి మున్ను శూర్పనఖ
ముక్కంట కోసిన మొనగానిపేర

మహారాష్ట్రము

దరువు. అంతాతాగితె అచ్చాయ తాలితాలితా తెల్లెలో
ఒక్కమదంకోండా డాయో తాలితావితా తెల్లెలో, తాతెల్లెలో.

ఇందులో నాట్యతాళలక్షణములు గలవు.[1]

## పోలూరి గోవిందకవి

ఈతఁడు తాళదశప్రాణప్రదీపిక, రాగతాళచింతామణి, పర్వత నారద సంవాదము అను మూడు గ్రంథములు రచియించియున్నాడు. మూఁడును పద్యకృతులే - సంగీతశాస్త్రమునకు సంబంధించినవి. దీనిలో మొదటి రెండును ముద్రితములైనవి. ఈతఁడు 'ఇందుమతీపరిణయము' అను వేఁలోక ప్రబంధము రచించినవాఁడనియు తంజావూరి రాజులయొద్ద నుండెడివాడనియు క్రీ. శ. 1829 లో కావలి వేంకటరామస్వామిగారు తమ దక్కను కవుల చరిత్రయందు వ్రాసియున్నారు.

ఈతని గ్రంథములు భరతనాట్యశాస్త్రము ననుసరించి రచింపఁబడినవగుటచేత చాల ప్రామాణికములుగా నున్నవి.[2]

---

1. గ్రంథ సంఖ్య. 519. అముద్రితము.

2. Govindakavi was a native of the Southern provinces, he glourished during the Tanjore Telugu Rajas, he was educated in the school established by those sovereigns. He was thoroughly acquainted with Telugu Grammar He composed a work entitled "Indumati parinayamu" or the marriage of Indumati, the daughter of a Saurastra king and this poem is composed in one book. He wrote several descriptions of different temples of Dravidas and died at Madhyarjunam. (Biographical sketches of Deccan poets compiled from anthentic documents C. Venkataramaswamy. Calcutta. 1829.)

## చల్లాపల్లి వెంకనార్యుఁడు

ఈతఁడు "శ్రీకృష్ణవిలాసము" అను నాల్గాశ్వాసముల ప్రబంధము రచియించెను. ప్రబంధావతారికలో నీతని వంశక్రమము వర్ణితమైనది గాని యందు కవి చరిత్రకుఁ దోడ్పడు నంశములు లేవు. ఆశ్వాసాంత గద్యవలన కొన్ని తెలియనగుచున్నవి.

"ఇది శ్రీమద్వేంకటేశ్వర శాశ్వత కరుణాకటాక్షవీక్షణ సంలబ్ధ లబ్ధవర్ణతాచరిత్ర సుకవిజనమిత్ర భాస్వదాశ్వలాయన సూత్రపాత్ర మహనీయ మౌద్గల్యగోత్ర చల్లాపల్లి సత్కులపవిత్ర రంగనామాత్యపుత్ర సకల జనవినుతచర్య వెంకనార్యప్రణీతంబైన శ్రీకృష్ణవిలాసంబను మహాప్రబంధంబునందు సర్వంబును చతుర్థాశ్వాసము."

దీనివలన నీతఁడు వేంకటేశ్వర భక్తుఁడనియు ఆశ్వలాయన సూత్రుఁడనియు, ముద్గలగోత్రుఁడనియు, రంగనామాత్యపుత్రుఁడనియుఁ దెలియుచున్నవి. ఈ ప్రబంధమున శ్రీకృష్ణుని లీలలన్నియు వర్ణితములైనవి.

ఈతఁడు తంజావూరివాఁడనుటకు నొకచే యాధారమున్నది. [1]అవతారికలో వెంకనార్యుఁడు తాను పోలూరి యోబనమంత్రి పుత్రుఁడు గోవింద కవీంద్రుఁడు తన స్నేహితుఁడని చెప్పుకొనియున్నాఁడు. గోవిందకవి తంజాపురాస్థానమునకు సంబంధించినవాఁడని తెలియుచుండుటచే నీతఁడును తంజావూరిలో నున్నవాఁడని గ్రహింపవచ్చును.*

---

నాయకరాజుల కాలమున గోవిందకవి కానరాలేదు. కావున నితడు మహారాష్ట్రరాజగు శహాజీరాజు కాలమున నుండవచ్చును. ఇతని కృతులు సంగీతసంబంధములైన వగుటయు నీయంశము బలపఱచుచున్నవి. 'రాగతాళచింతామణి' తంజావూరి పుస్తక భాండాగారములో నున్నవి. తాళదశప్రాణదీపిక తంజావూరి పుస్తకభాండాగారము వారిచే ప్రకటితమైనది. శ్రీ కే. వాసుదేవశాస్త్రిగారు, శ్రీసుందరశర్మగారు పరిష్కర్తలు.

1. ఉ. పొందుగ నాదుసన్నిధితి పోలురి యోబనమంత్రి పుత్రు గో
విందకవీంద్రు మత్సఖుని వేడ్కఁ దలిర్పఁగఁ జేరఁబిల్చి తా
నందముగాని శిఁగనిన యా కలఁజెప్పిన నాలకించి యా
నందము మీఱ నా సుకవినాయకుఁ డిట్లనియెన్ మృదూక్తులన్.

## శహాజీరాజ పదములు

శహాజీరాజు పద కవిత్వమునఁగూడ ప్రవీణుఁడు. ఆతని ముద్రతో "త్యాగేశపదములు" అను పేర రెండు సంపుటములున్నవి.[1] ఒక దానిలో 208 పదములున్నవి. అవి యీక్రింది శీర్షికలలో గలవు.

| | | |
|---|---|---|
| 1. | భక్తిపదములు | 50 |
| 2. | భావపదములు | 5 |
| 3. | వైరాగ్యపదములు | 9 |
| 4. | శృంగారపదములు | 103 |
| 5. | అరజంత్రహాస్యపదములు | 14 |
| 6. | నీతిపదములు | 24 |
| 7. | మంగళములు | 3 |
| | | 208 |

రెండవదానియందు రమారమి రెండువందల పదములుగలవు అవి యన్నియు త్యాగేశునిపైనున్నవి. ఇవి భక్తిపదములు.

## శహాజీ పైచాటువులు

శహాజీమహారాజుపై కవులు చెప్పిన పద్యములు "శాహరాజు మీఁద పద్యములు" అను పేర వెలయుచున్నవి. అవి యన్నియు నాతని వైదుష్యము, భాషాపోషణ, తెలుపుచున్నవి. మచ్చునకొకటి.

క. కవిరాజులైన రాజులు
భువిలో మీరొకరు మున్ను భోజుఁడొకండే
యివతల మీ తోసములగు
కవిరాజులు వేరు భువినిగన శాహేశా![2]

---

1. తంజాపూరు కేటలాగు. రెండవ సంపుటము. సంఖ్య 852, 853,

2. తంజాపూరి కేటలాగు. రెండవ సంపుటము. సంఖ్య. 822.

ఈ గ్రంథ మముద్రితము. దీనికి తంజావూరి పుస్తకశాలలోనే రెండు ప్రతులు (సంఖ్య 270, 271) లభ్యమగుటకూడ పై విషయము స్థిరపడుచున్నది.

## సోమకవి

ఈతఁడు శాహజీకాలమునున్నవాఁడు. ఆతనిపై "శాహరాజ పదములు రచియించినాఁడు. అవి యన్నియు శృంగార రసప్రధానములు. 17 పదములున్నవి.[1]

ఒక పదము చివర:

సోమకవి వరనుత నన్ను
విరులసరుల నరిగురుల
తురిమి యెంతో హాయిగా
శాహభూవరయే తేర.

## శహాజీ - సరస్వతీ మహాలు

### గ్రంథభాండాగారాభివృద్ధి

నేడు తంజావూరిలో శరభోజీపేర వెలయుచున్న సరస్వతీమహాలు గ్రంథాలయమునఁ దెలుఁగు గ్రంథములను విశేషముగ భద్రపఱచిన యశస్సు శహాజీ మహారాజుదేనని చెప్పనగును. ఈతఁ డనేక లేఖకుల నేర్పఱచి పెక్కు ప్రాచీన గ్రంథములను వ్రాయించెను. ఆతఁ డానాఁడు ప్రతులు వ్రాయింపనిచో నేఁడీపాటికి కొన్ని యమూల్య గ్రంథములు నామమాత్రావశిష్టములై యుండెడివి. ఆంధ్రసాహిత్య ప్రపంచంబు నుబ్బూతలూఁగించిన నన్నెచోడ మహాకవి కుమారసంభవ ప్రతి యీ మహారాజు కాలముననే వ్రాయఁబడినట్లు చతుర్థాశ్వాసము చివరగల "శ్రీ శహాజీభూపాల సంతుష్టార్పణమస్తు" అను వాక్యము విశదము చేయుచున్నది. మఱియుఁ దెనుఁగుభాషయందు పెద్ద ద్విపదగ్రంథములు రెండింటిలో నొకటియగు ద్విపద భారతమంతయు నీ మహారాజు నాజ్ఞచే వ్రాయఁబడిన ట్లీ క్రింది విరాటపర్వాంత ద్విపదలు తెలుపుచున్నవి.

1. తంజావూరి కేటలాగు రెండవ సంపుటము. సంఖ్య ౮౭౭.

"భోసలాన్వయ సుధాంభోధి చంద్రునకు
భాసురకావ్యాను భవహృదయునకు
భవసముత్కట జటాభరణాయమాన
ధవళకీర్తిమనోజ్ఞ తరగాంగభంగ
గాహనైకపవిత్ర గంధర్వగాన
మోహితామరవధూ ముఖకాంక్షణీయ
మనుజభావునకు రామామనోజునకు
ననఘు సన్నుతికి శాహావనీపతికి
నింబాజి వ్రాయించె నిఖిలార్థవితతి
కంభోధియగుచుండునట్టి భారతము
పటుచిత్తుఁడైన కుప్పయమంత్రిచేత"

ఈ మహాగ్రంధము పదునెనిమిది పర్వములను నింబాజీయను నాతడు శాహామహారాజుకొఱకుఁ గుప్పయమంత్రిచేత వ్రాయించెను. ఈ గ్రంధమంతయు నేడీ వ్రాఁతప్రతినిబట్టియే ముద్రితమైనది.

## గ్రంథవిలేఖకులు - రాజపోషణ

గ్రంథ విలేఖకుల పోషణయందు శహాజీరాజునకుఁ బ్రీతి మెండు. కాఁబట్టియే యీతని రచనలకు విలేఖకులు పెక్కు ప్రతికలను దయారు చేసియున్నారు. తంజావూరి పుస్తకశాలలోఁగల రెండువందల నాటకములలో సగముభాగము అనగా నూఱు నాటకములు శాహాజీరాజకృతములగు నిరువది నాటకముల ప్రతికలే! మిగిలిన నూఱింటిలో శహాజీ యాస్థానకవుల కృతులప్రతులు 15 పోఁగా తక్కిన 85 మాత్రమే నాయక రాజులకు నితరులకు సంబంధించినవని తెలియవలెను.

శహాజీకాలమున నట్టువచక్రవర్తి గట్టు నరసింహులు, నాగమయ్య వేంకటరంగయ్య, ప్రసంగి గజసింహులు, మద్దాలి వల్లభుఁడు మొదలగు లేఖకులు పెక్కురు వెలసినట్లుగా నాయా గ్రంథము చివరఁగల వ్రాఁతలను బట్టి తెలియుచున్నది.

శహారాజ దండకము[1]

దీని రచయిత పేరెఱుఁగరాదు. అసమగ్రముగానున్నది. మంచి రచనతోనున్నది.

తంజావూరి యాంధ్రవాఙ్మయమున నాయకరాజులలో రఘునాథ నాయకుఁ డెట్టివాఁడో మహారాష్ట్రరాజులలో శహాజీ యట్టివాఁడు.

---

# మొదటి శరభోజీ
## 1712-1728

క్రీ. శ. 1684-1712 వఱకు నభినవభోజుఁడని చెప్పఁదగిన శహాజీ మహారాజు రాజ్యము పాలించినవెనుక నాతని తమ్ములు మొదటి శరభోజీ యును, తులుజాజీ యను నామాంతరముగల తుక్కోజీయును గ్రమముగా రాజ్యపాలనము గావించిరి. వారిరువురు శహాజీమహారా జొనర్చిన కట్టుఁబాటుల ననుసరించి, శహాజీమహారాజువలె భాషా పోషకులై ప్రఖ్యాతిఁగాంచిరి. వారిలో మొదటి శరభోజీ క్రీ. శ. 1712 మొదలు క్రీ. శ 1728 వఱకు రాజ్యము పరిపాలించెను. ఈతని కాలమున సంస్కృత భాషాభివృద్ధియే విశేషముగఁ గాననగును.

మొదటి శరభోజీ దానధర్మశీలుఁడు, భక్తిపరుఁడు, ఈతని ధర్మాధికారి బ్రాహ్మణులకు నీ మహారాజుపేర శరభోజీరాజపురమను నగ్రహారమును, మంగమటమను మఱియొక యగ్రహారమును దాన మొసఁగినాఁడు. తన యన్నయగు శహాజీమహారాజు కాలమునుండియు మంత్రిగనున్న యానందరాయమఖి తన 'విద్యాపరిణయ' మను నాటక మును నీ శరభోజీ కాలమునందే రచియించినట్లు విద్యాపరిణయమునందలి యీ క్రింది శ్లోకమువలనఁ దెలియుచున్నది.

---

1. గ్రంథసంఖ్య 426.

సకల రాజ్యధురంధరస్య శరభమహారాజ మంత్రిశిఖామణేరస్య జనకసనక...ధౌరంధ రేయమితిమే మహదాశ్చర్యమ్.

ఆబాల్యాదపి పోషితోఽజని మయాప్రేమ్ణా తయా లాలితః
తేనాసౌ సరసాముపైతు కవితామానందరాయాధ్వరీ,
ఇత్యేకక్షితిపాలవంశజలధీన్దేవ్యా గిరా జాతయా
ధీర శ్రీశరభావనీంద్రవపుషామూనం ప్రసాదః కృతః.

ఈ నాటకము తంజావూరునఁగల ఆనందవల్లియను దేవత యుత్సవ సందర్భమున నీ మహారాజు సమక్షమునఁ బ్రదర్శింపఁబడెను. దీనింబట్టి యీతని భాషాభిమానము సువ్యక్తమగుచున్నది. ఇంతియగాక యీతఁడు సంస్కృతమున [1]రాఘవచరిత్రమను కావ్యమొకటి రచియించినాఁడు. ఇతి పండ్రెండు సర్గలుకలిగి రామాయణకథను సంగ్రహముగఁ దెలుపుచున్నది. గ్రంథావతారికయందేమి, సర్గాంతగద్యలయందేమి యీ కావ్యము శరభోజీకృతమని స్పష్టముగఁ దెలియుచున్నను ద్వితీయ సర్గాంతమందుఁగల "ఇది పంచరత్నకవికృతౌ రాఘవచరితే ద్వితీయస్సర్గః" అను గద్యచే నిది పంచరత్నకవి రచియించి యీ మహారాజుపేరు పెట్టియుండునని పాశ్చాత్య విమర్శకులు తలంచుచున్నారు. శరభోజీ యాస్థానమున ననంతనారాయణుఁడన్న కవికిఁ బంచరత్నకవి యను బిరుదముగలదు. ఆతఁడే యీ కృతిని మహారాజుపేరఁ జెప్పి యుండునని వారనుకొనినంతమాత్రముచే శరభోజీ యీ గ్రంథము రచియింపలేదని చెప్పుట యసమంజసము. పంచరత్నకవి తోడ్పాటు గ్రంథరచనమున రాజుగారికి నుండియుండవచ్చును. మఱియుఁ బై పంచరత్నకవి గద్య యొక్క ద్వితీయ సర్గాంతమం దుండుటచే నా సర్గ మొకటియే యాతఁడు రచించెనేమో యని శంక పొడచుముచున్నది. అంతమాత్రమున శరభోజీ గ్రంథకర్తృత్వమునకు లోపము చూపట్టదు. గ్రంథమునందలి సర్గాంతగద్య యిది—

"ఇతి శ్రీమదభిజాత భోసలకులకలశజలధి సంపూర్ణ తుహినదీధితే, రఖిల ధరణీపాల మకుటతటీ నిబిడిత మణికిరణపటల మంజరీ పింజరిత చరణపంకజస్య సకల కల్యాణగుణ శేవధే రేకమహారాజస్య తనయేతదయుత గుణమధిక శుభగుణ మణిగణ మహోదధేః సకల భాషాద్భుత సరళసందర్భ గుణగరిమ ససభివ్యంజిత నిజసరస్వతీపురు

---

1. A Descriptive Catalogue of Sanskrit Manuscripts, Tanjore Palace Library (No. 3724), Pages 2641-2664.

షావతారభావస్య, శహాజీ మహీవలారే రనుజన్మనా శరభోజీరాజేన...
సంగ్రహ రామాయణే రాఘవచరితే మహాకావ్యే ద్వాదశస్సర్గః."

సంస్కృతమున రతిమన్మథనాటకమును రచియించిన జగన్నాథ కవి శరభోజీ యాస్థానకవి. ఈతఁడీనాటకమునేగాక తన పోషకుని చరిత్రమును నతని పూర్వులచరిత్రమును శరభరాజవిలాస[1]మను పేర క్రీ. శ. 1722-లో సంస్కృతముననే రచియించి ప్రఖ్యాతిఁగాంచినాఁడు. పరమానంద కవీంద్రుని శివభారతమను ప్రసిద్ధచారిత్రక గ్రంథము నీ మహారాజులకాలముననే రచియింపఁబడినది. అయ్యది శ్రీ శివాజీఛత్రపతి వృత్తాంతమును దెలుపుచున్నది. దాని కీమహారాజు కాలములో నొక తమిళానువాదముగూడ[2] వెలువడెను. శరభోజీమహారాజు కాలమున నాంధ్రభాషాభివృద్ధి విశేషముగఁ గాలేదు. శహాజీకాలమునందున్న గిరి రాజకవి శరభోజీపై రచియించిన కొన్నిపదములు, కీర్తనలు గన్పట్టు చున్నవి.[3] పై విషయముల ననుసరించిచూడ, శరభోజీ విద్వత్పోషకత్వ మున తన యన్నయగు శహాజీమహారాజును నాదర్శప్రాయముగఁగొని, యా కీర్తిప్రతిష్ఠలను నిలువఁబెట్టినవాఁడని తెలియుచున్నది.[4]

---

1. Descriptive Catalogue of Sanskrit Manuscripts, Tanjore Palace Library (No. 4241), Pages 3291-3293.
2. The Maratha Rajahs of Tanjore, Page 50.
3. Descriptive Catalogue of Telugu Manuscripts, Tanjore Palace Library. No. 448.

ఈ సంఖ్యగల గ్రంథమునుండి మచ్చున కొక్కపదము నుదాహరించుచున్నాను.

మంగళకౌశిక – ఝంపెతాళం.

జయమంగళం సదా శుభమంగళం

పల్లవి మంగళము శ్రీపతి సమానశౌర్యునికి జయ మంగళము కీర్తిలసమానునికిని
మంగళము విబుధ గురుమహనీయమతికి జయ మంగళము శరభోజమనుజపతికి

కొన్నిపదములలో గిరిరాజకవి పేరుండుటచే నివి గిరిరాజకృతములు కావచ్చును.

పాయకగందవడి నాపైవేయకు ప్రొముక్కెద
మాయత్త కోపగత్తెరా గిరిరాజకవినుత
శరభోజీనృపాలన్ను
మరునికేళి గూడవేరా.

4. జగన్నాథకవి రచితమైన రతిమన్మథనాటకమును కీర్తిశేషులు కిర్లంపూడి కామేశ్వరరాయకవిగారు నలువదేండ్ల క్రిందట తెలిగించియున్నారు. పరమానందకవి కృత సంస్కృత శివభారతముననుసరించి, తెనుఁగున గడియారము శేషశాస్త్రిగారు శివభారతము రచియించియున్నారు. ఈ కావ్యము తెలుఁగు దేశమున చాల వ్యాప్తి నందినది.

# తులజాజీ (తుక్కోజీ)

1728-1736

ఈతఁడు శరభోజీ వెనుక క్రీ. శ. 1728-1736 వఱకు తంజావూరును పాలించెను. ఈతనిని తుక్కోజీయని చరిత్రకారులు పిలుతురు ఈతఁడు తన యన్న లిద్దఱివలె భాషాపోషకుఁడు. ఈతఁడు సాహిత్యమునసే గాక సంగీతశాస్త్రమును నెఱింగిన ప్రతిభాశాలి. తన రాజ్యమున హిందూస్థానీ గానపద్ధతుల నెలకొల్పుటయేగాక 'సంగీతసారామృత' మను నొక గ్రంథముఁగూడ రచియించినాఁడు. అందీతనికిఁగల సంగీతశాస్త్రజ్ఞానము విశేషముగఁ దెలియుచున్నది. ఈతఁడు శబ్దశాస్త్రమున పరిశ్రమఁ జేసినవాఁడు. ఈతని కాలమున ప్రఖ్యాతిఁజెందినవారిద్దఱు సంస్కృతపండితులుండిరి. ఒకడు మనమభట్టు. రెండవవాడు ఘనశ్యాముఁడు. మనమభట్టు పండితుఁడేగాక సంస్కృతభాషయం దమూల్యములగు గ్రంథములను సేకరించినాఁడు. ఘనశ్యాముఁడు తుక్కోజీగృహామాత్యుఁడు. రమారమి యిరువదినాలుగు గ్రంథములు రచియించినాఁడు. ఈతనికి సుందరి, కమల యను భార్యలిరువురు. వారును సంస్కృతనాటకములకు వ్యాఖ్యానములు వ్రాసినారఁట! ఈతఁడు మానభార్గవ వంశీయుఁడు, కాశీమహాదేవుని పుత్రుఁడు. ఉత్తరరామచరిత్రవ్యాఖ్య, దశకుమారచరిత్ర టిప్పణము, నీలకంఠవిజయవ్యాఖ్య, అన్యాపదేశశతకము, రామాయణచంపువు, యుద్ధకాండము - తద్వ్యాఖ్యానము, ప్రబోధచంద్రోదయ వ్యాఖ్యానము మున్నగు గ్రంథము లెన్నియో నీ విద్వాంసునివి పరిశోధకుల కెఱుకపడియున్నవి.[1]

తులజాజీ తెలుఁగున 'శివకామసుందరీ పరిణయ' మను నాటకము రచియించినవాఁడు. ఈతని కవనశైలి రసికజనహృదయంగమముగ నుండు ననుటకు శివకామసుందరీ పరిణయమునుండి యీ క్రిందిపద్యము లుదాహరించు చున్నాఁడను——

1 Journal of Oriental Research. Madras. Part III Volume III, పై సంచిక యందు ఘనశ్యామ పండితునిగూర్చి ఘనముగు వ్యాసము గలదు.

కం. విలసిత కిసలయ సమసుమ
ఫలపరిమళ శోభితములు, భావజ చాపో
జ్జ్వలగుణ శుకపికముఖ రవ
మలయానిల భాసురములు మధువాసరముల్.

చ. సురుచిర పుణ్యశీలురనసూయులు సర్వవిదుల్...దయా
పరులు కృతజ్ఞులుత్తములు పావనులీ సభవారు మెచ్చ భా
సురతుళజ క్షితీశకృత............శివకామసుందరీ
పరిణయరూప నాటకము బాగుగనాడుద మీసభాస్థలిన్.

గ్రంథమంతయు సంపూర్ణముగ తంజావూరు భాండాగారమునఁ గలదు.[1]

తులజాజీ రచించిన రెండవ కృతి రాజరంజన విద్యావిలాస నాటకము ఇది సంస్కృతమున ప్రబోధచంద్రోదయమువంటి యద్వైత తత్త్వప్రతిపాదకమగు నాటకము. గ్రంథాంత గద్యలో "శ్రీమద్భోసల కుల కలశాంబోధి రాకాశశాంక సమరనిశ్శంక, వృషాంకపాదపంకజసేవా ధురంధర, సకలభాషాకవితా నిర్వాహక విలస దేకమహారాజ దీపాంబికా తనూజ, శాహమహారాజ శరభరాజానుజజ తులజమహారాజ ప్రణీతం రాజరంజన విద్యావిలాసనాటకం పరమాత్మ ప్రీతయేసకల విద్వన్ముదే, సకలశ్రేయసేఽస్తు" అని యుండుటచే నిది 'తులజాజీకృతమగుట నిర్వివాదము.

ఇందలి పాత్రలు పుండరీకపురాధిపతి ఆత్మనుఁడు—రాజు, గాత్రపురాధినేత జీవరాజు. అతని మంత్రులు—చిత్తశర్మ—సుజ్ఞానశర్మలు. మాయాదేవి—కర్మశర్మ—మోహుఁడు, మొదలగువారు వత్తురు. శివజీవేశ్వరసంవాదము వెనుక జీవరాజమాయాదేవుల వాగ్వాదము నడచును. మాయ తన కన్నకొడుకు కాముని కల్యాణము జరుప శివుని వేడుకొనును. మాయాదేవీ జీవేశ్వరుల యూధగ్ర్యమున రతిమన్మథుల వివాహము జరుగును.

---

1. దీనికి 633, 635 సంఖ్యగల రెండు ప్రతులు గలవు.

'ఇహాపరంబులుగల్గ నూహించి భక్తితెలయ'

రచయితమైన దీ కృతి.

ఈ నాటకము మార్గపద్ధతిని - అనఁగా సంస్కృత నాటకపద్ధతి ననుసరించి నాంది, ఋతువర్ణనము (వసంతము), సూత్రధారపారిపార్శ్వ కుల ప్రస్తావనయుఁగలవు. ఈతఁడు తన శివకామసుందరీ పరిణయమునఁ గూడ నీ పద్ధతి ననుసరించి యున్నాఁడు.

ఇందు దరువులు, ద్విపదలు, కందములు, సీసములుగలవు. పద్య రచనలో పూర్వకవి నన్నిచోడనివలె దరువులలో నీతఁడు ముద్రాలంకారము వాడినాడు. అనగా మోహుని రాక మోహన రాగములోను ఆనందునిరాక ఆనందభైరవిలోను, శంకరసాక్షాత్కారము శంకరాభరణములోను చెప్పియున్నాడు.

ఇందలి రచన సరళమైనది. జాతీయమైనది.

నాందియందు :

"శ్రీమచ్చిదానంద శివజగత్కంద
సామాది నిగమప్రసవ మకరంద
అతిశయాధార పద్మాంతరామోద
తతమధువ్రతల సత్ప్రణవస్వరూప."[1]

## నీతిపదములు

తులజాజీమహారాజుచే రచియింపఁబడిన నీతిపదములు తొమ్మిది గలవు. బహుమనోహరములగు వానిలో నీ క్రింది మూడుపదములు ప్రకటించుచున్నాను. ఇవి శివపరములగు నీతిపదములు.

1. 'పరిశోధన.' సంచిక. 3. ఆగష్టు – సెప్టెంబరు 1954. పుటలు. 70-73.

### ౧. కనడ - జంపె

పల్లవి నీతిగలిగిన నెందు - నిత్యశ్రేయమువచ్చు
నీతియే భూషణము - నృపతుల జరాజేంద్ర.
అనుపల్లవి తనునమ్మియున్నట్టి - జనులఁ బ్రోవఁగవలెను
ఘనముగా శత్రువుల - ఖండింపవలెను
అనయంబు పెద్దలను - ఆదరింపఁగవలెను
వినయమున శివభక్తి - మొనసిచేయఁగవలెను. నీతి
శివునిపదపద్మములు - చిత్తమునఁదలఁపవలె
భువిధాన్య ధనవృద్ధి - పోషింపవలెను
సవరణగ ధర్మమును - సతతమును జేయవలె
సవినయంబుగ భక్తి - సాధింపవలెను నీతి
ఎలమిసత్పాత్రములు - తెలిసి యీయఁగవలె
కులదైవభజనంబు - కోరిచేయఁగవలెను
విలసిల్లరఘుకేంద్ర - వినుతశ్రీతుళజేంద్ర
పలుమారు రాజ్యములు - పాలింపవలెను. నీతి

### ౨. సౌరాష్ట్ర - జంపె

పల్లవి కులమునకు భూషణము - కూర్మిసత్పుత్రుండు
ఇలభూషణము పుణ్య - ములు సేయునృపతి
అనుపల్లవి పరగవిభూతియే - ఫాలసద్భూషణము
గరిమరుద్రాక్షలే - కంఠభూషణము
పురవైరిఁదలఁచుటే - ముఖమునకు భూషణము
హరునిఁబూజించుటే - హస్తభూషణము
శివకథాశ్రవణమే - చెవులకును భూషము
సవినయప్రదక్షిణమే - చరణభూషణము
భవహరుని దర్శనమె - బహునేత్రభూషణము
శివపదధ్యానమే - చిత్తభూషణము
శిరమునకుభూషణము - శివచరణవందనము
సరిసదాచారమే - జన్మభూషణము
ఖరవొంద ఏకరా - జేంద్రనుత తుళజేంద్ర
ధరనన్నిటికి నీతి - తగినభూషణము.[1]

---

1. భారతి సంపు. 4. సం. 1, 2.

### 3. బేగడ - జంపె

పల్లవి మనసుసౌఖ్యములేని - మమతలేల
ఘనకీర్తి నట్టి - జననంబులేల

అనుపల్లవి 1. తలిదండ్రిభక్తిలేని - తనయులేల మిగుల
చెలఁగు గురుభక్తిలేని - శిష్యులేల
వెలయు పతిభక్తిలేని - కులభామినులేల
మలయు హితవరిగాని - మంత్రియేల మనసు.

2. దానధర్మములేని - ధనవైభవములేల
మానంబులేనట్టి - మనుజులేల
సేనాబలములేని భూనాథు బ్రదుకేల
గానంబు తెలియని - గాయకుల జన్మమేల మనసు.

3. తెలిసివరములనీని - కులదైవతములేల
సలలిత సరసముగాని - సాహిత్యములేల
ఇలను తులజేంద్ర తన - రైకేంద్రవినుతుఁడై
ఎలమి శివుఁదలఁచని - హృదయమ్ములేల మనసు.

---

# ఆలూరి కుప్పనకవి

## 'ఆంధ్ర కాళిదాసు'

ఆలూరి కుప్పనకవి తన యాచార్యవిజయమున నొక చోళేంద్రుఁడు తన 'కాంధ్ర కాళిదాస' బిరుదమునిచ్చి మన్నించినట్లుగా నిట్లు చెప్పుకొనియున్నాఁడు.

క. ఘనుఁడగు చోళేంద్రుఁడు దయ
దనరఁగ నీకాంధ్ర కాళిదాసాభిఖ మ
నన్నగా నొసంగెనటె నీ
యనుపమ సాహిత్యమునకు వా! యనవలదే.

తంజాపూరి పుస్తకశాలలో వ్రాఁతప్రతి[1]యం దిట్లున్నను మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తకశాలలోను,[2] ముద్రితప్రతి[3] యందును నీ పద్య మిట్లున్నది :

క. ఘనుఁడగు తుళజేంద్రుని దయఁ
దనరఁగ నీవాంధ్ర కాళిదాసాభిధ మ
న్నన గానొసంగెనటె నీ
యనుపమ సాహిత్యమునకు హా ! యనవలదే.

ఈ తుళజేంద్రుఁడు, శహాజీ రాజకుమారుఁడును శివకామసుందరీ విలాస నాటకకర్తయు, క్రీ. శ. 1729 నుండి క్రీ. శ. 1735 వఱకుఁ దంజాపూరిని బాలించిన మొదటి తులజాజీ కాఁదగును. మఱియు కుప్పనకవి గద్యలో 'శ్రీమద్భోసల తుళజమహారాజకటాక్ష సముల్లసితాంధ్ర కాళిదాసకవి ప్రణీతంబైన' అనియుఁ జెప్పుకొన్నాఁడు. మఱియు క్రీ శ. 1740-60 ప్రాంతములఁ బ్రసిద్ధుఁడైన కస్తూరి రంగకవి కీతఁడు శిష్యుఁడగుటచేతఁ బై కాలము స్థిరపడుచున్నది.

ఈ విషయ మాచార్య విజయావతారికలోఁగల యీ క్రింది పద్యమువలనఁ దెలియనగుచున్నది.

సీ. భారతికే విప్రవర్యుని జిహ్వ ని
త్యముగ వసించు నాస్థానవాటి
వాణీవధూటికే వ్వానినున్నలుకులు
ధరియించినట్టి ముత్యముల చాలు
శారదకే సుధీస్వామిచేతోవీథి
యమరిన రత్నసింహాసనంబు
పలుకుల వెలఁదికే భావజ్ఞునిగృహంబు
నెట్టుగావసియించు పుట్టినిల్లు

1. A Descriptive Catalogue of Telugu Manuscripts, Tanjore Library No. 130. Page 15.
2. Triennial Catalogue of Manuscripts Part 3. Telugu Vol. II, Page 1. No. 138.
3. వేలటూరి సుబ్రహ్మణ్యముగారి విద్యావిలాస ముద్రాక్షరశాల, మదరాసు, 18-8,

గీ. నలువచేలువకు సెవ్వడెన్న(దగు పుత్రుఁ
డట్టి కస్తూరిరంగార్యునచల ధైర్యు
నార్యనుత చర్యుమద్గురువర్యు నెంచి
ప్రణుతిఁ గావింతుఁ బలుమారు ప్రస్తుతింతు.

ఆచార్యవిజయ గద్యలో నాంధ్రకాళిదాసను బిరుదనామమే యున్నను, నీతని యసలుపేరు 'కుప్పన' యని యాతని భాగవత దశమ స్కంధ యక్షగానావతారిక[1]వలనఁ దెలియుచున్నది.

" ననునరసింహార్చనాసమున్నతుని
ఘనసత్కవిత్వలక్షణ విచక్షణుని
కస్తూరిరంగ సత్కవిశిష్యభూప
కస్తుత్యుఁ గుప్పనకవినిరప్పించి."

" పరికింప శ్రీమహాభాగవతంబు...
హరికతి ప్రియమగునందునుజూడ
నలదశమస్కంధమతి చిత్రమదియ
గాననమ్మహనీయ కథయెల్లయక్ష
గానప్రబంధంబుగా సంఘటించి
జననుతంబుగఁ బార్థసారథివిజయ
మనుపేరఁదనర......నొసగుమటంచు."

ఈతఁడు చాల కృతులు రచియించియున్నను, నందు రెండు మాత్రమే లభ్యమగుచున్నవి. తులజేంద్రునకుఁగూడఁ బ్రత్యేకముగనే దేనికృతి యొసంగెనేమో తెలియరాదు. పైనిఁజెప్పిన ఆచార్య విజయము (శంకరాచార్య చరిత) ఆనందగిరి రచిత శంకరవిజయమునకు దెనుఁగుచేత ఆ గ్రంథావతారికలో కృతి ప్రోత్సాహకులగు చెన్నపురి నియోగి శిఖామణులు తన్నుఁగూర్చి యీ విధముగఁ బలికినట్లు చెప్పియున్నాఁడు :

1. Descriptive Catalogue of Telugu Manuscripts Vol. VII. Yakshaganas No. 1907.

క. ననుశ్రీనృసింహ పాదా
ర్చనజనితలసత్కవిత్వచాతుర్య గుణా
ఢ్యుని నాంధ్రకాళిదాసా
ఖ్యునిఁబిల్వఁగఁ బంచిపల్కిరున్నత కరుణన్.

సీ. లీలపంచనదీస్థలీ పురాణము తెనుఁ
గించితివారూధి కీర్తిమెఱయఁ
బరగురామాయణ భాగవతంబులు
యక్షగానము చేతనిమ్ముతముగ
గరమొప్పఁ బరమభాగవత చరిత్రయుఁ
గృతియొనర్చితివి యున్నతిఁదలిర్పఁ
దెలివొందు నిందుమతీపరిణయ నామ
కృతిరచియించితి వతులగరిమ

గీ. గురుతరోజ్జ్వల సరణితో హరికథాసు
ధారసాభిధ కావ్యముదారఫణితి
గారచించితి వెనలేని గద్యపద్య
తతులులెక్కింపఁ దరమెత్వత్కృతులు జగతి.

పై వానిలో భాగవత దశమస్కంధము యక్షగానము లభించుచున్నది. తక్కిన పంచనదీస్థలీ పురాణము (తిరువాడి క్షేత్రము) పరమభాగవత చరిత్ర, ఇందుమతీ పరిణయము, హరికథాసుధారసము లభ్యము కాలేదు.

ఆచార్య విజయమునందలి గద్య: ఇది శ్రీలక్ష్మీనృసింహ దేవదయా సంపాదిత సరససాహిత్య విరాజిత శ్రీమదాలూరి వేంకటగిరి సుధీపౌత్ర, వేంకటేశ్వరార్య నరసమాంబికా సుపుత్ర, ఆపస్తంభ సూత్ర, కాశ్యపగోత్ర పవిత్ర కస్తూరిరంగ సద్గురుపాదారవింద భజనానందిత హృద్విలాస, శ్రీమద్భోసల తులజ మహారాజకటాక్ష సముల్లసితాంధ్ర కాళిదాసప్రణీతంబైన శ్రీమదాచార్య విజయంబను మహాపురాణంబునందు.....షష్ఠాశ్వాసము.

## కస్తూరి రంగకవి

ఆంధ్రకాళిదాస బిరుదాంకితుఁడగు నాలూరి కుప్పనమంత్రి గురువు కస్తూరిరంగకవియు దాక్షిణాత్య వాఙ్మయమునకుఁ జెందిన కవియే. కస్తూరిరంగకవి లక్షణచూడామణి యను పేరుగల "ఆనంద రంగరాట్ ఛందస్సు" అను గ్రంథముచే నీవఱకే వాఙ్మయలోకమునకు సుపరిచితుఁడు. ఈతని యచ్చతెనుగు నిఘంటువు 'సాంబనిఘంటువు' నిఘంటుత్రయములో నొకటి. కృష్ణార్జున చరిత్రమును, పద్మనాయక చరిత్రమును నీతని కృత్యంతరములు.

ఇతని లక్షణచూడామణి ఫ్రెంచి దొరతనమువారి కాలమునఁ బుదుచ్చేరిలో దుబాసిగానుండిన ఆనందరంగపిళ్ల కంకితము. కావుననే దానికి ఆనంద రంగరాట్ ఛందమను పేరుగలిగినది. రంగకవి యానంద రంగపిళ్ల యాస్థానకవియేగాక, రాజకీయ వ్యవహర్తగాఁగూడ నున్నవాఁడు. తిరుచినాపల్లిలో ఫ్రెంచివారి కాతఁడు వకీలుగానుండెడివాఁడు. రంగకవి వృత్తాంత మానందరంగపిళ్లగారి దినచర్యా గ్రంథమునుండి చక్కఁగాఁ దెలియుచున్నది. [1]ఈ రంగకవినిఁగూర్చి కీర్తిశేషులు వంగోలు వేంకటరంగయ్య పంతులుగా రిట్లు వ్రాసియున్నారు.

"మఱియు నీ కవియు తెలుఁగు దేశస్థుఁడుగాఁడు. తిరుచినాపల్లిలో సేనానాయకులలో నొక చిన్న యధికారిగానుండెను. అటులుండియు తెనుగున లక్షణగ్రంథము వ్రాయునంతటి పాండిత్యము భాషాభిమానము గలిగియుండెను. ఈ కవి ఆరువేల కమ్మనియోగి తెగవాఁడయినందున ఆంధ్రుఁడేయగును"

**ఈతని కృతుల వివరము :**

1. సాంబ నిఘంటువు :"సకలసురచక్రవర్తి శ్రీ సాంబమూర్తి" అను మకుటముగల సీసపద్యశతకము. అచ్చ తెనుఁగుపదము లిందంతకుమున్ను నిఘంటువులయందు గానబడనివి యుదాహృతములైనవి, ముద్రితము.

1. భారతి. అంగీరస–ఫాల్గునము. ఆనందరంగపిళ్ల దూాల్లెస్విభాషి. **పుటలు** 460 – 465.

2. కృష్ణార్జున సంవాదము: ఇందలి కథ గయోపాఖ్యానకథ, అయిదాశ్వాసములకృతి, అముద్రితము, శైలి రసవంతమైయుండును.

3. పద్మనాయకచరిత్ర: తెలుఁగుదేశపు చారిత్రక పద్యకృతులలో నిది యొకటి. ప్రాచ్యలిఖిత పుస్తకశాలలోనున్న ప్రతి యందీ క్రింది పద్యము లేకపోవుటచే రంగకవి కర్తృత్వము గుర్తింపఁబడలేదు.

"ఆది బడబాగ్నిభట్టునుమితయశుఁడు
కేళి ఛీమన దీని సంస్కృతమొనర్చె
రసికతఁ జెలంగ కస్తూరిరంగసుకవి
దానిఁ దెనిగించియుంచె సుధారసోక్తి"

పద్మనాయకచరిత్ర సంస్కృతమున వ్రాసినకవి బడబాగ్నిభట్టు (చూ. అప్పకవీయము 2-374). దాని తెలుఁగుచేత రంగకవిది. ఇది ప్రాచ్యలిఖిత పుస్తకశాలవారి యర్థసాంవత్సరిక పత్రికలో ముద్రితమైనవి. కాని యందు పై పద్యములేదు. దీనిని రావు వంశీయులచరిత్రమున 34 పుటలలో కీర్తిశేషులు గురుజాడ శ్రీరామమూర్తి పంతులుగా రుదాహరించియున్నారు.

4. లక్షణచూడామణి లేక రంగరాట్ ఛందస్సు తెలుఁగు వాఙ్మయమున గల ప్రసిద్ధ లక్షణ గ్రంథములలో నొకటి. ఇందుఁ ప్రథమాశ్వాస మంతయుఁ, గృతిపతియగు నానంద రంగపిళ్లయొక్కయు నాతని వంశముయొక్కయు సంపూర్ణ వృత్తాంతములతో నిండియున్నది. ఇది చారిత్రకముగ చాల విలువగలది. ఇక సాహిత్యవిషయమున నీ గ్రంథమున దశవిధచ్ఛందము లుదాహృతములైనవి. ఇతర లాక్షణికు లుదాహరింపని కృతు లిందు గన్పట్టుచున్నవి. ఇది తొలుత 'కళావతీ' పత్రికలో ప్రకటితమైనది. ఆ వెనుక వావిళ్లవారు ముద్రించియున్నారు. దీని ప్రశస్తి నెఱుఁగవలెనన్న సుపరిష్కృతమై,

---

1. కృష్ణార్జునసంవాదమన్నఁగా 'భగవద్గీత' యని వ్యవహారముకలదు. భగవద్గీతను తెలుఁగుచేసి కవులు తమ గ్రంథమునకీ పేరు పెట్టియున్నారు. చూ. కృష్ణార్జున సంవాదము భగవద్గీత – కస్తూరి రంగకవి, జలిచేటి వేంకటరాయ ప్రధాని.

చారిత్రకసాహితీ విషయవిమర్శసహితమైన ముద్రణమొకటి యత్యావశ్యకముగ వెలువడవలసియున్నది.[1]

---

## రెండవ ఏకోజీ

### (క్రీ. శ. 1737)

తులాజాజీ లేక తుక్కోజీ వెనుక నాతని తనయుడు రెండవ ఏకోజీ యొక సంవత్సరము మాత్రమే పాలించినను, నాతఁడు తన తండ్రి పెద్ద తండ్రులవలె సంస్కృతాంధ్ర భాషాపోషకుఁడై కృతికర్తగనుండుట ప్రశంసనీయము. ఈతనికి "బాబాసాహేబు" అని నామాంతరము. తెనుఁగున ద్విపదలో రామాయణ కృతిని నాలుకాండలను నీతఁడు రచియించియున్నాఁడు. కొందఱు పూర్వచరిత్రకారులు విమర్శకులుగూడ నీ రామాయణ రచనము క్రీ. శ. 1676-83లో రాజైన మొదటి ఏకోజీయని యభిప్రాయపడినారు. కాని యది సరికాదని, యిది రెండవ యేకోజీ కృతమని యీ క్రింది యవతారికా భాగము తెలుపుచున్నది.

---

1. కస్తూరిరంగకవినిఁగూర్చి యీ క్రింది వ్యాసములు గలవు.

1. వీరేశలింగము కవులచరిత్ర మూఁడవ భాగము 170-171 పుటలు. (1950 ముద్రణము)

2. ఆనందరంగపిళ్లె రంగరాట్ఛందస్సు కృత్యవతరణిక కీ. శే. వంగోలు వేంకటరంగయ్య పంతులుగారు. ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక. 8 సం. సం. 1.

3. శతకకవుల చరిత్ర. కీ. శే. వంగూరి సుబ్బారావుగారు. పుట 486.

4. ఆనందరంగపిళ్లె. దూప్లేద్విభాషి - భారతి.

5. కస్తూరిరంగయ్య. డాక్టరు రాఘవన్. భారతి. 1942.

6. Kasturi Rangiah. Article in English by Dr. V. Raghavan, B.C. Law Commemoration Volume.

“శ్రీగణనాథు నాశ్రితపారిజాతు
బాగుగనుతియించి వాక్సిద్ధికెపుడు
శ్రీశారదాదేవి చిత్తాంబుజమున
భాసిల్లఁబ్రార్థించి భక్తితోడుతను
వాసవప్రముఖ గీర్వాణవందితుని
భోసలాన్వయరాజ పూజితపదుని
ఫాలనేత్రుని భక్తపాలునిఁజంద్ర
మౌళీశ్వరుని దయామానసుఁదలఁచి
ధరణి రామాయణోద్యానసంచార
వరకోకిలంబైన వాల్మీకిఁదలఁచి
వ్యాసశుకాదుల వర్ణించి కాళి
దాసాది కవులకుఁ దగ కేలుమోడ్చి
కులదైవతమ్ములఁ గొనియాడమదిని
పొలుపొందు సత్కవి బుధులసమ్మతిని
భోసలకలశాబ్ధి పూర్ణచంద్రుండు
భాసురషాహోజి పార్థివసుతుఁడు
సాహసాంకుఁడు నిత్యసత్యసంధుండు
శాహాభూపాలుండు చతురమానసుఁడు
అతని తనూజుఁడేకావనీపాలుఁ
డతనిబాలకుఁడు శాహక్షితిపాలుఁ
డతనిసోదరుఁడు మహాకీర్తిశాలి
చతురుఁడు శరభరాజన్య దేవేంద్రుఁ
డారాజసోదరుం డతులవిక్రముఁడు
ధీరుఁడు నయశాలి దీపాంబసుతుఁడు
చోళభూపాలుండు సుగుణహారుండు
పాలితసుజనుండు పరమపావనుఁడు
పసువడి తుళజభూపాలుఁ డారాజ
తనయుండునానేకధరణిపాలకుఁడు
యతులప్రాసంబుల నర్థసంగతుల
ప్రతిలేని నవరసభావముల్ దనర

నిరుపమాలంకార నియమముల్ దనర
నరుదుగా వాల్మీకి యల రామకథను
రచియించినట్లు సారముగాఁగ ద్విపద
రచియింపఁ దత్కథాక్రమ మెట్టిదనిన
ఘన తపస్స్వాధ్యాయ కలితమానసుని
మునినారదునిఁజూచి ముదమునఁ బలికె."

పై యుద్ధృతాంశముననుసరించి రెండవ యేకోజీయే గ్రంథకర్త యని నిశ్చయముగఁ జెప్పనొప్పును.

ఏకోజిరామాయణమునుండి యీ క్రింది భాగముద్ధృతము.

"ఓరిరాక్షసులార! యుర్విపై నేను
శూరతవిలసిల్లు సుగ్రీవుబంట
శ్రీరామదూతను క్షితినివాయుజుఁడ
శ్రీరామునేమంబు సీతతోఁజెప్పి
పోవుచున్నాఁడ నీపురిరాక్షసులకు
వావిరిమృత్యువై వచ్చియున్నాఁడ
ననిపల్కి దైత్యుల నందఱఁగూల్చి
దనరుచుఁదోరణ స్తంభంబునుండె
హతశేషముఖమున నావార్త దెలిసి
ధృతిఁబూనికోపించి దేవతారాతి
గురుగొని పింగళాక్షుని దీర్ఘజిహ్వు
వరవక్రనాసాళ్మ వక్షశార్దూల
ముఖులనేపురఁబంప మొనసివారప్పు
డఖిలాస్త్రములనొప్ప హనుమంతుఁడలిగి
ధనువులువిఱిచి కేతనములుకూల్చి
పనువడిరథముల భగ్నంబుఁజేసి."

ఈతని రెండవ గ్రంథము 'విఘ్నేశ్వర కల్యాణ'మను నాటకము. ఇది శాహాజీమహారాజు రచియించిన విఘ్నేశ్వరకల్యాణ నాటకము ననుసరించి వ్రాయఁబడినది, సంస్కృతాంధ్రభాషామయము. ముందు

చూర్ణికయందు రామాయణమునందు వర్ణించినట్లే తన వంశక్రమమును సేకోజీ వర్ణించినాఁడు. గ్రంథనామ మిందలి యితివృత్తమును దెలుపు చున్నది. ఈతని తల్లి పేరు రాజహంసాంబిక యని యీ గ్రంథమువలనఁ దెలియుచున్నది. ఇందు సంస్కృతాంధ్ర గద్యలు రెండుగలవు.

తెలుఁగు

ద్వి. రాజేంద్రదశరథభోజ రాజనందనుఁడు
రాజహంసాంబికా రమ్యసుతుండు
శ్రీకరగుణములఁ జెలువొందునట్టి
యేకేంద్రవిరచిత మీచరిత్రంబు
ఎలమితో తుళజేంద్ర యేకేందునికిని
బలములు సంతానభాగ్యసంపదలు
ప్రణవస్వరూపుఁడు భక్తపాలకుఁడు
గణనాయకుండిచ్చు గణనమీఱఁగను.

సంస్కృతము

ఇతి శ్రీమద్భోసలకుల కలశాంభోధి సుధాకర, తుళజమహారాజ తనూజ ఏకమహారాజ ప్రణీతం విఘ్నేశ్వర పరిణయమనాకం సాంబశివ ప్రీతయే విఘ్నేశ్వర ప్రీతయే......న్మృదే సకలశ్రేయసేఽస్తు.

ఈతని పేర నీతిపదములు అను శీర్షికతో కొన్నిపదములు తంజావూరి పుస్తకశాలలో సంఖ్య 40-42 లో గలవు.

రెండవ యేకోజీవెనుక నాతనిభార్య సుజనాబాయి 1737-1738 వఱకును నావెనుక 1738-1739 వఱకు షాహుజీ అను నాతఁడును తంజావూరు రాజ్యమును బరిపాలించిరి వీరసమర్థులగుటచేతను, రాజ్యమునం దరాజక మేర్పడుటచేతను నీ కాలమున భాషాభివృద్ధిగాలేదు. వీరి తరువాత రాజ్యమున కధిపతియైనవాఁడు ప్రతాపసింహుఁడు.

# జయసింహుఁడు - నెల్లూరి శివరామకవి
(క్రీ. శ. 1740)

ప్రతాపసింహుని యగ్రజులలో రెండవవాఁడు జయసింహుఁడు. ఈతఁడును కవిపండితపోషకుఁడు. నెల్లూరి శివరామకవి యీతనియాస్థానమున నుండెను. శివరామకవి 'కామకళానిధి' యను కామశాస్త్ర విషయిక గ్రంథము రచించి జయసింహుని కంకితమొనర్చెను. అందులో నవతారికాభాగమంతయుఁ దంజావూరి మహారాష్ట్రరాజుల వంశావళికి సంబంధించినది.[1] ముందు నేనుదాహరించిన వంశవృక్షము నీ గ్రంథమందలిదే.

జయసింహుఁడు తన్నుఁబిలిపించి యీ విధముగాఁ బలికినట్లు కామకళానిధిలో శివరామకవి వ్రాసియున్నాఁడు.

చ. హితుఁడవు పాకనాటనుతికెక్కిన నెల్లురివంశజాతుఁడీ
వతులితసాహితీపటిమ యాదవరాఘవపాండవీయమన్
కృతిగలవీరరాఘవ కవీంద్రసుతుండవు కొద్దివాఁడవే
తతమతి సంస్కృతాంధ్రకవితానిరతా శివరామసత్కవీ.

## నెల్లూరి వీరరాఘవకవి

శివరామకవియొక్క తండ్రియగు నీతనిగూర్చి తొలుత తెలిపెదను. ఈతని తెనుఁగు కృతులు రెండు లభ్యమైనవి. ఒకటి యాదవరాఘవ పాండవీయము త్ర్యర్థికావ్యము, రెండు వసుంధరాపరిణయము.

1. తంజావూరి మహారాష్ట్రరాజుల చరిత్రకు మిక్కిలి యుపకరించు నీ గ్రంథము తొలుత క్రీ. శ. 1930 లో నవతారికతో 'శృంగార గ్రంథమాల' వారిచే ప్రకటితమైనది. ఈ గ్రంథము తాళపత్రప్రతిగాని వ్రాఁతప్రతిగాని తంజావూరి పుస్తకశాలలో లేదు. మదరాసు ప్రభుత్వప్రాచ్యలిఖిత పుస్తకశాలలో R. 420 సంఖ్యగానున్నది. అవతారిక యీవఱకే ముద్రితమైనను తిరిగి పుస్తకశాలవారిచే ముద్రితమైనది.

ఈ రెండవ గ్రంథమునఁ గవి తన వంశమును వర్ణించియున్నాఁడు. అందుఁ దాను రచించిన కృతులనుగూడఁ బేర్కొనియున్నాఁడు. ఆ వివరము లివి :-




వీరరాఘవకవి తన కృతులను వసుంధరా పరిణయములో నిటు పేర్కొన్నాఁడు.

సీ. సప్తకాండమ్ములు సప్తవిభక్తులు
హరికర్థము విశేషణాప్తిఁ దనర
రమణ విశేషణరామాయణంబునాఁ
గృతి రచించితి చమత్కృతి రహింపఁ
గృష్ణభుజంగంబు కృష్ణలీలామృత
త్రిపురారిదండకకృతి రచించి
అలర స్తంబోద్భవం బాదిగాఁ దత్కథ
గద్యకావ్యంబుగా ఘటనఁజేసి

రొంచ రసమంజరిని దెనిఁగించి నీతి
సర్వలోకేశ శతకంబు సంఘటించి
మంత్రపాద స్తవంబును మఱియుఁగృతులు
ఘటనఁజేసితి వీరరాఘవ కవీంద్ర !

పైవానిలో విశేషణరామాయణము తంజావూరి పుస్తకశాలలో నున్నది. ఇది సంస్కృతమున నున్నది.

3737. విశేషణరామాయణము. నెల్లూరి వీరరాఘవకవి:

శ్రీమత్కాశ్యపగోత్రసూత్ర మహితాప స్తంబ సూత్రస్యచ
శ్రీమన్నెల్లురి రంగమంత్రిసుధియః పౌత్రస్యవిద్యానిధేః
శ్రీమత్పూజిత వీణవెంకటపతేః పుత్రస్యరామాయణం
కావ్యం స్వీకురు వీరరాఘవకవేః శ్రీరామమేవాఙ్మయమ్
శ్రీరామాంఘ్రిసరోరుహాంకితమిదం శ్రీరాఘవాఖ్యావతా
ప్రోక్తం చారుతరం విశేషణమహారామాయణం వానవీమ్
శ్రీమచ్చాటుకథాసు కావ్యరచనా చాతుర్యవాగ్వైఖరీ
శ్రీవైచిత్ర్యధురంధరేణ కవినా చంద్రార్కతారంవసేత్.
శ్రీవిశేషణరామాయణే వీరరాఘవీయే ఉత్తరకాండే సమాప్తం

సంస్కృత విశేషణరామాయణము తప్పఁ దక్కిన రెండు తెలుగు ప్రబంధములును నెల్లూరియందు[1] అముద్రితగ్రంథచింతామణి పత్రికలోఁ బ్రకటితములైనవి. వానినుండి యీతని కవితావైదుష్యము ప్రతిభాదికము గ్రహింపనగును.

1. యాదవరాఘవ పాండవీయమును వీరరాఘవకవి క్రీ.శ. 1717 (శా శ. 1639)లో రచించినట్లుగా, నా గ్రంథము తాళపత్రప్రతిలోని యమృతకవి రాఘవయ్య లేఖనము వలనఁ దెలియుచున్నది. ఈ గ్రంథమును క్రీ. శ. 1887 లో నెల్లూరిలో నముద్రిత గ్రంథచింతామణి పత్రికాధిపతులు కీ. శే. పూండ్ల రామకృష్ణయ్యగారు ముద్రించి ప్రకటించిరి.

క్రీ. శ. 1949 లో నీ త్ర్యర్థి కావ్యమునకు "ఆనందజ్యోత్స్న" అను పేరితో టీకవ్రాసి, శ్రీ అచార్యసరిపెల్ల విశ్వనాథశాస్త్రిగారు. ప్రథమాశ్వాసము బ్రకటించిరి.

వసుంధరాపరిణయమును క్రీ. శ. 1902 లో అముద్రిత గ్రంథచింతామణిలో ముద్రితమై బ్రకటితమైనది. కాని మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారము వారి తెలుఁగు కేట్లాగు, VI-వ సంపుటము 2253 పుటలో నిది ముద్రితము కాలేదని వ్రాయఁబడినది. అది సరికాదని గ్రహింపనగును.

## శివరామకవి కృతులు - కామకళానిధి

కామకళానిధి నాలుగాశ్వాసముల గ్రంథము. సంస్కృతమున రచితమైన కొక్కోకకవి రతిరహస్యము ననుసరించినది. గద్య: "ఇది శ్రీగురుచరణారవింద మిళిందాయమానమానస, నెల్లూరి వీరరాఘవామాత్యతనూభవ సూరమాంబాకుమార సంస్కృతాంధ్ర సాహిత్యసార్వభౌమ శివరామనామ ప్రణీతంబైన కామకళానిధి యను కామశాస్త్రంబునం జతుర్థాశ్వాసము."

## రామగీతలు

శివరామకవి రామగీతలను దెనిఁగించి, మట్ల్టి కృష్ణభూపాలుని యాజ్ఞానుసార మా గ్రంథమును రామకృష్ణపురధాముఁడైన రాముని కంకితముగావించెను.

సీ. శ్రీమట్లికుల వార్ధి శీతమయూఖుండు
 జనకులగోత్ర విస్తారకుండు
నలకృష్ణవిభునకు నాసర్వమాంబకుఁ
 బౌత్రుండు సద్గుణభరితుఁడైన......
వేంకటకృష్ణభూవిభునకు వేంగమాం
 బకుఁ దనూభవుఁడునై భవబిడౌజుఁ
డగు కృష్ణభూపాలుఁ డాశ్రితావన [illegible]
 పురవాసియైన రామునకునంకి

గీ. తమ్ముఁగా రామగీతలు......తత్త్వబుద్ధి
నక్షరసువర్ణమయపంక్తి నర్చచేసి
యీ మహాకృతి సభలలో నెన్నికగని
జగతినాచంద్ర తారార్కముగఁజెలంగు.

ఈ గ్రంథ మారాశ్వాసముల పద్యకావ్యము. క్రీ. శ. 1888 లో ముద్రితమైనది. రామగీతలయందలి గద్య కామకళానిధి గద్యకంటె యించుక భిన్నముగా నున్నది.

" ఇతి శ్రీగురుచరణారవిందమిళిందాయమానమానస శ్రీరామచంద్రపూజావాప్త సమస్తసంపద్విలాస నెల్లూరి వీరరాఘవప్రధాన తనూజాత సూరమాంబకుమార సకలాంధ్రశాస్త్రలక్షణ సామ్రాజ్య సార్వభౌమ శివరామనామప్రణీతంబైన కామగీతలయందు........ ప్రథమాశ్వాసము." గ్రంథమున 804 పద్యములతో యోగశాస్త్ర విషయము సమగ్రముగాఁ దెలుపఁబడినది.

## ముద్దుపళని - రాధికా సాంత్వనము

దక్షిణదేశాంధ్ర వాఙ్మయములో విజయవిలాసము వెనుక విపుల ప్రచారముగలది రాధికాసాంత్వనము. యువకలోకము నుఱ్ఱూఁతలూగించుచు విద్వద్రసికుల నతివేగముగ నాకర్షించిన యీ శృంగారకృతి ముద్దుపళని రచనము. ఆంధ్రకవయిత్రులలో నీమెకొక విశిష్టస్థానముగలదు.

ఇళాదేవీయమను నామాంతరముగల రాధికాసాంత్వనము రచియించిన ముద్దుపళని వేశ్యాంగన తంజావూరి మహారాష్ట్రరాజగు ప్రతాపసింహేంద్రుని కాలమున (1769-1782) వెలసినది. తనవంశక్రమమును విద్యావిశేషము నిట్లు తనగ్రంథమునఁ దెలుపుకొన్నది.

నాల్గవజాతిలో




1, 2-వీరిరువురిని తంజానాయకి యను నామె దత్తుగాఁగొనెను. ముద్దుతంజనాయకి కొమార్తెయగు రామామణినిగూర్చి యిట్లున్నది.

ఈ రామామణి సౌందర్యవతి యగుటయేగాక భగవద్భక్తురాలై యగ్రహారాది దానధర్మవ్రతశీలయై ప్రసిద్ధికెక్కినది.

సీ. ఏరామునకట్టించి యిడె నగ్రహారంబు
　　పుడమిరామాంబాఖ్య పురమనంగ
నమరనేధన్యదివ్యాలయం బొనరించి
　　తిరముగాఁగ శివప్రతిష్ఠఁజేసె
నెంచి యేపుణ్య పెట్టించె నందనవని
　　కొఱతేనివిరులెత్తి కోమరుమిగుల
నేమాన్యజీవనం బెసఁగఁదటాకంబు
　　ఘటియించె సేతుమార్గంబునందు

గీ. మేటియెవ్వతె గండరకోటలోన
మఱియునిత్యాది దానాది మహిమలంది
పార్వతీశుల నిత్యోత్సవములొనర్చె
నట్టిరామామణి వధూటి నలవిపొగడ.

ముత్యాలు పోటిబోటిని పెండ్లాడి సంతానవంతుఁడయ్యెను.




పై సంతానములో తొలిచూలు, ముద్దుపళని వంశమున కెల్లఁదుల లేని కీర్తి తెచ్చినది.

ముద్దుపళని పేరు దేవక్షేత్రము పేరు. దక్షిణదేశములో వేలాయుధుని పూజాక్షేత్రము పళని. "చాలచోట్లబిడ్డలకు దేవస్థలముల పేరులే ఉంచుచుండుట వాడుక ఉన్నది." అను శ్రీమతి బెంగుళూరి నాగరత్న నారీశిరోమణి మాట ననుసరించి పేరు సమంజసముగానేయున్నది. ఈమె గ్రంథావతారికలోఁ దన్నుఁగూర్చి చెప్పుకొన్నవిషయములన్నియు నతిశయోక్తులుకాక యన్వర్థములై యలరారుచున్నవి.

సౌందర్యము. సీ. చెన్నొందురంభ గాకున్నచో నుబ్రతాప
సింహేంద్రు పెంపును జెందనేల ?
ఆకారము. ప్రతిలేనియలకల్పలతిక గాకున్నచో
లలిముద్దులక్ష్మితో వెలయనేల ?
శరీరకాంతి. తగుదివ్యసుగుణరత్నంబు గాకున్నచో
ముత్యాలలోనుండి పొదలనేల ?
సౌరభము. యిలసుగంధప్రద మిదియ కాకున్నచో
శ్రీనివాసప్రాప్తిఁ జెలఁగనేల ?

కళాప్రౌఢి. గీ. వీఁకఁగలచంద్రరేఖయె కాకయున్న
లలితసకల కళాప్రౌఢి వెలయనేల
యనిపొగడమేటిదై మీఱెనతనుఘోటి
భవ్యవాగ్ధాటి శ్రీముద్దుపళనిబోటి.

రామభక్తి. సీ. ఏనాటియీరీతి నెంతొభక్తిచెలంగ
వ్రాయించెజయధాటి రామకోటి
విద్వత్సమ్మానము. ఏనారి యీదారి నెలమివిద్వచ్ఛ్రేణి
దనియించె నెఱమెచ్చిధనములిచ్చి
కృతిభర్తృత్వము. ఏకల్కి నీపోల్కి నిలకీర్తిఁగైకొనెఁ
గబ్బముల్ చేనంది ఘనతఁజెంది
ఘనత. ఏబాలనీలీల నిటుబరాబరులచేఁ
బొగడొందెగడిదేటి పొలుపుమీటి

వైష్ణవప్రపత్తి. గీ. తలఁపనేధీరనేమేర తాతయార్య
పాదములవ్రాలెమది నెంచి ప్రస్తుతించి
కలరెనీపాటి ముత్యాలుకన్నమేటి
ప్రబలగుణపేటి శ్రీముద్దుపళనిబోటి.

కవనశక్తి. సీ. ఘటియింపనేర్తువు కవనజాతులెఱింగి
పలుకులకల్కి వెల్వెలనఁబాఱ
దాతృత్వము. నీయఁగానేరుతువిలఁగోరినవరాలు
నగరాజు సుకుమారి సగముగాఁగ
సతీధర్మము. చెల్లింపనేర్తువు చెప్పినరీతిగా
గనిద్రౌపదీసతి కానకేగ
నాట్యకౌశలము. నటియింపనేర్తువు నవరసంబులునంటి
తగురంభ యనిమిషత్వమువహింప

సరసత్వము. గీ. నీదె మనయుక్తిపరికింపనీదెశక్తి
నీదెనెఱపద్దునరయఁగా నీదెముద్దు
సరసముగఁజేరి రాధికాసాంత్వనమ్ము
భక్తి హరికిమ్ము శ్రీముద్దుపళనిబోటి.

ముద్దుపళని కృతిసందిన కృతులు నేఁడు కానరావు. ఆమె యితర రచనములుకూడ కానరావు. స్త్రీలలోఁ గృతులు రచించినవారు గలరు కాని, ముద్దుపళనివలెఁ గృతు లందుకొన్నవారు వేరు. కావున నీవిష యమున నీమె ప్రత్యేకవిశిష్టత యెన్నఁదగినది.

ఈమె చిన్నికృష్ణుని శృంగారభక్తురాలు. ఇంకను నీమె విద్యా వైదుష్యము క్రింది యాశ్వాసాంత గద్యనుండి గ్రహించవచ్చును.

"ఇది శ్రీచిన్నికృష్ణకరుణాకటాక్ష వీక్షణక్షణ ప్రవర్ధమానాసూన శృంగార రసప్రధాన సంగీతసాహిత్య భరతశాస్త్రాది విద్యాపారంగత శ్రీమత్తిరుమల తాతయాచార్య పాదారవింద మిళిందాయమానమానస, చోళసింహాసనాధ్యక్ష ప్రతాపసింహమహారాజ బహుకృతానేకచా మీకరాంబరాభరణ, ముత్యాలుగర్భశుక్తి ముక్తాయమాన ముద్దుపళని ప్రణీతంబైన రాధికాసాంత్వనంబను శృంగారప్రబంధంబునందు ప్రథమా శ్వాసము.

ఇందు ప్రథమాశ్వాసమున 154, ద్వితీయాశ్వాసమున 147, తృతీయాశ్వాసమున 171, చతుర్థాశ్వాసమున 113, మొత్తముమీఁద 585 గద్యపద్యములు గలవు. షష్ఠ్యంతములు ఆశ్వాసాద్యంతములు మొదలగు వానియందుతప్ప, తక్కిన గ్రంథమునందంతట తెలుఁగుపలుకుల మెలఁకువలు జాతీయములు నిండారియున్నవి. ఈ నాలుగాశ్వాసముల లోను గథాంశములు స్వల్పమే.

శ్రీకృష్ణుని యశోదానందులు గారాబముతో వ్రేపల్లెలోఁ బెంచు కొనుచుండిరి. నందుని చెల్లెలు రాధ శ్రీకృష్ణునికి యౌవనము వచ్చిన నాఁటనుండి, యాతనిమోహించి, తనవశముచేసికొని, తుదకుఁ బ్రాణపద

మైనది. యశోదతోఁబుట్టువు కుంభకుఁడు. అతనికూఁతురు ఇళ. మొదటి నుండి యిళ మేనత్తవద్ద వ్రేపల్లెలో రాధ పోషణలోఁ బెరిగినది; పెద్ద మనిషియైనది. ఇళను శ్రీకృష్ణునికిచ్చి వివాహము చేసినారు. ఇళ వయసులో చిన్నదియైనను, తెలివితేటలలో మిన్నగావున శ్రీకృష్ణుని ననురక్తుని గావించుకొన్నది.

కొన్నాళ్లకుఁ గృష్ణుఁడు అత్తవారింటికి నీళాదేవితో మిథిలకు వెళ్లినాఁడు. అప్పటినుండి రాధ కృష్ణుని విరహవేదన భరింపఁజాలక సవతి మత్సరముపూని యొకచిలుక ద్వారా మిథిలకు రాయబారమంపినది. చిలుక యిళామాధవుల సంగతిచూచి వచ్చి రాధకు చెప్పసరి కామె చాల తూలిపోయినది.

ఇంతలోఁ గృష్ణుఁడు రాధనుచూచుటకు తహతహలాడి వ్రేపల్లెకు వచ్చినాఁడు. రాధ 'ఉక్రోషముతో' మండిపడి శ్రీకృష్ణుని యెన్నోవిధములుగా మాటలనినది. పదములంటినఁ దన్నినది. చివరకు నేడ్చినది. శ్రీకృష్ణుఁ డామెనూరార్చి, సాంత్వనవచనములు పలుకఁగానే కృష్ణుని కౌఁగిలిలో నైక్యభావన యందినది. రాధసంబంధమైన సాంత్వనము ప్రధానముగాన నీ కృతికి "రాధికాసాంత్వనము" అని పేరువచ్చినది.

ఇది ప్రధానముగా శృంగారకావ్యము. అందును దాక్షిణాత్య శృంగారకావ్యములకు సంబంధించినది. కావున నిందు బాహ్యాభ్యంతర సురతవర్ణనము గోప్యాంగవర్ణనము విశృంఖలముగాఁ జేయఁబడినవి. ఇట్టివి యానాఁటికావ్యములలో సర్వసాధారణములే. మఱియు నీ గ్రంథములో చాలభాగము, సముఖము వేంకటకృష్ణప్ప నాయకుఁడు రచించిన రాధికాసాంత్వనమునుండి గ్రహింపఁబడినదని వేంకటకృష్ణప్పనాయని చరిత్రయందు వెనుక వివరించియున్నాను. గ్రంథవిస్తరభీతి నిచటముందు చూపలేదు. ఇందలి శృంగారమత్యుత్కటమై, యీ తరువాత నాంగ్లేయ ప్రభుత్వమువారి నిషేధమునకుఁ బాత్రమైన గ్రంథములలోఁ బ్రథమముగా నిలిచినది. అయినను, ఆనాఁటి శృంగారాభిరుచులనుబట్టి చూచిన నంత విపరీతముగఁ గన్పట్టకపోవచ్చును.

ముద్దుపళని వేశ్యయేయైనను విద్వత్కవయిత్రి. పశుపుభోటియే యైనను భగవత్ భాగవత కైంకర్యపరురాలు. సానియేయైనను సంగీత సాహిత్య విద్యావిశారద. వెలయాలేయైనను విద్వత్సమ్మానిత. ఇన్ని విశిష్టగుణము లీమెయందుండుటచేతనే, యీ కావ్యము ప్రజాదరణకుఁ బాత్రమైనది.

ఈమె శృంగారపాండిత్యము 'వనవిల్తుశాస్త్రంపు మినుకులా వర్తించుపని వెన్నతోఁడఁబెట్టినది' అను వాక్యమునకు స్మారకము.

ఆపాండిత్యమైనను శుశ్రూషచేసి నేర్చినట్లుగా :—

"గణనసేయదొ మరుసాముగమనములకుఁ
దానునాచేతఁబడిన బెత్తంపుఁబెట్లు." (3–7)

అను పాదమువలనఁ దెలియుచున్నది.

ఈగ్రంథములో రాధికాపాత్రలో ముద్దుపళని యంతర్భావముఁ జెందినది. తనప్రభువగు తంజావూరిరాజు ప్రతాపసింహుఁడే శ్రీకృష్ణుఁడు. తాను ముద్దుపళనిపేరున వెలసినరాధ. ఆమె శృంగారానుభవములను నీగ్రంథరూపమున వ్యక్తమొనర్చినట్లుగా నిందలి శృంగార సన్నివేశ ములయందలి మెలఁకువలుపట్టి యిచ్చుచున్నవి. "దక్షిణనాయికాధ్యక్షుఁ డైన గోపాలదేవుఁడు" అని యవతారికలో నీమెచెప్పుటయే పై విష యమును స్పష్టపఱచుచున్నది. ఇహపరముగా దక్షిణనాయకుఁడు శ్రీకృష్ణుఁడు. ముద్దుపళనిపరముగా దక్షిణసింహాసనాధ్యక్షుడగు తంజా వూరిమహారాష్ట్రరాజు ప్రతాపసింహుఁడు.

ముద్దుపళనిరచన జాతీయములతో నానుడులతో ముద్దులుగులుకు చుండును. "చల్లకై వచ్చిముంతదాఁచంగనేల (2–126). నిన్నఁగుప్పయు నేడాళ్లు (3–7). పిచ్చుకమొదిర్చి కాట్లాడవచ్చినట్ల (3–8). తాను బెంచిన పొట్టేలుతనదుచే సన్నఁబడుట (3–9). వేలువాచిన రోలంత విరివియైన రోలువాచిననది యెంతబోలు (3–10). కుట్టఁదేలుకుట్టకున్నఁ గుమ్మరబూచి (3–13). ఎంతమీనువచ్చి యెంతమీనున్రమింగె (3–13).

వెన్నకుఁబండ్లు వచ్చువితము (3-16). అర్ధరాత్రి గొడుగు తెమ్మన్నకత (3-18). కొన్నంగడిలోపలనే మూరుబేరము (3-23). కుమ్మరికిఁజూడ నొకయేఁడు గుదియకొక్కపెట్టు (3-24). అత్తనెత్తి చేతులంగడిలోఁ గన్నులు (3-28). ఇట్లొక యాశ్వాసమునందే యివి కుప్పతిప్పలుగ నున్నవి.

ఈ గ్రంథమున ముక్కుతిమ్మన పారిజాతాపహరణము, రామరాజభూషణుని వసుచరిత్ర పోకడలు గలవు.

చ అనవినిద్రవేటువడ్డ యురగాంగనయుంబలె. 1-82. పారిజాతాపహరణము.
అనఁగుబుసంబునూడ్చిన మహాభుజగాంగననా, 4-68. రాధికా.

శా. మాయాశీలుర చంచలాత్ముల నుకంపాశూన్యులాత్మీయ కా
ర్యాయత్తుల్ సమయానుకూలహృదయ వ్యాపారగోపాయనో
పాయజ్ఞుల్ మగవారలాపయిని భూపాలుర్ మహావైభవ
శ్రీయోగాంధులు చెప్పనేల మగవారిన్నమ్మగావచ్చునే ? వసుచరిత్ర 3.

చ. కపటులుక్రూరచిత్తులు స్వకార్యపరుల్ కరుణావివర్జితుల్
చపలులసత్యభాషణు లిలన్మగవారలు.........

చ. నిలుకడసున్న: తాల్మినహి, నేస్తముదబ్బర, మాటపద్దులే
వలపుహుళక్కి యానలుసివాపులు పైపయిమేల్మినీతు నీ
తులు మెఱమెచ్చులాదరణదూఱుదయల్ సట నమ్మవచ్చునే
యిలమగవారిఁ దన్మహిమలెన్నఁగ శక్యమెయుందులన్ హరీ!
రాధికా. (4-70-71)

ఇట్టివియున్నను ధారాశుద్ధి పదములపొందిక గలిగి తెలుఁగుఁదనముగల రచన యిందుచాలఁగలదు.

" ఉ. మాటలుముద్దుపల్కులు, మక్కువటెక్కులు మొక్కుసొక్కులున్
గాటపుఁగౌఁగిలింతలు వగల్ గిలిగింతలుమీటు వింతలున్
మాటికిమాటికిం గలియుమాలిమి మేలిమిఁజూచినట్టియో
యాటది వానివీఁకునకటా ! కడురక్కసినన్నుఁదక్కఁగన్ ! 2-59.

అనునది పైరచన కొకమచ్చుతునుక. గ్రంథమంతయు నిట్లేసాగినది.

“ ఎంతయొయ్యార, మెంతసొగ, సెంత వదాన్యత, యొంతరాజసం,
బెంతవిలాస, మెంతకళ, యొంతగభీరత, యొంతసోయగం,
బెంతనిరూఢ, మెంత నయ, మెంత మనోజ్ఞత, యొంతకీవినా
యంతటిమందభాగ్య కిఁకనంతటిచక్కనిదేవ్రుఁడబ్బునే ” (2–112)

అనురాధఁగూర్చిన పద్యములోని చివరపాదము ముద్దుపళనికే యన్వయించి, యీ కవయిత్రి చరిత్ర ముగింతును.

ఏంతయొయ్యారమెంత... ... ...
... ... ... ...ఎంతరీవినీ
కింతులలోన ముద్దుపళనీ ! తులలేరుగదమ్మ ! మానినీ !

రాధికాసాంత్వనములోని పద్యములు [1]‘ఆంధ్రధ్వన్యాలోకమున’ నుదాహృతములైనవి, వానిని వివరించుచున్నాఁడను

ద్వితీయోద్ద్యోతము – పుట 262. అర్థశక్తిమూలమున కుదాహరణము.

సీ. చిగురాకునును మోవి చెలియనెమ్మోవికా
గజిబిజయగు పలుగంటులెల్ల ?
నవచెండులను జెండునాతిలేఁజనులకా
కఱకుగోటి ఫిరంగిసరకులెల్ల ?
నగునాచునననేచు నతివపెన్నెఱులకా
కక్కసంబగు పెక్కుచిక్కులెల్ల ?
మరువంపుగురుదింపు మగువనెమ్మోవికా
విడువనిమరుసాము బడలికెల్ల ?

గీ. నకట ! మగలకుఁ దమయక్కలైనఁజాలు
నబలలాగెంచి లాలించరనుచు నిళవు
వగచుగతిరాధ తనలోనివంతఁదెలియఁ
జేసెశౌరికి నన్యాపదేశముసను. (1–142)

1. న్యాయశిరోమణి వేదాల తిరువెంగళాచార్యులు గారిది. ప్రకాశకులు హైదరాబాదాంధ్ర సాహిత్యపరిషత్తు. 1950.

ప్రకృతపద్యమున నభివ్యక్తముకాఁదగిన యభిప్రాయమును గీతిలోని చివర రెండు పాదములను బైటఁబెట్టినవి. అందువలన వ్యంజనలోని చమత్కార మూలమగు గూఢత చెడిపోయినది. కావున నిదియు ధ్వనికాదు.

రూపకధ్వని - పుట 275.

ఆ. వె. సొమ్ములియ్యవచ్చు సొమ్మందమియవచ్చు
నియ్యరాని ప్రాణమియ్యవచ్చు
తనదువిభుని వేఁడి తరుణిచేతికినిచ్చి
తాళవళమెయెట్టి దానికైన. (1-116)

సీ. ఎటుతాళనున్నదో యీకొమ్మకెమ్మోవి
కైటభారాతి పల్గాటులకును ?
ఎటులోర్వనున్నదో యీకన్నెచన్నులు
గోపసింహునిగోటి కుమ్ములకును ?
ఎటులాగనున్నదో యీయింతినునుమేను
దంతిమర్దను గాఁగిలింతలకును ?
ఎటులాగనున్నదో యీతన్వి తేఁదొడల్
చాణూరహరుమూరు సాదనలకు ?

తే. గీ. అంచునును గేలియొనరించు మించుఁబోండ్ల
గాంచితలవంచిసిగ్గుచేఁ గలఁకఁబాఱు
వారిజాననవీనుల వద్దఁజేరి
బుద్ధిగానిట్టులనురాధ బుజ్జగించి. (1-`07)

ఇందుఁ ద్రాసాభాసోపస్కృతమును, శృంగారాంగమునగు హాస్య నర్మ వ్యంగ్యము. ప్రథమచరణమున కెమ్మోవి యుపమవ్యంగ్యము ద్వితీయ చరణమున గోపసింహుఁడు అను విశేషణమువలన వ్యంగ్యము తృతీయ చరణమున ' దంతి ' మర్దనుడు అను విశేషణమువలన స్ఫూర్తి వ్యంగ్యము చతుర్థచరణమున మల్లలోకైక శ్రేష్ఠునితో శ్రీకృష్ణునికి సామ్యము నట్టిదే ......... ఇట్లు వ్యంగ్యములగు నుపమములును దదున్మీలితమగు శ్రీకృష్ణుని యభిలాషయు, ప్రముఖవ్యంగ్యములు పరికరాలంకృతమును, త్రాసాభాసోపస్కృతమును నగు హాస్యమున కంగములై దాని నధిక రసాస్వాదనీయ మొనర్చును. (వివరములకు 275 - 277 పుటలు చూడుఁడు).

ఇట్లే "చెలిమిని చిన్ననాఁడె" (4-55) అను పద్యమును "వారి మోమునుజూచి నేనేల బేలైతి" అను పద్యమును ద్వితీయాశ్వాసమున నుదాహృతములైనవి. దీనినిఁబట్టియే రాధికాసాంత్వనమునకు శృంగార కావ్యములయం దెట్టి విశిష్టత గలదో యెఱుఁగవచ్చును.

ముద్దుపళని పాశురములు - సప్తపదులు.

ద్రావిడభాషలో గోదాదేవి (ఆండాళ్) రచించిన తిరుప్పావై అను ముప్పది పాశురములకు సప్తపదులు గేయరూపమైన తెనుఁగుసేఁత. తెలుఁగులో 14 చరణముల పాటగానున్నది. ఆ ముప్పదింటిలోఁ బది మాత్రమే ముద్దుపళని కృతముగా దొరికినట్లు, శృంగార కావ్యగ్రంథ మండలివారు 1936 లో రాధికాసాంత్వనమునకు ననుబంధముగాఁ బ్రకటించిరి. అంతకుముందే కీ. శే. ప్రభాకరశాస్త్రులవారు 1925 లోఁ దక్కిన వానిని బూరించి సప్తపదులను బూర్తిగ 'స్వధర్మప్రకాశిని' లోఁ బ్రకటించి ప్రత్యేక గ్రంథరూపమున వెలువరించిరి. కాని ముద్దుపళని గ్రంథ కర్తృత్వమునుగూర్చి సందియముగలిగి ప్రసిద్ధ విద్వాంసులగు శ్రీ బులుసు వేంకటరమణయ్యగారు, మూలప్రతులను పరిశీలింపఁగా నందు మొదటి చరణములోనే,

"శ్రీనివాసగురుఁడు విష్ణుచిత్తుమూర్తి ముద్దుపట్టి
పూనిచేయు ద్రవిడ పాటలోనిభావమూ
చెలఁగి తెలియఁగాను నాదుజిహ్వాకొనను నిలచియిటుల
పలికెతిరుప్పావు సప్తపదిపదంబుగా... అనియు

చివర. పావిరిలగనిటుల శ్రీనివాసదేశికుండు తిరు
ప్పావు భావమెల్ల సప్తపదులు గూర్చిరీ."

అని యుండుట కనిపెట్టిరి. ఈ గ్రంథము సురపుర సంస్థాన విద్వాంసులగు శ్రీనివాసదేశికులను మహాపండిత కవులు రచియించినదని వారే గ్రహించి యుది ముద్రితమగుట నెఱింగి దానిఁ దెప్పించి, గ్రంథ కర్తృత్వము ప్రామాణికముగ ముద్దుపళనిది కాదని నిశ్చయించిరి. పూర్వపాఠము ముద్రణములలో "శ్రీనివాసగురునిఁదలఁచి చిత్తమునను,

పూనిచేయు ముద్దుపళని ద్రవిడ పాటలోని భావము''అని మాటు టచే వచ్చిన యీాయనర్థకపాఠమును శ్రీ వేంకటరమణయ్యగారు బహిష్క రించి, నిజస్థితిని 'సప్తపదులు' అను వ్యాసమున భారతి (సం 15. సం 3. మార్చి 1938) లో నిర్వివాదముగా నిరూపించినారు. (పుటలు 236-241)

అట్లయ్యును నేఁటివఱకు వాఙ్మయచరిత్రకారు లీ పాశురములను ముద్దుపళని కృతిగా వ్యవహరించుట శోచనీయము. [1] రాధికాసాంత్వనముల ప్రతుల వివరము.

---

1. రాధికాసాంత్వనము – ముద్రితా ముద్రితప్రతులు కాగితపు ప్రతి సంఖ్య 707.

సంఖ్య 708. Note by C. P. Brown

The Radhikasantwanam
or
The melting soul of Radhika (or Ila)
Adopted daughter of Radha
Favourite mistress of Crishna

An amatory Poem written by Palani; a dancing girl mistress to the Raja of (Tanjore) named Vira Batapa simha.

This poem is excessively rare. I at last obtained three manuscripts all imperfect but luckily deficient in different places and from third Venkatanarasu under my directions and formed this Complete edition.

It does not seem probable that the lady herself composed the whole poem: part of which display much learning. Her name and the other names she introduces as relations appear to be maharatta utterly different from telugu appellations Her tutor Vijayaraghawachari probably assisted her; but her composition in other parts evince a female hand, and it may be observed that she uses only the changing meters those being the easiest to compose in. She also uses the easiest and loosest rhymes such as అఖండయతి and వబయోరభేదయతి etc.

709. బ్రౌనుదొరవారి ప్రతి. పాఠభేదములతోనున్నది.

711. రాధికాసాంత్వనము. సటీక. వాడుకభాషలో నీ గ్రంథమునకు సంపూర్ణ వ్యాఖ్యానము వ్రాయఁబడినది. వ్యాఖ్యాత పైడిపాటి వెంకటనరసు.

712–13. మొదటి రెండాశ్వాసము లొకసంపుటము, మిగిలిన రెండాశ్వాసము లొక సంపుటము. బ్రౌనుదొరవారి ప్రతి. [P.T.O.]

## అమరసింహుఁడు - మాతృభూతకవి

ప్రతాపసింహుని కుమారుఁడగు నమరసింహుఁడు తండ్రివలెనే భాషాపోషకుఁడు. ఈతఁడు రెండవ తుల్జాజీ వెనుక నొకసంవత్సరము (క్రీ. శ. 1788-1789) తంజావూరినిఁ బాలించినవాఁడు. ఈతని నామాంకితముగా మాతృభూతయ్య అనుకవి 'పారిజాతాపహరణము' అను నాటకము రచించియున్నాఁడు. అది అమరసింహమహారాజు మంత్రియగు శివరాయమంత్రి ప్రోత్సాహమువలన జరిగినది. అందలి గద్య "ఇది శ్రీచోళసింహాసనాధ్యక్ష భోసలప్రతాపసింహరాజ పూర్వపుణ్యపరిపాక స్వరూప యమునాంబికా గర్భశుక్తిమౌక్తికాయమానామరసింహ మండలాధీశ్వర నామాంకితంబైన మంత్రిమార్తాండ శివరాయమంత్రి కారితంబైన శ్రీమత్సుగంధి కుంతలేశ్వర కరుణాకటాక్షవీక్షణ సుధాసారసంజనిత చతుర్విధకవితానిర్వాహక, శాండిల్యగోత్రపవిత్ర, కవిరంగయార్యపుత్ర విద్వజ్జనవిధేయ మాతృభూతకవినామధేయ ప్రణీతంబైన పారిజాతాపహరణ నాటకమందు సర్వంబును పంచమాంకము."

---

పై యంశమువలన మొదట నీ గ్రంథమును సంపాదించి వ్యాప్తిలోనికిఁ దెచ్చినకీర్తి బ్రౌనుదొరవారిది యని చెప్పఁదగును. ఈ క్రింది ముద్రిత ప్రతుల కాధారము పై ప్రతులే.

1887. శ్రీధామ ముద్రాక్షరశాల, మదరాసు.

1907. శ్రీపారిజాత ముద్రాక్షరశాల, మదరాసు.

1910. ఇండియా ముద్రాక్షరశాల, మదరాసు. శ్రీమతి బెంగళూరి నాగరత్నముచే ప్రకటితము. ఇందు విపులపీఠిక గలదు. ఈ ప్రచురణయే ప్రభుత్వనిషేధమునకుఁ గారణమైనది.

1936. శృంగార కావ్య గ్రంథమండలి, మచిలీపట్టణము. కే. జి. మూర్తి.

1937. శ్రీసత్యనారాయణ పబ్లిషింగు హౌస్, రాజమహేంద్రవరము.

1950 శ్రీవావిళ్ళ రామస్వామిశాస్త్రులు అండ్ సన్సు, శ్రీవావిళ్ళ వేంకటేశ్వర శాస్త్రులవారు శృంగారగ్రంథములపై నిషేధము తొలఁగింపఁజేసి ప్రథమముగ దీనిని ప్రకటించిరి.

గ్రంథకర్తయగు మాతృభూతకవి తనవంశమునుగూర్చియు, కృతి ప్రేరకుఁడైన శివరాయమంత్రి వంశమునుగూర్చియు నిట్లు గ్రంథముఖమునఁ జెప్పియున్నాఁడు.

“ జయజగత్పరిపాల, జయరుక్మిణీలోల
జయమధురవాగ్జాల, జయకృపాపాల
జయఘనాఘననీల, జయసురామరసాల
జయదళితశిశుపాల, జయ జయగోపాల
... ... ...

ద్వి. ప్రకటమహామద్దుర స్వామినిఁదలఁచి
గురుతరశాండిల్య గోత్రపావనుఁడ
వరకవిరంగార్య వరతనూభవుఁడ
గురుకృపాసౌగంధి కుంతలాదేవి
వరముచేజనియించి ప్రబలినవాఁడ
మాతృభూతస్వామి మహితకటాక్ష
చాతుర్యపరిలబ్ధ సరససాహిత్య
సంగీతమధుర వాగ్ధురిఁ గల్గువాఁడ
శృంగారరసము చెల్విన మేలువాఁడ
కవిమాతృభూత నాఖ్యానంబుచేత
భువిలోపలఁ బ్రసిద్ధిఁబొందినవాఁడ
గరిమచేలోక విఖ్యాతంబుగాను
సరవిమీఱఁగఁ బారిజాతాపహరణ
మనుమహానాటకం బందఱు మెచ్చ
వినుపింతు త్రైలోక విఖ్యాతముగను.

పై వానినిఁబట్టి మాతృభూతకవి, “శాండిల్యగోత్రుఁడు, రంగార్యుని పుత్రుఁడు, సంగీతసాహిత్య విద్యావిశారదుఁడు, సుగంధికుంతలాదేవి వర ప్రసాది ” అను విషయములు తెలియుచున్నవి. ‘ మాతృభూతయ్య ’ అని పేరుండుటచే నీతఁడు దక్షిణదేశమున నెలకొన్న తెలుఁగుకవి. అరవములో మాతృభూతేశ్వరుని యాలయమునకు “ తాయిమాన్

కోయిల్ " అని పేరు. ఈతనిభార్య సుగంధికుంతల. ఈ యాలయము పుదుకోటలో నుండుటచే నీకవి పుదుకోట నివాసియని యూహింప నగును. మఱియు 'సంగీతసంప్రదాయ ప్రదర్శిని' యందుదాహరింపఁ బడిన మాతృభూతయ్య పదము లీతనివేయని చెప్పనగును.

ఈతని ప్రోత్సహించిన శివరాయమంత్రి కృష్ణరాయలచెంత యప్పాజీవలె యమరసింహునియొద్ద నుండెడివాఁడు. ఈతని తండ్రి శంభాజీ. శంభాజీకిఁగల నలుగురు పుత్రులలో నీతఁడు రెండవవాఁడు.

శంభాజీ

త్రియంబకమంత్రి | శివరాయమంత్రి | నాగోజీ | శంకరుఁడు

ఈ వృత్తాంతము గ్రంథావతారికయం దిట్లు చెప్పఁబడినది.

వ. అని * * * కృతిపతి నభివర్ణించెద నెటువలెనా.

ద్వి. శ్రీభోసలకులాబ్ధి శీతాంశుఁడనఁగ
ప్రాభవంబందిన పరమపుణ్యుండు
శ్రీకరమై...లునుభాసిలు చోళరాజ్య
మేకచక్రంబుగా నేలెడువాండు
మకరందముఖ్యసముంచితబిరుదు
లకలంకముగ బూనియమరినవాండు
పొలుపైన శ్రీతంజపుటభేదనమను
తెలిదీవికిని విష్ణుదేవుఁడౌవాఁడు.
* * *
నిరతంబుతుళజావనీ మహీపాలునికి
కరమొప్పపౌత్రుఁడై కడఁగినవాఁడు
మరియుఁ బ్రతాపసింహక్షితీంద్రునికి
సారిదినిబుత్రుఁడై శోభిల్లువాఁడు
వ్యక్తమైతగు యమునాంబికాగర్భ
శుక్తిమౌక్తికముగా సొంపొందువాఁడు

సారజ్ఞుఁడౌతుళుజావనీంద్రునికి
కూరిమియనుజుఁడై కొమరొందువాఁడు
*      *      *
రహిఁచంద్రమౌళీశ్వర ప్రసాదంబు
బహుళంబుగాఁగల్గి భాసిల్లువాఁడు
*      *      *
యింతటియమరసింహేంద్రుఁడౌ నృపతి
చెంతఁబాయకయుండు శివరాయమంత్రి
*      *      *
రమణకెక్కిన కృష్ణరాయలచెంత
విమలుఁడై యప్పాజి వెలసినరీతి
విహితధర్మముచేత వెలసిశంభాజి
రాయనితనయుఁడై రాష్ట్రంబునందు
నాయతకీర్తిచే నమరినవాఁడు.
అలత్రియంబకమంత్రి కనుజుఁడౌవాఁడు
కలితనాగోజి శంకరులకగ్రజుఁడు
ఎలమినీయమరసింహేంద్రునిసభను
నలుగురు మెచ్చంగ ననుఁబిలిపించి
యాచంద్రతారార్కమౌనట్టుగాను.   *   *
భవ్యమైతగుగద్య పద్యాత్మకముగ
నలపారిజాతాపహరణంబుముద్దు.
...      ...      ...      ...

తుది :- వ. అని గోపస్త్రీలు మ్రొక్కరట మెటువలెనూ.

గుమ్మకాంబోధి. ఆది.

చేరిమ్రొక్కరిగోపాలంగనలు చేరిమ్రొక్కరి
చేరిమ్రొక్కరిసిగ్గుచేత కనులుమూసుక
సారెత్రిశిరగిరీశుసఖుఁడైన శ్రీహరికి
మెనగుబ్బలుకరహారబాహుమూల
రుచులుపాదలకనకపు పల్లెములనగతత
తవనుననవిలుతుదివాణములు తెలియఁగాచేరి.

వ. ఇట్లు మ్రొక్కిన సమయంబున గోపాలమూర్తి గోపస్త్రీ సర్వాంగ దర్శన సంజాత కుతూహలుండై చీరలొసంగిన ధరియించుకొని సంతుష్టాంతరంగలై గోపస్త్రీలు స్వామిని పరివేష్టించుకొని యేమని కొనియాడుచున్నారు.

శ్లో. తవకథామృతంతప్తజీవనం కవిభిరీడితంకల్మషాపహమ్ ।
శ్రవణమంగళం శ్రీమదాతతంభువిగృణంతియే భూరిదాజనాః.
అంగనామంగనా దేవకీనందనః.

గ్రంథాంతగద్య 272-వ పుటలో నీయఁబడినది.

పారిజాతాపహరణ కథలో గొల్లలఁగూర్చి విశేషముగఁ జెప్పఁబడినది.

క. శ్రీవిలసద్భోసలకుల
పావనమకరందబిరుద భావజరూపా
శ్రీవనితాంచిత వీక్షణ
సేవకరిపుభూప! యమరసింహమహీపా!

గీ. అవధరింపుము నీపేరనంకితముగ
పారిజాతాపహరణంబు బాగుమీఱ
నాటకము గాను రచియించినాను వేడ్క
నెలమినందున ప్రథమాంక మెట్టిదనిన.

గ్రంథశైలి తెలియుటకై గ్రంథమధ్యభాగమునుండి యీ క్రింది పద్యపదముల నుదాహరించుచున్నాను.

గొల్లవాక్యం.

ఉ. ముక్కరశుక్రుఁడిచ్చె నయమొప్పఁగఁగమ్మలు సూర్యుఁడిచ్చె పెం
పెక్కినతారహారములు పేర్మినిజందురుఁడిచ్చె నింద్రుఁడున్
యెక్కువలైన కంకణములిచ్చెను పాపటబొట్టుశంభుఁడున్
చక్కని సూర్యచంద్రులును శారదయిచ్చెను నాదుచల్లకున్.

చల్లవర్ణన.

ద్విపద. శ్రీరమ్యమైనట్టి చిక్కనిచల్ల
సారస్యమైనట్టి చక్కటిచల్ల
కూరిమికొనరమ్మ కోమరైనచల్ల
భారతిగొన్నట్టి బాగైనచల్ల
శ్రీరమగొన్నట్టి చెలువైనచల్ల
పార్వతిగొన్నట్టి పరువైనచల్ల
నవ్వుచుఁగొనరమ్మ నాచేతిచల్ల.
నల్లావుపితికిన నయమైనచల్ల
తెల్లావుపితికిన తేటైనచల్ల
ఎఱ్ఱావుపితికిన హెచ్చయినచల్ల
నఱ్ఱావుపితికిన నాఁడెంపుచల్ల.

క. నెల్లనయి పుల్లనగుచును
చల్లనయై సకల తాపశమమైసమమై
చెల్లుగ మధురంబౌనీ
చల్లకుముల్లోకములను సాటియెుఁగలదే.

చల్లవర్ణన యింతచక్కఁగ వేఱొండుచోటలేదు.

మాతృభూతయ్య భక్తి ని గూర్చి యీ క్రిందికథ సంగీతసంప్రదాయ ప్రదర్శిని (111 పుట) లో నీయఁబడినది.

"ఈ మాతృభూతయ్యా తనవేదటికమును సైచక సుగంధి కుంతలాంబవద్ద బహుకీర్తనములచే మొఱయిడినదిగాక "కాశికపృణమీవల నమ్మి" అని చెప్పిన కీర్తనమువిని అమ్మవారు మాతృభూతయ్యా స్వప్నమున దర్శనమిచ్చి "తంజావూరిలో నా భక్తుఁడు ప్ర[illegible] డున్నాడు, అచ్చటికి వెడలుము. ఆరాజు నీలేమిని పోగొట్టును " అన్నమాత్రమున లేచి తంజావూరికి వెడలెను. ఆదినమే సుగంధికుంతలాంబ ప్రతాపసింహుని స్వప్నములో "నాభక్తుని నీవద్దకు రమ్మంటిని వాని లేమిని దీర్చుము." అని చెప్పినతోడనే రాజులేచి మాతృభూతయ్యా రాకను

గోరియుండెనట. అతడువచ్చినది తెలిసి యుపచరించి పదివేల రూపాయ లిచ్చి త్రిశిరగిరికి పంపించెను. అత డచ్చట సౌఖ్యముగా తన కృతులచే సుగంధికుంతలాంబను భజించుకొనుచుండెను.”

ఈతని కీర్తనలు ‘త్రిశిరగిరి’ ముద్రగలిగి, పదశయ్యా అర్థపుష్టితో నుండును. ఈతడు భక్తిశృంగార పరముగానే కాక నీతిపదములుకూడ రచించి యున్నాఁడు.

## రెండవ శరభోజీ

తంజావూరి నేలిన కడపటిరాజులలో నీతఁడు ప్రసిద్ధుఁడు. ఈతఁడు బహుభాషావేది. సంగీతసాహిత్య విద్యాపోషకుఁడు. ఈతని పేరనే తంజావూరి పుస్తకభాండాగారము ‘తంజావూరి మహారాజు శరభోజీ సరస్వతీ మహాలు పుస్తకభాండాగారము’ అని పిలువఁబడుచున్నది. ఈ మహారాజు చలువరాతి విగ్రహము నేఁటికిని దర్శనీయమై పుస్తక భాండాగార ముఖమున వెలయుచున్నది.

సంస్కృతమున నీతఁడు రచించిన [1]కుమారసంభవ చంపూకావ్య మొకటి లభ్యమగుచున్నది; అందు నాల్గాశ్వాసములు గలవు ఆశ్వాసాంతగద్య.

“ఇతి శ్రీభోసలకులజలధి కౌస్తుభ చోళవసుంధరాధురంధర తులజ మహారాజకుమార శరభోజీ మహారాజ విరచితే కుమారసంభవ మహా చంపూకావ్యే చతుర్థాశ్వాసః”

## త్యాగరాజు

ఈతనికాలమునఁ బ్రసిద్ధిలోనికి వచ్చిన మహానుభావుఁడు త్యాగరాజు.

ఆంధ్రసంగీతమున కాచంద్రార్కమును నజరామరమును నగు కీర్తిగడించిన మహానుభావుఁడు నాదబ్రహ్మ త్యాగరాజు, సంగీతవాఙ్మయ ప్రపంచమునకుఁ ద్రిమూర్తు లనఁదగిన అన్నమయ్య, క్షేత్రయ్య,

1. వ్రాఁతప్రతిసంఖ్య 4020. వ్రాయఁబడిన తేదీ 11–12–1812

త్యాగయ్య యనువారలలోఁ ద్వితీయుఁడైనను నద్వితీయుఁడైన మహా వ్యక్తి. ఈతఁడు రామభక్తాగ్రణి. ఒకకోటి తొంబదియాఱు లక్షలు రామనామమును జపించి శ్రీరామ సాక్షాత్కారమును జెందిన మహా పురుషుఁడు. ఈతని కృతులు వేలకొలఁదిగా రచితములైనను నాంధ్రుల దురదృష్టవశమున నాఱువందలు మాత్రమే లభ్యములైనవి. కావునఁ బ్రత్యేకముగ నిందు ప్రస్తుతము కాలేదు. దక్షిణదేశమున నీ మూర్తి వెలయుటచేత దక్షిణాంధ్రసంగీత వాఙ్మయమేకాక యాంధ్ర భక్తి సంగీత వాఙ్మయమంతయు భక్తిరస ప్లావితమై పవిత్రమైనది. త్యాగ రాజు రచియించిన నాటక కృతులలో ప్రహ్లాద నాటకమును, నౌకా చరిత్రమును ముద్రితములైనవి.[1]

---

1. శ్రీ త్యాగరాజస్వామి చరిత్రనుగూర్చి పరిశోధించినవారిలోఁ బ్రథములు నా జనకులు కీర్తిశేషులు సుందరముపంతులవారు. (1864–1931) వారు క్రీ శ. 1890 ప్రాంతమున తంజావూరు మధుర ప్రదేశములకేఁగి యచ్చట త్యాగరాజస్వామి చరిత్రకు సంబంధించిన కొన్ని యమూల్య విషయములను సేకరించిరి. క్రీ. శ. 1897 లో శ్రీ త్యాగరాజస్వామి జీవితమునుగూర్చిన కొన్ని ,యంశములు శ్రీ సుందరంపంతులు గారిచే గ్రంథస్థము గావింపఁబడినవి. అందు ముఖ్యమైనది త్యాగరాజు చరమదశ.

త్యాగరాజుస్వామి మహర్షి జీవితమునుగడపి, క్రీ. శ. 1847 సంవత్సరమున నొక శుభదినమున :తన కుమార్తెయగు సీతామహాలక్ష్మిని అల్లునిఁబిలిచి రామనామోచ్చారణ చేయుచుండఁగా శిష్యబృందమందఱును, శ్రీత్యాగరాజస్వామివారి కీర్తనలు గానము చేయుచుండగా "జానకీ జీవస్మరణమ్" అను మంత్రముతో మధ్యాహ్నము పండ్రెండుగంటల కాలమున శ్రీరామునితో నైక్యముఁజెందిరి.

అతని శరీరమును వేలకొలఁది జనులు భజనచేయుచుండగా తిరువయ్యారునందు దహనసంస్కారము గావించిరి. అంతసేపును, వర్గవర్గములుగా త్యాగరాజస్వామివారి కీర్తనల నాపకుండ, భక్తులు శిష్యులు పాడుచునేయుండిరి. శ్రీత్యాగరాజస్వామి దహనసంస్కారమునకు అనగా చందనకాష్టాది సకల ద్రవ్యములను నా కాలమున తంజావూరి మహారాష్ట్రరాజ వంశీయుఁడైన మోతీరామ్‌సాహెబు-అనువారు భరించిరి.

సుందరము పంతులవారి వృత్తాంతము ననుసరించిచూచిన శ్రీ ఎ. యం. చిన్న స్వామి మొదలియారుగారు, త్యాగరాజకృతులను వ్యాప్తికిఁ దెచ్చుటలోఁ దొలివారు. చెన్నపురిలో నే బహిరంగ సమావేశములు జరిగినను, చిన్నస్వామి మొదలియారుగారు త్యాగరాజ కీర్తనలను పాడెడివారు, ఆ కాలమున ఐరోపియను అధికారులు సభల

# తంజావూరి - శివాజీ మహారాజు
(1833-1855)

సంస్తవనీయుఁడగు శరభోజీ మహారాజు వెనుక తంజావూరినిఁ బరిపాలించిన రాజు శివాజీ. ఈతనికి సంతతిలేనందునను, దరువాత నీ రాజ్యము ఇంగ్లీషువారి వశమగుటచేతను నీతనినే కడపటి మహారాష్ట్ర రాజుగా మనము భావింపవచ్చును. ఈతఁడును దన వంశీయులందఱి వలెనే భాషాపోషకుఁడు, కవి. ఈతని కృతి "అన్నపూర్ణాపరిణయము" అనునది మనకు లభ్యమగుచున్నది. గ్రంథావతారికలో శివాజీ తన వంశమునంతయు వర్ణించినాఁడు. అది యిట్లున్నది.

గ్రంథ ప్రారంభము.

జయ కనకమయవాసే జయమంజులవిలాసే
జయ భక్తహృద్వాసే జయశుభాహాసే

క. తంజాపురంబటంచును రంజిల్లిన పట్టణమ్మున రహినివహించున్
కుంజరములు రథవాజులు అంజన వీరభటజనులుఁనద్భుతలీలన్.

---

కధ్యక్షత వహించెడివారు [1]చిన్నస్వామిగారు కర్ణాటసంగీతము ముఖ్యముగా త్యాగరాజకృతులను సభాప్రారంభమున గానముచేయుపద్ధతి నెలకొల్పుటచేత పాశ్చాత్యులకు, త్యాగరాజసంగీతమునందు కృతులందు నభినివేశనము దినదినము హెచ్చుకాఁజొచ్చెను.

ఆ చిన్నస్వామిగారే, పాశ్చాత్యుల వాద్యములమీదను, శ్రీత్యాగరాజకృతులు గానముచేయవచ్చునని దృష్టాంతపూర్వముగా వివరించి దానిపై నొకగ్రంథము వ్రాసిరని సుందరము పంతులుగారు తెలిపిరి.

సుందరము పంతులవారు వ్రాసిన వృత్తాంతము, శిథిలముకాగా, వారి [2]పౌత్రులందలి విషయములను లోకమున కెఱుకపఱచిరి.

---

1. A. M. Chinnaswami Mudaliar author of Oriental Music in European Notation.

2. Biography of Saint Tyagaraja by N. S. Sundareswra Rao (Sunday Times — 18-9-1949.)

సూ. వ. ఇటువంటి పట్టణంబునందు సకలవిద్యాప్రవీణులయిన సభ్యుల గూడియున్నారు గనుక నీసభకు చితంబైన అన్నపూర్ణాపరిణయంబను నూతన నాటకంబు నటియింపజేసి ఆత్మానుకృతార్థత జెందవలెనని యిచ్ఛయిస్తున్నాను ॥ పా ॥ యెవరయ్యా యీ దివ్యప్రబంధ నిర్మాత ॥ సూ ॥

క. వివిధాలంకృతిగలిగియు భువిజనులను ప్రేమఁబ్రోచుపుణ్యాత్మకుఁడై
అవిరళదానఘనుండై కవినుతుఁడుశివాజిరాజుఘనసద్గుణుఁడై

పా. సకలకళాప్రవీణుండయిన శ్రీశివాజీరాజేంద్రుండా యీ గ్రంథ నిర్మాత అయితే మన మనోరథంబులన్నియు సఫలమవును. అతని గుణాతిశయంబులు వినవలెనని యిచ్ఛయిస్తున్నాను. సూ॥ చెప్పేవేవినూ.

సీ. దయచేసిధారుణీతలముపాలించుచో ప్రతిలేని శ్రీరామభద్రుఁడనఁగ
ముదమందిసుదతుల మోహింపఁజేయుచో బాగైననవపుష్పబాణుఁడనఁగ
బెదిరించిరిపులను భేదింపఁజేయుచో మురహైనశ్రీకృష్ణమూర్తియనఁగ
కవిజనంబులనెల్లఁగాచిరక్షించుచో రహిమించుశ్రీభోజరాజనంగ

తే. వెలసెను శివాజిచంద్రునివిమలగుణము లెవ్వరికినైనఁగల్గునేయెంచిచూడ
అనుచు సకలజనంబులునభినుతింప వెలయుతంజాపురంబున వేడ్కమీర.

ద్వి. అవిభువద్దను అమరియున్నట్టి
శ్రీ విలసత్సదాశివరాయఘనుఁడు
అతులసౌభాగ్యంబు లమరినవాఁడు
మతిమంతుఁడైనట్టి మంత్రివర్యుండు
అతనిసోదరుఁడైన అద్భుతగుణుఁడు
మతిశాలియైనట్టి మాన్యుఁడుజగతి
వితతభుజాబలవిఖ్యాతయశుఁడు
ప్రతిలేని సేనాధిపతియైనవాఁడు
ఆర్తజనులబ్రోచు అలకల్పకంబు
కీర్తిగల్గినయట్టి కృష్ణరాయండు
బహువుపకారియు భాగ్యపూర్ణుండు
మహనీయగుణశాలి మంచిసత్ప్రభువు.

గానవిద్యలలోన ఘనుఁడైనవాఁడు
సేనాధురంధర శ్రీగల్లువాఁడు
వరయోగశాలియౌవరహేంద్రఘనుఁడు
పరిపూర్ణవిద్యలప్రబలినవాఁడు
యిటువంటిమిత్రులు యిరువంకగొలువ
వటువుగావిలసిల్లు భాగ్యముప్పొంగ
శ్రీశివాజీంద్రుండు చెలగుసద్విభుఁడు
ఆశాంతభూపుల ననువుగాఁబ్రోచి
ధీచమత్కృతులచే తేజరిలువాఁడు
భూచక్రవర్తియైపొల్పొందువాఁడు.

సా. వోయీ సూత్రధారా యిటువంటి మహారాజు వంశక్రమంబు దెలుపవోయి.

సూ. ఎర్గురు చక్రవర్తులు పదార్గురు రాజులంబోలి రాజ్యంబుచేయుచు నుండు శ్రీశివాజీరాజేంద్రుని వంశక్రమంబు సవిస్తరంబుగాఁ దెలిపెద వినుము.

ద్వి. శ్రీశాహజీంద్రుండు చిరసద్గుణుండు
వాసిగానువెలుంగె వైపుమీరగను
ఏకోజియనుపుత్రు డెలమిగానపుడు
జోకతోఁగాంచెనుసొంపుమీరను
శ్రీమించియేకోజిచెలువుచెందగను
ప్రేమగానీచోళభూమి పాలించి
తుక్కోజియనుపుత్రుతుల్యునిగనియె
చక్కనౌసౌందర్యశాలితుక్కోజి
చెలువుడైనప్రతాపసింహేంద్రుఁగాంచె
నిలలోనజనులెల్లమెచ్చుగాఁబొగడ.

వ. ఇవ్విధంబున ప్రతాపసింహేంద్రుండు పూర్వరాజర్షులం బోలి రాజ్యంబు చేయుచునుండి తులజేంద్రుఁడను కుమారునింగాంచె నివ్విధంబుగా.

ద్వి. అతులజేంద్రుండు అద్భుతగుణుఁడు
ఖ్యాతుఁడైవిలసిల్లి ఘనులపోషించి
బహుయోగశాలియైభాగ్యసంపదలు
సహజముగా గాంచి సౌందర్యఘనుని
శరభేంద్రుఁడను పుత్రుచెలువుగా గాంచి
పరిపూర్ణసామ్రాజ్యపదమున నుంచె
ఆశరభేంద్రుండు అతిసుందరుండు
శ్రీశివభక్తుండు స్థిరయశోధనుఁడు
మహాదేవుసత్కృపామహిమంబువలన
వహిమించినశివాజివర్యునిగాంచె
భోసలకులరాజపుంగవులెల్ల
వీసముఁబోలరీ విభుగుణంబులకు
బహుదాత, బహునేమి, భవ్యసద్గుణుఁడు
మహనీయసౌందర్యమాన్యుఁడు, విభుఁడు
ప్రఖ్యాతుఁడై చాలభాసిల్లిమిగుల
సౌఖ్యసమృద్ధుఁడై జగమేలుచుండు
శ్రీశివభక్తుండు, చిరయశోధనుఁడు
దేశాధిపతులెల్ల తెలిసి తన్ బొగడ
తులజేంద్రపౌత్రుండు దొరలలోఘనుఁడు
వెలయుచంద్రునిబోలు విమలముఖుండు
యీచోళరాజ్యంబు యింపుమీరగను
భూచక్రముననేలుపురుషోత్తముండు
శ్రీచంద్రమౌళీశు చిరకృపవలన
ఆచంద్రతారార్కమవనేలువాఁడు
రహిమించు శ్రీఅహల్యాంబికాగర్భ
మహితశుక్త్యుద్భవమౌక్తికమనుచు
ప్రఖ్యాతుఁడైభువి భాసిల్లువాఁడు
సౌఖ్యాభివృద్ధిచేసదయుఁడౌవాఁడు,

మా. వ. ఇవ్విధంబున వంశక్రమంబు తెలిపినపిమ్మట కథాక్రమం బెటువలె నంటేనూ.”

అన్నపూర్ణాపరిణయమునందలి కథ తంజాపూరియందు నెలకొనిన కొంకణేశ్వరునకు సంబంధించినది. ఆతఁ డన్నపూర్ణాదేవిని వివాహ మాడుట యిందు వర్ణితము.

సీ. పూర్వకాలంబున శర్వునననుజ్ఞచే సిద్ధపుష్కరిణికిఁ జెంతనున్న
వల్మీకపరిసరివర్తి భూభాగానఁ దపముచేయశివుఁడు తానుమెచ్చి
కొంకణసిద్ధుని కోర్కెఁదెలుపుమటన్న నాపేరమీరిట నతజనులకు
వరములనిచ్చుచు వాసుఁడై యీపురజనులపోషించుచు శాశ్వతముగ

గీ. కొంకణేశ్వరుఁడని భక్తికొలిచిమ్రొక్క వలయునని దేవశమ్ముగట్టి వరముఁడగుచు
నెలకొనుమనంగ కొంకణునిచ్చఁదెలిపి వరమొసగి నిత్యవాసుఁడైవరలుచుండె.

దక్షిణదేశమున రసవాదశాస్త్ర సంప్రదాయ ప్రవర్తకులలో నొకఁడగు కొంకణసిద్ధుని పేర నీ కొంకణేశ్వరుని యాలయము తంజాపురిని వెలసినట్లుగా పై పద్యము తెలుపుచున్నది. ఇట్లే తెలుగుదేశమున నోరుగంటిలో సిద్ధేశ్వరాలయము గలదు.

గ్రంథాంతమున నొకచో "రంగనాథకవీశ్వరుఁ డొకఁ" డాశీర్వదించినట్లుగా చెప్పఁబడియున్నది. ఈ గ్రంథరచనమున నాతఁడు తోడ్పడి యుండవచ్చును.

"ఈ విధంబున గ్రంథకర్తయైన శివాజీమహారాజ ఛత్రపతికి ఆశ్రిత పరంపరులైన రంగనాథకవీశ్వరులు అత్యాహ్లాదచిత్తంతో ఆశీర్వాదముచేసె నెటువలెనంటేను" ఈ రంగనాథకవీశ్వరుఁడే యీ వెనుక నుదాహృతుఁడైన "అమృతకవి తులసిరంగయ్య" కాఁదగును. గ్రంథాంతమున నాశీర్వాదము.

సీ. శ్రీరస్తు విజయోస్తుధీరస్తు శుభమస్తు గాంభీర్యమస్తు దీర్ఘాయురస్తు
సౌందర్యవిభవోస్తు శాశ్వతధనమస్తు సంతోషమహిమోస్తు సౌఖ్యమస్తు.
ఆరోగ్యమస్తు ధాన్యాభివృద్ధియశోస్తు ధృతిమస్తు శ్రుతిమస్తు తేజమస్తు.
పుత్రలాభోస్తు సంపూర్ణసత్కృతిరస్తు మహితసామ్రాజ్యసమృద్ధిరస్తు.

గీ. సకలసద్గుణ దాతృత్వచతురమస్తు హితసుగోధన సంపత్సమృద్ధిరస్తు.
చంద్రమౌళీశ సత్కృపాసారమస్తు ఈక్షణమె అష్టలక్ష్మీకటాక్షమస్తు.

సూ॥ ఈ విధంబున ఆశీర్వాదంబుచేయగా సమస్తసభ్యులు తథాస్తు, తథాస్తు, అని బల్కుచునుండిరంత.

గద్య :-ఇతి శ్రీమద్భోసలకుల కలశాంబునిధి పూర్ణశశాంక భూమండలాఖండల శ్రీ శివాజీమహారాజు ఛత్రపతి నృపవర విరచితంబైన అన్నపూర్ణాపరిణయంబను ఆంధ్ర నాటకమునందు ద్వితీయాశ్వాసము.[1]

ఈ గ్రంథమున నీనాటకమునాడు నపుడెవ్వరెవ్వరే యే వేషములు వేసిరో, యా వివరణము వ్రాయఁబడినది. ఇందు కొంకణేశ్వరుఁడు, విఘ్నేశ్వరుఁడు, సప్తఋషులు మొదలగు పురుషపాత్రలు, అన్నపూర్ణ, శుకవాణి, మంజువాణి, తిలోత్తమ, హరిణి మొదలగు స్త్రీపాత్రలు వత్తురు.[2]

---

1. నాటకముతుదిని ప్రతివిలేఖరి యిట్లువ్రాసికొనియున్నాఁడు.

"జయనామ సంవత్సరం భాద్రపద శుద్ధనవమి గురువారంనాడు రాజశ్రీమధ్య స్థులవారి ఉత్తరవుప్రకారం నగరిలోఉండే భాగవతమేళం సబనీసుదగ్గఱ యీ అన్నపూర్ణాపరిణయ నాటకపుస్తకం. వ్రాయించి ఆమృతకవి తులసీరంగయ్యంగారు నగరికి వ్రాయించి యిచ్చినది వ్రాసిన ఆకులు 49.

వంశవృక్షము.




2. తంజావూరి పుస్తకశాల గ్రంథసంఖ్య 499. M. 662.

# వెంకటకృష్ణకవి - శివపారిజాతము

ఈతఁడు మల్లుకులస్థుఁడు, శివాజీ మహారాజు నాస్థానమునఁ తెలుఁగుకవి. ఈతని కృతినుండి విశేషము లిట్లు తెలియుచున్నవి.

సీ. "మల్లువంశంబున మాతనింబజచేత వెల్వాలై వెలసిన మల్లులందు
కనకయ్య పుత్రుఁడ కమలాక్షుసేవ్యుఁడ ఘనవసిష్ఠకులుండ కవులబంట
వెంకప్పయను కవి విప్పిన శివకథల్ పుంఖానుపుంఖమై పొదలుచుండ
పసిబాలుఁడను నేను పశుపతిపొగడంగ రసికులెల్లరువిని రమ్యమొంద.

తే. వేదములయందు దాఁగిన వింతయొకటి హరియుఁజెప్పంగ నపురూపుహరునికథలు
నారదునిచేతఁ దెలిసెను నాణ్యముగను ధరణిలో నేను బొగడెద ధర్మనిపుణ.

ప. శ్రీకరంబుగా విఘ్నేశ్వరుఁడు వచ్చినవెనుక సకల విఘ్నాలున్నూ తీర్చినవెనుక శివపారిజాత నాటకమాడేటటువంటి మార్గం.

గ్రంథాంతమున :

క. కందముఁ జెప్పెదవినవే సుందరి నాప్రక్కఁజేరు శుభలగ్నమునన్
ఇందు ధరుండవె నేనును, పొందుగ నన్నేలుకోవె పువ్వులకొమ్మా !

గంగవాక్యం:

ఉ. మంచిది సామిరార బహుమంచిదిగల్గునునీకు మేలుగా
చెంచలమొల్లఁ దీర్చినను శ్రీశివప్రోవవె ప్రాణనాయకా !

మంగళం.

శృంగారకరముగాఁ జెలగి మ్రొక్కి
శ్రీజయము కలుగునని శ్రీవేంకటుఁడనేను
శ్రీశైలయుఁజెప్పితిని శివకథలును
జయమంగళం నిత్యశుభమంగళం
... ... ... ...
విద్యాజయములిచ్చి సిద్ధివరములనొసగి
చెలువమెసగు
జయమంగళం సత్యశుభమంగళం

గద్య :–శ్రీమత్సకలగుణ సంపన్నులయిన అఖండలక్ష్మీ ప్రసన్నులయిన అష్టలక్ష్మీ నివాసులైన శిష్టజనరక్షకులైన నిత్యాన్నదాన గోదానభూదాన వస్త్రదాన హిరణ్యదాన కన్యకాదాన పరిపాలకులయిన శ్రీరజతాచల హిమాచల కనకాచల ధీరులైన శ్రీరాజమాన్య రాజరాజరాజశ్రీ శివాజీ మహీపాలుని తెలుగుకవి కనకాజెట్టి వేంకటకృష్ణాజెట్టి చేసినకవిత్వం.

మఱియు గద్యక్రిందనే

" ఈశివపారిజాతనాటకం శ్రీ తంజపురేంద్రుడు శ్రీశివాజీ మహీపాలుని కులదేవుండైన శ్రీ చంద్రమౌళీశ్వరుని కృపచే వ్రాసిన కవిత్వం."[1] అని కలదు.

పై యుదాహృతులనుబట్టి యిది బాల్యకవితయే యని చెప్పనగును. కాని "మల్లుల్లో అల్లు గొప్పవాడు" అనేరీతిగా, మల్లులలో కవితచెప్పుటయే ఘనతకాఁబట్టి శివాజీ యీతని చేరదీసియుండును.

## శివాజీ సీసములు

ఈ పేరితో శ్రీ శివాజి మహారాజుపేర 4 గ్రంథములు 811,12,13 14 సంఖ్యగలవి తంజావూరి పుస్తకశాలలో నున్నవి. వీనిలో కొన్నింటికి యతినియమములుగూడ పాటింప[illegible]. మచ్చునకు నిందలి మకుటములు.

" ధనికుఁడౌ శ్రీశివాజీని తేవెయమ్మ "

" ధనికుఁడౌ శివాజీంద్రుని తేవె తరుణి "

" నళినదళనేత్ర శ్రీశివాజీంద్రచంద్ర "

ఇవి లక్షణము తెలియక వ్రాసినస్తుతి పద్యములుగా నెన్నవగును "అన్నసత్రంబులు అతిప్రేమతోఁగట్టి అవనికర్తులుగొన్న యతడెయమ్మ" అని యిట్లు "అమ్మ" సంబోధనలుకూడ నుండుటచే నచ్చట యువతులు కొన్ని సీసములను రచియించి యుండవచ్చును.

---

1. దీని సంఖ్య 636–637. ఈ రెండు ప్రతులలో 637 సంఖ్యగల ప్రతి యీ క్రింది దరువుతో మొదలిడుచున్నది. "శరణు శరణు శరణు" శ్రీగజముఖ

ఇట్టి సీసములు నూతనముగఁ బ్రకటితమైన తంజావూరి పుస్తక భాండాగారము కేట్లాగు రెండవసంపుటమున 17, 18, 19 పుటలలో నీయఁబడియున్నవి. అందును కొన్నిచోట్ల యతి తప్పినవి. కొన్నిచోట్ల సరిగనున్నవి. మచ్చునకుఁ గొన్నింటి నుదాహరించుచున్నాను.

సీ. శ్రీసదాశివపూజచేసిన సుకృతంబు శ్రీసదాశివమిచ్చు స్థిరముగాను
శ్రీవాణిపతి నీకు చిరతరాయుర్వృద్ధి యొసఁగు వాక్పతి జిహ్వనెసఁగునెపుడు
శ్రీశచీపతి నీకు చిత్తానుసరణగా భోగంబు లొసఁగును త్యాగరాజ
దివ్యులౌ దేవాదిదేవులు సతతంబు వినయంబు లిత్తురు విమలహృదయ

తే. గీ. నీ ప్రభావంబు నుతిఁజేయ నెవరితరము? మానినీజన! మన్మథమంజుభాష!
భళిర! శ్రీమంత ధీమంత భవ్యసుగుణ, శ్రీశివాజీమహారాజ! శ్రితసమాజ.

సీ. శ్రీభోసలాన్వయ క్షీరాబ్ధిచంద్రుఁడై విలసిల్లునట్టి నీ విభవములను
వర్ణనఁ జేసెద వైఖరిలోకను దయచేసిగ్గెకొను ధన్యచరిత
నొకవంక మంత్రులు నొకవంక మిత్రులు నొకవంకను వజీరు లొప్పికొల్వ
నొకవంక బుధులును నొకవంక బాంధవుల్ నొకవంక కవులును గాయకులును.

గీ. కొలువ పట్టాభిషిక్తుఁడై చెలువుదనరి యుండ నీసభఁ గనుగొంటి నిండు ప్రేమ
భళిర! శ్రీమంత ధీమంత భవ్యసుగుణ, శ్రీశివాజీ మహారాజ! శ్రితసమాజ!

సీ చంద్రశేఖరుఁడు నీకింద్ర భోగములిచ్చు, చంద్రదేవుఁడు నీకు చెలువమిచ్చు,
నందివాహనుఁడు నిన్ పొంది రక్షించును, నిందిరారమణుఁ డానందమిచ్చు
స్కందుండు నీయింటఁగాచి బ్రోచుచునుండు, నందనందనుడు నిన్ బొందియుండు
నింద్రుఁడు నీకును యిష్టార్థఫలమిచ్చు, నింద్రాణి నీయింట నిమిడియుండు.

గీ. సింధుశయనుండు నీ హృదయమందునుండు
విందులందున వెలుగొంది వేద్యుఁడయ్యు
మందగమనుఁడై వెలసిన మన్మథాంగ!
సుందరాకార! శ్రీశివాజీనృపాంగ!

పై పద్యములవలన శివాజీ చాల ధర్మాత్ముఁడనియు ప్రజలను ననుకూలముగా పాలించినవాఁడనియు తెలియుచున్నది. కేవలము స్తుతిపరములైనను యీ ప్రభువునందలి భక్తివిశ్వాసములతో చెప్పియుండుటచేత వీనియందు యతి నియతిఁ జెందిన నంతగా విమర్శకులు పరిగణింపకుండుట మేలు.

# శృంగారకవి తిరుమలనాథకవి

తంజావూరి మహారాష్ట్రరాజుల కాలములో జెట్టిమల్లు కులజులు కవులను బోషించిరి. వీరు తంజావూరిలోని ధేనువాళము గరిడికి పెద్దగరిడికి సంబంధించినవారు. ఆ జెట్టిమల్లులలో నొకఁడగు తిమ్మాజెట్టి ప్రేరణచే తిరుమలనాథకవి రచించినది

## [1]నాసికేతపురాణము

దక్షిణదేశీయాంధ్రసాహిత్యమున వెలసిన ద్విపదకృతులలో నాసికేత పురాణము నొకటి. పెద్దగరిడియందు వెలసిన శ్రీకృష్ణుని కంకితము. అనంతజెట్టి తిమ్మాజెట్టి యను మల్లుకులజుల వంశక్రమ మిట్లు వర్ణిత మైనది.

మల్లుకులము – భారద్వాజ గోత్రము




పై వారిలో రెండవవాఁడగు తిమ్మాజెట్టి ప్రేరణచే నిది రచితమైనది.

మల్లులకును బ్రాహ్మణులకువలె సూత్రగోత్రములు గలవు. బ్రహ్మాండపురాణములో నేకవీరామాహాత్మ్యమని, నింబజామాహాత్మ్యమని పేరుకల ఖండమున దేవమల్లు చరిత్రమున వివిధశాఖలును దశవిధ

1. ఈ నాసికేతపురాణము కథనే నాసికేతూపాఖ్యానము అను ప్రబంధముగా క్రీ. శ. 1460 ప్రాంతమున శ్రీనాథమహాకవి బావమఱది దుగ్గుపల్లి దుగ్గన రచించియున్నాఁడు. అది లభ్యమగుచున్నది. చందలూరి చిక్కయ. క్రీ. శ. 1500 ప్రాంతమున మఱియొక పద్యకృతి రచించియున్నాఁడు. అది లభ్యముకాలేదు. ఈ కథ తెలుఁగులో తప్ప యితర భాషలలో లేదు. చూ. కఠోపనిషత్తు. ఆంధ్రానువాద పీఠిక.

గోత్రములును నేర్పాటుచేయఁబడినవి. ఈ దేవమల్లుని కథయే మల్లు పురాణము. నుదురుపాటి వెంకనార్యుఁడు రచించిన మల్లుపురాణము నిదియే. అందులోఁ గృతిపతియగు కుప్పాల్ మల్లుఁడు, ఆపస్తంబ సూత్రుఁడు గార్గ్యసగోత్రుఁడుగా వర్ణితుఁడైనాఁడు. శివపారిజాత రచయిత వెంకటకృష్ణాజెట్టి వసిష్ఠగోత్రుఁడు. ద్విపదనింబజామాహాత్మ్య కృతిప్రోత్సాహకుఁడగు మన్నారుజెట్టి ఆశ్వలాయన సూత్రుఁడు.

కృతికర్తయగు తిరుమలనాథకవి తన్నుఁగూర్చి యిట్లు చెప్పుకొన్నాఁడు.

> "ఘనుఁడైన శృంగారకవి తిమ్మఘనుని
> తనయుఁడ వైష్ణవోత్తమసేవకుండ
> మహనీయగుణుఁడ తిర్మలనాథకవిని
> అహిరాజశయనుని కంకితంబుగను
> కరమొప్పఁ బరమభాగవతచరిత్ర
> పరమార్థదీపిక, పద్మినీపరిణ
> యము మొదలైన కావ్యములు రచించి"

పై దానినిబట్టి యీతఁడు తిమ్మాఖ్యునిపుత్రుఁడనియు, పరమభాగవత చరిత్ర, పరమార్థదీపిక, పద్మినీపరిణయమునను మూఁడు కావ్యములు రచించెననియుఁ దెలియుచున్నది. మఱియుఁ గృతిపతి తన్నుఁగూర్చి చెప్పు సందర్భములో,

> "లలితోక్తి దేవమల్లుచరిత్ర మాకు
> తొలుతరచించి కీర్తులు దెచ్చినావు"

అని వ్రాసికొనుటచే నీతఁడును నొక మల్లుపురాణము రచించెనని తెలియు చున్నది. కాని నాసికేతపురాణము తప్ప పైగ్రంథము లేవియు గానరాలేదు. ఈతఁడు తన కవనమునుగూర్చి యిట్లు చెప్పుకొనియున్నాఁడు.

> "అల మహారాష్ట్రదేశాంగనామణుల
> కులుకుగుబ్బలరీతి గూఢమైపోక
> మట్టుగా ద్రవిడభామాకుచలీల
> బట్టబయల్ గాక భావజ్ఞులకును

నఱజాఱుపైఁటల నాంధ్రభామినుల
మెఱుఁగుగుబ్బలరీతి మేలిమిదనర
సకలలక్షణలక్ష్య చాటుకావ్యములు
ప్రకటించి చెప్పనేర్పరి నాఁగ మించె
ఘనుఁడైన శృంగారకవి తిమ్మఘనుఁడు ”

పై ద్విపద పంక్తులు.

చ. ఘనతరఘూర్జరీకుచ యుగక్రియ గూఢముగాక, ద్రావిడీ
స్తనగతి తేటగాక, యఱచాటగు నాంధ్రవధూటి చొక్కపుం
జనుగవలీల గూఢతయుఁ జాటు దనంబును లేక యుండఁ జె
ప్పినయదెపో కవిత్వమనిపించు నగించటుగాక యుండినన్.

అను పద్యమునకు ననువాదము. గ్రంథమముద్రితము. ఇందలి యితివృత్తము నాసికేతూపాఖ్యానమే. కాని యిది దుగ్గనపద్యకావ్యము ననుసరించిన ద్విపద కాదు. గ్రంథమున మూఁడాశ్వాసములు గలవు.[1]

# బడగలనాటి నరసకవి

ఈతఁడు నింబజామాహాత్మ్యమను నామాంతరముగల 'ఏకవీరా మాహాత్మ్యము' అను ద్విపదకృతిని, ధేనువాళము గరిడిలోని రఘురాముని పేర రచియించియున్నాఁడు. ఈ కృతి ప్రేరకుఁడు తొక్కడము మన్నారుజెట్టి. దేవమల్లు కులమునకు సంబంధించినవాఁడు. ఈమల్లులకును శాఖలును సూత్రములును గలవు. వీరు విశ్వామిత్రుని వంశీయులఁట. మన్నారుజెట్టి వంశ క్రమమిది.




1. ఈ గ్రంథము మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తకశాలలో నున్నది.

ఈ మన్నారుజెట్టి నరసకవీంద్రుని బిలిపించి,

"దేవమల్లునికథ దేవిమాహాత్మ్య
మీ విధంబున శాఖలేర్పాటుగాఁగ
రమణబ్రహ్మాండపురాణ సంహితల
విమలమార్గలగోత్ర విధము లేర్పడఁగఁ
తెలుఁగునఁ దేటగా ద్విపద కావ్యంబు
నొనరించి రఘుపతి కొప్పించు" మని యానతిచ్చెను.

కవియు,

"లలినొప్పు ధేనువాళము గరిడిలోన
వెలసిన శ్రీరఘువీరుని పేర
మన్నారు కృష్ణమాంబా మనోహరు
సన్నుతమతినేలు సర్వజ్ఞు పేర
కరమర్థివిధుశైల కన్నడనరస
వరమంత్రితనయుండు వసుధపూజ్యుండు
వరుసబడగలనాటి వంశదీపకుఁడు
నరసకవీంద్రుఁడు నయగుణోన్నతుఁడు
కవులనుగ్రహమునఁ గావించెను"-అట్టి
రమణమానేక వీరామహాత్మ్యమున
హావణుమీఱిన పంచమాశ్వాసమయ్యె.

ప్రథమాశ్వాస గద్యయందు,

శ్రవణభూషగు నింబజామహాత్మ్యమున
హావణుమీఱఁగఁ బ్రథమాశ్వాసమయ్యె

అని యతిస్థానమున నుండుటచే 'నింబజా మాహాత్మ్యము' అని దీనికి నామాంతరము గలదని తెలియఁదగును. గ్రంథాంతమున "విజయ సంవత్సర భాద్రపద శుద్ధ దశమినాటికి నెల్లూరి వీరరాఘవపెరుమాళ్ల కుమారుడు కనకాజెట్టి వ్రాయించినది" అని కలదు. కవి తంజావూరి మహారాష్ట్రరాజులకాలమున క్రీ. శ. 1740 ప్రాంతమువాఁడు కాఁదగును.

ఇందలి యితివృత్తము ఏకవీరాదేవి మాహాత్మ్యము. ఈ కావ్య కృతిపతియగు మన్నారుజెట్టి సోదరుఁడు

## తొక్కడము రామాజెట్టి

ఈతఁడు కవియై యొక శతకము రచియించియున్నాఁడు. అది వేమనను గూర్చినది. 'బాలచక్రవేమ భవ్యనామ' అని దానిమకుటము. వేమన పద్యములవలె నిందును నాట వెలఁదులే గలవు.

మచ్చునకు,

"కదిరి తూర్పుదిక్కు ఘనతశోభిల్లఁగా
పరగవరకటూరు పల్లియనఁగ
నచటనునికి చేసి యమరియుండుదురయా
బాలచక్రవేమ ! భవ్యనామ! "[1]

"తల్లిదండ్రి యన్నదమ్ము లాత్మసఖుల
ఎలమిబంధులాది యెల్లజనులు
కలిగివర్ధిలూరు ఘనతనుమీఱును
బాలచక్రవేమ ! భవ్యనామ ! "[2]

## చల్లా సూరయకవి

ఈతఁడు తంజాపుర ప్రాంతమందలి పొందవాకగ్రామ నివాసి. వెలనాటివైదికి. ఆపస్తంబసూత్రుఁడు. కౌండిన్యగోత్రుఁడు. సూరభట్టునకుఁ బాపమ్మకుఁ గొమారుఁడగు సూరయపుత్రుఁడు. తల్లి లక్ష్మమ్మ. ఈతఁడు వేదాధ్యయనశాలి. మన్నారుగుడియందలి రాజగోపాలస్వామి యితని యిష్టదైవము.

ఈతని కృతి "వివేకవిజయము" అను నాటకము. ఇది సంస్కృత ప్రబోధ చంద్రోదయమువంటికృతి. ఈ తెలుఁగు కృతిలో వివేకేంద్రుఁడు ఉపనిషత్కాంతఁగూడి ప్రమోదమునందుట ముఖ్యాంశము. అద్వైతసార్వభౌముండైన జీవేశ్వరుండు ముక్తికాంతంగూడి యమందానందకందళితుండై యుండుట యిందుఁ బ్రతిపాదితము.

---

1. గ్రంథ సంఖ్య. 393.

2. శతకవుల చరిత్ర. నూతన ముద్రణము. పుట 715. పరిష్కర్త. ప్రస్తుత గ్రంథకర్త.

శైలి మచ్చునకు :

ద్వి. ముదమున జీవేశ మూర్తియు ముక్తి
గదిసి భేదము మాని కలయికఁ బొంది
కడలేని వేడుక కనరాని చెలిమి
యుడివోని మోదము నుజ్జ్వలానంద
మును బొంది సుఖమంది ముల్లోకములను
తనదు తేజము కీర్తి దట్టమై నిగుడ
తనసాటి లేదని తనుదానె తెలిసి
వినుత వైభవముల వెలయుచుండె.

గద్య. అనుచు శ్రీరాజమన్నారైన స్వామి
ఘన కృపావర్ధిత కవితాశయుండు
... ... ... ...
కవిసూరయాఖ్యుండు ఘనతత్త్వ విదుఁడు
వివరింపఁగ వివేక విజయనాటకము
... ... ... ...
దక్షిణ ద్వారకా ధాముని పేర
నా చంద్రతారార్కమై వెలయ " రచించెను.

నాటకాంతమున ఫలశ్రుతి :

చ. అలరఁగ నీ వివేక విజయాభిధనాటక మెవ్వరేని ని
శ్చలమగు భక్తిచేఁ జదువఁజాలి తదీయ పదార్థ భావమున్
సలలిత చిత్తవృత్తి ననిశంబులు జింతన చేసిరేని వా
రలఘుతరాత్మ తత్త్వపరమంది సుఖస్థితిఁ గాంతు రెప్పుడున్.[1]

## శ్రీనారాయణ తీర్థులు

గీతగోవిందకర్తయగు జయదేవుని యపరావతారమై, కృష్ణలీలా తరంగిణిచే, భారతదేశమును, గీర్వాణాంధ్రవాఙ్మయములను భక్త హృదయములను బునీతమొనర్చిన నారాయణ తీర్థులవారు దక్షిణాంధ్ర

1. తంజావూరి పుస్తకశాల సంఖ్య 604-605 (M. 497, 682),

వాఙ్మయమునకు సంబంధించిన మహనీయులు. వీరు తెనుఁగుభాషలో 'పారిజాతాపహారము' అను ప్రశస్త యక్షగానకృతిని రచియించినారు. ఈ గ్రంథమున 'శివనారాయణతీర్థ సేవితాధిపుఁడు' అను వాక్యమే తీర్థుల వారి రచనమును నిర్ధారణ సేయుచున్నది. మఱియు నీ యక్షగానకృతిలో 'అచ్యుతాబ్ధివరదప్రభో' అని యుండుటచేతను, దంజావూరికి సమీపమున నున్న మెలత్తూరును అచ్యుతప్పనాయకుఁడు, 'అచ్యుతాబ్ధి'యని నామకరణము చేయుటచేతను, తీర్థులవా రచ్యుతప్పనాయకుని కాలమున ననఁగా క్రీ. శ. 1561-1614 ప్రాంతముల విలసిల్లి యుందురు.[1]

# పారిజాతాపహారము

ఇందలికథ ప్రసిద్ధమైన పారిజాతాపహరణ కథయే. గ్రంథ వివరణమిది.

ప్రారంభము:

'పారిజాతాపహారాఖ్యం నాటకమభినీయతే.

... ... ... ...

వ. అపురా ఈ విధంబున అంతట శ్రీపారిజాత నాటకనాట్యావైఖరికి విఘ్నంటుగాకుండు విఘ్నేశ్వరుండు వచ్చేమార్గంబు పరాకు.

దరువు. వచ్చెనే గణపతిదిగోచాల
వరదుడై మిగులను వన్నెమీరగను.
సవతి నాతో నీకు చలమేలేభామ
భావించి చూడవే భాగ్యమెవ్వరిది
అవనీమండల చంద్రుం డఖిలపాలకుఁడు
శివనారాయణతీర్థ సేవితాధిపుఁడు.

1. శ్రీనారాయణతీర్థులవారినిగుఱించి తొలుత వ్రాసినవారు కీ. శే. ప్రభాకర శాస్త్రిలవారు. వారు భారతి ద్వితీయ సంపుటములో క్రీ శ. 1925 లో తీర్థులవారి పటముతోడ నీ ప్రశస్తవ్యాసము ప్రకటించిరి తరువాత నింగ్లీషులో సంగీత విద్వాంసుల చరిత్రలలోఁ దీర్థులవారి చరిత్ర యుల్లేఖింపఁబడినది. వీని వెనుక స్వామి శ్రీ శివశంకరశాస్త్రిగారు శ్రీ వావిళ్ళ వేంకటేశ్వర శాస్త్రిగారి షష్టిపూర్త్యుత్సవ సంపుటమున శ్రీనారాయణ తీర్థులవారినిగూర్చి వ్రాసియున్నారు. (పుటలు 66-72) తీర్థులవారినిఁగూర్చిన వ్యాసములలో నీ రెండే కాక భారతి రజతోత్సవ సంపుటమున శ్రీ చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారి వ్యాసముకూడ చూడఁదగినది.

గ్రంథాంతము :

వ. అంతట నీలాగున రుక్మిణి అమ్మవారిచేత సత్యభామ అవమానంబు పొంది యింటికివచ్చి కోపాగారమందు ప్రవేశించేటప్పుడు యేమని ప్రలాపిస్తూన్నది.

దరువు. యేమిసేతునే ఓయమ్మా బంగారుబొమ్మ ముద్దులగుమ్మా :[1]

## పరమానంద తీర్థుఁడు

ఈతఁడు తంజావూరి మండలమునఁ జంపకారణ్య క్షేత్రవాసి. పరమహంస పరివ్రాజకాచార్యుఁడగు యతీశ్వరుఁడు. ఈతఁడు దత్తాత్రేయ గురుపరంపరలోనివాఁడై, తెనుఁగుభాషలో నద్వైత వేదాంత ప్రతిపాదకములైన గ్రంథము లనేకములు రచించియున్నాఁడు. ఆంధ్ర భాషయం దద్వైత వేదాంత ప్రవర్తకులలో నీతఁ డగ్రస్థానము వహింపఁ దగినవాఁడు. ఈతఁడు సులభశైలిలో గంభీరమగు వేదాంత విషయములను, శతక, ద్విపద, యక్షగాన, వచనరూపములఁ దెలిపియున్నాఁడు. ఈతఁడు క్రీ. శ. 1590 ప్రాంతముల నుండెనని శతక కవులచరిత్ర[2] తెలుపుచున్నది.

# 1. శతకములు :

### 1. సంపఁగిమన్న శతకము

దీనికే మన్నారు శతకమని పేరు.

కందపద్యములు ప్రారంభము :

క. శ్రీమానినీమనోహర సోమార్క విశాలనేత్ర సురనుతచరణా
దామోదర నీలమణి శ్యామా నను బ్రోవవన్న సంపఁగిమన్నా !

1. తంజావూరి పుస్తకశాల. సంఖ్య. 544.

2. శతక కవుల చరిత్ర. నూతన ముద్రణము. పరిష్కర్త ని. వెంకటరావు, 225–230 పుటలు.

మధ్య. క. తత్త్వం బెఱుఁగక యా బ్రహ్మత్వమున చరించువారిమాటలు ఘృతకో
తత్వములవి మఱచిన నిస్సత్త్వములగు నన్నువిన్న సంపఁగిమన్నా!

చివఱ. క. పరమానంద యతీంద్రుఁడు పరిపూర్ణుండైన నీదు భక్తుండెలమిన్
విరచించెను నొకశతకము శరణాగత సుప్రసన్న సంపఁగిమన్నా!

చంపకారణ్య క్షేత్రమున వెలసిన మన్నారు దేవుఁడే సంపఁగి మన్నఁడు. ఈతఁడే రాజగోపాలస్వామి. ఈ యాలయమున్న యూరు పేరే మన్నారుగుడి.

## 2. శివముకుంద పరమానంద శతకము

ఇదియును వేదాంత ప్రతిపాదకమైన కందపద్య శతకము. ఇందుండి రెండు పద్యములు:

క. సుజ్ఞానివహిమ యెప్పుడు సుజ్ఞానియె యెఱుఁగనేర్చు సుస్థిరమతియై
యజ్ఞాని తెలియ నేర్చునె ప్రాజ్ఞునిగతి శివముకుంద పరమానందా!

క. హరిహర గిరిధర పురహర గరుడధ్వజ నీలకంఠ కనకాంబర శం
కరగౌరీధవ మాధవ పరమాత్మా శివముకుంద పరమానందా!

## 3. దత్తాత్రేయ శతకము

ఇదియును కందపద్య శతకము. ప్రారంభము:

క. శ్రీవిలసిత వరసంయమి సేవితపాదారవింద చింతితఫలదా
కావుము నను నెల్లప్పుడు దావరమగ గుణవిధేయ! దత్తాత్రేయా!

చివఱ. క. పరమార్థ ప్రతిపాదన మరుదందఁగ యోగివరుల కానందముగా
పరమానంద యతీంద్రుఁడు ధరనాచంద్రార్కముగను దగరచియించెన్.

మ. శ్రీవిఖ్యాతిగ నాత్మతత్త్వరచనా సిద్ధాంతవాక్యార్థముల్
రివిస్మీఱఁగఁ గందపద్యముల ప్రౌఢింజెప్పి యర్పించితిన్
దేవా! నీకును భక్తవత్సలతఁ బ్రీతిన్నన్ను మన్నించు ప్ర
జ్ఞావిర్భూత వినోదచిత్తమున దత్తాత్రేయ నిత్యోదయా!

ఈ శతకము తెనుఁగుదేశమునఁ జాల ప్రచారములో నున్నది. ఈ శతకములోని,

క. ఎంతదయో దాసులపై పంతంబున మకరి పట్టి బాధింపఁగ శ్రీ
కాంతుండు చక్రమంపెను దంతావళి రాజుఁగాయ దత్తాత్రేయా. !

అను పద్యమును బళ్లెటూరి బడులలో నోరవడికుదుర్చుటకై వ్రాయింతురు.

## 2. ద్విపదలు :

### 1. అనుభవదర్పణము

ఇది యద్వైత వేదాంత గ్రంథము. నాల్గాశ్వాసముల కృతి దత్తాత్రేయ గురునకంకితము.

ద్వి. శ్రీగురువరచంద్రు సిద్ధమౌనీంద్రు
యోగివైభవసాంద్రు యుక్తిని స్తంద్రు
తెలివిదత్తాత్రేయ దేశికస్వామిఁ
దలఁచిసేవించి కీర్తనలొప్పఁజేసి
యానందమున పరమానంద తీర్థ
మౌనీంద్రుఁడను మహామహిమదీపింప
ననుభవదర్పణంబను మహాగ్రంథ
మనుపమవాక్ప్రౌఢి యలరరచింతు

గద్య. శ్రీమదానంద విస్తీర్ణసుధాబ్ధి
సోమపరంధామ సుగుణాభిరామ
యమిసార్వభౌమ దత్తాత్రేయపాద
కమలరజఃపుంజ కలితలలాట

... ... ... ...

శ్రీమత్పరమహంస శ్రీపరివ్రాజ
కాచార్య శ్రీపరమానందతీర్థ
వాచాసుధారస వర్ణితంబైన
[illegible]ర్పణమ్మను కృతియందు
ననుపమంబుగఁ జతుర్థాశ్వాసముయ్యె.[1]

---

1. గ్రంథ సంఖ్య. 293. పైని ద్విపదగా ముద్రితము కావలసిన గద్య కేటలాగున పుట. 85 లో వచనముగా ముద్రితమైనది.

## శివజ్ఞానమంజరి

ఇది యొక వేదాంతగ్రంథము.

ద్విపదకృతి. ప్రారంభము :

శ్రీగురువరమూర్తి శివయోగవర్తి
భోగమోక్షస్ఫూర్తి భూరిసత్కీర్తి
అతిముదంబున పరమానందతీర్థ
యతినామధేయుండ [illegible]
మహితశివజ్ఞాన మంజరియనగ
మహిలోనఁబ్రాజ్ఞ సమ్మతముగానిపుడు
రచియించెదను లోకరక్షార్థముగను.

గ్రంథాంతము :

కరమొప్పుజగతి ప్రఖ్యాతిగాననుచు
ననువుమీఱంగ దత్తాత్రేయగురుని
యనుఁగు శిష్యుఁడు పరమానందతీర్థుఁ
డొనరించె నీకృతి యుత్సాహలీల.[1]

# 3. యక్షగానము :

## ముక్తికాంతాపరిణయము

యక్షగానము. ఇదియును వేదాంతగ్రంథము. వివేక జీవుఁడు ముక్తికాంతను బొందుట యిందలి కథ.

శ్రీమచ్చిదాగార శివయోగసార
... ... ... ...
పరగదత్తాత్రేయ భక్తవిధేయుఁ
దలఁచి కీర్తించి వందనమాచరించి
యలరుచుఁదగఁ బరమానందతీర్థ
యతినామధేయుఁ డాయతమోదమునను
చతురతప్రౌఢిచే సజ్జనుల్ పొగడ
కరమొప్పఁగా ముక్తికాంతావివాహ
మరుదార పదచాలి కమరఁజెప్పెదను.

1. తంజావూరి పుస్తకశాల 350-61. మూఁడు ప్రతులు.

దరువు. గురుతరమహాద్రి కూటాజాగ్రమున
పరిగెడుమందిర ప్రకటస్థలమున
నాడిస్తనద్వయ నాసికాగ్రమున
జోడుగరవిచేసి జోతులువెలుఁగ
చెలువొందుచువివేక జీవుఁడుముక్తి
లలనామణినిగూడి లక్ష్యంబమర్చ
తన్నుఁదానెఱుఁగక తనువునుమఱచి
చిన్మయస్థితిగాంచ శీఘ్రమునవుడు.[1]

# 4. వచనకావ్యములు :

## 1. బ్రహ్మవిద్యాసుధార్ణవము

వచనకావ్యములు :

ఇది యొక వేదాంతగ్రంథము. అనుభవపూర్వకముగ రచితమైనది. పదుమూఁడు ప్రకరణములుగలది. ప్రతి ప్రకరణాంతమునను నీక్రింది విధముగ గద్యగలదు.

"ఇతి శ్రీపరమహంస పరివ్రాజకాచార్యవర్య పరమానంద యతికృతౌ బ్రహ్మవిద్యాసుధార్ణవే యోగశాస్త్రే పంచమ ప్రయోజన నిరూపణం నామత్రయోదశ ప్రకరణం సమాప్తమ్.[1]

## 2. వివేకచింతామణి

ఇది మూఁడు పరిచ్ఛేదములుగల తెనుఁగువచన వేదాంతగ్రంథము.

ప్రారంభమున :

'జగదంకురకందాయ సచ్చిదానందమూర్తయే
గళితాఖిలభేదాయ నమశ్శాంతాయతేజసే' యని కలదు.

ఇందు ప్రతిపాదితములైన విషయములు.

---

1. తంజావూరి పుస్తకశాల 557–558 (M. 637–638)

2. గ్రంథ సంఖ్య 748 ఇది మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారము వారిచే ముద్రితమైనది.

ప్రథమపరిచ్ఛేదము. ప్రథమఖండము: చతుర్వేద మహావాక్యార్థ తాత్పర్యంబగు నుపనిషదర్థ ప్రతిపాదకంబనంబరగు వేదాంత సిద్ధాంతము.

ద్వితీయ పరిచ్ఛేదము - శైవసిద్ధాంతము. తృతీయపరిచ్ఛేదము - బ్రహ్మాండప్రపంచభువనకోశ రచనావిచిత్ర సిద్ధాంతవర్ణనము. గ్రంథాంతమున నీ క్రింది పద్యముగలదు.

ఉ. శ్రీమెఱయంగ యోగివరసిద్ధమనోహరమై వివేకచిం
తామణి నాఁగ నీ కృతిని ధారుణిమానవు లెవ్వరేని సత్
ప్రేమఁదలిర్ప విన్నఁ మది పేర్చి దురంతములైన సంశయ
స్తోమము లెల్లఁబాసి కడుసొంపునఁ గాంతురు భోగమోక్షముల్.

ఈ పద్యము నిజగుణ శివయోగి విరచిత కన్నడ వివేకచూడామణి యందిట్లున్నది.

ఉ. శ్రీమదనంతసూరి జనసమ్మతదిందసవే వివేకచిం
తామణియంబ సత్కృతియ..................స
త్ప్రియ దొళుక్కు మిష్టరికైకునన్నతి శంభులింగదిం
... ... ... ... ... ...

నిజగుణ శివయోగి క్రీ. శ. 16-వ శతాబ్ధివాఁడని కన్నడకవి చరిత్ర తెలుపుచున్నది.

ఇందలి గద్య:

ఇతి శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్యవర్య పరమానందతీర్థ యతి కృతౌ వివేకచింతామణి బ్రహ్మాండ ప్రపంచ భువనకోశ విస్తార వర్ణనం నామ తృతీయ పరిచ్ఛేదః.[1]

## 3. ఉపదేశక్రమము

ఉత్తర గీతావ్యాఖ్యానము:

ఇది భారతాశ్వమేధ పర్వమునందలి యుత్తర గీతకుఁ దెలుఁగు వ్యాఖ్య.

1. గ్రంథ సంఖ్య 750-751. రెండు ప్రతులు.

భాషవ్యావహారికము :

తెనుఁగు వాఙ్మయమున దత్తాత్రేయ సంప్రదాయ ప్రవర్తకులలో నీతఁ డగ్రగణ్యుఁడు.

## పల్లవి గోపాలయ్య లేక రాజగోపాలకవి వాగ్గేయ కారాగ్రణి

సంగీత ప్రపంచమున పల్లవి గోపాలయ్య అను ప్రసిద్ధిగన్న విద్వాంసుఁడే సాహిత్య ప్రపంచమునఁ గవిరాజ గోపాలవాగ్గేయ కారాగ్రణిగా విలసిల్లిన వాఁడు.

ఇతఁడు "భక్తజన పారిజాతము" అను నాలుగాశ్వాసముల మహా ప్రబంధము రచియించియున్నాఁడు.

అందలి గద్యలో నీతఁడు గుంటూరి వంశీయుఁడైనట్టుగా వ్రాసికొనియున్నాఁడు.

గద్య : ఇది చింతామణి మంత్రజపలబ్ధ చతుష్షష్టి కలాపాభిరామ గుంటూరి రామకృష్ణకవి సార్వభౌమ నందన గోపాల విద్వత్క-వీంద్రతనయ, వేదాది విద్యామనీషా విశేషాభిరామ రాజగోపాల కవి వాగ్గేయకారాగ్రణి ప్రణీతంబైన భక్తజన పారిజాతంబను మహాప్రబంధంబునందు చతుర్థాశ్వాసము."

రాజగోపాలకవి వెలనాఁటి శాఖాబ్రాహ్మణుఁడు. ఈతని పూర్వులు తొలుత గుంటూరి వాస్తవ్యులగుటచేత నీతని యింటిపేరు గుంటూరి వారై యుండవచ్చును. దక్షిణదేశమునకుఁ దరలివచ్చినప్పుడు గూడ నా యింటిపేరే వాడుకలో నుండి యుండవచ్చునని పై గద్య తెలుపుచున్నది. ఈతని తండ్రి తాతలు తంజావూరిలో నివాసముచేయుటచేఁ గాఁబోలు నీతనికి మన్నారుగుడియందలి రాజగోపాలస్వామి పేరుపెట్టినారు. సంగీత సంప్రదాయ ప్రదర్శిని (26 పుట) 'పల్లవి గోపాలయ్య – ఈతఁడు ద్రావిడ బ్రాహ్మణులలో నొత్తరుఁడు. తం-ప్ర-ర-మే యితని నివాసస్థానము' అని వ్రాయఁబడుట పై యూహను బలపఱచుచున్నది. మఱియు 'కర్ణాట సంగీత

పద కర్తలు' అను నాంగ్లగ్రంథమున నీతని వంశీయులలో నొకఁడును ప్రసిద్ధ సంగీత విద్వాంసుఁడునగు వెంకటరామశాస్త్రులనుగూర్చి గ్రంథకర్త వ్రాసిన దాని నీ క్రింద నిచ్చుచున్నాను.[1]

భక్తజన పారిజాతమున నతని వంశక్రమ మిట్లు తెలుపఁబడినది.

వెలనాఁటిశాఖ-ఆత్రేయగోత్రము.




ఈతఁడు ప్రతాపసింహుని కుమారుఁడగు నమరసింహుని కాలములోను, శరభోజీ మహారాజు కాలములోను జీవించియుండెను. ఈతని కృతియగు [2]భక్తజన పారిజాతమునఁ బరమభాగవతులచరిత్ర వర్ణితమైనది.

---

1. A noted contemporary of saint Thayagaraya and a profound scholar in music and Bharatha natya. Sastri was a Telugu Brahmin of the Velanadu sect who hailed from the village of Merattur in the Tanjore Dt. near ayyampet R. S- In foot note to this, the author writes thus :—

His ancestors migrated from Guntur and settled here

(The carnatic music composers. T. S. Vasudevan. Journal of the Madras university Vol X No. 1. Page. 153. కాఁబట్టి పల్లవి గోపాలయ్య రాజగోపాల వాగ్గేయ కారాగ్రణి అని తెలియుచున్నది.

2. గ్రంథ మముద్రితము. తంజావూరి పుస్తకశాలలో నున్నది. సంఖ్య 202. (M. 374).

భక్తజన పారిజాతమున కవితప్రశస్తముగానున్నది. ప్రారంభము-కవి వంశవృత్తాంత మిందుగలదు.

శా. శ్రీభూమితనుజాతనూలతకు నర్థింబ్రాపుదాపై జగ
త్సౌభాగ్యప్రదమైన లక్ష్మణమరుజ్జాత ప్రకాండంబు ల
క్ష్మీ... సమస్తఫలదశ్రీరామకల్పద్రుమం
బా భోగస్థితి మీఱ ధీరజనకీరాధారమై గావుతన్.
... ... ... ... ... ...

తే. గీ. ప్రేమ సాక్షాత్కరించె శ్రీరామవిభుఁడు

క. భక్తజన పారిజాతము యుక్తులలర నాంధ్రభాష నొనరించుట కా
సక్తుఁడవై తివి మే లనురక్తిని తద్భర్తయందు రహిఁగను శక్తిన్.

సీ. భూజనప్రద గుంటురీజన ప్రదయాజ యాజకత్వప్రణీతాజ్ఞి తేజ
... ... ... ... ... ...

తే. రాజగోపాలకవిరాజ రమ్యతేజ

క. మీ తండ్రియుఁ దాతయు ముత్తాతయుఁ దద్గురుఁడు ధరణితనయేశ్వరులై
ఖ్యాతిఁగఁ గృతులొనరించి రుదీతమతి నొనర్పువారి తెఱఁగున నీవున్.

క. వెలనాఁటికీర్తికలమను లిలనాఁటనెసంగుపేరు నెనసిన గుంటూ
రెలమి నలమి బలిమి కలిమి చెలి మిన్నకునికి యనఁగఁ జెలఁగుచు మెఱయన్.

శా. ఆయూరంబుధులే మదీయులు పవిత్రాత్రేయగోత్రోద్భవ
శ్రీయూరన్ నివసింతు రభ్యుదిత కీర్తిస్ఫూర్తి సౌభాగ్యధీ
... ... ... ... ... ...

క. మునుపు వారిలోపలి కవుల్ ఘనవాదన వారిలోపల సితుఁడనిరి పె
ద్దన దీక్షితుఁ గన దీక్షితు ఖన దీక్షితుల దగుకీర్తిగల బుధ చంద్రున్.

తే. ... ... యనఁగఁ జెలువొందు పెద్దనయజ్వచేత.

క. సమగారివిభవమున నిక్కముగారి యనంతమూర్తి కలితుఁడనం డ
క్కమగారిన్ సమగౌరిన్ రమదారింగన భజించిరహిచే నంతన్.

చ. హరిహర చర్యులన్ .. ... ... ... మం
దరధర ధైర్యులన్ బసువనప్రథితార్యుల లింగనాథ్యులన్
ధరనల యక్కమాంబవలనన్ సుతులంగని యొప్పె పెద్దనా
ధ్వరి ... ... ... ...

తే. గీ. అలర బసువయ్యయజ్వ సింగాంబవలన
ఆత్మజులఁగనె రామకృష్ణార్యులనఁగ
కృష్ణఘను రామచంద్రు శ్రీకృష్ణసూరి
... ... ... ...

క. మతి(ని)తెన్నేటి కృష్ణాకృతిజ జగన్నాథ తనయ కృష్ణసుధీరా
ట్నుత లచ్చమ బరిణయమై కృతతద్విధిసలిపె రామకృష్ణకవి భువిన్.

మ స్ర. కనె లక్ష్మిసాధ్వియందున్ ... ... గోపాలధీరున్.

క. ... ... ఊరునరసింహార్యమణి శుభోత్తరుఁడనఁగన్
పరగు సతి తిరుమలమ్మను పరిణయమై యతఁడు మెఱసె బాంధవులలరన్.

మ. కుకవిస్తోమనిరాకరిష్ణుఁడగు నా గోపాలధీరుండు
... ... ... శ్రీధన్యయౌ తిర్మలాం
బికయందుఁ సతులఁ గనెఁ [illegible] రామునిన్నన్న గే
తకరుఁ సర్వసుధీంద్రు వేంకటఘనుఁ త్రయ్యాదివిద్యాఢ్యులఁ.

తే. గీ. వారిలో రామసుకవి కావూరికొండ
నార్యసుతయై చెలంగు వెంగాంబయందు
తిర్మల బుధార్యగుణ ధుర్య ధర్మదార్య
ధీ సమృద్ధార్యుఁగని గుణాధికతఁ గాంచె.

క. గురుసము గోపాలబుధేశ్వరు సర్వసుధీంద్రు నెన్న వాసుకికైనఁ
దరమే దరమే దరమే దురమే దురమేశ బాణతుల వహియింపఁ.

శా. ... ... ... — గోపాలార్యాగ్రణి
వెంకటాగ్రణి సుధాపాథోధియొప్పుఁ మహిఁ
... ... ... ... ...

గ్రంథాంతమున:

క. అని పొగడి కృష్ణపాదాబ్జనవీనసమగ్రభక్తి పరవశుఁ డగుచుౝ
మనమున రంజిలి సూతుఁడు మొనసిన మతి శౌనకాదిమునులకు ననియెౝ

ఈ గ్రంథము నైదవ యాశ్వాసమున కొంతభాగమున్నట్లు తెలియుచున్నది.

## సభాపతయ్య[1]

"సభాపతయ్యపదములు" అను పేర సంగీతకృతులు రచియించిన సభాపతయ్య ములికినాఁటి వైదికశాఖా బ్రాహ్మణుఁడు. తంజావూరి సమీపమునగల మాననల్లూరు గ్రామనివాసి. సుప్రసిద్ధ క్షేత్రమగు మన్నారుగుడియందు నీతఁడు నివసించి రాజగోపాలస్వామి భక్తుఁడై యా దైవముపేర ననేకకృతులు రచియించెను. ఈతఁడు శ్రీ త్యాగరాజ స్వామికి చివరిదశలో సమకాలికుఁడు. క్రీ. శ. 1860 ప్రాంతమున నుండిన వాఁడు.

ఈతఁడు "సీతాస్వయంవరము" అను పాటల నాటకము రచించె నట, కాని యది నేఁడు కానరాలేదు. సభాపతయ్య సంగీత విషయమున క్షేత్రయ సంప్రదాయమునకుఁ జెందినవాఁడు. క్షేత్రయ పదములను సంప్రదాయసిద్ధముగాఁ బాడి వాని నభినయించువాఁడు. తన స్వంతకృతుల యందును క్షేత్రయ యనుసరణమే కన్పట్టుచుండును. కావున నీతఁడు కళోపాసకుఁడని చెప్పనొప్పును. మఱియు నీతఁడు భరతశాస్త్రమున మహాప్రవీణుఁ డగుటచేత పదములు రచించుటయేగాక వానిని శాస్త్ర రీతిగాపాడి యభినయించుటచేత పదకవితకు ప్రాణముపోసినవాఁడని చెప్పఁ దగును. ఆంధ్ర వాగ్గేయకారులలో సభాపతయ్యకు సముచిత స్థానముగలదు.

సభాపతయ్య పదముల విశేషముల నెఱుంగుటకు నీ క్రిందివాని నుదాహరించుచున్నాను.

---

1. సభాపతయ్య పదములు. శ్రీతిమ్మావఝ్ఝుల కోదండరామయ్య. భారతి సం. 28, సం. 2. (1951 ఫిబ్రవరి) పుటలు 158-163.

రాగము - శంకరాభరణము. తాళము - మిశ్రము.

పల్లవి. దారిఁజూచుచునున్నది నీదు ప్రియ
తరళాక్షి యీ చిన్నది

అనుపల్లవి. వారిజముఖి నీవు వచ్చువేళను కోని
కోరికతో రాజగోపాలసామినీ. ॥ దారి ॥

చరణములు. వెన్నెలఁగాయఁగ - వేడ్కమీఱ మంచి
సన్నజాజి విరి - సరులును గంధము
పన్నీరు చెంబులు - పడకింటిలోమంచి
వన్నెలాడి తల - వాకిట నిలిచి నీ. ॥ దారి ॥
ఏ వగనైనను - నెందు చప్పుఁడైన
నీవోయని యెంచి - నిలిచి తిరిగి చూచి
ఈ వగ చిత్తము - నిచట నిలిపినట్టి
భావం బెవరికి - బయలుఁగా నీక నీ. ॥ దారి ॥
పచ్చిపచ్చిగా - పదములు పాడుచు
వచ్చి రాజగో - పాలసామీ నీవు
ముచ్చటలాడుచు - ముద్దులుపెట్టుచు
గ్రుచ్చి కౌఁగిటఁజేర్చి - కూడుటఁ దలఁచి.[1] ॥ దారి ॥

రాగము - కాంభోజీ. తాళము - మిశ్రము

అన్యాయముగ నే నపదూరుపాలైతి
అతివరో యేమందునే

అనుపల్లవి. మన్నారు రాజగోపాలస్వామికి నాకు
కద్దని పలికేరు.

చరణములు. ఆ సరసుఁడు ప్రీతిచేసి పిల్వఁగనూ
రోసము చూపితినే
మా సీమలోనిది మరియాద కాదని
వేసారి మ్రొక్కితినే

1. సభాపతయ్యగారు రచించిన శృంగారపదము లేఁబది రాజగోపాలాంకిత ములు. క్రీ. శ. 1884-వ సంవత్సరము మార్చినెలలో శ్రీ అ స. నృసింహాచార్యులవారి శ్రీవాణీనిలయ ముద్రాక్షరశాలయందు ముద్రింపఁబడినది.

దోసమెన్నక పలుకు మోసగత్తెల గేలి
చేసే రేమందునే
ఆసదీరనే ననుభవించక యయ్యయ్యో
నక్కపల్లమన్న సామెత రీతిని. ||అన్యా|| ౧.

ఆటపాటలకై యాతనితో నేను
మాటలాడినందు కా
జోటులకెదుట నీ ప్రొద్దు వానింటికి
పోయివచ్చినందు కా
సూటిగాను వాని చూచినవ్వే యల
వాటు చేసి నందు కా
ఏటికే యీ గేలి యేపాప మెఱుగనే
తాటిక్రింద పాలు ద్రాగిన చందాన. ||అన్యా|| ౨.

ఏకమై గోపాలు డెనయ వచ్చెద నంటె
నీ కిది తగదంటినే
కోకలెత్తి పట్టికొంటి తనము చూప
రాకు పో పొమ్మంటినే
ఈ కారణ మేమేయిది తెలియవట్టి
పోకిళ్లు చేకొంటినే
లోకము మూయను మూకుడు గలదటె
చాకివాడు వృథా జానకి ననినట్లు. ||అన్యా|| 3.

# మేలత్తూరు వేంకటరామశాస్త్రి

(1807-1860)

రాజగోపాల వాగ్గేయకారాగ్రణి వంశీయులలో నొకరగు నీ వెంకట్రామ శాస్త్రి "మెరత్తూరు" అను గ్రామమున నివసించుటవలనను నీతఁడు తెలుఁగువాఁడైన కతముననను, నీతని యింటిపేరు మెరత్తూరు గ్రామ నామమైనది. మెరత్తూరు వాడుకలో "మేలటూరు" అయినది.

ఇతఁడు గొప్ప సంగీత విద్వాంసుఁడు. తెలుఁగునఁ బండ్రెండు యక్షగానములను రచియించియున్నాఁడు వానిలో పదునొకండు లభ్య

మైనవి. ఇవియన్నియు నముద్రితములు. కొన్ని ప్రదర్శనములయందు పాడుటతప్ప లిపి కెక్కలేదు. అయిన వీనికి సంగీతప్రపంచమున చాల వ్యాప్తిగలదు.

(1) ప్రహ్లాదచరిత్ర. (2) మార్కండేయచరిత్ర. (3) రుక్మాంగదచరిత్ర. (4) ఉషాపరిణయము. (5) హరిశ్చంద్రనాటకము రెండు భాగములు. (6) రుక్మిణీకల్యాణము. (7) శివరాత్రి నాటకము. (8) సత్సంగ రాజనాటకము. (9) అసత్సంగ రాజనాటకము. (10) సీతాకల్యాణము. (11) జగన్మోహనవిలాసనాటకము.[1]

[2]వేంకటరామశాస్త్రి సంగీతసాహిత్యవేత్తయేగాక నాట్యశాస్త్రము నభ్యసించిన నటకుఁడగుటచేత పై నాటకములలోఁ దానే నాయక వేషమును ధరించెడువాఁడఁట! కావున నీతని నాటక ప్రదర్శనమునకు గొప్ప సంగీత విద్వాంసులు వచ్చెడివారఁట!

క్రీ. శ. 1825 లో నీ నాటకములు రచించినది మొదలు డెబ్బదేండ్ల వఱకును నివి తంజావూరిప్రాంతమునఁ బెక్కు పల్లెలలో నృసింహ జయంత్యుత్సవ సందర్భమునఁ బ్రదర్శింపఁబడుచుండెడివఁట!

ఇతనినిగూర్చి సంగీతసంప్రదాయప్రదర్శినిలో నిట్లు వ్రాయఁబడినది. పుట 34. సంఖ్య 55 "ఇతడు త్రైలింగ్య బ్రాహ్మణుఁడు. తంజావూరికి సమీపముననున్న మెరటూరిగ్రామ వాస్తవ్యుఁడు. ఈతఁడు శరభోజీ మహారాజుకాలమునందును శివాజీ మహారాజు కాలములోఁ గొన్నిసంవత్సరము లుండినవాఁడు. ఆంధ్రభాషలో నసాధారణమైన పాండిత్యముగలవాఁడు. ఈతని పదములు కౌశికరీతిగాఁ బదసౌష్ఠవము గలిగి శృంగారరస భూయిష్ఠమైయుండును."

---

1. Carnatic music Composers Pages. 152, 154,

2. పైని చెప్పఁబడిన వెంకటరామశాస్త్రిగారి నాటకములను గూర్చిన సమీక్ష "భారతి. సం. 32. సం. 9 లో" మేలటూరు భాగవత మేళనాటకములు అను వ్యాసమునఁ గలదు. (సెప్టెంబరు 1955. పుటలు 14–20.)

# మధురాపురాంధ్ర వాఙ్మయము

ఇంతవఱకును మనము క్రీ. శ. 1600 నుండి క్రీ. శ. 1857 వఱకు దక్షిణ దేశీయాంధ్రవాఙ్మయమున ప్రథమ రంగమగు తంజాపురాంధ్రయందు నాయకరాజుల కాలములోను, మహారాష్ట్రరాజుల కాలములోను, సభివృద్ధినందిన యాంధ్రవాఙ్మయచరిత్ర చదివితిమి. ఇక ద్వితీయరంగమగు మధురనుగూర్చి తెలిసికొందము.

మధుర ప్రాచీనకాలమునుండి ద్రవిడభాషా వాఙ్మయ సంస్కృతులకు మాతృస్థానమై విలసిల్లినది. కవిసైనవాని కే చోటు నొసగు "శంఖఫలకము" మధురాపురాస్థానముననే యుండెడిది. [1]నత్కీరాది కవీంద్రులీ యాస్థానమున నుండెడివారే. కాలక్రమమున విజయనగర సామ్రాజ్యాధిపతియగు శ్రీకృష్ణదేవరాయలవారి కాలమున (క్రీ. శ. 1509 - 1530) నాగమనాయకుఁడు, విశ్వనాథనాయకుఁ డీ రాజ్యమును జయించిరి. శ్రీకృష్ణదేవరాయ లారాజ్యమున కధిపతిగా విశ్వనాథనాయకుని నియమించెను. ఆనాటినుండియు మధురలో ప్రాచీన పాండ్యరాజ్యనంతో మంతరించి తెలుఁగు నాయకుల పరిపాలన ప్రారంభమైనది.

విశ్వనాథనాయకుఁడును నాతని వంశీయులను, కృష్ణదేవరాయనివలె, భాషాపోషకులై, తెలుఁగు సంస్కృతి సంప్రదాయములను నిలువఁబెట్టి, తెలుఁగు కావ్యరచనకుఁ బ్రోత్సాహ మొసగిరి. మధురలో విశేష మేమనఁగా వచనములోఁగూడ మొదట కావ్యములు బయలుదేరుట. విశ్వనాథనాయకుని స్థానాపతి రాయవాచకముతో నీ వాఙ్మయచరిత్ర ప్రారంభమగుచున్నది.

రాయవాచకమునుగూర్చి చెప్పుటకుముందుగా విశ్వనాథనాయకునివద్దనుండి మధుర పాలించిన నాయకులనుగూర్చి కొంత తెలుపవలసి యున్నది. ఆ నాయకరాజుల వంశవృక్షమిది.

---

1. నత్కీరుని కథ తెలుఁగు వాఙ్మయమున నొక్కచోటనే ధూర్జటి శ్రీకాళహస్తీశ్వర మహాత్మ్యమున గలదు.

## మధుర నాయకరాజుల వంశవృక్షము.[1]




1. పై వంశవృక్షమే మిందటివఱకు నాంగ్లేయభాషలోఁ గాని తెలుఁగునఁగాని యే చారిత్రక విమర్శనలు నిర్ణయించియుండలేదు. క్రీ. శ. 1924-వ సంవత్సరములో మదరాసు విశ్వవిద్యాలయమువారు “మధుర నాయకుల చరిత్ర” అను గ్రంథముఁ బ్రకటించిరి. అది మధురనాయకరాజుల చరిత్ర. ఆయిన నందు తెలుఁగు ప్రసక్తిలేదు సరికదా, పేర్లుకూడ, తమిళ సంప్రదాయానుసారముగ వ్రాసినవి. నాచే మధురనాయకుల కంకితములైన

1. The History of the Nayaks of Madura by S. Sathianatha Iyer M. A. University of Madras. Historical Series. (No. 8. 1924)

పై వంశవృక్షమున తిరుమలనాయకుని కాలమువఱకును (క్రీ. శ. 1623 - 1629) నాంధ్రభాషాభివృద్ధి జరుగలేదు. తిరుమలనాయకుని యాస్థానకవి లింగనమఖి కామేశ్వరకవి, యాతనిచే సమ్మానితుఁడైనను, నాతనికి కృతులేవియు నొసగలేదు. తిరుమలనాయకుఁడు సంగీత శాస్త్రమునం దభిమానముగలవాఁడగుటచే కాబోలు కామేశ్వరకవి తన సత్యభామా సాంత్వన గద్యలో "దక్షిణ సింహాసనాధ్యక్ష తిరుమల క్షమాకాంత కరుణాకటాక్షలక్షిత ముక్తాగుళుచ్ఛసిత చ్ఛత్రచామరాకళాచికా కనకాందోళికాది రాజోపచార హృదయరంజకవచోవిహార వల్లకీవాదన ధురీణ వర్ణగీతాది గాంధర్వస్వర కల్పనాప్రవీణ" అని చెప్పికొని యున్నాఁడు.

చొక్కనాథనాయకునికి కామేశ్వరకవి ధేనుమాహాత్మ్యమును కృతి నిచ్చియుండుటచే నాతఁడు నాంధ్ర భాషాపోషకుఁడని చెప్పనగును.

చొక్కనాథనాయకుని సోదరుఁడగు ముద్దళగిరి క్రీ. శ. 1675-1678 నుండి మూఁడేండ్లు మధురను పాలించెను. ఈతనికి పెద్దళగిరి యను నామాంతరముగలదు. ఈతఁడు భాషాపోషకుఁడు ; కవిపండితాభిమాని. క్రీ. శ. 1674లో ముద్దళగిరి తంజావూరిరాజ్యముపై దండెత్తెను, అప్పుడా

తెలుఁగు గ్రంథములున్నను దానిని పరిగణింపలేదు. పాశ్చాత్యుల వ్రాఁతలను, శాసనములను ప్రమాణముగా గొనిరి. ఆ గ్రంథమున వారు తమకు దొరకిన సాధన సంపత్తినిఁ బట్టి యొక వంశవృక్షము తయారుచేసిరి. ఆ పైని చాలకాలమువఱకు నీ మధురనాయక చరిత్రనుగూర్చి యెవ్వరును తలపెట్టరైరి. నేను క్రీ. శ. 1944-వ సంవత్సరమున నీ దక్షిణదేశాంధ్రవాఙ్మయ పరిశ్రమ ప్రారంభించినప్పు డీ మధురనాయక రాజవంశజుల భాషాపోషణమునుగూర్చి యాంగ్లేయభాషలో నొక వ్యాసము వ్రాసి యందీవంశవృక్షము నిచ్చితిని. నా యాంగ్లేయ వ్యాసమున ముద్దళగిరికి కృతినిచ్చిన సత్యభామాసాంత్వనావతారికనుండి సంగ్రహీతమైన వంశవృక్షము నిచ్చితిని. [2]ఆ వ్యాసము క్రీ. శ. 1947 లో ప్రకటితమైనది.

2. Journal of the Andhra Historical Research Society, Rajahmundry Vol. XVI Nos. 1 to 4.

(Vijayanagara Empire special supplement.)

రాజ్యము నాక్రమించుకొన్న మహారాష్ట్రరాజగు శహాజీ పుత్త్రుఁడగు నేకోజీని పాలుఁద్రోలి నారాజ్యము నాక్రమించి యొకయేఁడాది (క్రీ. శ. 1674) పరిపాలించెను.

ముద్దళగిరి తంజాపూరి విజయమును వర్ణించుచు, నాతని యాస్థాన కవియగు గణపవరపు వేంకటకవి " పెద్దళగిరివిజయము " అనునొక కావ్యమును రచియించెను. అది పూర్వమాలిక, పశ్చిమమాలిక, దక్షిణమాలిక, ఉత్తరమాలిక అను నాలుగు భాగములుగలది. అదియంతయు నుత్పలమాలావృత్తముతో చెప్పఁబడియున్నది. పైసాహిత్య చరిత్రకు సంబంధించిన వివరణము లాయా కవి చరిత్రలలో చూడనగును.

క్రీ. శ. 1675 లో తిరిగి తంజాపూరు మహారాష్ట్రులవశమైనది. కావున నానాఁటినుండి మధురాపురమున నాంధ్రవాఙ్మయదశ యారంభమైనది.

ఇక కాలక్రమముగా నీ వాఙ్మయచరిత్రను దెలుపుదును.

## రాయవాచకము - విశ్వనాథనాయకుని స్థానాపతి

మధురనాయకుల కాలమునఁబుట్టిన గ్రంథములలో రాయవాచకము ప్రథమమని యూహకే తెలియుచున్నది. ఇది విశ్వనాథనాయకుని స్థానాపతి రచించినది. ఇది వచనకావ్యము. ఇందులో నవతారికయందు నాలుగు పద్యములుగలవు. గ్రంథ మధ్యమున పూర్వకవిరచిత గ్రంథములనుండి పద్యము లుదాహరింపఁబడియున్నవి. అవతారికలోఁ జెప్పిన రీతిని విజయనగర వృత్తాంతము, కృష్ణరాయల చరిత్ర, ఆతని విజయములు, కృష్ణరాయల కప్పాజి చెప్పిన రాజనీతులు నిందుఁగలవు. కావునఁ జరిత్రకారులకీ గ్రంథ మత్యంతము నుపాదేయమైనది. మఱియు నిందలి చారిత్రాంశములు, కృష్ణరాయనికాలమున పోర్చుగల్ దేశమునుండి వచ్చిన యాత్రికులు వ్రాసిన యంశములతో సరిపోవుచుండుటచేత నీగ్రంథము విలువ మఱియు హెచ్చినది. దీని ననుసరించియే కుమార ధూర్జటి కృష్ణరాయ విజయము, అను ప్రబంధమును రచించియున్నాఁడు.

1. అవతారిక.

క. విజయనగర వృత్తాంతము సుజనులతో విన్నయట్టి సూనృతవాక్యుల్
ప్రజలకుఁ దేటపడంగా సృజియించితి కృష్ణరాయశేఖరు చరితల్. ౧

క. విజయనగర జనపాలుఁడు విజయాపురి గోలుకొండ వీరులతోడన్
గజపతిని నాజిగెలిచిన విజయుండౌ కృష్ణరాయవీరుని చరితల్. ౨

క. రాయలకు రాజనీతులు నాయుఁడు నప్పాజిచెప్పినవి యన్నియుఁ దాఁ
బాయక మనసుననునిచిన రాయసములు వ్రాయఁజదువ రసికతగలుగున్. ౩

క. బాలురు చదివిన బుద్ధి విశాలురు గావలయు శాస్త్రజాలంబులలో
లోలురు నరివహ చింతాశీలురుఁ గావలయు భక్తిశీలత నెప్రుడున్. ౪

ఇది మధురరాజ్య సంస్థాపకుఁడగు విశ్వనాథనాయనివారి కాలము నందే క్రీ. శ. 1529-1564 ప్రాంతమున రచియింపఁబడినట్లు కథా ప్రారంభమువలనఁ దెలియుచున్నది.

"శ్రీమంతు సకలగుణసంపన్నులైన, మహామేరుసమాన ధీరులైన అఖండితలక్ష్మీ ప్రసన్నులైన శ్రీమన్మహామండలేశ్వరరాజమాన్యమహారాజరాజశ్రీ కాశీవిశ్వనాథ నాయనయ్యవారి దివ్య శ్రీపాదపద్మములకు దేవరవారిస్థానాధిపతి భక్తపరాధీనుండు సర్వదాను భయభక్తులనున్న శాయంగల విన్నపములు."

ఈ స్థానాపతి కవియైన ట్లవతారిక పద్యములే చెప్పుచున్నవి.

రాయవాచకమున నీ క్రింది విషయములు వివరింపఁబడినవి. (1) కర్ణాటరాజుల దినచర్య. (2) విద్యారణ్య ప్రశంస. (3) విద్యానగర నిర్మాణము. (4) శంఖుస్థాపన ముహూర్తము. (5) కృష్ణరాయల పట్టాభిషేకము. (6) కృష్ణరాయలకు మంత్రులు రాజనీతి నుపదేశించుట. (7) లోకవార్తలు తెచ్చుటకు వేగర్ల నియమించుట. (8) కృష్ణరాయని నిత్యకృత్యవివరణము. (9) కోశాది వివరణము. (10) కృష్ణరాయలు పట్టణశోధనకుఁబోవుట. (11) తిమ్మరసు రాయలవారిని మందలించుట. (12) రాయలసేన వివరణము. (13) సాళువతిమ్మరసు ప్రశంస. (14) విజయాపుర వృత్తాంతము. (15) అశ్వపతి నరపతి గజపతుల తారతమ్యము. (16) తురుష్కుల శీలము. (17) అహమ్మదాబాదు గోలుకొండల

వృత్తాంతము. (18) పరదేశుల శోధనము. (19) తురుష్క రాజ్యములో దండనవిధము. (20) మూఁడు దక్షిణహిందూ రాజ్యములు. (21) ఢిల్లీలో నున్న ప్రతాపరుద్రుని వృత్తాంతము. (22) అహమదానగర విజయపుర గోలుకొండరాజ్య వృత్తాంతము. (23) గజపతివారికి విరోధులు విష ప్రయోగము చేయించుట. (24) రాయలు తురకలమీఁదికి యుద్ధము నకు వెడలుట. (25) రాయలవారు ఉదయగిరి మొదలగు దుర్గముల మీఁదికి దండెత్తుట.

ఈ విషయములను దాను స్వజనులచే విన్న సూనృతవాక్కులను (నిజమగు మాటల) నిందు చక్కని రాజకీయ వ్యావహారిక భాషలో స్థానాపతి కవి రచించియున్నాఁడు. గ్రంథాంతమున నిట్లుగలదు.

"మఱునాడు కొలువులోపల యిష్టకథావినోదమైన నగరిని నియోగులున్న కవీశ్వరులు విద్వాంసులు మొదలైన నిండుసభలోన సాళువ తిమ్మరసయ్యగారున్ను రాయసంకొండమరసయ్య మొదలైన వారలున్ను ప్రసంగంవెంబడిని అందఱున్ను మెచ్చినట్లు కవితాచాతు ర్యము గలవారున్ను రాయలవారినిజూచి ప్రసంగంవెంబడిని నీదుకీర్తి శాశ్వతముగా నిలిచేటందులకు ఆదియందు అవనీపతులు కృతులందుచు రాగా వారల ప్రతాపములున్ను కీర్తిన్ని అందఱును మెచ్చినట్లు స్వామి వారున్ను కృతు లందుకుంటే కీర్తిప్రతాపములు శాశ్వతముగా నిలుచును గనుక తిమ్మరసయ్య, అయ్యమరసయ్య, కొండమరసయ్య, బాచరసు, తిప్పరసు, అయ్యమరసు మొదలయినవారలు తెలుపగా రాయలవారున్ను చాలసంతోషపడి ముక్కుతిమ్మయ్య, అల్లసాని పెద్దయ్య, మాదనగారి మల్లయ్య మొదలైన కవీశ్వరులతో కృతు లందుకోవలెనని కవితానాయ కులతో పలుకరించి ఆ తీరున అయ్యేని అనంగా కుళ్లాయి, తాళిచౌకట్లు, చేసరి పేరులు కోకతాకలు యిచ్చి పారిజాతాపహరణమున్ను మను చరిత్రను చెప్పమని ఆనతిచ్చినారు.

వెనుక స్వామివారికి యీవఱకునడచు సమాచారములకు వ్రాసి యంపించినాను, తర్వాతనడచు సమాచారములకు వెంబడిగా విన్నవించి అంపుచున్నాను గనుక స్వామివారి పాదారవిందములయందు నిరంతర

భక్తియిచ్చి రక్షింపగలది. ఈ రాయవాచకం చదివినవారలకు విన్న వార్లకున్ను బుద్ధివివేక విచక్షణములుగలిగి భాగ్యవంతులై యోగ శాలులై ఆచంద్రార్కస్థాయిగా సుఖానందురు. శ్రీ రామార్పణమస్తు శ్రీరామజయం."

ఈ రాయవాచకమున రాజనీతిసందర్భమున 'సభాపతి వచనము' అను పేరుగల యొక విశేష విషయసంకల్పిత వచనముగలదు. ఈవచనము వేఱుగా నేఁడు కన్పించుటచేత నంతకుముందు రచనమైనదానిని స్థానాపతి యిందు చొప్పించెనని యూహింపఁదగియున్నది.

ఈ గ్రంథమునఁ బద్యములు కొన్ని గలవు. అవి భారతము, బద్దె నీతులు, చాణక్యశతకము, కవికర్ణరసాయనము మున్నగువానినుండి యుదాహృతములైనవి. ఈ గ్రంథమునందుండియే కర్ణాటరాజుల దిన చర్యలో నీక్రింది గ్రంథములు బ్రాహ్మీముహూర్తమున రాజులు పఠించు చున్నట్లు తెలియవచ్చుచున్నది.

"విద్యానగరమందు వీరనృసింహరాయలవారు బ్రాహ్మీముహూ ర్తానలేచి, ఆరాధ్యుల నామావళులున్ను, అధ్యాత్మ సంకీర్తనలున్ను పాండవగీతలు, భ్రమరగీతలు, గజేంద్రమోక్షం, భారతసావిత్రి దధి వామన స్తోత్రము, గంగావతరణమున్ను, నదీస్తోత్రమున్ను, భారతం, భాగవతం, రామాయణము, ముచికుంద స్తుతి, అక్రూర స్తుతి, సంజయుని నీతి, విదురనీతి, చాణక్యనీతి, బద్యనీతి ఇది మొదలైనవిన్ని నీతి వైరాగ్యశతకం పురాణశ్రవణమున్ను రాజనీతులన్నియువిని"–పై వానిలో రెండు మూఁడు మాత్రమే సంస్కృతముగాని తక్కినవి తెలుఁగు.

ఆరాధ్యుల నామావళులనఁగా సహస్రగణమాలిక. మల్లికార్జున పండితారాధ్యకృతము, ఇది తెలుఁగుకన్నడములలోఁదప్ప సంస్కృతమున నప్పటికిలేదు. అధ్యాత్మ సంకీర్తనలు మహాప్రసిద్ధులగు తాళ్లపాక అన్నమయ్యగారివి. పాండవగీతలు, భ్రమరగీతలు, గజేంద్రమోక్షము, భారత సావిత్రి, అక్రూరస్తుతి, భీష్మస్తుతి ఇవియన్నియు తెలుఁగుకృతులే

దధివామనస్తోత్రము, గంగావతరణము, నదీస్తోత్రము, ముచికుంద స్తుతి సంస్కృతము. తక్కిననీతులు తెలుఁగే. బద్యనీతి యనఁగా బద్దెన నీతిసారముక్తావళి. ఇందుండి పద్యములు.[1]

క. న్యాయము ప్రజపెంపునకు నుపాయము ప్రజకలిమి సిరి కుపాయంబగుటన్
న్యాయము భండారము నరనాయకులకు నంద్రుకీర్తి నారాయణుఁడా!

క. బలవర్గము సామంతుల బలమున కగ్గలముగల నృపాలున కొదవే
బలిమెపెఱనృపతి [illegible] కెంతదవ్వు బద్దెనరేంద్రా!

క. సతిని ధరిత్రియు పురుషులె రత్నములెప్పుడు పురంధ్రిరత్నములు శిలా
రత్నము లవనీపతులకుఁ బత్నులరత్నములువగవ బద్దెనరేంద్రా!

క. తరుణుండై నవరత్నాభరణుండై [illegible]యుతుఁడై
నరనాయక పరివృతుఁడై పరగినవాఁడమరునిట సభాపతియనఁగన్.

ఇందు సంగ్రహింపఁబడిన మఱికొన్ని పద్యముల నుదాహరించుచున్నాను.

క. శ్రీగమ్యుఁడు విజయుండును ధీరోదాత్తుండు సుగుణతేజోనిధియై
యాగియ సింహాసనమున నాయూథుండగుట యొప్పునా సభనదుమన్.

గీ. వెలఁది, జూదంబు, పానంబు, వేఁట, పలుకు ప్రల్లదంబును, దండంపుఁ బరుసఁదనము,
సొమ్ము నిష్ప్రయోజనముగ వమ్ముసేఁత యనెడు సప్తవ్యసనములఁ జనదుతగుల.

క. సాధువులగు జంతువులకు బాధలుకల్పించు ఖలులభంజింపని రా
జాగము నాయుస్స్వర్గ శ్రీధనములు విడిచిపోవు సిద్ధముతల్లీ!

పరీక్షిత్తు ధర్మధేనువుతోఁ జెప్పినది.

శ్లో. శతేషు జాయతే శూరః సహస్రేషు చ పండితః
వక్తా శతసహస్రేషు దాతా భవతి వా న వా.

శ్లో. యతో ధైర్యస్తతో లక్ష్మీర్యతో లక్ష్మీస్తతో హరిః
యతో హరి, స్తతో ధర్మః యతో ధర్మస్తతో జయః.

1. ఈ స్తోత్రమునే పెద్దన ‘వామనస్తుతిపరత్వము’ అని ప్రవరాఖ్యుని వర్ణించుపట్లఁ జెప్పినాఁడు.

క. ఘనుఁడా వినయంబాడిన వినయంబా మీఁదనదియు విపరీతమగున్
గొనసుండి విల్లువంగుట వినయంబా యెదుటివాని వేగమె ద్రుంచున్.

సీ. ఏవంకఁ జూచిన హేమకుంభప్రభామండితోజ్జ్వలసభామంటపములు
ఏవీథిఁ జూచిన నిక్షురంభాస్తంభదర్పణాంచిత గృహద్వారభూమి
నేచాయఁ జూచిన నిభతురంగానేక రాహుత్తసుభట విరాజితంబు
నేదిక్కుఁ జూచిన నేణనేత్రాకుచ ఘనసారమృగమద గంధలహరి.

గీ. యెచటఁ గనుఁగొన్న నవరత్నఖచితరచిత హాటకోన్నత వివిధశృంగారవనము
గలిగి చూపట్టు దేదీప్యకలితమగుచు శుభకరంబగు పట్టణశోభితంబు.

శ్లో. అరిర్మిత్రం విషం పథ్యమధర్మో ధర్మతాం వ్రజేత్
అనుకూలే జగన్నాథే విపరీతే విపర్యయమ్.

క. నరసింహకృష్ణరాయా! దురమున నీపేరు పేరఁదురకలఁ గ్రుంగెన్
గిరిరాజవరదుఁడవునని కరిఘటములు నిన్నుఁ జూచి గ్రక్కునఁ దిరిగెన్.

ఇది ముక్కుతిమ్మన చెప్పినపద్యం.

క. ధాత్రీశుఁడంత దిగ్జయ యాత్రా[illegible]తిన్
శత్రువులగుండె లవియఁగ జైత్రప్రస్థానభేరి సేయించుటయున్

శా. భూకంపంబు జనింపరొప్పఁగ మహాంభోరాసులుప్పొంగఁగా
లోకాలోకము లెల్లఁ బెల్లగిల ముల్లోకంబు ఘూర్ణిల్లన
స్తోకవ్యాప్తి నజాండగోళదళనోద్భూతధ్వనింబోలె వ
ర్షాకాలాంబుద గర్జితధ్వని సమారంభంబులై మీఱఁగన్.[1]

[2]ఇందలి వచనరచన యెట్లున్నదియుఁ దెలిసికొనుటకు ముందుదాహరించిన పంక్తులే చాలును. రాయవాచకరచయిత స్థానాపతి వెనుకఁ బేర్కొనఁదగిన మహాకవి.

---

1. "భూకంపంబున" అను నీ పద్యము సంకుసాలనృసింహకవి కవికర్ణరసాయనములోనిది. కావున రాయవాచకము క్రీ.శ. 1530-40 తరువాత రచియింపఁబడెనని చెప్పవచ్చును.

2. రాయవాచక మాంధ్రసాహిత్యపరిషత్తువారిచే ప్రకటితమైనది. సంపాదకులు కీర్తిశేషులు జయంతి రామయ్యపంతులుగారు.

# లింగనమఖి శ్రీకామేశ్వరకవి

ఈతనిపేరు శ్రీకామేశ్వరకవియని తెలియుచున్నను నీవఱకు ముద్రించినవారెల్లరు నీతనిపేరు 'కామేశ్వరకవి'యని ముద్రించినారు. కీర్తిశేషులు వీరేశలింగము పంతులవారి కవులచరిత్రమునందేమి, ప్రాచ్యలిఖిత పుస్తకాగార వివరణములందేమి, శృంగారగ్రంథమాలా ముద్రణమునందేమి గ్రంథకర్త కామేశ్వరకవి యనియేయున్నది. ఈతడు తన గద్యమున 'శ్రీకరకవితాకర సుజనవిధేయ శ్రీకామేశ్వరనామధేయ ప్రణీతంబైన' అనియే వ్రాసికొనియున్నాఁడు. నేను పరిశోధించిచూచిన తాళపత్రగ్రంథముల నిట్లేయున్నది. ఇంతియకాక కామేశ్వరకవి తన్నుఁగూర్చి చెప్పుకొను సందర్భమున,

"క. కాసులవలె నింటింటను కాకవులున్నారు హంసకై వడిభువిలో
శ్రీకామ ! నీకెతగురా యేకడనుడిపాలు నీరు వేర్పఱుపంగన్ "

"క. ఏభాషనైనఁ గృతిపతి శోభనములఁ జెందు నీదు సూక్తులవలనన్
నీభాగ్యమసదృశము గౌరీధవకరుణానికేశ ! శ్రీకామేశా ! "

ఇందుఁ దొలిపద్యమునఁ బ్రాసముకొఱకును రెండవపద్యమున యతికొఱకును 'శ్రీ' చేర్చినాఁడని యందురేని యాతని యీ క్రిందిపద్యమును బరికింపుఁడు.

"చ. అనువుగ రుక్మిణీపరిణ - యంబు సముజ్జ్వల భావణించి యాద్యులౌ
ననఁగ నియించినావు నము - న ప్రతిమంబుగ నవ్య కావ్య మిం
పునఁ గరయించుమమీ సొగసు - పోఁడిమిమీఱఁగ సత్యభామ సాం
త్వనమనఁగ బ్పూరంపు నలు - వఁగ గెలువఁగ దిరుకామసత్కవీ "

ఇచ్చట శ్రీకామశబ్దమునకు తిరుకామయని వాడినాఁడు. శ్రీశబ్దమునకు ద్రావిడమున 'తిరు' అను రూపమువచ్చును. 'తిరుమల, తిరువేంగడ, తిరుమంజన, తిర్వాళిక మొదలగు పదము లిట్టివే' వైష్ణవ సంప్రదాయమున 'తిరు' శబ్దమాదియగు శబ్దములే మనకన్నియుఁ గాన వచ్చుచుండును. ఇంతియగాక శ్రీకామేశ్వరకవికృతము ధేనుమాహాత్మ్యమను వచనకావ్యము తంజావూరు పుస్తకశాలలోఁగలదు. అందుఁగూడ,

"చ. వివిధకళాకలాపఖని - వెంగనలింగమఖేంద్రునాగ స
త్కవి తిరుకామకోవిద - శిఖామణి"

అని స్పష్టముగాఁ జెప్పుకొనియున్నాఁడు. కావున నీతని పేరు శ్రీకామేశ్వరకవి యగుట నిశ్చయము.

గద్య :-"ఇది శ్రీ కాళహస్తీశ్వర చరణారవింద మిళిందాయమానాంతరంగ జ్ఞాన ప్రసూనాంబికా కృపావలంబ విజృంభమాణ సారసారస్వత సుధాతరంగ వెంగనామాత్య వంశపావన విరచిత విద్యాధిదేవతాసంభావన దక్షిణసింహాసనాధ్యక్ష తిరుమలక్ష్మాకాంత కరుణాకటాక్ష లక్షితస్వచ్ఛ ముక్తాగుళుచ్ఛ సితచ్ఛత్రచామరకళాచికాకనకాందోళికాది రాజోపచార హృదయరంజకవచో విహార వల్లకీవాదన ధురీణవర్ణగీతాది గాంధర్వస్వరకల్పనాప్రవీణ కామాక్ష్యంబికా నాగన కవిరాజనందన కలితసకల బాంధవహృదయ రంజన శ్రీకరకవితాకర సుకవిశ్రేయః శ్రీ కామేశ్వర నామధేయ ప్రణీతంబైన సత్యభామా సాంత్వనంబను మహాప్రబంధంబునందుఁ బ్రథమాశ్వాసము."

శ్రీ కామేశ్వరకవి తొలుత శ్రీ కాళహస్తి నివాసుఁడై యావెనుక మధురాపురమున రాజసన్మానములఁగాంచుచు నచ్చటనే స్థిరపడినవాఁడు. గద్యయందలి 'శ్రీ కాళహస్తీశ్వర చరణారవింద మిళిందాయమానాంతరంగ, జ్ఞానప్రసూనాంబికా కృపాలంబ విజృంభమాణ సారస్వతసుధాతరంగ' అను వాక్యమును 'దక్షిణసింహాసనాధ్యక్ష తిరుమలక్ష్మాకాంత కరుణాకటాక్షలక్షిత స్వచ్ఛముక్తాగుళుచ్ఛ సితచ్ఛత్రచామర కళాచికా కనకాందోళికాది రాజోపచార' అను వాక్యమును నీవిషయము తెల్లము చేయుచున్నవి. కామాక్షమ్మ, నాగన యాతని తలిదండ్రులు. ఈతని వంశమున బహుముఖముల నాచరించిన లింగనమఖి ప్రసిద్ధుఁడగుటచే నీతని యింటిపేరు లింగనమఖివారైనది. ఈతడు సంస్కృతాంధ్రములయందసమానపండితుఁడైన సరసకవితా సంపన్నుఁడగుటయేగాక, సంగీతమునఁ బ్రసిద్ధిఁజెందినవాఁడు. గద్యయందలి 'వల్లకీవాదనధురీణ' యను

విశేషణ మీతని వీణావాదనముఁ దెలుపుచున్నది. మఱి యీతఁడు గేయకృతులు పెక్కులు రచియించినట్లు 'వర్ణగీతాది గాంధర్వస్వరగవీన కల్పనాప్రవీణ' యనునది స్పష్టపఱచుచున్నది. ఈతని ప్రబంధకృతులలో నిప్పుడు సత్యభామాసాంత్వనముదక్కఁ దక్కినవియేవియుఁ గానవచ్చుట లేదు. ఈతఁడు తొలుత రుక్మిణీపరిణయము రచియించినట్లీవఱకు నుదాహరించిన పద్యమువలననేగాక,

తే. గీ. "తనదు దక్షిణనాయక - త్వమున కుచితముగను ముద్దళఘురిశౌరి-ముదముమీర
నపటి రుక్మిణీపరిణయం-బందుకతనఁ దానిపుడు సత్యభామసాం-త్వనముఁగోరె."

అను పద్యమువలనఁ దెలియుచున్నది. ఇదియు ముద్దళఘురి కంకితముగా వెలసినది.

## ధేనుమాహాత్మ్యము

ఈతని కృతి వేఱొకటి ధేనుమాహాత్మ్యమను వచనకావ్యము గలదు. ఇది యముద్రితము. తంజావూరు పుస్తకాలయ వివరణమునఁ గల దాని విషయముఁ గొంత దెలుపుచున్నాఁడను. ఇది సత్యభామాసాంత్వన కృతిపతి ముద్దళఘురి సవతియన్నయగు చొక్కనాథనాయని వారికిఁగృతి.

"శా. శ్రీరామామణివింతగానురమునం - జెన్నొందికొల్పుండనెం
తేరంగంబును కట్టుమట్టున సదా - దివ్యత్కృపాధార క్షీ
రారూఢిందగఁ గామధేనువుపలెన్ - రక్షించిలోకంబులో
శ్రీరంగేశుఁడు చొక్కనాథ... శౌరిన్ వేడుకన్ బ్రోవుతన్."

అను పద్యముతోఁ బ్రారంభించి గ్రంథమంతయు వచనకావ్యంబుగా రచియించినాఁడు; గ్రంథము కడపట,

"చ. వివిధకలాకలాపఘని - వెంగనలింగమఖీంద్రునాగ స
త్కవి తిరు కామకోవిదకి - ఖామణి ధీరులుపాకవైరిలో
కవికచకల్పకస్తబక - గంధధురంధరసూక్తియుక్తి నా
సవునని మెచ్చునావుల మ - హాత్మ్యమొనర్చును దేటమాటలన్.

అనుపద్యముకలదు.

ఇందు తేటమాటలతో, గోమాహాత్మ్యము ధర్మరాజునకు భీష్ముఁడు చెప్పుట వర్ణింపఁబడినది. ఆశ్వాసాద్యంత విభాగము లేదు. ఇందలి వచనరచనకు నీ క్రింది పంక్తుల నుదాహరించెదను.

"సత్యలోకమున నివియజ్ఞసంగతి నివసించు. హోమమ్ములనెల్లను వీనిపాలచే చమురు నుపయోగించు కొమ్ములు నెమ్ములు చర్మములు. నున్ననితోఁక రోమములు ప్రేవ పంచితమును నన్నింటికి నుపకరించు, గాలిని, చలిని, ఎండను వీనికి బడలిక లేదు కావున నాయా సమయమ్ముల తమకు నుచితమ్ములైన పనులివి నేయును. కావున నావును బ్రాహ్మణుండును నేకతత్త్వమ్ముగుటంజేసి పరమపదంబు జెందునందున గో బ్రాహ్మణులు సమానవస్తువులని పెద్దలు పలుకరింతురు. ఆవుపాలమృతంబని యమరవిభుండు పలుకరించె."

శ్రీకామేశ్వరకవి ముద్దళఘురి తాతయగు తిరుమలనాయకుని కాలమున నున్నవాఁడగుటచేతను, తిరుమలనాయకుఁడు క్రీ. శ. 1623 మొదలు 1659 వఱకు మధురను బరిపాలించినవాఁడగుటచేతను, క్రీ. శ. 1670 సంవత్సర ప్రాంతమున ముద్దళఘురి సత్యభామా సాంత్వనముఁ గృతినందుటచే నీతఁడు క్రీ. శ. 1670 ప్రాంతమువరకు జీవించియుండెనని చెప్పనొప్పును. కవినిగూర్చి యింతకన్న మనకేమియుఁ దెలియరాలేదు.

## సత్యభామా సాంత్వనము

సత్యభామా సాంత్వనము నాలుగాశ్వాసములుగల శృంగార ప్రబంధము. ఆంధ్రవాఙ్మయమున సాంత్వనమను పేరుగల కావ్యములలో నిదియే తొలుతటిదిగాఁ గన్పట్టుచున్నది. దీనివెనుక సముఖము వేంకట కృష్ణప్పనాయకుఁడు రాధికాసాంత్వనమును దాని ననుసరించి ముద్దుపళని రాధికాసాంత్వనమును వెలసినవి. ఇందు మొదటిది మధురాపురాంధ్ర కృతి. ఈ గ్రంథమునకు మూలము భాగవత హరివంశములయందు బ్రస్తుతమైన నరకాసురవధ ఘట్టము. నరకాసురవధానంతరము సత్యభామను శ్రీకృష్ణుఁడు సాంత్వనముసేయుట నిందు ముఖ్యమగు విషయము నగుట కవి యీ గ్రంథమునకు సత్యభామా సాంత్వనమను పేరుపెట్టి నాఁడు. శ్రీకృష్ణదేవరాయలవారు 'సత్యావధూప్రీణనము అను సంస్కృతకావ్యము రచియించినట్లుగ' నాముక్తమాల్యదలోని 'భావ

ధ్వనివ్యంగసేవధిగాఁగఁ జెప్పితివి సత్యావధూప్రీణనంబు' నను పద్య పాదము తెలుపుచున్నది. బహుశః సంస్కృత సత్యావధూ ప్రీణనము దీనికి మూలమేమో తెలియరాదు.

ఇందుఁ దొలియాశ్వాసమంతయు నవతారికయనియే చెప్పనగును. శిష్టాచార ప్రకార మిష్టదేవతావందనానంతరము ముప్పదినాలుగు పుటలలో మధురనాయకుల వంశక్రమ మెంతయు విపులముగ వర్ణితమైనది. ఇది చరిత్రకారుల కెంతయు నుపయుక్తము. ఆవెనుకఁ గథాప్రారంభమున ద్వారకాప్రశంసనమును శ్రీకృష్ణుఁడు ద్వారక నేలునని మాత్రమే తెలుపఁబడినది.

రెండవ యాశ్వాసమున నింద్రాగమనము నింద్రుఁడు నరకాసురుని వృత్తాంతముఁ జెప్ప శ్రీకృష్ణునిచే నరకాసురుని వధింతునని ప్రతిజ్ఞ సేయించుటయు, వసంతోత్సవ వర్ణనము, శ్రీకృష్ణ సత్యభామల విహారమును, యుద్ధయాత్రకు సత్యభామ బయలు దేరెదనన శ్రీకృష్ణుఁడు నివారించుటయు, నరకాసుర పురమగు ప్రాగ్జ్యోతిష సమీపమున దండు విడియుటయు, ద్వారకలో సత్యభామా విరహమును జెప్పఁబడినవి.

మూఁడవ యాశ్వాసమున దండువిడుదలయందు శ్రీకృష్ణుని విరహావస్థయు, కలవింకుని హాస్యప్రసంగమును సత్యభామవద్దనుండి చిలుక రాయబారములు కృష్ణుఁడు విరహమును సహింపఁజాలక ప్రద్యుమ్నకుమారుని సత్యభామను దోడితెచ్చుటకుఁ బంపి యామెను రప్పించుటయు వర్ణితము.

నాలుగవ యాశ్వాసమున నరకాసురునిబంటు పూర్వజన్మ వృత్తాంతముఁ జిలుక చెప్పుటయు, వానివలన నరకాసురుని యుదంతము కృష్ణుఁడెఱుంగుటయు, వర్ష శరదృతు వర్ణనములును, యుద్ధప్రారంభమును, సత్యభామ యుద్ధకౌశలమును, నరకాసుర సంహారమునును, అదితి కుండలదానంబును, భగదత్తు పట్టాభిషేకమును నరకుని చెఱయం దున్న పదారువేల చేడియల శ్రీకృష్ణుఁడు పెండ్లియాడుటయు, సత్యభామ ప్రణయ కోపమును శ్రీకృష్ణుఁ డామె సాంత్వనము సేయుటయు, ఫలశ్రుతితో ముగింపునుగలవు.

ఇందు శృంగారరసము ప్రధానమైనను నెడనెడవీర రౌద్ర హాస్యరస ములు పోషింపఁబడినవి. శృంగారలీలా ప్రపంచనాటక సూత్రధారి శ్రీ కృష్ణుఁడు నాయకుఁడుగా, శృంగారరససీమ సత్యభామ నాయికగానున్న యీ రసవత్కృతియందుఁ దద్రసస్థాయియగు రతి వర్ణన మత్యుత్కట ముగాఁ గావింపఁబడినది. విరహావస్థయుఁ బూరుషాయితక్రియలు నతి మాత్రముగా వర్ణితములైనవి. వీరరౌద్రరసములును నద్భుతరసమును,

సత్యభామాయుద్ధ విహారఘట్టమునను, హాస్యము కలవింకుని వచోధోరణి యందును బొందుపడినవి. శ్రీ కామేశ్వరకవి బహుధాసమర్థుఁడగుట కావ్యము రసనిష్యందమై, రసికజనహృదయంగమమై యలరునట్లు రచియించి కీర్తిఁగాంచినాఁడు.

ఆయా రసవర్ణనలకు నీ క్రిందిపద్యము లుదాహృతములు.

శృంగార వీరరసములకు :

సీ. కంకణక్రేంకృతియల్ - కటుచాపటంకృతియల్ చిఱునవ్వు మెఱయింపు - జేవురింపు
కలవాగ్విరావముల్ - కహకహారావముల్ గొల్లననగుచుప్పు - గోరకసద్దు
సరససల్లాపంబు - సంగ్రామకోపంబు వింతసొగసుడాక - వెగటుకేక
సొంపుమీఱినపైపు - చుఱచుఱమనుచూపు బులుపులుతగునంగు - పొగరుపొంగు

తే. గీ. సరసశృంగారవీర-రసంబులమరు కోమపు తగియుండ మెయిఁజిఱు-చెమటనిండఁ
బోరుగావించెరిపుసేన-బోరనంగఁ గల్లకగ గొల్లదేవేరి-కడఁకమీఱి. 4 ఆ పుట141

రౌద్రశృంగారమునకు :

సీ. సంవర్తకీలియై - చంద్రికాపాళియై కనుగెంపునగుపెంపు - క్రిక్కిఱిల్లఁ
బటుకాలదూతియై - పంచాస్త్రహేతియై చాపంబురూపంబు - సంఘటిల్ల
నశనిదుర్ధర్షమై - యతిసుధావర్షమై విడిసద్దునుడిముద్దు - విస్తరిల్ల
నుల్లాసనాభియై - యురుమోహశోభియై శరవృష్టికచదృష్టి - పరిఢవిల్ల.

తే. గీ. దితిజదితిజాంతకులకును - ద్వేగరాగ సంగతులుపొంగనంగనా - జనమతల్లి
కినిసియనిఁజేసెధీచమ - త్కృతివినిద్ర రౌద్రశృంగారరసముతో - రాయనంగ.

శృంగారాద్భుతములకు :—

సీ. వెన్నెలమూఁకయో-విడియెండకాఁకయో యననయ్యెఁజంద్రాస్య-మినుకుచూపు
మరుకీర్తిలెక్కయో-నెఱతోఁకచుక్కయో యననయ్యె దెఱవము-త్యపుఁదురాయి
పూఁదేనసోనయో - పాడిరాతివానయో యననయ్యె మగువగా - యకపుమాట
జంత్రవిశేషమో - శతధారఘోషమో యననయ్యెఁజెలివింటి - గొనముసద్దు.

తే. గీ. మొనయుశౌరికివైరికి-మోదఖేదములను శృంగారరసము-నద్భుతరసంబుఁ
దోఁచనాశాచమూలనేసి-దురముఁజేసెఁ గుతుకకోపంబులనెసంగి-కోమలాంగి.

శ్రీకామేశ్వరకవి యుభయభాషలయందు వైదుష్యముగలవాఁడయ్యును దన కవితయందు జాతీయముల నుపయోగించి తెలుఁగుకవి యను పేరును సార్థకముఁ గావించుకొనినాఁడు. కవితఁగూర్చి:

సీ. సరసతభువనంబు - చల్లనై విలసిల్ల సారస్వతస్ఫూర్తి - సంఘటిల్ల
ఘనమయూరాధిక - వాఙ్మైత్రి ఫణిపాసంగ రయనటద్ధారాతి - శయమెసంగఁ
బటుతరోదితకదం - బంబులుసనలొత్త తెలుఁగుపదఁగనైన - మఱుఁగుహత్త
సౌహృదకవిరాట్ - సంఘంబుహర్షింపఁ గూలంకషాభోగ - లీలమించ

తే. గీ. సంస్కృతవర్షము గురిసిన - యట్లుఘనత వెలయఁగా గీర్తికందళం - బులుచెలంగఁ
బ్రకృతియంతయుఁగనియంగ-వికృతిలేని సుకృతినొనరించువాఁడౌర-సుకృతిజగతి.

అని గ్రంథమునఁ జెప్పినాఁడు. అట్లే కవితసాగించినాఁడు.

గ్రంథమునఁ దెలుఁగుపలుకులను. నన్యభాషాపదములను, వాడుకమాటలను గూర్చి శ్రీకామేశ్వరకవి తన భాషానైపుణ్యమును వెల్లడించినాఁడు. దీర్ఘసమాస భూయిష్ఠములగు పద్యములున్నను నవికవికిఁగల గీర్వాణభాషాపాండిత్యమును విశదీకరించుచున్నవి. ఇందుఁ బెద్దనగారి 'సహసానఖంపచ' ఇత్యాదిపద్యములకుఁ బ్రతిబింబములనఁదగిన పద్యములు రెండుగలవు. వీనినిఁగవి సంస్కృతభాషా పాండిత్యముగల వాఁడగుట సాధ్యమైనంత ప్రౌఢముగా రచియించినాఁడు. ఇట్టి పద్య మల్లఁబోయి తారాశశాంకమున వేంకటపతి తెల్లఁబోయినాఁడు. వర్ణనములఁ గూడ నీకవి గతానుగతికముఁగాక క్రొత్తదారులఁ ద్రొక్కినాఁడు.

ద్వితీయాశ్వాసమున శయ్యాగృహావర్ణనము

సీ. పటికపు ప్రకోష్ఠమ్ము - చిటికరొద్దికఁజల్క- గుటికలపల్లకీ - గొనుచునినుచు
సుగటిరక్కలగాలి - సోఁకులనేమొ గొడిగెడుసకినల - గుంపునింపు
సన్నసన్నని నార - జంపుసుంపుల నింపు జగజంపుజంత్రంపు - జతలమూకి
కవలకుత్తుకహత్తు - కవకవకివకివ దవలతో మసుచివ్వ - బవిరిదీర్చ.

తే. గీ. నవులపుంజెందుచుంచువా - తోవలపొందు
తుమ్మెదయెలుంగు శ్రుతిగ్రమ్మ - కమ్మపైఁడి
ధక్కయుమ శారముల మేలి - గ్రుక్క లేను
హారవుమురువైన శయ్యాగృహమ్ములోన.

### తృతీయాశ్వాసము - గుడారము వర్ణనము

సీ. జాతిపచ్చలజోతి - రాతిగాఁజూచు మజ్జాతిపసరువన్నె - రీతిఁదీగ
కట్టునాతిపతిమై - గుజ్జారాతివిశాతి సకశాతిబిళ్ల పొం - దికసంగాతి
యేకరంగిహొరంగు - టింగితీకపురంగు తెనయుపగ్గిపునిగ్గు - లాఁరలగ్గు
నుగ్గడితపునిల్వు - మగ్గపురుతకల్వు పతిమలపట్టుచా - పలను బెట్టు

తే. గీ. చుట్టుఁగనుపట్టురతనాల - కుట్టుపనుల షేకకంబాలుపగిడింపు - మేకలుఁదిరి
కలశములపక్కిఁదోరడాలు - కలికితావి మీటిహొమ్మైన కుతినీగు - డాగులోన.

### చతుర్థాశ్వాసమున జాబిల్లి వర్ణనము

సీ. కలువలసంగాతి - వెలుపులమజ్జారి యివముపుట్టు విశాతి - యింపునాతి
తొలిజోగిముడిపూవు - బలుజక్కవలకావు నెలరేవలప్రప్రోవు - నింగితావు
ఒజ్జనెచ్చెలిమేలు - మొరపువెన్నెలచాలు కడలిరాయలచూలు - కళలప్రోలు
మరునివజ్రపుతాళి - మలయురిక్కలబాళి యొపయుజోడువిరాళి - యిపలజాలి

తే. గీ. చుఱుకుడాల్ జంట తపసిరా-చూపుపంట సోయగపుకేవకనుబాటు-సోటియావ
తామరలబంది కటిమేను - రామఱంది తేటఁబాటిల్లజాబిల్లి - తేజరిల్లి.

## గణపవరపు వేంకటకవి

లింగనమఖి శ్రీకామేశ్వరకవిని బోధించుటయేగాక, ముద్దళగిరి మహాలక్ష్మీశికుఁడును, బహుగ్రంథరచయితయునగు గణపవరపు వేంకట కవిని సమ్మానించెను. వేంకటకవి 'విద్యావతీ దండకము' అను పేర నొక దండకము [1]రచించి, ముద్దళగిరి కంకితముగావించెను. విద్యావతి యను నొకయాటవెలఁది ముద్దళగిరిని మోహింప, నాతఁడామెను తన నాట్యశాలలో సన్మానపాత్రగా చేయుటయిందలి యితి వృత్తము. ఇది పెద్దదండకము. వలసినభాగముల నుదాహరింతును.

---

1. Edited for the first time by N. Venkata Rao, M.A. in the first bulletin of the Government Oriental Manuscripts Library, Madras 1948 Vol. I, No. 1 Pages 88–102.

శ్రీవిశ్వనాథాన్వయాంభోధిచంద్రుండు ... ... సత్కాశ్యపాభిఖ్యగోత్రుండు భాస్వచ్చరిత్రుండు, శ్రీతిర్మలోర్వీధరాధీశ పౌత్రుండు వీరావనీపాల పుత్రుండు వీరాధివీరస్తుతోదారదోస్సారవచ్చొక్కనాథక్షితీశాగ్రణీసోదరుండాశ్రితత్రాణబద్ధాదరుం డబ్ధికన్యాసమానోల్లసల్లింగమాంబావధూగర్భశుక్తిస్ఫురన్మౌక్తికాకారుఁడై యొప్పు ముద్దళ్ ఘరిక్షోణి పాలుండు......

చంద్రబింబాస్య, చంద్రానుకారాస్మితోదార సారస్య, మవ్వంపు పూరెమ్మ మాణిక్యంపుంబొమ్మ, మాద్యద్వయస్సీమ, విద్యావతిన్ ప్రేమచున్ ......మన్మథాభోగ సామ్రాజ్య భోగమ్ములం'' దేలించె. అట్టి త్రిలోకీవదాన్యత్వసంశీలుఁడౌ తిర్మలక్షోణిరాట్ పౌత్రు పేరఁ, సుధీముద్దువీర క్షమాధీశు సత్పుత్రుపేరఁ, గుణామేయలక్ష్మీనివాసస్ఫురత్ పాండ్యసింహాసనాధ్యక్షు పేరన్, సదాసత్కృపావీక్షు పేరన్ ... ... కళాభోజు పేరన్, జయోదాత్తముద్దళ్ గిరిక్ష్మాతలాధీశు పేరన్, వృషాధీశ సంకాశు పేరన్, మహాలక్షణగ్రంథభాషాభిధాన ప్రథామాధురీసాధురీత్యర్థవచ్ఛబ్దబంధాను బంధ ప్రబంధాభిధానాప్పయామాత్య రాడ్వేంకటార్యప్రణీతంబుగాఁ బొల్చు నా బుష్ప కోదండకంబైన విద్యావతీ దండకంబుర్వి నాచంద్ర తారార్కమై యొప్పు నెల్లప్పుడుఁ.

ఈ ప్రశస్తదండకము వేంకటకవి కాలనిర్ణయమునకుఁ దోడ్పడునది. ఇది ప్రకటితమగువఱకు నీతడు క్రీ. శ. 1750 ప్రాంతమువాఁడని వీరేశలింగము ప్రభృతులు భావించిరి. కాని యీ రచనవలన నీతఁడు క్రీ. శ. 1674 ప్రాంతముననున్న ముద్దళగిరి కాలమువాఁడని స్పష్టమైనది.

ఈ వెంకటకవియే, ముద్దళగిరి తంజావూరిని జయించునప్పుడు, 'పెద్దళగిరి విజయము'[1] అను నొక చాటుకృతిని రచియించినాఁడు. అది తూర్పుమాలిక, దక్షిణపుమాలిక, పడమటిమాలిక, ఉత్తరపుమాలిక. అను శీర్షికలతో నాలుగు పెద్దయుత్పలమాలికలుగాఁగన వచ్చుచున్నది. మహారాష్ట్రరాజగు నేకోజీ మొదట తంజావూరిపై దండెత్తివచ్చినప్పుడు ముద్దళగిరి యాతని నోడించిన సందర్భమున నిది యాతని జయసూచకముగా వెంకటకవి రచియించియుండవచ్చును. ముద్దళగిరి క్రీ. శ. 1674-వ సంవత్సర మంతయుఁ దంజావూరిని పాలించెను.

ఈ మాలికలలో యుద్ధపరికరములకు సంబంధించిన దేశీయపదములు, అన్యభాషాపదములు చాలఁగలవు. చారిత్రాత్మకముగా మిక్కిలి

---

1. Edited by M. Sarabheswara Sarma in the bulletin of the Government Oriental Manuscripts Library, Madras. 1952 Vol. V. No. 2 Pages 49-63.

యుపయుక్తము. ఈ మాలికా రచన మెట్లుండునో చూచుటకు నా గ్రంధము నుండి మొదలు తుదిభాగముల నుదాహరించుచున్నాను.

ప్రారంభము.

ఉ. పోటరినంట తానహజిపుత్రుఁడో కానోకనాఁడు దూరుపుం
జేటకుఁజేరి తంజపుట భేదనమందలి విష్ణుచక్రపుం
గోటకులగ్గ లెక్కి—మదిఁగోరి కఠోరవజీరకోటికిన్
వాటకటంకముల్ బిరుదులైనసరాలువరాలు మాడ లే
ర్పాటుగఁ గేడెముల్ మెఱుఁగుబట్టెసముల్ జగవాళ్ నెజాజిరాల్
గ్రంథాంతము ... ... ... ... ... ... .. ... ... పెదళ్ళగిరిక్షమా
పాలునితోడుతన్ దెలుపఁబల్మెఱువానికి వస్తువాహనాల్
చేలములున్ ధనంబులు విశేషమణుల్ దయచేసికోపసా
పాలయులైనవారి సకలార్థములన్ మఱునాడుఖాసహా
రీలకు పెచ్చుఁబెట్టి బిగిరించిన చిత్తముతోడ వేడుకల్
చాలుకొనం బసిండి మొగసాలఁ గిరీటపతుల్ నుతింపఁ జే
రోలగమై దదీయ విజయోచితవార్త నెఱుంగసంగతిన్
సాలుములోన జాఱటలు చాలఁగఁ బంచి భజించి రాజగో
పాలునకున్ రథోత్సవము బల్ తిరునాళ్ళ ఘటించి నిత్యల
క్ష్మీలలనావిహారుఁడయి చెన్నువహింపుచు ముద్దువీర భూ
పాల పెదళ్ళగిరిప్రభుఁడపారశుభోన్నతి ధాత్రి వర్ధిలున్.

వెంకటకవి తన "ప్రబంధరాజ వేంకటేశ్వర విజయవిలాసము" అను గ్రంధమునఁ గూడఁ దన్ను పాండ్య దేశాధీశ్వరుఁడాదరించినట్లుగా నిట్లు చెప్పికొన్నాఁడు.

"కర్ణాటతుండీర పాండ్యదేశాధీశముఖ నిఖిలధరణీవరదత్త... విభవుండును"

సర్వలక్షణ శిరోమణిగద్యలో

"కర్ణాటతుండీర పాండ్యమండలాధీశ ప్రముఖాఖిల మహీమండలాఖండల దత్తమత్తసింధురసైంధవాందోళికా చిరత్నరత్నరత్నాంబరాది వస్తుప్రశస్త మందిరు"

అని పాండ్యరాజసన్మానము నుదాహరించికొనియున్నాఁడు.

# రాణీ మంగమ్మ

మూఁడవ ముద్దువీరప్పనాయకుని వెనుక, రాజ్యమునకు రాఁదగిన విజయరంగ చొక్కనాథుఁడు బాలుఁడగుటచే నాతనికి సంరక్షకురాలుగా నవ్వాయగు మంగమ్మ రాజ్యమును పాలించెను. ఈమె కాలమున నొకటి రెండు గ్రంథములు వెలువడినవి. అందు మొదటిది.

## మధురామంగపుంశ్చలీ లీలావిలాసము

ఇది యొక వచన కృతి ఇందు మంగమ్మ స్వైర విహార చేష్ట లన్నియు వర్ణితములైనవి. ఇందులో మధ్యనొక పెద్దరగడ కలదు. చరిత్రకారులకు పనికివచ్చు నంశములుండుట చేత నిది సారస్వతమున కెక్కినది. కాని యందఱు చదువఁదగినది కాదు. ఇది చిన్నవెంగన కృతమని శ్రీ డాక్టరు నేలటూరివారు (జూలై భారతి 1953 పుట 31) వికటకవి గోపాలరాయ కృతమని శ్రీచల్లా రాధాకృష్ణశర్మగారు. (భారతి సం. 30 సం. 10. పుటలు 332-338) తెలిపిరి.

ఈ మంగమ్మను గూర్చిన రెండు మనోహరమైన చాటువుల నుదాహరింతును.

సీ. పదచాళి వినిపించు వైభవస్ఫురణకుఁ గొనురొండ ముత్తేలకుచ్చుచెల్లు
జక్కిణి వినిపించు చాతుర్యమహిమకు రంజిల్లు వింజామరములుచెల్లు
తాళవిన్యాసభేదమున నాట్యానకుఁ దులలేని బిరుదుకాహాళలుచెల్లు
సభియంబొనరించు నతిశయప్రౌఢికి నిరతంబు ధవిణమల్హారులుచెల్లు

గీ. అనుచు సేకోజి భూపాలుఁ డనుదినంబు మెచ్చి ముత్తేలకుచ్చు నీకిచ్చుసభను
కలితగుణపేటి యాశ్రితకల్పవాటి భావజానిఘాటి ముద్దుమంగావధూటి.

క. కొద్దిగఁ జలించె నామది నిద్దావాతెఱకుఁ జెఱకు నేజాసుర రా
ణ్మద్దియవా ? ఒక తీయనిముద్దియవా చెలికొసంగ ముద్దులమంగా.

## నరసభోజనుతి

ఇది మంగమ్మ దళవాయియగు నరసయామాత్యుని స్తుతి - సీస పద్యమయము - యత్కర్తృకమో తెలియదు. నరసయామాత్యుఁడు క్రీ. శ. 1702 లో "మరవ" యుద్ధమునఁ గీర్తిశేషుఁడయ్యెను.

రచన కొకపద్యము నుదాహరించుచున్నాను.

సీ. శ్రీరంగనాథుని చెన్నొందమదిలోన కోరి పూజలుచేసి మీఱినావు
జంబునాథస్వామి సద్భక్తి సేవించి వరములుకొని కీర్తి నిలిపినావు
చెవ్వందిలింగనిచేరి సన్నుతులీవు గావించి పుణ్యముల్ గాంచినావు
ఎన్ని కార్యములైన యీడేర్చి ప్రభువుచే బహుమానములు చాలఁబడసినావు

గీ. ప్రౌఢి, వినయంబు, నేర్పు సంపదలఁ బొదలఁ
బాండ్యరాజేంద్రు శ్రీగంటఁ బ్రబలినావు
భానుసమతేజ! దీక్షయ ప్రభుతనూజ!
వరగుణసమాజ! దళవాయినరసభోజ![1]

## విజయరంగ చొక్కనాథుఁడు
(క్రీ. శ. 1706-32)

విజయనగర వాఙ్మయమునఁ గృష్ణరాయలకాలమెట్టిదో, తంజావూరి వాఙ్మయమున రఘునాథనాయకునికాలమెట్టిదో, మహారాష్ట్ర రాజుల పాలనమున శహాజీకాలమెట్టిదో, మధురనాయకుల కాలమున విజయరంగ చొక్కనాథునికాలమట్టిది. వారందఱివలె నీతఁడును, కృతికర్త. కృతిభర్త. విశేషమేమనఁగాఁ దనకుఁ బూర్వులు ప్రబంధవాఙ్మయమును బరిఢవిల్లఁజేయఁగా నీతఁడు గద్యరచనాసంప్రదాయము కమనీయముగాఁ విలసిల్లఁజేసినవాఁడు. ఆంధ్రవచన వాఙ్మయమునకు శ్రీకారము చుట్టినది మధురాపురాంధ్రవాఙ్మయమే. అట్లని ప్రబంధరచనను నీతఁడు ప్రోత్సహింపకపోలేదు. ప్రబంధకవు లెందఱేని యాతని యాస్థానము నలంకరించిరి.

విజయరంగనాథుని కృతులు రెండు లభ్యమగుచున్నవి - రెండును వచనములే - రెండును నముద్రితములే -

1. శ్రీరంగ మాహాత్మ్యము. 2. మాఘ మాహాత్మ్యము.

వాని వివరములు:

1. తంజావూరు పుస్తకశాల సంఖ్య 382.

# శ్రీరంగ మాహాత్మ్యము

ప్రారంభము :

శ్రీవిష్ణుభక్తాగ్రగణ్యుండైన నారదమహామునివరేణ్యుండు మహాను భావుండైన మహాదేవునుద్దేశించి, దేవదేవ! భవద్దివ్యముఖారవింద గళితంబైన వచనమకరందంబుచే మూఁడులోకంబులంగల వృత్తాంతంబు లన్నియు శ్రవణపుటంబులచేఁ దృప్తింబొందితి. అందు పుణ్యతీర్థంబు లును, పుణ్యక్షేత్రంబులును, గంగాదిపుణ్యనదులును, దక్కఁగల రాజర్షి దేవర్షి చరిత్రంబులు వర్ణించువేళ, కావేరీమాహాత్మ్యంబు ప్రశంసించితిరి. అప్పుడు శ్రీరంగంబనంబరంగిన విష్ణుస్థలం బొకటిగలదని సంక్షేపంబుగ నాజ్ఞవడసితిరి. మహేశ్వరా! ఆ శ్రీరంగమాహాత్మ్యంబు సకలపాప నివారణంబగును, పుణ్యాభివృద్ధికరంబును నగును గావున సవిస్తారంబుగ వినంగోరెద –

మధ్యభాగము :

మరాంతకుండు రామనామధేయంబున భవదీయవంశజాతుండైన గిశరథుని గర్భంబునందవతరించి [illegible] డైన రావణుని సంహ రించి వానికి సహోదరుండును, ప్రియంకరుండునగు విభీషణునకు లంకా రాజ్యంబును నీకుఁ గులధనంబైన శ్రీరంగవిమానంబును నీయంగలండు. అందుఁ జంద్రపుష్కరిణీ తీరంబున నచ్చోటఁ గల్పాంతంబుండి యీ విమానరత్నంబు క్రమ్మఱ సత్యలోకంబునవచ్చు, ఇవ్విధంబున బ్రతికల్పం బున శ్రీరంగవిమానంబు దివంబునకు భూతలంబునకు రాకపోకలు సేయు చుండు. బ్రహ్మదేవుని యాయురంతంబున నిజధామంబైన పరమపదం బునకుఁజను. దక్షిణదేశవాసులుఁ గావేరీతీర సంభవులునైన సకలజనుల యందును దేవదేవుండైన శ్రీరంగప్రాంత దేశంబుననున్న సకలజంతువులు మోక్షంబుఁజెందుటకు సందియంబులేదు.

గ్రంథాంతము :

" ఈ యితిహాసంబు వ్రాసినఁ, బఠియించిన, విన్న బ్రాహ్మణుండు వేదవేదాంగ పారాయణుండగు, క్షత్రియుండు సమస్తమహీమండలము

నకు నేకాధిపత్యంబు సేయు వైశ్యుండు కోటికింబడగెత్తు శూద్రుండు సకల శుభంబులనొందు. ఆయురారోగ్యవిజయంబులం జేకొను. పుత్రపౌత్ర సమృద్ధిగ భాగ్యంబులంగొందురు. చదివిన వ్రాసిన వినినవారలకు నాయురారోగ్యైశ్వర్యంబులు గలుగునని నారాయణమూర్తి యాన తిచ్చిరి. ఇట్లతులిత ముకుందచరణారవింద వందననిరంతరానందంబును నొందుదురని మహాదేవుండు నారదమహామునికి నానతియొసంగె".

ఇందు పది యధ్యాయములు గలవు.

## మాఘమాహాత్మ్యము

ఇది మాఘమాస మాహాత్మ్యమును దెలుపు పదునేనధ్యాయ ముల వచనకావ్యము. శ్రీరంగమాహాత్మ్యము వెనుక రచితమైనది. శ్రీరంగేశున కంకితము.

ప్రారంభము :

క. శ్రీమచ్చంద్రసరోవర తామరసపరాగచారుతరపటవాసా!
కామారివినుత! జగదభి రామామృత గుణవిలాస! రంగనివాసా!

గ్రంథశైలి :

"అమ్మునికుమారుండు కావేరికివచ్చి కుతికబంటి నీళ్ళలోనిలిచి యాదిత్యునిం దప్పక చూచుచుం జేతులు పొడవుగా నెత్తి యమస్తోత్రంబుఁ బఠించుచుండె నా యవసరంబునఁ దొలుత వారలందఱు మదగజంబు తుండంబు పొడవుగానెత్తుకొని యా మునికుమారుని సమీపంబునకువచ్చు టయు, మృగశృంగమహాముని మనంబున భయంబులేక చిత్తరు బొమ్మయుం బలెగదలక యుండుటయు నగ్గజేంద్రంబు నమ్మునిసందర్శ నంబువలనఁ దమోగుణంబును గోపంబునుమాన దనకరంబుచే మెల్లన నాతని నెత్తుకొని కుంభస్థలంబున నుంచుకొనుటయు నా ముని బాలకుండు దాని యభిప్రాయంబెఱింగి జపంబుచాలించి, ఏనుఁగు కుంభస్థలంబున సుఖాసీనుండై, యందువలనఁ దనకు శ్రేయస్సుకలుగునని హర్షించుచు, నిందితంబైన గజజన్మంబునుంబాపి మంచిగతి నొసంగెదనని మదిలోనం దలంచి మొనిమిదిదినంబులు తాను మాఘస్నానంబుచేసిన సుకృతంబు నొసంగెదనని యుదకంబెత్తి దాని శిరంబున ధారవోసెను."

చక్కని శైలినున్న చొక్కనాథుని గ్రంథములు రెండును ముద్రణ భాగ్యము నందకుండుట యాంధ్రుల దౌర్భాగ్యము. ఈ గ్రంథప్రతి ఆంధ్రసాహిత్య పరిషత్కార్యాలయమునందుమాత్రమే కలదు. ప్రతి యాధ్యాయాంతంబునను నీ క్రింది రీతిని గద్య కలదు. "ఇది శ్రీ పాండ్య మండలాధీశ్వర విజయరంగ చొక్కనాథభూపాల ప్రణీతంబైన శ్రీరంగ మాహాత్మ్యంబను వచనకావ్యంబున సర్వంబును పదియవయధ్యాయము" ఇది గ్రంథాంత గద్య.

ఇట్లే మాఘమాహాత్మ్యమునను పై రీతినే ప్రత్యధ్యాయాంతమునను గద్యలుగలవు.

# సముఖము వేంకట కృష్ణప్పనాయకుఁడు

విజయరంగ చొక్కనాథుని కాలమునఁ దొలుతఁ బేర్కొనఁదగిన ప్రసిద్ధకవి సముఖము వేంకటకృష్ణప్పనాయకుఁడు. ఈతఁడు విజయరంగ చొక్కనాథునిచే గజతురంగమాందోళికాది మహారాజ చిహ్నములను బడసి యాతని ముఖ్యసామాజికుఁడై యుండి, కృతులను రచియించి, కవులను బోషించి కీర్తిగాంచినవాఁడు. ఈతని ద్వితీయకృతియగు సహల్యాసంక్రందనములో నీతఁ డుభయభాషాకవితావిశేషులైన [1] శేషము వేంకటపతియు, పుణిగె కృష్ణకవీంద్రుఁడును దన వంశము నిట్లు వర్ణించినట్లు చెప్పియున్నాఁడు.

కేశవప్ప నాయకుఁడు
|
పెదగురువప్ప నాయకుఁడు
|
ఎల్లిసెట్టి నాయకుఁడు
|
వేంకటనాయకుఁడు (భార్య వెంకమ్మ)
|
మీనాక్షి నాయకుఁడు (భార్య అలమేలుమంగ)
|
వేంకటకృష్ణప్ప నాయకుఁడు.

1. ఈతఁడే తారాశశాంక విజయప్రబంధకర్త.

ఈతని తండ్రియగు మీనాక్షినాయకునికిఁ జొక్కనాథస్వామి కలలోఁ బ్రత్యక్షమై తత్త్వవిజ్ఞాన మొసగెను (1-28) మఱియు నీతఁడు రామేశ్వరమునకేగు బాటలో 'పడనల్లూరు' అనుచోటఁ బెద్ద యన్న సత్రమును బెట్టించుటయేగాక, మంచినీటి తటాకమును ద్రవ్వించి, యన్నోదకములకు లోపములేకుండఁజేసెను (1-29) మధురలో సుందరేశ్వరునికి బ్రహ్మాండమగు మండపముగట్టించెను (1-30).

కవియగు వేంకటకృష్ణనాయకునిగూర్చి చెప్పిన పద్యము లాతని ప్రతిభావిశేషములను దేటపఱుపఁగలవు.

సీ. చదువఁగానేర్తువు శారదాశారదాబ్జాననానూపురార్భటుల ధాటిఁ
బాడఁగానేర్తువు పండితాపండితా కర్ణనానందసంఘటన పటిమఁ
బలుకఁగానేర్తువు భావజాభావజా టాపగాటోప నిరర్గళోక్తిఁ
దగవ్రాయనేర్తువు తారకాతారకా నీకరేఖాసమానేకలిపుల

గీ. మెచ్చనేర్తువు కవితలమేలుఁ దెలిసి యిత్తునేనుఁగుపాడిగా నెలమిఁగవుల
కన్నిగుణములు నీయందునమరెనౌర ! [illegible] ! వేంకటకృష్ణ[illegible] !

ఉ. ఎంతయొయ్యార, మెంత సొగ, సెంతపరాక్రమ, మెంత రాజస
మెంతవిలాస ! మెంత నయ, మెంతవదాన్యత, యెంత [illegible] మేల్
సంతతశౌర్యధాటి విలసద్గుణపేటి కిరీటివన్నిటన్
కంతుజయంతరూపకవికల్పక ! వేంకటకృష్ణభూవరా !

సీ. ధైర్యమా శౌర్యమా దాక్షిణ్యమా పుణ్య మానయమా జయ మా ప్రతాప
మా శుభరూపమా మహితవిజ్ఞానమా దానమా భోగమా శ్రీనివాస
యోగమా యాశ్రితవ్యూహసంరక్షణ రాజద్విలాసమా రమ్యమంద
హాసమా మహితసౌహార్దస్వభావమా భావమా భూరిప్రభావమాన్య

గీ. నీకెతగునంచుఁ బాండ్యభూనేత విజయరంగచొక్కేంద్రుఁ డత్య [illegible]
మానసామాజకత్వమింపూన నొసగె సముఖవేంకటకృష్ణేంద్ర! శౌర్యసాంద్ర !

మ. లలనాసత్యవసంతులఁ గెలుచు సౌందర్యమ్ము, ధైర్యంబు దో
ర్బలమున్ స్వామిహితానువృత్తిదయయున్ బ్రౌఢత్వమున్ విద్యయున్
జెలయన్ బాల్యమునం దనీవు మధురోర్వీనాథు మెప్పించవా
భళిరా ! వేంకటకృష్ణభూవరమణీ ! భాషాఫణిగ్రామణీ.

పైని వివరించిన విషయములనుబట్టి చూడఁగా వేంకటకృష్ణప్ప నాయకుఁడు కలమును ఖడ్గమును సమముగాధరించి కీర్తినిఁ గన్నవాఁడని తెలియుచున్నది.

వేంకటకృష్ణప్పనాయకుఁడు యుద్ధమున శౌర్యసాహసములను జూపి బాల్యమున మధురోర్వీనాథుని మెప్పించినకాలము, విజయరంగ చొక్క-నాథునికి బాల్యమునందు సంరక్షకురాలుగానుంచిన మంగమ్మ రాజ్ఞీ పాలనకాలముననని చెప్పవచ్చును. ఆ కాలమునఁ దంజావూరిని బాలించుచున్న మహారాష్ట్రరాజగు 'శహాజీ' సేతుపతి సహాయమున మధురనాయకులకు లోఁబడిన కొన్ని పట్టణములను వశపఱచుకొనెను. అప్పుడు మంగమ్మ యాతనిపై యుద్ధమునకువెడలి, యాతని జయించి తన రాజధానికి మఱలెను. యువకుఁడగు వేంకటకృష్ణప్పనాయకుఁ డీ యుద్ధమునఁ బాల్గొని జయము సమకూర్చి యుండవచ్చును. ఆపైని విజయరంగ చొక్క-నాథుని యాస్థానమునఁ గవితాగోష్ఠియందే కాలముగడపెను. ఈతనివెనుక నీ వంశమునఁ గవు లుద్భవిల్లలేదు. ఈతని వంశమువారిప్పటికిని వడగరినగరై జమీందారులై యున్నారు. (చూడుఁడు జైమినీభారతము చతుర్థముద్రణము ఆంగ్లేయ పీఠిక) ఇక నీతని కృతుల వివరణము.

ప్రస్తుతమీతని కృతులు నాలుగు లభ్యమగుచున్నది. (1) జైమిని భారతము (2) అహల్యాసంక్రందనము (3) సారంగధర చరిత్ర (4) రాధికాసాంత్వనము. వీనిలో మొదటిది మూఁడవది వచనములు. రెండవది నాల్గవది పద్యములు. గ్రంథరచనాక్రమము ననుసరించి చూడఁగాఁబైని జెప్పిన రీతినే కవిగ్రంథరచన చేసెనని తోఁచుచున్నది. జైమిని భారతము వచనము విజయరంగచొక్క-నాథునికిఁ గృతిగార విత్తమైనది.

---

1. In 1700, there was a war between Sahajee and Mangammal on account of the capture of the some of her former forts with the aid of Setupathi. The woman ruler inflicted a defeat on her neighbour (Marata Rajas of Tanjore. K.R. Subrahmanyam. page 28)

ఇందులో నవతారికాభాగములేదు. కాని యాశ్వాసాంతగద్యలవలన నీ విషయము తెలియుచున్నది. రెండవకృతి యగు నహల్యాసంక్రందనములో

గీ. సముఖమీనాక్షినృపగర్భ విమలజలధి చంద్ర! వేంకటకృష్ణేంద్ర!శౌర్యసాంద్ర!
మునుపు జైమినిభారత మనఁగవచన కావ్యమొనరించినట్టి సత్కవివి కావె.

అని యీకృతి పేర్కొనఁబడినది. మూఁడవకృతియగు సారంగధర చరిత్రవచనములోఁ జై జైమిని భారతమునుగూర్చిన పద్య ముదాహరింపఁబడుటయేగాక యావెంటనే,

గీ. రంగధరపతినేను సారంగధర చరిత్ర వచనము చేసి తత్కృతినిమాకు
నంకితము సేయుము శుభంబులగుననీకు......

అని కృతిభర్త పలికినట్లు వ్రాయఁబడినది. మఱియు నిందులో నహల్యా సంక్రందనవిలాసావతారికయే యథామాతృకముగాఁ గొంచు పఱుపఁబడియున్నది. ఒక్క వంశవర్ణనమాత్ర మిందులేదు. ముందు కృతిలోను నుదాహృతమైన కారణమున కవి యిందులో నవతారిక మాత్రమే గ్రహించినాఁడు. కావున నిది మూఁడవకృతి. ఈకృతి వెనుక రచించినది రాధికాసాంత్వనము – ఏకాశ్వాసపద్యకావ్యము. ఇందులోఁ కృత్యాదిలేదు. రసికావతంసులకు రసాయనముగ రంగపతి యాజ్ఞచేఁ గవి దీనిని రచించియున్నాఁడు.

ఈ గ్రంథములలో మూఁడింటియందు సంభోగవర్ణనమున నీ క్రింది గద్యము సమానముగాఁ గన్పించుచున్నది. జైమినిభారతమున[1] "మదన కదనారంభ సముజ్జృంభమాన మనోభిలాషల నాప్రమీలాసుందరీ పురందరనందనుల మందానందకరచందనాది కస్తూరికా పరిమళద్రవ్యములకు సొమ్మసిల్లి యుండిరప్పుడు,..............................

మన్మథ బ్రహ్మనందంబునుంబొంది–మఱియు 'ఇదియే' మనోభిలాషల నహల్యాసుందరీ పురందరులమందానంద" అని అహల్యా సంక్రందనంబునం

1. ముద్రితప్రతియం దీ భాగము లేదు.

గలదు (3-107) ఇదియే 'మనోభిలాషల నా రాధామాధవుల మందానంద' అని రాధికాసాంత్వనమునఁగలదు (123 సంఖ్య వచనము) సారంగధర చరిత్రయం దవకాశములేకపోవుటనే నీ భాగములేదు. ఇదియుఁ జైకావ్యరచనాక్రమమును విశదముచేయుచున్నది.

## జైమిని భారతము

సంస్కృతమున జైమినిభారతమని పిలువఁబడు నశ్వమేధపర్వము ననుసరించియుఁ దెలుఁగున పిల్లలమఱ్ఱి పినవీరభద్రకవిరచించిన జైమిని భారతము ననుసరించియు వేంకటకృష్ణప్ప నాయకుఁడు దీనిని రచించెను. ఇది యైదాశ్వాసముల వచనకావ్యము. ఇదియును విజయరంగ చొక్కనాథునికి గృతియని యీవఱకే తెల్పియుంటిని. ఇది వచనకావ్యమైనను బద్యప్రబంధమువలె, అవతారిక, ఆశ్వాసాద్యంతపద్యములు గద్య మొదలగు నియమము లిందుఁ పాటింపఁబడినవి. ప్రస్తుతము ముద్రితమైన గ్రంథమున నవతారిక లేదు. "అభ్యుదయపరంపరాభివృద్ధిగా నా రచింపం బూనిన జైమిని భారతంబునం దశ్వమేధపర్వంబునకుఁ గథాక్రమం బెట్టిదనిన" - అని కావ్యము ప్రారంభమగుచున్నది. ప్రథమాశ్వాసాంతము నీ క్రిందివిధముగ నున్నది.

చ. అవిరతదానశీల ! శరణాగతరక్షణలీల ! సత్కళా
కువలయమిత్ర ! నూనశరకోటిమనోహరగాత్ర ! సాహితీ
నవరసభోజ ! నూత్న దిననాథవిడంబకతేజ ! రాజమా
న్యవిజయరంగ చొక్క నరనాయక ! సజ్జనభాగ్యదాయకా !

క. శ్రీరంగ కృష్ణముద్దుల వీరేంద్రకుమార ! సమరవితరణశూరా !
శ్రీరంగపతిపదాంబుజ సారంగా ! సమదశైలసమ సారంగా ![1]

---

1. ఆంధ్రసాహిత్య పరిషత్ప్రకటితము. ౨ చతుర్థముద్రణము ౧౯-౨౯. ఈ గ్రంథపీఠికలో ప్రకాశకులు తమకు లభించిన రెండుప్రతులలోను (సంఖ్యలు 142, 308) నీ యవతారిక లోపించినదని వ్రాసియున్నారు. ఈ యవతారికాభాగము పాండ్యరాజుల చరిత్రమనుపేర 'ఆడయూరు' పుస్తకభాండాగారము (చెన్నపురి) లోఁ గలదు. దీని ననుబంధములోఁ బ్రకటించుచున్నాఁడను.

మాలిని. సనయహృదయపద్మా ! శాశ్వతైశ్వర్యసద్మా !
మదనవిమతశౌర్యా ! మందరాహార్యధైర్యా !
విదితవిభవసాంద్రా ! విశ్వనాథాన్వయేంద్రా !
ముదితకవిసమాజా ! ముద్దమాంబాతనూజా !

గద్య : ఇది శ్రీమత్పాండ్యమండలాధీశ్వర శ్రీ విజయరంగ చొక్కనాథ మహీనాథ కరుణాకటాక్షసంపాదిత గజతురంగమాందోళికా ప్రముఖనిఖిల సంపత్పారంపరీసమేధమాన సముఖ మీనాక్షి నాయకతనూభవ మీనాక్షీ దేవీకటాక్ష లబ్ధకవితాసంప్రదాయ వేంకటకృష్ణప్పనాయకప్రణీతంబైన జైమినిభారతంబున నశ్వమేధ పర్వమ్మను వచనకావ్యంబునందుఁ బ్రథమాశ్వాసము.

ద్వితీయాశ్వాస ప్రారంభమున

క. శ్రీరాధావరచరణాంభోరుహభృంగాయమాన భుజకరవీరా !
ధారాఖండితశాత్రవశూరా శ్రీవిజయరంగ చొక్కవజీరా !

అవధరింపుము. అని యున్నది. ఆశ్వాసాంతపద్యములులేవు. గద్యపై ప్రథమాశ్వాసపు గద్యవలెనేయున్నది.

తృతీయాశ్వాస ప్రారంభము

క. శ్రీపాండ్యధరాభరణా ! భూపాలకమకుటరత్న పూజితచరణా
రూపరతిస్మర నిర్వ్యాజోపకృతీ ! విజయరంగ చొక్కనరపతీ !

అవధరింపుము "జైమినిమునీంద్రుఁడు జనమేజయనరేంద్రునకు" అని ప్రారంభము. తృతీయాశ్వాసాంతమున నీ క్రింది పద్యములు గలవు.

ఉ. వారణఘోటవీరభటవర్గనిరర్గళ ధూళిపాళిసం
పూరితవార్ధి ! (ధావి) తరిపువ్రజ సాధ్వసహేతుచక్రవా
ళోరుగుహాంతరాళబహుళోజ్జ్వలదోః పరిఘప్రతాపవి
ద్యోరవిమండల ప్రకరధామధురామధురాధినాయకా !

క. ముంగొంగుఁబసిఁడి చెంగటి బంగరుమలయొద్ది యమరపాదప మింటన్
రంగైనకామధేను వనంగ నిజాశ్రితులఁబ్రోచు నవ్యకృపాబ్ధీ !

భుజంగప్రయాతము. మదేభేంద్రయానాసమాజాబ్జబాణా
సదానంద (స) న్నీతిశాస్త్రప్రవీణా
ప్రదానాంబుసంపూర్ణ ఘాలాత్తతూణా
సదాయత్తవిద్వత్పరిశస్తప్రఘాణా.

ఆశ్వాసాంతగద్య పూర్వమువలెనే యున్నది.

చతుర్థాశ్వాసము ప్రారంభము

క. శ్రీమధురాపురనాథా! ...మధురాధరగభీర...నిజబోధా!
భూమీనుతభూరికళాస్తోమాంకా! విజయరంగ చొక్కమృగాంకా!

పంచమాశ్వాసానంతరమునఁ బద్యములులేవు. "తర్వాతి సత్కథలు వినుచు శాశ్వతైశ్వర్య భోగము లనుభవించుచుండె" అని ముగింపు. గద్య పూర్వమువలెనే గలదు.

ఇది యయిదాశ్వాసముల వచనకావ్యము. ఇది సంస్కృతమున జైమినిభారతమని పిలువఁబడు నశ్వమేధపర్వమునకుఁ దెలుఁగు. సంస్కృతమున జైమి[illegible]న నశ్వమేధపర్వమొక్కటియే మిగిలినట్లును, దక్కిన పర్వములన్నియు నశించినట్లును, గాకున్నచో జైమిని భారతమని పేరేలవచ్చుననియుఁ గొందఱు తలంచెదరు. జైమిని భారతములో మిగిలినపర్వములు కొన్ని కలవనిగాని, యవి నశించినవని గాని యశ్వమేధపర్వముఁ దెనిగించిన పిల్లలమఱ్ఱి పినవీరభద్రకవిగాని యీ వేంకటకృష్ణప్పనాయకుఁడుగాని, యెందును జెప్పియుండలేదు. అశ్వమేధపర్వమునఁ గొన్ని విశేషాంశములను జెప్పఁదలఁచి వ్యాసుని యశ్వమేధపర్వముకంటె వేఱుగా నతని శిష్యుఁడగు జైమిని యీ యశ్వమేధపర్వమొక్కటియే రచియించియుండునని మఱికొందఱు తలంచెదరు. మఱికొందరు భాగవత సంప్రదాయములు వైష్ణవమతము వ్యాపించిన తరువాత వ్రాయఁబడిన గ్రంథమని గ్రంథస్థవిషయమును బురస్కరించుకొని చెప్పుచున్నారు. ఎట్లున్నను జైమినిభారతమను పేర నీ యశ్వమేధపర్వ మొకటియే లోకమున విఖ్యాతిగాంచినది.

ఈ కవి యీ యశ్వమేధపర్వమును వచనముగా రచియించునపుడు "ఇది శ్రీసముఖ మీనాక్షినాయకతనూభవ వేంకటకృష్ణప్పనాయక ప్రణీతంబయిన జైమిని భారతంబునం దశ్వమేధపర్వంబునందుఁ బదునాల్గవయధ్యాయము" అనునట్లుగా నధ్యాయక్రమమున గద్యములను వ్రాసియున్నాఁడు. దీనినిబట్టి చూడఁగా మూలగ్రంథము నీతఁడు చూచి దీనిని రచియించెనని తెలియుచున్నది.

వేంకటకృష్ణప్పనాయకుఁడు సంస్కృత మూలమును జూచినను, నాతని రచనయంతయును, పిల్లలమఱ్ఱి పినవీరభద్రకవి తెలుఁగు జైమిని భారతము ననుసరించిన ట్లీక్రింది యుదాహరణములనుబట్టి తెలియఁగలదు.

వీర.[1] 1. గీ. పంకనిర్మగ్నమగు గోవుపరికరించి సుకరముగ నుద్ధరించు గోపకునిమాడ్కి-
ముదముదైవార [illegible] పంకనిర్నగ్నునన్ను గోపాలతిలక!
(1-130)

వేం. కృ.[2] పంకనిర్మగ్నంబైన ధేనువును గోపాలకుచందంబున శోక మగ్నులమైన మమ్ము నుద్ధరింపుము. (పుట 17)

వీర. 2. క. కలనన్ మనవారెల్లను బొలిసిరి నీదుర్నయమునఁ బోయినయవి పె
ద్దలె నాకను "స్త్రీబుద్ధిః ప్రలయాంతక" యనెడుపలుకబద్ధంబగునే.
(4-57)

వేం. కృ. నీ దుర్నయంపుబోధనచే యుద్ధంబునకుంబోయిననాకుం వారెల్లను సమసిపోయిరి. "స్త్రీబుద్ధిః ప్రలయాంతక" యనెడు పలుకే యథార్థంబయ్యె.

వీర. 3. క. అతిమించి చొచ్చినిల్లటు చెఱిచితి వింకఁబుట్టినిల్లు చెఱిచెదననియే
పఱతెంచితి రెండిండ్లకుఁ 'జెఱుపనచేఁటు' వయితేమి చేసెడిదనుచున్.(4-69)

---

1. వీర - పిల్లలమఱ్ఱి పినవీరభద్రకవి జైమినిభారతము పద్యకృతి
2. వేం. కృ. సముఖము వేంకట కృష్ణప్పనాయకుని వచన జైమిని భారతము.

వేం. కృ. పాపాత్ములారా! చొచ్చిన యిల్లు చెఱచినదియుంగాక పుట్టినయిల్లునుం జెఱుపవచ్చితివే? నీవంటి చెఱపనచేఁట మాయింట నుండదగదు.

వీర. 4. చ. పుడిసెఁడునీటిచేనడఁగిపోయెడు ధూళికిఁ గాలమేఘముల్
దొడరునె తెప్పవేయఁ జెడుదోమలమీఁదసుపర్ణుఁడెత్తిపోఁ
గడఁగునె యీ సుధన్వరథికప్రభుఁడెన్నఁగ మీకు నీడుగాఁ
డుడుగుఁడుసంభ్రమం బితనినోర్చెదఁ దెచ్చెద నధ్వరాశ్వముల్. (5-66)

వేం. కృ. పుడిసెండు నీళ్లుచల్లిన నడంగిపోయెడు ధూళికిఁ గాల మేఘంబులు వర్షింపవలెనే? తెప్పవేసినం బడిపోవు దోమలమీఁద గరుత్మంతుండెత్తి రావలయునె? ఈ రాజు మీకు సమానుండుగాఁడు. మీ రీతనిమీఁదఁ జేయిచేసికొనం బనిలేదు. నేనె యీతనింగెల్చి యధ్వ రాశ్వంబుఁ దెచ్చెద.

వీర. 5. క. చిలువదళీవాయు లప్పుడు "తలబీకనకాయ"లై "యథాయథలై" కా
కులువత్తులునై మొనతల నిలువక శేషాహికడకు నెటిచెడిపాఱన్. (7-102)

వేం. కృ. చిలువదళంబులు తలబీకనకాయలు యథాయథలు కకాపికలునై మొనగట్టంజాలక శేషాహిచెంగటికిం బఱచిన.

వీర. 6. క. సారిది ననాచారంబుల మురు వగుచుల్ ప్రథమపాదమునఁ గలిమహిమం
బెరుగును వడ్లునుగలిపిన కరణిల్ వర్ణాశ్రమములు కత్తరి గలయున్.
(8-214)

వేం. కృ. అందులోనఁ బ్రథమపాదమున దురాచారంబులు సదాచారంబులు సమ్మిశ్రంబులై పెరుగువడ్లు గలిపిన కరణి వర్ణాశ్రమధర్మంబులు సంకరంబులగు. (పుట 326)

పైవిధముగా పినవీరభద్రుని సమాసములు జాతీయములు సామెతలు నన్నింటిని యథామాతృకముగాఁ గృష్ణప్పనాయకుఁడు వచనమునం దనువదించియున్నాఁడు. ఈ పద్ధతి పద్యకావ్యములనుండి ద్విపదల కనువదించినవా రందఱును ననుసరించినదియే. కాని క్రొత్తదికాదు.

ముద్రితగ్రంథమున, పినవీరభద్రకవి పంచమాశ్వాసమున 19 పద్యములలో (5-105) నుండి (5-124) వఱకు వర్ణించిన స్త్రీమండల వృత్తాంతముయొక్క వచనభాగము ముద్రితముకాలేదు. ఇందుఁ బ్రమీలాలయర్జునుని రాకవిని యాతనిఁ గామించుటయు, యుద్ధముచేసి యతని వశపఱచుకొని యింటికిఁ దీసికొనివచ్చి యాతనితోఁ గ్రీడించుటయు విపులముగా వర్ణితమైనది. నవీనాభిరుచులకు భంగకరమని పరిష్కర్తలు దీనిని ముద్రింపలేదు. ఈ భాగమంతయు, శృంగార కావ్యగ్రంథమండలి ప్రబంధ పరంపరయందు మూఁడవదిగా ముద్రితమైన 'అహల్యా సంక్రందనమున' ననుబంధముగా ముద్రితమైనది.

## రచనావిశేషములు

ఈ గ్రంథమునందలి కవితాశైలి, భాషావిశేషము లీ క్రింద వివరింపఁబడినది.

(1) కథాసందర్భమునుబట్టి కథాపాత్రముల నామములకు సర్వనామ వాచకపదము లుపయోగించుటచే సరిపోవుచుండఁగా మరల నాయాపాత్రముల నామములనే తఱచుగా నుపయోగించుట.

(2) యమక వృత్త్యను ప్రాసాదిశబ్దాలంకారములకై కథాప్రసక్తికభ్యంతరముగా విశేషణబాహుళ్యమును గల్పించుట.

(3) గ్రంథమునం దామూలాగ్రము నెఱసున్నలే కాని యరసున్న లుపయోగింపకుండుట.

(4) అసమాపక క్రియలు పెక్కు లుపయోగించి చివరకొక సమాపకక్రియతోఁ బెద్దవాక్యములు వ్రాయుట.

(5) 'నేను' అనఁదగినచోటఁ 'దా' ననుట.

(6) 'చెప్పెను' అనఁదగినచోట్లఁ 'బలుకరించె' ననుట.

(7) 'వానితోడ' అనుటకు 'వానితోడంగూడ' ననుట నీ కావ్యంబునఁ గనుపట్టును.

ఈ గ్రంథము వ్రాఁతలో నెట్లున్నదియు, నచ్చులో నెట్లున్నదియుఁ జూపుట కొక యుదాహరణము నిచ్చుచున్నాఁడను.

### వ్రాఁతప్రతి

అనిన విని ధర్మ్మనంద్దనుండ్డు కృష్ణ ద్వైపాయ నుంగ్గనుంగ్గొని మహాత్మా। నాత్మ్మంమ్ముల్మలు భీమార్జున నకుల సహదేవులు యుద్ధంబ్బున మిగులండిస్సి యున్నవారు। మహాబలుండ్డును। కనణానూనుండ్డును। నగు వృషకేతుండ్డు బాలుండ్డు। ఘటోత్కచుండ్డు మాకార్యంబున హాతుండ్డయ్యె నతనితన యుంటగు మేఘువన్నణం డ్డత్యంత్త బాలుండ్డు గావున। వారల నిరువుర క [illegible] బంప్పుట అయుక్తంబ్బు.

### అచ్చుప్రతి

అనినవినిధర్మ్మనందనుండు కృష్ణ ద్వైపాయనుం గనుంగొని, మహాత్మా! నాతమ్ముల్మలు భీమార్జుననకుల సహదేవులు యుద్ధంబున మిగుల డస్సియున్నవారలు. మహాబలుండును, గర్ణసూనుండునగు వృష కేతుండు బాలుండు, ఘటోత్కచుండు మాకార్యంబున హతుండయ్యె. అతని తనయుండగు మేఘువర్ణుం డత్యంత బాలుండు, గావున వారల నిరువురు గయ్యంబునకుం బంపుట యయుక్తంబు.

## జైమినిభారత ప్రతులు

జైమినిభారత ప్రతు లాంధ్రసాహిత్య పరిషద్భాండాగారమున మాత్రమే యున్నవి.[1] పైని నేనిచ్చిన వ్రాఁతప్రతి యుదాహరణమా భాండాగారముయొక్క తాళపత్రప్రతి ననుసరించినది.

---

1. వాని సంఖ్య 142, 308. సాహి[illegible]ారే తమ గ్రంథమాలలోనే రెండవగ్రంథముగాఁ దీనినిఁ బ్రకటించిరి. పీఠికాకర్తలు అభినవవాగనుశాసన మల్లాది సూర్యనారాయణ శాస్త్రిగారు. ఇది నాలుగు ముద్రణములందినది. అందుఁ జతుర్థ ముద్రణప్రతి నే నుపయోగించితిని. ఆ పీఠికాకర్తల కెంతయుఁ గృతజ్ఞుఁడను. మఱియు నిది మదరాసు విశ్వవిద్యాలయములోఁ బఠనీయగ్రంథమైనది.

# అహల్యా సంక్రందనము

ఇది మూఁడాశ్వాసముల ప్రబంధము. ఇందు (1-131, 2-123, 3-149) 403 గద్యపద్యములు గలవు. అయిన నిందు గద్యములు మూఁడేయున్నవి గాన నిది కేవలము పద్యప్రబంధమనియే చెప్పనగును.

“ప్రథమాశ్వాసమున నవతారిక షష్ఠ్యంతములు నడచినపిదప నమరావతీపురమున నింద్రుఁడు పేరోలగంబున నున్న ఘట్టముతోఁ గథాప్రారంభము. ఆ సభలోఁ దక్కిన దిక్పాలకులును మునీంద్రులును నుండిరి. అప్పు డింద్రుఁడు తన కొల్వుకూటమునకు వచ్చిన యప్సరసలను జూచి, సభవారితో వీరిలో నెవరు చక్కనివారో తెల్పుఁడని యాజ్ఞాపించెను. వరుణుఁడును సూర్యుఁడును నూర్వశియని చెప్పిరి. పురూరవుఁడు దానిని సమర్థించెను. నలకూబరుఁడు రంభ చక్కనిదనెను. అంత మునులలో మృకండుఁడు ప్రమ్లోచయని, విభాండకుఁడు హరిణియని, మాండకర్ణి మదాలసయని, పరాశరుఁడు దాశకన్యయని యిట్లెవ్వరికిఁ దోఁచినట్లు వారు చెప్పిరి. వాక్కలహము చెలరేగెను. అంత నీ వివాదము దీర్పనలవయగు బ్రహ్మయే సమర్థుఁడని సభవారు తీర్మానింప నింద్రుఁడు తన పరివారముతో బ్రహ్మలోకమున కేగెను.

ద్వితీయాశ్వాసమున నింద్రుఁడు బ్రహ్మయెదుట నీ వివాదమును జెప్పఁగా నాతఁడీ యచ్చరపూఁబోండ్లు నంద తెందలదన్ను నొక యతిలోక సౌందర్యరాశిని సృజింతునని చెప్పి తత్క్షణమే యహల్యయను నొక కన్యను సృష్టించెను. ఆమె సౌందర్యమును జూచి జగమంతయు సమ్మోహితమైనది. ఇంద్రుఁడును నామెపై మరులుగొని, బ్రహ్మను నా కన్యను తనకిమ్మని కోరెను. అహల్యయుఁ దొలుత నింద్రునే వలచియుండెను. కాని బ్రహ్మ నీకు నీవే వర్ధించుకొనఁదగదని చెప్పి పరమ నైష్ఠికుఁడగు గౌతమునకిచ్చి పెండ్లిచేసెను. అహల్యయు గౌతమాశ్రమము ప్రవేశించి, కులవధూ ధర్మములు నెఱపుచుండెను. కాని యప్పుడప్పుడు మహేంద్రుఁడు మనసును గలవరపెట్టుటచే నాతనిం దలచుచుండును. ఇంద్రుడును నహల్యా విరహమునకుఁ దాళజాలక కొంగుదాఁకినఁ గొంతవానీయని గౌతమాశ్రమమున కప్పుడప్పుడు వచ్చి యాతిథ్యము వడసిపోయెడివాడు. అంతకంతకు నహల్యపైవిరాళి యాతనికి హెచ్చుకాఁజొచ్చెను.

మూఁడవ యాశ్వాసము నింద్రుఁ డొక ‘యోగిని’ రాయబారిగాఁబంపి, యహల్యతోఁ దన మనోరథమును నివేదించుటతోఁ బ్రారంభమగును. అహల్యయు తన మనసులో నింద్రునిపైఁ గల మక్కువ దెలుప నా దూతికయు నా సంగతి యింద్రునకు

నివేదించెను. అంత నింద్రుఁ డొకనాఁడు కోడిరూపమును ధరించి గౌతమాశ్రమమునకు వచ్చి, యాతనిఁ దన కూఁతచేఁ దెల్లవారినదని భ్రమపెట్టి, యాతఁ డిల్లు వెడలఁగానే, అహల్యతో సౌఖ్యము ననుభవించి తనకోర్కె నెరవేర్చుకొనెను. కాని యాతఁడు తిరిగి వెడలునప్పుడు గౌతముఁ డతని యెదుటఁ బ్రత్యక్షమై, చేసినపని నెఱిఁగి యాతని షండహీనుఁడవు కమ్మని శాపమొసగెను. ఇంటికివచ్చి యహల్య సంభోగచిహ్నములను గనిపెట్టి యామెను పాషాణరూపము నొందుమని శాపమిచ్చెను. ఆమె దుఃఖితయై కాళ్లపైఁబడ శ్రీరాముఁడా ప్రాంతమునకు వచ్చినపు డతని పాదరజస్స్పర్శచే మోక్షము గలుగునని నిజస్వరూపము వచ్చునని శాపావధిని జెప్పి తాను దపస్సుచేయుటకు వెడలెను. అప్పై నా రూపముతో నామె పడియుండఁగా శ్రీరామచంద్రుఁడు వచ్చి యామెకుఁ బూర్వరూపము నొసగెను."

వేంకటకృష్ణప్పనాయకుఁ డీకథను చక్కఁగానంతరించియున్నాఁడు. ఇందలి యితివృత్తము, వేదకాలమునుండి వెలసి రామాయణకాలము నుండి రసికుల నాకర్షించినది. కాని కవి యిందుఁ జక్కని సన్నివేశములు కల్పించి, యౌచితీభంగములేకుండ గథను రసవత్తరముగా దిద్ది తీర్చినాఁడు. శ్రవ్యమగు నిది ప్రబంధమేయైనను దృశ్యమగు నాటకమని చెప్పనొప్పును ప్రథమాశ్వాసమున నింద్రసభారంగమున నహల్యసృష్టి కొఱకు ఋషుల తగవుఁబెట్టి వివాదనాటకమాడించి, కవి ద్వితీయాశ్వాసమున నహల్యాపురందరుల మోహబీజముల నాఁటినాఁడు. గౌతమునివలన యహల్య శృంగారకళా లతికవసివాళ్లువాఱినది. గార్హస్థ్యములో పతిమీఁది భక్తి, వరునిపై వలపుచేత గతాగతకారియైన యుయ్యెలఁబోలె యహల్య హృదయము క్షోభించినది. మూఁడవ యాశ్వాసమున ఇంద్ర దూతిక సమాగమము వాడిపోయిన 'మోహలతికను చివురింపఁజేసినది. చివరకు నింద్రాహల్యా సమాగమమును నవధిగా గ్రమపరిణామమును జెందించిన వెంకటకృష్ణకవి దార్శనికత కావ్యశిల్పము ప్రశంసనీయములు.

నాటకీయముగ నీప్రబంధము రచితమగుటయే నిందలి విశిష్టత యని యీ క్రింది సంభాషణ పద్యములనుబట్టి చెప్పనగును.

చ. ఎవరిది యింటిలోపల, నదెవ్వరు, శక్రుఁడ చెల్ల మీరలా
యివలికిరండు, నీదుమగఁడెక్కడ మూలఫలార్థమేగెరా
నువిదరో తామసంబగునొ యుండుఁడు పూజలుగాంచిపొండు నే
యవలయు పూజనీవెఱుఁగవా ? యన సిగ్గున నేగు నవ్వుచున్. (2-116)

ఇంద్రుఁడు – ఎవరది యింటిలోపల ?
అహల్య – అదెవ్వరు ?
ఇం – శక్రుఁడ ;
అహ– చెల్ల ! మీరలా ! యివలకురండు,
ఇం – నీదుమగఁ డెక్కడ ?
అహ– మూలఫలార్థమేఁగె,
ఇం – రా నువిదరో తామసంబగునో ?
అహ– ఉండుఁడు ; పూజలుగాంచిపొండు
ఇం – చేయవలయుపూజ నీవెఱుఁగవా ? (అన)
అహ– సిగ్గున నేఁగు నవ్వుచున్.

ఉ. దేవ ! శచీమనోరమణ దేవరవచ్చిన దేమి నీదుశో
భావిభవంబుఁజూడ, వనవాసినికేమిటి చెల్వ రత్నమే
తావుననున్న నేమి వనితానవమన్మథ ! నాపయిన్ గృపో
ద్భావననానతిచ్చెదవు భావజునాన నిజంబుపల్కితిన్.

అహ– దేవ ! శచీమనోరమణ ! దేవరవచ్చినదేమి ?
ఇం – నీదుశోభావిభవంబుఁజూడ
అహ– వనవాసినికేమిటి చెల్వ ?
ఇం – రత్నమే తావుననున్న నేమి
అహ– వనితానవమన్మథ ! నాపయింగృపోద్భావననానతిచ్చెదవు
ఇం – భావజునాన నిజంబుపల్కితిన్.

'వైదికుని చేతివిడెమాయె వనితబ్రదుకు' అను నానుడిని వేంకటకృష్ణప్పనాయకుఁడు విపులముగా వర్ణించియున్నాఁడు. స్వర్గలోకమున నింద్రుని కొలువుకూటమునకు నప్సరసలు వచ్చినప్పుడు, వైదికవ్యవహారచ్ఛాందసపరిభాషలో, వారి తమకము నెంతయో సరస హాస్యరస ధోరణితో నిట్లు ప్రపంచించినాఁడు.

సీ. సోమయాగఫలంబు సుదతినీకిచ్చేను మొగమిటుద్రిప్పవే ముద్దుగాను
సోమపానఫలంబు భామనీకిచ్చేను అనఁగ నాకునీ యధరమీవె
కలికిరో సాన్నాయ్య కలశాలఫలమిత్తు బటువైనకుచములఁ బట్టనీవె
రమణిరో నామహావ్రతఫలమిచ్చేను రతులనన్నేలవే బ్రతికిపోదు.

గీ. ననుచు శాండిల్య కౌండిన్యమునిపరాశ రాత్రి … … … … …
………… పర్వతాది ఋషులు మోహింప నప్పరస్త్రీలు మఱియు. (1-68)

సీ. అహహ ఇహ బోవకే యిషువుల చేనన్ను విషమాస్త్రుఁ డేచీని పెట్టిపడుచ!
వాజిసేయ ఫలంబు వలద పేరోయోష! యింద్రు డేమిచ్చీని యిటు నిలువవె
మేము శుంతలమటే మీరు నేర్చినపాటి యెఱుఁగమటే వేద మెల్లఁ జదివి
యతివ నీవుద్వరోష్టయయ్యే దినములయ్యె నగరికి బోవకే నడుమ నెటులో!

గీ. అనుచు ఛాందసులగు సోమయాజివరులు వెంటనంటఁగ … … … …
… … … … … వెడలినప్పుడు వేలుపు వెలవెలఁదులు. (1-69)

ద్వితీయాశ్వాసమున నీ క్రిందిపద్యము 'అమరుకము'నఁగల తృతీయ శ్లోకముపకు ననువాదము.

శ్లో. ఆలోలామలకావళిం విలుళితాం బిభ్రచ్చలత్కుండలమ్
కించిన్మృష్టవిశేషకం తనుతరైః స్వేదాంభసాం జాలకైః
తస్యా యత్సురతాంత తాంతనయనం వక్త్రం రతివ్యత్యయే
తత్త్వాం పాతు చిరాయ కింహరిహరబ్రహ్మాదిభిర్ దైవతైః.

చ. కలఁగిచలించు ముంగురులు కర్ణములన్నటియించు కమ్మలుం
చిలికెడు చిన్నిక్రొంజెమట చెక్కులనించు కజాఱు కొంచెపుం
దిలకము నొప్పఁ బౌరుషరతి శ్రమతాంతవిలాసనేత్రియౌ
కలికి మొగంబు నెన్నటికిఁ గన్నులపండువుగాఁగఁ జూతునో!

తెల్గున నాల్గవపాదమున భావము వేఱైనది.

కాని యితఁడు స్వతంత్రకల్పనలయందు సిద్ధహస్తుఁడే. మచ్చునకు.

ఉ. అంబుజగంధి చక్కఁదనమల్లనఁ గన్గొని విస్మితాత్ముఁడై
యంబుజనేత్రుఁ డప్పుడు త్రియంబక భావముఁ గోరె నాతఁడ
ష్టాంబకలీలఁ గోరె, మదినాతఁడు గోరె సహస్రలోచన
త్వంబునతం డనంతనయనత్వముఁ గోరె మఱేమి చెప్పఁగన్.

"వేంకటకృష్ణప్పనాయకుని ప్రబంధము ఏవిధమైన అనౌచిత్యానికిన్ని యెడమీయదు, పాకమూ ముదిరి కటువుపడదు; శృంగారమా! సభ్యతను మించివేసి ఉచ్ఛృంఖలముగా అతివేలము కాదు: కల్పనలా బింకము తప్పవు. సర్వమధురమైన సద్గ్రంథము"

మధురవిమర్శన రచనాప్రథితులైన మల్లాది[1]వారి పై వాక్యములు గ్రంథసమీక్షకుఁ గలశము పెట్టినట్టున్నది.

## సారంగధరచరిత్ర

వేంకట కృష్ణప్పనాయకుఁడు పిల్లలమఱ్ఱి పినవీరభద్రకవి జైమిని భారత పద్యకావ్యము నెట్లనుసరించి వచనకావ్యముగా రచించినాఁడో, ఆ విధముగనే చేమకూర వేంకటరాజ కవికృత పద్య సారంగధరచరిత్రను వచనకావ్యముగా రచియించియున్నాఁడు. ఇందుల కుపబలముగా నముద్రిత మగు వచన సారంగధర చరిత్రమునుండియు, ముద్రితపద్య సారంగధర చరిత్రమునుండియు రెండుఘట్టముల నుదాహరించుచున్నాను.

1. సారంగధరుడు పావురముకొఱకుఁ జిత్రాంగియింటికి వెడలెద నన్నప్పుడు పద్య సారంగధర చరిత్ర ద్వితీయాశ్వాసము 4 మొదలు 7 వఱకు సుబుద్ధిప్రబోధ మీ క్రిందిరీతి నున్నది.

వెంకటరాజు :

ఉ. చెంగలిడంగ గెంటి యిటు పెంటినిఁ గానగ తేలిపోయి ; చి
త్రాంగివిచిత్రరత్నభవనాంగణ సీమసదేలప్రాలెనా
బంగరుముద్దుపావురము బాపురె ! యంతిపురగంబులోని క్షే
భంగుల నన్యులన్ వెదకఁబంపఁగరాదిఁక నేమి సేయుఁగున్.

గీ. తామసము సేయఁదగదింక దీమసమున నేనుపరిస్థైన నేఁబోక తీరదనుచుఁ
బోవ నుతిమంతిసుతుఁడు సుబుద్ధి దీర్ఘదర్శి గావున సారంగధరుని కనియె.

ఉ. మన్ననచేసి మీరు బహుమానముతో నను నేలినారు, నేఁ
గన్నది తెల్పకుండిన నఘంబగుఁగాదని శ్లాఘ్గలింపకే
విన్నపమాలకింపుము ; వివేకివిగాని మఱొండుగావు నీ
కెన్నఁడులేని యోజయిది యేమెటుపోయిన హానియయ్యెడున్.

---

1. శృంగారకావ్య గ్రంథమండలి ప్రబంధపరంపర 3 అహల్యాసంక్రందనము భూమిక పుట. 18 మల్లాది రామకృష్ణశాస్త్రిగారు, ఈ భూమికలో వేంకటకృష్ణప్ప నాయకుని గ్రంథము లన్నింటినిగూర్చి విపులసమీక్ష - చదువఁదగినది గలదు.

ఉ. రాజొకఁడూరలేఁడు, చెలి, ప్రాయపుబిత్తరి, నీవు రూపరే
ఖాజితమన్మథుండ, వటుకావునఁబోఁదగదయ్య, నీకునో
రాజకుమార! యెక్కడిపరాకిటు నూడఁగదయ్య! భామినీ
రాజులచిత్తముల్ తెలియరాదెటుపోయెటువచ్చునోకదా!

వెంకటకృష్ణప్పనాయకుఁడు :

"అవధరింపు మక్కపోతంబు చిత్రాంగిశాతోదరినగరిలోన వాలుటయుఁ జేరికలనున్న రాకొమరులు సారెసారెకుఁ గేకలువేయ వ్యాకులంబగు మనంబునఁ గలవరపడుచు మత్పారావతంబు పెంటెంగానక చిత్రాంగి విచిత్రాంగణంబున నేఁటికి వ్రాలె? నా బంగరు పావురంబుం దోఁజంగి యెభ్భంగినుండు? పోతుటేఁగ కేనియుం (జొరఁ) గూడని యంతిపురంబునకు నెవ్వరిఁబనుతు? దీమసంబునఁ దామసంబు సేయరాదు. తక్కొక్కరి నాయమయింటికిఁ బంపుట న్యాయముగాదు. ఏనె పోవలయు" నంచు నెంచి యీ నగరి కభిముఖంబుగఁ జనుచుండ, నుతిమంతుఁ డను మంత్రిసుతుఁడు, తనకు హితుఁడును, వివేకసుగుణాకరుఁడగు సుబుద్ధి బుద్ధిమంతుండు గావున సారంగధరుం జేరంగనేగి, "పోవలదుపోవలదు, పరాకు రాకుమారా!" నన్ను మన్ననచేసి యిన్నివితంబులనేలు నేలికవు గావునఁ గన్నకార్యంబు విన్నవింపకయుండిన దోషంబు. కనుక తోఁచినవిధంబు విన్నపంబుచేసెద. "వివేకివిగాని మతొకండవుగావు, ఎన్నండులేని యోజన సేయుదురే? ఈ కార్యంబొనర్చిన హానివాటిల్లు. ఇక్కార్యంబు సేయందగదు. ఆ తావునకుంబోయిన నిందలువచ్చు, ఆ తావునకుం బోవంజనదు. పోరానిచోటులకుఁ బోయిన రారానిమాటలువచ్చు. ఇంత యెఱుంగవె? ఇంత యేమిటి కంటివేని ధారణివల్లభుం డూరలేఁడు. నీవు చక్కెరవిలుకాని ధిక్కరించు చక్కఁదనంబును నివ్వటిల్లు జవ్వనంబును విలాసినీ విభ్రమకంబులైన విభ్రమంబులుం గలవాఁడవు. తిమురుకొమరుఁ బ్రాయంపు సొంపున నింపుమీఱు నాచంపకగంధి. అంగుగావున నీవొంటిగ నవ్వాలు గంటి యింటికిఁబోవఁజనదు. అటలా? యేటి మోమోట? నామాట వినుము. రాజుల వృత్తంబును రాజవదనల చిత్తంబు నెఱుంగంగూడదు."

పై వచనమును జూచిన వేంకటరాజకవి రచననెట్లు వేంకటకృష్ణప్పనాయకుఁడు పుచ్చుకొన్నదియుఁ దెలియఁగలదు. మఱియు నీక్రింది రెండవఘట్టమును జూడుఁడు ఇది రాజు పెద్దలతో సారంగధరుని నేరముగూర్చి విచారించు సందర్భములోనిది.

ఉ. ఓనృప! నాకుఁజూడనలయుగ్మలి నీసుతునిన్ మనోహరా
ననవిలాసుఁజూచి నిలుపోపకపట్టిన లోనుగామి నెం
తేనెగులూని వానిఁబొలియింపఁగ మాయలువన్నె నిట్లు కొం
డేనకు ధర్మరాజలుగు, నిక్కముగా మిముఁజెప్పనేఁటికిన్.

చ. పొలఁతుక మీకుఁగానఁబడఁబొందుగఁ జెప్పినదే నిజంబుగా
దలఁచెదరీ ; రదెంతయును దబ్బరసూ ; 'మగవాఁడు బొంకినా
యలదడిగట్టినట్టులగు నాఁడుదిబొంకిన గోడవెట్టి న
ట్లలవడునన్నమాట' వినరా ధనరాశిపరీత భూభుజా !

గీ. ఇలఁజెరవమాయ మాఁకుడుగలదుగాక నోరుమాయంగ మాఁకుడెందులనుగలదె
యొరులననుటకేమి సారంగధరునిమీఁద నాకు సంశయమొదవదో నరవరేణ్య !

క. ఏతన్మాత్రుఁడె, చేతోజాతారిక్రపాకటాక్షజాతుఁడు సుగుణా
నీతుఁడు, తెలియకయాడెద రాతనికటువంటిగుణములా? నరనాథా'(20-247-351

దీనికి వచనభాగ మిా క్రిందఁ బొందుపఱచుచున్నాను.

"కొండెమునకు ధర్మరాజును నలుగునను నెడమిమ్ముంజెప్ప నేమిటికి? అడియాలంబులు కనుపడంజేసి నీకు నిజంబగునట్టులా కలికి పలికిన దెంతయు దబ్బఱసుమీ! మగవాండు బొంకినం దడిగట్టినట్టులు. ఆండది బొంకినం గోడబెట్టినట్లన్నమాట వినమా! మనమరసిచూడవలయు. చెఱవమాయ మాఁకుడుగలదు గాని నోరుమాయ మాఁకుడుగలదా? ఎవ్వరేమన్న నేమి సారంగధరుం డట్టివాండుకాండు. నీతనూజుండేతన్మాత్రుండా! ఈశ్వరవర జనితుండు. పరనారీసహోదరుండు."

ముద్రితసారంగధర చరిత్రయందలి పాఠభేదములను సరిచూచుటకీ వచన సారంగధరచరిత్ర యెంతయు నుపయోగకరమగును. కాని దీనికి

[1]పరిషత్పుస్తకభాండాగారమున నొక్కటే ప్రతి (సంఖ్య) 62 కలదు. అది శిథిలమైనది. కాని యది పూర్తిగా శిథిలముగాకమునుపే, దానినుపయోగపఱచుట మంచిది. ఆయుపయోగమెట్లో యీ క్రిందఁ దెలుపుచున్నాను.

సారంగధరుఁడు చిత్రాంగి యింటిముందఱకు వెళ్లినప్పు డక్కడ చెలికత్తెలు వెలువఱచిన యభిప్రాయములు గల భాగమునకుఁ బద్య భాగము లేదు. ఇట, రాఁబోవు సారంగధరునిహాని సూచించుచు చెలికత్తె లాడిన మాటలు రాజాస్థానములయందలి విశ్వాసపాత్రులగు సేవకులు తమ యేలికల మేలుగోరి యాడునవిగా నున్నవి. రాజాస్థాన మర్యాదల నామూలాగ్రముగ నెఱిఁగిన చేమకూరకవి దీనిని విడిచి యుండఁడు. మఱియు నాతని పద్యములకు యథానువాదము లుండఁగా నీ భాగమునకు నుండియుండవలెను. లేఖకులు ప్రమాదవశమున విడిచి రేమో యెఱుఁగరాదు. పద్య సారంగధర చరిత్ర తాళపత్ర ప్రతు లింకను జాగరూకతతోఁ బరిశీలింపవలసిన యవసరము నీ ఘట్టము నిరూపించుచున్నది. ఆ భాగమిది.

“ అప్పుడు ప్రోడలగు చేడియ లాచేడియంజూచి యక్కుమారుని చక్కదనంబ్బును యీ చక్కెరబొంమ్మ యక్కరయుం జూచిన నెటికెం బ్బొటికెమోపాటువచ్చువని తోంచుచున్నయది. ఇత్తరి యీబిత్తిరికిం త్తత్తరంబేమిటికి సూటిగానిచోట మోహంబుపాటించుటం బాతిగాదు. యివ్విధంబు మానుమని పలికినంబ్బగ...యీవనిత మనము మానుప లేము. దైవగతి విపరీతంబయ్యెనని తోంచుచుంన్నయది. మనమేని శాయంగ్గలవారమాయమ్మనియు మించ్చిన చందంబ్బున నుండుదమట మీద నెట్టులయ్యేనట్టు కాగాకయని గుసగుసలంబోవును నటునిటు నడి యీడుచుండ్డ చిత్రాంగి విచిత్రంబైన మేడమీదికతనిం దోడ్కొని తన పాదపద్మరాగంబ్బులు సోపానపద్మరాగంబ్బులు పరస్పరంబును సంధింప.

1. సంఖ్య 62. పరిషత్పుస్తక భాండాగారము. (పుటలు 76–77)

ఈ భాగమును '[1]గద్యచింతామణి' యందును గలదు. మఱియు, ముందు పేర్కొన్న శృంగార కావ్యగ్రంథమండలివా రహల్యాసంక్రంద మున దీనిని ముద్రించిరి.

## రాధికాసాంత్వనము

సత్యభామా సాంత్వనము ననుసరించి వేంకటకృష్ణప్పనాయకుఁడీ రాధికాసాంత్వనమును రచించి గోపాలదేవునకుఁ గృతినొసగెను. కవియే దీనిని 'చాటుప్రబంధమని' గ్రంథాంతగద్యయం దిట్లు చెప్పియున్నాఁడు.

"ఇది శ్రీమత్పాండ్యమండలాధీశ్వర శ్రీవిజయరంగ చొక్కనాథ కటాక్షలబ్ధాఖిల సంపత్పారంపరీ సమేధమాన సముఖమీనాక్షీనాయక తనూభవ మీనాక్షీ దేవీకటాక్ష లబ్ధకవితా సంప్రదాయక, వేంకటకృష్ణప్ప నాయక ప్రణీతంబైన రాధికాసాంత్వనంబను చాటుప్రబంధంబు సర్వంబు నేకాశ్వాసము.

ఇందాశ్వాసారంభమున మూఁడు పద్యములు, నాశ్వాసాంతమున మూఁడు పద్యములుపోగా గ్రంథమున 120 పద్యములున్నవి. నడుమఁ జిన్నచిన్న వచనములు, చివరనొక పెద్దవచనముకలదు. శ్రీకృష్ణుఁడు రాధను ననునయించుట యిందలి యితివృత్తము, శృంగారరసపూరితము. ఇదివరలో సూచించినట్లిందలి చివరివచనము (సంభోగవర్ణన) అహల్యా సంక్రందనమునుండి గ్రహింపఁబడినది.

ఇదివఱలో వాఙ్మయచరిత్రకారులు ముద్దుపళని 'రాధికాసాంత్వ నము'ను మాత్రమే యెఱుఁగుదురు కాని యంతకు నూఱేండ్లముందుగా వ్రాయఁబడిన వేంకటకృష్ణప్పనాయకుని కృతినిగూర్చి యెఱుఁగరు. దీని

---

1. 'గ్రంద్యచింతామణి' యనునది యొక వచన సంకలన గ్రంథము. దీనిని సంకలనము చేసినవారు, అభినవ వాగనుశాసనులు కీర్తిశేషులు గిడుగు రామమూర్తి పంతులుగారు. అది 'నవ్యసాహిత్య పరిషత్తు' (గుంటూరు) వారిచే క్రీ. శ. 1933 లోఁ బ్రకటితమైనది.

యునికి [1]యాంధ్రసాహిత్య పరిషత్పత్రిక తెలుపుచున్నది. లోక మెఱుఁగదు. ఇటీవల నీ గ్రంథము ముద్రణభాగ్యము నందినది.

ముద్దుపళని వ్రాసిన రాధికాసాంత్వనమునకు మాతృక వేంకట కృష్ణప్పనాయకుని కృతియని చెప్పవచ్చును.

ఏకాశ్వాసమగు నీ కృతిని నాలుగాశ్వాసముల ప్రబంధముగా ముద్దుపళని రచించినది. వేంకటకృష్ణప్పనాయని కృతియందలి పద్యము లిందుఁ బొందుపఱుపఁబడినవి. ఆ విషయము స్పష్టపఱచుటకు నీ క్రింది యుదాహరణముల నొసగుచున్నాను, పద్యముల మొదళ్లను మాత్రమే యొసగెదను.

| వేంకటకృష్ణప్పనాయకుని. రాధికాసాంత్వనము | అశ్వాసపద్య సంఖ్య | ముద్దుపళని. రాధికాసాంత్వనము | అశ్వాస పద్య సంఖ్య |
|---|---|---|---|
| చ. చిలుకవజీరుఁడంతటను | 9 | చ. చిలుకవజీరుఁడంతటను | 2-102 |
| క. ఇట్లేసినమది ఝల్లని | 10 | క. ఇట్లేసినమదిఝల్లని | 2-103 |
| ఉ. శౌరినిఁబిల్వఁగాఁజనిన | 11 | ఉ. శౌరినిఁబిల్వఁగాఁజనిన | 2-104 |
| సీ. తడవుఁజూచినదృష్టి | 12 | సీ. తడవుఁజూచినదృష్టి | 2-116 |
| సీ. మదదంతిపై నెక్కి | 15 | సీ. మదహస్తిపైనెక్కి | 2-108 |
| గీ. హరునుదిటి కంటిమంటల | 19 | గీ. హరునుదుటికంటిమంటల | 2-121 |
| క. ఇటులే తెంచిన చిలుకన్ | 20 | క ఇటులే తెంచినచిలుకన్ | 2-122 |
| గీ. అటులముంజేతిపైవ్రాలు | 21 | గీ. అటులముంజేతిపైవ్రాలు | 2-123 |
| ఉ. దేవకిచిన్నికుఱ్ఱవసుదేవుని | 22 | ఉ. దేవకిచిన్నికుఱ్ఱ వసు | 2-125 |
| గీ. ఎంత వేఁడినబదులాడ | 24 | గీ. ఎంత వేఁడినబదులాడ | 2-127 |
| గీ. అనినవినిచిల్కయాల్క | 26 | గీ. అనినవినిచిల్కయాల్క | 1-126 |

1. (1) ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక. సం. 4 పుట. గ్రంథసంఖ్య 177. ప్రాచ్య లిఖిత పుస్తకభాండాగారము కాగితప్రతి సంఖ్య. 199.

(2) శృంగార కావ్యగ్రంథమండలి గ్రంథ పరంపర 3 అహల్యాసంక్రందనముతోఁ గూడ నీ గ్రంథమును వచన సారంగధర చరిత్రలోని కొంత భాగమును జైమిని భారతమున ముద్రితమున విడిచిపెట్టఁబడిన భాగమును నిందు ముద్రితములైనవి. ౧౯౩౯.

| | | | |
|---|---|---|---|
| సీ. తెఱవా! యేమని చెప్పుదు | 27 | సీ. తెఱవా ! యేమని చెప్పుదు | 2-128 |
| క. పన్నీరుమేరువుల్ బాగాల | 19 | క. పన్నీరుమేరువుల్ బాగాల | 12-138 |
| సీ. కొసరుపల్కులగమ్మిగోటి | 30 | సీ. కొసరుపల్కులగమ్మిగోటి | 1-146 |
| సీ. కిలకిలనవ్వులు గిలిగింతలు | 31 | సీ. కిలకిలనవ్వులుఁగిలిగింతలు | 2-140 |
| క. నానావిధభావాకర | 32 | క. నానావిధభావాకర | 2-144 |
| చ. పరవశుఁడైన శౌరిఁగని | 33 | చ. పరవశుఁడైనశౌరినిఁగని | 3-4 |
| శా. ఎమేమే వెఱపింతలేకయె | 35 | శా. ఏమేమే వెఱపింతలేకయె | 3-6 |
| సీ. మఱచెనో నాచేత | 36 | సీ. మఱచెనో నాచేత | 3-7 |
| గీ. నిన్నగుప్పయునేఁడాళ్లు | 37 | గీ. నిన్నగుప్పయునేఁడాళ్లు | 3-8 |
| గీ. పాలమెఱుంగనినిన్నటిపులికె | 40 | గీ. పాలమెఱుంగనినిన్నటిపులికె | 3-10 |
| గీ. కానిపదఱకుమిఁకమీఁద | 45 | గీ. కానిపదఱకుమిఁకమీఁద | 3-15 |
| సీ. ఆశుకవిత్వంబులల్లి తేనేసరా | 50 | సీ. ఆశుకవిత్వంబులల్లి | 3-18 |
| క. అనివినిశుకమిట్లనియెన్ | 51 | క. అనివినిశుక | 3-14 |
| గీ. చూపులోపలనొకవింత | 52 | గీ. చూపులోపలనొకవింత | 3-17 |
| గీ. లేనిపట్టింపు | 53 | గీ. లేనిపట్టింపు | 3-18 |
| క. నిన్నెఱుఁగుదునెదురు | 54 | క. నిన్నెఱుఁగుదునెదురు | 3-21 |
| గీ. తగరుకొండమీఁద | 55 | గీ. తగరుకొండమీఁద | 3-13 |
| గీ. కుట్టఁదేలుకుట్టకున్న | 57 | గీ. కుట్టఁదేలుకుట్టకున్న | 3-12 |
| క. నిన్నుండిమానినైతా | 59 | క. నిన్నుండిమానినైతా | 3-22 |
| గీ. మాయదారిమాట | 60 | గీ. మాయదాదిమాట | 3-23 |
| గీ. పడఁతిమునుఁదెల్పె | 61 | గీ. పడతిమునుఁదెల్పె | 3-19 |
| క. కలలోనైనుబాయక | 64 | క. కలలోనైననుబాయక | 3-36 |
| క. నెఱతనముడిగి | 65 | క. నెఱతనముడిగి | 3-35 |
| గీ. నందసుతుఁడుమున్న | 66 | గీ నందసుతుఁడుమున్న | 3-28 |
| సీ. కీరవాణులచేత | 67 | సీ. కీరవాణులచేత | 3-31 |
| గీ. మగువయిదిగాక | 71 | గీ. మగువయిదిగాక | 3-41 |
| గీ. ఎల్లవారికి శకునంబు | 71 | గీ. ఎల్లవారికిశకునంబు | 3-46 |
| గీ. నీవుపోయినపనికి | 74 | గీ. నీవుపోయినపనికి | 3-50 |
| క. తలకెక్కినవలపున | 76 | క. తలకెక్కినవలపున | 3-54 |
| సీ. జడవేగవదలించి | 78 | సీ. జడవేగవధలించి | 3-75 |

| | | | |
|---|---|---|---|
| చ. ఉలుకును జెచ్చునూర్చు | 79 | చ. ఉలుకును నెచ్చునూర్చు | 3-59 |
| ఉ. రాయనువింతే | 80 | ఉ. రాయమని [illegible] | 3-60 |
| క. తను వెల్లఝల్లుమన | 85 | క. కను వెల్లఝల్లుమన | 3-74 |
| క. ఏమంద మేమిసేయుద | 87 | క. ఏమంద మేమిసేయుద | 3-77 |
| ఉ. కోమలినిబ్బెపున్మెఱుంగు | 89 | ఉ. కోమలినిబ్బెపున్మెఱుంగు | 3-76 |
| గీ. అంతనచ్చుటనర్జునా | 92 | గీ. అంతనచ్చుటనర్జునా | 3-99 |
| సీ. రాజాస్యగిలించు | 93 | సీ. రాజాస్యగిలించు | 3-97 |
| తే. గీ. తోయజాననమది | 95 | తే. గీ. తోయజాననమది | 2-100 |
| సీ. నిలుబాసినిముసంబు | 96 | సీ. నినుబాసినముసంబు | 3-102 |
| తే. గీ. మ్రొక్కి-మ్రొక్కి-ంచుకొను | 98 | తే. గీ. మ్రొక్కి-మ్రొక్కి-ంచు | 3-112 |
| ,, [illegible] లేదయ్యో | 100 | ,, మునుప్రవిద్దురలేదయ్యో | 3-119 |
| ,, రామగాదది సౌందర్య | 101 | ,, రామగాదది | 3-147 |
| సీ. శృంగారయౌవన క్షీరాబ్ధి | 104 | సీ. శృంగారయౌవనక్షీరాబ్ధి | 3-105 |
| గీ. అపుడునచ్చుటరాధకంసారి | 107 | గీ. అపుడునచ్చుటరాధకంసారి | 4-15 |
| సీ. విడువిడుమని | 111 | సీ. విడువిడుమని | 4-15 |

ఇంకను నిందు 13-వ పద్యమునకు 2-113, 83 పద్యమునకు 3-87 పద్యములలో ఛాయలును, 112-వ పద్యమునకు 4-16 లో నర్థ సమానత్వమును గానఁబడుచున్నవి. మొత్తముపై సగము భాగము వేంకటకృష్ణప్పనాయకుని గ్రంథమిందుఁ బొందుపడినది. కాని యంత మాత్రమున ముద్దుపళని గ్రంథమునకుఁ బ్రత్యేకతలేకపోదు. ఆ గ్రంథ విశిష్టతను ముద్దుపళని కృతినిగూర్చి వ్రాసినపుడే వచిఁకే తెలిపితిని.

అహల్యాసంక్రందనంబునందువలె నిందును సంభాషణరూపము నగు పద్యముగలదు. రాధికామందిరము ప్రవేశింపఁబోవునపుడు వాకిట యడ్డమునిలిచిన చెలికత్తెకుఁ గృష్ణునికి జరిగిన సంవాదము.

కృష్ణుడు. పొలఁతిరో ? — చెలికత్తె. ఏమి ?

కృ. త్రోవ విడు పోవలె — చె. ఎచ్చటికి ?

కృ. ఇంతిచెంతకే — చె. తొలిరుచివీడవో

కృ. విడను — చె. త్రోతుము

కృ. ద్రొబ్బుదు పొమ్ము — చె. పోను

కృ. మాటలకెడమౌను
కృ. ఔను
కృ. బలిమిమిటారి
కృ. వచ్చితి
చె. కానివికటాననుఁజొచ్చితి
చె. ఎవ్వరో ?
చె. రమ్మిదిగో
చె. రాకలమానవోహరీ !

ఇది యీ క్రింది పద్యము:

చ. పొలఁతిరో ! యేమి ? త్రోవవిడు, పోవలె నెచ్చటికింతిచెంతకే
తొలిరుచిపీడవోవిడను ద్రోతుము ద్రొబ్బుదుపొమ్ము పోనుమా
టలకెడమౌను గాన వికటాననుఁజొచ్చితి నౌను నెవ్వరో
బలిమిమిటారి రమ్మిదిగో వచ్చితి రాకలమానవోహరీ !

ప్రత్యేకము వరాంగవర్ణన మొదలగునవి లేకుండిన నీ చాటుకావ్య మింత కన్న మనోహరతరముగా నుండెడిది.

[1]ఈ క్రింది పద్యములు విజయరంగ చొక్కనాథునిపైఁ జాటుపద్యములు.

వేంకటకృష్ణప్పనాయకుఁడు చెప్పిన పద్యములుగా భావించి మొదట చేర్చితిని. కాని నిశ్చయముగా నాతని కర్తృత్వము నిరూపితము కాక పోవుటచే నథసూచికలో నుంచితిని.

---

1. క. రమ్మనెరా తనదేనే రమ్మనెరా పంచశరుని రాపోద్చుట భా
రమ్మనెరా నీపై తన సొమ్మనెరా విజయరంగ చొక్కవజీరా !

క. రాపేరా ? జిగిపచ్చల రాపేరా ? యొసఁగితల్ల రమణికి నాతో
దాపేరా ? రేపేరా చూపేరా ? విజయరంగ చొక్కవజీరా !

క. ఇమ్ముగఁ గమ్మనిపీడెము కొమ్మని కొమ్మనిపుడేలు కొమ్మనిశము కో
పమ్మేరా యాచెలినీ సొమ్మేరా విజయరంగ చొక్కవజీరా !

క. వలరాజును నెలరాజును నలరాజును ...... నీతుల నీ
తులరాఁగలరా ? యిలరాజులరాజా ! విజయరంగచొక్కవజీరా !

క. సరసానికి దొరసానికి ......... నొసఁగితివిభళీ!
సరసాలా ! కవిగాయక సురసాలా ! విజయరంగచొక్కవజీరా !

క. మాటికిమాబోటిని నొక చోటికి రప్పనియు నెనయఁజూచితి...
... ... ... ... ... జూటేరా ? విజయరంగ చొక్కవజీరా !

క. ఎక్కడనేర్చితివగలను నిక్కముపలిచినదికొమ్మ ! నీపేరంటే
మ్రొక్కనురా స్రుక్కనురా సొక్కనురా విజయరంగ చొక్కవజీరా ![1]

---

1. చాటుపద్యరత్నాకరము, తృతీయతరంగము 140–141 పుట. విద్వత్కవి దీపాల పిచ్చయశాస్త్రి సంపాదితము.

# శేషము వేంకటపతి

విజయరంగ చొక్కనాథుని కాలమున విలసిల్లినకవులలో వేంకటపతి ప్రసిద్ధుఁడు. సముఖము వేంకటకృష్ణప్పనాయకుని కతఁ డాప్తమిత్రుఁడని యీ వఱకే తెలిపియుంటిని. ఈతని కృతియగు శశాంక విజయము (తారాశశాంకవిజయమని వాడుక పేరు) దాక్షిణాత్య కృతులలో విశేష వ్యాప్తిగలది. ఈ కృతి వంగల సీనయామాత్యుని కంకితము. సీనయామాత్యుని వంశక్రమమిది.




ఈ వంశమున తొలివాఁడగు వేంకటకృష్ణయను గూర్చి.

"మంత్రిమాత్రుండె యతఁడు దుర్మంత్రి గంధసింధురోగ్రజాగ్రన్నృసింహమూర్తి
చెంజివేంకటనృపతి సాచివ్యకారి కీర్తిగుణహారి వేంకటకృష్ణశౌరి"

అని తెలుపఁబడినది. ఈ చెంజివేంకటేంద్రుండు విజయనగర వేంకటపతి రాయలచేత క్రీ.శ. 1586 ప్రాంతమున చెంజీదుర్గపాలకుఁడు[1]గా నియమితుఁడైనాఁడు. కావున వేంకటకృష్ణయ యీకాలమువాఁడేయని తెలియనగును.

ఈతని కొమారుఁడు కృష్ణుఁడు. శాత్రవరాజు కాంతల కబరిభారముల (కొప్పెరలను) హరించుటచే, 'కొప్పెర కృష్ణుఁడ' పేరు వహించెను. ఆ వెనుక నీ వంశమున వెంగన్న రెండవతమ్ముఁడు కళ్లకృష్ణుఁడు కవితాధుర్యుఁడయ్యెను. ఇఁక కృతిపతితాత "పండిత మండలీహృదయ పంకజభానుఁడు" కృతిపతి తండ్రియగు వేంకటరాఘవాధ్వరి,

సీ. ఋగ్యజుస్సామాది రీతుఁలేర్పడఁజేసి పాఠశాలలు పెట్టి వ్యాసులట్లు
ప్రాకారమణిమంటపాది కైంకర్యముల్ పరకాలుగతి రంగపతికొనర్చి
చాయలుకల్పించి జలధరప్రౌఢిమ శాలలువేయించి జనులకెల్ల
బుధులకు నవరత్న భూషణాంబరములు కల్పవృక్షంబుల కరణినొసగి

గీ. వెలయు నారదవరదున కలఘుభక్తి నిష్ఠభోగంబులొనరె ఫణీంద్రులీల
భజనతోషితఖగ సార్వభౌమవాజి సుగుణవేంకటరాఘవ సోమయాజి.

అని ప్రశంసింపఁబడినాఁడు. కృతిపతి సీనయ దానధర్మములచేతఁ దండ్రిని మించుటయేగాక సంగీతసాహిత్యవిద్యావేత్తయై విలసిల్లినవాఁడు. ఈతఁడు, శ్రీవిజయరంగచొక్కనాథ మహీనాథ కృపాకటాక్ష వీక్షణానుక్షణవర్ధమానుఁడు, మఱియు,

సీ. సకలసామాజిక సంఘంబు మదికి నింపుగ బృహస్పతిలీల బుద్ధిచెప్పు
కార్యఖడ్గక్రియా ఘటనాఘటనశక్తి దొరనుబ్రమోదంబు దొరయఁజేయు
జననంబుమొదలుగా సకలజనోపకారంబు వ్రతంబుగా రహినొనర్చు
జనకునిశైఖరి జ్ఞానకర్మప్రపాదనభక్తి గురునిష్ఠలొనర మెలఁగు.

---

1. In 1586 he (Krishnappa) rebelled against Venkata, who captured him and had him put in prison. During his imprisonment, Gingee was ruled by one Venkata who was sent against him by Venkatapatiraya.

(The Nayaks of Tanjore, Page 75. F. N. 43.)

గీ. ధరనుపనయన కన్యకాదానశతము లన్నదానంబుజలదాన మాదియైన
దానములొసంగు ఘనుఁడభిమానధనుఁడు శ్రీపతినిభుండు వంగలసీనవిభుఁడు.

అని యీతని ప్రతిభావిశేషము, దాతృత్వము వర్ణితములైనవి. ఇతడు వాధూలవరద దేశికుని శిష్యుఁడై యుభయ వేదాంత సిద్ధాంతములను గ్రహించిన వైష్ణవశిఖామణి.

సాహిత్య విద్యావేత్తయగు సీనయ "రామానుజ దివ్యచరిత్ర ప్రబంధ సాహితీ మోహితానల్పసంతోషవిశంకట వేంకటనగాధీశ్వరుఁడు." అని వర్ణితుఁడైనాఁడు అనఁగా విశిష్టాద్వైతమత ప్రవర్తకులగు శ్రీరామానుజాచార్యులవారి చరిత్రను నీతఁడు ప్రబంధరూపమున రచించి శ్రీవేంకటేశ్వరునకు కృతినిచ్చినాఁడని వివరణ. ఇదియే షష్ఠ్యంతములలో "రామానుజవిజయాంక గవీ మధుర సమోదమాన వేంకటపతికిన్" అని చెప్పఁబడినది. ఈతని కవితాశక్తి యసమానమని 'ఆలంకారిక సమ్మతోజ్జ్వల కవిత్వాగాథ' అని యాశ్వాసాంతమునఁ బేర్కొనఁబడినది. 'సరసగద్య పద్య రచనాంభోజుండు' అను విశేషణ ముపయుక్తమైనది.

ఇతడు సంగీతశాస్త్రపారఁగుఁడు. వీణావాదనమున నేర్పరి "ఘన నయదేశీయ కమనీయ గ్రామమూర్ఛనా బహువిధన్యాస ధన్యాసమాన తాళమాన నానానూన తానవితాన భంగీతరంగిత సంగీతవిద్యావిశారదుండును, వీణానినాద వినోదభూలోకనారదుండును" అని యవతారిక యందుఁ గలదు. ఈతని సంగీతవిద్యానైపుణ్యము హాహా హూహూ గంధర్వుల మించినదని యిట్లు వేంకటపతి ప్రశంసించినాఁడు.

శా. హాహాహూహూహులు గానగర్వమున నాహాహూహూహువంచున్ స్వరా
రోహప్రక్రియ ........................................ వృథా
సాహంకారులు మర్త్యగాయకులు జోడా ? నీకుఁ బాండ్యేశ్వర
స్నేహాలంకృతవంగలాన్వయమణీ ! సీ నాకవిగ్రామణీ !

ఈతఁడు మన్నారురంగనిగూర్చి పదములుచెప్పినట్లుగా "శ్రీమన్నారు రంగాధిపనామాంకిత గేయకల్పనా సుతమణికిన్" అనియు "శ్రీమన్నారు రంగాధిపరామానుజగుణగణాంకరచనాముదితా" అనియు కవిషష్ఠ్యంత

సంబోధనలలోఁ జెప్పియున్నాఁడు. మన్నారురంగముద్రగల పదములు నేఁడు లభించుచున్నవి. ఈ పదము లీతని చివరి నివాసస్థానమగు [1]మన్నారు పోలూరుగ్రామమున వెలసియున్న మన్నారు రంగని పైరచితములైనవి. [2]కురవంజిరాగమున నున్న 'శివదీక్షాపరురాలనురా' అను మనోహరపద మీతని రచనయే.

ఇట్టి మహనీయునకు శశాంకవిజయమును గృతినిచ్చి ధన్యుఁడైన వెంకటపతి కవినిగూర్చి విశేషములు మన కంతగాఁ దెలియరాలేదు. కృతిపతి తన్నుఁగూర్చి యీ క్రిందివిధముగాఁ జెప్పినమాటలలో నీతఁడు శ్రీరంగేశ్వరభక్తుండనియు, శేషము కృష్ణసుధీతనయుఁడనియు నింతకు మున్ను కొన్నికృతులు రచియించెననియుఁ దెలియుచున్నది.

క. ననురంగేశ్వర పదయుగ ఘనతరభజనానిరూఢ కవితాసామ్రా
జ్యుని శేషము కృష్ణసుధీ తనయునిఁ బిలిపించిపలికె దయదయివారన్

చ. అసదృశభక్తి సద్గురుకటాక్షముఁగాంచి సమంచితాత్మతన్
బిసరుహమాకరందరసపేశలకౌశలవన్మృదూక్తులన్
రసికులకింపుగాఁగృతి పరంపరలన్ రచియించి కీర్తిచే
నెసగితివయ్య వేంకటపతీ! భళి! శేషము వంశసత్కృతీ!

కాని యీతని కృ... లేవియు లభింపలేదు. ఇష్టదేవతాస్తుతిలో గందాళ ... తన గురువుగఁ జేర్కొనినాఁడు. గద్యయందుఁగూడ విశేషములు లేవు.

"ఇది శ్రీ జానకీరామచంద్ర చ... కందళితానంద కందాళ రామానుజ గురుచరణసేవాసమాసాదిత సాహితీవైభవ శేషము కృష్ణయార్యతనూభవ సుకవిజనవిధేయ వేంకటపతి నామధేయ ప్రణీతంబైన శశాంకవిజయంబను మహాప్రబంధంబునందుఁ బంచమాశ్వాసము"

1. మన్నారు పోలూరు గ్రామము ఉత్తరార్కాటుజిల్లాయందున్నది. ఈతని మొదటి నివాస మీ మండలములోని చెట్టిపట్టణము.

2. The Carnatic Music Composers T. S. Vasudevan. Journal of the Madras University Vol. X Pages 146-147

## శశాంకవిజయము: కథాసంగ్రహము

పరమపవిత్రుఁడగు నత్రిమహాముని తన భార్యయగు ననసూయతో సంతానముఁ బడయుట కొఱకు హిమవత్ పర్వత ప్రాంతమునకువచ్చి, యనసూయ కచ్చటి విశేషముల నెఱింగించెను. అచటనుండి ముందునకు వెడలుచుండ బదరికాశ్రమము వారికి గోచరించెను. అచటనే యత్రిమహాముని నిలిచి ఘోరతపస్సు చేయసాగెను. హరిహర బ్రహ్మ లాతనికిఁ బ్రత్యక్షమై వరమడుగుమనిరి. అంత నాతఁడు త్రిమూర్తులవంటి ముప్వురు కొమారుల నిమ్మనెను. అప్పుడు త్రిమూర్తులు తామే పుత్రరూపములను ధరించి యనసూయకు జన్మించెదమని చెప్పి యంతర్హితులైరి. అవెనుక, విష్ణువంశమున దత్తాత్రేయుఁడు, శివునియంశమున దుర్వాసుఁడు, బ్రహ్మయంశమునఁ జంద్రుఁడును జన్మించిరి. బ్రహ్మయుఁ దన యంశమున జన్మించిన చంద్రుఁడు దినదినప్రవర్ధమానుఁడై యుండ నొకసారివచ్చి యాతనికి గాండీవాద్యాయుధముల నొసంగి, రాజపట్టము నిచ్చి, యాతఁడు పాలించుటకుఁ బ్రతిష్ఠానపురమను నొక పట్టణము నిర్మింప విశ్వకర్మను నియమించెను. ఇది ప్రథమాశ్వాసకథ

ద్వితీయాశ్వాసము విశ్వకర్మ నిర్మించిన ప్రతిష్ఠానపురవర్ణనతోఁ బ్రారంభము. అచట చంద్రుఁడు నివసించుచుండెను. గురునియొద్దఁ జదివినఁగాని వివేకము గలుగదని యెంచి, అత్రిమహాముని చంద్రుని బృహస్పతి వద్దకుఁ బంపెను. బృహస్పతియుఁ జంద్రుని రూపవినయగుణంబులకలరి, తన భార్యయగు తారను బనిచి, యీ క్రొత్త శిష్యుని నాదరముతో నన్నపానాదులనిడి పోషణసేయుమని యప్పగించెను. చంద్రుఁడు శ్రద్ధగా గురుముఖమున సకలశాస్త్రములును త్వరలో నేర్చెను. ఇంతలో క్రమక్రమముగా నాతనికి యౌవనవసంతోదయమయ్యెను. తొలుతనే యాతఁడు చక్కనివాఁడు. ఆవెనుక యౌవనోదయమైనవాఁడు. సకలకళారహస్యములను నెఱిఁగినవాఁడు. అతఁడు గురువునింట నుండుటచే నితరాంగనలకు నాతనిచక్కఁదనము 'పూచినసంపెఁగ మధుకరాంగనలకుఁబోలె'' నంటరానిదయ్యెను. బృహస్పతిభార్య తార, తానింటనే యుండునదిగావునఁ జంద్రునిజూచి మోహమునఁ దత్తరింపుచు, నాతనికి శృంగార చేష్టలమూలమునఁ దన మనోభావము వ్యక్తము సేయుచుండెను. వయసులోనున్న చద్రుఁడును శృంగారావ తారయగు తారనుఁజూచి మోహించియు, గురుగృహమగుటచేఁ దన మనసులో భావముల నణఁచి, ప్రవర్తింపుచుండెను. ఇరువురును క్రమక్రమముగా సమాగమమున కువ్విళ్లూరుచుండిరి. ఇంతలో వారికోర్కె లీడేరెనన్నట్లు వసంత కాలము వచ్చెను. ఇంద్రుఁడు యాగముచేయఁదలఁచి బృహస్పతికిఁ గబురంపెను. బృహస్పతి యింద్రుని యాజ్ఞగాన, తాను బోయివచ్చెదనని యంతవఱకుఁ జంద్రుని జాగరూకతతోఁ జూడుమని చెప్పి వెడలిపోయెను.

తృతీయాశ్వాసము తారాచంద్రసమాగమ ఘట్టము. తార చంద్రునిఁజేరి తన మనోరథమును దెల్పఁగా చంద్రుఁ డామెకు కులవధూధర్మము లెఱింగించి, ధర్మశాస్త్ర సంప్రదాయములు దెలిపి, యావెనుక నామెపొందెడి బాధలను దెల్పెను. కాని యామె చంద్రునికన్న నాలుగాకు లెక్కువ చదివినది యగుటచే, నాతని నొడఁబఱచి, మన్మథ సౌఖ్యాంబుధి నోలలాడును. అప్పటినుండి గురువు తిరిగివచ్చువఱకు వారి సౌఖ్యమునకే యంతరాయమును గలుగలేదు.

నాల్గవయాశ్వాసమున బృహస్పతి యజ్ఞము నిర్వర్తించివచ్చి, తారాచంద్రుల వైఖరి నీక్షించి, తన భార్యపైఁ గోపించి చేసినపని చెప్పుమనెను. ఆమె సత్యము పలుకఁగా నాతఁడు శాపమీయఁబోయెను. కాని కాళ్ళపైఁబడుటచే నామెనువదలి చంద్రుని శపింపఁదలచి యదియు సరికాదని యాలోచించి చంద్రునితోఁ జదువు పూర్తియైనది గనుక స్వగృహమునకు నేగుమని దీవించిపంపెను. చంద్రుడును ఖిన్న మనస్కుఁడై వెడలిపోయెను.

ఆనాఁటినుండి తార చంద్రవిరహము నోర్వలేక యాతని సమాగమ మెప్పుడైన నగునాయని కాంక్షించుచుండెను. ఇంతలో నామె స్నేహితురాలగు నొక తాపసి చూచుటకు రాఁగా చంద్రుని కామెచేత సందేశమంపెను. ఆమె చంద్రుని చూడఁ బోవఁగా నాతఁడును తారావిరహమున నతిఖిన్నుఁడైయుండెను. తాపసి తారచెప్పిన సందేశమును విని యామె చెప్పినప్రకారము నొక సంకేతస్థలమునకువచ్చి, తారకొఱకు నిరీక్షించుచుండెను. తాపసిచేసినపనికి మెచ్చుకొని తార యచ్చటికేఁ దన భర్తను గికురించి వచ్చి చంద్రునితోఁగూడి చంద్రుని రాజధాని కేగెను.

బృహస్పతియుఁ దారయింటలేమి కనుఁగొని తన దివ్యదృష్టివలన జరిగినదంతయు నెఱింగి, చంద్రునికిఁ దగిన శాస్తియొనర్చెదనని చెప్పి, యింద్రునివద్దకేగి చంద్రునిపై యుద్ధమునకుఁబోవ నాజ్ఞాపించెను. ఇంద్రుఁడు తొలుత యుద్ధముచేయకుండ నొక దూతను పంపెను. కాని చంద్రుఁడు వానిమాటలను లక్ష్యపెట్టక యుద్ధమునకు సన్నద్ధుఁడయ్యెను.

పంచమాశ్వాస మింద్రచంద్రు లిరువురును ఘోరముగా పోరుచుండు ఘట్టముతోఁ బ్రారంభము. ఆ యుద్ధము మిక్కిలి విపరీతస్థితికిరాఁగాఁ ద్రిమూర్తులు ప్రత్యక్షమై వారిని విచారించి చంద్రునితోఁ దారను తిరిగి గురునకిమ్మని యాజ్ఞాపించిరి. అంత నప్పుడే గర్భచిహ్నములు కన్పించుచున్న తారను గురునకొసంగెను. బ్రహ్మయు నమృతరశ్మియగు చంద్రుని పొందినదిగావున నామె పరిశుద్ధయని వెల్లడించెను. బృహస్పతి స్వీకరించెను. అంత నవమాసములు నిండినవెనుక తార బుధుఁడను పుత్రుని గనెను. పుత్రోత్సవము చేయుటకుఁ జంద్రుఁడు రాఁగా బృహస్పతి యాతఁడు రావలసిన యగత్యము లేదని నివారించెను. తనకొమారుఁడేయని చంద్రుఁడు పలికెను. వారికి వాదమయ్యెను బ్రహ్మ తిరిగివచ్చి తార నడుగఁగా నామె బుధుఁడు చంద్రుని

కౌమారుఁడే యని చెప్పెను. చంద్రునికి బృహస్పతిచేత బుధుని నిప్పించి బ్రహ్మయాతనికి గ్రహమండలాధిపత్యము నొసంగెను. చంద్రుఁడు తారాబుధులతో తనపురి కరుదెంచి సౌఖ్యముచ నుండెను. అప్పుడు దక్షప్రజాపతి యశ్విన్యాది నక్షత్రరూపములైన తనయిరువదియేడుమంది పుత్రికలను జంద్రునికిచ్చి వివాహము గావించెను. అతఁడు వివాహమైనవెనుకఁ దన రాజశబ్దము సార్థకము గావించుటకుఁ రాజసూయయాగ మొనరించెను. తారకా సార్వభౌముఁడు దారరీతి ధరణిఁ బాలించునపు డంచితముగఁ బ్రపంచమంతయు నమృతమయ మై మించెను.

వేంకటపతి మృదుమధురరీతిని రసోల్లసితముగ నీకావ్యమును రచియించెను.

> "లోకములోనఁ గొంద ఱబలుల్ సతులన్ దనియింపలేక న
> స్తోకమనీష నన్యపురుషుల్ తమభామలనంటకుండఁ దా
> టాకులలోనవ్రాసిరి పరాంగనఁగూడిన పాపమంచు న
> య్యాకులపాటుఁజూచి యిపుడాకులపాటొద వెన్మనంబునన్."

అను పద్యమును,

> "ఎన్నిపూవుల ౙాలదు తేఁటియట్లె మగవాఁడనువానికి దోసమున్నదే"

యను పద్యపాదము నెఱుంగనిచదువరులు తెనుఁగునాఁటలేరు. కావ్యము శృంగారరసప్రధానమైనను వరాంగవర్ణన మొదలగునవిలేవు. ఈకథను నంతకు మూఁడుశతాబ్దుల పూర్వము శ్రీనాథ మహాకవి కాశీఖండమున రచియించియున్నాఁడు. అందుఁ జతుర్థాశ్వాసమున 194 నుండి 230 వఱకును 36 గద్యపద్యములలో నిది ప్రౌఢతమరీతిని రచితమైనది.

ఈకథకు మూలప్రాయమైన తారాశశాంకపరిణయ పరిణామమును శ్రీనాథమహాకవి యొక్కపద్యమున నిట్లు చెప్పియున్నాఁడు.

> గీ. చదివెఁజంద్రుండు ధర్మశాస్త్రంబుఁదొలుత పరసుతాత్పర్య విశ్వాసభక్తిగరిమఁ
> జదివె చంద్రుండు కామశాస్త్రంబు పిదప తలిరుఁబోన్పన ననురక్తిఁదారయొద్ద.

అయినను నందే నీతిబోధకమును నిరవద్యమునగు నీక్రిందిపద్యము రచియించియున్నాఁడు.

> సీ. భువనైకధన్విచేఁ బుష్పాయుధునిచేతఁ బ్రసవాస్త్రమున నేటుపడనివాఁడు
> అతిగాఢమైన క్రోధాంధకారమ్మునఁ గన్నులనంధుఁడు గానివాఁడు
> నిర్నిబంధనలోభ నిద్రాభరంబునఁ బారవశ్యంబు చేపడనివాఁడు
> లక్ష్మీకటాక్షలీలాసీధుమదమున మనములోపల నన్నుకొననివాఁడు

గీ. నేఁడు భూపతిగలిగెనే న్యాఁడు నృపుఁడె? విశ్వధాత్రీజనుల పాలివేల్పు గాక
బాహ్యశత్రులఁ బరిహరింపఁగవచ్చు నంతరారుల నిర్జింపనలవిగాదు.

వేంకటపతి తారాశశాంకమునందే కాక, యీ కాలమునఁబుట్టిన ప్రబంధములలో నీ నైతికదృష్టి కొఱవడుటచేత వానిని కేవలము కామ శృంగార ప్రబంధములని విమర్శకులు నిరూపించినారు. అయినను బహు ప్రజారంజకములగు నిట్టి ప్రబంధము లా కాలమున సాంఘికాభిరుచులను జక్కఁగఁ దెలుపుటచేత వాఙ్మయచరిత్రమున శాశ్వతస్థానమును సంపాదించినవి.[1]

## కుందుర్తి వేంకటాచలకవి

విజయరంగ చొక్కనాథుని యాస్థానమున మఱొక ప్రసిద్ధకవి కుందుర్తి వేంకటాచలకవి. ఆతని వంశక్రమము.




1. భాషోద్ధారకులగు బ్రౌనుదొరవారి నాకర్షించిన గ్రంథములలో నీ ప్రబంధ మొకటి. వారు దీనికి 'చకోరీయము' 'తారకము' 'తారాభావప్రకాశిక' అను మూఁడు వ్యాఖ్యానములు రచియింపఁజేసిరి. గ్రంథమును బ్రతులతో సంప్రతించి పాఠభేదములను నిర్ణయించిరి. ఆంగ్లేయభాషలో సూచికలు వ్రాసిరి. మఱియు నిందలి పదముల కకారాద్యనుక్రమణిక వ్రాయించిరి, ఈ గ్రంథమునకు మదరాసు ప్రాచ్యలిఖితపుస్తక భాండాగారమున సంఖ్య 807 నుండి 819 వఱకు, పండ్రెండు ప్రతులున్నవి. ఈ గ్రంథప్రశస్తిని ప్రచారమును వీనినిబట్టి మనము గ్రహింపవచ్చును.

పైవారిలో నహోబలకవి గజపత్యశ్వపతుల సభలలోఁ బండిత శ్రేణిని జయించెను. గోవిందయ కుందుర్తిని వాసస్థలముగాఁ జేసికొనెను. మఱియు నాతఁడు 'భారతీపరిణయ' మను కావ్యమును వీరవేంకటపతి రాయలకు నొసంగి యాతనిచేత సమ్మానము గాంచెను. అది యిప్పుడు గానవచ్చుటలేదు. రామయ పాండ్యవసుధాధ్యక్షుని మంత్రియైనాఁడు. వీర వెంకటపతిరాయలు క్రీ. శ. 1680-1700 ప్రాంతముల నున్నవాఁడు. వెంకటాచలకవి తన్నుఁగూర్చి చెప్పుకొనునప్పుడు క్రీ. శ. 1704-1732 వఱకును మధురను బాలించిన విజయరంగ చొక్కనాథుఁడు తన్ను బహూకరించినట్లుగా నిట్లు చెప్పుకొన్నాఁడు.

చ. కవిజనకల్పకం బఖిలకావ్యరసజ్ఞుఁ డఖండపాండ్య భూ
ధవుఁడు మహానుభావుఁడతి ధార్మికుఁడర్యగవజ్రధారియై
న విజయరంగ చొక్కనరనాథుఁడు నీకవితాసమగ్రవై
భవములు మెచ్చి నీకొసగె ధర్మమణీశిబికాదిసంపదల్.

దీనినిఁబట్టి యీతఁడు క్రీ. శ. 1732 వెనుకనే గ్రంథరచనము గావించినట్లూహింపవచ్చును.

ఇఁక వెంకటాచలకవి 'కథాశుకవి' యని కీర్తిఁగన్నవాఁడు. ఇతఁడు పెద్ద చదువరి. ఆశుమధుర చిత్రవిస్తరములను 'చతుర్విధకవితలు' చెప్పుటయందు నేర్పరి. నాటకములు చాటుకృతులు పెక్కులు రచియించినాఁడు. ముఖ్యముగా భారతభాగవత రామాయణములు వచన కావ్యములుగా రచియించినాఁడు. కాని నేఁడీతని వచనకృతులేవియుఁ గానరాకున్నవి. ఈ విషయ మీ క్రింది పద్యములలో నీతఁడు రచించిన మిత్రవిందాపరిణయ ప్రబంధావతారికవలనఁ దెలియుచున్నది.

గీ. అతఁడు సామాన్యుఁడే షట్సహస్రకుల పరివృఢకుందుర్తి ధవళాంతరీపదీప్తుఁ
డాగమాంచలపద్యావిహారకారి విశ్వపరితోషకారి గోవిందశౌరి.

చ. పటుతరగోస్తనీ మధురపాకసమంచితముగ్ధ రసోర్మి ప
ర్యటమగు 'భారతీ పరిణయంబ'నుకావ్యమొసంగి వీర వేం
కటపతిరాయలందనిపి కాంచె మణీకనకాభిషేకము
త్కటగతినమ్మహామతి ముఖస్థితిశోభి యశోభిరాముఁడై.

సీ. చదివినావే మేమి చదువయోగ్యంబులో యవియెల్ల [illegible]
వచనకావ్యములుగా రచియించినావు భారతభాగవతములు రామకథయు
ఘటియించినావు ద్రాక్షాపాకముగ బహు నాటకంబులు సమున్నతినెలంగఁ
జాటించినావు దిక్కోటరంబుల బుధకోటిమెచ్చ నపారచాటుకృతులు

గీ. అర్థగుంఫసముజ్జృంభితాశు మధుర చిత్రవిస్తరకవితాప్రసిద్ధినీకు
సహజమేకద పాండ్యభూజానిసభఁ గథాశుకవి యనఁ గీర్తిఁ జెన్నలరినావు.

క. అటుగానఁదలఁప నీకే మిటనింతకొ అంతలేదు మేల్మేలు భవ
త్పటుకావ్యహారమునకును ఘటియింపుము నాయకమణిగా రంగపతిన్.

సీ. ఘనుఁడు మీ ముత్తాత కవ్యహోబల మంత్రి గజపతి సభనుతుల్ గాంచి మించె
మీ తాత గోవింద మేదినీసురుఁడు రాయలచేతఁ గాంచె స్వర్ణాభిషేక
మనఘుఁడు మీ తండ్రియును బాండ్యచొక్కనాథానీశ్వరునకు నాప్తుఁడయ్యె
నీపూర్వవంశజుల్ నెలకొని రాయసంస్థానంబున నె కీర్తినవధరించి

గీ. రనుచు లోకప్రసిద్ధులై తనరిరిగద నీవు వారలవలెనె యనేకకావ్య
నాటకసమగ్ర రచనలమేటివైతి ....................

వెంకటాచలకవి పై విధముగఁ జెప్పుకొన్నను, నాతని వచన రచనలుకాని నాటకములుగాని లభ్యముకాలేదు. వచనకావ్యరచనకు శ్రీకారముచుట్టిన మధురరాజ్యమునకు సంబంధించినవాఁడగుటచే నీతఁడు వచనకావ్యములు రచియించుట సంభావ్యమే యగుచున్నది. ఈతని కృతులలో లభ్యమైన రెండే - ఈ మిత్రవిందాపరిణయ మొకటి, రెండవది కార్తికమాహాత్మ్యము.

## మిత్రవిందా పరిణయము

ఇది యారాశ్వాసముల ప్రబంధము. మిత్రవిందా కృష్ణులవివాహ మిందలి యితివృత్తము. ఆశ్వాసాంతగద్య.

"ఇది శ్రీమదలమేలుమంగనాథ వేంకటనాథ దయాసమేధమాన చతుర్విధ కవితాధురంధర, మంత్రియుగంధర కుందుర్తి రామయ మనీషిపుత్ర, ఆపస్తంబసూత్ర, శాండిల్యగోత్రపవిత్ర నిరసూయాపర

కవివరవిధేయ కథాశుకవి వేంకటాచలకవి నామధేయ ప్రణీతం
బైన మిత్రవిందాపరిణయంబను మహాప్రబంధంబునందు సర్వంబును
షష్ఠాశ్వాసము.”

ఈతఁడు తనగురువగు రేవూరి కాళహస్తి దేశికు నిట్లు నుతించినాఁడు.

సీ. అష్టభాషామహితాశు ప్రబంధనిర్మితచాతురీధుర్య శతసహస్ర
లేఖినీలేఖ్య కలితకవిత్వాపాద నాహృతవ్యస్తాక్షరాది చతురుఁ
జలజిహ్వాకాచలాచల జిహ్వాకాచల జిహ్వాకారచనా విశేషనిపుణు
నోష్ఠ్యనిరోష్ఠ్యవరోదర్ణకల్పనుఁ గతినత్రిపాద సంఘటనకుశలు

గీ. నఖిలలక్షణ లక్ష్యసిద్ధాంతపాణి నీయకాణాద కాపిలానేక తంత్ర
కోవిదుని రేవురి కులాబ్ధికుముదబంధుఁ జెలఁగి మది కాళహస్తి దేశికుభజింతు.

ఈ కాళహస్తి దేశికుఁడు గాధేయోపాఖ్యానాది మహాప్రబంధ
ములు రచియించిన రేవూరి అనంతయకగ్రజన్ముఁడు. అనంతయ చరిత్ర
మున నీతని యుదంతము తెలియఁగలదు.

మిత్రవిందా పరిణయమునందు కథాక్రమము :

శ్రీకృష్ణుఁ డష్టమహిషులలో నొకర్తెయగు మిత్రవిందను పెండ్లి
యాడుట యితివృత్తముగల మిత్రవిందాపరిణయమున, ప్రథమాశ్వాస
మున, అవతారిక, కవివంశానుక్రమణిక, షష్ఠ్యంతములు, కథాప్రారం
భము, అవంతీపుర వర్ణనము, పుష్పలావికాజనవర్ణనము, రాజవర్ణనము,
రాజనీతి, వేంకటాచల వర్ణనము, శేషాద్రివర్ణన వచనము, గ్రీష్మఋతు
వర్ణనము, వర్షర్తు వర్ణనము, శరదృతు వర్ణనము, శేషశైలాధినేతృ
వర్ణనము గలవు.

ద్వితీయాశ్వాసమున దాహృదవర్ణనము, మిత్రవింద బాల్య
క్రీడాభివర్ణనము, యౌవనదశాభివర్ణనము, వసంతవర్ణనము, వనవిహారము,
వనవిహారరగడ యనునవి గలవు.

తృతీయాశ్వాసమున కాసారవర్ణనము, కాసారవర్ణన వచనము,
జలక్రీడాభివర్ణనము, మనోజపూజాభివర్ణనము, చిలుక రాయబారము
అనునవి గలవు.

చతుర్థాశ్వాసమున మురహారువర్ణనము, జయసేన కుమారికా వర్ణనము అనునవి గలవు.

పంచమాశ్వాసమున అస్తమయవర్ణనము, జ్యోత్స్నాభివర్ణన వచనము, చంద్రదూషణ సూర్యోదయ వర్ణనములును గలవు.

షష్ఠాశ్వాసమున మిత్రవిందాభివర్ణన వచనము, వసుదేవకుమార వర్ణనము, రణాభివర్ణనము, రణరంగవర్ణన వచనము, రత్నాకరవర్ణనము, మిత్రవిందా వివాహము అనునవి గలవు. ప్రథమాశ్వాసమున 149, ద్వితీయాశ్వాసమున 121, తృతీయాశ్వాసమున 75, చతుర్థాశ్వాసమున 147, పంచమాశ్వాసమున 86, షష్ఠాశ్వాసమున 145, మొత్తముమీఁద 723 పద్యములు గలవు. ఇందు గద్య సంప్రదాయములుగల వచనములు తప్ప వేఱులేవు. ప్రాచీనకవుల పోకడలు ముఖ్యముగా రాసురాజభూష ణునివి పెక్కులు గలవు. మింత్రవిందా స్వయంవరమునందలి రాజవర్ణన నైషధ కావ్య వర్ణనము ననుసరించినది. దీనిని 'వర్ణనప్రబంధ' మని చెప్పనగును.

ఇందు లక్షణ విరుద్ధములైన, 'కరఁగినీరై పడీని,' 'ఎల్లానుకూర్చేది' మొదలగు ప్రయోగములున్నను నవి యుత్తరాంధ్ర కృతులలో సామాన్యమే. గనుక ప్రత్యేకముగ పరిగణింపఁదగినవి కావు.

ఈ గ్రంథము క్రీ. శ. 1888 సంవత్సరమున "అముద్రిత గ్రంథ చింతామణి" పత్రికాధిపతులచే నెల్లూరిలో నొకసారి మాత్రమే ముద్రితమై ప్రకటితమైనది.

## కార్తిక మాహాత్మ్యము

రెండవకృతియగు కార్తికమాహాత్మ్యము తీర్థపురపాలకుఁడును బల గోలు లింగారెడ్డి కుమారుఁడును నగు వేంకటాచలనృపుని యానతిచేఁ గోపాలస్వామి కంకితముగా రచితమైనది. ఈ తీర్థపురి నేఁడు 'తుర యూరు' అనుపేర వాడుకలోనున్నది. ఇది తిరుచనాపల్లిజిల్లాలో నా పట్టణమున కిరువదేడుమైళ్ళదూరమున నున్నది. కార్తికమాహాత్మ్యమున నీ తీర్థపురి యిట్లు వర్ణితమైనది.

"సీ. ఏ రాజధానికి నిరుచక్కి గోపాల వేంకటాచలపతుల్ వెలయుచుండు
నేపురి మధ్య సందీపితుండగుచు నందీశ్వరుండు వసించు గృపను మనుప
నే పట్టణం బయోధ్యాపురంబునకు జోడై పరాభేద్యమై యలరుచుండు
నేపుట భేదనం బాపూర్ణ రుచి రాష్ట్రలక్ష్మి నివాసమై లలిఁజెలంగు

గీ. నట్టి తీర్థపురీ పాలనాతివేల ధర్మపథవర్తి చంద్రికా ధవళకీర్తి
తార్క్ష్యవాతాత్మజ ధ్వజాద్య ఖిలబిరుద విజితచక్రాయుధార్జున విభవుఁడతఁడు"

"ఆ పురపరిపాలకుఁడు పాండ్య గజకేసరి బిరుదాంకుండు రాయ వేశ్యాభుజంగుఁడు పంటకులకలశ పాథోనిధాన రాకాతమీన బలకోలు లింగనృప పుంగవకులపాలికా పేర్యంబికా నిర్భరగర్భశుక్తి ముక్తాయమా నుండునగు వేంకటాచల మహీమహేంద్రుండు"-కవిని బిలిపించి యీ క్రిందివిధముగా బలికినట్లు గ్రంథమునఁగలదు.

"మ. నను శ్రీవేంకట భూధరాధిపకృపానాణీయకల్లోలసం
జనతానేక మహాప్రబంధరచనా సంశీలు, విద్వజ్జనా
వన పాండిత్యవిశాలుఁ బాండ్యధరణీపాల ప్రదత్తాశ్వకాం
చనచంచచ్చతురంతయానమణి భూషాళాలిసెంతేఁదయన్.

సీ. ఆంధ్రభాషను ప్రౌఢయనుమాత్రమే కాదు సంస్కృతంబున నీవు సరసమతివి
లక్షణగ్రంథసారము లెఱుంగుదుపైన లక్ష్యముల్ నీకు లాలాజలములు
తతచతుర్విధ కవిత్వప్రౌఢి నీసొమ్ము నవరసప్రతులు నీ నవ్యకృతులు
నీ దీవనలు సమున్నిద్ర సంపదలిచ్చుఁ బూజలందితివి భూభుజులచేతఁ

గీ. జాటుకృతులును బహువిధనాటకములు బంధురితశార్థ పూర్ణప్రబంధములును
రచనఁగావించి దేవతార్పణముఁజేసి పాండ్యవిభుచేఁ బ్రభుత్వసంపదలుగనితి

గీ. అనఘ' కార్తికమాహాత్మ్య మాంధ్రభాష గబ్బమొనరించి మదభీష్టకలనఁ జెలఁగ
బంధురకృపాలహరికి గోపాలహరికి నంకితమొనర్పు నిదియె మా కభిమతంబు

## కృతిపతి వంశీయులు రెడ్డికులజులు

గ్రంథావతారికలోఁ గృతిపతి తాతయగు నల్లారెడ్డి స్కాంద పురాణము నాంధ్రమున రచించెనని యిట్లు చెప్పఁబడియున్నది.

క. శ్రీవేంకటాచలాధిప దేవునకున్ మండపములు దివ్యోత్సవముల్
గావించె స్కాందమాంధ్రముఁగా వర్తిలఁ గృతియొనర్చి ఘనతవహించెన్.

ఇందలి యాశ్వాసాంతగద్య: ఇది శ్రీయలమేలుమంగాసనాథ వేంకటనాథ దయాసమేధమాన చతుర్విధకవితాధురంధర శ్రీకరపంటవంశప్రశంసితోజ్జ్వల బలగోలు లింగనృప పుంగవి భారత్యావలంబ వైర్యంబికాగర్భయశః పారావారపూర్ణతారానాథ తీర్థపురాధార వేంకటాచల భూపాలప్రదత్తమహత్తరాంబరాభరణ కల్యాణపల్యంకికాది బహుబహూకరణవిరాజమానానసమాన సంపత్ప్రవర్తి కుందుర్తి రామయమనీషిపుత్ర, ఆపస్తంబసూత్ర, శాండిల్యగోత్రపవిత్ర, నిరసూయాపర కవివిధేయ కథాశుకవి వేంకటాచల నామధేయప్రణీతంబైన[1]కార్తిక మాహాత్మ్యంబునందుఁ బ్రథమాశ్వాసము.

ఇందలి కవితాశైలినిఁ దెలియుటకు నొకపద్య ముదాహరించుచున్నాను.

ఉ. ఎందుకుఁ గోపమో సరసిజేక్షణ యెక్కడడాగినావయో
ఇందుముఖీవతంసమ ! యొకించుక ముందరవచ్చినిల్వవే
బృందసుధారసంబొసగ వేపికవాణి చలించుచున్న నా
డెందము చల్లసేయదె కడింది తనంబులు మానిమానినీ !

## కృతిపతి వంశచరిత్రము

కృతిపతి వంశీయులు రెడ్డికులజులని ముందు దెల్పితిని.

ఈ రెడ్డిరాజులు పంటరెడ్లు – తొలుత నెల్లూరి మండలమున పల్లవోలిసీమ వీరి కాపురము. ఆ వెనుక శ్రీకృష్ణదేవరాయల కాలమున, అన్నారెడ్డి, సూరారెడ్డి అను నిరువురు సోదరు లాతనికడ నాయకులై కొలువు చేయుచుండిరి. కృష్ణదేవరాయలు దక్షిణదేశము జయించిన వెనుక కొల్లడమున కుత్తరమునగనుండు 'ముత్తైనాడు' 'తీర్థగిరి' ప్రదేశములలో దోపిడిగాండ్ర యొత్తిడి యధికముగ నుండుటచే నీ యన్నదమ్ము లిరువురిని వారి నణఁచుటకుఁబంపెను. వీరా ప్రదేశమున నిశ్శేషముగ

1. ఈ గ్రంథ మముద్రితము – దీనికి యొక్కటియే తాళపత్రప్రతి గలదు. అది కాకినాడలో ఆంధ్రసాహిత్య పరిషత్పుస్తక భాండాగారమున గలదు.

దొంగలభయము లేకుండఁజేసినందున నా తీర్థగిరి ప్రదేశమును వీరికి సర్వమాన్యముగా రాయలవా రొసగిరి. ఆ తీర్థపురికి నరవమున "తురయూరు" అని పేరు కావుననే వీరికి "తురయూరు[1] రెడ్లు" అని పేరు వచ్చినది. సోదరు లిరువురు నా ప్రదేశము నభివృద్ధిపఱచి సంస్థానముగా నేర్పఱచిరి. సోదరు లిరువురిలో సూరారెడ్డి వెనుక యీ క్రిందివారా సంస్థానమును బాలించిరి.

(1) కుమార యెఱ్ఱమరెడ్డి — క్రీ. శ. 1547–1582
|
(2) పాపిరెడ్డి — క్రీ. శ. 1582–1597
|
(3) ఎఱ్ఱమరెడ్డి — క్రీ. శ. 1597–1632
|
(4) లింగారెడ్డి — క్రీ. శ. 1632–1667
|
(5) నల్లపరెడ్డి లేక నల్లారెడ్డి — క్రీ. శ. 1667–1696
|
(6) లింగారెడ్డి (భార్య పోరమ) — క్రీ. శ. 1696–1708
|
(7) వేంకటాచలరెడ్డి — క్రీ. శ. 1708–1740

కృతిభర్తయు కృతికర్తయు "వేంకటాచల" నామధేయులగుట యిందలి విశేషము.

వేంకటాచలరెడ్డి కుమారుఁడు – కుమార వేంకటాచలరెడ్డి క్రీ. శ. 1740 లో రాజ్యపాలన ప్రారంభించినాఁడు. ఈతఁడు క్రీ శ. 1772 వఱకు రాజ్యము చేసిన వెనుక నీతని కుమారుఁడు విజయ వేంకటాచలరెడ్డి క్రీ. శ. 1820 లో మెకంజి దొరవారికిఁ దమ సంస్థానచరిత్రను [2]రచియించి పంపినాఁడు. అది తమిళభాషలో నున్నది. దానినుండియే పై విషయములను నేను గ్రహించితిని.

1. తురయూరు – మెకంజీ దొరవారి సంగ్రహములందును, స్థానిక చరిత్రలయందును తురైయూరు సంస్థాన చరిత్రయందును దీనినిగూర్చి చక్కఁగా తెలియవచ్చుచున్నది. ఆ చరిత్ర ననుసరించి తురైయూరు రెడ్డిరాజుల వంశవృక్షమును, వారు పాలించిన కాలపరిమితిని పైని చూపితిని.

2. Mackenzie Collections 17–6–10 Section 5 Account of Turaiyur Samstanam.

వేంకటాచలరెడ్డియు విజయరంగ చొక్కనాథుఁడును సమకాలికు లని స్పష్టపడుచునేయున్నది. వేంకటాచలకవి కార్తికమాహాత్మ్యము ముద్రితమైన నింకను విశేషములు తెలియఁగలవు. ఇందు నీతిదాయక ములును భక్తిప్రదములునగు నుపాఖ్యానములు కార్తికమాన మాహా త్మ్యముతోఁగూడ ధారాళశైలిలో వర్ణితములైనవి.

## బాలసరస్వతి

[1]ద్విపదభారత కవిత్రయములో బాలసరస్వతి సభాపర్వమును మాత్రమే రచించెను.

అందు పర్వాంతగద్య యిట్లున్నది:

“ అసమసాహిత్య విద్యాచతుర్ముఖుఁడు
రసికుండు బాలసరస్వతీశ్వరుఁడు
పసనొనర్చిన సభాపర్వంబునందు
నసదృశంబుగ ద్వితీయాశ్వాసమయ్యె.”

ఈతని కుమారుఁడగు తిరుమలకవివలన నీతని యుదంతము కొంత తెలియనగును.

“ జయశాలియగుచు సెసంగిన శ్రీవి
జయరంగ చొక్కరాజాధీశునగర
ననుభవించుచునుండు ననఘుని పేర
శ్రీలచేఁ దనరుచు నృపవర నిత్య
లాలితుండయిన బాలసరస్వతి మఖి
సుత ముఖ్యుఁడగు.........తిర్మలకవి. ”

అని చెప్పుకొనుటచే బాలసరస్వతి తిర్మలకవి తండ్రియనియు నాతఁడు విజయరంగ చొక్కనాథునికాలమున క్రీ. శ. 1706-31 వఱకు విలసిల్లినట్లు నిశ్చయింపవచ్చును. ఈతని రచన సరళముగనుండును.

---

1. ద్విపదభారత కవిత్రయమనఁగా అతుకూరి తిమ్మన – బాలసరస్వతి – అతుకూరి సోమన యను మువ్వురుకవులు.

# రేపూరి కవికుటుంబము : రేపూరి అనంతకవి

మధురనాయక రాజుల కాలములో దక్షిణదేశమునకు వెడలి యచట స్థిరపడి యశస్సునించిన యాంధ్ర విద్వత్కవి కుటుంబములలో రేపూరివారి వంశమొకటి. వీరు వెలనాటివైదికులు. ఆపస్తంబ సూత్రులు, కౌండిన్యగోత్రులు. వీరి వంశవృక్షము.




1. కాళహస్తికవి : వంశమునకు మూలపురుషుఁడు.

2. కాళహస్తికవి : శ్రీమదప్పయ దీక్షితులవారి శిష్యుఁడు. కంచి కామాక్షీదేవి భక్తుఁడు. వసుచరిత్రను సంస్కృతభాషలో రచించిన కవి. కుందుర్తి వేంకటాచలకవి గురువు. చూడుఁడు మిత్రవిందాపరిణయావతారిక.

3. అనంతయ్య : మైసూరి చెంజిరాజులచే సన్మానితుఁడు. గాధేయోపాఖ్యానమును వృద్ధాచల మాహాత్మ్యమును శేషార్యోదాహరణమును నీతని కృతులు.

4. ఏకామ్రకవి. ఈతఁడు సంస్కృతభాషలో గొప్పకవి. క్రీ. శ. 1620 ప్రాంతముననున్న ఇమ్మడి జగదేవరాయని కనిష్ఠ సోదరుఁడగు నంకుశేంద్రుని కొమారుఁడు ఇమ్మడి అంకుశేంద్రునికి నంకితముగా సత్యాపరిణయము, జాంబవతీపరిణయము నను రెండు కావ్యములు రచియించినాఁడు.

5. అనంతయ : శ్రీముష్ణమాహాత్మ్య, శివరహస్య ఖండకృతికర్త.

ఈ కవులందఱును క్రీ. శ. 1609 నుండి 1750 ప్రాంతముల వఱకును విలసిల్లినవారు. పై వారిలోఁ దెలుఁగు కవులనుగూర్చి తెలుపుచున్నాను.

## రేవూరి అనంతయ్య

### గాధేయోపాఖ్యానము

ఇది మైదాశ్వాసముల పద్యప్రబంధము. [1]వీరేశలింగము పంతులు గారి కవులచరిత్ర మీకవి కాలమును దెల్పకపోవుటయే కాక యీతని యింటిపేరు 'తాళ్ళప' వారనిమార్చి యీగ్రంథ మేకాశ్వాస శృంగార ప్రబంధమని చెప్పుచున్నది. ఇందుకుఁ గారణ మప్పటి కీకృతి పూర్తిగా లభింపకపోవుటయే యని యూహింపఁదగియున్నది. ఈ కావ్యము కృతి నందిన బదిర కృష్ణభూపాలుఁడు తన్నుఁగూర్చి చెప్పినట్లుగా గ్రంథావ తారికలో నిట్లు వ్రాసికొనెను.

సీ. ఘనమౌనికులమాన్య కౌండిన్యగోత్ర పవిత్రుఁడాపస్తంబ సూత్రమహిత
గతిహారిరేవూరి కాళహస్తికవీంద్ర పుత్రు లింగకవీంద్ర పుత్రుఁగాళ
హస్తిమహాకవి యనుజన్ము నేకామ్రకవిశిఖామణి గుర్వ కవితిలక శి
వానందసుకవుల కగ్రజన్ముని ఘటికాశతగ్రంథ సంఘటకు శేషి

గీ. నీశతకగణ్య కవితాప్రకాశకుని ది
నప్రబంధను నను ననంతుఁ ............

పైదానినిబట్టి "యీకవి యింటిపేరు రేవూరివారు. ఇతఁడువైదిక బ్రాహ్మణుఁడు. కౌండిన్యగోత్రుఁడు. ఆపస్తంబసూత్రుఁడు. కాళహస్తి కవికిఁ బౌత్రుఁడు. లింగకవికిం బుత్రుఁడు. కాళహస్తి మహాకవికిఁ దమ్ముఁడు. ఏకామ్రకవి గుర్వకవి శివానందకవులకు నన్న, ఘటికాశత గ్రంథకర్త, దినైక ప్రబంధకర్త" యని తెలియుచున్నది. మఱియు నీతని పౌత్రుఁడగు ననంతయజ్వ తన శ్రీముష్ణమాహాత్మ్యమున నీతని నిట్లు వర్ణించెను.

---

1. వీరేశలింగము పంతులుగారి కవులచరిత్ర 3-వ భాగము. సంఖ్య 96 పుట 260, 270. ముద్రణము 1949.

సీ. ఐదేండ్లనాఁడె వేదాదివిద్యలునేర్చి విభులమెప్పించె గర్వితులనణఁచి
యష్టప్రాయమునాఁడె యష్టభాషలఁ జతుర్విధకృతుల్ ధరవినిర్మించినిలిపె
ఘటికాశతదినైక ప్రబంధముల మైసూరిచెంజిండ్ల మెచ్చులుఘటించె
నూఱుఘంటములకై నోరారఁగఘనాఘనంబనఁగవిత మిన్నందఁబలికె

.. గీ. నేకసంధావధృతధృతానేకవిబుధ దుర్గ్రహగ్రంథ సాహస్రతూర్ణతుష్ట
మండలాధీశ దత్తసన్మానబాల కవియనంతేంద్రు నెనత్రిలోకములఁగలరె.

పితామహునియందలి గౌరవముచే నతఁ డిందు గొంత యతిశయోక్తి చెప్పెనని యూహించినను ననంతయ వైదుష్యకవిత్వ సామర్థ్యములు గొప్పవియని మాత్రమేకాక, యాతని కాలముకూడ తెలిసికొనుటకు నిది యాధారమని చెప్పనగును.

ఈ కావ్యముఁ గృతినందిన యాతఁడు బదిర కృష్ణభూపాలుఁడు. శూద్రజాతియందలి 'కంపళ' యనునది యీతని కులమైన ట్లీక్రింది పద్యము చెప్పుచున్నది.

వంశవర్ణన ప్రారంభమునఁ దొలిపద్యము :

సీ. ముల్లోకములయందుఁ గల్లోలవతి తనయందు సముత్పన్నయై చెలంగ
ఆదిత్యమండలం బహరహంబును దన సన్నిధానంబునె సారెకోర
దోషాకరప్రభాస్తోమంబు తనచేత నవనీతిమగుటెందు నధిగమింప
నాశ్రితాళులఁజేర నరిగెడునెడల భవ్యాసక్తితనకు నవ్యాహతముగఁ

గీ. జిత్రచారిత్రమైన లక్ష్మీశకళత్ర చరణశతపత్రమునఁ దుర్యజాతికుశల
ధుర్యరీతిఁ జనించె నందునుతిఁగాంచె కంబళంబనుకులము సత్కర్మఫలము.

గాధేయోపాఖ్యాన కృతిభర్తయగు కృష్ణభూపాలుఁడు,

గీ. ... ... ... ... ... ... ... .. ..., కవిననంతుఁ
దనరుచిరబోధయుతమనోవనరుహమునఁ దనరు నెనరువఁ గనుఁగొని—యనియెనిట్లు:

క. "ఆలింతురో లాలింతురో పాలింతురో మూఢజానపదులతులరస
శ్రీలాలితమోహన పాంచాలీలాలిత్యనిత్య చంచత్కవితల్.

మ. తనరన్ మజ్జనకుండుఁ ద్వజ్జనకుఁడున్ దారావళీదండకా
ద్యనవద్యద్భవదీయ చాటుకృతులందారావళీ దండకాం
చనకీర్తుల్ గని కాంచనాంబరగజాశ్వగ్రామభూషాదులం
దనియన్ నిన్ను బహూకరించిరిగదా! తాత్పర్యధుర్యాత్ములై.

చ. సుమతులకెక్కు నీదుమృదుసూక్తులయందు మరందకందళం
బమరుటయెంతవింత? వినుమా నిను! మాబిరుదంచునెంచు మా
కమితరసాను సారసముదార భవత్కృతి కన్యకాపతి
త్వముసమకూర్పుమా! మతిపితామహతా మహనీయవర్తనా!

క. ముఖ్యాద్యర్థరతిశ్రుతి పాఖ్యావహ సంస్కృతాంధ్ర సందర్భోద్య
ద్విఖ్యాతిగ గాధేయో పాఖ్యానము కృతియొనర్పుమా మాకనయన్.

అని [1]గాధేయోపాఖ్యానము ప్రబంధరూపమున రచింపుమని యానతిచ్చెను.

గద్య: ఇది శ్రీమద్వామదేవ సేవాహేవాకప్రభావాకలితలలిత కవితా వైభవ, లింగకవితనూభవ నిరంతరతత్త్వ చింతనానంతార్య ప్రణీతంబైన గాధేయోపాఖ్యానంబను మహాప్రబంధమునఁ బంచ మాశ్వాసము.

ఈప్రబంధమున విశ్వామిత్రుఁడు రాజ్యముచేయుట, వసిష్ఠుని యావునడుగుట, మొదలుగా ఘోరతపస్సుచేసి యాతనిచే బ్రహ్మర్షి యనిపించుకొనుట యను నంతవఱకునుగల కథాభాగ మతి ప్రౌఢముగా సరసశైలిని వర్ణింపఁబడినది. శైలి తెలుపుటకు నీ కావ్యమునుండి రెండు పద్యము లుదాహరించెదను.

1. గాధేయోపాఖ్యానమునకుఁ జెన్నపురి ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారమున నాలుగు ప్రతులు గలవు. అందు 482, 483 సంఖ్య గలవి సంపూర్ణప్రతులు. 494 R 186 అసంపూర్ణప్రతులు. ఈ గ్రంథము పూర్తిగా ముద్రణము కాలేదు. ఇందులోని పంచమాశ్వాసమునకు మాత్రము, పూర్వ ముద్రణ మొకటియు, శృంగార గ్రంథమాల లోని రమణీయ ముద్రణ మొకటియుఁ గలవు. మఱియు నీ గాధేయోపాఖ్యానము నైదాశ్వాసముల ప్రతి యొకటి సంపూర్ణముగా నాంధ్రసాహిత్యపరిషత్తులో నున్నది.

శా. ఏకాలంబున దీనిఁగట్టువిడ నీకెవ్వారలున్నారయో
మాకీలారమునందు దీనినిడినన్ మాకింపుసంధిల్లదో
నీకున్ వేడిన వేళనిచ్చిమగుడం జెప్పించుకోమో ? వృథా
మాకున్ గోపము రేఁచితిందుఁ దరమే మమ్మున్ని వారింపఁగన్.

ఉ. ఏమనవచ్చునీమహిమ యీమహిమాద్రిగిలాతలాధిప
గ్రామణికిట్టిగోమణి యొకండును గల్గదమేల్గడాఘనుం
డీమునిదీనినింబడసె నిమ్మెయినిమ్మెయి నింతకంటెమే
లేమొదవున్ మహాత్మునకు నేమొదవున్ మఱిదీనిఁబోలునే

## [1]వృద్ధాచల మాహాత్మ్యము

తురయూరును క్రి. శ. 1632–67 వఱకు పాలించిన లింగారెడ్డి కీ గ్రంథ మంకిత మీయఁబడినది. ఇతని భార్య యెఱ్ఱాంబికను వృద్ధాచలేశ్వరుఁడు ప్రత్యక్షమై తనకు వెంగనూరిలో నాలయము కట్టింపుమని కోరినట్లామెవలన విని యాస్వామి కాలయము కట్టించిన ట్లిందు వర్ణింపఁబడినది.

ఈ వెంగనూరు వెంగళమునకు సమీపమున 'పెరంబలూరు' తాలూకాలోనున్నదని తెలియుచున్నది. ఈ వెంగళము తిరుచినాపల్లి మండలములోనిది. కవి యీ కృతినాయకుని "బల్లవోల్ శాసనుఁడు. జగదగోవాళ, రాయవేశ్యాభుజంగుఁడు, పాండ్యగజకేసరి, విశుద్ధపంట వంశపావనుఁడు" మొదలుగాఁగల విశేషణములతో వర్ణించియుండుటచే నితఁడుగూడఁ బాండ్యభూపాలుని సామంతులలో నొకఁడు.

శైలి కొకపద్యము :

శా. ఆరూపంబుఁ గనుంగొనన్వెఱచి నేత్రాంభోజముల్ మూసియా
శౌరిన్ బ్రహ్మముఖామరుల్ ప్రణతులై స్వామీ ! కటాక్షింపవే
యీరూపంబుఁ గనుంగొనంగఁ గలమే యేమెల్ల మాదృగ్దృగ
జ్ఞారాధ్యంబగురూపుఁ జూపఁగదవే యర్ధేందుచూడామణీ !

1. గ్రంథరచనాకాలమునాఁటికి లింగారెడ్డి తురయూరును వీడి వెంగనూరును రాజధానిగాఁ జేసికొనెను.

## శేషార్యోదాహరణము

నల్లందిగళ్ వంశజుఁడగు శేషార్యుని ప్రశస్తిని వర్ణించు నీ లఘు కృతిని బాలకవి యనంతయ రచించినట్లుగా గ్రంథాంతమున నిట్లుగలదు.

క. చెలంగు నుదాహరణంబిది నలసన్నిభ బాలకవి యనంతయనీకై
వెలయించి దీనిఁగైకొను నలఘుసమున్మేష తిరుమలాచార్యుని శేషా!

ఈ యుదాహరణమునుగూర్చి నేను రచించిన యుదాహరణ వాఙ్మయచరిత్రయందు జూడనగును. అందీ యుదాహరణము నాచేతఁ బూర్తిగఁ బ్రకటితమైనది. దీని విషయమంతయు నందుఁ గాననగును.

## రేవూరి అనంతయ (బాలకవి) శ్రీముష్ణమాహాత్మ్యము

ఇది యైదాశ్వాసముల పద్యప్రబంధము. దీనిని రచించిన యతఁడు రేవూరి అనంతయజ్వ, ఇతఁ డాపస్తంబసూత్రుఁడు, కౌండిన్యగోత్రుఁడు, వైదికబ్రాహ్మణుఁడు, బాలకవి బిరుదాంకితుఁడు, మహాకవియు మహా పండితుఁడును నగు పై యనంతార్యునకుఁ బౌత్రుఁడు. కాళహస్తికవికిఁ బుత్రుఁడు. ఇతఁ డీగ్రంథమును వెంగుళము కృష్ణమహీంద్రుని యానతిచేఁ దెనిఁగించి యాతనికే యంకితమొనర్చెను. ఈ విషయమంతయు గ్రంథావతారికలోని యీ క్రింది పద్యమువలనఁ దేటపడఁగలదు.

మ. అనఘున్ ధీనిధి బాలకవ్యుదిత పూర్వానంత పౌత్రున్ జగ
జ్జనగేయోదయ కాళహస్తికవి భాస్వత్పుత్రునిఁ గౌండిన్యపా
వనగోత్రాంకు ననంతనామునను నాపస్తంబసూత్రున్ బ్రియం
బున రావించి సుధారసౌఘముల సొంపుల్ గుల్కఁబల్కన్ దయన్.

సీ. ఏవీటనిరవొందు నేప్రొద్దు దారాపురీశ్వరనాముఁడై విశ్వవిభుఁడు
ఏపురంబున నుండుఁ గాపురంబుగ గౌరిసౌందరనాయికా సముచితాఖ్య
నేప్రోలుపాలించు నెలమిఁబెట్టనికోట యగుచుఁ గూత్తాండారు జగమెఱుంగ
నేనగరంబున నింపునింపు ననంత విద్వత్కవిస్తోమ విశదఫణితి

గీ. నట్టివెంగుళ మాత్మీయరాజధానిగామిఱు నాచంద్రతారకముగ
భరితజగనొబ్బ గండాది బిరుదశాలి వరదరాజేంద్రు కృష్ణభూపాలమౌళి.

క. శ్రీముష్ణ మహత్త్వం బభిరామంబది తెనుఁగు సేసి రహిఁ జెక్కు జగత్
క్షేమంకర కృతి మచ్ఛుభ నామాంకితముగ నొనర్చి నైపుణిఁ గనుమా.

ఆంధ్రసాహిత్య పరిషత్తున దీని కొక్క ప్రతిమాత్రమే గలదు. అది మిక్కిలి చక్కని వ్రాఁతలో సంపూర్ణముగానున్నది. కవిత్వ శైలి యెంతయుఁ బ్రౌఢమై మనోహరముగా నున్నది. స్వయంవ్యక్తంబులై ప్రసిద్ధిఁగాంచిన వేంకటాచల శ్రీరంగ శ్రీకాకుళ కుంభకోణ బ్రహ్మపురాది క్షేత్రంబులలో నొకటియగు శ్రీముష్ణంబను పుణ్యక్షేత్రముయొక్క మహత్త్వ మిందు వర్ణింపఁబడినది.

శైలికి నుదాహృతులు :

శా. నానా నారదమౌని కిట్టులనియెన్ నానాన నారాజు నా
నానా నారత భోగయోగములఁ గానంబూన మూఢాత్ముఁడన్
గానన్ లౌకిక వైదికోచితగతుల్ గానన్ ననున్ నీవదే
వా ! నీ వానిగ నెంచి మంచి గతి యెట్లా నట్టు శిక్షింపవే.

సీ. అతివేల రతిశీల గతియేల ననఁజాలఖల కాండముల దండ నిలువకుండ
వరమాన హారమైన సురయానక యమాన నలతాపములతాప కలనఁ బాప
ధన దానమున దీన జనమాననముఁ బూన బలుకల్ల పలుకల్ల పలుకనొల్ల
శరవారఁ బరదార హరనార భటి జేరఁ గులవృత్తముల నుత్తములను హత్త

గీ. మందమానస మజ్ఞాన బృందమాన మాన దీమాన దీక్షైదమాన మదము
శరమధో లేఁడు నీపాటి పరమయోగి కావు నను గావు నను ముక్తి గలుగఁజేసి.

## శివ రహస్య ఖండము

అను శైవమతగ్రంథ మీతఁడు రచించినదొకటి యాంధ్రసాహిత్య పరిషత్తులోఁ గలదు. ఇందుఁ దొమ్మిదవ యాశ్వాసమునఁ దుదిపత్రములు గొన్ని లేవు గాని యిది తొమ్మిది యాశ్వాసముల గ్రంథమని నిర్ణయింపనగును. మిగిలియున్న భాగము మంచి స్థితిలోనే యున్నది. ఇది కోడూరి వేంకటాచలకవి రచించిన శివరహస్య ఖండముకంటె వేఱయి యాతని కృతికిఁ బిదప రచియింపఁబడినది. మహాస్కాంద పురాణాంతర్గత

మగు నీ భాగమును దెలిఁగించి తీర్థపుర (తుఱైయూరు) నందీశ్వరున కంకిత మొనర్చెను. దీనింబట్టి యితఁడు తిరుచనాపల్లికి సమీపముననున్న "తుఱైయూరు" అను గ్రామమున నున్నవాఁడని యూహింపఁదగి యున్నది.

ఇందు సంభవము, ఆసురము, వీరమహేంద్రము, యుద్ధము నని నాలుగు కాండములు గలవు. సంభవ కాండమున నాలుగాశ్వాసములు అసుర వీరమాహేశ్వరకాండముల నొక్కొక్క యాశ్వాసమును, యుద్ధ కాండమున మూఁడాశ్వాసములును గనఁబడుచున్నవి. ఈ రెండును శివక్షేత్ర మహాత్మ్యమును, శివమాహాత్మ్యమును తెలుపునవియైనను వీనియందుఁ బెక్కు చక్కని యుపాఖ్యానములును ప్రబంధోచిత వర్ణనములును ప్రౌఢముగా సంతరింపఁబడినవి. శైలిఁ దెలుపుటకు రెండు పద్యము లుదాహరించుచున్నాఁడను.

ఉ. అమ్మకచెల్ల ! యంచలివి యడ్డమునిల్చెఁ జనంగనీక యీ
నెమ్మియుఁ బింఛముల్ నిబిడ నిర్వృతి విప్పుచు నోలమాసయై
సొమ్మసిలంగఁ జేసెనిది సొంపునఁ బెంచిన నాకె విఘ్నతల్
గ్రుమ్మఁగాఁ దొడంగెనని కొమ్మయొకర్తు చనెల్ విభుంగనల్.

ఉ. బొమ్మలపెండ్లిసేయు చొకబోటిగిరీంద్ర సుతాకళత్రుఁడా
యిమ్ములరాజవీధిఁ జనుచేర్పడఁ గాంచి వినిద్రరోమయై
సొమ్ములుపెట్టు చొప్పసఖిఁ జూచి విపర్యసనంబు గల్గఁబో
పొమ్మనిపంచి తాను మదిపొందకవచ్చె గవాక్షరేఖకుల్.

## బద్దెపూఁడి ఎఱ్ఱభూపతి

విజయరంగ చొక్కనాథుని కాలమునే, శేషము వేంకటపతి తారాశశాంకవిజయము వెలయించిన కాలమునే, బద్దెపూఁడి పురాధ్యక్షుఁడగు నెఱ్ఱభూపతి యీ కథను 'యువజన హృదయానందమను' పేరిట నొక ప్రబంధముగా రచియించి యున్నాఁడు. ఇందు రెండాశ్వాసములు మాత్రమే లభించినవి. ప్రథమాశ్వాసము నవతారికనుండి యీ క్రింది విశేషములు తెలియుచున్నవి.

ఈతఁడు చతుర్థకులజుఁడు – కలువకొండ గోత్రుఁడు వంశక్రమము

పోతరాజు
|
మూర్తిరాజు
|
ఎఱ్ఱ మహీపతి
|
కృష్ణ మహీపతి (మీనాంబ)
|
ఎఱ్ఱ భూపాలుఁడు కృతికర్త

పై విషయము లీ క్రింది పద్యములవలనఁ దెలియుచున్నవి.

క. శ్రీరమ్యసారవైభవ గోరాజ్ఞిభు కలువకొండ గోత్రపవిత్రుఁ
సూరిజన స్తుతిపాత్రుని భూరి గుణు ...... పోతన నెంచు౯.

క. ... ... ... ... ... ... ... ... మూర్తి పార్థివధుర్యు౯
శ్రీవరపాద సరోరుహ సేవాసిధి రిపుమదేభ సింహునిఁ దలఁతు౯.

గీ. ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ...
టతుల ఘనకీర్తినమిత శౌర్యాప్తమూర్తి మూర్తినృపవర్యు నుతియింతుముదముమీఱ

గీ. ... ... ... ... ... ... ... ఎఱ్ఱభూవరతనూజు
మజ్జనకు కృష్ణమహీకాంతు నుదిఁదలంతు

క. వినుతింతు మీన మాంబ౯ జనసన్నుత శుభచరిత్ర
... ... ... ... ... ...

తక్కిన కవులవలెఁ దమపూర్వులింతటి వారంతటివారని చెప్పక వారినందఱిని నిష్టదేవతాస్తుతిలో దేవతలవలె స్తుతించుట యెంతయు సమంజసమై యున్నది. మఱియు నీదృశరచన క్రొత్తయనియే చెప్ప వచ్చును.

ఇకఁ గవిస్తుతిలో నొక్కరేవూరి యనంతయను మాత్రమే యిట్లు పేర్కొన్నాఁడు.

ఉ. పాయనిభక్తిమద్గురుల పాదసరోరుహయుగ్మమున్న పా
ధ్యాయతనొప్పునప్పురధరామరవర్యుఁ దలంచి, భారతీ
నాయకతుల్యు రేవురి [illegible] గొల్చి, భూరితే
జోయుతులైన సత్కవుల సొంపుదలిర్పనుతింతు నెప్పుడున్.

ఈ రేవూరి యనంతయ గాధేయోపాఖ్యాన, శ్రీముష్ణ మాహాత్మ్య, శివరహస్యఖండకృతులను రచియించిన మహాకవి. ఈతని గూర్చి యీ వఱకే తెలిపితిని.

ఈ గ్రంథమంతయును లభ్యముకాలేదు. కాని యుపలబ్ధమైన దానిని బట్టిచూడఁ గవిత్వము జాతీయమై జటిలత్వము కలిగియుండును.

క. పొలుపగునని మదిఁ బొగడుచు కలికోకతతి నతని నెలమిఁ గవయఁగఁదలఁచున్

... ... ... ... ... ... ...

క. మనసేకన్నికపై నీకెనసున్నది చెప్పితేని యిప్పుడెదానిన్
నినుఁగూర్చి పెండ్లిచేసెదనని మెల్లనఁ జంద్రుతోడ హాస్యమొనర్చెన్.

చ. వనితయుఁ దానునేఁగి హిమవత్ప్రముఖాఖిల భూధరంబులన్
వినుతసరస్తటంబులను [illegible]గా
ఘనపులినంబులన్ బదరికాగహనాది మహావనంబులన్
మునులరుదందునట్టి తపముల్ సలిపెన్ గడునిష్ఠమీఱఁగన్.

ఉ. అక్కజమైనధైర్య మహిమాతిశయంబులుకల్గు నింద్రునిం
గుక్కటమై యహల్యకడఁ గూయఁగఁజేసెఁ బ్రతాపశాలియై
మిక్కిలినొక్క దర్పకుఁడు మెత్తనివాని సుధాంశువేడ్క నా
ప్రక్కనుజొక్కి పావురపుఁ బల్కులుపల్కఁగఁ జేయఁజాలఁడే.

గద్య : ఇది శ్రీమద్రామభద్ర పాదారవిందసుందరమకరంద పానతుంది
లేందిందిరాయమానమానస, నిత్యసమారాధిత ప్రభాకరచరణ
సారస, నిరంతరావార్యశౌర్య, మహదౌదార్య, సముపార్జిత
సంగ్రామార్జున జగనొబ్బ గండ, గండరగండ, నిశ్శంకమల్ల
చౌహత్తమల్ల, దోహత్త నారాయణ, గుజ్జరిదళవిదారణ సుక
విజనస్తుత్య, పల్లవాదిత్య, కలియుగ భేతాళ, గాతాగోవాళ

జాళియామాళియాబందీకార, చంచుమలచూఱకార, బసవ శంకర కేతనాంక, సమరనిశ్శంక, బలాత్కారాపహృతపాండ్య రాజసప్తాంగ, త్రిభువనరాయ శ్యాభుజంగ, వేధనకనకమణి గణప్రపూరిత బుధజననికేతన పరభయదగరుడకేతన, కేళాది రాయ కనకకర్పూర వసంతరాయాది మహనీయ బిరుదవిచక్షణ, శ్రితజనసంరక్షణ, పంటవంశపయఃపారావార తారకాకళత్ర కృష్ణమహీమహేంద్రపుత్ర, దినేశసంకాశప్రకాశ, మధురదేశాధీశ, విజయరంగ చొక్కనాథధరానాథ వితీర్ణసువర్ణదండప్రకీర్ణ ధ్వజచ్ఛత్రపల్యంకికాప్రముఖ బహువిధ రాజలక్షణానుషంగ, బుధవిధేయాంతరంగ, బద్యపూఁడి పురవరాధ్యక్ష యెఱ్ఱభూపాల హర్యక్ష ప్రణీతంబైన యువజనహృదయానందంబను శృంగార ప్రబంధంబు.........[1]

# వెలఁగపూఁడి కృష్ణయామాత్యుఁడు

## భానుమద్విజయము

ఈతఁడు తనగ్రంథమున నిచ్చిన వివరములు.

వెలఁగపూఁడివారి వంశవృక్షము.

లోహితస గోత్రము

1. అన్నయ




1. ఆంధ్రసాహిత్యపరిషత్పుస్తక భాండారము గ్రంథ సంఖ్య 390, రౌద్రి సంవత్సర వయ్యాశి నెల ౧౮-వ తేది గురువారము పద్యభాండాగారము వేంకటకృష్ణ రాజువారి స్వామిరాజు వారితమ్ముడు తిరుపల్లిని వ్రాసినది.




పై వంశవృక్షమునకు సంబంధించిన చరిత్రాంశములు.

1. ఈ వంశమున తొలివాఁడగు 'అన్నయ' జన్నావులవారి మంత్రి. ఈ జన్నావులవారి వంశమున కసవానాయనింగారు క్రీ. శ. 1414 లో మాచెర్ల చెన్నకేశవ దేవాలయమున వరువుంబనిచేయించినట్లు శాసనమున్నది.[1] క్రీ. శ. 1515 లో కృష్ణరాయలకాలమున కొండవీటి దుర్గరక్షకులలో జన్నావుల కసవాపాత్రుఁడు గలఁడు.

2. అన్నయ కొడుకులలో మొదటివాఁడగు నాబళుఁడు విశ్వపతి రాయ మంత్రియై ధనము గాదెలను నింప నాతని వంశీయులు గాదె వారైరి. ఈతఁడు మధురరాజ్య సంస్థాపకుఁడగు విశ్వనాథనాయకుఁడు కాఁదగును.

3. ఎఱ్ఱమంత్రి చింతపల్లి సొంతముగ నేలుటచేత యాతని వంశీయులు చింతపల్లి వారైరి.

4. రామరాజు 'వెలఁగపూఁడి' కాణాచిగా చేసికొనుటచే నావంశీయులు వెలఁగపూఁడివారైరి. కృతికర్త యీ వంశీయుఁడే.

5. గోపన, ఉత్కళదేశాధీశుఁడగు ప్రతాపరుద్ర గజపతి దండెత్తి వచ్చినపు డాతని బలమును పిడుగువలె సంహరించుటచే నాతని వంశీయులు పిడుగు[2] వారైరి.

6. అన్నయపౌత్రుఁడు గౌరన పలనాటిలో 'దేశపాండ్యా' అధికారమును బొంది, తన యన్నకుమారుఁడగు రామరాజున కొసగెను.

7. హనుమంతుని కొడుకు రామలింగము, పలనాటిసీమకు 'దేశపాండ్యా' యై మిక్కిలి పేరుగడించెను. ఈతఁడు వెలుగోటివారి వంశీయులలో దరిసికుమార యాచమహీపతికి నాప్తమిత్రుఁడై యుండెను.

---

1. No. 580 South Indian Inscriptions Vol. 10, Page 32.

2. పిడుగు మల్లన కుమారుఁడు వేంకటకవి రచించిన విప్రనారాయణ చరిత్ర మను నొక ప్రబంధము (అసమగ్రము) తంజావూరి పుస్తకశాలలోఁ గలదు. కవి యీ వంశీయుఁడే కాఁదగును.

8. కృతికర్త పినతండ్రి 'కొండయ' మిగుల పరాక్రమశాలియై పాండ్యమండలమున పాళెగార్లచే కప్పములు గొనెను.

9. కృతికర్త తండ్రి నరహరి విజయరంగ చొక్కనాథునిచే నీ క్రిందివిధముగా సమ్మానితుఁడయ్యెను.

క. శ్రీవిజయరంగచొక్క మహీవరకరుణాకటాక్ష వీక్షణగుణ సం
భావితగజాంతవరలక్ష్మీవిభవుఁడునై నరహరి మీఱుఁ జేడ్కన్.

క. బంగరుమొలాముగంటము సింగారపుపెండిడెమొరయు క్షితిబిరుదుగమీ
అంగని సముఖము సంప్రతి యంగుగఁ గావించె నరహరయ్య నెలంగన్.

10. నరహరి బావయగు బొప్పూడిసాంబయ్య పాండ్యరాజుల దళవాయి నలుబదినాలుగు లక్షలవఱ లెడి పాండ్యభూమి నేలిన విజయరంగ చొక్కనాథునిచేత బహుముఖముగ సమ్మానింపఁబడినవాఁడు. ఈతని ప్రశస్తి; బలపరాక్రమములు.

సీ. సరిబేటి యార్కాటి సాదులాఖానుతో ఘటియించె నెవ్వాఁడు ఘనతమీఱ
పేర్మితంజాపురీపేషునా ఆనందరావును నెవ్వాఁడు రహినణంచె
మయసూరి నంజరాజయగారి ప్రియవాక్య సంధికి నెవ్వాఁడు శక్తిదాల్చె
నలువదివేల్బంట్లు నాల్గువేల్గుఱ్ఱముల్ కనికొల్చె నెవ్వాని కలిమిబలిమి

గీ. నతఁడుతగు నాజిజితవైరి యత్యుదారి సత్త్వసంయుక్తగుణహారి సత్త్వసీరి
తిలకితపురారి బొప్పూడికులబలారి సదుపకారి శ్రీదళపతిసాంబశౌరి.

మ. తనభేరీనినదంబొకింత వినినంతంజెంజి తంజాపురీ
ఘనపూర్వాంబుధి తీరపట్టణములార్కాడాది శ్రీరంగ ప
ట్టణముం గేరళపట్టణంబులును జిట్టాడంగనుత్తుంగ కీ
ర్తిని గాంచెన్ క్షితిసాంబసైన్యపతి యుద్దీప్తప్రతాపోన్నతిన్.

ఆతని దానధర్మములు :

సీ. వేదశాస్త్రపురాణవేది ధరామరలకితాగ్రహారంబులను ఘటించి
హరిహరదేవాలయస్థిరగోపుర ప్రాకారసన్మంటపములొనర్చి
సర్వవిద్యాభ్యాస సంవత్సరగ్రాస రక్షితపాఠశాలలురచించి
సకలదేశాగతజన మనోరంజన ప్రవరాన్నదాన సత్రములనుంచి

గీ. రమ్యపానీయశాలికారామకూప దీర్ఘికాతటాకాదుల దివ్యముగను
కరముసవరించెఁ గీర్తిదిక్తతులమించఁ బాండుదళవాయిమేటి సాంబయ కిరీటి.

గ్రంథావతారికలోఁ గృష్ణయప్పై సాంబయదళవాయి కుమారుఁడగు గోవిందామాత్యుఁడును, శాసనరచయితయు మంత్రియు నాతని కుమారుఁడునగు శివరామయ్య[1]యును దన్నీగ్రంథము రచింపుమని ప్రోత్సహించినట్లుగా నీ క్రిందివిధమునఁ జెప్పియున్నాఁడు.

సీ. పాండ్యభూమండ లాఖండలుండైన విజయరంగచొక్కభూజాని కాప్త
మండనుండగుసాంబ దండనాథాగ్రణి తనయులలో మేటి తంత్రియగుచు
సంగీతసాహిత్య సంస్కృతాంధ్రకవిత్వ మర్మజ్ఞుఁడై మేనమఱఁదియగుచుఁ
గొమరొప్పబాపూడి గోవిందయామాత్యుఁ డనుపమ విద్యాధికార్యసభను
గీ. నిండుకొలువుండెనపుడు నేదండఁజేరి సరససల్లాపములుమీఱి చతురమతిని.

... ... ... ... ... ...

క. శ్రీవిద్యానిధియగు లక్ష్మీవరగోవిందమంత్రి శివరామయగా
రేవేళఁబొగడవినుమా నీవైఖరి యేకవీంద్రునికి లేదైనన్.

ఉ. నీవుఘటించుసత్కృతికి నేఁబతినయ్యెదనంచుశంకరుం
డేవివరించె నింకనొకటేమిదలంచంగ నున్నదట్లనే
భావముమీఱసల్పు మనవారియనుజ్ఞయు నీశ్వరోక్తియున్
గేవలభుక్తిముక్తియుక్తులకుఁ గీర్తికి కారణమంచునెంచుచున్.

ఆవెనుక నాత్మకులంబువారలను బ్రస్తుతిసేయుట సంప్రదాయమని పై వంశమును విపులముగా వర్ణించియున్నాఁడు.

---

1. క్రీ. శ. 1739 సంవత్సరమున (9. 2. 1739) మీనాక్షి పరిపాలనా కాలమున తిరునల్వేలి మండలమున శీవలప్పేరి లేక ముద్దు వెంకటలక్ష్మీపతి భూపాలసముద్రము గ్రామమునగల దానశాసనమును వ్రాసినది, శివరామయ. ఇది తెలుగు శాసనము. అనుబంధములో దీనిని ప్రకటించినాడను.

**No 81. A Telugu Copper-plate grant of Queen Minakshi Saka 1660. Travancore Archeological Series Vol. VI, Part II Pages 229-234.**

ఈ గోవిందప్పయ్యగారును తండ్రివలె, దండనాథుఁడై మీనాక్షీదేవి, బంగారు తిరుమలరాజుపై యుద్ధమునకు వెడలినప్పుడు, సైన్యాధిపత్యము వహించి యాతనోడించెను. పై అధస్సూచిక యందుగల నివేదిక పుట 231.

## వాఙ్మయచారిత్రకాంశములు

భానుమద్విజయావతారికయందు కవి తనపూర్వులు పెక్కు కృతులు రచియించిన ట్లీవిధముగాఁ జెప్పియున్నాఁడు.

క. భూనుతగాంగేయోపాఖ్యానసుమంతోదయాంధ్ర కర్ణామృతముల్
మానితవజ్రభుజోపాఖ్యానము శుభహేతుసేతు మహాత్మ్యంబుల్.

క. దత్తాత్రేయచరిత్రల్ సత్తగుమర్యాద రామసచివచరిత్రల్
చిత్తరపుఁగృతులుచేసిన యుత్తమకవులెల్ల మీకులోద్భవులగుటల్.

పై కృతులలో 1. గాంగేయోపాఖ్యానము, 2. సుమంతోదయము, 3. ఆంధ్రకర్ణామృతము, 4. వజ్రభుజోపాఖ్యానము, 5. సేతుమాహాత్మ్యము, 6. దత్తాత్రేయ చరిత్రము, 7. మర్యాదరామన చరిత్రము అనువానిలో 'ఆంధ్రకర్ణామృతము' అనునదిమాత్రమే లభ్యమగుచున్నది. ఇదియే 'శ్రీకృష్ణకర్ణామృతము,' లీలాశుకయోగియని నామాంతరముగల బిల్వమంగళుని సంస్కృతగ్రంథమునకుఁ దెలుఁగుసేఁత. దీని రచయిత వెలఁగపూఁడి వెంగయామాత్యుఁడని యాశ్వాసాంత పద్యములవలనఁ దెలియుచున్నది.

ఇది కృష్ణాశ్రమయోగిపుంగవ కృపావీక్షాత్తసారస్వతా
భ్యుదయ శ్రీవిభవప్రభావచిదచిద్బోధక్షమాశాంతి స
త్యదయాభూషణ వెల్లపూఁడి మణిపెద్దామాత్యవెంగాగ్రణీ
గదితాశ్వాసమగుల్ దృతీయమగుచుల్ గర్ణామృత శ్రీకృతిల్.

పై పద్యమునుబట్టి యాతఁడు వెలఁగపూఁడి పెద్దయామాత్యుని కుమారుఁడని మనకుఁ దెలియుచున్నది. పై వంశవృక్షములో నీ పెద్దయామాత్యుఁ డెవరో గ్రహించుటకు వెంగనామాత్యుని కాలమును దొలుతఁ దెలిసికొనవలెను. ఒక కృష్ణకర్ణామృత ప్రతియందు విలేఖకుఁ డిట్లు వ్రాసియున్నాఁడు.

క. శ్రీమత్కర్ణామృత కృతి ప్రేమంబున వెల్లపూఁడి వెంగన తెనుఁగుం
గామాల్యఁగూర్చె దీనిన్ రామబ్రహ్మేంద్ర మానిరాట్టు లిఖించెన్.

గీ. శాలివాహ నాఖ్యశక వరుషములు వెయ్యిన్ని యాఱునూఱు నిరువదేడు
పరగ చనిన పిదప పార్థివ వత్సర మార్గశీర్షమందు వ్రాసినాము.

శాలివాహన శకము 1627 అనఁగా క్రీ. శ. 1705 సంవత్సరమున 'రామబ్రహ్మము'అను నాతఁడు దీనిని వ్రాసియుండుటచే నీతఁ డంతకుఁ

బూర్వుఁడు. కాని కృష్ణకర్ణామృతమును క్రీ.శ. 1560 ప్రాంతముల సుప్రసిద్ధ లాక్షణికుఁడు లింగమగుంట తిమ్మన తన సులక్షణసారమున నుదాహరించు టచే నీతఁడు క్రీ.శ. 1530 ప్రాంతమువాఁడు కావలెను. పై వంశవృక్షముతో నీ కాలపువారు గౌరమంత్రి, అతని కొడుకు పెదసర్వాయ. వెంగామాత్యుఁడు పెదసర్వయనే పెద్దయామాత్యుఁడని పేర్కొనియుండును. పెద్దయామాత్యుని నాల్గవతరమువాఁడైన హనుమంతుఁడు క్రీ. శ. 1690 ప్రాంతమువాఁడగుటచేఁ దరమునకు ముప్పదియేండ్లు లెక్కించిన నీ కాలము సరిపోవుచున్నది.

ఆంధ్ర జనతాకర్ణామృత స్యందియగు కృష్ణకర్ణామృతమునుండి యొకపద్య ముదాహరించుచున్నాను.

శా. బాలున్మంజులతాలవాలుఁ జపలాపాంగోల్లసల్లీలునిన్
గాళిందీపులినాఁగణ ప్రణయ శృంగారైక ఖేలున్ శుభ
శ్రీలోలున్ గరుణావలోకనసుధాశీలున్ వినీలప్రభా
జాలున్ గొల్చెద రామణీయక రసస్వారాజ్య పాలున్మదిన్.

ఈ గ్రంథమునకు వచనము మహిమలూరి రంగయామాత్యుని కొడుకు వేంకటకృష్ణుఁడు వ్రాసెను. ఈతఁ డాపస్తంబసూత్రుఁడు, శాండిల్య గోత్రుఁడు, పరమహంస పరివ్రాజకాచార్య సదాశివ తీర్థపాదుని శిష్యుఁడు, వేణుగోపాల పాదభక్తుఁడు, దక్షిణ ద్వారకయగు మన్నారుగుడి నివాసుఁడు.

భానుమద్విజయకర్త యంతకుమున్ను తానీ క్రింది గ్రంథములు రచించినట్లు చెప్పుకొనియున్నాఁడు.

సీ. మహిలోన మాలినీ మాధవీయమనంగ శృంగార కావ్య మెసంగఁజేసి
గౌళికా శాస్త్రంబు కడు లోకహితముగా నెనయ నేకశ్వాసమున రచించి
పరిఢవిల్లఁగఁ గంద పద్యపు శతకంబు నాల్గు యోగంబుల ననువు పఱచి
మీఱిన వేదాంతసార సంగ్రహ శాస్త్రమమరంగ వచనకావ్యంబొనర్చి

గీ. చాటు కృతులను మఱికొన్ని సంఘటించి మామకాకింత మొనరించి మంచిపుణ్య
శాలియనఁగీర్తిగాంచిన సత్కవీంద్ర!మధురవాక్సాంద్ర! కృష్ణయామాత్యచంద్ర!

వీనిలో గౌళికాశాస్త్రమను బల్లిపలుకు శాస్త్రము ముద్రితమైనది. అందు కవిపేరు లేదు. ఆ కృతి యీతనిది. తక్కినవి లభ్యములు కాలేదు.

## భానుమద్విజయము

ఇది యుత్తర కాశీఖండమందలి కథను గైకొని వర్ణన ప్రధానముగ రచితమైన యైదాశ్వాసముల ప్రబంధము. భానుమంతుఁడను విప్ర కుమారుఁ డుజ్జయినిరాజు కొమార్తెయగు పద్మావతిని బెండ్లియాడుట యిందలి యితివృత్తము. ఈ ప్రబంధమున యోగశాస్త్రవిషయ మైదవ యాశ్వాసమున విపులముగా నున్నది. గ్రంథకర్త దక్షిణా మూర్తి యవతారమని ప్రసిద్ధిఁజెందిన రామచంద్ర పరమహంస శిష్యుఁడు, దక్షిణామూర్తి మంత్రోపాసకుఁడు, అద్వైత వేదాంతవేత్త ఈ విషయములు గ్రంథాద్యంతములనుండి యిట్లు తెలియుచున్నవి.

ఆది :

శా. శ్రీవిద్యాకరమై, ప్రమోదకరమై, సిద్ధాంత సంసేవ్యమై,
కైవల్యస్థితి భవ్యమై, విమల విజ్ఞానైక సంవేద్యమై
జీవాత్మైక కృదాద్యమై, శ్రుతి శిఖాసిద్ధాంత శుద్ధాంతమై
ప్రావీణ్యంబునఁ శాంతమై తగు పరబ్రహ్మంబు భావించెదన్.

అంతము :

మ. సకలాధారున కప్రమేయునకు నాసాగ్రస్థిరీ భూత దృ
ష్టికి గ్రంథిత్రయ భేదనాతి చతుర శ్రీరాజయోగాది స
త్తకవిజ్ఞానిక ఖండ సౌఖ్యద సుషుమ్నామార్గ ముఖ్య ప్రచా
రిక సంరక్షిత దేవహాని తతికిన్ శ్రీదక్షిణామూర్తికిన్.

ఇందలి గద్య : ఇది శ్రీమద్దక్షిణామూర్తి కటాక్షలబ్ధ చతురకవితాచిత్ర సుకవిజనమిత్ర, ఆపస్తంబసూత్ర, లోహితగోత్ర, వెల్లపూఁడి నారసింహార్య పౌత్ర, నరహరి మంత్రిపుత్ర, కృష్ణయామాత్య ప్రణీతంబైన భానుమద్విజయంబను మహాప్రబంధంబునందు సర్వంబును బంచమాశ్వాసము.

భానుమద్విజయ టీక :

ఈ గ్రంథమునఁ గథ శృంగారమైనను గ్రంథకర్త యోగవేదాంత విషయములనుజేర్చి రచించుటచేత టీక యావశ్యకమైనది. ప్రస్తుతము దీనికిఁగల టీక, గ్రంథకర్తయే రచియించియుండవచ్చును. ఏలయనఁగా గ్రంథమున సులభమైన ఘట్టములకు వ్యాఖ్యలేదు. క్లిష్టమైన పద్యము లకు, ముఖ్యముగా యోగపద్ధతి ప్రపంచితమైన పంచమాశ్వాసమునకుఁ టీక విపులముగా నున్నది. సరళమైన వ్యావహారికభాషలో నున్నది.

[1]మొదటిపద్యము టీక : శ్రీ = పూజ్యమైనటువంటి, విద్యా = బ్రహ్మవిద్యకు, ఆకరమై = ఆధారమై, ప్రమోదకరమై, ఆనందకరమై, సిద్ధ = జ్ఞాన పరిపూర్ణులయొక్కయు, ఆళి = పరంపరలకు, సంసేవ్యమై = ఉపాసన చెయ్యతగ్గదియై, కైవల్య, స్థితి, భవ్యమై = మోక్షార్హమై నటువంటి, ఉనికిచేతను మనోజ్ఞమై ; విమల = స్వచ్ఛమైనటువంటి, విజ్ఞాన = విశేషమైన తెలివిచేతను, సంవేద్యమై = తెలుసుకోతగ్గదై, జీవ = చేతనకున్నూ, ఆత్మ = పరాత్మకున్నూ, ఐక్యకృత్ = ఏకీభావము చేసుటకు హేతువైనదై, ఆద్యమై = మొదటిదైనదై, శ్రుతిశిఖా = ఉపనిషత్తులయొక్క, సిద్ధాంత = రాద్ధాంత మార్గములకు, శుద్ధాంతమై = అంతఃపురమై, ప్రావీణ్యంబున = నైపుణ్యముతోటి, కాంతమై = ప్రకాశించేటిదై, తగు = ఒప్పేటి, పరబ్రహ్మంబు = పరతత్త్వస్వరూపమును, భావించెదన్ = ఉపాసన చేసెదను.

ఈ [2]కృతి తమిళభాషలోనికి భాషాంతీకరింపఁబడినదఁట.

---

1. పై పద్యమున టీక వ్యావహారిక భాషలోనున్నది. ప్రాచీనకాలమున టీకలు, వ్యాఖ్యానములు మున్నగునవి వ్యావహారిక భాషలో నుండుటయే సంప్రదాయము.

2. భాషోద్ధారకులు బ్రౌనుదొరగారీ కావ్యమునుగూర్చియు టీకనుగూర్చియు నిట్లు వ్రాసిరి.

The nuptials of Padmavati also called the adventures of Banumantha written about the year 1740 or 1760 A. D.

This entertaining and useful book is extremely rare as it belongs to the saiva creed, where as the vishnu is creed prevailing in the Telugu country. Fragments of it occur everywhere, but I never met with more than two manuscripts.

This poem is translated into Tamil, perhaps from Telugu. The title is affixed to it is Tamil Ariyum Perumal.

This is a learned and useful commentary and sufficient as regards the more difficult passages : but the easier passages are omitted, the minute commentary on the Transcendental Philosophy, (Yogasastramu contained in 5th canto is placed in another volume (ప్రా. భా. సంఖ్య 606-612.)

# శ్యామరామకవి

## రామాయణ వచనము

శ్యామరామకవి రచించిన రామాయణములో బాల అయోధ్యా కాండములును, అరణ్యాకాండము పూర్తి 75 సర్గలకును తెనుఁగు వచనము లభ్యమగుచున్నది. కవింగూర్చి గ్రంథమున నిట్లున్నది.

"......సాహిత్య విద్యాగోష్ఠి ప్రసంగంబున నాశ్వలాయన సూత్రుండును, వాసిష్ఠగోత్ర సంభవుండును, కృష్ణయామాత్య పుత్రుండును, షడ్దర్శనీ పారంగతుండును, లక్ష్మీపతి నామధేయాగ్రజు ననుజుండును, సంస్కృతాంధ్ర భాషాకవితా నిర్వాహక సకల పారంగతుండును, అసహాయ శ్యామరాయ విద్వత్కవియగు నన్నుం బిలిపించి చతుశ్శాస్త్ర పండితుండవు, కవికుల తిలకుండవు......కళావల్లభుండని కొనియాడి కర్పూర తాంబూలం బొసంగి" కృతిపతియైన సుబ్బరాయశెట్టి పలికిన ట్లున్నది. సుబ్బరాయశెట్టి "శ్రీ కాంతిమతీ శాలివాటీశ్వర కరుణాకటాక్ష ప్రశమిత సకలాంతరాయుండును, సేతు హిమాచల మధ్యవర్తి విద్వత్కవి నికరసంస్తూయమానుండును, దక్షిణకాశీతట తామ్రపర్ణీతీరస్థిత నిరంతర సత్రాన్నదాన సమ్మోదమాన భూసురాశీర్వాద సంప్రాప్త సమేధమానోత్తుంగ శతాంగ మాతంగతురంగ పదాతిసంగత నవరత్న విరాజిత మందిరుండును, చతురుదధిముద్రిత విశ్వవిశ్వంభరావలయ పరిపాలన రాజాధిరాజ సన్మానితుండును, సకలగుణగణాలంకృతుండును, వాసవకన్యకా వరప్రసాద శాశ్వతైశ్వర్య విలాసుండును, వైశ్యకులరత్న రత్నాకరుండు పరిసెట్లగోత్ర సంభవుండును, తుమ్మలపాటి మన్నారుశెట్టి పౌత్రుండును, మణప్పార వేంకటకామిశెట్టి పుత్రుండును, నిజసుకృత విశదీకృత మహనీయ పాతివ్రత్యాది గుణకదంబయగు కృష్ణమాంబావధూ గర్భశుక్తి ముక్తాఫలుండును............గురుమూర్తి సహోదరుండును ............ శ్రీ విజయరంగ చొక్కనాథమహీవర కరుణాకటాక్షవీక్షణ పాత్రుండును, వణిగ్గ్రణియగు సుబ్బరాయ వైశ్యధౌరేయుండు"

ఈ శ్యామరామకవి విజయరంగ చొక్కనాథుని కాలములోనివాఁడై యుండియు సుబ్బరాయశెట్టితో "......శ్రీమద్రామాయణంబు వచనకావ్యంబుగాఁజేయుమని పలికితివి, నీవు కృతార్థుండవైతివి. తొల్లి వాల్మీకీయ రామాయణ మహాకావ్యంబు భాస్కరకవి పద్యకావ్యంబుగా రచన చేయించె, రంగనాథకవి ద్విపదకావ్యంబుచేసె, నితరు లెవ్వరును వచన కావ్యంబుగా రచనచేయనిది నీవు నేను జేసిన పుణ్యంబుగా నీపేర నంకితంబుగా రచన చేసెదనని" (కవిపలికి)... నవరసాలంకారంబుగాఁ జాతుర్వర్ణాశ్రమజన సంఘంబులు పఠియింప యోగ్యంబుగా శ్రీమద్రామాయణంబు చేయం బూనినాఁడు.

ఈ గ్రంథము వ్రాఁతప్రతిలో నారణ్యకాండ మొక్కటియే యున్నను, బాలకాండము మొదట నుండఁదగిన యీ క్రింది పీఠిక కృత్యాది పద్యములు నిక్కడఁ జేర్చుట మన కీయొక్క కాండమేకాక యన్ని కాండములును రచియింపఁబడినవని స్పష్టమగుచున్నది. కృత్యాది పద్యములు వ్రాసిన 12 పత్రములలోని వ్రాఁత యొక్కనిది. తక్కిన కథాభాగము వ్రాఁత వేఱొక్కనిది. ప్రతి సర్గమునకును "ఇది శ్రీమదారణ్యకాండంబునందు అసహాయ శ్యామరాయ విరచితంబను వచన కావ్యంబునందు పదారునొకటవ సర్గార్థము" అని యిట్లు కలదు. ఆరణ్యకాండము సర్వమును డెబ్బదియైదు సర్గలున్నది. సప్తసంఖ్యను దెనుఁగులో "ఏడు" అనిన రోదన సంఖ్య యని పేరుపెట్టి ఛాందసముగా ఆఱునొకటి యనుట కలదు. అట్లే యిక్కవియుఁ బదారునొకటి యని చెప్పినాఁడు. ఆయా సర్గముల ప్రారంభముననను,

క. జాయాహరణానంతర కాయజసంతాపజాత ఘనతరచింతా
భూయోన్వేషణ లక్ష్మణధీయుత వచనాభిరామ తేజోరామా! 13 సర్గము.

క. రాక్షస కృపాణ విదళిత పక్షద్వయ పాదజాను పార్శ్వ కరోటీ
కుక్షివిలోచన చంమాపక్షీక్షణ మోక్షదాన భాగ్య నిదానా! 67 సర్గము.

క. భీకరకబంధబంధన సాకల్య భుజ ప్రసార సంగ్రహ వార్తా
ఢౌకన లక్ష్మణరాజ ద్రాకా శశికీర్తిజాల! రామనృపాలా! 20 సర్గము.

ఇట్లాయాతావుల కథాసూచనము విషయసూచికవలెఁ బద్యములు చేర్చినాఁడు. మొదట శ్యామరామకవి పద్యకవిత్వము గొంత చూపి తర్వాత వచనరచనఁ జూపెదను.

క. శ్రీతులసీ దామోజ్జ్వల వాతాత్మజ సేవితాంఘ్రి వనరుహ యుగళా
కాతర నత జన కైరవ! శీతల గుణసాంద్ర సోమ! శ్రీరఘురామా!

సీ. ఎవ్వని మదినెంచ నిందిరా దేవియు మందిరంబుననుండి మహిమ లొసఁగు
నెవ్వని నుతియింప నీప్సిత కవనంబునిచ్చి శారదయు సన్నిధి యొనర్చు
నెవ్వని బింబంబు నీక్షింప నింద్రియ గ్రామంబు లన్నియుఁ గదలకుండు
నెవ్వని నామంబు నెన్నుచో జనులకు బహు పుత్రలాభంబు పరఁగు చుండు

గీ. అతఁడు శ్రీరాముఁ డఖిల సన్నుత చరిత్రుఁ డాశ్రిత వనవసంతుండు నబ్జజాది
వినమ దమర ముకుట తట వివిధ రత్న కాంతి కలిత పదయుగుండు కాంతి నొసగు.

సీ. ఎవ్వనిప్రాయంబు మవ్వంబుఁదోఁటకు దీర్ణాంగతాటకదృష్టియొముక
యెవ్వని కరకరికిక్షుఖండముగదా చండీశుకోదండ దండవరము
ఎవ్వనిబాణాగ్ని కింధనమ్ములు గదా యతికాయకుంభకర్ణాసురతతి
యెవ్వని విశిఖదారేందీవరాక్షికిఁ బంక్తికంఠునితలల్ బంతులాట
లతఁడు శ్రీరాము ... ... ... ... ...

శా. శ్రీమత్కోసలరాజు ప్రేమ నిజలక్ష్మీకాంతి కైసేయఁగాఁ
గామార్థంబులు ధర్మమోక్షము లిలంగాంక్షింపదానీయఁ గా
సీమాతాత్రితదయావిశేషఘనుఁడై చేదోయిపద్మంబు చే
ధామశ్రీసరు సుబ్బరాయకృతి నేతంబ్రోచిశ్రీలీవుతన్.

క. శ్రీవేంకటాద్రి నేతయు భావంబునఁదన్నుఁదలఁచు భక్తుండగు నా
ధీవరుని సుబ్బరాయని, కావిశ్రుత... కీర్తికాంతులనొసఁగున్.

మ. శరమావిష్ణువు బ్రహ్మసారథియు నశ్వంబుల్మహావేదముల్
పరగన్ ధారుణితేరు సూర్యశశులుంబండ్లొప్పధానుష్కుఁడా
పురముల్ గూర్చినజోదు నాసుకృతినిన్ బొందొప్పశ్రీలాదిగా
సిరిమాణిక్య మహాధనాఢ్య జయలక్ష్మిప్రాప్తిగాఁజేయుతన్.

సీ. తీగచెంగటనున్న తిలకవృక్షముమాడ్కి బలువిల్లుమూపునఁ బరగువాఁడు
కాడతోఁజెలువొందు కమలంబుతెఱఁగున గరమునఁజెన్నొందుశరమువాఁడు
కరుణారసమ్ములు కనుఁగవనలరంగ జిఱునవ్వుమోమునఁ జెలఁగువాఁడు
పాదనేఁకుఁజేరు పవనజుకరమునఁ గైదండగైకొని కదలువాఁడు
రాజపుత్త్రుఁడొకఁడు వత్స ! రార ! యనెడి పలుకులను నను(బిలువఁగ భక్తితోడ
జేరవనుగలలోనను జెఱగునంది యేమిపనియనంగను దానునిట్టులనియె.

"నాదుచరిత్రము నీవును నాదరమునఁ దెనుఁగుఁజేయు" మని చెప్పినాఁడఁట. వచనశైలికి: ఏకాదశసర్గ ప్రారంభము:

క. సీతాసాంత్వనపూర్వక ఘాతుకరక్షస్సమూహ ఖండనవార్తా
జాతాదరవన్యాచర, చేతోనయనాభిరామ ! శ్రీరఘురామా !

"దండకారణ్యంబునఁ జనునప్పు డగ్రభాగంబున శ్రీరామదేవుండు మధ్యంబునందు సుమధ్యమయగు సీతాకాంతయుఁ బిఱిందిదెసబాణ బాణాసనంబులను పాణిచేరాణించు లక్ష్మణుం డనువర్తించి చనునపుడు నా రాజకుమారు లిరువురు నానావిధములగు పర్వతములమధ్య ప్రదేశములు వనములు వింతవింతలై రమణీయంబగు నదులంజూచుచు సీతాకాంతామణితోడంగూడి చనునపుడు ఆ నదీ మధ్యభాగమునఁ జెలువలరు నిసుకదిబ్బలందు సంచరించు బెగ్గురులు జక్కవలు జలంబునందు జనతములగు నీరుకోళ్లు నీరుకాకులతోఁగూడి తామరలచే తనరారు కొలంకులు గుంపులుగుంపులుగా సంచరించు జింకలను మదగర్వితులై గొప్పలగు కొమ్ములచేఁ గొమరొప్పు వృషభములను గారెనుపోతులను వనవరాహములను జెట్లనువిఱిచి పడవైచు వేతండములను నవలోకించుచు దూరంబగు మార్గంబునుంగడచి సూర్యుం డస్తగతుండగు సమయంబున సహస్రదళములచే సంకులంబగు పద్మములు నూఱురేకులచేఁ బొలుపారు పుష్కరంబులనెడి తామరసహితంబున సమీపదేశంబున సంచరించు సామజములచే సమలంకృతంబును యోజనదూర విశాలంబగు తటాకంబునందు గీతంబు వాదిత్రంబు నాట్యవీణ మర్దలంబు పిల్లఁగ్రోవి కంచుతాళంబనెడు చతుర్విధవాద్యముల నాదంబు వినంబడునపుడు నచట నొక్కనింగానక" ఇట్లు 151 పత్రములలో నారణ్యకాండముగలదు.[1]

---

1. ఆంధ్రసాహిత్య పరిషత్పుస్తకభాండాగారమున బాల అయోధ్యాకాండములును నరణ్యకాండమును గలవు. గ్రంథసంఖ్య 168.

# వెలిదండ్ల అళఘరికవి

కవుల చరిత్రమునకెక్కని యీ దాక్షిణాత్యకవి[1] సుదంతాపరిణయ మను ప్రబంధమును రచించెను. ఈతఁడు విజయరంగ చొక్కభూపాలుని యాస్థానములోనివాఁ డయినట్లు నాతని యానతిచేఁ దా నీకృతి శ్రీరంగ స్వామి కంకితముగా నొనర్చినట్లును దనతండ్రి యా రాజునొద్ద మంత్రిగా నున్నట్లును గ్రంథావతారికలో వ్రాసికొనిన యీ క్రిందిపద్యములవలనఁ దెలియుచున్నది.

సీ. ఆద్యస్వయంవ్యక్తమైన రంగస్థలం బేనృపతికి రాజధానియయ్యె
నధికచంచలయైన యలమహాలక్ష్మియే విభునిపూజలకిలు వేలుపయ్యెఁ
బ్రత్యక్షవిరజయై పరఁగు కావేరియే ప్రభునికోటకు మహాపరిఘయయ్యె
రాజార్హమైన చిరత్నరత్నంబులే దంటసీమకు నిట్టపంటయయ్యె

గీ. నట్టినృపపాలిత......సమిద్ధ పంచతిరువట రాజసప్తాంగసాళి
శాత్రవీకంఠసూత్రశాసన...శాలి శ్రీవిజయరంగ చొక్కధాత్రీపమౌళి.
... ... ... ... నిండుకొలువుండి వేడ్క నన్నిలువనంపి.

గీ. నాకునారోగ్యభాగ్యముల్ నీకుఁబ్రతిభ విన్నవారికిహర్షంబువిస్తరిల్లఁ
గృతియొనర్పుము శ్రీరంగపతికి ననిన నాఁటినెమ్మది నొకహాయినాఁటి రేయి.

సీ. పాండ్యేశపరమాప్త పారిషద్యవరుండు గోపాలచరణ సేవాపరుండు
నిఖిలదిక్తటవర్తి నిజకీర్తివిస్ఫూర్తి షట్సహస్రకులీన చక్రవర్తి
మధురాంధ్రకవన గుంఫనకళాచతురుండు సాధురక్షణ విచక్షణకరుండు
జ్ఞాతిబంధుసుహృన్నిరాతంక శుభకారి సత్యోక్తిమాతనా జాతశౌరి

గీ. సకలధనికౌఘువర్ణ్య భూషాయమాన లలితనిరవద్యనిజగుణాకలితపద్మ
శతసహస్రుండనంగ సన్నుతివహించె ఘనుఁడు వెలిదండ్ల పెద్దరాఘవవిభుండు.

విజయరంగ చొక్కనాథుఁడు క్రీ. శ. 1704–1731 నడుమవాఁడగుటచే నీకవియు నప్పటివాఁడై శేషము వెంకటపతి సముఖము వేంకట కృష్ణప్పనాయకాది కవులకు సమకాలికుఁడని స్పష్టపడుచున్నది.

---

1. ఈ గ్రంథము తాళప్రతియొకటి ఆంధ్రసాహిత్యపరిషత్పుస్తక భాండాగారమున మాత్రమే కలదు.

మఱియుఁ గవి తన పితామహాదుల నిట్లు వర్ణించెను.

చ. అలతిరువేంగళార్యుఁడు మహాద్భుతచర్యుఁడు కీర్తిధుర్యుఁడై
యలరిప్రసూనమార్దవ శుభాంగిని గోనమయన్వయామణిన్
లలితగతిన్ వరించి కమలాసతిఁ జేకొనినట్టి చుట్టువా
ల్బలియుని కైవడిన్ బరఁగెబంధువులందఱు సంతసింపఁగన్.

సీ. శృంగారరసముఖోచిత సితాంధ్రోక్తి పద్ధతిపోషి వేంకటపతిమనీషి
సకలదేశాధీశ సమ్మతపేశల కవనుండు పెద్దరాఘవఘనుండు
జనమనోరంజన సరససల్లాపధారలవన్నెఁగన్న చిన్నరాఘవుండు
మధురవాక్యప్రౌఢిమ నిరస్తభారతి నఖముఖరితతంత్ర నరసమంత్రి

గీ. లలితవార్తాచమత్కృతి లక్ష్మపతియు ననఁగ నేవురుగల్గిరి వినయులైన
తనయులై తిరువేంగళార్యునకు జగతిఁ దనువులందిన పంచతత్త్వములనంగ.

క. అందగ్రజుఁ డర్చితగోవిందపదుండచ్చతెనుఁగు వేంగనవెలసెన్...

సీ. ఆమేరురామేశ్వరావని విఖ్యాత మేనేతశుద్ధాంధ్ర కృతిసహస్ర ...

గీ. అతఁడు చెలువొందుఁ దిరువేంగళార్యగర్భ జలధికమలాదిమువ్వ–విస్మయవిదారి
యనవరతతోషి గానవిద్యాభిలాషి బంధుపరిపోషి వేంకటపతిమనీషి.

దీనిని బట్టి యితని పితామహుఁడగు వేంగళార్యున కీతని తండ్రి యగు పెదరాఘవార్యుఁడుగాక యింక నలువురు విద్వాంసులగు పుత్రులు గలరనియు, వారిలోఁ బెద్దవాఁడయిన వేంకటపతిమనీషి యనేక శుద్ధాంధ్ర గ్రంథములు రచించి 'యచ్చతెనుఁగు వెంగన'యను బిరుదువడసె ననియుఁ దెలియుచున్నది. మఱియు రాధామాధవసంవాదము రచించి నట్లుగాఁ గవులచరిత్రలోఁ బేర్కొనఁబడిన వెలిదండ్ల వేంకటపతి యీతఁడేయని తెలియుచున్నది. ఈ వేంకటపతినిఁగూర్చి "రాధా మాధవ సంవాదము" అను శీర్షికనుఁ జూడుఁడు.

గ్రంథవిషయము: అష్టమహిషులలో నొక్కతెయగు సుదంతకును శ్రీకృష్ణునకును జరిగిన వివాహము ప్రబంధోచితవర్ణనలలో నిందు విస్తరింపఁబడినది. గ్రంథము సంపూర్ణముగానున్నది. కవిత్వము చక్కఁగా నున్నది. శైలి తెలియుట కిం కొకపద్య ముదాహరించెదను.

చ. లలితరసాలసాలపరిలంబి మహీతలచుంబివల్లికాం
చలయుగళంబులం బెనచి చయ్యన నుయ్యల లూఁగు వేళలన్
గులుకుమిటారి జవ్వనపుఁ గొమ్మలు పొల్చిరి పంచకాండకుం
డలితధనుర్లతాంతరకనత్కనకాంబక రేఖలో యనన్.

# తిరుమలకవి

విజయరంగ చొక్కనాథునికాలమున వెలువడిన యక్షగాన నాటకములలోఁ దిరుమలకవి విరచితమగు చిత్రకూటమాహాత్మ్య మనునది ప్రశస్తమైనది. ఈతఁడు బాలసరస్వతి పౌత్రుఁడు. వేంకటాధ్వరి పుత్రుఁడు. ఈ బాలసరస్వతి యసమసాహిత్య విద్యాచతుర్ముఖుఁడై భారతమున సభాపర్వము ద్విపదగా రచించెను. తిరుమలకవి తన్నుఁ గూర్చి చెప్పిన గ్రంథభాగము నుదాహరించుచున్నాను.

గ్రంథ ప్రారంభము :

సీ. శ్రీలచేననుపమలీలచే నెంతయు నలునొందుద్వారకా నగరమునను
కాంతమైసుతపై జయంతమై జిగిమీఱు మెఱుఁగారుబంగారుమేడమీఁది
పొందు గాఁగనుదోయి విందుగాఁ గనుపట్టుడంబైనకొలువు కూటంబునందు
కెంపురాసంతన నింపురాణించు కుందనపుగద్దియనుండు దైవరాయ

తే. రంగకృష్ణముద్దుల వీరరాజసుతుఁడు శ్రీవిజయరంగచొక్కనాథావనీంద్రుఁ
డెలమి కోరినకోరికలిచ్చు దేవ ! నీకు మ్రొక్కెదనిరవద్య ! నిగమవేద్య !

కైవారం : సీరెుుదుటనుదుటువగ కోవులమరనమరనాయక సభాంతరమున నటియించు తెలగంటితెలవల తెలంగుప్రకటించునించుఁ బోణులు నటియించు, చిత్రకూటమాహాత్మ్య మహానాటకవిధానంబు చూడనవధరించు నాస్వామి, జయీభవదిగ్విజయీభవ.

తుది : ద. రామకలి. అట.

జలకేళిచాలించికోలను వెల్వడివచ్చి
చెలులతో జతగూడి వలువధరించి
చలువగంధములంది సతియు శంకరుఁడు
నలువొందనిజసదనము చేరికెలమిన్.

ద. కల్యాణి. ఝంపె.

గౌరియును......నలకడనసభనఖిలభోగంబు
లనుభవింపునుండి రచటన్.

ద్విపద. అనియనివార్య శౌర్యాన్వితుపేర
అనుపమసత్కీర్తియగుశౌరిపేర
కృష్ణచారిత్రకీలితుఁడైన రంగ
కృష్ణముద్దులవీర నృపపుత్రుఁడగుచు
జయశాలియ... నెసంగినశ్రీవి
జయరంగచొక్కరాయాధీశునగర
నెనరుమీరవసించి నిరుపమానంద
మనుభవింపుచునుండు ననఘునిపేర
శ్రీల చేఁదనరుచు నృపవరనిత్య
లాలితుండయిన బాలసరస్వతిమఖి
సుతముఖ్యుఁడగుచు నిస్తులకళాప్రౌఢి
నతనిమించిన వెంకటాధ్వరిసుతుఁడు
తిర్మలకవి పార్వతీపతి భజన
నిర్మలమతి విష్ణునిత్య సేవకుఁడు
సంగీత సాహిత్య చతురుఁడౌ విజయ
రంగచొక్కావనీరమణుని కృపను
కర్ణభూషణములు ఘనభూషణములు
సర్వాంబరంబులు సరిపెనల్ తాళి
యనువొందు నందలం బగ్రహారాది
ఘనబహుమానముల్ గాంచినవాఁడు
వచనచమత్కార వైఖరిమీర
రచన సేయఁగను నర్తన యోగ్యముగను
గొనబుమీఱిన చిత్రకూటమాహాత్మ్య
మను నాటకమును విద్యల రూఢిఁగన్న
కవులెన్న నానిశాకర తారకముగ
నవనీశ్వర సభార్హమై యొప్పఁగాత.

చిత్రకూటమాహాత్మ్యము: కథన ర్వేశ్వరుఁ డొకనాఁడు ప్రమథగణం బులఁగూడి కొలువుండి వారిని పార్వతి జాడయడుగ వార లామె చిత్ర కూటమున 'తిల్ల' యను పేరును గాంచియున్నదనిరి. అప్పు డీశ్వరుఁ

"డాపల్లవాధరను జూడక సొంపు సంధిల్లదు. ఆమె నాట్యమునఁ దన వన్నెవాసి ధరణిలోఁ బొగడ, నన్నేడఁబాసి యొంటిగాఁ దిల్లవనినిం బొందె. ఆ వాలుఁగంటిని తలంచుకొంటిని" యని వేఁటాడు నెపంబున నచటవెడలి తిల్లవనిని నాలుగు దినంబులుండి పార్వతినిగలసి తమ కుంద నంపు మేడకు వచ్చుట యిందు వర్ణితము.[1]

మధురనాయక సంస్థానమునుండి యీ గ్రంథము తంజావూరి పుస్తకశాలకుఁ జేరినట్లుగా నీ క్రిందిసూచిక వలనఁ దెలియుచున్నది. గ్రంథ మముద్రితము.

# శ్రీపతి రామభద్రకవి

ఈతఁడు హాలాస్య మాహాత్మ్యమును వచనకావ్యముగా రచించెను. ఇందెనిమిది యాశ్వాసములు గలవు. ఆశ్వాసాంతగద్యలో "ఇది శ్రీ మీనాక్షీ సుందరేశ్వరసాంద్ర కృపారసలబ్ధకవితా మాధురీ ధురీణ కాశ్యప గోత్రాశ్వలాయనసూత్ర శ్రీపతికులపవిత్రచరిత్ర శ్రీ గిరియ మాంబా సత్కళత్ర సూరయామాత్యపుత్రక[illegible]ద్ర ప్రణీతంబైన హాలాస్య మాహాత్మ్యంబను వచనకావ్యంబున ప్రథమాశ్వాసము."

పై గద్యవలన నీతఁడు మధురాపుర నివాసియనియు బ్రాహ్మణుఁడనియు, కాశ్యపగోత్రుఁ డనియు, గిరియమాంబా సూరనలపుత్రుఁ డనియుఁ దెలియుచున్నది. ఈతని గ్రంథమునందెచ్చటను విజయరంగ చొక్కనాథునిపే రుదాహృతము కాకపోయినను నితఁడు మధురాపురి నివాసి యగుటయు వచనగ్రంథము రచించుటయు నీతఁడు విజయరంగ

1. తంజావూరి పుస్తకశాల ప్రతి సంఖ్య 550 (M 671) గ్రంథాంతమున "తిల్ల గోవిందరాజ నాటకము తెలుఁగు లిపిని ఆకులు 35 టికి పుస్తకం ౧ టికి హుజూర్ నుంచి వచ్చింది మానాజి గుజార్తిసభా అళ౯ వర్షం సఫర్ నెల 9-వ తేదీ మహల్ ప్రవేశం తిరుచినాపల్లి ముఖాంహరకార వైద్యనాథుండి సంబంధం"

చొక్కనాథుని కాలమువాఁడని తెలియఁజేయుచున్నవి. మఱియు నిందలి వచన రచనయు, శ్రీరంగమాహాత్మ్య, మాఘమాహాత్మ్య రచనల పోలికనున్నది.[1]

ఇందలి వచన రచనకు మచ్చు:

"అశ్వినీదేవతలు చూచి యిది యపరిహార్యంబనినవారు నిరుద్యోగులై జాగులైరి. తద్రోగ పరిహారార్థంబుగా నొక్క యుపాయంబు దేవ రానతీయవలయుననిన వరుణ ముఖావలోకనంబు చేసి వాసవుండు, "విను! మోసంబులేదని సుధాసార సమానవచనంబులు" పలికినపుడు ఏ మహావ్యాధిపీడితులై, పాపకృత్యులై, యపమృత్యుపీడితులై, కాల మృత్యువశమైనవారెవ్వరో వారందఱు సుందరమూర్తి సందర్శనంబునం బునీతులగుదురు. కావున మనోవాక్కాయ పరిశుద్ధుండై యీ యభిషేక పాండ్యరాజాగ్రణీ! భక్తి ప్రభావంబును యీ దేవుని మహిమాతిశయంబును నీవు లెస్సగఁ బరీక్షించి తెలిసి తల్లింగార్చనంబు గావించితి వాయెనా నీ రోగంబు దొలంగు నిందులకు సందియంబు లేదు"[2]

## కవిధాటి బలభద్రకవి

గజారణ్యక్షేత్రమనఁగా జంబుకేశ్వరము. ఈ క్షేత్రమాహాత్మ్యమును, కవిధాటిబలభద్రకవి పద్యకృతిగా, [3]'గజారణ్యసంహిత' యను పేర రచియించెను. ఇచ్చటనున్న శంకరాచార్య మఠమునకు విజయరంగ

---

1. దక్షిణాంధ్ర వాఙ్మయమునుగూర్చి క్రీ. శ. 1916 లోనే వ్రాసిన హరి సేతురామయ్యగారు తమ వ్యాసమునఁ బై యభిప్రాయమునే వెలిబుచ్చియున్నారు. (చూ. ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక 7-వ సంపుటము పుటలు 84-92)

2. ఆంధ్రసాహిత్యపరిషత్తు. గ్రంథ సంఖ్య 170. పరిషత్పుస్తకభాండాగారము ద్వితీయభాగము. పుట 78-79.

3. ఆంధ్రసాహిత్యపరిషత్తులోఁ గర్తతెలియని గజారణ్యక్షేత్ర మహాత్మ్యము తెలుఁగు వచనము గలదు

చొక్కనాథుఁడిచ్చిన దానశాసన మొకటికలదు. దానికాలము క్రీ. శ. 1708 కావున నీ గ్రంథరచనము నా కాలమునాఁటిదే యని యూహింప వచ్చును.

ఈ కృతియంతయు లభింపలేదు. ఇందుఁ ద్వితీయాశ్వాసము మొదలు షష్ఠాశ్వాసమువఱకుఁగల భాగము పూర్వఖండముగా లభ్యమగు చున్నది. ఇది శ్రీగిరి గౌరరాజు బసవరాజున కంకితము.

గ్రంథాంత గద్య: "ఇది శ్రీ సూర్యనారాయణ వరప్రసాదలబ్ధ కవితా పాండిత్య రామకవీంద్రపుత్ర కవిధాటి బలభద్రనామక కవిప్రణీతం బైన [1]గజారణ్యసంహిత పూర్వఖండంబున ద్వితీయాశ్వాసము."

## భాస్కర వేంకటాచలకవి

"సేతు మాహాత్మ్యము" అను నాలుగాశ్వాసముల పద్యప్ర బంధము రచించిన యతఁడు భాస్కర వేంకటాచలకవి. ఇతఁడు నందవరీక నియోగి బ్రాహ్మణుఁడు, వసిష్ఠగోత్రుఁడు, ఆశ్వలాయన సూత్రుఁడు, ఈతని పితామహుఁడు వెంగనార్యుఁడు. ఇతఁడు నందవరమునకుఁ బ్రభువై యొప్పినట్లుగాఁ గవి యవతారికలో వర్ణించెను. దీనింబట్టియే యతఁడు నందవరీకుఁడని యూహింపఁబడినది. ఇక్కవి తండ్రి సూరయా మాత్యుఁడు, తల్లి వెంగాంబ, సోదరుఁడు శేషాచలకవి. ఇతఁడు 'నాంచారు పరిణయము' అను యక్షగాన కావ్యమును రచియించిన ట్లవతా రిక తెల్పుచున్నది. గ్రంథావతారికాదులంబట్టి పైనిఁదెల్పి నవిషయములు మాత్రమే దెలియుచున్నది.

ఇందు శ్రీరామకథయు సేతువృత్తాంతము రామేశ్వర క్షేత్ర మహాత్త్వమును సమగ్రముగా వర్ణింపఁబడినవి.[2]

1. గజారణ్యసంహిత పద్యకృతి మదరాసు ప్రభుత్వ ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారముననున్నది.

2. ఈ గ్రంథముయొక్క యసమగ్రమైన ప్రతి యాంధ్రసాహిత్యపరిషత్తులోఁ గలదు.

ఇందలి కవిత్వ మంత ప్రౌఢమైనదియు నిర్దుష్టమైనదియుఁగాదు; కాని సులభశైలి నొప్పుచున్నది. ఇందచ్చటచ్చటఁ గొన్ని వృత్తములు వ్రాయఁబడినవి గాని మొత్తముమీఁదఁ కంద గీతపద్యములే యమితముగా నున్నవి.

చ. అన విని గౌతముం డతిపరాక్రమధుర్యులఁ బాండవేయులన్
మనము వధింపఁగాఁ గలమె మానిత శౌర్య ధురీణు చీడు రా
జున కెఱిఁగించి వాని మన సొప్పిన యట్టుల చేత మన్న నా
ఘన భుజుఁడైన ద్రోణి విన కప్పుడె తా వెడలెన్ ధ్రువంబుగన్.

గీ. (తివిరి) సన్నుతి సేసి తత్తీరమున సమగ్రరామ షడక్షర మంత్రజపము
చేయుచుండినఁ దన్మంత్ర సిద్ధి మహిమ నిశ్చలం బగు భక్తిచే నెగడె జగతి.

ఈ భాస్కర వేంకటాచలకవిని సీతని వెనుకనున్న సీనయకవిని, దక్షిణాంధ్ర దేశమున వెలసిన వాఙ్మయమునకు సంబంధించినవారినిగా, శ్రీహరి సేతురామయ్యగారు తాము రచించిన 'చోళ పాండ్య దేశాంధ్ర ప్రాబల్యము' అను వ్యాసమునందుఁ దెలిపినారు. వీరు క్రీ. శ. 1731-1767 ప్రాంతముల నున్నట్లు వారి యభిప్రాయము.[1]

## సీ న య క వి

షణ్ముఖ సహస్రము అను నపూర్వమైన తెలుఁగు పద్యకావ్యము రచించిన కవివర్యుఁడు సీనయ్య. కృత్యాదిలోనివగు,

మ. సరస శ్రీనిధి తిర్మలార్య సుతుఁడన్ సాహిత్య విద్యా ఘన
స్థిరమోదావహ చాతురీలలితసంధిగ్రామ ధౌరాధురం
ధరుఁడన్ సీనయ నామధేయుఁడ జగత్సాకల్యమై ధీ శుభా
కర మా నీతి సహస్ర పద్యకృతి నీ కర్పింతునో షణ్ముఖా!

శా. నానాదేశికచిత్త భూషణములై నాళీకజాతాంగనా
పీనోత్తుంగపయోధరాగ్రపదవీప్రేంఖన్మిళద్భూషలై
నానానీతివిచిత్రవాక్యరుచులై నాణెంబు దీపింపఁగా
నే నీ పేర రచింతు, బద్యములు వేయిన్నెన్మిదో షణ్ముఖా!

1. చూ. ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక. సం॥ 7. పుటలు 84-92.

అను పద్యములంబట్టి యితఁడు తిరుమలార్యుని సుతుఁడనియు 'సెంది' గ్రామవాసి యనియుఁ జక్కని సాహిత్యము గలవాఁడనియు వేయు నెనిమిది పద్యములు శ్రీ పార్వతీ పరమేశ్వరుల పుత్రుఁడగు కుమారస్వామికి నంకితముగా రచించినవాఁడనియుఁ దెలియుచున్నది. సంది = సెంది గ్రామము. ఇది యిపుడు "తిరుసెందూరు" అను పేరఁ దిరునల్వేలి మండలములో నున్నది.

[1]ఇందు నూరేసిపద్యము లొక్కొక్క భాగముగా విభజింపఁబడినది. ఇది లక్ష్మీ సహస్రాదులవలెఁ గేవలము కృతినాయక వర్ణన పరముగాదు. ఇందు వివిధములయిన లోకనీతులు పురాణగాథలు శాస్త్ర చర్చలుగూడ వివరింపఁబడినవి. మఱియు నిందు లోకమున వ్యవహరింపఁబడుచుండెడి పెక్కు సంస్కృత శ్లోకములు సరిగా నాంధ్రీకరింపఁబడి యున్నవి. కవిత్వ మంత నిర్దుష్టమును బ్రౌఢమును గాకపోయినను గొంచె మించుమించుగా నిది నూఱేండ్లనాఁటిది యగుటచేతను నీతికావ్య మగుటచేతను నాంధ్రలోకమున నాదరము నొందఁదగినది. శైలి తెలుపుట కింకొకపద్య ముదాహరించెదను.

మ. కరవాలాగ్రమునన్ మెలంగుట భుజంగస్ఫారరంగత్ఫణో
దర సచ్ఛాయ వసించు భాతి గజమేదశ్చర్వణోన్మత్త గ్రీ
సరికంఠం బవలంబనంబు గొను నోజన్ రాజ సేవా మహా
త్వరమల్ సేవక కోటి కల్ప సుఖముల్ ధాత్రీస్థలిన్ షణ్ముఖా.

## ధూర్జటి వేంకటరాయకవి

సుప్రసిద్ధుఁడగు ధూర్జటి కవివంశీయుఁడగు వేంకటరాయకవి రత్నావళీ "పరిణయము" అను ప్రబంధమునురచించి చేకూరి రామస్వామి మంత్రికిఁ గృతి నిచ్చియున్నాఁడు. అవతారికలో కృతిపతి వంశమును గూర్చి యీ క్రింది వివరములు దెలిపియున్నాఁడు.

1. ఈ గ్రంథ మాంధ్రసాహిత్య పరిషత్తునందుఁ గలదు. ప్రతి పరిశుద్ధముగా సంపూర్ణముగానున్నది.




పై వారిలో గృతిపతి తాతఁగూర్చి యిట్లు చెప్పబడినది.

" ధరణి నమ్మోటి చెలువొందె గరుడ సింధు
దక్షిణ పినాకినీ నదీ తట నిరూఢ
పాటల పురాధి వాసియై ప్రజలు పొగడ
మనసిజనిభుండు రామయామాత్య విభుఁడు."

కృతిపతికూడ,

" గరుడ సింధు దక్షిణ పినాకినీ తటస్థాన పూర్వ
శరధిసంగమ పాటలపుర నివాసుఁడని " వర్ణితుఁడైవాఁడు.

ఈ గరుడ తీర్థమునకు 'గడిలము' అని పేరు. ఇది నేఁడు దక్షిణార్కాటు మండలములో దక్షిణ పినాకినీ నదీతీరమున పాటలీపురము లేక తిరుప్పళయూరను పేరఁ బరగుచున్నది. కావున రత్నావళీ పరిణయము దక్షిణాంధ్రవాఙ్మయమునకు సంబంధించిన కావ్యమేయని చెప్పవచ్చును.

# ఎల్లయ

"చంద్రతారా విలాసము" అను పేరఁ దారాశశాంకుల ప్రేమగాథను యక్షగాన రూపమున రచించిన యెల్లయకవి సేలమువద్ద నుద్దండ మల్లసముద్ర గ్రామనివాసి యని యీ క్రింది పద్యమువలనఁ దెలియుచున్నది.

గ్రంథాది :

క. శ్రీకర నగజ ముఖాబ్జ ప్రభాకర విఘ్నౌఘహార శుభాకర సద్వి
ద్యాకర మునిజన హృదయ వశీకర గణనాథుఁ గొల్చి సేవింతు నెదన్.

సీ. శ్రీరహిమించిన చేర దేశంబులోఁ జెలువొందె వెలయును సేలపురము
దాని చేరువను సుద్దండ మల్ల సముద్రమను గ్రామమున నుండు నాంధ్ర విప్రుఁ
డాత్రేయ గోత్రజుం డమల తేజస్కుఁడౌ రామ భక్తుఁడైన రామభద్రుఁ
డాతని తనయులు ననఘులు నిద్దఱు నం దగ్రజుఁడు మల్లనార్యుఁ డనఁగ

గీ. నతని కనుజుండు విశ్వనాథాఖ్యుఁ దనయ వినుతి కెక్కిన కులసతి వేంకటాంబ
గర్భ కలశాబ్ధి చంద్రుఁడు కవి వరేణ్యులకును శిష్యుండు 'ఎల్లయ' సుకవిహితుఁడు.

గీ. రాజితంబుగఁ గల్యాణ రాము కృపను చంద్ర తారా విలాసంబు సరస యక్ష
గానముగ నేను బల్కెద గారవమున వినుఁడు జనులార! వీనుల విందుగాను.

గ్రంథాంతము :

ఘనులు మునులు కవి గాయకులు
వినుతి సేయ భట వీరులతో
జనని జనక గురుజనులు ముద మలర
దనరిన సీతా రామునకును.

శోభానమే.

ఈ యెల్లయకవి ఈరోడు పట్టణంబున క్రీ. శ. 1846 లో నున్న ట్లుగా నా సంవత్సరముననే 'నీలగిరి యాత్ర'[1] అను వచనకావ్యము రచియించిన కోలా శేషాచలకవి తన గ్రంథమున నిట్లు వ్రాసియున్నాఁడు.

"ఈ యెల్లయ కావేరీ తీరంబున నీరోడునకు ముక్కాలుకోసెడు దవ్వున నొక సత్రంబు గట్టించెను.

ఈరోడనునది కోటయుం బేటయుం గలయది. కావేరి యావలి తీరంబున సత్రంబును గట్టించిన యెల్లయ యను జన్ని గట్టు, ఈచోటనున్న వాఁడు. సేలంబునందు పెట్లుప్పు ప్రత్తి లోనగు సరకుల వ్యాపారంబు

1. ఈ నీలగిరి యాత్ర ప్రాచ్యలిఖితపుస్తక భాండాగారమువారిచే నీ తరువాత ముద్రితమైనది. ఇది ప్రశస్తమైన వచన కృతి.

నేయు 'ఫిషర్' అను దొర కతండు నొక్క యేజంటను కార్యకర్త గావున నక్కోటలో నుండు నా దొర పెట్టుపప్పు గిడ్డంగి యాతని యధికార మునకు లోనై యుండును.

అయ్యుర్వీగీర్వాణుండు సంగీత సాహిత్య విద్యాప్రవీణుండు గావునఁ దారాశశాంక ప్రభృతి కతిపయ నాటక ప్రబంధంబులు శృంగా రాది రసానుబంధములుగా రచియించియున్నాఁడు.[1]

## హోసూరి సాకమ్మ

క్రీ. శ. 1760 ప్రాంతము

చరిత్రకెక్కని దక్షిణాంధ్ర కవయిత్రులలో సాకమ్మ యొకతె యని చెప్పవచ్చును. ఈమె నివాసస్థానము సేలము జిల్లా హోసూరి తాలూకాలోని "తోగిరి" అను గ్రామము. ఈ "తోగిరి" అను గ్రామము క్రీ. శ. 1711 ప్రాంతమున మైసూరి చిక్కరాయల సేనానియు, గీర్వాణాంధ్ర భాషా విద్వాంసుడునగు కళువె వీరరాజు, "వీరరాజాంబుధి అగ్రహారము" అను పేర నొక యగ్రహారము చేసెను.

సాకమ్మ వెలనాటి బ్రాహ్మణ యువతి. తండ్రి వైపువారు సర్వే పల్లివారు-తల్లివైపువారు పిల్లలమఱ్ఱివారు. తలిదండ్రులు వేంకటాంబా వేంకటరామావధాని దంపతులు.

సాకమ్మకు చిన్నతనముననే పెండ్లియైన కొన్నియేండ్లకే యీమె భర్త గతించుటచేత బాలవైధవ్యము ప్రాప్తించినది. అప్పటి నుండియు నామె యైహికసుఖ విముఖయై భగవద్భక్తి ప్రపత్తిచే, జీవితము గడుప నారంభించినది. 'నారాయణయతి' యను నొక గురువు నారాధించి, వేదాంతశాస్త్రమున ప్రజ్ఞగడించినది. సాకమ్మ సరస్వతి నారాధించి యామెను ప్రత్యక్షము చేసికొనె ననియు, నప్పటినుండి యామె కవిత్వముచెప్ప నేర్చెననియు పెద్దలు చెప్పుచున్నారు.

---

1. పుట 51. మదరాసు ప్రాచ్యలిఖితగ్రంథ భాండాగార గ్రంథసంఖ్య 14-2-5.

ఈమె రామాయణము, ముక్తికాంతా కల్యాణము, రంగ విలాసము, గురుశిష్య సంవాదము మొదలగు గ్రంథములను రచించినట్లు తెలియుచున్నది. వీనిలో రామాయణము, రంగవిలాసము, యక్షగానములు. ఈ రెండింటిలో రామాయణము చాలా ప్రసిద్ధికెక్కినది. ఇందు దరువులు, కీర్తనలు, సీసములు, కందములు, లాలిపాటలు, మంగళహారతులు, వచనములు మొదలగునవి గలవు. శైలి సులభము పాటలు మనోహరములు. స్త్రీలు పాడుకొనుటకు ననుకూలముగ నుండును.

ఈ రామాయణమున బాలకాండము మాత్రము క్రీ. శ. 1912 లో కర్నూలులో ముద్రితమైనది. గ్రంథ ముద్రాపకురాలగు 'శ్రీ రామలక్ష్మమ్మ' అనునామె యీ గ్రంథము "తన పూర్వులలో తోగిరి అగ్రహార వాస్తవ్యులైన అన్నదానము వెంకటరామావధానులభార్య వెంకటాంబ" అనువారు రచించినదని ప్రకటించినది. దీనినిబట్టి తరువాత వారు దీనిని రచించినది "అన్నదానము వెంకటాంబ" యని వ్రాసియున్నారు. కాని ప్రస్తుతము హోసూరు తాలూకాలో యీ రామాయణము ప్రచారములో నున్నది. ఇందలి సుందరకాండమొక్క యంతములో సాకమ్మగారిపేరు స్పష్టముగానున్నవి, ఇంతేకాక ముక్తికాంత విలాసము అను గ్రంథములోను, ఈ రామాయణము సాకమ్మగారిదే యని స్పష్టముగా నున్నది. కాబట్టి యీ రచన వెంకటాంబది కాదని సాకమ్మగారిదే యని నిశ్చయింపవచ్చును. సాకమ్మగారి గ్రంథములు లభ్యములుకాగానే, వాని సంపూర్ణ సమీక్ష వెలువడును. ప్రస్తుతము మనకిట్టి గ్రంథకర్త్రి యున్నదని తెలియజేసినవారికి[1] మనము కృతజ్ఞతతో స్మరింపవలసియున్నది.

---

1. ఈ కవయిత్రి చరిత్రను రచించుటకు నాకు శ్రీ కే. యస్. కోదండరామయ్య, ఎం.ఏ., బి. టి. అనువారు, 21-4-57 తేదీని ఆంధ్రప్రభ ఆదివారము పత్రికలోను 21-4-57 తేదీని ఆంధ్రపత్రిక ఆదివారము పత్రికలోను ప్రకటించిన "హోసూరు సాకమ్మ" అను వ్యాసములు ఆధారములైనవి. వారికి నా కృతజ్ఞత.

# పుదుక్కోట — ఆంధ్రవాఙ్మయము

తంజావూరు మధురనాయకరాజుల వెనుకఁ దెనుఁగు వాఙ్మయమును బోషించిన నాయకరాజులలోఁ బుదుక్కోటరాజులు ముఖ్యులు. వీరికి 'తొండమాన్' అను బిరుదముగలదు. వీరును దొలుత విజయనగర సామ్రాజ్యాధీశులకు సామంతులై, క్రమక్రమముగ స్వతంత్రత వహించిరి. పుదుక్కోట యనగా నవసాలపురమని, క్రొత్తకోట యని యర్థము. ఇది తిరుచినాపల్లి కిరువదిమైళ్ళ దూరముననున్నది. ఈ ప్రదేశము శుద్ధ ద్రవిడదేశమైనను, పుదుక్కోట రాజధానిగాఁగల తొండమాన్ రాజులు తెనుఁగునఁ దాము స్వయముగ కృతికర్తలై, కృతిభర్తలై ప్రఖ్యాతిఁగాంచిరి. ఇప్పటికి నీ సంస్థానధ్వజమునందు తెనుఁగులో "శ్రీ బృహదంబా సహాయం" అని వ్రాయఁబడియున్నది. ఈ రాజుల వంశవృక్షము.




వీరిపేరిట్లున్నను నీ రాజులందఱును బుదుక్కోట పురాధిష్ఠానశక్తియగు బృహదంబాదేవి భక్తులు. తిరుచినాపల్లియందలి మాతృభూతేశ్వరస్వామి (తాయుమాన్ కోయిల్) సేవకులు. కావున శివమతానుయాయులు. వీరి యింటిపేరు కోటివారు. కావున వీరు తెలుఁగు నాయకులని వేఱుగ చెప్పనక్కరలేదు.

ఈ తొండమాన్ రాజులకు వంశపారంపర్యముగా నాస్థానకవులై విలసిల్లినవారు నుదురుపాటివారు. వీరు వెలనాటి వైదికులు. పశ్చిమ గోదావరీ మండలమున నరసాపురము తాలూకాయందలి నుదురుపాటి వాస్తవ్యులు. మధురనాయకరాజగు ముద్దుకృష్ణప్పనాయని కాలమున నాతని యాహ్వానమున దక్షిణదేశమునకుఁ దరలివచ్చిన యుత్తరాంధ్ర బ్రాహ్మణ కుటుంబికులలో వీరు నొకరు. వీరి వంశీయులును, సంతతి వారును నేఁడును బుదుకోట్టలో నున్నారు. వీరికిని రాజులకును గల సంబంధము తెలుపుచున్నాను.

నుదురుపాటి సీతారామయ్య (రాయరఘునాథ విజయరఘునాథులు పోషకులు)

వెంకన్న (పోషకుఁడు రాయరఘునాథ తొండమాన్)




పై వారిలోఁ దొలికవి[1]

## సీతారామయ్య

ఇతనికి 'ఉద్దండకవి' యని బిరుదుగలదు. ఈతఁడు రాయ రఘునాథునిచేతను, తిరుమల తొండమాన్ రాజుచేతను, విశేషముగ సన్మానింపఁబడినవాఁడని యీతని కుమారుఁడగు వెంకన్న చెప్పియున్నాఁడు.

1. ఈ వంశీయుల వృత్తాంతము తెలియుటకు నాధారభూతులు శ్రీహరి సేతురామయ్యగారు. వీరు నుదురుపాటివారి బంధువర్గములోనివారు. పుదుకోట్ట వాస్తవ్యులు. నుదురుపాటి వంశవృత్తాంతమే కాక మఱికొందఱు దాక్షిణాత్యకవుల వృత్తాంతమును మొదట తెలిపినవారు వీరే. క్రీ.శ. 1908 లో రఘునాథ తొండమాన్ విరచితమగు పార్వతీపరిణయమును ముద్రించుటకు మూలప్రతి పంపినది వీరే క్రీ.శ. 1916 లో వీరు "చోళదేశాంధ్ర ప్రాబల్యము" అను ప్రశస్త వ్యాసమును నాంధ్ర సాహిత్యపరిషత్ పత్రికలో ప్రకటించియున్నారు.

ఆతఁడు 'మజ్జనకాది స్వసృష్టకవిరచిత వివిధప్రబంధముల్ వినుచు' అని తన తండ్రినిగూర్చి వ్రాసినను, సీతారామయ్య కృతులేవియు మనకు లభ్యములు కాలేదు. కొన్ని పద్యములు మాత్రమే లభించినవి.

ఈతని కవిత్వమును గూర్చి కుమారుఁడు వెంకనకవి యిట్లు చెప్పినాఁడు.

క. బలవైరి గంధసింధుర గళబంధురఘటితఘంటికారావనిర
ర్గళధాటీపటిమ మనీ షిలలామా నుదురుపాటిసీతారామా !

సీతారామయ్య కవితాశైలినిఁ దెలియుటకు కోటి తిరుమలరాయల పైని ఆతని కుమారుఁడు విజయ రఘునాథునిపైని రచించిన పద్యములుదాహరించుచున్నాను.

చ. స్థిరజయసాంద్ర ! కోటికుల తిర్మలరాయధరాధరేంద్ర ! నీ
కరకరవాలఘాతలను గాంచినవైరికిఁ బోటుఁదాన నం
బరమణి మేనఁదూటుఁ బలవైరికిఁ దత్తరపాటు రంభవా
తెఱపయిఁగాటు సౌరసుదతీమణి కబ్బురపాటు చిత్రమే ?

చ. అరుదుగదా ! తలంపఁగవులార ! ధరాధిపులార ! వింటిరా ?
శరనిధి మేరఁదప్పినఁ బ్రచండకృశానుఁడు చల్లనైన దు
ర్భరకులిశంబు వాడటిన రాముని బాణము నూటితప్పినన్
ధరణి సుధాకరుల్ గతులుఁదప్పినఁ గోటికులాబ్ధి చంద్రుఁడీ
తిరుమల తొండమానుఁడు మదిన్మతి యాడినమాట దప్పునే ?

చ. జరజరవచ్చుబాణముల జల్లికుఁ గొంకక రింగు రింగునన్
మొరయుతుపాకి గుండ్లకును బ్రమ్గ్గక ఖల్లను కత్తిపెట్లకున్
దొఱవక సాజిలో రిపుల వేమరు గెల్తువు రాయతొండమాన్
తిరుమలభూపపుంగవుని తిర్మలభూప ! దిలీపవిక్రమా !

చ. నలుకుదు వైర వైరినరనాథుల గొగ్గి జిరాలు సింగిణీ
తరకసజీని ఘోడలవదంధ ధణాలు ఘణీలు ఘల్లనన్
దురమునఁబెద్దకత్తిగొని దోర్బలశక్తిని రాయ తొండమాన్
తిరుమలభూపపుంగవుని తిర్మలభూప ! దిలీపవిక్రమా !

# రాయ రఘునాథ రాజు
## క్రీ. శ. 1769-1789

పుదుకోట రాజులలో నాంధ్రభాషా పోషకులలో నీతఁ డగ్రగణ్యుఁడు. నుదురుపాటి సీతారామామాత్యోద్దండకవులఁ బోషించుటయే గాక, స్వయముగా సంస్కృతాంధ్ర భాషా కవితాపాండిత్య విశారదుఁడై కృతికర్తయై కృతిభర్తయై విరాజిల్లినవాఁడు. ఒక్క దక్షిణాంధ్ర వాఙ్మయమునందే కాక తెనుఁగు దేశమందలి ప్రశస్త రాజకవుల నితఁడును పేర్కొనఁదగినవాఁడు.

ఈతని యాస్థానముననే, ఆంధ్రభాషార్ణవాది బహు మహాగ్రంథములరచించి విద్వన్మహాకవియని ఉద్దండకవియని పేరొందిన వేంకన కవీంద్రుఁడు వెలసినది. వెంకన కవీంద్రునిఁగూర్చి తెలుపుటకుఁ బూర్వ మీ రాజకవినిగూర్చి తొలుతఁ దెలుపుచున్నాను.

ఈతఁడు క్రీ. శ. 1730-1769 వఱకుఁ బాలించిన విజయరఘునాథ తొండమాను వెనుక రాజ్యమునకువచ్చెను. ఆతనికి సంతతి లేకపోవుట వలన నాతని సోదరుని పుత్రుఁడగు నీ రాయరఘునాథ తొండమాన్ రాజయ్యెను. ఆంధ్రభాషాభిమాన మీ రాజునకు నాస్థానకవులగు నుదురుపాటివారివలన నుగ్గుపాలతో నలవడెను. ఈతనికి ముందు పాలించిన విజయరఘునాథతొండమాన్ రాజును నాంధ్రభాషాభిమాని. ఆతఁడు క్రీ.శ. 1732 లో పుదుకోట రాజ్యమున 'తిమ్మయము' తాలూకాలోని 'కిమనూరు' గ్రామము నొకానొక బ్రాహ్మణునికి దానమిచ్చుచు, నా దానశాసనమును దెనుఁగుభాషలో వ్రాయించియున్నాఁడు. తక్కిన యాతని శాసనములన్నియు నరవభాషలోనున్నవి. రాయరఘునాథుఁడును బృహదంబాభక్తుఁడు. సహజమగు నాతని ప్రతిభకు దైవభక్తి గురుభక్తి వన్నెఁబెట్టినవి. ఆతఁడు రచించిన కృతులు రెండే మనకుఁ గానవచ్చుచున్నవి. వానిలోఁ దొలిది [1]పార్వతీపరిణయము, రెండవది కవిజనోజ్జీవిని

---

1. పార్వతీ పరిణయము క్రీ. శ. 1907 లో సరస్వతీ పత్రికలో ముద్రితమైనది. ఈ కవి గ్రంథములనుగూర్చి తొలుతఁ దెలిపినవారు విద్వద్వర్యులు మా. రామకృష్ణ కవిగారు. ఆంధ్రరాజకవులు – ఆంధ్రపత్రిక ప్రథమ సంవత్సరాది సంచిక, 1910.

## పార్వతీ పరిణయము

నన్నెచోడ మహాకవి మొదలుకొని నేఁటికాలమువఱకును ఖాళిదాస మహాకవి కుమారసంభవకథను బెక్కుమందికవులు కావ్యములుగా రచియించియున్నారు. వానిలో క్రీ. శ. 1769 నుండి 1789 వఱకును బుదుకోట సంస్థానమును బరిపాలించిన కోటి రఘునాథరాయ తోండమాన్ మహీపాలుఁడు రచియించిన పార్వతీపరిణయ మొకటి. కవితారచనయందు సిద్ధహస్తులగు నన్నెచోడ శ్రీనాథాది కవులవెనుక నీకథను నింత స్వాతంత్ర్య కల్పనలతోఁ జతురతతో జాతీయ స్ఫూరకముగ రచించిన కవి వేఱొకఁడులేఁడని కంఠోక్తిగఁ జెప్పవచ్చును.

పార్వతీపరిణయమాఱాశ్వాసముల ప్రబంధము. ప్రథమాశ్వాసమున హిమవద్వర్ణనము, హిమవంతుఁడు మేనకాదేవితోఁ గూడి సౌఖ్యమునందుట, అతఁడు సంతానము లేనందునఁ జింతించి తపస్సుచేయుటకు భార్యతో నొక సరస్సునకు బోవుట అను కథలు గలవు.

ద్వితీయాశ్వాసారంభమున భార్యతోఁగూడ హిమవంతుఁడు తపోదీక్షనుండఁగా బాలాంబ ప్రత్యక్షమై తాను దక్షుని కూఁతురనియు వారలకుఁ బుత్రికయయ్యెదననియుఁ జెప్పి యంతర్హితయయ్యెను. మేనకయు గర్భవతియై కొమార్తెను గనెను. మునులు 'ఉమ' యని నామకరణము చేసిరి. పార్వతి దినదిన ప్రవర్ధమానయై శివభక్తిపరాయణయై పెంపఁగుచుండెను. ఇంతలో నామెకు యౌవనోదయమయ్యెను. నారదుఁ డొకనాఁడు వచ్చి పార్వతి యీశ్వరుని యర్ధశరీరమని తలిదండ్రులకుఁ జెప్పెను. పరమేశ్వరుఁ డాకాలముననే హిమవంతమునకుఁ దపస్సుచేయుటకు వచ్చెను. అంత హిమవంతుఁడు మేనకా పార్వతీసహితుఁడై శివునికడకువచ్చి, పరిచర్యచేయుటకు తన సుతనంగీకరింపవేఁడెను. శివుఁ డంగీకరించెను; ఆమెయు నతి శ్రద్ధతో పరిచర్య చేయుచుండెను.

ఇంద్రుఁడు మొదలగు నష్టదిక్పాలకులు నాసమయమున బ్రహ్మవద్దకరిగి, తారకాసురుడు చేయుచున్న దుండగములను వివరించిరి. బ్రహ్మయుఁ, బార్వతీ పరమేశ్వరులకు జన్మించిన పురుషుఁడు గాని తారకుని జంపలేఁడు గాన నాతని యుదయము కొఱకుఁ బార్వతీ పరమేశ్వర సమాగమము సమకూడునట్లు చేయుఁడని చెప్పెను. దానికి మన్మథుని నియోగింప నుపదేశమిచ్చెను.

ఇంద్రుఁడు మన్మథుని బిలిపించి యీ కార్యమునకై నియోగింప మన్మథుఁడును సంతోషముతో నా కార్యము సాధించుటకు వసంతునితోఁ దన పరివారబలముతో నీశ్వరునిపైకిఁ బ్రయాణము సాగించెను. అంత మధ్యేమార్గమునఁ గళావతియను కన్య హిమవంతమునుండి వచ్చుచుండఁగా, మన్మథుఁ డామెను గౌరి వృత్తాంత మడిగెను. కళావతియు, గౌరి యెంత పరిచర్య చేసినను శివుఁ డామె నెంతమాత్రము కన్నెత్తియైన చూడలేదనియు నాతని వశపఱచుకొనుట కేదైన వశ్య విద్యను సమకూర్చుకొని రమ్మని పార్వతితల్లి మేనక తన్నంపెననియుఁ జెప్పెను. మన్మథుఁ డా మాటల కియ్యకొనక యీశ్వరుని తపోవనమున దండువిడిసెను. ఇది ద్వితీయాశ్వాసకథ.

వసంతుఁడు తపోవనము ప్రవేశించఁగానే వసంతోదయమయ్యెను, ప్రకృతి యుల్లాసముతో నుప్పొంగుచుండెను. ఆ సమయమునఁ దపోనిష్ఠాగరిష్ఠుఁడైయున్న శివునిరూపముచూచి మన్మథుఁడు తొలుతఁ దల్లడిల్లి యీ వెనుకఁ దానుజేసిన ప్రతిజ్ఞ జ్ఞప్తికివచ్చి; యొక చెట్టుచాటున గౌరిరాకకై వేచియుండెను. అంతలో మనోహరాకారమునఁ బార్వతివచ్చి శంభునకు మ్రొక్కు—సమయమున మన్మథుఁడు తన బాణములను శివునిపైఁ బ్రయోగించెను. శివుఁడు తత్క్షణమే, తన్నుఁ గలఁతపెట్టిన మన్మథుని ఫాలనేత్రము తెఱచి దగ్ధమొనర్చెను. పార్వతి మూర్ఛపోయెను, హిమవంతుఁ డచటికి వచ్చి పార్వతిని దీసికొనివెళ్లెను. అంత మన్మథుని భార్యయగు రతి జరిగినదిచూచి భర్తకై విలపించి, యగ్నిహోత్రమున కాహుతి యగుటకు సిద్ధమయ్యెను. ఆకాశవాణి పార్వతీ వివాహసమయమున మన్మథునితో నామె యుండుననియు నితరుల కాతఁ డనంగుఁడై యుండుననియుఁ బలికెను. రతి సమాశ్వాసితయై వెడలిపోయెను. ఇది తృతీయాశ్వాసకథ.

పార్వతియు హిమవద్గిరికి వచ్చిననాఁటనుండి విరహతప్తయై తపస్సు చేయ నారంభించెను. పరమేశ్వరుఁడును దన కొలువుకూటమున నుండఁగా నింద్రోపేంద్రాది సమస్తదేవతలువచ్చి శంకరుని లోక సంరక్షణార్థము గౌరిని భార్యగాఁ బరిగ్రహింప వలసినదని కోరిరి. శంకరుఁ డందుల కియ్యకొని మన్మథుని బునరుజ్జీవితునిజేసి వటు రూపమునుదాల్చి పార్వతి తపోవనమునకు వచ్చెను. అప్పు డతఁడచ్చటి చెలికత్తెలవలన వృత్తాంతమంతయు నెఱింగి, శివుఁడు జోగి యనియు విరూపియనియు నిట్టి సుందరాంగిని నాతనికిచ్చుట తగదనియు శివుని నిందించెను. పార్వతియుఁ గోపోద్దీపితయై చెలికత్తెలకా వటువు శివనిందఁజేసినందుకు దగిన శాస్తి యొనర్పుమని యాజ్ఞాపించెను. అంత శివుఁడు తన నిజరూపమునఁ బ్రత్యక్షమై పెండ్లియాడుమని కోరెను. పార్వతి తల్లిదండ్రుల యాజ్ఞ లేనిదే తానేదియుఁ జెప్పఁజాలనని చెలికత్తెలతో వెడలిపోయెను. తన కూఁతురు తపముడిగి మగిడివచ్చినందుల కామెసంతసించెను. పార్వతికిఁ బరమేశ్వర విరహము ప్రాంతమయ్యెను. ఇది చతుర్థాశ్వాస కథ.

పరమేశ్వరుఁడు సప్తఋషులను హిమవంతుని యొద్దకుఁ బెండ్లిమాటలకై పంపెన హిమవంతుఁడు వివాహమునకు నంగీకరించిన వెనుకఁ బరమేశ్వరుడు పెండ్లికిఁ దర వచ్చెను. ఆపైని వివాహము. మన్మథుఁడు రతికిఁ బ్రత్యక్షమగుట. వైవాహికోఁ వము. పార్వతీ పరమేశ్వర సమాగమము. ఇది పంచమాశ్వాస కథ.

షష్ఠాశ్వాసమున షణ్ముఖుని జననము, అతఁడు దేవసేనాధిపత్యమువహిం- తారకునిపై యుద్ధమునకు వెడలుట, తారకసంహారము, షణ్ముఖుఁడు వల్లియను పేరుగ దేవసేనను బెండ్లియాడుట అను నానంద విషయములతోఁ బ్రబంధము సమాప్తమగును.

ఈ ప్రబంధమునఁ గృత్యవతరణికలో రఘునాథతొండమాన్ రాః తన యాస్థానకవియగు సుదురుపాటి వేంకనార్యుఁ డీ ప్రబంధము వ్రాయ మని ప్రోత్సాహించినట్లు చెప్పఁబడియున్నది. మఱియు వేంకనార్యుని యాంధ్ర భాషార్ణవములోని వంశవర్ణన పద్యముల నాతఁడు చెప్పినట్లే యిందిమిడ్చియున్నాఁడు; ఇది యెంతయు సమంజసమే. తన పూర్వుల వృత్తాంతము, తన్నుఁగూర్చి తాను జెప్పుకొనుటకంటె నితరులచేతఁ జెప్పించుట మేలుగదా! మఱియు సుదురుపాటివారు కులక్రమాగత ముగా వారి యాస్థానకవులు కావున నిచట రఘునాథతొండమాన్ యొక్క యౌచిత్యమేగాక, యాస్థానకవియందలి గౌరవాభిమానములు కూడఁ దేటపడుచున్నవి.

ఇందలి కొన్ని కల్పనలు భావములు మనోహరములై యున్నవి.

గణపతిస్తుతి:

చ. మంచముఁజేరి శంభుఁడు కుమారుని తొట్లను బెట్టినీవు చే
లాంచలమేల పట్టుకొని దవ్వకడంజను మన్నథత్క్యభి
మ్మంచనిపోరఁ జంద్రకళ నక్కుఱగై నిడఁగేలఁ ద్రోయుచున్
ద్రుంచిన దోసెయంచ సెడు తోరపుబొజ్జగలానిఁగొల్చెదన్

పార్వతీ దేవికి 'ఉమ' యని పేరువచ్చుటకుఁ గారణము కాళిదాసు తపస్సునకు వెళ్లవలదనుటవలన వచ్చినదని చెప్పఁగా మనకవి శివమంత్ర పరముగా దాని నిట్లు సమర్థించినాఁడు.

క. ప్రణవస్వరూపిణియై తగ నణఁకువగఁ దదక్షరమ్ము లన్నియునుండం
గణుతించి యంబ కల మునిగణ ముమ యనియపుడు నామకరణముచేసెన్.

ఓంకారములో అకార, ఉకార, మకారములుగలవు ఉమ శబ్దములో ఉకారము, మకారముమీఁద అకారము, మకారముగలవు.

సీ. వచససఁఖ్యనెగాదు వాచావిభూతిచేఁ జతురాస్యభావంబు సంఘటిల్లు
యానంబుననె కాదు, ధ్యానమార్గంబుచేఁ బరమహంసప్రీతి పరిఢవిల్లు
అధివాసమునెఁగాదు హాసోక్తియందును సత్యాశ్రయత్వంబు సంఘటిల్లు
ప్రభవరీతినె కాదు పారిశుద్ధ్యముచేతఁ గమలయోనిత్వంబు ఖ్యాతిఁగాంచు

గీ. నేమహామూర్తికతఁడు నీవేచరాచరాత్మకమస్తలోక జన్మాదికార్య
సంఘటనలేఖినమిత సర్వలేఖ! శ్రీవిధాతపదానత శ్రీవిధాత!

ఇట్లెన్నేని పద్యము లుదాహరింపవచ్చును. ఇందలి కల్పనలు, రసపోషణ, సంభాషణాచమత్కారము, జాతీయరచన చదివినకొలఁది చవులూరించును. కేవలైహిక శృంగారరసభూయిష్ఠములగు దాక్షిణాత్య ప్రబంధములలో నుదాత్తముగ నున్నకొలఁది కృతులలోనిది యుత్తమమని చెప్పనొప్పును.[1]

ఇందలి గద్య: ఇది శ్రీమద్బృహన్నాయికా కృపాకటాక్ష సంప్రాప్తనిత్య మహాసామ్రాజ్యధుర్య, సర్వమహీపాల స్తూయమాన శౌర్యౌదార్య గాంభీర్యశౌణాయమాన దృక్కోణవిలోకనమాత్ర హస్తగత సామంతదుర్గ నిరంతరపూజాసంతోషితభర్గ కోటిసమాఖ్యాసమఖ్యాతసత్కుల కలశపయోనిధిరాకానిశాశశాంక, ఘంటికాహనుమధ్వజమకరకేతన తురగ కరవాలవామకృశార్దూల త్రిపల్యయన సింహాస్య కటకనీలాసపత్రదివాదీపికా నిజోపాంగ నవవిధ భేరికాది నిఖిల బిరుదాంకవాత్స్యాయనాది వేదాంతపర్యంత

1. ఈ గ్రంథమునుగూర్చి సాహిత్యవిద్యాపోషకులు, సద్విమర్శకులు, కృతిభర్తలు నగు బ్రహ్మశ్రీ వేలూరిపాటి రామభద్ర చయనులుగారొక విపులవిమర్శ వ్రాసియున్నారు. అది శ్రీ మాడపాటి హనుమంతరాయ సన్మానసంచికలోఁ బ్రకటితమైనది.

నిఖిలతంత్ర నిర్మితగ్రంథసత్కృచ్ఛ్రవణవిదిత మహాకవి ప్రబంధ నూతన తంత్రకరణ సామర్థ్యనిరంకుశ ప్రతిభావిభాసుర, బహుళా గ్రహారప్రతిష్ఠా సంతోషితభూసుర, కులక్రమాయాత సాహితీ విద్యానవద్య, సకలసమ్మతనిజబిరుద పద్యదక్షిణాస్యనంసేవనా జీవన్ముక్తాయమానమహోద్దండ కవివిధేయ శ్రీరాయ రఘునాథ తొండమాన్ మహీపాలనామధేయ ప్రణీతంబైన పార్వతీపరిణయం బను మహాప్రబంధమునఁ బ్రథమాశ్వాసము.

## కవిజనోజ్జీవని

రఘునాథ తొండమాన్ రాజు రచించిన వేఱొకకృతి "కవిజనో జ్జీవని" అనునది. ఇందులో నూఱు తెలుఁగుసమస్యల పూరణముగలదు. ఈ గ్రంథమువలన రఘునాథ తొండమానురాజు సంస్కృతాంధ్రభాషా పాండిత్యప్రతిభ యెంతయో వెల్లడియగుచున్నది. ఈసమస్యల నాస్థాన కవియగు వెంకన్న యొసఁగినట్లును దాను బూరించినట్లును గ్రంథకర్తయే యిట్లు చెప్పియున్నాఁడు.

ఉ. శ్రీకరలీలఁ బుష్పమునఁ జెందిన తావియుఁబోలె దివ్యగ
త్వాకలితంబగుణ్ శ్రుతివిధంబున, జాబిలిచల్వరీతిగా
నాకపిలాశ్రుతీశ్వరుని యంగమునన్వసియించి సర్వవి
ద్యాకృతియై చెలంగు బృహదంబనుగొల్తు నభీష్టసిద్ధికిన్.

వ. అని యిష్టదేవతా ప్రార్థనంబుచేసి.

క. విజయరఘునాథభూపతనుజుఁ డఖిలక్షోణిపాలనుతుఁడనుచుఁ గలి
ప్రజమనఁగను మను కవితారవిని సుధాద్యుతిని రాయరఘునాథపతిన్.

గీ. వెంకనకవీంద్రుఁడుద్దండ బిరుదశాలి మమ్ముఁగొలిచియుఁ గఠినసమస్యలొసఁగ
నొప్పుకొనియేము పద్యముల్ సెప్పినంత నందఱును విని కృతికివి యర్హమనిన.

గీ. కవిజనోజ్జీవనియటంచుఁ గావ్యమొకటి దుర్ఘటసమస్యలకునెల్ల ద్రోవఁదెలియ
కవిజనంబులకును నుపకారకముగఁ జేతుదయచేత బృహదంబ చిత్తగింపు.

ఈ గ్రంథమున రఘునాథరాయని వైదుష్య మెట్లు వ్యక్తమైనది యీ క్రింది పూరణములవలనఁ దెలియనగును.

1. అక్షరవంచన,

"కలుషగిరి భేదశంబ శ్రీబృహదాంబా"

క. వకుళవననిత్యవాసిని సకలాభీష్టములనిచ్చు చక్కనితల్లీ
ప్రకటితముసేయు మీకృతి నృకలుషగిరి భేదశంబ! శ్రీబృహదంబా

2. యతివంచన – కఠినప్రాస,

గ్లావిమలాక్ష వేంకటనగాధ్యక్షా.

క. దిగ్లలలనాకబరీధర స్రగ్లాలితకీర్తిజాలసద్గుణశీలా
విగ్లపిత రక్షమార్తాండగ్లావిమలాక్ష వేంకట నగాధ్యక్షా.

3. కఠినప్రాస పునరుక్తరూప విషయసమస్య,

గోగ్రణిగో అగ్రణీగవాగ్రణియనియెన్.

క. అగ్రజగోశబ్దముపై నగ్రణిశబ్దంబుగూడ నదియెట్లగు సం
ధిగ్రహణఁ దెలుపుమనినన్ గోగ్రణిగో అగ్రణీగవాగ్రణియనియెన్.

4. కఠినప్రాస సంస్కృతాంధ్రభాషా సంప్రదాయికము,

క. భో అచ్యుతభో బ్రహ్మన్ భో అంబరచారిణాంవిభో సర్వేదే
వాఃఇయాతవ్యాయన గోఅగ్రణినెక్కి శివుఁడు గొబ్బున వెడలెన్.

5. అంతర్లాపి సమస్య,

దోనపులిమొనయమ్మశాఖి తుదలనిపల్కెన్.

క. వనజాంబకుండు ననుఁగని గినుకంగనలుచును గనులఁగెంపుజనింపన్
ననతూపువేసిరమ్మను దోనపులి మొనయమ్మశాఖి తుదలనిపలికెన్

దోన, పులి, మొన, అము, శాఖి, యీ పదముల చివరి యక్షరములు కలుపగా 'నలినముఖి' యగును. ఒక స్త్రీ తన చెలికత్తెనుజూచి దానితో 'ఓ నలినముఖి' నన్ను మన్మథుఁడు రమ్మనును అని పలికెనని భావము.

6. వృత్తగోపనము,

నారదవంద్య కాంతి జితనారద కాఁగిలినీయ వేమిరా.

క. మదనుఁడు కోపముచేతం గదనంబును జేయఁదొడఁగెఁ [illegible]
రదవంద్య! కాంతిజితనారద! కాఁగిలినీయవేమిరా! యిదియేరా!

వృత్తగోపనమనఁగా నొక వృత్తపాదమును వేఱొక వృత్తములో నిముడ్చుట. ఇచ్చట ఉత్పలమాలపాదము కందపద్యములో నిముడ్పఁబడినది.

7. ఏకపాదపూరణము – అనగా మూఁడుపాదములిచ్చి నాల్గవపాదము పూర్తిచేయుట.

చ. చిటికెన వ్రేలియుంగరము చేడియకొ డ్డౌను మాయె భూవరా
కటక చరత్కరేణుకర కంపితసాలము శీత శైలముల్
కటకట దోసపండ్లనుపకట్లకుఁ దాళునటే తలోదరీ!

పూర్తి:

చ. చిటికెన వ్రేలియుంగరము చేడియ కొడ్డైనమాయె భూవరా
కటకట దోసపండ్లనుపకట్లకుఁ దాళునటే తలోదరీ!
కటక చరత్కరేణుకర కంపితసాలము శీతశైలముల్
ఘటికిని గాంతునేనని నిజాంగనతోడను దెల్పువేగమే.

గ్రంథాంతమున:

క. ఈకృతియతి కరినసమునస్వకృతిఁ జదివినను విన్న సద్భాగ్యములౌ
నేకృతినైనను శ్రీనుత శ్రీకృతి విఖ్యాతగయును బృహదంబికయున్.

గద్య: ఇది శ్రీ బృహదంబికాపాదారవింద నిరంతరసంసేవనా విశేషలబ్ధ మహాసామ్రాజ్యధురంధర, సకలభూపాలసభాభాసుర యశోబంధుర, హనుమద్గరుడ మకరమత్స్యపతాకాది మహారాజలక్షణ నవవిధాంగభేరీప్రముఖ నిఖిలవాద్య గంభీరనినాద శ్రవణమాత్ర విరోధిగర్భనిర్భేదనవిచక్షణ, పాండ్యభూపాల దక్షిణబాహాయ

మాన, సకలభూపాలసంస్తూయమాన, వాత్స్యాయనప్రభృతి గ్రంథ్యంతపర్యంత పరిచయసముత్తేజిత ప్రతిభావిశేష ప్రబంధశత సమానవచో నిర్జితాదిశేష, ఆశురచనీయ మధురాదికవితాధౌరేయ, [illegible], రణరంగవిజయ, విజయరఘునాథ తొండమాన్ మహీనాథతనూజ, రసికతాభినవభోజ కోటికులదీప, శ్రీ రఘునాథభూపప్రణీతంబైన 'కవిజనోజ్జీవని' యను కావ్యంబునందు సర్వంబు నేకాశ్వాసము.[1]

## నుదురుపాటి వెంకన్న

సీతారామయ్య పుత్రుఁడు వెంకన్న పుదుక్కోట కవులలో నేకాక, దాక్షిణాత్య కవులలో నేకాక యాంధ్రదేశమంతటఁ బ్రఖ్యాతికెక్కినకవి. ఈతనికిఁ దండ్రివలెనే 'ఉద్దండకవి' బిరుదముకలదు. సంస్కృతమున నేకాక, అచ్చ తెనుఁగున నీతఁడసమానుఁడు. సంస్కృతమున నమరమునకుఁ బ్రతిగాఁ దెనుఁగున 'ఆంధ్రామరము' నిర్మించిన జగజెట్టి. నిఘంటు రచనమేకాక, నిరవద్యములగు పెక్కుకృతులు రచించిన విద్వత్కవి. ఈతఁడు క్రీ. శ. 1769-89 వఱకుఁ బాలించిన పై రఘునాథ తొండమాన్ రాజుచే బహుముఖముగా సన్మానింపఁబడిన విద్వత్కవి. ఈతని కృతులు :

### ఆంధ్రభాషార్ణవము

ఇదియే పైని పేర్కొనఁబడిన యాంధ్రామరకోశము. తెనుఁగు దేశమున నకారాది నిఘంటువులురాక పూర్వ మీ నిఘంటువు చాల ప్రచారములో నుండెడిది. ఆంధ్రవాఙ్మయములో నచ్చ తెనుఁగు నిఘంటువులలో నింతకన్న పెద్దనిఘంటువు వేఱేలేదు. ఆకాలపు నిఘంటువులవలె నిదియును బద్యమయము. అమరకోశమువలె నిందును స్వర్గవ్యోమ దిక్కాలాదివర్గముల విభాగముతో మూఁడుకాండములు గలవు. ఇది మాతృభూతేశ్వరస్వామి కంకితముగా రఘునాథ తొండమాన్‌రాయుని

---

1. ఆంధ్రసాహిత్యపరిషత్ప్రకటితము – సం. 25. సంచిక. 1.

ప్రేరణచే రచితమైనది. ఈ గ్రంథావతారికయందుఁ గవివెంకన్న ప్రతిభా దికమేకాక, తెలుఁగుభాష విశిష్టతయుఁ దేటతెల్లముగాఁగలదు. మఱియు నిందు రఘునాథరాయని పూర్వులైదుతరములవారు వర్ణితులైరి. రఘునాథునిగూర్చి చెప్పిన విషయములు చారిత్రకముగ విలువ గలవి. కావున నా యవతారికయందు కొంతభాగము నిందుదాహరించు చున్నాను.

ప్రారంభము :

శా. శ్రీమాత్మప్రకటీకృతాంగరుచిసారెంజూచి భాషింపు వో
నామేయైనత్రిలోకమాతయగుట నైవ్యశ్యాంగనందల్లియై
ప్రేమంబ్రోచుటఁజూడ వింతయెయనన్ శ్రీమాతృభూతేశ్వరుం
డామోదంబునఁబ్రోచుఁగాత రఘునాథాధీశచూడామణిన్.

* * * *

వ. అని యిష్టదేవతా నమస్కారంబును సుకవికుకవి పరిష్కార తిరస్కారంబులుంజేయు నవసరంబున.

సీ ..................పాంఢ్యమహీమండలాధ్యక్షు బాహుదండ
కలితశితతేజిత చకచ్చకత్కృపాణి దాన విద్యా సశిష్యసంతానపాణి
రంజితజనాళి రఘునాథరాయమౌళి.

వ. ఒక్క శుభదినంబున ............ సభాంతరాళంబునం గొలువుండి నన్ను రప్పించి సన్మానంబుసేయుచు సవినయంబున.

క. ఖచరీకచకుచవిచల ద్విచికిలహారస్రవన్నవీనమరంద
ప్రచురరుచి పెనుఁగొనుఁ గచాకచిగా నీకవిత లెన్నఁ గవి వెంకన్నా.

తే. ఆంధ్రగీర్వాణకవనములందు నీకుఁగలుగు జ్ఞానం బదేరికిఁ గలుగ నేర్పు
నాశ్రితుఁడవంచు నుతియించునట్లుగాదు కాని యవియేల యిపుడు వెంకనకవీంద్ర.

తే. దేవతలభాషగావునఁ దెనుఁగుకన్న సంస్కృతమెమిన్న యూయుక్తిసరియె తెలిసె
రసికుఁడగువాఁడు తనదుజారసికలోనఁ దులసినేయిడుకొనునో ?జాదులనెయిడునో?

తే. కాన నీ యాంధ్రకృతులను గలుగునట్టి పదములకునెల్ల నర్థమేర్పడుటయునుదె
నద్భుతంబుగఁ గృతిని జేయంగవలయు నర్థమైన రసస్ఫూర్తియగుటయరుదె.

తే. కృతికినాయకు మాతృభూతేశుఁ జేయ వలయునన నేనునట్లనేతలఁచితి ననఁ
బసిఁడిసొమ్ములుసేయించి వంటరాలఁ జెక్కినను మేలె రతనము ల్చెక్కినన్న.

వ. అనిన నేనునుం దదీయపరమేశ్వర చరణారవిందభక్తికి మెచ్చుచు సత్కులప్రసూతుండవగు నీకు నేతాదృశమనీషావిశేషం బరుదేయని తత్కుల ప్రశంసనుచేసెను.

ఈ గ్రంథమున కవియిచ్చిన వంశవృక్షమిది.




ఆపైని విజయరఘునాథునివర్ణన.

సీ. త్రిశిరః పురీపరివృఢమనోనలినికి బాలవిభాకరలీలఁదోఁచి
చోళరాజాస్థానకేళీగృహంబున మణిదీపికావళిమాడ్కిఁదనరి
మహిసూరినరపాల మానసాంభోధికి బాడబంబోయను పగిదిపెలసి
తత్ప్రియాన్యతుమాధవ శుష్కవసులకు దావపావకమను దారి నెగడి
త్రిపురద్వైతేయహరణ సంకుపితనిటల నయననయననటద్ధనంజయ జయావ
హంబుశ్రీవిజయ రఘునాథావనీంద్రు సత్ప్రతాపంబు గనుపట్టు సంతతంబు.

తే. దక్షిణామూర్తి సేవావిచక్షణుండు సంతతాద్వైత సిద్ధాంతసక్తచిత్తుఁ
డతఁడు తద్గర్భజలధిహిమాంశుఁడీవు రాయరఘునాథ నృపచంద్ర రణమృగేంద్ర.

ఉ. శ్రీరమణీ మణీచరణశింజ[illegible]పుంజమం
జీరనినాదవద్గృహవిశేషుఁడవౌచు సపుత్రపౌత్రతన్
ధారుణినేలు సౌభరివితమ్మున సర్వమహీపతుల్నినున్
సారెకుఁగొల్చులీల రఘునాథనృపాల విశాలవైభవా.

మ హృదయాలవాలముచక్కి భక్తిరసవారిన్ జ్ఞానబీజంబులో
నుదయంబంది ప్రరూఢపాదమగుచున్ గోకర్ణనాథాభిధ
త్రిదశానోకహసంగతిం దనరుచున్ శ్రీమద్బృహన్నాయికా
ఖ్యఁదగున్గల్పకవల్లి రాయరఘునాథాధీశునిం బ్రోవుతన్!

వ. అని తలంచి కార్యంబు నాశీర్వాదపూర్వకంబుగా నెఱవేర్చి మహారాజ నియుక్తప్రకారంబున.

క. శ్రీమత్సుగంధి కబరీ కామికిని మునీంద్రహృదయ గామికిని క్షమా
భూమికిని మాతృభూత స్వామికిని నమస్కరించి సద్భక్తిమెయిన్.

వ. అని యాంధ్రభాషార్ణవంబను మహాకృతిని రాయరఘునాథుని కంకితముఁ గావించెను.

సీ. గట్టులయొకిమీఁదు గన్నవాల్గంటని జెట్టఁబట్టుక యేలినట్టిదిట్ట
మున్నీటిరాచూలి ముక్కంటిజెడలోనఁ [illegible] కొన్నమేటి
గబ్బుచెంక మెకంబుగట్టి కళవసంబు కుబుసంబుగాఁ జేసికొన్నదంట
ప్రాఁబల్కుగుప్పముల్పన్ని సిస్తగునట్టి పుడమితేరెక్కుడి పోటుకాఁడు

జముపగఱబూచులదొర తొల్జంగమయ్య విసనికకలాఁడు ముక్కంటియనఁగనిట్టు
యౌగికంబుగ భవదాఖ్యలలరియుండు ధాతృనుతపాదజలజాత మాతృభూత.

గ్రంథాంతము:

తే. శ్రీలువెలయంగ నీపేరఁ జేయుకతనఁ బరగుశాశ్వతముగఁ గ్రియావర్గమిట్లు
వైకొనుము దీనిభక్తసంఘాభిమాని మాతృభూతజగత్త్రయీ మాతృభూత

* * * * *

మాలిని. సకలభువననాథా [illegible]
మకుటఘటితసోమా మంగళాధారనామా
సుకవిహృదయగేహా సుందరస్వచ్ఛదేహా
యకలుషనిజచర్యా యాశ్రితామోదకార్యా.

గద్య: ఇది శ్రీమత్పరమేశ్వర కరుణాకటాక్ష సంప్రాప్త సర్వజ్ఞత్వాది కతిపయగుణ స్వసామ్య తదితర సకలగుణ నిరౌపమ్యా సేతు హిమాచలఖ్యాత మహోద్దండకవి బిరుదప్రశస్త సీతారామార్య వర్యతనూజాత శౌర్యధైర్యస్థైర్యాది సకలగుణచిరత్నరత్నాకర కోటి సమాఖ్యావంశ సుధాపయోధిరాకాశశాంక ఘంటికాతురంగ నీలాతపత్ర హనుమద్ధ్వజమకరకేతన దివాదీప నవవిధభేరికాది నిఖిలబిరుదాంక బృహదంబికాకటాక్ష సంజాతసామ్రాజ్యధురంధర విమలయశోబంధుర కర్ణాట పాండ్యచోళమహీపాలాది సంస్తూయ మాన శ్రీ రాయరఘునాథమహీనాథ మహాసభాంకణ బిరుదాయ మాన ఆర్యనుతచర్య వెంకనార్య ప్రణీతంబైన యాంధ్రభాషార్ణ వంబునందుఁ దృతీయకాండము సంపూర్ణము.

క. బృహదంబికా కటాక్షం బహరహమును గాంచి సమధికైశ్వర్యముతో
మహి నేలుము శాశ్వతముగ రహిదిక్కులఁదోప రాయరఘునాథనృపా!

ఇట్లే ప్రతికాండాంతమునను గలవు.

పై నుదాహరించిన భాగమునుబట్టి యీ నిఘంటువు ప్రాశస్త్యము తెలియఁగలదు. ఇందు తత్సమపదములకు సరిగా నచ్చ తెలుఁగుపదము లీయఁబడినవి. అందుచేత నేఁటి తెలుఁగుకవులకు మిగుల నుపయోగ కారిగా నున్నది.[1]

---

1. ఈ నిఘంటువునకు వ్రాఁతప్రతులు ముద్రితప్రతులు చాలగలవు. వాని నుదాహరించుచున్నాను.

1. మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారము 1363 సంఖ్య నుండి 1368 వఱకు. వీనిలో 1358 సంఖ్యలో నాంధ్రభాషార్ణవశబ్దసూచి గలదు.

2. ఆంధ్రసాహిత్య పరిషత్తు. తాళపత్రప్రతులు.

ముద్రితప్రతులు

1. అర్ష ముద్రాక్షరశాల విశాఖపట్టణము, 1898 2. చింతామణి ముద్రాక్షర శాల, 1900. 3. వావిళ్ళ ముద్రాక్షరశాల, 1910,

ఈ నిఘంటువు మూఁడు పర్యాయములు ముద్రితమైనను, ప్రామాణికమగు ముద్రణము లేనేలేదు. ఈ నిఘంటువునుగూర్చి తొలుత పరిశ్రమ చేసినవారు భాషోద్ధార కులు బ్రౌనుదొరవారు. వారు 'దీనికి ఆంధ్రభాషార్ణవ శబ్దసూచి' అను పదసూచికను దయారుచేయించినారు. అది యెంత జాగరూకతతోఁ జేయఁబడినదియు, నెంత యుప యోగపడునదియు నీ క్రింది యుదాహృతభాగమునుబట్టి గ్రహింపవచ్చును.

## రఘునాథీయము

ఇది నరసభూపాలీయమువంటి యలంకార గ్రంథము. అన్ని యలంకారములును రాయరఘునాథున కంకితముగా రచియింపఁబడినవి. విభావనాలంకారము.

గీ. నీవలన నాజిఁగలిగిన భావమెంచి కలియుగంబున మించె నక్రమమటంచు
నడవులకుఁబాఱు నలికి నీయరులబారు నమదహితగేయ శ్రీరఘునాథరాయ.

---

ఆంధ్రభాషార్ణవశబ్దసూచి

బ్రౌనుదొరగారు వ్రాయించినది.

" The Andhra Bhash Arnavam is written in verse being in imitation of Amara Kosha, every verse containing the various synonyms forms the object."

" I caused a list to be made alphabetically of the words therein: with the meaning, in Telugu: it is arranged in this volume, on the plan used to my Telugu Dictionary."

" This work contains perhaps one - fourth of the language, certainly not more."

ప్రారంభము :—

ఆ-తృ-౧౨౨-ఏవకారార్థము. అంకవన్నె-ద్వి-౩౭౮-అశ్వపార్శ్వాలంబి రజ్జువు. అంకకాఁడు-తృ-౧౬-ప్రధానుఁడు. అంకుు-ద్వి-౨౬౮-అంకుశము. అంకె-ద్వి-౫౦౫-గోణ్యగ్రము-తృ ౮౭-సమయము అంగ-ద్వి-౩౭౧-ఆస్కందితము. అంగడి, ద్వి-౧౬-ఆపణము. అంగద ప్ర-౧౭౩-మనోవ్యథ. అంగదట్టము-ద్వి-౨౯౮-యోగాంతరీయము.

అంతము :—

హేమాహేములు-తృ-౨౬-బహువచనముచేత అన్యుల తెలిపేసట్లు పూజ్యులు. హైసరే-తృ-౧౨౧-యాథార్థ్యము. హొంతకారులు-ద్వి-౩౯౦-బిరుదువేసిన శెట్టి పరివారము. హొన్ను-ద్వి-౫౩౧-కాంచనము. హొమ్ము-తృ-౩౧-స్థూలము. హొయలు-ప్ర-౧౭౭-విలాపము. హొయల్కాండి-ద్వి-౩౭౬-కంబళివ్యాహాము. హొరగు-ప్ర-౧౭౭-విలాసము. హొరవల-ద్వి-౨౯౫-వన్నెగల కోక. హొరాహొరీ-తృ-౧౧౫-అవిచ్ఛిన్నము.

**Finished August 1850 ; Signed C. P. Brown** ఇది నేఁటివఱకు ముద్రితము కాకుండుట శోచనీయము.

## పార్వతీకల్యాణము

ఇది మీనాక్షీ సుందరేశ్వరుల కంకితముగా రచింపఁబడిన యక్షగానకావ్యము. ఇందు గ్రంథకర్తకుఁగల 'మహోద్దండకవి' బిరుద ముదాహరింపఁబడినది. రాగతాళయుక్తములగు ననేకాంధ్రకీర్తనలు, స్వల్పముగా సంస్కృతగేయములు గలవు. పార్వతీ పరమేశ్వరుల వివాహ మిందు వర్ణితము. సంస్కృత గేయరచన కుదాహృతి:

ఘనమణిదీపే కల్పితధూపే కనదతి చిత్రకలాపే
కనకమయోల్లస దనుపమసైజభవన శుకమధురాలాపే
శ్రీకరవిభవశ్శివయా సమేతశ్శ్వేతే మాణిక్యసౌధే
శ్రీకామహర హరహర హరేతి గీతం ప్రాకారరక్షణం కుర్వంతు.

## తొండమాన్ వంశావళి

తొండమాన్ రాజుల వృత్తాంతమును దెలుపు నీ వంశావళి 373 సీసపాదములలో మాలికగా రచితమైనది. చరిత్రకారుల కత్యంతోపయుక్తమైనది.

ప్రారంభము:

సీ. "శ్రీజానకీదరస్మిత నిదానీకృత భాషణుం డాశ్రితపోషణుండు
... ... ... ... నిచ్చలు దయసేయ హెచ్చుచు నానాఁట
విజయచందురు రీతి వెలసితౌర ... ... ... ...
కోటికులాంబుధి కువలయినీజార రణరంగధీర వీరాధివీర

రఘునాథభూపాల రమణీయగుణజాల భవదన్వయంబును బ్రస్తుతింప
నాహ్లాదము జనించె నానతీవర్ణింతు"

అని రాయరఘునాథుని పూర్వుల నిరువది తరములనుండి వర్ణించినాఁడు. మఱియు, పుదుకోట నిర్మాణము, పుదుకోటరాజును, మధుర తంజావూరి నాయకులతో యుద్ధములు, వారి విజయములు విపులముగా వర్ణితములైనది. ఇం దంతయుఁ బ్రామాణికమగు చరిత్రయే వ్రాయఁబడినది.

గ్రంథాంతము :

విజయలక్ష్మి వరింప వేడుకలనుగాంచి విదియచంద్రురీతి వెలసితనుచు
వంశావళులొనర్చి భవదీయసంతతి మత్కృతాశీర్వాద మహిమవలన
నలరుఁగావుత రాయపదాంకధుర్య! ఆర్యజనగేయ! తొండమానాభిధేయ!
రాయరఘునాథ నృపచంద్ర రణమృగేంద్ర ధరణివర్ధిల్లు మాచంద్రతారకముగ.[1]

## బృహన్నాయికాదండకము

ఇది పుదుక్కోట పురవరాధీశ్వరియగు బృహన్నాయికకు సంకితముగా రాయరఘునాథునిగూర్చి తెలిపెడి పెద్దదండకము. ఇందులో వెంకనార్యుని నిరర్గళ సంస్కృతాంధ్ర కవనపటిమ కనఁదగును.

ప్రారంభము :

శ్రీమత్ బృహన్నాయికా నామధేయే, మహాదేవజాయే మహావిష్ణుమాయే, నవాంభోదకాయే, ......... శ్రీలసన్మేఖలా నూపురాలంకృతే, దివ్యపీతాంబరాలంకృతే యంచనన్ దేవబృందంబుచే సన్నుతుల్ గాంచు శ్రీచక్రరాజంబుపై నిండుకొల్వుండు శ్రీమన్మహారాజరాజేశ్వరైనట్టి మేల్ భక్తచింతామణింగాను రంజిల్లు ............... సంగీత సాహిత్యలోలుండు సత్కీర్తిశీలుండు శ్రీమన్మహారాజ రాజాబహద్దర్ రఘూత్తంసనాథుండు బల్ హాయిగానంత నానావిధానర్ఘ్య రత్నాంబరాలంకృతుండై ......

దండకము చివర :

శ్రీమన్మహారాజరాజేశ్వరీదేవి శ్రీమత్పదాల్ వర్ణనారూపమానీ కృతిన్ ఆకవీంద్రుల్ నుతింపంగ నుద్దండ విద్వత్కవిత్వాంకనుండైన శ్రీ వేంకనార్యున్ తృతీయాత్మజుండేయు శ్రీమత్ బృహన్నాయికా దండకం బుర్వి నాచంద్ర మస్తారకాంభోజినీ బంధుబింబంబుగా వర్ధిలున్.[2]

---

1. ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక. సం. 2. పుటలు 304-17. 1914 లో ముద్రితము.

2. ప్రాచ్యలిఖితభాండాగార గ్రంథసంఖ్య 1992 అముద్రితము.

## మల్లుపురాణము

ఇది మల్లుల యుత్పత్తినిగూర్చి తెలుపు నాల్గాశ్వాసముల పద్య కావ్యము. ఇది మల్లయుద్ధమునఁ బ్రసక్తములకు ముప్పదిరెండు విన్నాణము లిందుఁ జేర్పఁబడినవి. పుదుక్కోట కెరువదిరెండుమైళ్ళ దూరమునసున్న గంధర్వకోట నివాసియగు బిరుదు కుప్పాల్ మల్లున కంకితముగా రచియితమైనది. ఇది యముద్రితము.

కృతిపతి విషయము - ఈకవి బిరుదు కుప్పాలుమల్లుని ప్రేరణచే నాతనికిఁ గృతిగా బ్రహ్మాండపురాణములోని దేవమల్లు చరిత్రము నాంధ్రీకరించినట్లుగా నీ క్రిందిపద్యములవలనఁ దెలియుచున్నది.

సీ. శ్రీకరుణారసార్ద్రీకృతభవనుండు విత్వాత్క విచ్ఛటావినుతకీర్తి
మల్లవంశాభోధిహల్లకినీపతి గార్గ్యసగోత్రవిఖ్యాతమౌళి
సురుచిరాపస్తంబ సూత్రక్రియావేది యభ్యాసిగండగేహాభిమాని
వేంకటేశ్వరమల్లవీరపుత్రాగ్రణి లక్ష్మణాంబాగర్భరత్నభూష

గీ. సకలరాజాధిరాజ ప్రశస్తముద్దు వడుగనాథేంద్ర దత్తప్రవర్ధమాన
సకలనిరవధికైశ్వర్యశాలిపుషిత బాంధవజనుండు బిరుదుకుప్పాల్ ఘనుండు

ఉ. కొండలవంటి జెట్లకులగోత్రము లేమని తెల్పలేకయే
యుండుదు రందఱుం దెలియ నొక్క కృతిం రచియింపుమీవు బ్ర
హ్మాండపురాణమందుఁగల మల్లకులక్రమ మంధ్రభాష భూ
మండలిఁ బండితోత్తములు మానసవీథిఁ దలంచి మెచ్చఁగన్.

ఈకృతి నాయకుఁడు జెట్టివంశములోనివాఁడయినట్లు పైనిఁజూపిన మల్లు జెట్టికుల శబ్దములనుబట్టియు,

గీ. అల్లఘనునకి నియ్యాళిగాద్రిజెట్టి వేంకటేశ్వరమల్లుండు విశదరీతి.

అనుచోఁ గృతిపతి పెదతండ్రి పేరులలోనున్న 'జెట్టి, మల్ల' శబ్దములనుబట్టియుఁ దెలియుచున్నది. ఇందలి యవతారికను బై పద్యములనుబట్టి యీ కృతినేత ముద్దువడుగురాజు మొదలగువారివలన గొప్ప

మైశ్వర్యమార్జించిన సేనానాయకుఁడని తెలియుచున్నది. ఈరాజాకాలమున రామనాథపుర సంస్థానమును బాలించుచుండెను. అతనిచే గౌరవింపఁబడిన యీ బిరుదు కుప్పాలుమల్లుఁడుమాత్రము గంధర్వకోట నివాసుఁడని తెలియవచ్చుచున్నది. ఇది పుదుకోటకు 20 మైళ్ళ దూరములో నున్నది.

గ్రంథవిషయము – తారకాసురుని మనుమఁడగు వజ్రదంతుఁడను రాక్షసుఁడు స్వర్గలోకజయంబునకై యీశ్వరునిగూర్చి తపస్సుచేసి వరంబులుగొని మదించియుండఁగా నతని దేవమల్లుఁడనువాఁడు సంగ్రామంబున నోడించుట, యీ మల్లునివంశము నిందు వర్ణింపఁబడినవి. అందందు దోషములుగలవు గాని కవిత్వము మృదువుగానుండును.[1]

గ్రంథ ప్రారంభము :

శా. శ్రీమజ్జానకి [illegible] చెంబట్టి భార్యాభిధన్
దా మెల్లన్వినఁబల్కు నిత్తుమనసీతా దెల్పనంచేవచ
స్సామర్థ్యంబునఁ దెల్పఁదెల్పననివారం తన్నుగన్నవ్విభున్
వ్యామోదుండగు రాముఁడీ బిరుదుకుప్పాల్మల్లునిం బ్రోవుతన్.

ఉ. ఏకవిమూలమై తగనొయేకవిదుంపయుగన్ జెలంగనో
యేకవులందుమీఁదట ననేకవిశమ్ములఁ గొమ్మలుం జిగు
ళ్లాకులు సూనముల్ ఫలములై విలసిల్లనొ సంస్కృతాంధ్ర భా
షాకవనామరద్రుమలకు సత్కవిచంద్రములైనయట్టి వ
ల్మీకజ నన్నపాదులకు మేల్మిఁదలంచి నమస్కరించెదన్.

వ. అని ............ యుండుసమయంబున.

సీ. శ్రీకరుణాకరసార్వి కృతభవనుండు విద్వత్కవిచ్ఛటా వినుతకీర్తి
... ... ... ... ...
... ... ... ... ...
బాంధవనుండు బిరుదు కుప్పాల్లనుండు.

1. ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారమునను నాంధ్రసాహిత్య పరిషత్కార్యాలయమునను దీని ప్రతులు గలవు.

క. నను(బిలువనంపివచ్చిన వినయముతో నొక్కమాట వినవలెననుచు౯
వనరుహభవ వనితామణి కనకమణీవలయ నినదకలమధురోక్తి౯

ఉ. కొండలవంటి జెట్లు ... ... ...
... ... ... ... ...
... ... ... ... ...
... ... ... ... ...

"క. జలవైరి గంధసింధుర గళబంధుర ఘటితఘంటికారావనిర
ర్గళ ధాటీపటిమ మనీషిలలామా నుదురుపాటి సీతారామా."

క. అని వినుతిఁ గన్న యతనికిఁ దనయుఁడవగు నిన్ను మాకుఁ దరమా పొగడం
గను నభినవ సర్వజ్ఞుఁడ వనఁదగు నీకెట్లుసాటి యన్యకవీంద్రుల్.

క. అవాత్స్యాయన తంత్రంబా వేదాంతముగఁ దెలిసినట్టి కవీంద్రుం
డీ వొక్కండె ధరాస్థలిఁ గావున నీకవిత మిన్న కవిశంకన్నా!

వ. అని తగుపాటి వినుతించి వీటికనకశాటీ ప్రముఖంబులొసంగ సంగతానందుండనైన నేనును గృతినాయకుని యన్వయావతారక్రమంబు నభివర్ణించెద.

సీ. సకల చరచరాత్మక జగత్కర్త యావనరుహగర్భుఁ డెవ్వానితండ్రి
... . ... తద్విరోధి పరచ్ఛట ధారవీర
వజ్రదంత విదారి యెవ్వానిపాణి యతఁడు చెలువొందు సమరసహాయనితంబ
జాత్తహృదయుండు దేవమల్లాభిధుండు

క. అతనికి సుతదశకంబద్భుతగుణసౌందర్యవీర్య భుజబలవిద్యా
న్వితముగఁ బొడమెను దత్సంతతి పొల్పొంగినవితానఁ దనరుచు రాఁగ౯.

క. అందుఁ గెంపనమల్లుం డందఱు వినుతింప వెలసె నరవిందభవ
స్యందనపర చందనదర నందనధరణీజగణ ఘణాయితయశుఁడై.

తే. అల్లఘనునికి నాయళగాద్రిజెట్టి వేంకటేశ్వరమల్లుండు విశదరీతిఁ
దనయులన వెలయుచున్నారు ధరణిలోనఁ దలఁచి చూచిన భేద మింతయును లేక.

తే. వేంకటేశ్వరమల్లుఁ డా వేంకటేశ్వరుండు కావున నురమున నుండులక్ష్మి
పరిచరియముఁ జేయఁ జెంతకువచ్చె ననఁగ నాతనికి భార్యయై లక్ష్మమాంబ వెలయు.

తే. అల్లఘునునికి నాసాధ్వియందుఁ గలుగు నందనులలోన నగ్రగణ్యత వహించఁ
దగినధీరుండు నీవేర సుగుణహార వరహృదయభల్ల! బిరుదు కుప్పాలుమల్ల!

మ. కరినిం గన్గొన గుప్పునం దుముకుసింగం బోయటంచెన్నని
బ్బరపుఁ శౌర్యముఁజూపుచుఁ బిరుదు కుప్పాపెట్టిపై దాఁకియా
బిరుదుల్గాంచితివౌర నిన్నుఁగని హంవీరు లున్నతింపంగ మేల్
పరమండూక ఘుటీఫణీ బిరుదు కుప్పాల్మల్ల వీరాగ్రణీ

... ... ... ... ...

తే. తమ్ములంచనఁ దనకు నుదారరీతి రామసామియు వేంకటరమణుఁడుండ
నఖిలశత్రుల నణఁగించునట్టి శక్తి సకల బిరుదమ్ము లెసఁగు శాశ్వతముగాను.

గీ. ఇంత ఘనుఁడవు గావున నెంచిచూచి మల్లకుల చక్రవర్తియై మనుచునుండు
పెద్దకుప్పనమల్లుండు ప్రీతితోడ నఖిలజనములు మెచ్చఁ గన్యకనొసంగె.

... ... ... ... ...

క. వీరునకు బంధుజనతాధారునకు సమస్తమల్లదర్పాపహాదో
స్సారునకు బిరుదు కుప్పాల్ ధీరునకుఁ బ్రబంధకృత్సుధీమేరునకున్

వ. అంకితంబుగా నా యొనర్పంబూనిన దేవమల్ల చరిత్రంబను మహాప్రబంధంబునకుఁ గథావిధాన మెట్టిదనిన.

... ... ... ...

క శ్రీముద్దువటుక నృపతిలలామకృత గజాదిభాగ్య ... ట్వ
హైమదశసింహముఖ ముక్తామణి గుచ్ఛాద్రకుసుమదామోల్లసితా.

... ... ... ...

గద్య: ఇతి శ్రీమత్పరమేశ్వర కరుణాకటాక్ష సంప్రాప్త సర్వజ్ఞత్వాది కతిపయగుణ స్వసామ్య తదితర సకలగుణ నిరౌపమ్యాభూతపాల పూర్వతంత్రసద్యః కల్పన శేముషీనిధాన రాయరఘునాథమహీ సభాంకణబిరుదాయమానా సేతుహిమాచలఖ్యాతి మహోద్దండ కవి బిరుదప్రశస్త సీతారామార్యతనూజాత సకలవిద్వత్కుల వినుతచర్య వేంకనార్యప్రణీతంబైన దేవమల్లు చరిత్రంబను మహా ప్రబంధంబునఁ జతుర్థాశ్వాసము.

వెంకనకవి రాయరఘునాథునిపైనిచెప్పిన చాటువులు - అను బంధమున నుదాహరించితిని.

# శ్రీమన్నారాయణయ్య లేక మన్నారయ్య

పుదుకోటకవులలోఁ బేరొందఁదగిన వారిలో మన్నారయ్య లేక శ్రీమన్నారాయణకవీంద్రుఁ డొకఁడు. ఈతఁడు క్రీ. శ. 1730-69 లో పుదుకోటను బాలించిన విజయరఘునాథునికాలమున నున్నవాఁడు. ఆతని సోదరుఁడగు కోటి రాజగోపాలరాయని కాశ్రితుఁడు.

ఈతఁడు భానుకవి రచితమగు సంస్కృత రసమంజరి నాంధ్రీకరించి యున్నాఁడు. ఈ కృతియుఁ దనకుఁ బోషకులైన రాజులనుగూర్చి చెప్పిన చాటుపద్యములుతప్పఁ దదితరరచనలేవియుఁ గానరాలేదు. వేంకటార్యుని పుత్రుఁడు - భారద్వాజగోత్రుఁడు - ప్రౌఢకవి - సంస్కృతాంధ్రభాషా విశారదుఁడు. ఈ గ్రంథమునుండి యుద్ధృతములైన యీ క్రిందిభాగము వలన నతని కవితాశైలి తెలియనగును.

ప్రారంభము :

క. శ్రీరంగస్థల వక్షస్స్ఫార శ్రీవత్సకౌస్తుభప్రభలు తమ
సూరులఁ గేరు న్మిళుక శ్రీరంగస్థలపతిఁ భజింతుఁ భక్తిఁ.

ఉ. వల్లభునుల్లమందుఁ గృతవాసయగుందనదివ్యదేహమ
త్యుల్లసిత ద్యుతిన్వెలికిఁ దోఁచెననం దదురస్థలంబునఁ
జెల్లుబడి న్నిరంతరముఁజేరి వసించు సరోజపాణి మ
త్తల్లి యభీష్టసిద్ధి సతతంబు నెసఁగ నొసంగు నెంతయుఁ

క. వినుతి యొనరింతు మలయల్లునికి నటన చలితమకుట లుతదమరధునీ
ఘనతర తరంగబింబిత వనజారి కళాసహస్ర వల్గనగతికిఁ

క. కేవల కాంచనకటక విధావిష్కృతయుతులు కాళిదాసాదికవుల్
భావింప రత్నకటక మహావిభవులు నన్నయాదులాంధ్ర కవీంద్రుల్

వ. అని యెద్దియేని యొక సరసకృతి చమత్కృతి సమున్నతిగ రచియింప నుతిఁబూనియున్న సమయంబున.

సీ. కోటివంశాంబుధి కుముదినీరమణుండు కువలయానందైక గుణగణుండు
... ... ... ... ...

గీ. కలిత నిజనామబోధిత కాంతివిభవ సమరసాహస సత్యవాక్క్రమసమాజ
శీలపురుషుఁడు రాజగోపాలభూప విజయరఘునాథ వసుమతీ విభుఁడుభువిని.

మ. ప్రసరచ్ఛాత్రుని నప్పయార్యవర సత్పౌత్రుఁ ద్విషన్నీరద
శ్వసనస్ఫూర్తిని జియ్యవేంకటమహాచార్యాత్మజుఁ విశ్వవి
శ్వసనీయుఁ శరకోపయోగికరుణా సంప్రాప్త సారస్వత
స్వసనాథుఁ ద్వయపూర్వ వాక్యముఖషడ్వర్ణప్రసిద్ధాహ్వయుఁ.

మ. ప్రతిభోదంచిత కావ్యకల్పన భరద్వాజీయగోత్రుఁ జగ
న్నుత చారిత్రుని నన్నుఁజూచి పలికెఁ.........

మ. సుకవీంద్రుండవు మన్తురుండవు జనస్తుత్యుండ వత్యాదరుం
డ కళంకాత్ముఁడ వాంధ్ర సంస్కృతకవిత్వాత్యంత విఖ్యాతుఁడౌ
సకలోర్వీనుతరీతి నీవొకకృతిఁ సంతుష్టుఁడై చేసి వే
డుక గావింపు మిలన్మదంకితము ప్రౌఢోక్తిఁ సుధీంద్రాగ్రణీ!

.. క. శీలితబుధమానస మధుపాళిరసాసంగహేతువై యలరఁగవా
క్కేళిని నే రసమంజరి బాళిఁబ్రకాశింపఁజేసె భానుఁడు జగతిఁ.

క. రసమంజరి తెనుఁగొనర్చి రసికులు పొగడఁ.

అని రాజుపలుకగా నాంధ్రీకరించెను. అవతారికలోఁ గృతిపతి వంశావళి విశేషముగాఁగలదు. నాల్గాశ్వాసములు. ప్రత్యాశ్వాసాంత మున గద్యమును బద్యరూపకముగా రచియించెను.[1]

శా. వన్నెల్మీఱఁగ నుల్లసిల్లిన భరద్వాజీయగోత్రార్ణవో
త్పన్నశ్రీఁగొను సూరిచంద్రుఁడు దలిర్పఁ వెంకటాచార్య శ్రీ
మన్నారాయణ సత్కవీంద్రుఁ డొనరింపఁ రమ్యమై యాంధ్రమై
యన్నన్నా రసమంజరీకృతిఁ జతుర్థాశ్వాస మర్వ్రాం దగున్.

---

1. ఆంధ్రసాహిత్యపరిషత్తు గ్రంథసంఖ్య 148. పరిషత్పుస్తక భాండాగారము. ద్వితీయభాగము. పుట 76, 77. గ్రంథము చివర "నవసాలపురమునందే పసమటినగరు దొరనై యంకితముగా శ్రీమన్నారాయణయ్యంగారు చేసిన రసమంజరి యను గ్రంథము వీరెనుబ్బయ రాక్షసనామ సంవత్సర శ్రావణశుద్ధషష్ఠికి వ్రాత పూర్తిచేసెను" అని కలదు.

# నవనప్ప - ఖడ్గలక్షణశిరోమణి

తెనుఁగుభాషలో శాస్త్ర గ్రంథములు ప్రత్యేక వాఙ్మయశాఖగా బరిగణింపఁదగిన విలువగలవి. కాని నిన్న మొన్నటివఱకు నీ గ్రంథములకు పర్యాప్తమైన పరిశీలనలేదు. ఈ శాఖాసంబంధములైన గ్రంథములన్నియు, నసిగాఁ, జక్కఁగాఁ, బరిష్కృతములై, వ్యాప్తినందినఁగాని, తొల్లి సర్వాంగసంపన్నముగా వెలసిన తెనుఁగు సాహిత్యస్వరూపము తేటతెల్లముకాదు ; కావ్యలక్షణములును, గవితారీతులును, గవి ప్రతిభయును వెల్లడికాదు.[1]

## గ్రంథప్రశస్తి

ఈ[2] గ్రంథము పేరునుబట్టి యిది కత్తులను వానిస్వరూపములను వివరించునది యని తెలియుచునేయున్నది. తెనుఁగులో నింతవఱకు ప్రత్యేకముగా ఖడ్గములను గూర్చిన పద్యరూప గ్రంథములేదు. మఱి యొక విశేషమేమనఁగా నీ గ్రంథము దక్షిణదేశమున బుడుకోఁటలోఁ

---

1. ఇట్టి పరిస్థితిలో మదరాసు రాష్ట్రీయ ప్రభుత్వమువారు, దేశభాషలలోని ప్రాచీన గ్రంథము లచ్చుకూర్పించుటకుఁ దలపెట్టుటయు నందు ముఖ్యముగా, సంగీతము, వైద్యము, జ్యోతిషము, వేదాంతము, చరిత్ర మున్నగు శాస్త్రీయ గ్రంథములకుఁ బ్రాధాన్య మొసంగుటయు మిక్కిలిగా భాషాభిమానులందఱును బ్రశంసింపఁదగినది. ఈ ప్రణాళికలోఁ దెనుఁగుభాషలో వెలువడిన శాస్త్రీయ గ్రంథములలో నీ ఖడ్గలక్షణ శిరోమణి యొకటి.

2. దీని మాతృక యొక్క వ్రాఁతప్రతి మాత్రమే లభించినది. అది 2667 సంఖ్యగా మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారముననున్నది. ఆప్రతి వివరములివి.

" కాగితము నెం. డి. 2677 (పొడవు $13\frac{1}{2}$ " వెడల్పు $8\frac{1}{2}$) పుటలు 19 పుటకు 26 పంక్తులు. వ్రాఁత చక్కఁగనే యున్నది. కాని తప్పులు గలవు. పద్యపాదములలో నచ్చటచ్చట లోపములు గలవు. ప్రతి సమగ్రముగ నున్నది. ఒక్క ప్రతిమాత్రమే గలదు."

ఆంధ్రసాహిత్యపరిషత్తు (కాకినాడ) పుస్తకభాండాగారమున 95 సంఖ్యగా కత్తుల లక్షణము తెలుపు చిన్న పుస్తకముగలదు. కాని యది యీ గ్రంథమునను సరించి వచనములో వ్రాయఁబడినది. అదియైన సమగ్రముగాదు.

బుట్టినది. కాఁబట్టి శాస్త్రీయ గ్రంథముగ నేగాక, దక్షిణాంధ్రసార స్వతమునకు సంబంధించిన గ్రంథముగాఁ గూడ నిది పరిగణింపఁ దగినది.

## గ్రంథ స్వరూపము

ఈ గ్రంథములో 77 పద్యములు నొక పెద్దవచనము మఱియొక చిన్నవచనమును గలవు. మొత్తము 79. వీనిలో 1. చంపకము, 1 ఉత్పలము, 15 కందములు, 14 గీతములు, 46 సీసపద్యములుగలవు. లభించిన ప్రతియొకటియే యగుటచేతను, సాంకేతిక పదజాలము విశేషముగ నుండుటచేతను, గ్రంథ విషయము లోపింపకుండ స్వల్పసవరణములు చేసి యథామాతృకముగ నిది ముద్రింపఁబడినది.

## గ్రంథకర్త కాలము

దీనిని రచియించినకవి నవనప్ప, నల్లపిచ్చయ్య కుమారుఁడు. ఈతని కులగోత్రములు తెలియరాలేదు. కాని యీతఁడు ఖడ్గములను గూర్చి పూర్తిగాఁ దెలిసిన యీ క్రింది వ్యక్తులనే పేర్కొనుటచేత, నీతఁడును నా విశ్వకర్మశాఖకు సంబంధించినవాఁడని గ్రహింపవచ్చును.

1. తిరుమలచిదంబరుఁడు – ఇతఁడు విశ్వకర్మను మించిన ప్రజ్ఞగలవాఁడు.
2. చిగిలి లక్ష్మారాముఁడు – సకల ఖడ్గముల క్రమము నెఱిఁగినవాఁడు.
3. శెంకిసుమాలు – పనివారలందఱిలోఁ బండితుఁడు.
4. ఆపకుశాయి – ఖడ్గపరీక్షయందు నిపుణుఁడు.
5. సుభాభక్తుఁడు – పై లక్షణములన్నియు గలవాఁడు, గొప్పపనివాఁడు.

నవనప్ప తనతండ్రి నల్లపిచ్చయ రాయరఘునాథరాజుచే సన్మానితుఁడనియు, తాను రాయరఘునాథరాజు తనయుఁడగు విజయరఘునాథరాజు ఆనతియఁగా నీ కృతి రచించితిననియుఁ జెప్పుకొన్నాఁడు. (7–9 పద్యములు) పై వారిలో రాయరఘునాథరాజు పుదుకోటను క్రీ. శ. 1769-89 వఱకును బాలించిన తొండమానురాజు. ఇతఁడు భాషా

పోషకుఁడగు విద్వత్ప్రభువు. ఈతనిని గూర్చి యీవఱకే తెలిపితిని. ఈతని వెనుక విజయరఘునాధరాజు రాజ్యమునకువచ్చి క్రీ.శ. 1789-1807 వఱకును పాలించెను. కాబట్టి యీ కవియు క్రీ.శ. 1780 ప్రాంతమున నున్నవాఁడని[1] చెప్పవచ్చును.

## గ్రంథ విషయము

ఈ గ్రంథమున అసి మొదలుగా ముప్పది రెండాయుధములు పేర్కొనఁబడినవి. ఆవెనుక వానిలో ముఖ్యమైన 'అసి' యను ఖడ్గము నకుఁ బ్రత్యేకముగా 'లక్ష్మీనారాయణ సంవాదము' అను గ్రంథమున లక్షణములు చెప్పఁబడియున్నవనియుఁ దాను దాని ననుసరించితిననియుఁ గవి చెప్పినాఁడు, కాని యీ గ్రంథ మిప్పు డెచ్చటను గానరాదు. ఆవెనుక నూటనలువదిమూఁడు విధములగు నాయుధములను వాని లక్షణ ములను దెలిపియున్నాఁడు, కవి నవీనుఁడగుటచేత నితర భాషాపదము లను, సాంకేతికపదములను వాడియున్నాఁడు. ఇతఁడు వాడినవానిలో ఫిరంగి, సైపు అనునవి అరబీపదములు. బందరు సూరై, త్యాగ, ఖండామిశ్రి అబ్బాసి మొదలగునవి ఉర్దూపదములు. ఇవి పారశీకభాషనుండి వచ్చినవగుటచేత, భాషోద్ధారకులు బ్రౌనుదొరవారు వీనిని దమ నిఘంటు వులో (1852 ముద్రణము) నిచ్చియున్నారు. పైవానిలో "ఫిరంగు" అనునది యగ్నిహోత్ర సంబంధమగు నాయుధమనియు నది చేతితో నుపయోగింపఁబడునదికాదని మనకొక యభిప్రాయముగలదు కాని యిదియు కత్తులలో నొక భేదమని యీ గ్రంథమునుబట్టి, నిఘంటువునుబట్టి తెలియుచున్నది. ఖండాపదము తెలుఁగుకవు లుపయోగించినపదమే.

---

1. నేనీగ్రంథమును ప్రభుత్వపక్షమునఁ బ్రకటించిన వెనుక, తెనాలి వాస్తవ్యులు పరమనిష్ఠాగరిష్ఠులు. అంతర్ముఖులునునగు శ్రీభాగవతుల పూర్ణయ్య శాస్త్రులవారు, ఖడ్గ లక్షణశిరోమణి గ్రంథకర్తఁగూర్చి యీ క్రింది రీతిని నాకుఁ దెల్పిరి. "ఈతఁడు భాగవతుల నాయనప్ప అను పేరుగలవాఁడు మాకుఁ బూర్వుఁడు. ఖడ్గశాస్త్రమున చాల పరిశ్రమ చేసినవాఁడు. దక్షిణదేశమున, ముఖ్యముగా పుదుక్కోటలో నీ ఖడ్గ ముల పరిశ్రమ హెచ్చుగ నున్నదని తెలిసి యచ్చటికి వెళ్ళిపోయి యచ్చటనే స్థిరపడి నాఁడు. నుదురుపాటివారీతని బంధుకోటిలోనివారు." భావిపరిశోధకులకు నుప యుక్తమగునని యీ విషయము నిం దుదాహరించితిని.

తెలుఁగుకోశమున ఖడ్గమున కనేక పర్యాయపదములున్నను, 'అసి' అను పదము వేదకాలమునాఁటి ప్రాచీనపదము. అయినను "ఖడ్గతిక్కన" "ఖడ్గనారాయణ" మొదలగు బిరుదనామములు ఖడ్గశబ్దప్రసిద్ధినే సూచించుచున్నవి.

నవనప్ప ఈ గ్రంథమును 'అసి' ప్రబంధమనిచెప్పి ఖడ్గలక్షణా శిరోమణి యని దీనికిఁ బేరుపెట్టుటయే పైని తెలిపిన ఖడ్గ పదవ్యాప్తిని రూఢిపఱచుచున్నది.

## ఖడ్గముల వివరణము

మొదట 32 ఆయుధముల వివరణము:

(1) అసి, (2) ముద్గరము, (3) ముసలము, (4) కోహాణము, (5) కణయము, (6) కంపణి, (7) సిల్లు, (8) భల్లాతకము, (9) భిండివాలము, (10) కరవాలము, (11) కుంతము, (12) కోదండము, (13) కఠారి, (14) తోమరము, (15) పరశు, (16) త్రిశూలము, (17) వజ్రముష్టి, (18) గద, (19) ఆఘ్రుది, (20) అంగల, (21) అంకుశ, (22) వంగిణి, (23) చక్రము, (24) సబళము, (25) ఈఁటె, (26) ఇనుపకోల, (27) సెలకట్టె, (28) పట్టిసము, (29) ప్రకూర్మము, (30) నఖరము, (31) మయూరదండము, (32) నారసము,

కత్తులు సామాన్యరకములు:

(1) హస్తము, (2) మకరము, (3) జనబల్, (4) మక్కె, (5) వాజలల్.

| ఫిరంగుతరగతి | | సైపు తరగతి | |
|---|---|---|---|
| 1. కిరైమాన్ | ఫిరంగు | 6. పూర్తికాల్ | సైపు |
| 2. తురా | ,, | 7. సుక్కా | ,, |
| 3. ఎక్కేల్ | ,, | 8. మకరబ్ | ,, |
| 4. దోర్యా | ,, | 9. రుకమ్మి | ,, |
| 5. కుషీకా | ,, | 10. ఇనుపాత్ | ,, |

| | |
|---|---|
| 11. మళయవారి | సైపు |
| 12. ఉలాందా | ,, |
| 13. జజ్ఞా | ,, |
| 14. ఫుతన్క | ,, |
| 15. కుష్కి | ,, |
| 16. ఇసుపాత్ | ,, |

బందరు తరగతి

| | |
|---|---|
| 17. చాందు | బందర్ |
| 18. గోవా | ,, |
| 19. అహమ్మదు | ,, |
| 20. జెల్ | ,, |
| 21. నాట్ | ,, |
| 22. ఆరా | ,, |
| 23. ప్రాంసు | ,, |
| 24. జ్ఞా | ,, |
| 25. ఫ్రాతన్కేసీ | ,, |
| 26. మెనా | ,, |
| 27. లయిమానా | ,, |
| 28. మోనాభి | ,, |
| 29. తినాభి | ,, |
| 30. పురే | ,, |
| 32. ద్యాబు | ,, |
| 33. బత్తాళి | ,, |
| 34. కాయంతే | ,, |
| 35. ఇంగ్లీషు | ,, |
| 36. మహమ్మద్ | ,, |

సూరై తరగతి

| | |
|---|---|
| 37. ఇందుస్తానీ | సూరై |
| 38. మారాషా | ,, |
| 39. భుజకా | ,, |
| 40. రాజాషా | సూరై |
| 41. కంచకా | ,, |
| 42. పప్పుషా | ,, |
| 43. అంబబా | ,, |
| 44. వాసికుని | ,, |
| 45. సాదాల గుబురాల్ | ,, |
| 46. సుదాదాలా | ,, |
| 47. కలకత్తా | ,, |
| 48. కత్తాను | ,, |
| 49. సిద్ధోట్కు | ,, |
| 50. సురతానిశాయి | ,, |
| 51. కలియకెరాట్సూరై | ,, |

త్యాగాతరగతి

| | |
|---|---|
| 52. బండవాన్ | త్యాగా |
| 53. ప్యహాం | ,, |
| 54. అంబరి | ,, |
| 55. రుమీ | ,, |
| 56. గుజరాత్ | ,, |
| 57. బంద్యా | ,, |
| 57-ఎ. హిరాక్షి | ,, |
| 58. వరకుసిల్ | ,, |
| 59. అబ్దాల | ,, |
| 60. జహాశా | ,, |
| 61. మత్తాన్ | ,, |
| 62. బగ్దా | ,, |
| 63. బహారి | ,, |
| 64. లహూరి | ,, |
| 65. అకుపరి | ,, |
| 66. అపరంగజపి | ,, |
| 67. నిరవరి | ,, |

68. బువాన్ త్యాగా
69. అపజ్జా ,,
70. మేవళ ,,
71. జికర ,,
72. దేపగదిచండా ,,
73. బంగాళీ ,,
74. పట్నా ,,
75. హైదరాబాద్ ,,
76. మసుధాభా ,,
77. సహాజాపూర్ ,,
78. సేంచా ,,
79. సిద్దోట్ ,,
80. కచ్చనా ,,
81. డాల్‌మన్‌కాన్ ,,
82. కెంగమా ,,
83. అలంగిరి ,,

గురుదా తరగతి

84. మకరంబ్ గురుదా
85. జబ్బురు ,,
86. మక్రై ,,
87. హాలబ్బు ,,
88. తురా ,,
89. మాక్కి ,,
90. షోణ్యురోక్య ,,
91. రుమ్మ ,,
92. గుజరా ,,
93. అందెబాడి ,,
94. బాందూ ,,
95. గోసా ,,
96. తుంకహారు ,,
97. జేల్ ,,
98. నాల్ ,,
99. ఆరా గురుదా
100. ఆలయమూని ,,
101. ప్రాంసు ,,
102. జిజ్ఞా ,,
103. ప్రతన్‌కన ,,
104. ఎకనాభి ,,
105. మహామ్మద్ ,,
106. బందర్ ,,
107. అవేమూని ,,
108. దోనాంబి ,,
109. తికాభి ,,
110. ఫ్యులాందర్ ,,
111. పాము ,,
112. కాండక్ ,,
113. బత్తావి ,,
114. కామల్ ,,
115. ఇంగ్లీషు ,,
116. ఎక్కోల్ ,,
117. బాదిపాసురతాన్ ,,
118. శికిందర్ ,,
119. వస్తాదిమీార్ ,,
120. సుమాహిర్ ,,
121. మహామదంబాసి ,,
122. విలాడి ,,
123. అబ్బాసి ,,
124. బురాతిసావి ,,
125. సాలువాల ,,
126. ఖండా ,,
127. దుఃందుమూయవన్ ,,
128. మొదను ,,
129. మిస్రీ ,,
130. ఇవి ,,

ఇట్లు 130 కత్తుల లక్షణములు చెప్పఁబడినవి.

స్థానభేదములు 18: (1) పాత, (2) క్రొత్త, (3) నిడివి, (4) వెడల్పు, (5) ప్రక్కలు, (6) చూరి, (7) కాడి, (8) వాయుదార, (9) పెణకు, (10) గీతలు, (11) ముద్రలు, (12) దోరా, (13) దోర్యాలు, (14) చాయలు, (15) కప్పు, (16) కంజరు, (17) లఘువు, (18) జిహ్వారు.

ఈ ముప్పదిరెండాయుధముల లక్షణములు, కత్తులనుగూర్చి విశేషములు, అగ్నిపురాణ, బృహత్సంహిత, శుక్రనీతి, మానసోల్లాస, శివతత్త్వరత్నాకరాది గ్రంథములలోఁ గాననగును. తెనుఁగునందే కాని యీ శాస్త్రమునకు సంబంధించిన గ్రంథ మితరభాషలలో లేదు. అదియే యీ గ్రంథ విశిష్టత.[1]

ఆంధ్రసాహిత్యపరిషత్తులోఁగల గ్రంథమున వచనభాగము నిందుతోఁ బొందుపఱుపఁబడినది.

"ఇందుఁ గత్తులపేరులు పొడవు వెడలుపు లక్షణములు ముద్రలు పిడుల వివరము మొదలగునవి వ్రాయఁబడినవి.

కత్తులు: 1. హిందూస్థాన్ సురై, 2. అభియాబాగు సురై, 3. బల్దవాన్ త్యాగా, 4. న్యహార త్యాగా, 5. రుమ్మిత్యాగా, 6. బింనుపాన్ త్యాగా, 7. హీరాన త్యాగా, 8. అబ్బాలీత్యాగా, 9. పరన్ సెరీత్యాగా, 10. బద్దాత్యాగా, 11. సరవరిత్యాగా, 12. మావిపీత్యాగా, 13. హైదరాబాద్ త్యాగా, 14. కుచ్చిత్యాగా, 15. చెంగ్లామా త్యాగా, 16. విలాతి అబాసీ, 17.

1. The above work was Edited by Sri N. Venkata Rao, M.A., with an English & Telugu introduction and was published in the Madras Government Oriental Series No. xiv under the authority of the Government of Madras.

ఖురాసాక్ అబాసీ, 18. మందుమాభీర, 19. అండాబాది గురుదా, 20. ఎడ్నెల్ అనునవి చెప్పఁబడినవి. ఒక్కదాని కుదాహరణము.

ఖురాక్ ఆబాసీ: కత్తి గడుసుగానుండును, తక్కిన లక్షణములు విలాతి ఆబాబవలెను.

మిశ్రకత్తి: (మిసర్ కత్తి) కాలుతక్కువ నాలుగు జెనలు వెడలుపు మూఁడుౘ్రేళ్లు పెణికెదగ్గర నొకదోరెము. పెణికెలావు పిల్ల దోరెము ౧/- బీరకాయ పీఁచువలె ఛాయ.

నాలువాలు: నిడివికజేనలు పెణికి కొనదాఁక సన్నగానుండును. నడుమ నొక దోరెము ఉక్కుటల్లు సీరునల్పు వెడలుపు రెండువేళ్లు.

ఖండా - నిడివి కాతుకాలుతక్కున నాలుగుజేవలు వెడల్పుకి వేళ్లుచూరి ముందు వంగియుండును. అడుగు దుత్తెడు ౩ దోరెములు. పెటికె దగ్గెఱ కడవెళ్ళ అటువుముద్దర దుగళం పేరాముదపుగింజవలె కత్తిగడుసు రందాపట్టు దప్పం కత్తిలఘువు.

ఆ యాతావులకత్తియొక్క ముద్రలు చిత్రింపబడియున్నవి. ఫరుజులు, డాల్లు, కెములపేరులు గుర్తుకొఱకు కొన్ని వ్రాసికొన్నారు.

కెడయములు - బరువుగానుండును. కొత్తదికోసిన నేరేడుపండు చెక్కినట్లుండును. ప్రాఁతగిలిన దోసబీరకాయబిక్కునఁ గోసినట్లుండును. నఱకు దగిలినఁ గూడిపోవును. నాలుగుతావులను బెట్టునది కెడయము తక్కినతావున పెట్టేది చిలుకట్టు."[1]

---

1. ఆంధ్రసాహిత్య పరిషత్తు - పుస్తకభాండాగారము గ్రంథ సంఖ్య 95. ఖడ్గ లక్షణము (వచనము)

# నుదురుపాటి సాంబశివకవి

వెంకనార్యుని యార్వురుకొడుకులలోఁ గడపటివాఁడగు నీ సాంబశివ కవియుఁ దండ్రితాతలవలె ప్రౌఢకవి. ఈతని కృతులలో మనకు లభ్యమైనవి మూఁడు.

## 1. బిల్హణీయము

ఇది సంస్కృతబిల్హణీయమునకుఁ దెలుఁగుసేఁత. కథ ప్రసిద్ధమైనదే కావున వివరింపలేదు. ఇది పూర్వభాగము, ఉత్తరభాగము అని రెండు భాగములుగా రచితమైనది. కవిత సారవంతమై శ్రావ్యమై యున్నది. శైలినిఁ దెలుపుటకు రెండుపద్యము లుదాహరించుచున్నాను.

ఉ. కొందఱు లేడియంద్రు మఱికొందఱు చిహ్నమటంద్రు పిమ్మటం
గొందఱు యుక్తిఁజేసి కనుఁగొంటిమి భూప్రతిబింబమంద్రు పో
చందురులోనఁ గానఁబడు చాయనిచాయ యదౌనె రేలనం
దందతమంబు మ్రింగనది తజ్జఠరంబునఁ గానవచ్చెడిన్.

సీ. అద్దంపుబిల్లయో యల్లజాబిల్లియో వికసితాంభోజమో వెలఁదిమోము ?
వాలుగచేపలో వలరాజుతూపులో తామరరేకులో తరుణికనులో !
కవఁబాయమిండు జక్కవల పూగుత్తులో బంగారుగిన్నెలో పడఁతిచనులో ?
నక్షత్ర (గతి) నవనవమైన తీగయో కారుమెఱుంగో వాల్గంటిమేనో

గీ. అకట ! యేమంచుఁ జెప్పెద నాత్మలోన నిదియనుచు నిశ్చయముచేయ నెవరికైన
వశమె (గతి) యీరీతినూరక పలుకరింప నందులో నొక్కటెదియైన నౌనుగాక!

ఈతఁడీ గ్రంథము క్రీ. శ. 1825–39 ప్రాంతములలోఁ బుదుకోటను బరిపాలించిన రాయరఘునాథరాజున కంకితము గావించెను.

## 2. తొండమాన్వంశ ప్రతాపమాలిక

తనతండ్రి వెంకనార్యుఁడు రచించిన తొండమాన్వంశమాలిక క్రీ.శ. 1789 వఱకు రాజులచరిత్రను మాత్రమే దెలుపుటచూచి, సాంబశివ కవి దానిని క్రీ.శ. 1840 వఱకు ననఁగా తనకాలమువఱకు నేలిన రాజులను

నదేరీతిగా 342 పంక్తుల సీసమాలికగాఁ జెప్పెను. ఇదియును ముద్రితము. అప్పటికింగ్లీషువారి పాలన ప్రారంభమైనది. రాయరఘునాథునకు "His Excellency" అను బిరుదము నిచ్చినట్లిందు వర్ణితమైనది.

సీ. కలశవారిధి లసత్కల్లోలముల మాడ్కి-యే మేటికీర్తి పై పై మెలంగు
సేతుకాశీమధ్య భూతలంబందున నెవ్వాని రాడ్భావ మెన్న నెగడు
సకలరాజన్య ప్రశంసనీయంబులై యెవ్వాని బిరుదంబు లెసకమెసఁగు
కవితాతి ధూర్వహకవి లోకములకెల్ల నెవ్వాని గుణగణం బెలమిసేయు

గీ. హూణరాజన్య వృషభ విషాణమైన "ఎక్సలెన్సను"ను బిరుదునే నృపుఁడువడసె
నింద్రవంశాబ్ధిచంద్రుఁడై యెవఁడు వెలయునట్టి రఘునాథరాణ్మౌళియనువుమీఱ.[1]

## చంద్రాననా దండకము

ఇది భోగినీదండకమురీతిని బుదుకోట ప్రభువులైనట్టియు, కంపెనీ ప్రభుత్వముచే 'హిజ్ ఎక్సలెన్సీ' బిరుదమును మొదటఁ బడసినట్టియు క్రీ. శ. 1825–39 వఱకుఁ బాలించిన రఘునాథ తొండమానురాజునకుఁ గృతిగా నాంధ్రభాషార్ణవకర్త వేంకటకవి పుత్రుడు సాంబశివకవి రచించినది. శృంగారపరము – శైలికి.

శ్రీ దక్షిణాభిఖ్యగోకర్ణ వక్త్రారవింద స్ఫురద్దివ్య తేజస్సదాధ్యాన సక్తాత్మభావుండు, భావోద్భవామిత్ర భాలాక్షికీలాసమాన ప్రతాపార్కబింబ ద్విషద్ధ్వాంకవారుండు, వారాశి గాంభీర్యగాఢత్వదాన ప్రవీణాతి గంభీరతాశాలి, శాలీనవిద్వద్ధరా పాలమౌళీస్ఫురన్మంజు రత్నచ్ఛవిచ్ఛన్న చక్రాది రేఖోల్ల సత్పాదపద్ముండు......హూణాదిరాజన్య సంస్తూయమానోల్లసత్కీర్తి.........

సంతానసంపత్తు లింపొంద నుద్దండ విద్వత్కవిత్వాంకనుండైన శ్రీసాంబనాభిఖ్య విద్వత్కవీంద్రుండు కైసేయ [2]చంద్రాననాంకంబగున్.

---

1. ఆ. సా. ప. ప సం. 6 పుటలు (198–212)

2. ఆం. సా. ప. (గ్రంథ సంఖ్య. 55) అముద్రితము. 22 చిన్న పత్రములు గలది. పరిషత్పుస్తక భాండాగారము, పుట 19.

## చిదానందకవి - చంద్రాననా దండకము

ఇది పై రఘునాథ తొండమానురాజు పుత్రుఁడును క్రీ. శ. 1844 నుండి 1886 వఱకుఁ బుదుక్కోట పాలించిన రామచంద్ర తొండమాను రాజున కంకితముగా, వేంకనకవి పౌత్రుఁడును, మాతృభూతయ్య పుత్రుఁడునునగు చిదాకారకవి (చిదానంద) చే రచితమైనది. ఈతనికిని నుద్దండకవి బిరుదముగలదు. ప్రౌఢమైన శైలి. మెచ్చునకు.

శ్రీరామచంద్ర క్షితీశుండు తానొక్కనాటన్ హజారమ్మునన్ ......స్వీయేతరంబైన భూపాలశబ్దార్థ మిత్వంబు......కోటిభూపాల వర్యుండితండంచు లోకుల్సుతింపంగ...హాహా తాస్మి హాకోపేంతురా సీదిదంకిం వరాకే కిలాహామ్మటంచుర్ వినిష్పేషణోద్యుక్త హస్తాబ్జులై ...ఉద్దండ విద్వత్కవిత్వాంకనుండైన శ్రీ వేంకనాభిఖ్యధీరేంద్ర పౌత్రుండు శ్రీమాతృభూతాఖ్యధీమంతు పుత్రుండు శ్రీమచ్చిదాకార విద్వత్కవీంద్రుండు నై సేయు చంద్రాననా దండకంబు......[1]

అనుబంధమున సూర్యశేఖరకవి, శేషయకవి, మన్నారయ్య, ఆయా రాజులపైని చెప్పిన చాటువులుదాహరింపఁబడినవి.

---

1. ఆ. సా. ప. గ్రంథ సంఖ్య. 61. అముద్రితము. కాగితపుఁ బ్రతి పు. భా. పుట 64.

# మైసూరు - ఆంధ్రవాఙ్మయము

[1]దక్షిణదేశమున తమిళభాషప్రధానముగా గలిగిన చోళపాండ్య రాజ్యములు (తంజావూరు, మధుర) యందేగాక, కన్నడ భాషప్రధానముగా గలిగిన మైసూరునందు నాంధ్రవాఙ్మయము విస్తరించినది. కన్నడమునకు తెనుఁగునకు చిరకాలమునుండియు నత్యంతసన్నిహితత్వముండుటచేత, క్రీ. శ. పదునేడవ శతాబ్ది ప్రారంభమునుండియు మైసూరి రాజు లీ భాషను ప్రోత్సహించిరి. వారిలో చిక్కదేవరాయలు మహా ప్రసిద్ధుఁడు. ఈతఁడు క్రీ. శ. 1672 మొదలు 1794 వఱకు మైసూరు పాలించినవాఁడు. విశేషమేమనఁగా నీతని కాలమున సంస్కృత కర్ణాటాంధ్ర వాఙ్మయములు మూఁడును వర్ధిల్లినవి. ఈతనిఁగూర్చి కవులు చెప్పిన చాటువులుగలవు. ఈతని పేర ప్రస్తుతమున్న గ్రంథముల వివరణమిది.

## 1. చిక్కదేవరాయ విలాసము

ఇదియొక యక్షగానము. సంపూర్ణము ప్రశస్తకవితకలది. చిక్కదేవరాయలకుఁ గృతి.

---

1. కీర్తిశేషులు శ్రీకట్టమంచి రామలింగారెడ్డిగారు మైసూరి విశ్వవిద్యాలయమున నధ్యక్షు పురోధాతులు (Pro-chanceller) గా నున్నప్పుడు, మైసూరిరాజులాంధ్రవాఙ్మయమున కొనర్చిన సేవనుగూర్చిన విశేషముల నన్నెఱింగింపఁ గోరిరి. అంతియేకాక, మైసూరు పరిపాలకులకు సంబంధించిన తెనుఁగు గ్రంథముల నన్నింటిని విశ్వవిద్యాలయము తరపుననే ముద్రితము గావించు నేర్పాటు చేయుదుమని నన్నా ప్రణాళికను తయారుచేయుమనికూడఁ గోరిరి. వారి యనుమతిని నేనెంతయో పరిశ్రమ చేసి, పై నూతనవిషయములతో వారి కా ప్రణాళికను జరిత్రను బంపితిని. వారు కీర్తిశేషులు కాఁగానే యాయుద్యమ మంతరించినట్లున్నది. నేఁటివఱకు నీ వాఙ్మయమునకు సంబంధించిన గ్రంథములు చాలవఱకు నముద్రితములు.

## రామాయణము తిరుమలాచార్యుఁడు

చిక్కదేవరాయలకాలమున వైష్ణవ విద్వాంసులలో చిక్కుపాధ్యాయుని వెనుక రామాయణము తిరుమలాచార్యుఁడు ప్రసిద్ధుఁడు. ఈతఁడు క్రీ. శ. 1674-వ సంవత్సరమున దేవనగిరి శాసనమును రచియించినవాఁడు. ఇతడు సంస్కృత కర్ణాటాంధ్రభాషలయందేగాక సంగీత విద్యయందుఁ బ్రవీణుఁడు.[1]

## కంఠీరవరాజు యక్షగానకృతులు - పదములు

కంఠీరవరాజు మైసూరు పరిపాలకుఁడును కవి పండితప్రియుండును మహాయశస్కుఁడునగు చిక్కదేవరాయల కుమారుఁడు. ఇతఁడు క్రీ. శ. 1704 నుండి 1714 వఱకును మైసూరును బరిపాలించెను. ఇతఁడు పుట్టుకచే మూఁగవాఁడును, జెవిటివాఁడునై యుండెను. అందుచే నీతనికి "మూకరసు" అను నామాంతరము. కేవలము హస్తసంజ్ఞలతోడనే రాజకార్యములను నిర్వహించెడివాఁడు. అయితే భగవంతుఁ డేదేని యంగవైకల్యమును గలిగించినప్పు డా వ్యక్తి కేదేనొక విలక్షణమైన శక్తిని బ్రసాదించును. కంఠీరవరాజునకుఁ గమనీయమగు కవనశక్తియే గాక బహుభాషా వేత్తృత్వమును పరమేశ్వరుఁడు ప్రసాదించినాఁడు. ఇతని యక్షగానరచనముల మూలమున నితడు సంగీత సాహిత్య నాట్య విద్యలందు నేర్పరి యగుటతోఁ బాటు సంస్కృతమునఁ బ్రాకృతమున మాతృభాషయగు కన్నడమునఁ దెనుఁగునఁ దమిళమునఁ గవితారచన చేయఁగలవాఁడని విశదమగుచున్నది. ఈతని విద్యావిశేషము మైసూరు చరిత్రకారు లెవ్వరును నీవఱకు గుర్తించియుండలేదు.

ఈ యక్షగాన రచనలవలన నీతఁడు దక్షిణాంధ్ర వాఙ్మయముననే కాక యాంధ్రవాఙ్మయమునఁగల రాజకవులలో నొక ప్రశస్తకవిగా నెన్నఁదగినవాఁడు. ఇతని కృతుల వివరణము నీ క్రింద నొసగుచున్నాను.

1. History of Mysore Vol. 1. Ch. XIV. P. 421. Literary Activity in the time of Chikka Devaraya Wodeyar.

1. కొరవంజికళ్లు — ఇందులో నాలుగుకృతులు గలవు.
a. [1]ఆంధ్రకొఱవంజి. b. కన్నడకొఱవంజి. c. ప్రాకృతకొఱవంజి.
d. తిగులకొఱవంజి లేక తమిళకొఱవంజి.
2. పంచాయుధకళ్లు.
3. లక్ష్మీవిలాసము.
4. కలవాణీవిలాసము.
5. నాట్యవిద్యావిలాసము.
6. వసంతోత్సవవిలాసము.
7. విభక్తికాంతావిలాసము.
8. అష్టదిక్పాలకవిలాసము.
9. పావకినాటకము.
10. వైవస్వతనాటకము.
11. నైరుతినాటకము.
12. వారుణినాటకము.
13. వాయవినాటకము.
14. కౌబేరినాటకము.

పై కృతులలో నీ క్రింది లక్షణములు సాధారణముగఁ గన్పట్టు చున్నవి.

1. గ్రంథాదిని సంస్కృతశ్లోకము కొన్ని కృతులయం దున్నవి.
2. గ్రంథాదిని తెలుఁగుపద్యము కొన్నిటఁగలదు.
3. వచనములు మధ్య మధ్య గలవు.
4. ద్విపదలు, సీసపద్యములు మొదలగుజాతులు కలవు.
5. మత్తేభము మొదలగు వృత్తములు గలవు.
6. దరువులు, ఝంపె, త్రిపుటలు గలవు.

---

1. ఆంధ్రకొఱవంజియందు కాంచనవల్లి విరహము వర్ణితమైనది. ఈ కొఱవంజి ‘ పరిశోధన ’ పత్రికయందు ముద్రితమైనది (సంచిక 5. డిసెంబరు–జనవరి 1955 సం.)

7. ఆటతాళము, ఏకతాళము, ధ్రువతాళము, మఠ్యతాళము ప్రయుక్తములైనవి.
8. కొన్నింటఁ బ్రాకృతమును కన్నడమును వాడఁబడినవి.
9. తెనుఁగున లేక, కన్నడమున నున్న సాంగత్య ఛందోపద్ధతి యిందుఁ గలదు.
10. అన్నింటియందును రచన సరళముసు హృద్యమునై యున్నది.

## 1. ఆంధ్ర కొఱవంజి[1]

కంఠీరవరాజు శ్రీరంగనాథుని దర్శించి తిరిగి వచ్చుచుండఁగాఁ బాంచాలదేశపు రాచపట్టి కాంచనలత యాతనిజూచి మోహించును. ఇంతలో కొఱవంజి ప్రవేశించును. తన మనోరథమును తెలిసికొని కంఠీరవరాజు తన్నుఁ బ్రేమించి వివాహమాడుననని కొరవంజి చెప్పఁగా విని సంతోషించి పారితోషిక మిచ్చిపంపుట యిందలి యితివృత్తము. దీనిరచన కొక మచ్చుతునక — ఎఱుకత వచ్చుట.

మాళవిరాగము:

వచ్చె నెఱుకత యెఱుక యెఱుకని
వాడవాడల వెంటనూ
హెచ్చుగా తారొక్కాణ లెల్లను
యిదిగో చెప్పెద ననుచునూ
తళుకుఁజెక్కులఁ బసిఁడికమ్మలు
తళుతళుక్కని మెఱయఁగా
కులుకుగుబ్బలు పైని హారము
వెలసి వేడుక మీఱఁగా
పొందుగా రత్నములు నించిన
బుట్టబుజముననుంచుక

1. దీనినిగూర్చి "తాళపత్ర గ్రంథములు కొఱవంజి" అను శీర్షిక క్రింద వాణిలో తే 7–10–1950 దిని ప్రకటితమైన యస్. యస్. సుందరేశ్వరరావుగారి ప్రసంగముఁ జూడదగును.

చందముగ తన చిన్ని బుడుతను
　　సరవి వీపున గట్టఁగా
ఘల్లుఘల్లున జాళువా గిల
　　కయు కరంబున మ్రోయఁగా
మెల్లమెల్లనె హంసనడపులు
　　గల్లసొగసులు త్రోయఁగా

## సాంగత్య ఛందోపద్ధతి కుదాహరణము

సాత్యవతినే నుందు స్వర్గాననేనుందు
నిత్యమ్ము ధరలోన నుందూ
అత్యంతాద్భుతమైన అమరాద్రియందుందు
సత్యమ్ము సర్వత్ర నుందూ

ఇందు ఆహిరి, కాంభోజి, ఘంటారవ మాళవి మొదలగు రాగములు ప్రయుక్తములైనవి. ద్విపదలు దరువులు కలవు. కంఠీరవరాజ కృతులలో నిదియె పెద్దకృతి.

## 2. పంచాయుధకల్లై

ఇందు విష్ణుమూర్తి పంచాయుధములు కంఠీరవనృపతిని సంరక్షించునట్లుగా, నాయాపాత్ర నభినయించునట్లు రచితమైనది. ఇందు సంస్కృతశ్లోకములు హెచ్చుగాఁగలవు. ఇది సంస్కృత శ్లోకముతో ప్రారంభము.

## 3. లక్ష్మీవిలాసము

ఇదియు నాదిని సంస్కృతశ్లోకము గలది. ఇందు మహాలక్ష్మి కంఠీరవరాజుసభను నృత్యమొనరించి యాశీర్వదించుట చెప్పఁబడినది. ఇందు దరువు, ద్విపద, వచనములు గలవు. ఈ క్రింది గేయముతో సమాప్తమైనది.

రాగం - సౌరాష్ట్ర

కలితనిరంతర కనకవసంత
వలరిపువైభవ వాజిశేవంత
వితరణరాధేయ వినయవిధేయ
శ్రుతిమహితోపాయ శోభనకాయ
రాజకంఠీరవ రాజాధిరాజ
రాజేంద్ర చిక్కదేవరాజతనూజ.

## 4. కలవాణీవిలాసము

ఇందుఁ గలవాణి యనువేశ్య కంఠీరవరాజునుజూచి మోహించు కథ చెప్పఁబడినది. ఇది తెలుఁగుపద్యముతోఁ బ్రారంభము. ఆ పద్యమిది:

శ్రీకాంతారమణుండు భూమిమహిళా
 చిత్తాభిరామోత్సవుం
డాకర్ణాంతవిలోచనుండు కమనీ
 యాజానుబాహుద్వయుం
డీకంఠీరవ రాజచంద్రునికిఁ దా
 నీరంగసద్భీవరుం
డాకల్పంబౌన గూర్చు ధర్మములనే
 కైశ్వర్య కీర్త్యాదులన్

## 5. నాట్యవిద్యావిలాసము

ఇది [1]నాట్యకర్త్రులు తమ తమ విశేషములను వివరించు కృతి. సంస్కృతశ్లోకముతోఁ బ్రారంభము. ఇందు సంస్కృత భాగము హెచ్చుగా నున్నది. పద్యరచన తెనుంగున నచ్చటచ్చటఁ గాననగును.

## 6. వసంతోత్సవ విలాసము

ఇది ప్రశస్తమైన కృతి. పూర్వము నాచన సోమనాథ మహాకవి వసంతవిలాసమును వ్రాసినట్లు లక్షణగ్రంథములవలనఁ దెలియుచున్నది. కాని గ్రంథము పూర్తిగ లభించలేదు. కంఠీరవరాజు కృతి పూర్తిగనున్నది.

---

1. నాట్యకళా నిపుణలగు స్త్రీలు తమ విద్యావిశేషములనుఁ బ్రదర్శించు కృతి. నాట్యకర్త్రే. అంకకాఁడు-విటకాఁడు మొదలగు వానివలె సంస్కృతాంధ్రమిశ్రసమాసము.

ఇది,

శ్రీమత్పశ్చిమరంగ పట్టణవరే
భోగీంద్ర శయ్యాతలే
శ్రీభూమీకర పల్లవాశ్రితపదాం
భోజన్యయానోహరిః
ఆవ్యాదాశ్రిత పారిజాతమఖిల
క్షోణీంద్ర చూడామణిం
శ్రీకంఠీరవ భూమిపాల మనిశం
శ్రీదేవ రాజాత్మజమ్

అను శ్లోకముతోఁ బ్రారంభము — దీని వెనుక నీరీతి నాందిచేసి సూత్రధారుండు తెరదిక్కుఁ జూచుటయు నటి వచ్చెక్రమం బెట్టువలెనన.

రాగం - ఆహిరి.

వచ్చెను నటి వచ్చెను తమి
హెచ్చిన కంఠీరవేంద్రుని సమ్ముఖమున
ఆటలపాటల తేటలనలరిన
పాటలగంధి నెఱనీటుతో నదిగో.

పల్లవి

వ. వచ్చిన నటినిఁజూచి సూత్రధారుడు వసంతోత్సవవిలాసంబు వినిపించ వలె ననె. నటి-అయ్యా! ఆ వసంతవిలాసంబనే కృతికి కర్తయెవరు? అనుటయు సూత్రధారుం డిట్లనియె:

సీ. శ్రీసోమవంశాబ్ధిసితకిరణుఁడు మహా
దానధారేయుఁడు ధర్మపరుఁడు
అకళంకచారిత్రుఁ డమిత విక్రమశాలి
సకలవిద్యాభ్యాస చతురహృదయుఁ
డంగనాజనమనోహర రూపలావణ్యుఁ
డాశ్రితజన కల్పకావనిజుఁడు
రాజకంఠీరవ రాజేంద్రచంద్రుండు
చారు కారుణ్య విస్తారయశుఁడు

మధురిమృదువాక్య సందర్భమగుచు నెగడి
నవరసాలంక్రియాకల్ప నములఁదనరి
లలితమైనవసంత విలాసమనెడి
నాట్యమేళానగతి ప్రబంధము రచించె.

ఆ వెనుక నటి వసంతసమయమును వర్ణించును. ఇందు రెండు ప్రాకృతగేయములు, నొక తెనుఁగుపదము గలదు.

గేయము. సహియరము యుశబాణో
మహుయరన్నిణ దణుహాసంకారో
విరహియణ మణోమియసుం
మియయా శ్లేష్లం కరయికదస్సో.

తెనుఁగున మెదుకుల కాంభోజి – ఆటతాళము

ఈ వసంతము లింపాయె
భావించిచూడ బాగాయె
ఠీవితో రాజ కంఠీరవరాయఁ
డీవిధముల వింత లిటువలెనేయ.

పల్లవి. అలరువల్కల క్రొవ్విరులు తేనెజాఱ
చెలరేఁగి యాసించి యలులందు జేరఁ
చెలువైన మావిడి చిగురాకుసార
ములమదించిన కోయిలల సొంపుమీఱ.........

ఈకృతి కంఠీరవేంద్రుని సమ్ముఖమున ప్రదర్శించినట్లుగాఁ దరువాతి భాగము చెప్పుచున్నది. దాని మొదలు— "ఆసమయంబున రాజకంఠీరవేంద్రుఁడు కొలువైయుండు క్రమం బెటులన్నను" అని 22 పంక్తులలోఁ గొలువు వర్ణనగలదు. అపుడు సూత్రధారుఁడు నటినిజూచి "రాజకంఠీరవేంద్రుఁడు రత్నసింహాసనారూఢుఁడై నిండుకొలువై యున్నాఁడు. ఈ సమయంబు వసంతోత్సవవిలాసంబను నాట్యప్రబంధంబు వినుపించుటకు వేళ. ఇప్పు డందుకు తగినపాత్రలు ఎవ్వరంటే మల్లిక,

మందారిక, మంజుభాషిణి, మధురవాహిని మొదలైన యంగనామణులు ముస్తీబై వచ్చునట్లు సేయుమనునప్పుడే వారు ముస్తీబై వచ్చు క్రమం బెట్లన్న,

"వచ్చెను మల్లిక వరుసతో నిదిగో
హెచ్చైన కంఠీరవేంద్రపరాకు."

దీనినిబట్టి తంజావూరి రంగమునందువలె మైసూరియందు నాటకశాలలో స్త్రీలు స్త్రీపాత్రలుధరించి నాటకము లాడెడివారని తెలియుచున్నది. ఆ మల్లిక కంఠీరవేంద్రుని మోహించి చేపట్టుమని యారీతిని ప్రార్థించును. దానితో కథ ముగియును.

ధ్రువతాళము

శ్రీకంఠీరవరాయ శ్రితజనరాధేయ
రాకేందుచంద్రికా రవళికితాళలేను
ఆ కౌముదిశారికి నలసితిచాల

రూపకము

నిరతము నెమ్మది నిన్నె నమ్మినదాన
పరిపరిగా నన్ను భావించనేల
ఇరవుగా దయతో నన్నేలు కంఠీరవేంద్ర
ధరణీపురందర ! దానమందార !

ఝంపె

నీపొందు నెడఁబాసి నిముసమోరువఁజాల
రాపేలచేసి నను రచ్చఁబెట్టేవు
నీపాదమాన యిఁక నీ చెలిమి నే మాన
భూపకంఠీరవ ! శుభోదయవిశాల !

తెనుఁగు సాహిత్యములో మధుర కవితాశాఖకు సంబంధించిన కృతులలో యక్షగానములనుగూర్చి యింతవఱకును సమగ్రపరిశీలన జరిగియుండలేదు. ఈ శాఖలలోఁగూడ ముద్రితములు నముద్రితములు

నగు గ్రంథజాలము చాలగా వెలయుచున్నది. కాని వాఙ్మయ ప్రపంచమున నీ శాఖకుఁగల యున్నతస్థానము గుర్తింపఁబడకుండుటచే యక్షగానములనుగూర్చి కూలంకషముగా వ్యాసంగము జరుగలేదు. కొలఁది మంది విద్వాంసులు [1]మాత్రమే దీనినిగూర్చి పరిశ్రమచేసి యాంధ్ర విద్వల్లోకమును గృతజ్ఞతాబద్ధము గావించినారు. సాహిత్యపథముయొక్క పరిణామమును సంగీత సాహిత్యములకుఁగల పరస్పర సంబంధమును వ్యక్తముసేయుచు, సంధ్రతాముద్రను బ్రదర్శించు నీ యక్షగానములు మిక్కిలి సూక్ష్మముగాఁ బరిశీలింపఁదగినవి. అట్టివానిలో నీ వఱకుఁ బరిశోధకుల కెఱుఁగరాకుండఁగా లగర్భమున నణఁగియున్న కంఠీరవరాజు యక్షగానకృతులనుగూర్చి పదములనుగూర్చి నేను తెలిపితిని.

## కంఠీరవరాజు పదములు

### 1. రాగము భైరవి – త్రివడితాళము.

వారినిధిగంభీర, శారద
నీరదాశ్రిత హారరుచిర వి
హార, మనసిజవీర, శతగుణసార
వితరణశూర, ధర్మవిచార, కుజనవి
దూర, సరసోదార, సుజనాధార, వంశో
ద్ధార, లలితాకార, మైసురివీర
కంఠీరవేంద్ర జయ జయ.
గానలోలఘనబుధజాల కవిజన
కలిత లీలా.

పల్లవి: ౧. వందితాఖిలబృంద సుజనా నందలసదర
విందపదకన దిందు బంధురవదనభాస్వర
కుందకుట్మల దంతసురవరనందివాహన
వందనప్రియకందలితకురువిందనఖకర
మందరాచలధైర్యసౌందర చంద్రకంఠీర
వేంద్ర జయ జయ.

---

1. (1) కీ. శే. పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రిగారు. (2) కీ. శే. వేటూరి ప్రభాకరశాస్త్రిగారు. (3) శ్రీ చింతా దీక్షితులుగారు. (4) శ్రీ డాక్టరు నేలటూరి వేంకటరమణయ్యగారు.

౧. రాజరాజ సమానభోగవి
రాజమాన మనోజభాసుర
రాజబింబ సమానజామర
వేజితామర రాజవిద్యా
భోజ మైసురి దేవభూపత
నూజనవకృతనైజకవితా రాజితాలపజాలకూజిత
రాజకంఠీరవేంద్ర జయజయ.

## 2. రాగము ఘంటారవ - వడ్డిమర్త్య.

కొమ్మ నీవదియేమే నాసామినీవెంత
కొదవగా యేంజేసేమే
ఈమహిని రాజ కంఠీరవేంద్రుని
యేమని తెలియలేను.

పల్లవి. ఆటపాటలవింత మాటలతేటల
అందచందములు గలిగినా
మీకైననీటు బలు జాటుపనుబోటుల
మిటుకులాడు లైనట్టి
పాటలగంధులు పదముమోపినగాని
పొన్నుఁజేర్చనివాఁడమ్మా!
పాటపాడిరైన పడుచులనెల్లా
పాటిజేసునటే ఓభామా!

పల్లవి. వందితాఖిలబృందసుజనా
నందలసదరవిందపదకన
ఇంది బంధురవదన భాస్వర
కుందకుట్మల దంతసురవర
నందివాహన వందనప్రియ
కందళితకురువిందనఖర
మందరాచలధైర్యసౌందర
చంద్రకంఠీరవేంద్ర జయజయ

ఏణాక్షీ వినవె యిలలో వారికెల్ల
యెక్కుడైన రూపము.
జాణతనముమంచి జిగిబిగితనమున
జగడపునఁడినట్టి
ప్రాణనాయకి వేడుకొనినగాని సుమంత
ప్రావుచేయని వాఁడమ్మా
త్రాణము తెలియని తగినవారివలల
తగిలియుండేవాఁడేమో ఓ చెలియా!
సఖిగరిమ తెలిసిన ఘనగంభీరముగల
గుణవంతుఁ డితఁడందు
నరపాల జనులలో నాడాడివాఁడంటే
ననఁబోఁడి తెంచఁదగునా
నిరతమై గూడియుండువాని మహిమ
నిజమై యెవరు తెలిసేరే
వీరరాజ కంఠీరవేంద్రుఁడు వేరిటి వలపులాడిని
నమ్మినా ఓ కొమ్మా!

### 3. రాగం ఘంటారవం – ఆటతాళము.

అక్కరో! వినవె యీవేళ వలపుజూడ
యెక్కడనుండి వచ్చెనే
సొక్కుపాడి జల్లెనో సొగసు కంఠీరవేంద్రుని

పల్లవి. అటుగాఁ జూచినవాని అలరుమోమందము
ఇటుచూడ వాని నీటు యింత హీనమై
ఎటుగాఁ జూచినవాని యేమనవచ్చునో యందు.
విటరాయని వగలు వింతలై చినటు నాఁటి
కనుబొమ్మ సన్నలోను కలికిరో! రమ్మని
మొనగుబ్బలపై గోరు ముద్దుగానుంచి
అనవరతము నన్ను అంగజాకేళినిగూడి
వినయమున కంఠీరవేంద్రు నున్నట్టి నున్నది.

## 4. రాగం ఘంటారవం - ఆటతాళం.

కానిలేర చక్కని సామి కానిలేర
దానశూర కంఠీరవ ధరణిపాల యిలాగైతే

పల్లవి. పడుచుదాననంటూ నడిప్రాయాన నన్నుఁ
జూడక విడిచి దానినే జేరున్న వివర మెఱుఁగనా?
వడియగట్టినదాన వసుమతిచంద్రా! విను నా
జడనుజుట్టిన పూలు చెదరివేయక మానేన
దురుసుమాటలాడి దూరి ముద్దుఁబెట్టఁబోయనంట
బిరుదువని తలచే బలిమి బిరుదందినదాన
బిరుసైనగుబ్బల బిగిసి చక్కిలి చక్కిలిగోరు
వరుసవరుసగాఁజూడక వరిది విడిచెనాఁడోరోరి
చక్కనైనయ్య యేరా యిట్టి చప్పనలాడునవచ్చి
సొక్కించి సోలించి నన్ను సొబగుమీఱఁగ
మక్కువతోఁ గూడినట్టి మైసురికంఠీరవేంద్ర
గ్రక్కున మోవి గంటుశాయకమానేన

## 5. రాగం - అశోకవరాళి.

ఏమే భామనీ ప్రేమము యెంతటిదో కాననమ్మా
కామకోటి రూప రాజకంఠీరవేంద్రునియందు
వలపులాఁడినీ చెలులు పిలిచినట్టివాని
పేరనికలసి బిలిచి నీలోనీవె తలవంచుకనుండే వేమే
అలనైనదినుదిటనీవు తిలకమున దిద్దినంటా
వలపులో కాని రూపు వన్నెమీఱ దిద్దేవేమె
ఆటపాటలాడేవేళ అందిపొంది యుండేవేళ
బోటిరో కంఠీరవేంద్రుని పొందియుండు భావ మిదిగో

## 6. రాగం - తోడి.

పదిరి నన్నంటి వచ్చేవేర
మొదటివలె గాదు చాలురా మోహనాకారా!
కులుకు కుబ్బలాన పయ్యారి గుమ్మినమీరి
గురుతై యున్నదిరా కస్తూరి
అలదానివద్ద నీవు దూరిసారి
అటువంటి దినమున మైసూరికంఠీరవేంద్రు

కంటికంటిరా నీ మాయలెల్ల అమ్మనే జెల్ల
కల్లగాదు కామినివల్ల
వింటి వింటి వింటిరా నీమాట లెల్ల అల్ల
తెలఁదియుండే నీ ప్రేమమేల కంఠీరవేంద్రా
అనరానిమాటలాడే వేర అవురాచాలురా
ఆదే రా నీ కామేరవయ్యెరా
దినమునసేలు దాని భారమూర
దేవరాజేంద్రుని కుమార కంఠీరవేంద్ర.

## 7. రాగము - తోడి త్రివడి.

వారివారి కిటు వలచినవాఁడే
వీర కంఠీరవేంద్రుని వింతలుజూడే

పల్లవి. అలివేణి వినవె అల్లటు జూచెనేనివాని
చెలువైన చెక్కిలి జేరేది ఒకర్తె
అలరు నీమోవియన్న అమృతమేదిరా యని
తెలయ పంటి నొక్కు వింతలాఁడి యొకతె
బారిగుబ్బల మొనల బలిమిరొమ్మున గ్రుమ్మి
బీరముతో జడను బిగిసి జుట్టుకొని
వేఓ నీకొకతె యేతెలఁది వలరాయని
యీరీతీ గూడియున్న యింతినే నొకతె
బారాడు కురులను బాగుగా వైచుక
వారాసిగ పెట్టిన వయ్యారి ఒకతె.
ఏరా కంఠీరవేంద్ర ? ఎవతె కోరినదనీ
గారుచేసే బలు గయ్యాళి యొకతె.

## 8. రాగము - ముఖారి.

విన్నవించరో ఓయమ్మ
కన్నెరో యీ వగలెల్ల కంఠీరవేంద్రునితోన
విడిదికే వచ్చిన వొమ్మనదె నన్నిపుడు విడనాడెదె
నిడెమాయఁగా నందుకోరాదా వింతఁజేసేదు
దుడుకు లేటికి నాతో వాద దూరకొాలదే

కడుదుఁ జేసేదే మరుదా కాని నేనేమిసాద
అల్లదని చెట్టబట్టికొంటి
బింకముతోన అటుజూచుకొంటి
మొల్లమొగ్గలవంటి పంటి మోవి యానుకొంటి
ఉల్లాసాన దానియింటనుండి వచ్చెదమాయంటి
గురిగా మైసూరి నేలునంటి
నిజతనంటి ఘన గుణవంతు కంటి
వీరకంఠీరవ వీరుఁడంటి వద్ద జేరుంటీ
నిరతాన ననుగూడి నాడంటి
నే నమ్మియుంటి మెఱసివారనుంటి
మేరగాదని యంటి.

9. రాగము కాంభోది - తాళము వడ్డిమఠ్య.

ఇపుడు జాణవైతివా చెలియా నీ
విపుడు జాణవైతివా
అపటి దినమున మఱచినీవె
పైపయి వారి యందమే నుపరతి నమరేవేమొ.

పల్లవి. ముద్దులాఁడిరో నీవు చిన్నప్రాయమునాఁడు
ముద్దుగుమ్మలతో బొమ్మల పెండ్లిండ్లు చేయించి
కొద్దిగా సతిపతి నిద్దరునుగూర్చి కులుకుచునుండఁగా
అద్దరి పోయెనే నేనురాఁగాఁ గనుఁగొని
అందరి మోము వారఁజేసుకొంటి
వద్దనున్న చెలులమఱుఁగుదాఁగున్నట్టి
వలపులాఁడి వింతెగదవె నీవపుడు.
సామజయాన నాడు పాన్పుపై నేను
సరసమై నిదురమబ్బుగనున్న యోసన్న
ప్రేమతోనుపరతి దిద్దుకొమ్మనంటి భామనాప్రి
యుండగా నేమి జేసునోయని వారజేసుకొంటి
ఇంతిజోడునరీతి నీవు దెలుసుక
మేము వెళ్ళ మఱుఁగునుంజొచ్చి మేలు మీఱి

ముదముతోడ ప్రక్కఁజేరి యుంటివే యపుడు
చెలియ చప్పడకాళ్ళ మంచియపైని జిక్కించి
అద్దముపై నీడ గనుగొని
తొలుత మదనక్కేళిలోని రీతిఁజూచి
తొయ్యలి భ్రమసి నీవు
నెలతరో నా సామి కంఠీరవేంద్రుఁడు
నేర్పున నుపరతిఁజేర్పు కొన్నాడంటి
పలుమారద్దము బారఁజూపులజూచుక
పదరి చిఱునవ్వుతో నున్న దానవపుడు

"శ్రీ శ్రీ శ్రీ శ్రీశైల గురువేనమః అని వ్రాఁతప్రతి చివరకలదు"

# బెంగుళూరునిర్మాత పెదకెంపరాయఁడు

## గంగాగౌరీ విలాసము

నేఁడు మైసూరిప్రాంతమున బెంగుళూరిని గట్టించిన "పెదకెంప గౌడు" పేరు విననివా రరుదని చెప్పవచ్చును. ఈతని నిజనామము పెద్దకెంపరాయఁడు. కన్నడమున హిరియ కెంపరాయఁడు. గౌడు అనునది యీ వంశీయుల కందఱకును నొక నాయకపదమును సూచించు బిరుదము. పెదకెంపరాయని పూర్వులు తెలుఁగువారు. కాంచీపుర ప్రాంతములనుండి మైసూరిరాజ్యముననున్న 'ఆవటి' యను గ్రామమునకు వచ్చి, యచ్చటనుండి బెంగుళూరి కెనిమిదిమైళ్ల దూరముననున్న 'ఎలహంక' అను ప్రాంతమున స్థిరపడిరి. అప్పటికి విజయనగరసామ్రాజ్య మేర్పడుటచే, నా ప్రభువులవలన నాడగౌడఱికము పొందిరి. అందుచేత నీ వంశీయులకు 'గౌడ' యను పదమును, 'ఎలహంక ప్రభువులు' అను పదములును నియతముగానుండఁ జొచ్చినవి.

వీరిలో క్రీ. శ. 1418 నుండి 1433 వఱకును ఎలహంకను బాలించిన జయగౌడ యనునాతఁడు ప్రసిద్ధుఁడు. ఆతని కొమారుఁడు 'గిద్దగౌడ' గిద్దగౌడునకుఁ బిల్లలు లేకపోవుటచేత, తమ యిలవేల్పగు [1]కెంపమ్మ

1. 'కెంపమ్మ' అనగా తెనుఁగులో 'ఎఱ్ఱమ్మ' అను దేవత.

నారాధించి, యొక కుమారుని గని యాతని కా దేవతపేరితో 'కెంప నంజగౌడ' అని పేరుపెట్టెను. ఆనాఁటినుండి 'కెంప' అనుపేరే యీ వంశీయులందఱికిని గలదు. కెంప నంజగౌడ, తన తండ్రివెనుక క్రీ. శ. 1443 నుండి క్రీ. శ. 1513 వఱకును దన సంస్థానమును బాలించెను.

ఈ కెంప నంజగౌడ కుమారుఁడే పెద కెంపగౌడ. ఈతఁడు క్రీ. శ. 1513 నుండి 1569 వఱకు నేఁబదియాఱేం డ్లవిచ్ఛిన్నముగా రాజ్యము పాలించినవాఁడు. ఈతఁడు విజయనగర సామ్రాజ్యాధీశుఁడగు కృష్ణదేవరాయలచేతను, నచ్యుత దేవరాయనిచేతను మన్ననలను బొంది నాఁడు. ఈతఁడే క్రీ. శ. 1537 లో బెంగుళూరు పట్టణమును నిర్మాణము చేసియున్నాఁడు. ఈతఁడే గంగా గౌరీవిలాస కృతికర్త.

బెంగుళూరు పట్టణము కట్టఁబడుటకు పూర్వ మీ ప్రాంతమునకు 'శివసముద్రము' అని పేరు. తనరాజ్యము విస్తరించిన తరువాత రాజధాని కోఱకై, శివసముద్ర గ్రామమునుండి బయలుదేఱి, కెంపగౌడ స్థలములు పరీక్షించుచుండఁగా బదిమైళ్లు వెళ్ళినవెనుక నొక స్థలమున నొక కుందేలు తన కుక్కను నడ్డగించుట చూచి, అదియే రాజధానికి తగిన స్థలమని యెంచి, కోటను నిర్మించెను. ఈ కోటకు నాలుగు బురుజులు కలవు. నాలుగు బురుజులు కోట పూర్తియై, సింహద్వారముకట్టఁ బ్రారంభిం పఁగా, నది సాయంకాలమువఱకు నిలిచియుండి, తెల్లవారినతోడనే పడిపోవుచుండెడిది. ఇట్లెన్ని యోదినములు జరుగఁగాఁ గెంపరాయఁడు నిరుత్సాహుఁడై యుండఁగా, నొకనాఁడు స్వప్నములో నాతనికి నరబలి యిచ్చిన నిలుచునని యొక మహనీయుఁడు చెప్పెను. కెంపరాయఁ డీ వృత్తాంతము తనవారితోఁ దెలుపఁగా, నాతని కోడలు "లక్ష్మమ్మ" అనునామె తాను బలియగుదునని చెప్పెనట. కాని కెంపరాయఁ డందుల కంగీకరింపలేదు. తుద కామెయే యెవ్వరికిఁ దెలియకుండ సింహద్వారమువద్దకుఁబోయి, కంఠము నుత్తరించుకొని, యా రక్తముచే నా ద్వారమును తడిపివైచినది. మఱునాఁడు సింహద్వారము నిలిచినది. కెంపరాయఁ డామెకు బెంగుళూరికిఁ దూర్పున 'కోరమంగల' అనుచోట దేవాలయమును గట్టించెను. అందు నేఁటికిని నీమె పూజలనందుచున్నది.

తెనుఁగున 'లక్ష్మమ్మకథ' యని యొక పాట ప్రచారములో నున్నది. అది ముద్రితమైనది. దానిని జూడఁగా నందుఁ బేర్కొనఁబడిన లక్ష్మమ్మ, చిరుమామిళ్ళవారి యాఁడుబడుచని కలదు, కావున నామె యీ లక్ష్మమ్మ కాదు.

ఈతఁడు బెంగుళూరు పట్టణము కట్టించి దాని నభివృద్ధిపఱచుట యేగాక, అనేక దేవాలయములను నగ్రహారములను గట్టించినవాఁడు. గవిపురమున గంగాధరేశ్వరాలయము కట్టించినవాఁడు. అందొక పెద్ద చెఱువు త్రవ్వించినాఁడు. దానికిఁ దన కులదేవతయగు కెంపమ్మ పేర "కెంపాంబుధి" అని పేరు పెట్టినాఁడు. నేఁటి బసవనగుడియందలి బసవేశ్వరుని బ్రతిష్ఠించి యాగుడి కట్టించిన బసవభక్తుఁడు కెంపరాయఁడే. ఆ గుడిచుట్టునున్న దొడ్డవిఘ్నేశ్వర, నందీశ్వర, ఆంజనేయ, మల్లికార్జున దేవాలయములన్నియు నీతఁడే కట్టించెను. అన్నింటికన్న ముఖ్యముగాఁ బేర్కొనఁదగినది హాల్సూరునందలి సోమేశ్వరాలయము.

హాల్సూరునందలి దేవాలయ నిర్మాణముగూర్చిన కథ గలదు. అచ్చటనున్న సోమేశ్వరస్వామి కెంపరాయనికి కలలోఁ గనఁబడి, యొక స్థలము త్రవ్వినచో నచ్చట నధిక సంఖ్యాకమైన ద్రవ్యము లభించుననియు దానితో నొక దేవాలయము కట్టింపుమనియుఁ జెప్పెను. తెల్లవారినతోడనే యచ్చట త్రవ్వింపఁగా, త్రవ్వి తండములుగా ధనమును, నొక లింగమును గాన్పించెను. ఆ ధనముతోడ నా దేవాలయమును గట్టించి, యందు సోమేశ్వరస్వామిని బ్రతిష్ఠించి కెంపరాయఁ డాతని సేవించుచుండెను.

ఈ సోమేశ్వరునికే కెంపరాయఁడు తన గంగాగౌరీవిలాస యక్షగానము కృతి నిచ్చెను. గ్రంథాదిని

శా. శ్రీగౌరీముఖ చంద్రచంద్రికల కేలిచ్చిత్తమ్ములోలింప క
న్నాగాధీశ్వరహార మార మధువా నాళీకసంధీరతా
నాగేంద్రార్చిత పాదపద్మ యుగళా నానా మహార్థాంగ...
......హారము కెంప నృపతిన్ రక్షించు సోమేశ్వరా !

క. సుకవులకు సారమై బహు కుకవుల కెద శూలమై యకుంఠితధారై
చకిత చకిత వాద్యములై వికసించును పెద్ద కెంప విభుసత్కవితల్ !

క. గంగా గౌరి విలాసము సంగతి పదపద్యములకు సరసతమీఱఁగన్
రంగద్భూషణములు చెలఁగంగాఁ బెదకెంపరాయ ఘనుఁడొనరించున్.

ఈ యక్షగానము పూర్తిగ లభింపలేదు. గ్రంథాంతమున నీ కంద పద్యమున్నది:

"క. అంగజుకేళిని మది యుప్పొంగఁగ రతిక్కెలి సోలి బోటిరపిల్లన్
బంగారు గిండిపట్టుక ముంగిటికిని వెడలె చాల మురిపెంబలరన్"

ఇందలి కవితారచన తెలుపుటకు రెండు పద్యములను రెండు పదములను నిం దుదాహరించుచున్నాను.

"ఏనుమోములవాఁడు నిగురుపాయమువాఁడు
నెలబాసికమువాఁడు వలపుకాఁడు
చిలువ సొమ్ములవాఁడు తెలిమేనుగలవాఁడు
నీలకంఠమువాఁడు నీటుకాఁడు
వేఁడికన్గలవాఁడు లేడిఁబట్టినవాఁడు
జగములేలెడువాఁడు జాలకాఁడు
జడలుమోసినవాఁడు వెడవిల్తు పగవాఁడు
చుట్టాలుగలవాఁడు సొగసుకాఁడు

మింటిసిగవాఁడు పెనుగొండ వింటివాఁడు
లీలహాసమువాఁడు నామేలువాఁడు
అలరునీ గుర్తులకు నలుఁడైనవాఁడు
అనిన గౌరితో చెలి వ్యంగ్యమనుచుఁ బలికె"

"పాయమందునఁ బతినెడఁబాయుకన్న
పురుష దారిద్ర్యమున మదిఁ బొగులుకన్న
విరహవేదనచేఁ జిక్కి పొరలుకన్న
నీ శరీరము తృణముగా నెంచమేలు."

గుమ్మ కాంభోధి - ఏకతాళము.

కేల ముమ్మొనవాలు నీ
కేలనే వానిమీఁద మేలు
పూసెను దలపై నొకయన్ను - యట్టి
వానిపై నేలనేకన్ను
జడలలోన నెలవంక - వాని
కడియాసలేలనె యింక
తెలిమేనిపైని విభూతి - వాని
చెలువము నీకేమి ప్రాతి
అన్నింట కొఱగానివాఁడు ఓ
కన్నెరో నీ కీడుగాఁడు

కాంభోది - ఏకతాళము.

జాలిమాలి పొందితినె వాని
పాయఁజాలక కుందితినె
చాలుచాలు ఆఁడుబుట్టూ యిట్లైనమీఁద
బాలనా కేటి గుట్టూ
గడియ యేఁడాదియైన గదవే వానిమా
విడిదికి తేఁగదవే
తలకెక్క దానిమందునే
నెంత పిలిచిన రాఁడేమందు.

పెద కెంపరాయని పుత్రుఁడగు ఇమ్మడి కెంపరాయఁడు [1]బెంగుళూరున బల్లాపురపు పేటలోనున్న రంగనాథ దేవాలయమున వేయించిన యీ క్రింది తెలుఁగు శాసనమునుబట్టి వీరు తెలుఁగువారని తెలియనగును.

స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవర్షంబులు ౧౫౭౮ అగు అనియెడి ప్రభవ సంవత్సరముగను ౧౫ అలు శ్రీమద్రాజాధిరాజ రాజపరమేశ్వర శ్రీ వీరప్రతాప శ్రీవీరరామదేవరాయ మహారాయలయ్యవారు రత్నసింహాసనారూఢులై పృథివీ

1. Epigraphica Carnatica Vol. 9. Bangalore 1 Page. 179.

సామ్రాజ్యం జేయుచుండగాను ఆ సంస్నుకులైన ఎలహంకనాడు ప్రభువులైన కెంప నంజయగౌని[2]వారి పౌత్రులైన కెంప గౌనివారి పుత్రులైన యిమ్మడి కెంప గౌనయ్య వారు సద్ధర్మ ప్రతిపాలకులై సుఖరాజ్యం జేయుచుండగాను బెంగుళూరిపేటయందు సమస్తులయొక్క రూపాంతరము.

సమయం తీర్చుకొనివచ్చిన స్వస్తి సమస్త నిజమహంకాళికా ప్రశస్త సమస్తులైన శ్రీమద్గణేశ్వర వీరనారాయణదివ్య శ్రీపాదపద్మారాధకులైన అయ్యావళి ముఖ్యులైన స్వదేశ, పరదేశ ఉభయ నానాదేశం చాలు మూల సమస్త పెక్కండ్రు పెనుగొండ బెంగళూరు, చిక్కనాయనిపల్లె బళ్లాపురం తాటిపర్తి అవలె, చంద్రగిరి, కోలూరు, కొత్తకోట, కావేరీపట్నం రాయకోటె శ్రీరంగపట్నం నరసీపురం బేలూరు హాబురు నాగమంగలం ఇక్కేరి బస్తిహాళ్లి మాదులైన స్థల పరస్థల ఉభయ నానాదేశ చాలుమూల సమస్తలున్ను బెంగుళూరు ముత్యాలపేట రంగనాథస్వామి పడితర నైవేద్య తిరుతిరునాళ్లు మొదలైన ధర్మాలకు కెంపగౌనయ్యవారికి రొుఉుకచేసి యిచ్చిన మగముంపడి కవ ౧ టిప ౧ టి అరవీసం లెఖను విడిచేస్తిమి. ఆచంద్రార్కస్థాయిగా స్వామిపడితర నైవేద్య తిరుతిరునాళ్లు మొదలైన ధర్మాలు త్రికరణశుద్ధిగా సమర్పించిన దానపత్రశిలాశాసనం. తరువాత "స్వదత్తాద్విగుణ పుణ్య"... ఇత్యాది శ్లోకములు.

దీని తరువాతిది తెలుఁగు దే 8 పంక్తులు మాత్రమున్నది. "యిమ్మడి కెంప గౌనయ్యవారికె ఆ చంద్రార్కము పుత్రపౌత్ర పారం పర్యము ధర్మం" అని కలదు.

ఈ కెంప గౌడివంశీయులు క్రీ. శ. 1728 వఱకు బెంగుళూరి ప్రాంతమును బరిపాలించిరి. మైసూరి దొడ్డకృష్ణరాజు దళవాయి, దేవరాజయ్య వీరిలోఁ జివరివాడగు ముమ్మడి కెంప వీరప్పను జయించి యీరాజ్యములో దీనిని జేర్చెను.

ఈ వంశీయుల వృత్తాంతమును దెలుపు నొక తాళపత్ర పుస్తక మిటీవల లభించినది. అందులో మొదటి యాఱు పుటలు తెలుఁగు. తక్కినది కన్నడము. దీనినిబట్టి వీరు తెలుఁగువారనియు, రాజ్య వ్యవహారములు కన్నడభాషలోఁ జేయుచుండెడివారనియుఁ దెలియఁగలదు.

---

2. గౌని అనునది 'గౌడని' అను శబ్దభేదము.

వీరి వంశవృత్తాంతము [1]నాంగ్లేయభాషలోను, కన్నడములోను విపులముగాఁగలదు. వానినిబట్టియే నీ చరిత్ర వ్రాసితిని. గంగాగౌరీ విలాసకర్త బెంగుళూరి నిర్మాతయగు కెంపరాయఁడే యగుట తెలుఁగు వారికే ముదావహము.

## కళువె వీరరాజు

మైసూరి రాజులయొద్ద దళవాయిలుగానుండి కవులై, సంస్కృతాంధ్ర భాషాపోషకులైనవారిలోఁ గళువె వీరరాజుకుటుంబ మొకటి. వీరు చూడదవకులజులు. మైసూరిజిల్లాలో నంజనగూడు గ్రామమునకు నాలుగుమైళ్ల దూరముననున్న "కళులె" అను గ్రామము వీరి నివాస స్థానము. అందుచేతనే వీరి యింటిపేరు 'కళులె' వారైనది. కళులె యనునది సరియగుపేరు. జనవ్యవహారమున 'కళువె' అయినది. వీరు ఋగ్వేదులు, ఆశ్వలాయనసూత్రులు, భారద్వాజసగోత్రులు. ఈ వంశమున మొదట దొడ్డరాజు జన్మించెను. వీరి వంశవృక్షము.




పైవారిలో మొదట దొడ్డరాజు చిక్కదేవరాయల (1671-1704) దళవాయి యయ్యెను. ఆతనివెనుక నాతని కుమారుఁడును, కవియు గ్రంథకర్తయునగు వీరరాజు సైన్యాధికారి యయ్యెను. ఈతఁడు మహా పరాక్రమవంతుఁడై మహారాష్ట్రవీరులను బాణఁద్రోలి యనేక దుర్గములనుగొని, చిక్కదేవరాయలవెనుక రాజులకాలములో క్రీ.శ. 1724 వఱకు

1. The Quarterly journal of the Mythic Society, Vol. XII No. 4. July 1923.

The Kempa Gowda Chiefs by B. Puttaiya Esq, B. A, (Pages 723–741).

నుండెను. ఈతని వెనుక మొదటి కుమారుఁడగు దేవరాజు సైన్యాధిపత్యము వహించి క్రీ. శ. 1732 వఱకు నిర్వహించెను. ఆతని వెనుకఁ బ్రసిద్ధ గ్రంథకర్తయగు నంజరాజు క్రీ. శ. 1759 వఱకును సర్వాధికారియై విలసిల్లెను.

## వీ ర రా జు కృ తు లు

వీరరాజు రచించిన కృతులలో వచనములో రచితమైన భారతము లభించుచున్నది. కాని యందులో ఆది, సభా, భీష్మపర్వములు మాత్రమే మనకు లభ్యములగుచున్నవి. వీనిలో ఆదిపర్వమున నూటనలువది మూఁడవ యధ్యాయము తరువాతిభాగము లభ్యముకాలేదు. సభాపర్వము పూర్తిగా లభ్యమైనది. అందు 120 యధ్యాయములు గలవు. భీష్మపర్వము కూడ సంపూర్ణముగ 117 అధ్యాయములలో మనకు లభించినది. అందు 'భగవద్గీత' కూడఁగలదు. దీనినిబట్టి చూడఁగా వీరరాజకవి మహాభారత గ్రంథమునంతటికి వచనానువాదముచేయ సంకల్పించినట్లు కానవచ్చుచున్నది. ఈతఁడు తనకుఁ దోడుగా తుపాకుల యనంత భూపాలుఁడను చెంజిదుర్గపరిపాలకుని జేకొని యీరచనను నిర్వహించినట్లుగా సభాపర్వాధ్యాయాంతములయందలి గద్యలు తెలుపుచున్నవి. సభాపర్వము క్రీ. శ. 1730 లో రచితమైనట్లుగ నా గద్యలపైనుండు నీ క్రింది పద్యము వలనఁ దెలియనగును.

సీ. [1]వెయ్యిన్ని యాఱున్నూట వెలయు రేంబదిరెంటి మీందటి శకవర్ష మెలమినడుచు
వరుస సాధారణవత్సరంబున మాఘశుద్ధపంచమియందు శుభదినంబు
వరుసందనర దళవాయి దొడ్డేంద్రుని సుతుఁడు వీరేంద్రుండు సుకవినుతుఁడు
వచనభారతమందు వైఖరినీ సభాపర్వంబు రచియించె (ప్రతిభ) మీఱ

గీ. ధరణిమీఁదను చంద్రార్క తారకముగ నలరుంగావుత లోకవిఖ్యాతిగాను
సరసులెల్లను వేడుకం బదువువేళం దప్పులున్నను దిద్దండి దయనుమీఱ.

1. మూలమునుండి యథామాత్రృకముగ వ్రాయఁబడినది. శకవర్షములు 1652 + 78 = క్రీ. శ. 1730.

మ. .........వివిధ క్రీడానిరూఢాల...............
.........సన్మార్గనసపక్ష్మ · పద్మహితవేణీ హల్లకేంద్రాది ది
క్పతిచూడామణి జాలజాల పదరాద్గంధర్వ...సం
స్తుత మీనాద్యవతారతారక విధుద్యోరత్న నేత్రద్వయీ.

క. నందకుమారక మునిరాట్ బృందారక విమలహృదయ పీఠనివాసా
నందధురంధర వాసవ నందన సారథ్య కల్పనానితరథ్యా.

స్రగ్విణి. మిత్ర వింధానుచామేయ కస్తూరికా
పత్రచిహ్న ద్విరేఫస్ఫురత్కౌస్తుభా
కృత్రిమాంభోరుహాక్షప్తిభాభాగుర
శ్చిత్ర కాసారకా సేవకోద్ధారకా.

వీరరాజు గద్య : ఇది శ్రీరామచంద్ర చరణారవిందసేవాభినందన వరప్రసాదాసాదిత
గీర్వాణాంధ్ర కర్ణాటకాది నానాభాషా కావ్యరచనాచతుర, శ్రీమన్మహారాజాధి
రాజ రాజపరమేశ్వర రాజమార్తాండ ప్రౌఢప్రతాపాప్రతిమ వీరనరపతిబిరుదెం
తెంబరగండబిరుదాంకిత శంఖచక్రమకరమత్స్యహనూమద్గరుడగండభేరుండసింహ
శరభసాళ్వాది నానావిధదేవార్హధ్వజాంకిత, యాదవవంశాబ్ధితిలక, అంగ వంగ
కళింగ కాశ్మీరలాటమరాట ద్రావిడాది నానాదేశాధీశ్వర కిరీటకోటి సంఘటన
ప్రస్తరత్న పరాగపరాగిత నిజభవనద్వారా సక్తానేక భూపాలఫాలతలఘటితాం
జలి పుంజ రంజితారవిందాంక, రామాయణ సభాస్థానస్థ రత్నసింహాసనాధి
రూఢనానావిద్వదభీష్ట వరప్రదానరాజ చిక్కదేవరాజ కరుణాప్రాప్త కర్ణాట
రాజ్యలక్ష్మీ నృత్యరంగాయమాన, శ్రీరంగపట్టణ పరిపాలనార్థాదృత సైన్యాధి
పత్య నిర్వాహక, మహారాష్ట్రమదేభపంచానన, కెళదివంశదావాహాన, మధురా
నాథమర్దన, జయజయఘాటీశిరః కందుకక్రీడన, వసంతరాయ నాసాకృంతన
నిమ్మాజీజీవ మూలోన్మూలన, దాదోజీదండన ప్రతాపశీలవితల పాలెగారువిద
ళన, అంతరబాహ్యాది శత్రుసంఘస్య మేఘజంఝానిల, పరరాజాంధకారవిదళన,
దినరాజ దళవాయిదొడ్డ రాజతనూజ, యాచకసురభూజ, భుజబలాటోప పటు
జితాతి రాజన్య సమర్పితానేక రత్నరాశీకృత ధన కనక వస్తువాహన సంతో
షితాఖిల భూసురాశీర్వాదాను వర్ధిత పుత్రపౌత్రాది వంశాభివృద్ధి, విరాజమాన
కళువె వంశాబ్ధిరాకా నిశాకరాశ్వలాయన సూత్రపరమపవిత్ర భారద్వాజగోత్ర
పరిపాలన ఆసేతుశీతాచల మధ్యవర్తి కాశీప్రభృతి పుణ్యక్షేత్ర నిత్యాన్నదాన
వినోదదాన క్షేత్రాధీశ్వర విభిన్నక్షేత్రగ్రహారామాది సంతోషిత కవిరాజ
ప్రణీతంబైన శ్రీమన్మహాభారతవచన కావ్యంబునందు సభాపర్వము సంపూర్ణము

అనంతభూపాలుని గద్య : ఇది శ్రీనందనందన చరణారవింద సేవానుభావ భావితసార సారస్వత శాశ్వతైశ్వర్యధుర్య, మేరుసగ సమానధైర్య, సమాసాదిత విమత వాహినీ సమాక్రాంత దక్షిణసింహాసన సముద్ధారణాధురంధర, విరోధినృపతి రాజధానీ సమానీత గంధసింధుర, గోసహస్ర కనకతులాది మహాదాన, నానావిధ మాన నిస్తుల కీర్తి చంద్రికాధవళిత దిశాంతరాళ గడిమన్నియవిభాళ సేతు శీతా చలమధ్య భూతలాయాతక, విబుధచాతక వ్రాతకౌతుక హేతు కనకధారాభి షేక, వినతపర్జన్య వినుతసౌజన్య నిఖిలపురాణేతిహాసకథాను సంవిధాన నిరుప మాన విజ్ఞాన, సాంద్రవచన మాధురీగరిమాధరీ కృతసమాచ, కవేరకన్యానదీతీర ప్రతిష్ఠాపిత నిస్తులవస్తు సమగ్రానేకాగ్రహార సంతోషిత మనీషి జనసంతతాశీ ర్వాది ముదిత సముదగ్ర వైభవ, చంద్రగిరి కృష్ణ నృపతనూభవ, హనుమద్ధ్వజ బిరుద ప్రకాశిత నిజభుజాబల, భాగమాంబాగర్భశుక్తిముక్తాఫల సౌందర్యనిర్జిత నలకూబర నలజయంత, తుపాకుల యనంతవసుమతీకాంత ప్రణీతంబైన శ్రీమహా భారత వచనకావ్యంబునందు సభాపర్వము.

## సభాపర్వమునుండి యుదాహృతి

"అంతటి మహానుభావులగు రాజులుండ రాజార్హంబులగు పూజలకు రాజభావ రహితుండగు గోవిందుం డెవ్విధంబున నర్హుండగు ? మైత్రి వాటించిగదా యాదవునికిం గావించితివి ? ఇది పాండుపుత్రులగు మీకు నుచితంబగు. మీరు బాలురు గావున ధర్మ సూక్ష్మం బెఱుంగరైతిరి. ఈ శాంతనవుండు నల్పబుద్ధియును, వృద్ధుండును నగుటంజేసి కృష్ణుండు మీకుం జెలికాండనియును నతని నర్చించుట మీకుం బ్రియంబనియును వివరించెంగాని రాజధర్మం బెఱింగి తెలుపలేండయ్యె. ఇతండు వయోవృద్ధుండని పూజించితివేని, వసుదేవుండుండ నతని పుత్రుండగు నితం డెట్లు పూజార్హుండగు ? కాక మిత్రమహత్వంబువలన నితండు పూజ్యుండని తలంచితివేని, నిఖిల గుణగరిష్ఠుండగు ద్రుపదునిం బూజింపరాదే ? గురువని తలంచితివేని; యాచార్యుండగు ద్రోణుండుండ కృష్ణుండు పూజనీయుండగు టెట్లు ? లేక ఋత్విజుండని విచారించితివేని, బ్రహ్మనిష్ఠుం డగు సాత్యవతేయుండు లేండయ్యెనే ? స్వచ్ఛందమరణుండును, వృద్ధుండును బురుష శ్రేష్ఠుండుననగు శంతన నందనుండుండ నితని నెవ్విధంబున నర్చించితివి ? మఱియును భరతవంశంబునకుం జాపవిద్యాగురుండగు కృపాచార్యుండును, నఖిల శాస్త్రాస్త్ర విశారదుండగు నశ్వత్థామయును, గింపురుషాచార్యుండగు ద్రుముండును, ధనుర్విద్యా కౌశలంబునం బరాక్రమంబున ధనంజయ సమానుండుననగు నేకలవ్యుండును, బటు

శౌర్యధుర్యుండగు కృపాచార్యుండును, భగదత్తుండును, రాజ్యాధీశ్వరుండగు జయత్సేనుండును, గీర్తిధురంధరుండగు కాళింగుండును, బూర్వకోసలేశ్వరుండగు బృహద్బలుండును, మహావీరుండగు విరాటుండును, శూరాగ్రేసరుండగు దరదుండును, వైరిదుస్సహుండగు భీష్మకుండును, గాంభీర్యభూవల్లభుండగు కృతధన్వుండును, రాజశ్రేష్ఠుండగు రుక్మియును, మహారాజేశ్వరుండగు దంతవక్త్రుండును, మద్రదేశాధ్యక్షుండగు శల్యుండును, వీరుండగు సురాష్ట్రాధిపతియును, గంభీరవసమానుండగు మాళవుండును, సుజ్ఞానశీలుండగు వైదేహుండును నను మహాత్ములగు వీరలిందఱు నిటుండ నీ గోపాలబాలుఁడు నీకు నర్చనీయుండయ్యెనే ?

ఈ భాగమును నన్నయభట్ట భారతానువాదముతోఁ బోల్చిన వీరరాజకవి సంస్కృతమునే సరిగా ననుసరించెనని తెలియఁగలదు.

## భీష్మపర్వము

కళువె వీరరాజకృతమగు నీ భీష్మపర్వమునందు 117 అధ్యాయములు గలవు. ఇందలి విశేషమేమనఁగా సంస్కృతాంధ్రములలో మూలమందుఁగూడఁ గన్పట్టని భగవద్గీత యిందు 23–40 అధ్యాయములలోఁ గన్పట్టుచున్నది. పదునెనిమిది యధ్యాయములకు సరియగు వచనము గలదు. ఈ భీష్మపర్వ గద్యలయందు వీరరాజు గద్యలతో భారతమునఁ గన్పట్టుచున్న తుపాకుల యనంతభూపాలుని గద్య కానవచ్చుట లేదు. భగవద్గీత పారాయణగ్రంథము కాఁబట్టి దానిని వేఱుగాఁ బ్రతులావశ్యకములయ్యెను. అట్లు వేఱుగా లభ్యములైన ప్రతులయందు వీరరాజుగద్యకు మాఱుగాఁ దుపాకుల యనంతభూపాలుని గద్యయేకలదు.

[1]ఇది శ్రీమదుభయభాషాకవిత్వభూషణేంద్ర చంద్రగిరి కృష్ణనరేంద్ర తపఃఫలసంజాత కుమారచంద్ర విమల యశోవిశాల తుపాకుల యనంతభూపాలప్రణీతంబైన శ్రీమద్భగవద్గీతా వచనంబునందు సర్వంబు నేకాశ్వాసము.

1. ఈ భగవద్గీత వచనము క్రీ. శ. 1907 లో మదరాసులో ముద్రితమైనది. దీనినిఁ దిరుగ క్రీ. శ. 1934 లో ఎలమంచిలి గీతాసమాజమువారి పక్షమునఁ బ్రసిద్ధ వైజ్ఞానికులు శ్రీ గొబ్బూరి వేంకటానంద రాఘవరావుగారు ముద్రించి, ప్రకటించిరి ముద్రితగ్రంథలలోఁ బైగద్యగలదు.

ఈ గద్య వెనుక నీ క్రింది రెండు పద్యములు గన్పట్టుచున్నవి :

ఉ. నీలద నీరగాత్ర రజనీచరగర్వ విభేదనక్రియా
ధార చతుర్భుజాన్విత సుదర్శనశంఖగదాబ్జ సర్వబృం
దారక బృందవందిత పదద్వయ దివ్యకిరీటహారకే
యూర విభూషితాంగ సుగుణోన్నత సన్ముని జాలసన్నుతా.

క. వారిధి కన్యాకుచకుం భోరుపరీరంభ జృంభణోజ్జ్వలముక్తా
హారాంచిత వక్షస్థల శ్రీరమ్య కృపాలవాల శ్రీగోపాలా!

ఈ రెండు పద్యములు చూడఁగా నీ భగవద్గీతయుఁ దక్కిన పర్వముల వలె, వీరరాజును, అనంతభూపాలుఁడును గలిసియే రచించినట్లేర్పడు చున్నది. ఏలయనఁగా వీరరాజ కృతులన్నియు శ్రీగోపాలాంకితములు. వీరరాజకృత భీష్మపర్వ ప్రతియందలి భగవద్గీతకు ముందుగాను వెనుకను గోపాలాంకితముగా నీ క్రింది పద్యములు గలవు :

క. శ్రీరమణీ హృదయప్రియ సారసపత్త్రాయతాక్ష సకలాధ్యక్షా
భూరికరుణా విలాసా శ్రీరాజితసుగుణజాల శ్రీగోపాలా.

మాలిని. దివిజనగరపాలా! దివ్యకౌశేయచేలా
సవనభరణదక్షా! సాధితారాతి పక్షా
ప్రవిమలగుణధుర్యా! పావనామేయచర్యా
నవజలధరనీలా! నందగోపాలబాలా!

దీనినిబట్టి భగవద్గీత ప్రత్యేకముగ వేఱుపఱచి వ్రాసిన లేఖకులు తుపాకుల యనంతభూపాలుని గద్య మాత్రమే వ్రాసిరనియు, నదియే ముద్రణముల కెక్కినదనియు, ప్రస్తుతము ముద్రితమైన భగవద్గీత యిరువురి రచన యనియు నిశ్చయముగఁ జెప్పనొప్పును.

ఈ భీష్మపర్వశైలి, సభాపర్వశైలికన్న భిన్నగనున్నది. వీరరాజు మహావీరుఁడగుటవలన, భీష్మపర్వశైలి విశిష్టమై వెలయు చున్నది. భగవద్గీత వేదాంతగ్రంథము గావున నందలి గంభీరవిషయములు ప్రజలకు సుగ్రాహ్యమగురీతిని వీరరాజు రచియించియున్నాఁడు. ఉదాహరణముకొఱకు రెండు గ్రంథభాగములనుండి కొన్ని పంక్తులు నిచ్చు చున్నాను.

భగవద్గీత :- ఎవ్వరు సర్వజ్ఞత్వాదిగుణంబులు గలిగి యీశ్వరుండైన నాయందు మనంబు నిలిపి నిత్యధ్యానయుక్తులై శ్రద్ధావంతులై నన్నుపాసింపుదురు వారలు యోగిశ్రేష్ఠులు. ఎవ్వరేనియు నింద్రియంబుల నిగ్రహించి శత్రుమిత్ర మధ్యస్థులయెడ సర్వభూతహితులై, అక్షరంబును ననిర్దేశంబును, అవ్యక్తంబును, సర్వగతంబును, నచలంబును, ధ్రువుండగు పరబ్రహ్మంబు నుపాసింపుదురు వారు నన్నె చెందుదురు.

(పండ్రెండవ యధ్యాయము.)

[1]భీష్మపర్వము : అంత నారాత్రి ధర్మజుండు, తమ్ములుం దానును, నాప్తులగు మహీపాలకులతోడం గూడి, జనార్దనునిపాలికిం జని, భీష్మ పరాక్రమంబును దమ పరాజయంబును దలంచి పొగులుచు నతనిం జూచి రాజీవాక్ష! నేడు సురనదీసూనుండు రణంబున విజృంభించుట గనుంగొంటివె. ఆతండు గ్రీష్మసమయంబునం బేరడవి నేర్చు కార్చిచ్చు విధంబున విజృంభించి మన బలంబులనెల్ల నిశితవిశిఖంబులచే సమయింపం దొడంగె. చాపంబని యెడి వక్త్రంబుచే భయంకరంబగు నా భీష్మశార్దూలమునుం గనుంగొనినయంతనే మనసైన్యంబులెల్ల దిక్కులం బట్టి బఱచుచున్నయది. వజ్రపాణియగు మహేంద్రునైనం బాశహస్తుండగు వరుణునైనం గదాదండధారులగు వైశ్రవణ వైవస్వతులనైనం గెలువం దరంబగు నింతియకాని మహాబలుండగు నతని గెలువందరంబుగాదు.

ఆదిపర్వము వచనము

ఈ పర్వమునందలి వచనరచన మచ్చునకు నీ క్రిందిభాగము నుదాహరించుచున్నాఁడను. ఇది ముద్రితముకాలేదు.

"కుమారకా! యేను జాత్యంధుండయినను పాండుభూపాలుండు నన్ను మిగులం బూజించె. అది యెట్లంటేని లోచనంబులు లేమింజేసి పరదళంబుల మొగ్గరంబులు పన్ని యగ్గలిక మెఱయ గెలువంజాల; స్వరాష్ట్ర పరిపాలనంబున కసమర్థుండ; సాంగంబులుగ వేదంబులను రాజనీతి శాస్త్రంబులు నధికరించితి. ఎంత యతిశయించిన నేమి ప్రయోజనంబు? క్షత్రియుండగువాఁడు ధర్మమార్గంబు దప్పక సమరంబు

1. మహాభారతము, భీష్మపర్వము. సాధనముద్రాశాల. అనంతపురము 1936 శ్రీ యన్. కే. వెంకటేశముపంతులుగారు సంపాదకులు పుటలు. 374.

గావించి హతుండయ్యేనేని స్వర్గంబునకరుగు జయించినం గీర్తియును భూమియుం బడయుం గావున నాయుధోపజీవుల కాయోధనంబవశ్య కర్తవ్యంబు. అట్లు గెలిచి పుత్రులయొడ నైశ్వర్యంబు నిలిపి వనవాసంబున కరుగవలయు. ధర్మపౌరుష ప్రభావంబుల వారలధికులై యున్నయెడ వారల నెట్లునగరంబు వెలువరింపించి వారణావతంబున కుంబనుపువాండ నట్లు పనిచినను లోకంబునం గల జనులు నిందింపకుందురె?

(ఆదిపర్వము 139 అధ్యాయము. K 4–2 పుట 421.)

ఇందలి రచనలలో 'నేను' శబ్దమునకు 'తాను' పలుకరించు మొదలగు క్రియలు, తత్సమక్రియలకు శత్రర్థకమున నింపుగాగమము, ఆహామదర్థకమునఁ దచ్ఛబ్దబహువచన ద్వితీయాది విభక్తిరూపములు - వాటిని వాటికి - మొదలగు ప్రయోగములు గలవు.[1]

పై నుదాహరించిన వానినిబట్టి వీరరాజకవి రచనయందలి గుణములను గ్రహింపనగును.

1. వీరరాజు వ్యాసభారతమునే యనుసరించి యందలి యధ్యాయములకు సరిగాఁ దెనుఁగున నధ్యాయములుగానే విభాగించి రచించెను. కావునఁ గవిత్రయభారతము ననుసరింపలేదని తోఁచుచున్నది.

(2) ఇందలిశైలి చాలవఱకు సంస్కృతపదజటిలమైయున్నను, నేతత్కవి తెనుఁగు భాషాసంప్రదాయజ్ఞుఁడగుటచే నీ కృతికిఁదెనుఁగుఁదనముగూర్చి తెనుఁగు వచనకావ్యములలో నుత్తమస్థానము గల్పించెను.

(3) వీరరాజువర్ణనలు చేయుటయందు మిగుల నైపుణ్యము గలవాఁడు. అందును యుద్ధవర్ణనల కీతఁడు పెట్టినదిపేరు. తాను స్వయముగా మహాపరాక్రమవంతుఁడై, సైన్యాధిపత్యము వహించి, యనేక యుద్ధములయందనుభవముగలవాఁడగుటచేత, యుద్ధవర్ణనయం దీతఁడు వినువుపుట్టింపక యుద్ధము కన్నులకుఁ గట్టినట్లు వర్ణించును.

(4) ఈతఁడు తన మాతృదేశమైన మైసూరి సీమయందు మహాభిమానము గలవాఁడు. [1]సభాపర్వములో మూలమున రెండుచోట్ల 'మాహి

1. ప్రాచీనాంధ్ర వచనకావ్యములు. ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక. 2 సంచిక. మాఁగడతెఱకలు (పుట 49–78.) కీ. శే. శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు.

ష్మతి' (అనగా మైసూరిప్రదేశము) యొక్క సూచన మాత్రమేయుండఁగా నాస్థలమునఁ దెనుఁగులోఁ దన కాలములో మైసూరిసీమ యెట్లున్నదో యతి విపులముగా వర్ణించినాఁడు.

(5) ఈతఁడు వచన రచయితయేకాక, కవియునై నట్లుగా నాశ్వాసాద్యంతముల నీతఁడు రచించిన పద్యములే తెలుపుచున్నవి.

తెనుఁగున వచన రచయితలలో వీరరాజునకు విశిష్టస్థానముగలదు.

## వీరభూపాలీయము

కళువె వీరరాజు పేర వీరభూపాలీయ మను నొక లక్షణ గ్రంథము గలదు. ఇది 'వీరనఛందస్సు' అనుపేర వెలయుచున్నది. "గరళపురిఛందస్సు" అను మఱియొక ఛందోగ్రంథమును నీ వీరఛందస్సును సమానముగానున్నవి.[2]

ప్రారంభము :

క. వీరనయ వరగుణాఢ్యులు వీరనయ మహత్త్వసదృశ విద్యత్క్రవిహం
వీరనయనాంచల కృపన్ వీరనలఘులక్షణంబు వివరించెదగన్.

ఉ. ఈలఘులక్షణంబు సులభేచ్ఛగ్రహించి యనంతరంబు ప
ద్యాలపదాలమర్మము లుదారతపూని పరామరించునా
వేళల నెల్లలక్షణము వేయువిధంబుల సంగ్రహింపఁగాఁ
జాలుదు రెట్టివారను నిజంబిదియేగద కీలు దీనికిన్.

అ వె. పామరునకుఁ గావ్యభావంబు తెలియదు చీకటింటిలోలి చిత్రమట్లు
కొంత తెలివియున్న కోఱవి వెలుంగగుఁ బండితులకు దీపభాతియగును.

గీ. ప్రాసమిరువదినాల్గింట వాసిగాంచి షష్టివిధయతులందున స్పష్టపరిసి
సర్వసాధారణంబగు జాడఁజూచి తేటగనునట్టి తెఱఁగొనర్తు.

---

1. సభాపర్వమును దొలుత క్రీ. శ. 1928 లో ముద్రించి, కీ. శే. యన్. కే. వెంకటేశముపంతులుగారు విపులమగు నాంగ్లపీఠికతో వెలయించిరి. నేఁ డాంధ్రవచన వాఙ్మయమున వీరరాజుయొక్క విశిష్టస్థానము నెఱుకపఱచుటకు వేంకటేశముపంతులుగారి యమోఘకృషియే కారణము. వీరి కాంధ్రవిద్వల్లోక మెంతయుఁ గృతజ్ఞతాబద్ధమై యున్నది.

2. పరిషత్పుస్తక సంఖ్య 363. 10 పత్రములు గలవు.

# తుపాకుల అనంతభూపాలుఁడు

చంద్రగిరి కృష్ణరాజపుత్రుఁడైన అనంతభూపాలుఁడు చెంజీదుర్గ పాలకుఁడు. ఈతఁడు వచన భారత రచనలలోఁ గలుగు వీరరాజునకుఁ దోడ్పడుటయేగాక, విష్ణుపురాణమును రామాయణ సుందరకాండమును వచనముగా రచియించియున్నాఁడు. వీనిలో విష్ణుపురాణము ముద్రితమైనది. సుందరకాండము ముద్రితము కాలేదు. ఇతఁడు తన గద్యలో 'నిఖిలపురాణేతిహాస కథానుసంధాన సమేధమానచాతుర్య వచనరచనా వైచక్షణ్య' అని చెప్పుకొన్నాఁడు. ఈతఁడు తెనుఁగు వచనరచయితలలో నొక యగ్రస్థాన మలంకరింపఁదగినవాఁడు. మచ్చున కాయా గ్రంథములనుండి యుదాహరించుచున్నాఁడను.

## విష్ణుపురాణము

"కలియుగంబున వర్ణాశ్రమధర్మంబు లర్థకామప్రధానంబులై యాచరింపంబడుంగాని ఋగ్యజుస్సామ వేదమార్గంబునం బ్రవర్తిల్లవు. న్యాయప్రాప్తంబులగు వివాహంబులును ధర్మమర్యాదా కలితంబులగు గురు శిష్యభావంబులును దాంపత్యధర్మంబులు నగ్నిసంతర్పణంబులు దేవపూజా విధానంబులు కలియుగంబున గలుగనేరవు".

అయిదాశ్వాసముల గ్రంథము.

## సుందరకాండము

అయిదాశ్వాసముల గ్రంథము.

"ఓ పురుషపుంగవా! నీ వుత్సాహ సంపన్నుఁడవగుచు నన్నుఁ గరుణింపుము. నీవంటి వల్లభుఁడుండియు నేననాథనైయుంగుసనున్నదాన భూకారుణ్యంబు పరమధర్మంబని. పూర్వంబున నీవలననే వినియుందును. నీవు [illegible], మహోత్సాహుండవనియు, మహాబల సమన్వితుండవనియు, నెవ్వరికిం గాని కార్యంబు నీకు శక్యంబనియు నెఱుంగుదు."

1. మైసూరురాజుల సేనానాయకుఁడగు కళులె వీరరాజులతోఁ గలిసి గ్రంథరచనముఁ గావించుటచేత, తుపాకుల అనంతభూపాలుని చరిత్రమును, వీరరాజుచరిత్ర పూర్తియైనతోడనే తెలుపుట సమంజసమని యింక (మైసూరు ఆంధ్రవాఙ్మయము) అను శీర్షికక్రిందఁ జేర్చితిని – కావున ప్రత్యేకముగ నీయలేదు.

మైసూరి ప్రభువగు శ్రీకృష్ణరాజేంద్రభూపాలుని కంకితముగా నీ క్రింది గ్రంథములు రచితమైనవి.

1. శ్రీకృష్ణభూపాలీయము: చంద్రకవి రచితము (మైసూరి ప్రాచ్య లిఖితగ్రంథ భాండాగారము వారిచే ప్రకటితము. ఇది పీరభూపాలీయము వంటి లక్షణగ్రంథము.
2. కీర్తికాంతా స్వయంవరము: మానూరి గోపాలరాయ కవి రచితము. ముద్రితము.
3. చామరాజేంద్ర చంద్రిక: ఇది చామరాజేంద్ర ఒడయరునకు కృతి. సి. ఆర్. చెల్లయ్యమ్మగారు రచించినది. ముద్రితము.

## కవీశ్వర గిరియప్పకవి

ఈతఁడు మూఁడవ కృష్ణరాయ వొడయరు ఆస్థానకవి. ఆర్వేలని యోగిశాఖ. కాశ్యపగోత్రము. యజుశ్శాఖ. తండ్రి నూరప; తల్లి సుబ్బమ పుట్టుకతో కవి. కృష్ణరాజేంద్రునికి కధలు చెప్పెడువాఁడు: కవిత్వ మల్లెడువాఁడు. ఆతఁడా యా సందర్భములలో సంస్థానములో చెప్పినవి ఖిలమైనవి. ఈతఁడు బాలికా గీతముక్తాకలాపము అను గ్రంథము రచించెను. అది నేటికిని మైసూరులో ప్రచారముననున్నది. ఈతఁడు భరతశాస్త్రమున ప్రవీణుఁడు. ఈతఁడు క్రీ. శ. 1827 లో జన్మించి 1895 ప్రాంతమున చనిపోయెను. క్రీ. శ. 1881–1894 వఱకు పాలించిన చామరాజేంద్రఒడయరు ఆస్థానమున నీయన యున్నాఁడు.

ఆతనిపై "చామరాజేంద్రచతుర్వింశతి" అను సీసమాలిక చెప్పి యున్నాఁడు. ఆ సీసమాలికయందు నిరువది నాలుగు సీసములుగలవు. సీసముల సంఖ్య గాయత్రీమంత్రాక్షరములననుసరించినది.

క. వరగాయత్రీ మంత్రాక్షరసంఖ్యన్ సీసపద్యసరణిగ కృతిసే
విరచించి కాన్కనొసఁగితి కరుణింపుము, చామ భూమి కాంతారమణా.

సకలగుణసాంద్ర సరసభాషాఫణీంద్ర
భోగశేవేంద్ర చామరాడ్భూతలేంద్ర!

అని యొక మకుటము.

సురుచిరాకార కృష్ణరాడ్వరకుమార
శ్రితజనోద్ధార చామరాజేంద్రధీర!

అని వేఱొక మకుటముగలవు.

# నంజరాజు

వీరరాజ పుత్త్రుఁడగు నంజరాజు తండ్రినిమించిన కుమారుఁడు. ఈతఁడు సర్వాధికారియై రెండుదశాబ్దులుమైసూరినేలెనని చెప్పవచ్చును. ఇతఁడు సంస్కృత కర్ణాటాంధ్ర భాషలలోఁ గవి, పండితుఁడు, కృతికర్త, కృతిభర్త. ఆలూరి నరసింహకవి విరచితమైన నంజరాజ యశోభూషణ మను సంస్కృతాలంకార శాస్త్రమున కీతఁడు నాయకుఁడు. ఆ గ్రంథ మున నీతఁడు గీర్వాణాంధ్రకర్ణాటకాది నానాభాషావిశేష కావ్యరచనా చాతురీధురీణుఁడనియు, నవభోజరాజనియుఁ బ్రశంసింపఁబడినాఁడు. ఈతని తెనుఁగు గ్రంథములు రెండు వచనకావ్యములు మనకు లభ్యమగుచున్నవి. రెండును నముద్రితములే.

## హాలాస్య మాహాత్మ్యము

ఇది మధురయందలి మీనాక్షీసుందరేశ్వరుల్ల లీలలను దెల్పు డెబ్బదిరెం డాధ్యాయముల గ్రంథము. తండ్రి వీరరాజువలెనే కృత్యాది యందును నాధ్యాయాద్యంతంబుల యందును బద్యములు గలవు. ఇందలి శైలికిఁ గొన్ని పంక్తు లుదాహరించుచున్నాను.

వ. "రూపలావణ్య భాగ్యమువల్లనో, యనువైన గోత్రంబుగల వాండ నియో విద్యంజూచియో, సుందరేశ్వరుండను బుద్ధిచేతనో, లేక భ్రాంతి చేతనో నేండు నేను బిడ్డనిచ్చుట యనుచుంబలికి, యాబ్రహ్మచారిం గులగోత్రంబుల నడుగ నతండు తనగోత్రంబును సూత్రంబును నక్షత్రం బును నూర్ధ్వపుండ్రంబును గ్రమంబుగా విస్మితుండై యెఱింగించుటయు నబ్బాంధవులు కులగోత్ర వ్యత్యాసంబులు లేకుండుటకు సంతసించి, యూర్ధ్వపుండ్రధారణంబున కొక్కింత భేదంబుం జెంది యనేకమ్ము లగు గుణమ్ముల యందొక దోషంబు గలిగి యుండినంగాని యడంగు నని నిశ్చయించినవారై వివాహంబు లొనరింప నవ్విరూపాక్షుం డైశ్వర్యయుక్తుండగుటంజేసి పుత్రికకధికంబుగా ద్రవ్యం బొసంగ నయ్యుర్వీసురనందనుండు సంతుష్టుండై యాధనంబంతయుం గైకొని

పత్నీసమేతంబుగాఁ బెక్కండ్రు బంధువులతోడం గూడికొనియున్న తల్లిదండ్రుల సమీపంబునకుం జనుదేర దేశాంతరంబున కరిగి వివాహంబుచేసికొని భార్యతోడం జనుదెంచిన కుమారునిం గాంచి తండ్రియుం బాంధవులు నత్యంత సంతోషంబునం బెనఁగిరి. ''
—29 అధ్యాయమునుండి.

ఇందలి రచన సలక్షణమై నాతికఠినముగానున్నదని వీరేశలింగము పంతులుగారి యభిప్రాయము.[1]

## కాశీ మహిమార్థదర్పణము

ఇది స్కాందపురాణముననున్న కాశీఖండమునకు వచనానువాదము. దీని నింతకుముందే శ్రీనాథమహాకవి ప్రౌఢతరమగు పద్యకావ్యముగా రచించియున్నాఁడు. నంజరాజు వచనరచన మూలానుసరణముగ నధ్యాయక్రమము ననుసరించినది. ఇందలి గద్య ననుసరించి చూడఁగా నంజరాజు దీనిని తొలుత కర్ణాటభాషలో ననువదించి యందుండి తెనుఁగునకు మార్చెనని తెలియుచున్నది. "ఇది కర్ణాట భాషావిరచితంబుగా మహాశూరసేనాధిప దొడ్డరాజపౌత్ర వీరరాజ పుత్ర, దళపతి దేవరాజానుజ కళువె నంజరాజభూపాలుండు స్కాందపురాణోక్త కాశీమహిమార్థదర్పణమునందు మణికర్ణికోత్పత్తిం జెప్పిన యిరవైమూఁడో అధ్యాయమునకు మంగళము.''

కాశీఖండము పురాణము కావున నిందలి శైలి కొంచెము వ్యావహారికమై యున్నది.

ప్రారంభము :—

"ఒకానొక కాశీపట్టణము భూమియందున్నదైనా గానీ అక్కడ వాసంచేసికొని యుండేవారికి పునర్భవాదులు లేవు గనుక తాను భూమి గదా? అయినాగాని స్వర్గమందుండేవారికి పునరావృత్తిగద్దు. తన

---

1. చూ. ఆంధ్ర కవులచరిత్ర మూఁడవభాగము. పుట 93.)

యందుండేవారికి పునరావృత్తిలేదు. కనుక తాను స్వర్గమునంటె క్రిందుగా ఉండేటిదైనా, మీదనైననుగాని తాను కోటకొత్తళములచేత కట్టబడినదైనా భవబంధములను విడిపించును.''

చివర :

''గంగామహిమ చెప్పేటివారికి సకల పాపపరిహారము. మాయా మోహితులైనవారికి గంగయొక్క నదిమాత్రమై కనిపించును. జన్మాంతర సంస్కారముచేత గంగయొక్క భక్తి దొరకును. ఆ భక్తి గలిగిన వారికి బ్రహ్మ అమరావతిపట్టణము మొదలైన వాటియందు విడిది చేసికొనియుండును.''

ఈతని కవితాశైలి తెలియుటకు హాలాస్యమాహాత్మ్య కృత్యవతరణికనుండి యొకపద్య ముదాహరించుచున్నాను.

శా. ధీరత్రాణపరాయణుండగుచు నెంతే విశ్రుతుండైన యా
సేనాధీశ్వర దేవభూవిభుడు కాశింఖానమాద్యన్మలా
ఖానాద్యుద్భట యావనాధిపుల సంగ్రామంబునం గూల్చి ఢి
ల్లీ నాథాదులకెల్ల నచ్చెరువు గొల్పెంధారుణీ మండలిన్.[1]

# మైసూరు చెన్నపట్టణ నిర్మాత
# ఇమ్మడి జగదేవరాయఁడు

మైసూరి రాజ్యమున మొదట విజయనగర సామ్రాజ్యాధీశులవలన నాయంకర వృత్తులనుబడిసి యా వెనుక స్వతంత్రులైనవారిలో రాణా వంశీయు లొకరు. వీరు తెలుఁగువారు. చతుర్థ కులజులు – విష్ణువర్ధన గోత్రులు. ఆ రాజ్యమునఁ జెన్నపట్టణసీమను బాలించుచుండెడివారు. సంస్కృతాంధ్ర భాషలను బోషించి రణరంగమునఁగూడఁ బ్రఖ్యాతి

---

1. వ్రాఁతప్రతుల సంఖ్య. 1405, 1406 – కాశీమహిమార్థదర్పణము.
1456, 1466 – హాలాస్యమాహాత్మ్యము.

వహించినవారు. వీరిలో ప్రసిద్ధుఁడగు నిమ్మడి జగదేవరాయఁడు [1]చెన్న పట్టణమునఁ గోటను గట్టించినాఁడు. ఈతనికే పొన్నతోఁట బొబళకవి [2]'వామనపురాణము' అను గ్రంథమును గృతి నొసఁగియున్నాఁడు. అందీతని వంశక్రమ మిట్లు వర్ణితము.




---

1. చెన్నపట్టణము – ఇది మన (మద్రాసు) చెన్నపట్టణము కాదు. ఈ చెన్న పట్టణము మైసూరి రాష్ట్రములోని బెంగుళూరునకు 37 మైళ్ళ దూరమున నున్నది. ఆషెరి తాలూకా ముఖ్యపట్టణము. ఇమ్మడి జగదేవరాయఁ డీ పట్టణమునఁ గోటకట్టి, దానిని విస్తరింపఁజేసి, రాజధానిగాఁ జేసికొనెను. " The fort appears to have been built abont 1580 by Jagadevaraya, who made Chennapatna the Capital of the territory, bestowed upon him for his gallant defence of Penuganda "

Mysore. Lewis Rice Vol. 2. Bangalore Dist, Page 63.

| | | |
|---|---|---|
| Immadi Jagadevaraya | 15 | years |
| Mummadi | 8 | ,, |
| Kumara Jagadeva | 7 | ,, |
| Ankusa | 16 | ,, |

In 1630, It was captured by Chamaraja Vodayar of Mysore.

2. అముద్రితము. (ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారము త్రైవార్షిక సూచికా సంపుటము. 1919-22. నాల్గవ సంపుటము సంఖ్య 607. పుట 1524-39.

## ఇమ్మడి జగదేవరాయఁడు

"[1]అసమబాహాశక్తి నలరారి మృత్యుజా
ఖాను చిత్తాఖాను కఠినభావ
ఖనినూరు ఖానుని ఖండించె నసఁదదీ
యాను చరావళి నాక్రమించి
చెండాడె బలసమంచితముగ విక్రమ
క్రమలీల నెంతయుఁ గ్రమముమీఱ."

ఇట్లు మహామ్మదీయ సేనానాయకులను జయించుటయేగాక, వీర వేంకటపతిరాయలు పట్టాభిషిక్తుఁడగుటకుఁ నీతఁడు దోడ్పడెను. ఈ మహావీరుని వలననే రాణావంశము కీర్తి విస్తరిల్లినది.

పై వంశవృక్షములోని జగదేవని తమ్ముఁడగు అంకుశేంద్రుని కుమారుఁడు 'ఇమ్మడి అంకుశభూపతికి' రేవూరి ఏకామ్రనాథుఁడను కవి సంస్కృతమున "జాంబవతీకల్యాణము"[2] "సత్యాపరిణయము"[3] అను రెండు కావ్యములను రచియించి యంకిత మొనర్చియున్నాఁడు. ఈ రెండింటి యవతారికలయందును రాణా వంశవృత్తాంతము వివరింపఁబడినది. ఇందలి చారిత్రికాంశములన్నియు, వామనపురాణావతారికతో సంవాదము నందుచున్నవి. వామనపురాణమునకుఁ దరువాత రచితము లగుటచే, నీ కావ్యములలో అంకుశభూపతి భార్యలఁగూర్చి తత్సంతానముఁగూర్చి కొంత వివరణముగాఁ దెలుపఁబడినది. జగదేవరాయని విజయములనుగూర్చి సత్యాపరిణయములో:

---

1. Further sources of Vijayanagar History. Dr. N. Venkata Ramanayya.

Vol. II-Page 205. Also Vol. I. page 311-315,

" Headed by famous Jagadevaraya, the ruler of Chenna-pattana they chose Venkata II as their emperor " Jagadevarow appears to have made a sally from the fort and attacked the Kutubshahi Army.

2. Descriptive Catalogue of Sanskrit Manuscripts Vol. XX. No. 11535-11816. (P. 7732-42, 7889-97.)

3. Sources of Vijayanagar History 70-71. P. 227-230.

"యోఽరక్షీ ద్దుర్గవర్యే ఘనగిరిమహితే మూర్తిజాఖాన సూరూ
ఖానే జిత్వాచ శూరే మహితవలయుతం చిత్తఖానంచ యుద్ధే
జీవగ్రాహం త్వ గృహ్ణోద్బహుబలమపి నిర్భేద్య సౌజాతఖానం
యేఽరక్షీ చేర్ణముల్కుం సజయతి జగదేకావనీనాథశౌరే"

వామనపురాణములో నీవలి కుదాహృతమైనదాని నిది దృఢ పఱచుచున్నది.

ఈతని శాసనములు రెండింటి నిం దుదాహరించుచున్నాను.[1]

1. ఒకటి కన్నడము. ఒకటి తెలుగు.

(1) [1]మైసూరిరాజ్యములోని చెన్నపట్టణపు తాలూకాయందలి దశవార గ్రామమునను న్న శాసనము.

శుభమస్తు. స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవరుషంగళు 1535 అగుననియ రుధిరోద్గారి సంవత్సరద వైశాఖ బహుళ 12 నేడు శ్రీమద్రాజాధిరాజమహారాజన పరమేశ్వర శ్రీవీరప్రతాప శ్రీవీరరామదేవరాయలయ్య వడబస్కు గొండరమ్మ నెయ్యానేన శ్రీమతు పృథ్వీ సామ్రాజ్యముచేయుచుండి యుండంగయు విఙ్గపిగారు చలరు. ప్ర...రుగ బసేన నిగద స్వామికిచ్చి ధారాదానసహద్యలు అంగరంగ వైభవలు మొదలుగాల అన్నిన్ని సంగంగాను... విష్ణువర్ధన గోత్రపవిత్ర రాణా పెద జగదేవరాయనింగారికి అమాత్యులైన జగదేవరాయనింగారి పుత్రులు రాజశ్రీ కుమార యిమ్మడి జగదేవరాయనింగారు సమర్పించిన భూదాన ఆయధర్మ శాసనక్రమ మెట్లన్నను...అమరనాయక తనకు నడిచే చెన్నపట్ణం సముతు చెల్లుమంవాగి కీళలలైన దసవరం గ్రామానకు చెల్లే కుప్పకిళువళి సహాగాను చెల్లే చతుస్సీమ తంద్రి జగదేవరాయనింగారికి పుణ్యంగాను సహిరణ్యోదకధారా పూర్వకంగాను సమర్పించిన రంగలు అగ్రామానకు చెల్లే అ చతుస్సీమలో నిధి నిక్షేప జలపాషాణ అక్షిణ ఆగామి సిద్ధ సాధ్యంబులు అనియెడు అష్ట భోగ తేజస్వామ్యములున్నూ మీరాశి షడంగంగాను, త్రివాచకంగాను ఆ చంద్రార్కస్థాయిగాను నడచేలాగున సమర్పించిన దానశాసనము.

దానపాలనయోర్మధ్యే దానాచ్ఛ్రేయోఽను పాలనం,
దానాత్ స్వర్గమవాప్నోతి పాలనాదచ్యుతం పదం.

1. Epigraphica Carnatica Vol IX. Channapattana Taluq. No. 182, Page 349.

ఇందు మొదటిది క్రీ. శ. 1623 నాఁటిది. రెండవది క్రీ. శ. 1621 నాఁటిది. దీనినిబట్టి యీతఁడు 17-వ శతాబ్ధి ప్రథమదశకములోని వాఁడనవచ్చును. ఈతనికిఁ గృతినిచ్చిన పొన్నతోట ఔబళకవియు క్రీ. శ. 1620 ప్రాంతమువాఁడని చెప్పనగును.

ఇమ్మడి జగదేవరాయఁడు సంగీతసాహిత్య విద్యాచతురుఁడు. ఈతఁడు ప్రత్యేకముగా వీణ వాయించుటయందు నేర్పరియని కృత్యాది నున్న యీ క్రింది పద్యమువలనఁ దెలియుచున్నది.

క. ప్రౌఢియగునతని వీణా
వాదన మప్రతిమ, మతులవైభవము శుభా
పాదకము, వితరణంబతి
మోదకరం బౌర ; మఱియ మోఘుం డెందున్.

మఱియు నీతఁడు తెనుఁగున స్వయముగాఁ గవి. కవిరాజని కీర్తి గాంచినవాఁడు. ఔబళకవియే యిట్లు చెప్పుచున్నాఁడు.

గీ. అమిత మధ్యాత్మరామాయణము తెనుంగు
కబ్బముగ గూర్చినట్టి యక్కుబ్బి తేఁడు
పరులకవితా ప్రవీణత లరయనేర్పు
నని వచింపఁగవలయునే యద్భుతముగ.

---

(2) [1]కంకణ హాల్లితాలూకా ఆల్లాస సంద్ర గ్రామముననున్న శాసనము. శ్రీదుర్మ్మఖి సంవత్సరద జ్యేష్ఠబహుళ 2 రాజశ్రీ కొమారయిమ్మడి జగదేవరాయ అయనవరు 1 బసవపళి ఆళాజవానరు ప్రతిష్ఠమాపిదీ కాశీవిశ్వనాథస్వామిగ కనుక నళిసీమాళుగిన అవాళిసముద్ర గ్రామవన్ను సర్వమాన్య అగ్రహార వగికొట్టి శిలాశాశన శ్రీ విశ్వేశ్వరదేవరు.

(ఈ ఎపిగ్రాఫికా కర్ణాటికా సంపుటములలోను. మైసూరి అర్క శాఖా నివేదికల లోను తెలుఁగు శాసనములు చాలఁ గలవు. 10-వ సంపుటములోనే 211 శాసనము లున్నవి. ఇవి కొంతమంది కవుల కాలనిర్ణయము చేయుట కనుకూలించును. వీని లిపి కన్నడము )

---

1 E. C. Vol, 9 Kankanahalli Taluq. No. 108 Pege 296.

కాని జగదేవరాయని కృతి యధ్యాత్మరామాయణము నేఁడు లభ్యముకాలేదు. "కబ్బితేఁడు" అనునది 'కవిరాజ' శబ్దమునకుఁ దెనుఁగుసేఁత.

ఈతఁడు సంస్కృతమునఁ జండికాదేవీ నవరత్నములను రచియించెననియు, వానిని వీణపై వాయించుచుండెడివాఁడనియు, అష్టమాశ్వాసాద్యంతములలోని పద్యములనుబట్టి తెలియుచున్నది.

క. "నిరత ప్రచండదేవీ
విరచిత నవరత్న ఖచిత వీణానాద
స్ఫురణార్ద్రిత మణిగృహసంచరణా..."

క. "ధీవిభవ ఘన ప్రచండ దేవీభరిత
ప్రావీణ్య......................"

మఱియు నీతఁడు పెక్కు గీతప్రబంధములు రచించి యవి వీణపై వాయించుచుండినట్లు పంచమాశ్వాసాంతమున నిట్లు చెప్పఁబడియున్నది.

క. "వరవైణికాద్భుతాపహ
నిరుపమగీత ప్రబంధ నిర్మాణకళా
దరణీయ చాతురీకృత
పరభాగ విశాల సుకృత భరణ సుశీలా!"

ఈ గీతప్రబంధములకొఱకు బరిశోధన నెఱపఁదగియున్నది.

జగదేవరాయనిగూర్చి యీ క్రింది చాటుపద్యము లభించుచున్నది.[1]

జగలోభుల్ మలభాండ విగ్రహులు గంజాతిండి లండీలు మొం
డి గులాముల్ మగలంజె లాగడపు పెద్దల్ ఘోర క్రూరాధముల్
దగిడీలుండఁగ నేమి యర్థులఁ గృతార్థత్వంబు నొందింతువే
జగదేవక్షితి పాలరాజకుల తేజా! దీన కల్పద్రుమా!

---

1. ఇది చాటుపద్య రత్నాకరము 148 పుటలో నుదాహరింపఁబడియున్నది.

## బద్దెపీటి దత్తప్పకవి

ఈతఁడు సుగుటూరి చిక్కరాయ మహేంద్రుని యానతిని[1] గణిత దీపిక యను గణితశాస్త్రమును రచించెను. ఇది పద్యకృతి. వ్యాఖ్యా నముఁకూడ కలదు.

ప్రారంభము.

శ్రీమద్విలాస పరికల్పిత జీవరూప
మానందరూపమణు రూపమమేయరూపమ్
చిత్తీకృతోరుపరమేశ నరేశరూప
మద్వైతనామ జగదీశ్వర నామధేయ.

క. అని యాక్రియ జగదీశ్వరు వినుతింగావించి సకల విద్వజ్జనతా
జనితాదరితా యోగ్యుఁడనను జనులెంచ ధరణినలరినవాఁడన్.

ఉ. భోజసమానమానిత విభూతియు విశ్వదభీష్టసత్కృతి
భ్రాజితపుణ్యవర్తనము భవ్యయశంబును గల్గి ధాత్రిపై
రాజిలు సుగ్గుటూరి చికరాయమహేంద్రుఁడు గారవింపఁ స
ద్యోజిత సర్వవైభవ సమున్నతిఁ గాంచినవాఁడ నెంతయున్.

ఉ. శ్రీతరుణీకటాక్షములఁ జెల్వువహించినవాఁడు, లోక వి
ఖ్యాతుఁడు బద్దెపీటికులగణ్యుఁడు గౌతమగోత్రుఁడన్వ కాం
తాతతి సోదరుండు కడుధన్యుఁడు పుల్లయమంత్రి పుంగవుం
డాతని కూర్మిపుత్రుఁడ మహానయశీలుఁడ దత్తనాఖ్యుఁడన్.

గద్య: ఇది శ్రీ రామపాద సేవక బద్దెపీటి పుల్లయామాత్య పుత్రదత్తయ
నామధేయ ప్రణీతంబైన గణితశాస్త్రదీపికయందు వర్గసూత్రము
సమాప్తము.

## భైరవకూరి ముళువాగళుప్రభువు - కోడూరి వేంకటాచలకవి

కవుల చరిత్రమున కీవఱకే పరిచితుఁడగు కోడూరి వేంకటాచలకవి, దక్షిణ దేశీయాంధ్ర వాఙ్మయమునకుఁ జెందినకవి. ఈతఁడు రచించిన శివరహస్యఖండ కృతిపతి ముళువాగళు ప్రభువు, ఈ ప్రభువు సుగుటూరి

1. ఈ గ్రంథము తాళపత్రప్రతియొక్కటి మాత్రమే అడయారు గ్రంథాలయ మునఁ గలదు. అది యముద్రితము.

వారితో సంబంధముగలవాఁడు. ముళువాగళుప్రభువు భైరవకూరిలో నివాసముగానుండి యా ప్రాంతములకుఁ బాలకుఁడగుటచే నీతని భైరవకూరి లేక బైరకూరి ముళువాగళు రాజని యందురు. వేంకటాచలకవి తన గ్రంథావతారికలో నీ వంశీయులనుగూర్చి విపులముగాఁ దెలిపియున్నాఁడు. అందునుండి వారి వంశవృక్షము నీ క్రింద నొసగుచున్నాను. ఈ వంశీయు లందఱు శైవులు.




శివరహస్యఖండ కృతిపతియగు ముళువాగుళు ప్రభునకును, వేంకటపతిరాయలచే చిక్కరాయపట్టమును బొందిన ముళువాగళు ప్రభునకును నడుమ మూఁడుతరములు గలవు. క్రీ. శ. 1584-1616 వఱకు

వేంకటపతిరాయల కాలమగుటచే నాతని వెనుక మూఁడుతరములకనఁగా క్రీ. శ. 1690 ప్రాంతములలోఁ గృతిపతి ముళువాగళు ప్రభువును నుండ వచ్చును. మఱియు నీతని మేనల్లుఁడగు నిమ్మడి చిక్కరాయని శాసనము క్రీ. శ. 1693 లో కానవచ్చుచుండుటచేత, ముళువాగళు ప్రభువును నాతని యాస్థానములోని వేంకటాచలకవియు క్రీ. శ. 1650–1700 ప్రాంతమువారని నిశ్చయింపవచ్చును.

## వేంకటాచలకవి

ఈతఁడు కోడూరిపుర నివాసి, కాశ్యపగోత్రుఁడు, శివపాద భక్తుఁడు. తాత ఎల్లార్యుఁడు. తండ్రి శంకరమంత్రి. తల్లి లక్ష్మమ్మ. అభిరామ వాసుదేవాది కావ్యములు రచియించిన యెడవల్లి వెంకటకవి యాతని విద్యాగురువు. నలయాదవ రాఘవపాండవీయాది మహా ప్రబంధ నిర్మాతయై, శ్లేషకవితా [illegible] గునుగుటూరి వేంకటకృష్ణకవి యాతని మేనమామ, వేంకటాచలకవి 'బాలసరస్వతి' అను బిరుదముచేఁ బ్రసిద్ధినందెను. పైవారిలో విద్యాగురు విషయమును, మేనమామ విషయమును గ్రంథావతారికవలనను, మిగిలిన విషయము లీక్రింది యాశ్వాసాంతగద్యవలనను దెలియుచున్నవి.

"ఇది శ్రీమత్సకలసుకవిజనానుగ్రహపాత్ర, కాశ్యపగోత్ర, కోడూరి ఎల్లనార్యపౌత్ర, శంకరామాత్యపుత్ర, లక్ష్మాంబికాతనయ, వినయ విధేయ బాలసరస్వతీ నామాంక వేంకటాచలకవి ప్రణీతంబైన శ్రీ స్కాందంబను మహాపురాణంబున శంకరసంహితయను శివరహస్య ఖండం బునం దుపదేశ కాండమునందు సర్వంబును దశమాశ్వాసము".

వెంకటాచలకవి గ్రంథ మిదియొక్కటే మనకుఁ జిక్కుచున్నది. ఈ శివరహస్య ఖండమున నేడు కాండములు గలవు. ఆయా కాండము లలో నెన్నెన్ని యాశ్వాసములుగలవో, వాని వివరణమును గ్రంథాంత మునఁ గవియే యిట్లు చెప్పియున్నాఁడు.

సీ. సంభవంబైదు నాశ్వాసము ల్సర్వంబు నాసురకాండ రెండభినుతింప
నాశ్వాసమొక్కటి యలరు వీరమహేంద్ర కాండకునుతి యుద్ధకాండ నాల్గు
నాశ్వాసములు రెండు నమరునుదేవకాండకునాల్గు దక్షకాండను దగును
ఒనరఁగఁ బదియొప్పనుపదేశకాండకు నిరువదియెనిమిదౌనివియు నిట్లు

గీ. సప్తకాండంబులకును నాశ్వాసనిర్ణయంబుగాఁగను శివరహస్యాఖ్యఖండ
స్కాందమును నాంధ్రభాషచే సకలసుకవినుతుఁడు బాలసరస్వతి కృతియొనర్చె

దీని వివరణము :

| | | | | |
|---|---|---|---|---|
| 1. సంభవ | కాండము | 5 | ఆశ్వాసములు | (సమగ్రము) |
| 2. ఆసుర | ,, | 2 | ,, | ,, |
| 3. వీరమహేంద్ర | ,, | 1 | ,, | ,, |
| 4. యుద్ధ | ,, | 4 | ,, | (లభ్యముకాలేదు) |
| 5. దేవ | ,, | 2 | ,, | (ప్రథమాశ్వాసము |
| 6. దక్ష | ,, | 4 | ,, | మాత్రము గలదు). |
| 7. ఉపదేశ | ,, | 10 | ,, | |
| | | 28 | | |

## పొన్నతోఁట ఔబళకవి - వామనపురాణము

వామనపురాణమునఁ బది యాశ్వాసములు గలవు. కాని వానిలో సప్తమాష్టమాశ్వాసములుమాత్రము ఈవని వేంకటేశకవి ప్రణీతమైనట్లుగా నా యాశ్వాసాంత గద్యలు తెలుపుచున్నవి.

ఔబళకవిగద్య : ఇది శ్రీమద్వేంకటరమణ పరిచరణధురంధర హృదయ నిఖిల కవిరాజ వర్ణనీయవరాంధ్ర కవితావిశేష సర్వంకష భాషా నిరాఘాట పొన్నతోఁట కులపాథోనిధి రాకానిశాకర రాజరాజ దౌబళార్యతనూభ వౌబళకవి ప్రణీతంబైన వామనపురాణంబు నందు సర్వంబును దశమాశ్వాసము.

వేంకటేశకవి గద్య: ఇది శ్రీ మీనాక్షీకటాక్ష వీక్షణానుక్షణ సంవర్ధిత చతుర్విధ కవిత్వవైభవ యావని మొట్టనార్యతనూభవ సరస సంస్కృతాంధ్ర భాషావిశేష బోధాకర, శాండిల్యగోత్ర సుధాకర నిరంతరారాధిత సోమసౌందర్యేశ వేంకటేశకవి ప్రణీతంబైన వామనపురాణమున నోబళకవివిరచిత శేషంబున సప్తమాశ్వాసము —

ఇట్లే అష్టమాశ్వాసము. కాని, నవమ దశమాశ్వాసములలో నోబళకవిగద్య యుండుటచేత నోబళకవియే యిది పెద్ద గ్రంథమని, శేష భాగమును వేంకటేశకవిని బూరింపు మని నియమించియుండును. తిరుగఁ దనకుఁ దీరిక గలుగుటచేఁ జివరి రెండింటిని రచియించియుండును. వీ రిరువురును సమకాలికులే గదా!

ఓబళకవినిగూర్చిన యితర విషయములు తెలియరాలేదు. ఆతఁడు కందాళ భావనాచార్యుని తనయుఁడైన శ్రీరంగాచార్యుని శిష్యుఁడైనట్లు చెప్పుకొనియున్నాఁడు. క్రీ. శ. 1614-30 వఱకుఁ బాలించిన రామదేవరాయల కాలమున కృతికర్త కృతిభర్త లిరువురు నున్నట్లు 'అసమానోదయ రామరాయ ఘనకార్యాయోగ నిర్వాహ' అను పంచమాశ్వాసాంత పద్యపాదము తెలుపుచున్నది.

వామనపురాణమునకు వేఱొకచోటఁ [1]బ్రత్యంతరమున్నట్లు కన్పట్టదు.

ఓబళకవి రచన కుదాహరణములుగా వామన పురాణమునుండి యీ క్రిందివి యుద్ధృతములు:

మ. కృతకైవల్యధునీకమై, మదవృషక్రీడా సమాభోగ ని
ర్మితసంప్రాపితమై, సరోజసుషమోన్మేష క్రియాదక్షమై
పతగానేకవిజృంభ సంఘటితమై, పంకాపనోదప్రథా
శ్రితమై యంతట శారదాగమము మించెన్ సర్వసౌఖ్యంబుగన్.

1. ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారమునఁగల యీ ప్రతి మూలమును సంపాదించినది శ్రీ మానవల్లి రామకృష్ణకవిగారే!

చ. క్షమయును బ్రహ్మచర్యమును శౌచమదీనతయుం జితేంద్రియ
త్వమును, వివేకముం దయయుదానము యజ్ఞమునీశ్వరాంబికా
హిమకర భక్తియు క్తియు నహింసయు శాంతిదమానుభూతియుం
క్రమమున మర్త్యధర్మములుగా వచియింతురు నీతికోవిదుల్. ౨

క. లలిత మణిమేఖలాంచిత జలజాక్షికి జఘనమధిప సాలంకృతమై
వెలయు నలమదన భూవరు నలఘాకృద్దుర్గ నగరమనఁగానమరుం. ౩

క. వారాహియువద నాగ్రన వారాహిసమాన తుండమరుదారగదు
ర్వారాహిత తతిపై సుర వారాహిత వినుతులడరవడిగాఁ దొడరెం. ౪

వేంకటేశకవి రచన కుదాహృతులు :

మ. అనుకీర్తిధ్వజమై, సమస్తబుధసేవ్యంబై, జగత్పావనో
న్మనసంబై శుభదాయియై సకలధర్మ శ్రీ జయాపాదియై
జనిసాఫల్యకరంబునై వెలయు నీసద్వృత్త మంచుం మరు
న్మునివీక్షించి పులస్త్యమౌని పలికెం మోదంబుసంధిల్లఁగం.

## సుగటూరి ముమ్మడి తమ్మభూపతి

మైసూరి పాలకులక్రింద సామంతరాజులలో సుగటూరివా రొకరు. వీరి శాసనములు కోలారు, మూల్‌బాగలు జిల్లాలలోఁగలవు. వీరు శైవులు. సంస్కృత కర్ణాటాంధ్ర భాషాపోషకులు. వీరి వంశవృక్ష మిది. వీరికిఁ జిక్కరాయ లనునది వంశపారంపర్యముగా వచ్చెడి బిరుదము.

సుజ్ఞానమూర్తి
|
దేవయ
|
తిమ్మప్ప (1551-1560)
|
చిక్కతమ్మేంద్ర (1560-1575) (ఇతఁడు చికరాయపట్టముఁ బొందెను)
|
ఇమ్మడి తమ్మభూపాల (1575-1614)
|
ముమ్మడి తమ్మభూపాల (1614-1630)

వీరిలోఁ గడపటి ముమ్మడి తమ్మభూపాలుఁడు గొప్పవిద్వాంసుఁడు, కవి. భాషాత్రయ విశారదుఁడు. ఈతని రచనలు.

సంస్కృతము. 1. శివదర్పణము. 2. రసికమనోరంజనము.
3. కౌముదీవ్యాఖ్య.

కర్ణాటము. 1. శంకరసంహిత. 2. యక్షగానము.

తెలుఁగు. 1. రాజేంద్రచోళ చరిత్ర. 2. కుమారార్జు
నీయము. 3. సౌందరేశ చరిత్ర.

ఈతఁడు శైశవముననే రాజేంద్రచోళచరిత్రను, నూనూగుమీసకట్టు వచ్చినతోడనే కుమారార్జునీయమును, ప్రౌఢవయస్కుఁడైన వెనుక సౌందరేశ చరిత్రమును రచియించెనని వీరి వంశవృత్తాంతము దెలుపు గ్రంథము[1]నుండి తెలియుచున్నది. కాని యీ తెలుఁగు గ్రంథము లేవియును లభ్యముకాలేదు. సంస్కృత గ్రంథములలో మొదటి గ్రంథము శివదర్పణము. శివాగమములు, శివమతోత్కర్ష దెలుపు పెద్ద సంకలనగ్రంథము. ఈ గ్రంథాంతగద్యవలన తమ్మభూపతి విద్యావైదుష్యము సుగమమగును. దాని నీ క్రింద యుదాహరించుచున్నాను.

గద్య: ఇది శ్రీ ప్రమథావతార, సుగుటూరి వంశకలశాంబుధి సుధాకర, శివదర్శనస్థాపనధురంధర, సకలకవిబుధజన, సరసిజమిత్ర శివానందభూపాల చిక్కరాయ తమ్మప్పనరేంద్ర తమ్మప్పమహీపతి కవితసౌభాత్ర సహృదయహృదయాహ్లాద భాషాత్రయప్రబంధ నిర్మాణ, సంగీతసాహిత్యసారస్య సౌరభాస్వాద చాతురీధురీణ నిజాంఘ్రవశంవద నిఖిలసామంతధౌరేయ దానరాధేయ, తమ్మప్ప రూపరామేయ ముమ్మడిచిక్కరాయ, మహీపాల హృదయకమల కుహరవిహారమాన శ్రీ సాంబశివ ప్రేరితేన, వనాన్వయనృసింహ సూరి వరసూనునా, బ్రహ్మవిద్యాధ్వరేణవిరచితే వేదాంతసర్వస్వాపరనామని, శివదర్పణే ప్రథమాధ్యాయస్య ప్రథమపాదః. ఇతనికాలమున విలసిల్లినకవి,

1. Epigraphica Carnatica Vol. IX B Page 255-256, Lewis Rice.

[1]ఈ మహాగ్రంథమున ముందు వివరించిన రీతిని నేడుకాండములును నిరువదియెనిమిది యాశ్వాసములు గలవు. వీనిలో 15 ఆశ్వాసముల గ్రంథముమాత్రమే మనకు లభించినది. వెంకటాచలకవి కవనము ప్రౌఢమైన ధారాశుద్ధిగలదియై యుండును. [2]కవితాశైలిని దెలియుటకుఁ గొన్ని పద్యముల నుదాహరించుచున్నాను.

ఉ. లింగనృపాల పుత్రుఁడగు లింగనృపాలుని శుభ్రకీర్తిశూ
లింగని, శారదాభ్రపటలింగని, నాకధునీతరంగపా
ళింగని, నీలచేలునిహాలింగని, మానసరస్స్ఫురన్మరా
ళింగని, పద్మగర్భునిచెలింగని సారెహసించు నెంతయున్. అవతారిక

## సంభవకాండము నుండి

ఉ. తేనియవాఁక యిచ్చుటను దిన్నఁగరాఁగదవే, మృగీమదం
బీనెలతాలబోఁదె లిడునిచ్చుట జాఱెదుసుమ్మ, కోకిలో
ద్గానములిందు వింటెకలకంఠి యటంచుసఖీజనావళుల్
మానుగ హెచ్చరింప నసమాన మహామహిమాభిరామయై. ఆ. ౧.

మ. పలితస్వచ్ఛశిరోజముల్ తనరఁగా బల్జీర్ణమౌమేనునన్
వళులున్ వ్రేలఁగఁ గంపమంద శిరమున్ వక్త్రంబు నిర్దంతమై
వెలయన్ భూరిజరాతి భారమున గర్వీభూతుఁడై పోలె ప్ర
స్ఖలదంఘ్రిద్వయ మొప్పగద్గదికమించన్ వృద్ధవిప్రాకృతిన్. ఆ. ౨.

ఉ. పోయెదనుండెదన్ సమరము రచియించెద నాయథేచ్ఛ నే
లాయిటులాడఁ దావకబలంబుఁ జలంబును లావుఁజేవయున్
వేయివిధంబులంబలుక వేమరు నాకు జనించుహాసమో
హో యిది చాలుఁ జాలు వినువోరివచించెద రాక్షసాధమా! ఆ. ౫.

1. ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారము. మద్రాసు ప్రతి 322–323.
పై భాగములలో సంభవకాండమును, వీరమాహేంద్ర కాండమును, వరంగలులో శ్రీ కొడిమేల రాజలింగారాధ్యులవారిచే, శ్రీరామలింగేశ్వర శ్రీశివధర్మవర్ధనీ ముద్రాక్షరశాలలో క్రీ. శ. 1913–వ సంవత్సరమున ముద్రితమైనది.

2. వీరేశలింగము పంతులువారి ఆంధ్రకవుల చరిత్ర. మూఁడవభాగము పుట 73–76.

## కృష్ణవిలాసము - విశ్వేశ్వర పండితుఁడు

తలమల :

తిరుచనాపల్లి మండలమున నామకల్లు తాలూకాయందలి తలమల యను కొండ క్రింది ప్రదేశమును పైలింగారెడ్డికి తాతయగు పాపిరెడ్డి వశపఱచుకొని కొండపై శ్రీ వేంకటేశ్వరస్వామి యాలయము కట్టించెను. అందుచేత నీ వంశీయులకుఁ దలమలవారని యింటిపేరు వచ్చినది. వీరిలో క్రీ. శ. 1670–1700 ప్రాంతముల విలసిల్లిన తలమల రామచంద్రారెడ్డికి విశ్వేశ్వరపండితుఁడనువిద్వత్కవి [1]'కృష్ణవిలాసము'అను నైదాశ్వాసముల శృంగారరసో త్తర ప్రబంధము నంకితము గావించెను. ఇందవతారికలోఁ గృతిపతివిషయము విపులముగా గలదు.

కృష్ణవిలాస కృతికర్త విశ్వేశ్వరకవి. కవితార్కిక శిరోమణి బిరుదాంకితుఁడు. గీర్వాణసాహితీవేత్త. అతఁ డీ గ్రంథమునకు ముందు పెక్కు సంస్కృతాంధ్రకృతులు రచియించినట్లుగా నీ క్రిందిరీతిని చెప్పియున్నాఁడు.

సీ. కర్కశంబగునట్టి తర్కశాస్త్రంబున మిగుల శిరోమణి మించినట్లు
రాణఁదలిర్చు పురాణంబులందెల్ల భాగవతంబు చొప్పడిన పగిది
భవ్యసంస్కృత నవ్యకావ్యంబులందెల్ల కడు నైషధం బొప్పుఁగాంచినట్లు
బాగైన యాంధ్రప్రబంధంబులందెల్ల నాముక్తమాల్యద యలరుకరణి

---

1. కృష్ణవిలాస గ్రంథకృతిపతియగు రామచంద్రనాయకుఁడు క్రీ. శ. 1652 లో జన్మించి క్రీ. శ. 1718 లో మరణించినట్లు సేలముజిల్లా గెజటీయరువల్లఁ దెలియుచున్నది. (సం. 1. పుట 69)

**Ramachandra Naika – Robert De Noblli found a Rama Chandra Naicka established at Shendamangalam in 1623. The horoscope of another of these Ramachandra Naicks came in to the hands or Col. Mackenzie from which in appears he was born in 1652 and died in 1718. The name is associated with Talaimalai – a hill over looking the Kauvery it the South of Namakkal Taluq and the Namakkal fort is said to have been built by a prince of this line. Salem Gazetter Vol. 1. Page 69 (History)**

గీ. నేను రచియించినట్టి సంస్కృతకృతులను
తెలుఁగు కృతులను గూఢార్థకలనఁగలుగ
సంస్కృతాంధ్రాది లక్ష్యలక్షణములందుఁ
దెలియఁజాలనివారికిఁ దెలియవశమె.

కాని యీతని కృత్యంతరములు లభింపలేదు. మచ్చున కీతని గ్రంథమునుండి రెండుపద్యము లుదాహరించుచున్నాను.

చ. "తలఁపున నన్ను నిల్పునెలఁతా! నెలతాపము హెచ్చివచ్చెనే
యలరుల తేనె చిల్కు నవలా! నవలాలిత సూక్తివల్కునే
వలపులు సందడింపఁ జెలువా! చెలువానఁగఁ గౌఁగిలింపవే
తలిరులతావిగుల్కు వనితా వనితావుల నన్నుఁగూడవే"

చ. సుదతిరదాళిపేర నునుఁ జొక్కులబల్కులపేర నాసుధన్
జదురుగ నవ్వుపేర నవచంద్రికలన్ నిటలంబుపేర డా
ల్వాదలఁగ నుందు మండలములో సగమక్షులపేరఁ గల్వలన్
గుదుపుగనుంచె మోమునకు గోము సుధాకరుఁ డప్పుఁ దీయఁగన్.

## రాధామాధవ సంవాదము -

# వెలిదండ్ల వేంకటపతి (క్రీ. శ. 1740)

ప్రళయకావేరి (చెంగల్పట్టు జిల్లా)

దక్షిణాంధ్రవాఙ్మయమున వలపు చవులూరఁజేసెడు మేలిమి తెలుఁగు కబ్బము లెన్నియేని విలసిల్లినవి. విజయవిలాసము, సత్యభామా సాంత్వనము, తారాశశాంక విజయము, అహల్యా సంక్రందనము, రాధికాసాంత్వనము మున్నగు శృంగారరసోత్తర కావ్యముల నెఱుంగని యాంధ్రులులేరు. రసికజన హృదయంగమమై రమ్యాంధ్ర మృదుమధురపదసదనమై, రాధామాధవ ప్రేమైక లీలాతరంగిణియగు నీ రాధామాధవసంవాదము దక్షిణాంధ్రకృతులలో మున్నెన్నఁ దగినదియై యలరారుచున్నది.

ఈ గ్రంథ మాంధ్రదేశమున నత్యధికవ్యాప్తిలో నున్నదనుటకు నీ [1]గ్రంథమునకుఁగల మాతృకలును, ముద్రణములును ప్రమాణములై యున్నవి.

ఈ గ్రంథమునకుఁ గృత్యవతరణిక లభ్యముకాలేదు. కావున కృతికర్తనుఁగూర్చియుఁ గృతిభర్తనుఁగూర్చిన విశేషము లితర గ్రంథ సాహాయ్యమున మనము తెలిసికొనవలసియున్నది. ఈ రాధామాధవ సంవాదమునకుఁ గర్త వెలిదిండ్ల వెంకటపతి యని గ్రంథాంతగద్య మిట్లు తెలుపుచున్నది.

“ఇది శ్రీమద్వేణుగోపాల వరప్రసాదలబ్ధ శృంగారకవిత్వవైభవ, వెలిదిండ్ల తిరువేంగళార్యతనూభవ, విద్వజ్జనవిధేయ, వేంకటపతి నామధేయ ప్రణీతంబైన రాధామాధవసంవాదంబను మహాప్రబంధంబునందుఁ బ్రథమాశ్వాసము”.

---

1. క్రీ శ. 1829 నాఁటికే యాంధ్రభాషాప్రచారకులలో మున్నెన్నఁదగిన బ్రౌను దొరవా రీ గ్రంథమునకుఁ బమిడిపాటి వేంకటనరసయ్య యనువారిచేత టీక వ్రాయించి పండితలోకమున కుపయోగపడు ప్రతినిఁ దయారు చేయించియున్నారు [ప్రాచ్య లిఖిత పుస్తకభాండాగార వివరణ నివేదిక. 2-వ సంపుటము 1927. పుట, 925.]

తంజావూరి శ్రీ సరస్వతీమహాలు భాండాగారమునను, ఆంధ్రసాహిత్య పరిషద ముద్రితగ్రంథ భాండాగారమునను నీ గ్రంథమునకుఁ దాళపత్ర మాతృకలు గలవు. అరువదేండ్లనుండి ముద్రితములైన పుస్తకములు వ్యాప్తిలోనున్నవి. అందులోఁ బూర్వముద్రణములు కేవలము ‘గుజిలీ’ ప్రతులుగానుండి, పాఠకలోకమున కత్యంత క్లేశకరముగానుండుటచే వాని నన్నింటిని సేకరించి, సకలజనమనోహరముగ సర్వాంగ సుందరముగ నీ కృతిని కీర్తిశేషులు గంటి సూర్యనారాయణ శాస్త్రులవారు శృంగార గ్రంథమాలయందు తొలి పుష్పముగ నిప్పటికి పదునెనిమిదేండ్లక్రిందట ప్రకటించిరి. ఆ పుస్తకములు నేఁడు లభ్యమగుట లేదు. ఆ పైని యొకటిరెండు ముద్రణములున్నను నవ్యావి పీఠికా విశేషములలో కొఱతపడియుండుటచే నీ గ్రంథమును సంశోధితమును, సంగ్రథితమును, సప్రమాణముఁ గావించిన ‘యాంధ్రవిజ్ఞానసమితి’ వారి ముద్రణము మిక్కిలి సంభావించుచున్నాఁడను.

గ్రంథమునం దింతకంటె కవినిఁగూర్చి తెలియఁదగినదిలేదు. అయినను నీతరువాత సుదంతాకళ్యాణ[1]మను ప్రబంధమొకటి గ్రంథకర్తనుగూర్చి మనకు మిక్కిలిగా తోడ్పడుచున్నది. ఈ గ్రంథము వేంకటపతి తమ్మునికుమారుఁడగు నళఘురికవిచే రచియింపఁబడియుండుటచే నిది మనకు వేంకటపతి వంశచరిత్రము నెఱింగించుటయందు మిక్కిలి విలువగలదిగానున్నది.

సుదంతాకళ్యాణమునుండి కవినిఁగూర్చి యెఱుకపడిన విషయములఁ దెలుపుచున్నాఁడను.

వెలిదండ్ల[2]వారారాధ్యేల నియోగిశాఖా బ్రాహ్మణులు, కౌశిక గోత్రులు. వీరి వంశక్రమము వర్ణించుపట్టున మూఁడు పద్యములు క్రిమిదష్టము లగుటచే నళఘురి ప్రపితామహునివద్దనుండి తెలియనగుచున్న వంశక్రమ మీ దిగువ నుదాహరించుచున్నాఁడను.

---

1. రాధామాధవ ముద్రిత గ్రంథములలో నీవఱకు పీఠికాకారులు వ్రాసిన ట్లీ గ్రంథముపేరు సుదంతాపరిణయము కాదు. "సుదంతా కళ్యాణము" అని కవి గ్రంథమునను నాశ్వాసాంత గద్యలలోనుఁ జెప్పియున్నాఁడు. కావున నేను సుదంతా కళ్యాణమని వాడినాను. ఇది నాలుగాశ్వాసముల ప్రబంధము. ఆంధ్రలోక మీవఱ కెఱుఁగనిది. శ్రీకృష్ణుఁడు సుదంతను పెండ్లియాడు కథ యిందు వర్ణితము. దీని తాళపత్ర మాతృక ఆంధ్రసాహిత్యపరిషత్తునఁ గలదు. దాని సంఖ్య 71. అం దిరువది నాలుగు తాళపత్రములు గలవు. ఎడనెడ గ్రంథపాతముగలదు. శృంగారరసవత్కలితా కలితమగు నీ గ్రంథము యథామాతృకముగ ముద్రింపఁదగినది. ఈగ్రంథము నే నుప యోగింప నొసంగిన సాహిత్యపరిషత్తువారి కెంతయుఁ గృతజ్ఞుఁడను.

2. తాళపత్రమాతృకలలో 'వెలిదండ్ల, వెలిదిండ్ల' యనియుఁ గొన్నిచోట్ల 'వెలిగండ్ల' యనియు గానవచ్చుచున్నది. ఈ ముద్రణమున 'వెలిదిండ్ల' యనియే యింటిపేరు స్వీకరింపఁబడినది. సుదంతాకళ్యాణమునఁగూడ 'వెలిదండ్ల' యనియే కలదు. వెలిదండ్లగాని, వెలిదిండ్లగాని గ్రామనామమగుచో, నీ వంశమువారు తొలుత నెల్లూరు మండలమునఁ బాకనాటి సీమలో నివసించుచుండి, యాపెనుక దక్షిణదేశమున నెలకొనియుందురని తలఁపఁదగియున్నది.




సుదంతాపరిణయమున నళఘురికవి తనపూర్వులు వర్ణించిన పద్యముల నుదాహరించుచున్నాఁడను.

చ. అలతిరువేంగళార్యుఁడు మహాద్భుతచర్యుఁడు కీర్తిధుర్యుఁడై
యలరిప్రసూన మార్దవ శుభాంగిని గోనమయన్వధూమణిన్
లలితగతిన్ వరించి కమలాసతి చేకొనినట్టి చుట్టు వా
ల్చలియునికైవడిన్ బరగె బంధువులందఱు సంతసింపఁగన్

సీ. శృంగారరసముఖోచితసితాంధ్రోక్తి పద్ధతిపోషి వేంకటపతిమనీషి
సకలదేశాధిశ సమ్మతపేశల కవనుండు పెద్దరాఘవఘనుండు
జనమనోరంజన సరససల్లాపధారల వన్నెగన్న చిన్నరాఘవుండు
మధురవాక్యప్రౌఢి మనిరస్తభారతి నఖముఖరితతంత్రి నరసమంత్రి

గీ. లలితవార్తాచమత్కృతి లక్ష్మీపతియు ననఁగ నేవురుగల్గిరి వినయులైన
తనయులై తిరువేంగళార్యునకు జగతి తనువులందిన పంచతత్త్వములనఁగ.

వీరిలో మొదటివాఁడగు వేంకటపతియే మన రాధామాధవ సంవాదమును రచియించినకవి. ఈతనిఁగూర్చి యళఘురి ముచ్చటించిన విధముఁ గనుఁడు.

క. అంద్రగజుఁ డర్పితగోవిందపదుం డచ్చతెనుఁగు ఐంగన ఐలసెన్
చందనభాస్కరుం దనభక్కరుం దన భస్సింధుబంధు గురుతరకీర్తిన్.

సీ. ఆమేరురామేశ్వరావనివిఖ్యాత మేనేత శుద్ధాంధ్రకృతి సహస్ర
మారాజతారార్క మై రాజితస్ఫూర్తి నలరారునే ధీరు నలఘుకీర్తి
ఆసముద్రాసమనాఖిలాభీష్ట లక్ష్మీకరంబై విలాసపాణి
అమరాశామితాశావహ శ్రీధారి యేసూరివైభవోల్లాసకలన

గీ. ఆతఁడు చెలువొందు తిరువెంగళార్యగర్భ జలధికమలారిదుష్కవి స్మయవిదారి
యనవరతతోషి గానవిద్యాభిలాషి బంధుపరిపోషి వేంకటపతిమనీషి.

పై వానివలన వేంకటపతి కవిఁగూర్చి క్రొత్తసంగతు లెన్నియేని మనకుఁ దెలియుచున్నవి. ఈతఁడు శుద్ధాంధ్రమునఁ గృతిసహస్రము రచియించి 'అచ్చతెనుఁగు వెంగన' అయినాడఁట. ఆ తెలుఁగు గబ్బము లేవియు మనకుఁ జిక్కుటలేదు. మఱియు నాతఁడు కవితయందేగాక గానమునందును నభిలాషగలవాఁడని యళఘురి చెప్పుచున్నాఁడు. సంగీత సాహిత్య విద్యావిశారదుఁడగు వేంకటపతికవికృతి రాధామాధవమొకటి తక్క, తక్కినవి కానరాకుండుట విచారకరముగానున్నది. అయిన నింకొకసందేహము కలుగవచ్చును. సుదంతాకల్యాణమున రాధా మాధవకృతి ప్రశంస లేకుండుటచేత నితఁడు వేఱుపురుషుఁడని భావింప వలనుపడదు. వేంకటపతికవి 'శృంగారరస ముఖ్యోచిత సితాంధ్రోక్తి పద్ధతిపోషి' యని వర్ణింపఁబడియుండుటచేతను, వేంకటపతి తన రాధా మాధవసంవాద గద్యయందు "శృంగారకవిత్వవైభవ" అని శృంగార పదము చేర్చుకొనియుండుటచేతను వీరిరువురు నొకరే యైయుందు రనుటకు సందేహములేదు. మఱియు నళఘురికవి సుదంతాకల్యాము వ్రాసిన వెనుక వేంకటపతి రాధామాధవ సంవాదము, వ్రాసియుండి నచో సుదంతాకల్యాణమున నీ విషయము తెలుపుటకు ప్రసక్తియే యుండదుకదా!

మఱియు "వ్యాసతాత్పర్యనిర్ణయము" అను సంస్కృతగ్రంథ మును వేంకటపతికవి కుమారుఁడు "అయ్యన్న" రచియించియున్నాఁడు. అందలి గద్య పరిశీలించిన మనకు పెక్కు సంశయములు వీడును.

"ఇతి శ్రీ రాధామాధవసంవాదాద్యనేక ప్రబంధనిర్మాణధురీణస్య శ్రీవేంకటపతికవి సార్వభౌమస్యతనూభవేన, సుదన్తాకల్యాణాద్యనేక ప్రబంధరచనాచాతురీధౌరేయస్య, అళఘురికవేరనుజేన, వీణావాదనప్రవణ వేదాంతసిద్ధాంతరహస్యార్థ ప్రకాశధురంధరేణ, శ్రీ మదయ్యన్నవిద్వన్మణినావిరచితే వ్యాసతాత్పర్యనిర్ణయే"

మఱియు నందే,

> శ్రీవేంకటపతేస్సూను రళఘు రేరనుజః కవేః
> అయ్యన్నో వైణికః స్వర్వేవ్యాసతాత్పర్య నిర్ణయమ్.

అని కలదు. పైని వివరించిన గద్యవలన అయ్యన్న రాధామాధవ సంవాదమును రచియించిన వేంకటపతికవి సార్వభౌముని కుమారుఁడనియు, సుదంతాకల్యాణమును రచియించిన యళఘురికవి తమ్ముఁడనియు స్పష్టమగుచున్నది. కాని యళఘురి సుదంతాకల్యాణమున వేంకటపతికి రాఘువమ్మ అను భార్యయందు తిరువేంకళార్యుఁడను నొక కుమారుఁడు కలఁడని యిట్లు చెప్పియున్నాఁడు.

> మ. అనఘుండాతఁడు రాఘవమ్మను వివాహంబై తదంభోజలో
> చనయందుం దిరువేంగళాఖ్య సుకృతిఁ సంగీతసాహిత్యధు
> ర్యుని నద్వైత[illegible] సుచరిత్రుఁ బండితస్తోత్ర పా
> త్రుని సౌజన్యసమేతు విశ్రుతవినీతుం గాంచి యొప్పెన్మహిన్.

ఈ తిరువేంగళార్యునికి అయ్యన్న అనునది ముద్దుపేరు. తన తండ్రి పేరిటఁ బిలుచునపుడు కుమారుని 'అయ్యన్న' అని పిలుచుట వాడుకలోఁగలదు. కావున నా పేరితోడనే తిరువేంగళార్యుడు ప్రసిద్ధినందెనని పై గద్యవలనఁ దెలియుచున్నది. మఱియుఁ బై పద్యములోని అద్వైతకళాప్రవీణుఁడను విశేషణము వ్యాసతాత్పర్యనిర్ణయమునందలి 'వేదాంతసిద్ధాంతరహస్యార్థప్రకాశధురంధరేణ' అను విశేషణముతో ననుకూల్యము గలిగి యున్నదిగదా! కావున వీరిరువురు నొకరే యనుటకు సందియములేదు. అయ్యన్న అళఘురికవి తమ్ముఁడనని చెప్పికొన్నప్పు డాతఁడు వేంకటపతి యౌరసుఁడని తలఁపరాదు. వేంకటపతి కయ్యన్నయను నామాంతరము

గల తిరువేంగళాచార్యుఁడుతప్ప మఱి పుత్రులున్నట్లు తెలియుటలేదు. అళఘురి పినతండ్రికొడుకైనను అయ్యన్న యట్లనుటకు కారణ మళఘురి యందఱిలోఁగూడ బెద్దవాఁడగుటయేయని చెప్పనొప్పును.

పినతండ్రి పెదతండ్రికొడుకులు నలుగురును భీమార్జున నకులసహదేవులట్లు తన్ను గొల్చుచున్నారని చెప్పుచున్నప్పు డాతఁ డందఱికంటెఁ బెద్దవాఁడనుట స్పష్టమేగదా! మఱియు సుదంతాకల్యాణ ప్రబంధ రచనాదికముచే నాతఁ డందఱికంటె ముందు ప్రసిద్ధుఁడై యుండవచ్చును. కావుననే యళఘురికవి యందు గౌరవము చూపనెంచి యాతని యనుజుఁడనని యయ్యన్న యీ విషయము గద్యలోఁ బ్రత్యేకముగా నుదాహరించి యున్నాఁడు. అళఘురి పెదవీరరాఘవార్య పుత్రుఁడని నేను పైనివ్రాసిన వంశవృక్షమువలన స్పష్టమగుచున్నది. అళఘురికవి కాపేరు గల్గుటకుఁ గారణ మాతని పెదతండ్రి పెదరాఘవాచార్యుఁడు పాండ్యమండలాధీశుఁ డగు ముద్దళగిరి యాస్థానమున మంత్రియై వెలసినవాఁడు. 'పాండ్యదేశ పరమాప్త పారిషద్యవరుండు' అనుచరణ మిందులకు సాధనముగా నున్నది.

ఇంతదనుక వేంకటపతి చరిత్రమును దెలిపితిని - ఇక నాతని కాలమునుఁగూర్చి తెలిపెదను.

అళఘురి సుదంతాకల్యాణము నాతఁడు మధుర రాజధానిగా పాండ్యమండలమునేలిన విజయరంగ చొక్కనాథునిచే సన్మానితుఁడనని వ్రాసికొన్నాఁడు. విజయరంగ చొక్కనాథుఁడు క్రీ. శ. 1706-1732 లో రాజ్యముచేసినవాఁడు కావున నాతని పెదతండ్రియగు వేంకటపతి క్రీ. శ. 1700 ప్రాంతమున నుండెననుట నిర్వివాదాంశము. ఈ కాలము రాధా మాధవసంవాద కృతిపతి కాలముతోఁగూడ సరిపోవుచున్నది.

రాధామాధవసంవాదము కృతినందినయతఁడు మగదల రామదాసామాత్యుఁడు. ఆశ్వాసాద్యంత పద్యములుతప్ప, అవతారికాభాగ మిందు లేదు. అయిన నాపద్యములను పరిశీలించిన నీ క్రిందివిషయము

తెలుకపడుచున్నవి. ఈతఁడు మగదల కృష్ణమంత్రి తనయుఁడు. ప్రళయ కావేరీపట్టణాధ్యక్షుఁడు, శంకర పద్మనాభ రఘునాథగోపాలుర కగ్రజుఁడు, తాండవకృష్ణ భక్తుఁడు.

ధరణిదేవుల రామమంత్రి కృతమగు దశావతారచరిత్రము మన కీవట్టున నెంతయుఁ దోడ్పడుచున్నది. దశావతారచరిత్ర కృతిపతి మగదల కృష్ణమంత్రి. ఈతఁడే మన రాధామాధవసంవాద కృతిభర్త యగు రామదాసామాత్యుని తండ్రి. దశావతార చరిత్రమున వర్ణితమైన కృష్ణమంత్రి వంశవృక్షమునుఁ జూచినచో నీ విషయము స్పష్టమగును.

మగదలవారి వంశవృక్షము




పై వంశక్రమముఁ జూచిన రాధామాధవసంవాదమున నాశ్వాసాద్యంతములయందు కృతిపతియగు రామదాసామాత్యునిగూర్చి కానఁబడుచున్న వివరములన్నియు దశావతారచరిత్ర వంశక్రమముతో సరిపోవుచున్నట్లు స్పష్టము. ఈ క్రింది వివరములు చూడుఁడు.

రాధామాధవసంవాదము.

ప్రథమాశ్వాసాంతము.

1. పీఠామాత్ర పలప్రద ప్రళయకావేరీ మహాపట్టణాధ్యక్షా !

కృతిపతి రామదాసు.

2. శంకర, పద్మనాభ, రఘునాథామాత్య, గోపాలకాది, సోదరాగ్రజుఁడు.

దశావతారచరిత్ర. కృతిపతి మగదల కృష్ణమంత్రి, ప్రళయ కావేరీపట్టణాధ్య క్షుఁడు. ఈతఁడు 'ఓలాందా' వారి యొద్ద అనగా డచ్చివారియొద్ద 'Pulicat' అనబడు రేవుపట్టణమున కధికారిగానున్న వాఁడు. ఆంగ్లేయభాషలో 'పులికాట్' అనునదియే తెలుఁగులో ప్రళయకావేరి అను రీతిగా మాఱినది.

మగదలకృష్ణమంత్రికి

మ. తనయాగ్రేసరరామదాస విలసత్ సాహిత్యహృష్యన్మనో
వనజా, శంకరదాస గానకలనావైయాత్య వీణానువా
దన సమ్మోదన, పద్మనాభ పరితోదారార్థశృంగారఖే
లన పద్యాదర రంగశాయి మధురాలాపప్రియంభావుకా.

అనువారలు పుత్రులు,

ద్వితీయాశ్వాసము.

శ్రీమగదల రామదాసు అని యింటి పేరు. కృష్ణసచివ కుమారుఁడు. లక్ష్మమాంబా తనూజుఁడు.

తృతీయాశ్వాసము.

కృష్ణయమంత్రి పుత్రుఁడు. మగదల కులధీరుఁడు.

మగదల కృష్ణమంత్రి

భార్య లక్ష్మమ

పై విషయములఁ బరిశీలించిన, దశావతారచరిత్ర కృతిపతియగు మగదల కృష్ణమంత్రి పుత్రులలో జ్యేష్ఠుఁడగు రామదాసామాత్యుఁడే రాధా మాధవసంవాద కృతిభర్తయని స్పష్టమగుచున్నది. కావున నవతారిక భాగము లేకపోయినను నీ విషయము నిర్వివాదమని చెప్పవచ్చును.

ప్రళయకావేరీపట్టణము చెంగల్పట్టుజిల్లాలో పొన్నేరికిఁ బదిమైళ్ల దూరముననున్నది. ఒలాందావారివద్దనుండి యింగ్లీషువారి కిది క్రీ. శ. 1781 లో దాఖలుపడినది. దీనిని క్రీ. శ. 1680 ప్రాంతమున కృష్ణమంత్రి

ఒలాందావారివద్ద ద్విభాషిగానుండి పాలించుచున్న ట్లీక్రింది విషయముఁ బట్టి చెప్పనగును. కృష్ణమంత్రి పెదతండ్రి తిమ్మన నీరవేంకటపతి రాయలచే సమ్మానితుఁడని దశావతార చరిత్రమువలనఁ దెలియు చున్నది. వేంకటపతిదేవరాయలు క్రీ. శ. 1584-1616 వఱకు పరిపా లించినవాఁడు. కాబట్టి తిమ్మన నాల్గవతమ్ముని కుమారుఁడు కృష్ణమంత్రి క్రీ. శ. 1680 సంవత్సర ప్రాంతముల నుండుటయు, నాతని పెద్దకుమారుడు రామదాసామాత్యుఁడు క్రీ. శ. 1700 ప్రాంతములయం దుండుటయు సమంజసము కాకపోదు. వేఱొక సాధనముచేకూడ నీ కాలమును స్థిర పఱుపవచ్చును. రాధామాధవ కృతికర్త వేంకటపతికి అయ్యన యను కుమారుఁ డున్నట్లుగా నీవఱకే తెలిపియుంటిని. ఆతఁడు దక్షిణదేశ మున మహాప్రసిద్ధుఁడగు శ్రీధర వేంకటేశార్యుని శిష్యుఁడని యీ క్రింది శ్లోకమువలన నెఱుకపడుచున్నది.

శ్లో. యద్వీక్షాఖిలలోక కల్మిషతమః కాండస్యచండద్యుతిః
సూక్తిర్యస్య విరక్తిభక్తి భగవద్భోధప్రవాహావనీ
బ్రహ్మానందసుధాబ్ధి మందరగిరిర్యస్యోపదేశక్రమః
తస్మై శ్రీధరవేంకటేశగురవే కుర్వేప్రణామాయుతమ్.

శ్రీధర వేంకటేశార్యుఁడు క్రీ. శ. 1684 మొదలు 1710 వఱకు తంజా వూరును పరిపాలించిన సుప్రసిద్ధ మహారాష్ట్రరాజు, శహాజీ మహారాజుచే సమ్మానితుఁడు. కావున నిదియు పై కాలమునే స్థిరీకరించుచున్నది.

రాధామాధవసంవాదము మూఁడాశ్వాసముల ప్రబంధము. ఇందు రాధామాధవుల ప్రథమానురాగము, రాధావిరహము, శుక సందేశము, సవతుల సంభాషణము, రాధామాధవసంవాదము కడం గడు నేరుపుతో నిర్వహింపఁబడినవి.

ప్రకృతి పురుషులగు శ్రీ రాధాకృష్ణుల ప్రేమను నొత్తరాహులగు జయదేవాదులు గానమొనర్చి జ్యోతిర్మయ శరీరములతో విలసిల్లు చున్నారు. ఆంధ్రదేశమునఁగూడ నీ రాధాకృష్ణులఁ ప్రేమస్వరూప మునుఁ గీర్తించి పెక్కు కవులు ధన్యులయినారు. అయిన దక్షిణభారత

దేశమున రాధాకృష్ణులు ప్రకృతిపురుషులుకారు. విష్ణుభక్తి ప్రతిపాదకములగు విష్ణుపురాణ భారతభాగవతములం దీ సంబంధ మెచ్చటను గన్పట్టదు. దేవీభాగవతమున రాధాదేవి యాదిశక్తిగ వర్ణింపఁబడి యున్నది. ఈ సంబంధమునకుఁ గారణము బ్రహ్మవైవర్త పురాణమని కృష్ణజన్మఖండమునందలి రాధాదేవిచరిత్ర మాధారమని విమర్శాదర్శకుల యభిప్రాయము[1] ఒకానొక శాపముచే రాధ భూలోకమున జన్మించి కొంతకాలము నారాయణపత్ని మాత్రముగనే యుండవలసి వచ్చునను బ్రహ్మవైవర్తపురాణ విషయమె రాధామాధవుల సంబంధమునకుఁ గారణమని విజ్ఞులు తలంచుచున్నారు. కేవలము పరకీయగా రాధను వర్ణించు నాంధ్రకవుల కిదియే మూలమై యుండవచ్చును.

కాని యాంధ్రవాఙ్మయమున మనకు నీ రాధాకృష్ణులఁగూర్చి తెలుపు గ్రంథములలో నిప్పటికి లభించినవానిలోఁ దొలిగ్రంథమగు "రాధామాధవము"న[2] రాధాకృష్ణులు కేవలము లక్ష్మీనారాయణులుగనే వర్ణింపఁబడిరి. ఈ గ్రంథము క్రీ. శ. 1520 ప్రాంతమునాఁటిది. ఆ వెనుక లభ్యమగుచున్న రాధామాధవులఁగూర్చిన గ్రంథములలో రాధామాధవులపై సంబంధమే ప్రస్తుతమైనది.[3] దక్షిణాంధ్రవాఙ్మయమునఁ బ్రస్ఫుటమగు నతివేల శృంగారరసవర్ణనమున కీ గాధ యెంతయుఁ దగియున్నది. కావుననే మన రాధామాధవ సంవాదమునను, సముఖము వేంకట కృష్ణప్పనాయని రాధికాసాంత్వనము, ముద్దుపళని రాధికాసాంత్వనము

---

1. రాధామాధవము మునిపలుకు – విమర్శాదర్శక. నడకుదుటి వీరరాజుపంతులు గారు. పుట. 31.

2. రాధామాధవము. చింతలపూఁడి యెల్లనార్యప్రణీతము. శ్రీకపిలేశ్వర పురాధినాయక ప్రకటితము. కాకినాడ ముద్రాక్షరశాల 1937.

3. ప్రాచ్యలిఖిత పుస్తకాగారమున రాధాకృష్ణవిలాసము, రాధామాధవ సమాగమము మున్నగు గ్రంథములు గలవు. ఇందులో రాధామాధవ సమాగమ మొక యపూర్వకృతియని తెలుపఁబడియున్నది. రాధాకృష్ణులఁగూర్చి యాంధ్రవాఙ్మయమునఁ గల గ్రంథములఁ బ్రకటించి రాధాకృష్ణతత్త్వ మాంధ్రలోకమున వ్యాప్తిఁ జెందునట్లు ఆంధ్రులు ప్రయత్నింతురుగాక !

మున్న గువానియందు రాధాదేవియొక్క పరకీయనాయికా స్వరూపమే మనకుఁ గన్పట్టుచున్నది. వీథి భాగవతములం దీ సంప్రదాయమే యగుపడుచున్నది.

రాధామాధవసంవాదమున వేంకటపతికవి దశావతార చరిత్ర యందు వర్ణితమైన రాధామాధవ కథాసంవిధానముఁజూచి దానిని మఱియు మనోహరముగా నొనర్చినాఁడని రెండు గ్రంథములు చదువఁగా దోఁచుచున్నది. దశావతార చరిత్రమున కృష్ణుఁడే రాధపై తొలినుండి విరాళిగొన్నట్లు సూచింపఁబడియున్నది.

" పిన్ననాటినుండి కన్నులకింపయి
యున్నరాధమీఁద కన్ను వేసి
యున్నవాఁడు గాన, వెన్నుఁడాప్రాయంపు
కన్నె పొందుఁగోరి సన్న సేయ "

" ఎమ్మె మెఱయించు శ్రీకృష్ణుఁ డెల్లవేళ
రాధలంకించుకొనెడి యారాటముసను "

తొలుత శ్రీకృష్ణునికి రాధపై నిట్లు మోహముఁగల్పించుట యనౌచిత్యమని వేంకటపతికవి రాధకుఁ జిన్నదనమునఁ బెండ్లియైనట్లును, భర్తను జూడనట్లును, శ్రీకృష్ణునిపై మోహమున నాతని చిన్నతనము నుండి పెంచి, యాతఁడు వయసువాఁడైన వెనుక తన మనోరథము నెఱవేర్చికొనినట్లును క్రమక్రమముగా రాధాకృష్ణుల మోహావస్థనుఁ జిత్రించియున్నాఁడు. శృంగారరసభావ సందర్భములను వివరించుపట్టున నీ వేంకటపతికిఁగల చాతుర్య మసమానము. పాత్రలు సంభాషించునపుడు మన కండ్లయెదుటవారిని నిలుపును. మాటలు చెప్పునపుడు మన హృదయములకు సూటిగఁ దగులునట్లు చేయును. కవి కావ్యమును కేవల వర్ణన ప్రధానముగాక ధ్వనిప్రధానముగ నొనర్చియున్నాఁడు. చదివినకొలఁదియు వలపుఁ జవులూర పలుకు పలుకునఁ దేనియలొలుకు తలఁపులు నెలవుగా నలరించు రాధామాధవుల యీ మేలి తెలుఁగుఁగబ్బమునుఁ దెలుఁగువా రాదరింతురుగాక !

శెయ్యూరుసంస్థానము - చెంగల్పట్టు జిల్లా

# మారుపెద్ది చెంగల్వరాయకవి

(1810 – 1900)

చెంగల్వరాయకవి చెంగల్పట్టుమండలమున శెయ్యూరు సంస్థానమున నాస్థానకవియై, సంగీత విద్యావేత్తయై యశస్సునందిన విద్వాంసుఁడు. ఈతఁడు వెలనాటి వైదికి, కౌశికగోత్రుఁడు, క్రీ. శ. 1810 సంవత్సరమున జన్మించి, తొంబదేండ్లు జీవించి క్రీ. శ. 1900 సంవత్సరమున ఫిబ్రవరి 28 వ తేదిని మరణించెను.

ఈతఁడు సంస్కృతాంధ్రభాషలయందును సంగీత సాహిత్యములందును భరతనాట్యశాస్త్రమునను పరిణత ప్రజ్ఞగలమనీషి - పచ్చి కుండపైని భరతనాట్య మభినయించి ప్రఖ్యాతిఁగన్న పాత్రకత్తె శెయ్యూరు శారదాంబ యీతని శిష్యురాలే.

తెలుఁగున నీతనికృతులు "ముద్దుకుమార" శతక మొకటియు "చారులీలావిలాసము" అను అసంపూర్ణ ప్రబంధమొకటియు లభ్యములగుచున్నవి. చారులీలావిలాసము దొరకినంతవఱకుఁ బరిశీలింపఁగా కథాసంవిధానమున నిది కళాపూర్ణోదయముతో సరిపోలునని చెప్పవచ్చును.

సంగీతమున నీతని పదకృతులు వేయింటికి మించియుండును. అందు కంచి కామాక్షిపైని 360 కృతులు, మధుర మీనాక్షిపైని 240 కృతులు, శ్రీ వేంకటేశునిపై నూఱు కృతులు కలవు. ఈతఁడు తమిళమున గూడ కొన్ని కృతులు రచియించెను.

## సుందరేశ్వరవిలాసము

అను నొక యక్షగాననాటక మీతనికృతి మనకు లభించుచున్నది. ఇది మీనాక్షీ సుందరేశ్వరుల వివాహము వర్ణించునది. ఇందు పద్యములు, దరువులు, ద్విపదలు, ఒక శ్లోకము పెక్కు రాగములతో కీర్తనలు గలవు,

వానిలో మధ్యమావతి, పూర్ణచంద్రిక, యమునాకల్యాణి శోకవరాళి గౌళపంతు అను రాగములతోనున్న పదకృతులు ప్రత్యేకముగాఁ బేర్కొనఁదగినవి. సంగీత శాస్త్రమున స్వయముగా ముద్రగల పదకర్తలలో చెంగల్వరాయకవి యొకఁడు. చిత్రకవితను సంగీతములో నీతఁడు చూపియున్నాడు. 'సరిగమపదనిసల' తోడనే కందము నడిపించియున్నాఁడు. సుందరేశ్వరవిలాసమున మీనాక్షిని చెలులు "నీ మగని పేరేమి" అని యడిగినప్పు డామె సంకోచించి చిత్రకవిత్వరూపమున సుందరేశ్వరుఁడని వ్యంగ్యముగా నిట్లు పలికెను.

| | | | |
|---|---|---|---|
| సీ. ఇభరాజగమననా విభుని పేరడిగేవు | | | |
| విననమ్మ చెప్పెద విశదముగను | | | |
| తరిత్రాడుగా నేయఁదగుపాడు పేరేమి ? | వా | సు | కి |
| కడలిఁదచ్చిన గొప్ప కవ్వ మెద్ది ? | మ | ంద | ంర |
| పూలతేనియలను గ్రోలెడు పురు గెద్ది ? | ద్వి | రే | ఫం |
| అరదంబునకు ముందుపఱచు నెద్ది ? | అ | శ్వ | ము |
| ఇలునిండ వెలుఁగొందఁగల భూషణం బెద్ది ? | త | ర | ణి |
| విఘ్నేశ్వరుని చేత వెలయు నెద్ది ? | కు | డు | ము |

గీ. అన్నిటికిఁ జూడ మూఁడేసియక్షరములు మధ్యవర్ణంబునందు నామగని పేరు
గానఁబడుచుండు నమ్మ నాకైనమరసి యిందఱుఁ దెలియఁ బల్కవే కుందరదన!

పై పద్యమున ప్రశ్నలకు జవాబుగా మధ్యవర్ణములు చదివిన "సుందరేశ్వరుఁడు" అను పేరువచ్చును. ఇందలి కవితారచన హృద్యమైనది.

ఇతఁడు సుందరేశ్వరవిలాసమే కాక "వల్లీనాటకము" అను నొక నాటకమును చాలగా సంస్కరించి అది ప్రచారములోనికి వచ్చునట్లు చేసెను. అంతియ కాక తెయ్యూరు దేవాలయమున, బహువాద్య సమన్వితమును బహు కష్టతరమునునగు "సర్వవాద్యవిన్యాసము"ను అనఁగా డెబ్బదిరెండు వాద్యముల విన్యాసమును సంశోధించి దానిని పునరుద్ధరించెను. నవీనకాలమున దీనిని ప్రచారములోనికిఁ దీసికొనివచ్చిన కీర్తి చెంగల్వరాయకవిది యని చెప్పవచ్చును.

ఈ సర్వవాద్యవిధానము "కామికాగమము" లో నున్నదట! దీనినింబట్టి అట్టి వాద్యవిధాన సంస్కరణమునకుం బూనుకొనిన చెంగల్వ రాయకవి యెంత యాగమశాస్త్రవేత్తయో మన మూహించుకొన వచ్చును.[1]

## ఎట్టియాపురము సంస్థానము

దక్షిణదేశమున ఎట్టియాపుర సంస్థానాధీశులు సంగీతసాహిత్య విద్యలను బోషించినవారు. వీరిలోం జాల ప్రసిద్ధుండు.

జగదీశ్వర రామకుమార ఎట్టప్ప మహారాజు 1839.

ఈతని తండ్రి వెంకటేశ్వర ఎట్టప్ప మహారాజు క్రీ. శ. 1816 మొదలు క్రీ. శ. 1839 వఱకుం బాలించెను. వెంకటేశ్వర ఎట్టప్ప సంగీత విద్యా సంపన్నుం డగుటయేగాక సంస్కృతాంధ్ర ద్రవిడభాషా విశారదుండు. జగదీశ్వరుండును దండ్రివలె సంస్కృతమునం గావ్య నాటకాలంకారాది విద్యల గ్రహించెను. మఱియు షట్శాస్త్ర మర్యాద లను నెఱింగెను. సంగీతమున లక్ష్యలక్షణ సంప్రదాయముల నెఱింగి వైణికోత్తముం డని పేరందెను. ఆంధ్ర ద్రావిడ భాషలలో నతిసమర్థుండు. సంస్కృతమున దేవతాస్తుతు లగు శ్లోకములును, సంగీతమున 'శ్రీకార్తి కేయ' ముద్రతోం జూర్ణికలు రక్తి రాగకల్పనలతో గేయ రచనలు నీతండు గావించెను. ఈతని యాస్థానము నలంకరించిన కవి పండిత బృందమును బరిశీలించిన నీతండు సంగీత సాహిత్యములను శాస్త్రమును నెట్లుపోషించినాండో తెలియంగలదు. తెనుంగుభాషలోం గవులును, బండితులును భట్రాజులుగూడ నీతని యాస్థాన మలంకరించుటచేతం దెనుంగు భాషయొక్క ప్రాశస్త్యమును మనము గుర్తింపవచ్చును.

---

1. సుందరేశవిలాసమును మదరాసు విశ్వవిద్యాలయ సంగీత శాఖాధ్యక్షులు శ్రీ సాంబమూర్తిగారు ప్రకటించియున్నాడు. అందు "చెంగల్వరాయశాస్త్రి" అని శాస్త్రిపదము నీతనికి చేర్చియున్నారు. కాని యాతని తక్కిన కృతులలో నీ "శాస్త్రి" నామధేయము కన్పట్టదు.

చతుశ్శాస్త్రపండితులు :—శ్రీరంగం కుప్పనయ్యంగారు.

తిరువరంగాడువిశ్వేపురి దీక్షితులు – (వీరు అప్పయ దీక్షితుని వంశీయులు.)

మీమాంసాశాస్త్రవేత్త:—తిరుక్కోడికావల్ కోదండరామశాస్త్రి.

వైయాకరణపండితుఁడు :—విల్లిపుత్తూరు వీరరాఘవ తాతాచార్యులు.

తార్కికశిరోమణి :—విట్లాపుర మన్నారయ్యంగారు.

అష్టాదశాగమవేత్త – ఆంధ్ర సంస్కృత పండితుఁడు :— గుడుగుముల అహోబలశాస్త్రి.

ఆంధ్రవైయాకరణి :—విశాత్తియం కృష్ణయామాత్యులు.

ఆంధ్రద్రావిడ మహాకవి :—ఆవల్నత్తం రామలింగయ్య.

ఆంధ్రపండితులు :—బాలయ్య, గోపాలయ్య.

ఆంధ్రకవీంద్రుఁడు :— కేశవరాజు భట్రాజు.

ద్రావిడకవీంద్రులు :—కడిక్కైప్పులవర్, ముద్దుకుమారప్పులవర్, మున్నగు నాఱుగురు.

సంగీత విద్వాంసులు :—బాలస్వామి దీక్షితులు, వీణ మీనాక్షి సుందరమయ్య,

ఈ మహారాజు ప్రతిదినముసంగీత సాహిత్యవిద్యాగోష్ఠి నెఱపుచుండెడివాఁడట. ఈ కవి పండితబృందమును వంశపారంపర్యముగాఁ బోషించు నేర్పాటు గావించినాఁడఁట. ఈ జగదీశ్వర ఎట్టప్పమహారాజు కాలమున బాల్యదశలో నున్న మహనీయులు :—

## సుబ్బరామదీక్షితులు

దాక్షిణాత్య సంగీతప్రపంచమున మూర్తిత్రయమని ప్రఖ్యాతి గాంచిన వారిలోఁ బ్రథములగు శ్రీముద్దుస్వామిదీక్షితుల కనిష్ఠ సోదరులైన బాలస్వామిదీక్షితుల పెంపుడుకొడుకు సుబ్బరామదీక్షితులు. ఈతఁడు క్రీ.శ. 1839 లో జన్మించెను. జగదీశ్వర ఎట్టప్ప యీ సుబ్బరామ

దీక్షితుల జాతకము చూచి గొప్పవిద్వాంసుఁడు కాఁగలఁడని తలంచి యాతనిని బుత్రునిగా స్వీకరింపుమని దన యాస్థానవిద్వాంసుఁడగు బాలస్వామిదీక్షితులను గోరెను. బాలస్వామిదీక్షితుఁ డపుత్రకుఁ డగుటయే గాక, సుబ్బరామదీక్షితులకు మాతామహుఁడు. కాఁబట్టి రాజాజ్ఞననుసరించి పుత్రునిగా స్వీకరించెను. వెంటనే యా బాలునకు బ్రహ్మోపదేశము, శ్రీవిద్యోపదేశము చేసెను. బాల్యమున సంస్కృత మునఁ గావ్య నాటకాలంకారాదు లేకాక సంస్థానపండితులైన విళాత్తియం కృష్ణయామాత్యుల వారియొద్ద మనుచరిత్ర, వసుచరిత్రాది మహాకావ్య ములును, నాంధ్ర వ్యాకరణచ్ఛందస్సులును సుబ్బరామ దీక్షితులు నేర్చెను. వంశ పారంపర్యముగవచ్చు సంగీత విద్య యాతనికి నుగ్గుఁ బాలతో నలవడినది. ఈతఁడు తన పదియవ యేఁటనే శ్రీకార్తికేయ స్వామిపై నొక తానవర్ణము రచించెనఁట. క్రమక్రమముగా సంగీత సాహిత్యవిద్యలయందు పరిణతుఁడై వాగ్గేయకారాగ్రణియై, ముద్దు స్వామి దీక్షిత సంప్రదాయప్రవర్తకుఁడై, ఎట్టియాపురసంస్థాన విద్వాం సుఁడై ప్రసిద్ధినందెను.

సుబ్బరామ దీక్షితులు సంగీతవాఙ్మయమునకుఁ జేసిన సేవ యపార మైనది. సంగీతప్రపంచమునకు శిరోభూషణమని చెప్పఁదగిన,

'సంగీత సంప్రదాయ ప్రదర్శిని'

అను మహాగ్రంథమును నీతఁడు క్రీ. శ. 1904లో ఎట్టియాపుర సంస్థా నాధిపతుల యాదరముచే వెలువరించెను. అందు ప్రసిద్ధ వాగ్గేయకారుల కృతు లనేకములు స్వరయుక్తముగఁ బ్రకటితములైనవి. సంగీత విద్వాంసులకు, సంగీతశాస్త్ర పరిశోధకులకీ గ్రంథము పెన్నిధి. ఇందులోఁ దొలుతఁ దెలుఁగుభాషలోఁ బీఠికయు, నా వెనుక 44-వ పుటలలో

'వాగ్గేయకారకుల చరిత్ర'

గలదు. మొట్టమొదట సంప్రదాయసిద్ధముగ, చారిత్రకాంశముల వివ రించుచు వాగ్గేయకారుల చరిత్ర తెలిపినది సుబ్బరామదీక్షితులవారే.

ద్రవిడ వాగ్గేయకారులఁగూర్చియేగాక, తెలుఁగువాగ్గేయకారులఁగూర్చి తెలిపెడి యీ యుద్గ్రంథము, తరువాతి పరిశోధకుల కందఱకు నుపజీవ్య మైనది. ఇందలి తెలుఁగు వచనరచనయు సులభమైయుండును. ఆ వెనుక సంగీతశాస్త్రమును గుఱించి యీ క్రింది రెండు వచనరచనలు గలవు.

1. సంగీతలక్షణ ప్రాచీనమార్గము.

2. సంగీతలక్షణ సంగ్రహము.

ఈ రెంటియందును, సంగీతశాస్త్ర సంప్రదాయములు, లక్షణ ములు సరిగా నిర్వచింపఁబడినవి. ఇందు 34 విషయములఁగూర్చి విపుల ముగాఁ గలదు.

## కవిత్రయ మహాభారతము

### ద్రావిడానువాదము

సుబ్బరామదీక్షితు లాంధ్రభాషకుఁ గావించిన సేవ యపూర్వ మైనది. ఈతఁడు కవిత్రయరచితమైన తెనుఁగు మహాభారతమునంతటిని ద్రవిడభాషలోనికి వచనరూపముగా ననువదించియున్నాఁడు. ఈ రచన జగదీశ్వరరామకుమారఎట్టప్పమహారాజుగారి ప్రోత్సాహమున జరిగినది. పై సంగీతసంప్రదాయ ప్రదర్శినిలోనే 39 పుటలో సుబ్బరామదీక్షితు లిట్లు వ్రాసియున్నారు:

"జగదీశ్వర రామకుమార ఎట్టప్పమహారాజు హూణాంధ్రద్రవిడభాష లలో నతిసమర్థులు. శ్రీ మహాభారతమందు బద్ధస్పృహులు, కవి త్రయము వారిచే తెనుగింపబడిన శ్రీ ఆంధ్ర మహాభారతము నీ మహారాజు అనుమతివలన నాచే ద్రవిడీకరింపబడి యచ్చొత్త బడినది."

పైరచనలనుబట్టి దాక్షిణాత్య వాఙ్మయమున సుబ్బరామ దీక్షి తులస్థానము నెఱుఁగఁదగును.

## తి. సు. మురుగేశము పిళ్ల

తెనుఁగుభాషలోను ద్రవిడభాషలోను ససమాన పాండిత్యముగల విద్వాంసులలో తి. సు. మురుగేశము పిళ్లను మించినవారు లేరని చెప్ప వచ్చును. ఈతఁడు ఎట్టియాపుర సంస్థానపండితుఁడు. తెనుఁగు భాషలో విద్వత్కవి. ప్రశస్త వచనరచయిత. ఈతఁడు 'త్రిశిరపురము' అను నిజనామముగల నేఁటి తిరుచినాపల్లి వాస్తవ్యుఁడు. క్రీ. శ. 1904 లోఁ బ్రకటితమై, మున్ను పేర్కొనఁబడిన 'సంగీత సంప్రదాయప్రదర్శిని' ప్రకటనకాలమునం దాగ్రంథమును బ్రశంసించుచు నీతఁడు వ్రాసిన శ్లాఘాపద్యములనిందు పొందుపఱచుచున్నాను.

"క. శ్రీవెంకటేశ రెట్టక్ష్మావరుఁడిల కార్తికేయ చరణద్వయప
ద్మావేశిత హృదయుఁడు దీనావనపావన చరిత్రుఁడై విలసిల్లున్."

మత్త. చంద్రకుంద మృగేంద్రచందన చంద్రవిష్టపదీసుధా
సాంద్రహీరతుషార శంకరసామ్య కీర్తిధురంధరుం
డింద్రతుల్యుఁడు వెంకటేశ్వర యెట్టభూమివిభుండు ని
స్తంద్రగ్రంథములు ద్వహించెడి సంతసంబున నుండఁగన్.

సీ. శ్రీపతినిభుఁడగు శ్రీ వేంకటేశ్వర యెట్టేంద్రు భోగదేవేంద్రుఁగాంచి
సన్నుతితో చిన్నసామి మొదలియారు మనవిసేయఁగ సురమంత్రివోలె
చెలఁగు జగన్నాథశ్రేష్ఠియుఁ బురిగొల్ప ధరణిపునాజ్ఞ గాంధర్వవిద్య
ఖిలమొందనీయ కఖిల విబుధోపకారముగ వేంకటమఖి ప్రముఖఫణితి

గీ. కాస్పదంబును సత్కీర్తికాటపట్టునైనసంగీత సాంప్రదాయప్రదర్శి
నీ సముద్గ్రంథ నిర్మాణనిపుణ పటిమఁ జెంచె శ్రీ సుబ్బరామదీక్షిత బుధుండు.

తి. సు. మురుగేశుఁడు, తెనుఁగు పండితుఁడు, త్రిశిరపురం.

మురుగేశంపిళ్ల క్రీ. శ. 1911 లో నాంధ్రసాహిత్యపరిషత్తు స్థాపించిన నాఁటనుండి దానితో సంబంధముగలవాఁడు. క్రీ. శ. 1916 లో మధురయందు 'ఆంధ్రసాహిత్య పరిషద్వార్షికోత్సవసభ' జయప్రదముగ జరిగించుటకు నీతఁడే కారణభూతుఁడు. ఈతని రచనలన్నియు నాంధ్ర సాహిత్య పరిషత్పత్రికయందే ప్రకటితములైనవి.

## ద్రవిడాంధ్రభాషల అన్యోన్య సంబంధము

భాషాతత్వశాస్త్ర సంబంధియగు నీ ప్రశస్తవ్యాస మిప్పటికి ముప్పదియేండ్ల క్రిందటఁ బ్రకటితమైనది. ఈ వ్యాసరచన వెనుకనే కీర్తిశేషులు జయంతి రామయ్య పంతులుగారు సూర్యారాయాంధ్ర నిఘంటు సంపాదకులుగనుండి, మురుగేశంపిళ్ల పాండిత్యమును గమనించి, నిఘంటువునకు ద్రావిడభాషా సజాతీయపదములను సమీకరించుటకు నియమించిరి. ఆపని నీతఁ డతిశ్రద్ధతో నిర్వహించి 7500. సజాతీయ పదములను సేకరించెను. దీనినిబట్టి యీతని భాషాపాండిత్యము గ్రహింపనగును. (చూ. ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక, సంఖ్య 7. పుటలు 108-132.)

## కంబమహాకవి జీవితము

ద్రావిడభాషామహాకవియు రామాయణకర్తయునగు కంబ మహాకవి జీవితమును నీతఁడు తెనుఁగు వచనము గా రచియించెను అదియును పై పత్రికయందే ప్రకటితము. (సం. 12, సం. 2-3, పుటలు. 76-105.)

## కణ్ణకి లేక నూపురమహిమ

ద్రవిడభాషయందలి పంచమహాకావ్యములలో శిలప్పదికారము మణిమేఖల అను గ్రంథములలో నాబాలగోపాలమెఱిగిన కోవిలన్ కణ్ణకి వృత్తాంతమును, మురుగేశుఁడు సంగ్రహముగా వచనరూపముగ రచి యించియున్నాఁడు. ఇదియును బ్రకటితము.

## త్రిశిరగిరీశ శతకము

ఇది త్రిశిరగిరీశుపైఁ జెప్పఁబడిన కందపద్య శతకము, మురుగేశుని కవితావైశద్య మిందుఁ గానవగును. (పరిషత్ప్రకటితము సం. 21, సం. 1, పుటలు 14-24. (1932).)

# అనుబంధము

## అముద్రిత గ్రంథభాగములు

### జైమినిభారతము - కృత్యాది

ముద్రితగ్రంథమున కృత్యాది లేకపోయినను, నీక్రింది యుదాహృత వంశవర్ణనా భాగమునుబట్టి యిది యాగ్రంథ కృత్యాదియేయని చెప్పవచ్చును. ఇష్టదేవతాస్తోత్రము మొదలైనవి అహల్యా సంక్రందనమునందలి పద్యములే యుండునని యీతని సారంగధరచరిత్ర కృత్యావతారికనుబట్టి పోల్చుకొనవచ్చును. (చూ. పుట. 337)

క. బాగైన తత్కులంబున సాగరవలయాంకధరణి చక్రముఁబూనెన్
నాగమహీధర వైరీ నాగమనాయకుఁడు బుధజనాగమనిధియై.

క. ఆనాగమనాయకునకు దానామరశాఖి సమరదర్పితరిపురాట్
సేనావన శిఖికృత సన్మానితుఁడగు విశ్వనాథనాయఁడు పుట్టెన్.

[1]సీ. అచ్యుతరాయలే యవనీశమౌళికి నరుదు కాపలువగ బిరుదులిచ్చె
దక్షిణసింహాసనాక్షీణసామ్రాజ్య ధౌరేయుఁడయ్యె నేధరణివిభుఁడు
ఘనముగావిజయదుర్గను మహాలక్ష్మి నేధీరుండు తెచ్చి ప్రతిష్ఠఁజేసె
మధురాపురంబున మహనీయపాండ్య భూమండలంబేలె నేమహీపమౌళి

గీ. అతఁడు నృపమాత్రుఁడే మహాహవజయాంక భువనవివరావి బిరుదసంభూతకీర్తి
కార్తికకచంద్ర ధవళితగగన వాటి యలఘుఁడగు విశ్వనాథనాయక కిరీటి.

క. ఆయవనీశ్వరమౌళికి నాయత బాహాకృపాణ హతవైరిచమూ
నాయకుఁడగు పెదకృష్ణప నాయఁడు జనియించె సజ్జనావనపరుఁడై.

చ. గజమున నంకుశ స్థితులుగావుగిరుల్ సరియౌని పద్గతిన్
భుజగవరుండుడాఁగు కిటిముఖ్యుఁడు చూడఁగనొంటికాఁడు త
ద్భుజనమవర్ణమంచు వసుధారమణీమణి కృష్ణపెద్దభూ
భుజుని భుజాగ్రపీఠమునఁ బొందికఁజెందునమంక హైఖరిన్

1. This verse is quoted in "Further Sources of Vijayanagar History" Vol. II. by Dr. N. Venkata Ramanayya, M A., Ph. D.

క. ఆతనికి సుతుఁడయ్యె మహోన్నతచరితుఁడు పాదపద్మ నమితారిమహీ
పతి, పెదవీరధరిత్రీ పతి, సంపదలను నిలింప పతిచెలువలరన్.

ఉ. నీళ్ళమునింగియుండి, సవనీయవరాహము పంటిమొంటి యం
దల్లలమాఁదియుండి, పవనాశన వృత్తిగనుండి, కొండలం
దెల్లపుడుండి, యీధరణియింత తపంబొనరించెనో, హరి
ద్వల్లితకీర్తియైన పెదవీరనృపాలుని జెట్టఁబట్టఁగన్.

క. ఆయన కుమార కృష్ణపనాయనిఁగనె నతఁడుపూర్ణలీలల్
పాయక కువలయసౌఖ్య శ్రీయుక్తిన్ ఘనకళావిశేషముఁ గాంచెన్.

క. అస్తోక కీర్తిరుచులుదయాస్తాచల పుష్పవాటిరై విలసిల్లన్
ప్రస్తుతగతి యాసుకృతికి కస్తూరిరంగ నృపతిఘనమతిఁ బుట్టెన్.

గీ. నెమ్మినెలమూఁడువానలునిండఁ గురియు సకలభూమండలంబు దున్నకయె పండు
పాండ్యమండలమేలు నప్పార్థివునకుఁ గృష్ణభూపతి యుదయించెఁ గృష్ణుఁడనఁగ.

క. ఆతనికి నుదయించె మహోన్నతతిరుమలశౌరి చరణనమితారి జనా
హితహారి సదా......దయు సతతసుదర్శన విహారిశౌరి యనంగన్.

శా. శ్రీమీనాక్షియు సుందరేశ్వరులు పేర్మిన్ దల్లిదండ్రింబలెన్
ప్రేమంగామితముల్ ఘటింప విభవశ్రీలీల దేవేంద్రుఁడై
భూమీమండలమేలె సర్వచతురంభోరాశి మధ్యక్షమా
భామామౌక్తిక భూషణంబగుచుఁబర్వన్ సర్వసంస్తుత్యుఁడై.

క. స్తుతమతి ముదువీరనృపుం డతనికి సుతుఁడై జనించె నవనీచక్రం
బతులిత బాహాశక్తిన్ ధృతిమీఱ ధరించెవైరి నృపులుదలంకన్.

గీ. చొక్కనాథేంద్రుఁ డతనికి సూనుఁడగుచు నక్కజంబగు కీర్తిచే నతిశయించె
దిక్కులెల్లను గెలిచిధాత్రిని వహించె మక్కువనుహస్త ముద్రికామరకతముగ.

గీ. ఆతనికిఁగళ...దోషుఁ డక్షయాంకుఁ డమితసంఖ్యకళాధారి యరివిదారి
నృపతిచంద్రుఁడు శ్రీరంగకృష్ణముద్దువీరభూపతి పుత్రుఁడై వెలసెధరణి.

సీ. తనవీరభటజన ఘనపదాహతులచే దిగ్గజంబుల తలల్ మొగ్గతిలగఁ
దనరణభేరికా ధణధణత్కారంబు రిపువధూగర్భ నిర్భేదనముగఁ
దనతేజి సంగరోద్ధతవైరి రాజవక్షస్స్థలంబులు రవగాలుఁద్రొక్కఁ
తనకత్తిసామంత ధరణికాంతుల కంఠభాగంబులను నిండుపదనుఁజూపఁ

గీ. తెలుఁగు నిక్కేరి, మైసూరి, చెంజితంజపురి విజాపురిఢిల్లీశ ముఖ్యరాజ
విజయ లక్ష్మీసమాశ్లిష్ట భుజుఁడు రంగ కృష్ణముదు వీరనృపతి సత్కీర్తిఁగాంచె.

సీ. తనకీర్తి దశదిశా తాటంకవతులకుఁ డెక్కుముత్యాల చేర్పుక్కగాఁగఁ
దనప్రతాపము మహోత్పల భవాండకటాహమునకు బంగారంపుఁ బూఁతఁగాఁగ
దనచరిత్ర యశేషధారుణీ పతులకు ననవద్యమగు నిదర్శనముగాఁగ
దనదు చక్కఁదనంబు తరుణీమణులకెల్ల రతిపతి మోహనాస్త్రంబుగాఁగ

గీ. మెఱయు దొరలందు మేటి సంగరకిరీటి ప్రణుతరిపుపాళి బాంధవపద్మహేళి
రిపుజయవిహారి శ్రీరంగ కృష్ణముద్దు వీరభూమీంద్రుఁ డుర్వీదేవేంద్రుఁడనఁగ.

క. సారసదాచారనయోదారయశోవృత్తశీలయగు ముద్దమ్మన్
శ్రీరంగ కృష్ణముద్దుల వీరేంద్రుఁడు పెండ్లియాడె వేడ్క నెసంగన్.

క. అవనితామణి యెడ నా భూవరచంద్రుఁడు పూర్వపుణ్య ఫలము నా
శ్రీవిజయరంగచొక్కక్ష్మావరుఁ గనియె జగము సంతసమొందన్.

గీ. రామరంతిభగీరథరాజచర్య ననుకరింపుచుఁ బ్రజలకాహ్లాద మెసఁగ
శ్రీవిజయరంగచొక్కధాత్రీ విభుండు పూర్ణపట్టాభిషిక్తుఁడై భూమియేలు.

సీ. తనకీర్తిచక్రవాళనగంబు నవ్వలి నెలవుకుఁ దేట వెన్నెలలుగాఁగఁ
దనప్రతాపము సముద్ధత వైరిరాజన్య వంశాటవికి మహావహ్నిగాఁగఁ
దనదానధారాంబు తటినీసముత్కర మంభోధికిని జీవనంబుఁగాఁగఁ
దనగుణశ్రేణులెంతయు సమస్తోర్వీశు పంక్తులకును మేలుబంతిగాఁగఁ

గీ. గఠినకమఠేంద్ర పరభాగ కపట పోత్రి గంధసామజరాజ వర్గద్విజిహ్వ
భజసవృజనార్తి ధరణీశుభప్రదాయి భుజుఁడు శ్రీముద్దమాంబికా పుత్రుఁడెసఁగు.

సీ. పలికినపలుకెల్ల పద్మగర్భునివ్రాలు తలఁచినతలఁపెల్ల ధర్మమయము
నడచిననడలెల్ల నయమార్గసారంబు చూచినచూపెల్ల శుభకరంబు
పనిచినపనులెల్లఁ బరచమూభయదంబు కోరుకోరికకెల్ల కొంగుపసిఁడి
ఎన్నునెన్నికలెల్ల హితములోకములకు మనుమన్కియొల్లను మాననీయ

గీ. వీర! యీ మేటికిని సాటియవనిఁ గలరె నాఁటిరాజుల యందును నేఁటిరాజు
లందునను పాండ్యసింహాసనాథనాథుఁడిల విజయరంగచొక్కనాథేంద్రుఁడలరు.

చ. బవరమునందు శాహనరపాలుని గర్వమడంచి, దుష్టలో
యవనుల మించనీక తనయాజ్ఞ శిరంబునఁదాల్చి పాళెగా
ర్లవిరళరత్న కాంచనము లప్పనలియ్య సమస్తభూమినే
లువిజయరంగ చొక్కనృపలోక శిఖామణి రాముకైవడిన్.

సీ. తడకట్టుఁ బాములదారి గానామన్నె దొరలిట్టు నటునాడ దెఱచియుందు
రెక్కడెక్కడి వారలక్కడక్కడ పాళ్యగార్లు చిత్రాకృతిఁ గదలకుండ
పులుమేయుచును వనంబుల సంచరింపుచు శాత్రవుల్ పశువులసరణి మెలఁగ
శూలాగ్రమున మేను శోషింపఁజేయుచుఁ జోరకుల్ తపముల తీరుగాంచ

గీ. నవనిపాలించె నార నైకాతపత్ర సరణి శరణాగతత్రాణ బిరుదధారి
వంచతిరువడి రాజసప్తాంగహారి శ్రీవిజయరంగచొక్కధాత్రీ బలారి.

సీ. ఎందాఁక నిందిరాధీశు వక్షంబునఁ గౌస్తుభరత్నంబు కాంతిమెఱయు
నెందాఁకఁ జిత్తజాహితజటాజూటికఁ గ్రొన్నెలరాతళుక్కు వన్నెమీఱు
నెందాఁకలోకత్రయీసృష్టికర్త నెమ్మోమునవాగ్దేవి మోదమొందు
నెందాఁకనాది నాగేంద్ర ... ... ... ...

గీ. వెలయునందాఁక వంశాభివృద్ధిగాఁగ సకలసామ్రాజ్య లక్ష్మీవిశాలభోగ
బహుసుపుత్రాయురారోగ్యభాగ్యగరిమ శ్రీవిజయరంగ చొక్కధాత్రీశుఁడవని.

గద్య: [1]వెండియు నఖండమార్తాండమండలతేజఃప్రకాండ వైశ్వానరజ్వా
లికా నిరంతరసంతప్యమాన బ్రహ్మాండభాండస్ఫుటిత విదీర్ణవిక్షిప్త
వీహికర్ణాయ మానవివిధవిరోధిసామంతవసుంధరానాథయూథుం
డును, వినిశ్యంప్రబోధుండును, కుంభికుంభీనసకుంభినీ ధీరకూటకట
సంరంభ వీరరణప్రారంభక లీలావిజృంభమాణదంభోళిధీర గంభీర
వేదికర సంభాసమాన విమతకుంభినీ వరదురభిమానస్తంభ దంభ
ప్రతిష్టంభ శరణాగతరక్షా సంభారగంభీర, శుంభద్భుజస్తంభ

---

1. Adyar Library 32-E-31 Pandya History.

సంభృతపరిరంభ సంజోకప్రియంభావుక, కలమసముదయ ధరా రోమాంచ గుంభితాజ్ఞాత విప్రలంభాసంబోధి వలయిత విశ్వంభ రాంభోజముఖి మేఖలాసంచరణశీలుండును, శూరమ్మన్యమన్య రాజన్యజన్యమవధిఘాలుండును, ఘోటకపావేతగిరితటకల్పక పటీర విటపిపాటీకృతాటీకన విబుధశరకోటిచటులచాటు వచనపరిపాటీ సముత్పాదిత నటన శశిమకుటకటక రజతగిరికటక కపటపటుచిరణ సరిదురుదర శరసుర కరితురగ పరసితగరుదమల కమలకుముద సముదయ సమిదదన విస్ఫూర్తిమూర్తికైత వామృతఝరీప్రక్షాళిత వేలాశైలచరమభాగ మేదినీతమఃపంకుండును, మధురాపుర శాసనాంకుండును, అసాధ్యాసాధ్యసద్గురుధ్యానాధ్వనీన పరిపంథి విధ్వంసనదక్షహనుమత్ ధ్వజ, గరుడధ్వజ, సింహధ్వజ, నాగధ్వజ, మకరికాద్వయ చంద్రసూర్య శంఖచక్రభూవరాహధ్వజ, స్వర్ణ త్రోభయచామర సాంద్రాణికా వధూవక్రపుముఖ నిఃలబిరుద సముదీర్ణతేజోవిరాజితమానుండును, శ్రీ రంగనాథ జంబునాథ మాతృభూతేశ్వర మీనాక్షీసుందరేశ్వర ప్రముఖదేవతాపూజన సముదారుండును, నిఖిలదిగ్గాజరాజీరాజిత గుణశ్రేణీశాఘాసముల్లంఘన జాంఘికానంత కల్యాణగుణైకహారుండును, పంచతిరువడి సప్తాంగహరణ విహారుండును, నలనహుషనాభాగనృగ నకులాగ్రజ ప్రభృతి నానామహారాజచర్యుండును, దక్షిణసింహాసన సామ్రాజ్య లక్ష్మీధుర్యుండును, సంగీతసాహిత్య సర్వస్వభోజుండును, సంతత ప్రశాంత ముఖాంభోజుండును, సకలసుకవిసముదయగేయుండును, సంగరరంగ గాంగేయుండును, శ్రీ ముద్దమాంబికాగర్భ శుక్తి ముక్తాఫల శ్రీకరుండును, కామసమన్మథాకారుండును, కాంచనాచలధీరుండునునగు శ్రీ విజయరంగ చొక్కనాథనాయక క్షమామండలాఖండలుం డొక్కనాఁడు రుటంపు పటికలమెటికల, నిగ్గులతో నిగ్గులాడుచుం జగ్గుమీఱుమగఱాల నిగరాల..........

సంజరాజు

# శ్రీ హాలాస్యమాహాత్మ్యము

## అవతారిక

శ్రీకాత్యాయని పెండ్లివేళ మిగులన్ వ్రీడాప్తి నమ్రాస్యయై
చోకంఠస్థలియందు తాళిఘటియించున్ జూడతద్వక్త్రమున్
దాకౌతూహల మొప్ప సోన్నమనమున్ గావించి వీక్షించి య
స్తోకానందము సాజెందు నిందుధరుఁ డిచ్చున్ మాకు సౌభాగ్యముల్.

చ. ఇరవగు సర్వలోకముల కీశ్వరియై గజవక్త్రకేకిరా
ట్తురగులకంబయై పరగతోయజ భూవనితాదిదేవతా
తరుణుల కార్యయై శశివతంసునకున్ సతియైచెలంగు వి
స్ఫురితమనోజ్ఞ గాత్రిగిరిపుత్రి ముదంబున మమ్ముబ్రోవుతన్.

ఉ. ఆదరణంబుతో కమలజాండ పరంపరకుక్షిలోపలన్
బ్రోదిగదాల్చు శంభునకు బొల్పుగ పెద్దతనూజుడౌటచే
మోదము మీర దద్భరము బొజ్జలోదానయి దాల్చియొప్పలం
బోదరుడై తనర్చుసుగుణోన్నతి విఘ్నపతిం దలంచెదన్.

ఉ. తల్లికి నొక్క మోమునను తండ్రికి నైదిటనొక్క వేళనే
యుల్లము పల్లవించునటు లొయ్యనముద్దిడి బాలలీలచే
మెల్లముగాగ వారలకు ముచ్చటసేయు కుమారమూర్తి మా
కెల్లెడ నీప్సితార్థముల నీవుత భూరిదయారసంబునన్.

ఉ. వారిజసంభవాండముల వారిత శైఖరికోటికోటులన్
బారపుచెండ్లమాడ్కి నెగవైచుచు గ్రచ్చర బట్టుకొంచుమ
ర్వారమహాప్రభావమున బాపురె కేళియొనర్చు భద్రకా
ళీరమణుండు సత్కృపదలిర్ప మమున్ భరియించుగావుతన్.

ఉ. రంగుగనత్త పెన్మిటి యురంబున నుండఁగఁగాంచి యంతక
స్నం గణుతింప నున్నతమునన్ పతివక్త్రమునందు బొల్చుమీ
రంగను సర్వకాలమనురాగము నన్వసియించియున్న భా
షాంగన యుల్లసిల్లుత దయామతితోడ మదీయవాక్కునన్.

అర్యహితప్రచారమున నందము గాంచి జగద్ధితంబుగా
భూర్యచలైకధర్మధృతి బొల్పువహించి మనోభవస్ఫురత్
తార్యమణంచి నమ్రగణకౌతుకముల్ ఘటియించు నీలకం
ఠార్యుల భాష్యకారుల సమంచితభక్తి భజింతు నెంతయున్.

క. కరమర్థి గొలుతు విమతో త్కర తత్వధ్వాంత సూర్యఘనగుణధుర్యున్
హరదత్త చిదైశ్వర్యుని హరదత్తాచార్యవర్యు నద్భుతచర్యున్.

వ. అని యిష్టదేవతా ప్రార్థనంబు గావించి యే నొక్కనాడు దండనాథ సామంత ప్రముఖులు గొల్వ నిండోలగంబుండి, వారలం బనిచి విద్వజ్జనులతో ప్రసంగవశంబున హాలాస్యమాహాత్మ్యం బాంధ్రభాషను వచనకావ్యంబుగా రచియించెద ననుచుం బలుక వారు సంతోషభరితాంతరంగులై దేవా సకల కళావల్లభత్వంబును సమస్తభాషా ప్రావీణ్యంబునుం గలిగి వీరరాజగర్భాబ్ధిసుధాకరుండ వగు నీ కిది యేమద్భుతం బవధరింపుమని యిట్లనిరి.

మ. సిరితోఁ బుట్టువు లక్షణాఢ్యుఁడు బుధశ్రేణీ సమాసాదిత
స్ఫురితాద్యంత వసుప్రకాండుఁడు కళాపూర్ణుండు సర్వజ్ఞశే
ఖరతన్ బొల్చు మహామహుం డరితతిన్ గాసిల్లగాఁజేయు బం
ధురసామర్థ్యయుతుండు చంద్రుఁ డిరవొందున్ సాంద్రవిస్ఫూర్తితోన్.

గీ. ఆసుధాధాము వంశంబున రహిని సంభవించిరి పెక్కండ్రు జగతివరులు
చిత్రగరిమ భారద్వాజగోత్రకలన పరిఢవిలిరి ముక్కామ్రుఖానువర్తులగుచు.

వ. తత్సంతతి యందు.

మ. జననంబందె మహావిపక్షహరణాంచద్విక్రమోద్భాసితం
దనసౌభాగ్యవినోది పుణ్యజనసంపాదైక సంవర్ధనుం
డనవద్యస్థిరదివ్యభోగుఁడు సుధర్మావాప్తి చేతన్ జగ
ద్వినుతింగాంచు ఘనప్రచారకళ చే తిమ్మేంద్రుఁ డమ్మేటికిన్.

క. కాంతాజననూతనరతికాంతుడు మహనీయ సుగుణకాంతుండుగౌరీ
కాంతాంఘ్రిభక్తధుర్యుఁడు కాంతప్రభుఁడొదవె ధరణికాంతాగ్రణియై.

క. అతనికి దళవాయిదొడ్డ క్షితిపశ్రేష్ఠుఁడు జనించె జేజేఘాటో
ద్ధతదాదాజిప్రముఖ ప్రతిభటగందద్విపేంద్ర పంచాస్యుండై.

ఉ. ఆదళవాయి దొడ్డవసుధాధిపుమౌళికిఁ గల్గె సజ్జనా
హ్లాదకరుండు షోడశమహాద్భుతదానధురంధరుండు తే
జోదినునాథుఁ డంచిత యశోధవళీకృత సర్వదిక్తటుం
డాదినృపాలసన్నిభుఁడుదారు వీరనరేంద్రు డర్మిలిన్.

క. ఆవీరక్ష్మారమణునకు దేవనృపాలాగ్రణియును దేవరయను న
ర్మావనుల్రింద్రోపేంద్రుల భావంబు సంభవించి పరగిరి ధర్విన్.

క. అందగ్రజుండు దళపతి చందిరదేవప్రభుండు సామంతముఖా
స్కందఘనదుర్గతతియను వందన్ సాధించి కాంచె నురుతరకీర్తిన్.

వ. మరియును.

శా. దీనత్రాణపరాయణుండగుచు నెంతే విశ్రుతుండైన యా
సేనాధీశ్వరదేశభూవిభుఁడు కాశింఖానమాద్యన్మరా
ళ్తానాద్యుర్భటయావనాధిపుల సంగ్రామంబునంగూల్చి ఢి
ల్లీనాథాదులకెల్ల నచ్చెరువు గల్పించెన్ ధరామండలిన్.

క. ధరనవ్విభునను జాడప్పై పరగెడు నీవహహా! దానపరతజెలంగన్
హరువుగ ప్రత్యర్థులు దారరయఁగ ముక్తాతపత్రులైరి గణింపన్.

చ. జలధులహో కొలంకులు నిశాకరభాస్కరులద్దముల్ సమా
కలితసుమేరు భూధరముగద్దియ, యద్దిరసర్వలోకముల్
వలనుగ మేల్మహల్లు సురవాహిని మట్టపుమేలుకట్టగున్
చెలువుగ వీరనంజనృపశేఖర తావకకీర్తికాంతకున్.

గీ. అబ్ధిగంభీరదానకర్ణావతార సమరనిశ్శంక పవనాత్మజాన్వజాంక
భోగదేవేంద్ర ఘనకళాపూర్ణచంద్ర నంజభూపాల యటుల నొనప్పుమనిన.

వ. వారల వచనంబాకర్ణించి యానందకందళితహృదయుండనై మదీయకుల దైవతంబగు నంజుడేశ్వరునకు వృత్తాంతంబులు వివరించెద.

క. అరుణాబ్జ స్ఫురణావహ చరణునకును యోగిహృదయసంచరణునకున్
శరణాగత భరణాంతః కరణునకును మహితపన్నగాభరణునకున్.

క. ఉద్యన్నిగమాఘ ప్రతిపాద్యునకును నిజాంఘ్రిభక్తి భాగ్వేద్యునకున్
ఆద్యున కుగ్రభవామయ వైద్యునకున్ గిరితనూభవాహృద్యునకున్.

క. క్రతుభుక్రియ మకుటమణిద్యుతినిరాజితపదాంచ న్నృపకంఠునకున్
హితవైకుంఠునకు విరాజిత విభవోత్కంఠునకును శితికంఠునకున్.

క. సురుచిరమందస్మిత విస్ఫురితజ్యోత్స్నా మనోజ్ఞ ముఖచంద్రునకున్
తురగితవృషభేంద్రునకును నిరవధిక శుభప్రదానని స్తంద్రునకున్.

క. అంభోరుహసంభవవిశ్వంభర సంభావిత ప్రభాగుంభునకున్
శుంభన్నజాండాహ్వయశంభునకుం ద్విజగవదన సంరంభునకున్.

ప్రంథాంత్యభాగము:

చ. వనధినిషంగ ! యోగిజన భవ్యమనోజలజాతభృంగ ! కాం
చన శిఖరీంద్రచాప ! సుమసాయకకోటి మనోజ్ఞరూప ! శో
భనగుణధుర్య ! దీనపరిపాలన తత్పరదివ్యచర్య ! పా
వనతరనామ భక్తజనవాంఛితపూరణ కల్పకద్రుమా !

క. కలుషధ్వాంతపతంగా ! కలితక్షోణీశతాంగ ! కమనాపాంగా !
జలజాస్త్రశమదభృంగా ! విలసద్గంగోత్తమాంగ ! వృషభతురంగా !

మాలిని. హరిణపరశుహస్తా ! యంచితౌజః ప్రశస్తా !
సరసిజభవవంద్యా ! సర్వలోకాభివంద్యా !
పరమశుభచరిత్రా ! భాసమానత్రినేత్రా !
గరళగళసవర్తీ ! కమ్రనంజాండమూర్తీ !

గద్య. ఇది శ్రీభారద్వాజగోత్రాభిరామ బుక్కాఖ్యానువర్తి మహీశుర
సేనాధిపతి కళువె దొడ్డమహీపాల పౌత్రవీరరాజపుత్ర విద్వజ్జన
కల్పభూజ నంజరాజప్రణీతంబైన స్కాందోక్తంబగు అగస్త్య
సంహితాప్రతిపాదితం బగు హాలాస్యమాహాత్మ్యంబు నందు
సర్వంబును డెబ్బదిరెండవ యధ్యాయము.

# చాటువులు

## పుదుక్కోట రాజులకు సంబంధించినవి.

| కవి | ప్రస్తుతుఁడైన రాజు |
|---|---|
| 1. సుదురుమాటి సీతారామయ్య | విజయరఘునాథుఁడు |
| 2. ,, వెంకన్న కవి | రాయరఘునాథరాజు |
| 3. సూర్యశేఖరకవి | ,, |
| 4. శేషయకవి | విజయరఘునాథరాజు |
| 5. మన్నారయ్య | రాయరఘునాథరాజు<br>కోటి రాజగోపాలరాయలు |

### 1. సీతారామయ్య - విజయరఘునాథుఁడు

సీ. వలిమలల్లుండును వానికుమారుండు సరివత్తు రవనిలో శౌర్యమందు
వనధియల్లుండును వానికుమారుండు రూపొప్పుదురుదాత్త రూపమందు
పాండవేంద్రు నల్లుండు వానికుమారుండు జంటౌదురిలలోన వింటియందు
వనజాక్షునల్లుండు వానికుమారుండు నీడౌదురుర్విలో నీవియందుఁ

గానని నుఁగొల్చి విఖ్యాతిఁ గాంచినట్టి అల్లుఁడికుమాళ్ళ కవనిలోననుదినంబు
భళిరతిరుమల తొండమాన్ ప్రభుకుమార! విజయరఘునాథ! తొండమాన్ విభువజీర!

సీ. దేవతారాజులు స్థిరశౌర్యమహిమచే భోగిరాజులు పటుబుద్ధిచేత
గిరిరాజవర్యులు నెఱిధైర్యగరిమచేఁ బక్షిరాజులు బహుబలము చేతఁ
గలశాబ్ధిరాజులు గాంభీర్యగుణముచేఁ గలువలరాజులు కాంతిచేత
రాజరాజులు తనరారు సంపదలచే వలరాజులిలరూప వైభవమున

ధర్మరాజులు నీతిచేఁ దఱచిచూడ సామినీరాజచంద్రులు జగతిమీఁద
భళిర తిరుమలతొండమాన్ ప్రభుకుమార! విజయరఘునాథ! తొండమాన్ విభువజీర!

సీ. గుభగుభాలని పారు గుంటుకోవిఘిరంగి జవురు జంగీలను సరకుగొనక
సరసర చిరచిరజరజరమనివచ్చు బాణాలరవళిచే బబ్బురిలక
ఫెళఫెళధమిధమీ పెటపెట రొయ్యాను, బలుతుపాకీగుండ్ల కళుకుఁగొనక
ఢణఢణాంఢణఢణాంఢణఢణవత్కార భేరిభాంకృతులకు బెండగిలక

గీ. యెంతచెప్పని తేర్లపై నెక్కి తూరి చుట్టుముట్టఁగఁ బాశెముల్ గొట్టితౌర
భళిర! తిరుమలతొండమాన్ ప్రభుకుమార! విజయరఘునాథ! తొండమాన్ విభువజీర!

సీ. గజఘంటఘణఘణల్ ధ్వజములపెటపెటల్ గంటుకోవిధిరంగి గుభగుభలును
బలుతుపాకీగుండ్ల ఫెళఫెళల్ కత్తుల భళభళల్ ఁజెల ధగధగలును
శరముల బిసబిసల్ చక్రాలజరజరల్ బాణాలబిరబిరల్ భటులరథుల
భూరిభేరీధ్వనుల్ వారణఘీంకృతుల్ జవనకంకాణఘోషలు చెలంగ

గీ. నలుకుబెళుకును లేక యాహవముసొచ్చి ఘోరశైరుల శిరములఁగూల్తువౌర !
భళిర! తిరుమలతొండమాన్ ప్రభుకుమార! విజయరఘునాథ! తొండమాన్ విభువజీర!

## 2. వెంకన్నకవి - రాయరఘునాథరాజు

శా. గంభీరోద్భట గంధసింధుర ఘటాఘంటాఘణాత్కారముల్
దంభాడంభరభేరికా ధణధణంధాణంధణాత్కారముల్
జృంభింపన్ రణరంగమందు రిపులన్ శిక్షింతువౌ దిగ్జయ
స్తంభ శ్రీరమణీయరాయరఘునాథా ! యోధ యూథాగ్రణీ !

శా. రాజారామసరోజ బాంధవుఁడు ప్రహ్లాదుండు ఖైరోజి స
త్తోజీ ఘోర్పడముఖ్యులైననెఱయోధుల్ తొండమాన్ రాజహో
రాజభోజసభాసహోభవాతుభాల్లా ! యంచునిన్మెచ్చ బా
బోజీ పండితుఁడా ! సమర్థుఁడు రణంబుంజేయ నీసాకకున్
హాజీపై భళిమేలురాయరఘునాథా ! యోధయూథాగ్రణీ !

మ. గణుతింపన్ వశమా భవద్విజయజాగ్రద్వీర విద్యావిజృం
భణ పాండిత్యము నీకచెల్లె భళిరా ! భద్రేభఘంటాఘణాం
ఘణనిక్వాణనిరాఘ్య నిర్భరమహాగంభీర భేరీధణాం
ధణధాణంధణధాణ ! రాయరఘునాథా ! యోధయూథాగ్రణీ !

మ. దురమందుందురగంబు దైయనుచుఁజిందుల్ త్రొక్కబాహానిభీ
కరలీలం.........................లపేట్రీజరా
పెంఋఘోడాగజసింగిణీ తరకసాబేజల్ ధణారింతువౌ
తరుణీమన్మథ ! కోటిరాయరఘునాథా ! యోధయూథాగ్రణీ.

సీ. నవరసాలంకార నయచమత్కృతులొప్ప సత్కవుల్ పద్యముల్ సంఘటింప
జమదగ్నిభుజగర్వ శమనోగ్రభుజశక్తు లుత్తమక్షత్రియులోగిఁ జెలంగ
విదితసంగరరంగ విజయవిక్రమములైన బిరుదరౌతుల పరంపరలుగొల్వ
ననవద్య జనహృద్య ఘనసత్యపదపద్య గతులొంది వందిమాగధులు పొగడ

గీ. నెగడునభినయ విభ్రమాన్వితులువార వనితలనితరసులభ విద్యనునటింప
నిండుకొలువుండు నాఖండలుండు జగతి నీవెయనవార రఘునాథ నృపవజీర !

సీ. మహిలోనఁ గలహంస మండలంబుల చెల్వుఁ గైకొనిదిక్కుల కలయఁదిరుగు
నారదద్యుతి పరిణాహంబులం జూచి నయముమీఱంగఁ దానవ్వఁదొడఁగు
నతిశీతభానుజాహంకార హుంకార పటిమఁజేకొని వియత్తటినటించుఁ
దతహారకంఠ నిస్సృతరుచిస్ఫూర్తితో నవనిఁజూడంగ నందందనలరు

గీ. భళిర ! నీవైరిరాజన్యకులముకీర్తులరయనీభవ్య సత్కీర్తులనుకరింప
వచ్చుజిగినల్లనల్లన విచ్చిపఱచు నిస్తులోదార ! రఘునాథ నృపవజీర ?

సీ. సమదసైంధవ శరాసన గురూత్తమరాజ రాజకర్ణభయంకరంబులగుచుఁ
గదనభీకరవైరి మదమదావళిపంక్తి వదనవైవర్ణ్య కృత్స్వనములగుచుఁ
సమతనిర్భయవిద్విషత్కృతవీర్యముల్గర్వ సర్వంకషక్రమములగుచు
ప్రతిమహీభృన్మహోద్భట పక్షసంతతక్షణవిచక్షణ తరక్షణమ్ములగుచు

గీ విజయరఘునాథ ! పరకుప్యధుర ! దరనిరర్గళోదగ్రభవ్య దివ్యాయుధోగ్ర
గుణములనుమించు నీభేరి ధణధణమ్ము లదిర! రఘునాథచంద్ర! యాహవమృగేంద్ర !

సీ. కార్యంబునకులేక గ్రాసమిమ్మనువానిఁ బట్టుకముచ్చెను గొట్టవలయు
సమరంబనినఁబాఱి చదురుననుండెడు వారి మీసముఁబీకి వైవవలయు
బంతిగూటికిఁబొంచి బారుకేగనివాని వీథిలోనిడిసొడ్డ వేయవలయుఁ
బడియుండుమనుచోటఁ బాఱివచ్చినవానిఁ జలమునఁగొట్టుపై నిలుపవలయు

గీ. ననుచరోషములాడుచు నహితనరుల నెగ్గిపిగ్గులుదీతురు నీదుభటులు
కోటికులవర్య! రణనిరాఘాటచర్య! రాయబిరుదాంక! రఘునాథరాణ్మృగాంక!

సీ. శ్రీరామచంద్రుని శేరుదొరతనమ్ము రతనమ్ములనుమీరు సుతులకలిమి
కలిమిపూఁబోఁడి నిల్కడయైన 'వరసభరసభావసత్కావ్య రచనతెలివి
తెలివిప్పుటస... తెగనియాలోచన లోచనానందమై తోఁచునగరు
నగరుచిర సనీవవిలాస కలన సకలనరేంద్ర ప్రశస్తమహిమ

గీ. మహిమతంగజగామినీ మాననీయ భావమును భావమున మెచ్చి భవుఁడొసంగుఁ
గాఁతగోటి కులాబ్ధినక్షత్రనేత ! రాయబిరుదాంక ! రఘునాథ రాణ్మృగాంక!

సీ. గొలకొలమనినంతఁగలఁకఁ బాఱెడురాజు జందెంబుతట్టు పచ్చాడిగాదె ?
స్వామికార్యమునందు జరిగిపోయెడురాజు పట్టెనామముకొంగ రెట్టగాదె ?
సాళెంబుపోవ జాలాలు చేసెడురాజు బుఱ్ఱకట్టియదోటి కఱ్ఱగాదె ?
... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ...

గీ. యిదితెలిసి......సదరుబెదరు నొదిగి మదవదహితుల నెల్లను జముమవలదె ?
కోటికులవర్య! రణనిరాఘాటచర్య! రాయబిరుదాంక! రఘునాథ రాణ్మృగాంక!

సీ. తనభేరికాధణంధణరవ ప్రతిభయ స్ఫూర్జద్ఘనాఘన గర్జితంబు
జృంభితాహిత కుంభికుంభోత్పతత్పత ద్రుచిరముక్తాఘ వర్షోపలంబు
ప్రతిదళస్ఫుర దసిద్యుతి చకచ్చకలస ద్విద్యుల్లతోదగ్ర విభ్రమంబు
శరవర్ష నిర్మగ్న పరభూధరధ్వాంత నిర్భరకీలాల నిర్ఝరంబు

గీ. సమరసమయ సముద్భవత్సైన్యవరసముదయ పర్జన్యవిలసితంబదిర ! భోగ
విజయరఘునాథ మేదినీవిభుతనూజ ! రాయరఘునాథభూతలరాజరాజ !

సీ. మీసంబుదీటి గంభీరభేరీతతి ఢాంక్రియా సంభ్రమభ్రమధురీణ
ఘోట్టాణఖురటంక కుట్టాకసంజాత ధరణీరజస్స ... స్థగితసకల
హరిదంతరంబుగా ననిమొనలోనిల్చి చిఱునవ్వుతో షబల్ సురియఁబూని
జిగిజిరాల్ బిగుబాల్ తెగిఫటుల్ తెగినటుల్ బడిసలామిడ సలాముడుగుమడుగు

గీ. దుడుకునడవడి తపఁబడి యడుగులిడఁగ గడుసుకడివడిఁబడెదు నీయడుగులందు
నీకెతగుఁగాక ! రణజయాన్వితపతాక! రాయరఘునాథభూప విక్రమదిలీప !

## సూర్యశేఖరకవి - రాయరఘునాథుఁడు

చ. హరహరపద్మజాది దివిజాంశము లన్నియుఁ గూడిమేటిదై
హరిహయమెక్కి మిక్కిలి రయాన్భటి నిక్కినదైత్యకోటులన్
దురమునఁద్రుంచి మించిదయతో భువనమ్ములఁ బ్రోచునట్టియా
పురహరదేవిదుర్గనినుఁ బ్రోచుదయన్ రఘునాథభూవరా !

చ. సమరతలంబునేమడిని శాత్రవరక్తజలంబు నించి దు
ర్దమకరికుంభ మౌక్తికపరంపర విత్తనముల్ ఘటించి వ్యో
మము నెడు కాయమానమున మంజులకీర్తిలతాళితారకా
సుమసహితంబుచోఁ బ్రబలఁజూచెదు శ్రీరఘునాథ భూవరా !

సీ. ఖండింతువౌ సముద్దండ దండాదండ పరిపంథిగంధ సింధురకరాలు
సాధింతువౌ జగ్గు జగ్గుగా శరలుఠత్కారినారిలోక భీకరపురాలు
భేదింతువౌ పెడాపెటలుగఁ దళుకుబెళ్కు-ను లేక రిపుల గొంతులనరాలు
పెకలింతువౌ వకావకలుగాఁ జికిలితళ్కు-లుఁగుల్కు- శత్రురాజులజిరాలు

గీ. షాబాసు ! మజ్ఝారె ! బాపురే ! జా ! శెబాసు !
రణజయోద్దండ ! భుజదండ ! రాయతొండ
మండలాఖండలతనూజ ! దండితేజ !
రాయరఘునాథభోజ ! విక్రమబిడౌజ !

సీ. ఖమ్ములై శశిమయూఖమ్ములై స్మరవిశిఖమ్ములై చంద్రసఖమ్ములగుచు
భమ్ములై ............... శారదాభమ్ములై పవిసన్నిభమ్ములగుచు
సరములై నవసుధాసరములై కుముదకేసరములై కుందవిసరములగుచు
శరములై ద్యోధునీశరములై ఖ్యాతపురాశరములై నరపుగీశరములగుచుఁ

గీ. దావకీనయశమ్ములు ధరణిలోన ప్రబలుబలసంపదల పెంపుసొబగునింప
విజయరఘునాథ ! మేదినీవిభుతనూజ ! రాయరఘునాథభోజ ! విక్రమబిడౌజ !

క. నీకీర్తిపుష్పలతకును లోకస్తుత పుష్పవంతులును వాసింపఁగా
లోకాలోక ముదంబగు రాకాశశిపూర్ణవదన రఘునాథనృపా !

సీ. యామినీకామినీ హారకా తారకా శరకుంద దరబృంద సమితినొంచి
హారగాత్రసురగోత్ర పరగాత్రమరసింధు జరసింధుభవదంతిఁ బరిహసించి
హరికాండ హరకాండ హరిదంతకరిదంత శరదభ్ర పరిశుభ్ర సరణిగెలిచి
మదజాల పదజాల మందారబృందార కాహారభాహార గరిమమించి

గీ. అంచితోరగశైఖరి ... ... ...
... ... ... ... ...

# శేషయకవి

విజయరఘునాథరాయలపైఁ గొన్ని చాటువులను నొక శతకమునుఁ జెప్పియున్నాఁడు. వానిలోనుండి కొన్ని పద్యములు.

సీ. శ్రీహరికరుణా విశేషవైఖరులచే సామ్రాజ్యమేలుము జయమునీకుఁ
జంద్రజూటునిదయాసాంద్ర వైభవముచే సంపదల్ గాంచుము జయమునీకు
వారిజోద్భవు కృపాపారసత్త్వముచే శౌర్యంబుఁబూనుము జయమునీకు
మలయకేతన పాండ్యమధురేశు వరముచే సత్కీర్తిఁజెందుము జయమునీకు

గీ. ననుచుఁగవి బుధపాఠకుల్ వినుతిసేయ విక్రమస్ఫూర్తికీర్తుల వెలసితౌర!
భళిర! తిరుమలతొండమాన్ ప్రభుకుమార! విజయరఘునాథ తొండమాన్ విభువజీర!

సీ. పైఠాణిపాగపైఁ బైఁడిశేకుతురాయి చొక్కమైమిక్కిలి సొంపునింప
హురుమంజి ముత్యంపు టొంట్లతో మగరాల బావిలీల హారంగు పంతగింపఁ
బూర్ణచంద్రునిరీతిఁ బొలుపొందు మోముపై నిస్తుకస్తురిచుక్క జిగివహింప
మైనిధరించిన మణిభూషణావళుల్ కొమరొప్పు కాంతులఁ గ్రుమ్మరింప

గీ. నీవుపట్టాభిషిక్తుఁడై నిఖిలజనులు గొలువమాణిక్యపీఠిపైఁ జెలఁగితౌర
భళిర! తిరుమల తొండమాన్ ప్రభుకుమార విజయరఘునాథ తొండమాన్ విభువజీర!

సీ. ధారుణీతలమెల్లఁ దనుదానెయుప్పొంగఁ బలుచోరజార బాధలుతొలంగఁ
జేరికొల్చినవారి కోర్కెల్ ఫలియించె విమతులగెల్లను వేగించె
బంధుసంతతికి సౌభాగ్యంబుఁ దనరారెఁ గవులదారిద్ర్యముల్ కడలిదూరె
సకలసజ్జనులకు సంతోషములుమీఱె గాయకకోటికిఁ గలవుతీరె

గీ. నీవు పట్టాభిషిక్తుఁడై నిఖిలమైన ధరణిజనులను రక్షింపఁ దలఁచినపుడె
భళిర! తిరుమల తొండమాన్ ప్రభుకుమార! విజయరఘునాథ తొండమాన్ విభువజీర!

సీ. సకలసద్గుణముల జానకీపతితోడు సరినీకు "నారణప్పురళ" బిరుద!
గాంభీర్యగరిమచేఁ గలశాబ్ధినీ జన "వరవాక మాలికాధరణ" బిరుద!
శౌర్యవిస్ఫురణచే సవ్యసాచీడౌను ధరనీకు "వర్కాలతర్క" బిరుద!
వితరణఖ్యాతిచే విధుఁడునీపాటి? "జయవీరమణవాళ" చండబిరుద!

గీ. ధైర్యమున నీకు మేరుభూధరముదీటు తనర "వడశువు కులదండధారి" బిరుద!
భళిర! తిరుమల తొండమాన్ ప్రభుకుమార! విజయరఘునాథ తొండమాన్ విభువజీర!

సీ. కత్తికిఁ బచ్చుఫురాల్ కలిగిన నెఱయోధ! బొడ్డు గంట గుఱ్ఱాని కిడ్డజోద!
కపి కేతనముగల్గు కదనరంగ కిరీటి! వీరకంకణముచే మీఱు మేటి!
ప్రతి లేని సింహతలాటంబు గల ధీర! వింజామరంబులు వెలయు శూర!
గండపెండేరంబుఁ గైకొన్న దునెదారి! పచ్చగొడ్డులు గల్గు ప్రధనశౌరి!

గీ. పంచవన్నెల పావడల్ పరగుసేత మానరక్షణ బిరుదంబుఁ బూనుదాత
భళిర! తిరుమల తొండమాఙ్ ప్రభుకుమార! విజయ రఘునాథ! తొండమాఙ్ విభువజీర!

సీ. మదనుని యాకార మహిమంబు విడినాడి యనిరుద్ధు సౌందర్య మణఁగఁద్రొక్కి
చందురు నెమ్మోని సారము నిరసించి మహిని జయంతుని మట్టుపఱచి
నలకూబరుని నిండుచెలువమ్ము ననురెమ్మి నకులుని శృంగారనయము గేరి
నలరాజు రూపంబుననుజూచి యణకించి గాంగేయు చందంబుఁ గాకుసేసి

గీ. కృష్ణదేవుని యందంబుఁ గ్రిందుపఱచి సాటి లేకుండ మీఱె నీ చక్కఁదనము
భళిర! తిరుమల తొండమాఙ్ ప్రభుకుమార! విజయ రఘునాథ! తొండమాఙ్ విభువజీర!

సీ. తూనిక దాతాయె తొలుదొల్త శిబిరాజు చంచల దాతాయె జలధరంబు
కఠిన దాతాయెను గాంచఁ జింతామణి వీసపు దాతాయె వెలయు విభుఁడు
పరక దాతాయెను బరికింపకి... పాతికె దాతాయె భానుసుతుఁడు
అరవాసి దాతాయె నంబికారమణుండు ముక్కాలు దాతాయె మున్నె బలియుఁ

గీ. గాన నీపాటి నెఱదాతఁ గలియుగాన నరసి చూడంగ వేఁగాన వారి సమాన
భళిర! తిరుమలతొండమాఙ్ ప్రభుకుమార! విజయరఘునాథ! తొండమాఙ్ విభువజీర!

సీ. విడిబడి శేషుని పడగలు విడియించి పాలమున్నీటిని భంగపఱచి
కలువల చెలికాని కాంతులు కరఁగించి మరి తారకలనెల్ల మాయఁజేసి
ఆకాశవాహిని నబ్ధిలోపల ముంచి వెలిదమ్మి విరులను విరియఁజేసి
పూని శంఖంబుల పొట్టలెల్లనుఁ జించి కల్పవృక్షములఁ జీకాకుపఱచి

గీ. హార హీర పటీర నీహార రుచుల మీఱి నీ కీర్తి ధరలోన మెఱసె నౌర
భళిర! తిరుమల తొండమాఙ్ ప్రభుకుమార! విజయరఘునాథ! తొండమాఙ్ విభువజీర!

సీ. ప్రతి లేని మైసూరిపతి కేతనముమీఁద నెలకొన్న సింగంబు నీదు కీర్తి
పాచ్ఛాహు శిరముపై భాసిల్లుచున్నట్టి నిండు చంద్రజ్యోతి నీదు కీర్తి
గడిచోడభూపతి కంఠదేశంబున నెలకొన్న హారంబు నీదు కీర్తి
కేరళభూపాలు కెలఁకులఁ జేవల నెగడు వింజామర నీదు కీర్తి

గీ. పరగ సామంత నృపతుల పొగలందు నిలుచు మగరాతి జిగి తురాల్ నీదు కీర్తి
భళిర! తిరుమల తొండమాన్ ప్రభుకుమార! విజయరఘునాథ! తొండమాన్ విభువజీర!

సీ. భానుని నాకాశ పథమునఁ బాలింఘు బడబానలంబును జడధి కనిపి
కాంచనాద్రిని విల్లు గావించి యీడ్పించి వేలాయుధుని ముందు వెనుకఁ జేసి
పద్మరాగంబులఁ బట్టి సానలఁబెట్టి యరుణుని గుంటిగా నడరఁజేసి
విష్ణు చక్రంబును వేయంచు లొనరించి వారిజోద్భవు విప్రవరునిఁ జేసి

గీ. పరగె నీదు ప్రతాపాగ్ని పద్మజాండ భాండమెల్లను నిండి యుద్దండ లీల
భళిర! తిరుమల తొండమాన్ ప్రభుకుమార! విజయరఘునాథ! తొండమాన్ విభువజీర!

సీ. జోడెనల్ ద్రొక్కను సొగసుగా నొక తేప మదవద్విరోధుల మస్తకములఁ
జేదాట్ల దాఁటును జగ్గుగా నొకసారి కుటిల విద్వేషుల నిటలములను
వేడెముల్ దిరుగును వేడ్కతో నొకమాటు వీరాధివీరుల వీథులందు
కదలికల్ చూపును ఘనముగా నొకతూరి సామంత నృపతుల ధామములను

గీ. పంచధారలు కనుపించుఁబరులు బెగడఁబూని నీ తేజి నృపరాజి పొగడ నాజి
భళిర! తిరుమల తొండమాన్ ప్రభుకుమార! విజయరఘునాథ! తొండమాన్ విభువజీర!

సీ. ఘుల్లుఘుల్లుమనంగ గడుసు వైరులఁ గొట్టి ఘులిఘులీలు మనంగ బలులఁ గూల్చి
ఘణిఘణీలు మనంగ గడివీరులను డుల్చి ఖచిఖచిక్కు మనంగఁ గరుల నొంచి
ఖంగుఖంగు మనంగఁ గంఖాణములఁ ద్రుంచి ఖరిఖరీలు మనంగఁ గత్తళములఁ
కరికతిల్లు మనంగ గర్వాంధులను జెండి ఖణిఖణీలు మనంగఁ గత్తళములఁ

గీ. జించి విదలించి విమతులఁ జీల్చు నౌర మేలు నీ కత్తి వైరుల పాలి మిత్తి
భళిర! తిరుమల తొండమాన్ ప్రభుకుమార! విజయరఘునాథ! తొండమాన్ విభువజీర!

సీ. కలనిలోఁ బగవారి ఖచిఖచిక్కనఁ గ్రుమ్మి ఛేదించు నీదు కైజీత బలము
దురములో రిపులపై దూరి గోరించుచుఁ జెండాడు నీదు కైజీత బలము
అనిలోన విమతుల నదలించి విదలించి చించును నీదు కైజీత బలము
పోరిలో వజ్రీలఁబొడిచి పొర్లించుచు చేకొద్ది నీదు కైజీత బలము

గీ. ఘోర వైరుల బారులఁగొట్టి కూల్చి చెలఁగుఁ జలమున నీదు కైజీతబలము
భళిర! తిరుమల తొండమాన్ ప్రభుకుమార! విజయరఘునాథ! తొండమాన్ విభువజీర!

సీ. ఘోడాలు తోడాలు కేడాలు బొమిడికల్ ధరఁగూల వడ్రీల నటికి నటికి
పేఁటలు కోటలు బిగుపుజంట జిరాలు స్థిర వాల వైరులఁ జెండి చెండి
చిలు కొత్తు దగళాలు చికిలి చేదస్తులు చెదరంగ దుసెదార్లఁ జించి చించి
సింగాణి తరకసల్ జిగిరేకు వత్తులుఁ దునియంగఁ బగతులఁ దునిమి తునిమి

గీ. తురగముల మీటి విమతులఁ ద్రుంచి త్రుంచి గెలిచె భవదీయరాహుత్త దళము కలన
భళిర! తిరుమల తొండమాన్ ప్రభుకుమార! విజయరఘునాథ! తొండమాన్ విభువజీర!

సీ. వికటించు వైరులవేసి "కో"యని యార్చు "నదెకయ్య"మన్న నీ యడపకాఁడు
మదవద్విరోధుల హృదయముల్ పెకలించు "రణ" మన్ననీదు కాళాంజివాఁడు
కుటిల విద్వేషుల గుండెకాయలఁజీల్చు "సమర" మంచనిన నీ జారివాఁడు
గర్వించు విమతుల కంఠముల్ తెగఁగొట్టు గడి దురంబునను నీ గొడుగువాఁడు

గీ. నీదు సాహస మెంచి వర్ణింపఁదరమె వీరమణవాళ బిరుదాంక విక్రమార్క—
భళిర! తిరుమర తొండమాన్ ప్రభుకుమార! విజయ రఘునాథ! తొండమాన్ విభువజీర!

సీ. నీ భేరి నినదంబు నెగడినయంతనే మదవద్విరోధుల మతులు గలఁగు
నీ డాలు పెటపెటల్ నిండినయంతనే ఘోర విద్వేషుల గుండె లదుర
నీ కత్తి నిగనిగల్ సోఁకినయంతనే విమతుల గర్భ నిర్భేదమగును
నీ ఘోటి ఖురధూళి నెగడినయంతనే మత్తుల చిత్తముల్ తత్తరించు

గీ. నౌర నినుఁ జూచినప్పుడే యాజి విడిచి యౌర వైరులు గుహాలలోఁ జేరుచుంద్రు
భళిర! తిరుమల తొండమాన్ ప్రభుకుమార! విజయ రఘునాథ! తొండమాన్ విభువజీర!

సీ. మొనసి స్వామిద్రోహ మొనరించు మూర్ఖుల పై తలమిత్తి నీ చేతి కత్తి
ఏలిన స్వామితో సెదిరించు కుమతుల నెత్తిపై బలుమేకు నీదు బాకు
స్వామికార్యముల వంచనసేయు కుటిలుల నిటలంబుపైఁ గొంకి నీదు వంకి
పతి మాట మీరిన బండలండీలకు జముని దాడిర నీదు జమ్ము దాడి

గీ. గదర! యస్మద్భుజాగ్ర కాగ్రత్పు ప్రతాప మెన్న శక్యంబె? యల పన్నగేంద్రునికిని
భళిర! తిరుమల తొండమాన్ ప్రభుకుమార! విజయ రాఘునాథ! తొండమాన్ విభువజీర!

సీ. ముజ్జారె! నీవంటి మహీపచంద్రుఁడు గల్గఁ దపమాచరించిరో ధరణిసురులు
భళ్లారె! నీవంటి ప్రభుశిరోమణి గల్గ నే పూజఁ జేసిరో యెల్ల కవులు
మాయురే! నీవంటి మనుజసింహము గల్గఁ బద్మాత్మఁ గొల్చిరో బంధుతనులు
చాఁగురే! నీవంటి జననాయకుఁడు గల్గ నే వరమందిరో యిష్టసఖులు

మేలు! శహబాసు! నీవంటి మేటి కలఁడె జలధి వలయిత ధారుణీచక్రమునను
భళిర! తిరుమల తొండమాన్ ప్రభుకుమార! విజయ రఘునాథ! తొండమాన్ విభువజీర!

సీ. అల్ల మార్కండేయునంత దీర్ఘాయువు సూర్యునియంత తేజోధరంబు
శంకరునంతటి శాశ్వతైశ్వర్యంబు దేవేంద్రునంతటి దివ్యభోగ
మర్జునునంతటి యాహవశౌర్యంబు భీమసేనునియంత భీమబలము
అల హరిశ్చంద్ర రాజంతటిసత్యంబు ధర్మరాజంతటి ధర్మపరత
నలరాజునంత పుణ్యశ్లోకతాయుక్తి మాంధాతయంతటి మహితకీర్తి

ఆనిలునంతటి సత్ప్రతాపాతిశయము కర్ణునంతటి యీవియుఁగలిగి మనుము
భళిర! తిరుమల తొండమాన్ ప్రభుకుమార! విజయరఘునాథ! తొండమాన్ విభువజీర!

క. శ్రీకంఠుని కృపచేతను నీకత్తికి దీటులేక నిఖిలధరిత్రిం
జేకొమ్ము శాశ్వతమ్ముగ రాకాశశిరూప! విజయరఘునాథనృపా!

సీ. కత్తికిఁబచ్చిపూల్ కలిగినహంవీర బొడ్డుగంట గుటానికిడ్డిగూర
సాంబ్రాణి ఘనవాసలు గైకొను మేటి! గండపెండేరంబుగల కిరీటి
పంచెవన్నెలుగల్గు హావడల్ గలయోధ నవరత్నదలయట్టి యవనినాథ
సింహతలాటంబుఁ జెల్లింమవ్రేఁడ వేటుపావడగల్గు పోటుకాఁడ

మకరబిబ్బీలుకల్గిన మన్నెరాయ! చంద్రసూర్యాదివాద్యఘోష సమితిఁ జేయు
కోటికులవర్య! గణనిరాఘాటధైర్య! విజయరఘునాథ! జయభార్గవీసనాథ.

సీ. చేపట్టుసడలక చివ్వుసవీడక తెగువునఁదరక తెట్టగిలక
చెలఁగెడితావుల జలిగాక కడివోక నుంగసులుంగలక చుట్టుకొనక
గడుసైన తావులఁదడఁబడినిలువక సామానటంచనక సరకుగానక
కావనివంపైన గతిమాడకుండక కొనకత్తి వెంపైనఁ దునిఁగిచనక

దొనకుదిదిరోటు పోటును జినుకునిఱుకు విసరులను హత్తిబిగుదు కక్కసపుబంట్లఁ
జిగురుదనిపించు నానీచేతికత్తి విజయరఘునాథ! జయభార్గవీసనాథ!

సీ. వడివేయు మీసంబు పట్టునఁజిక్కగా వీడియొడాచేత వ్రేలుతలలు
కరకరిచేతఁబల్గంటి సేయుచునుండ కొర్పిముంజేఁబట్టుకొనెడితలలు
అటుగంటఁ దెగియుండ నడిరొమ్ముంగకపోర రమ్మను నన్ను చేవ్రాలుతలలు
బిరుదులంపలుకంగ దొరఁగియు మధ్యము ఖైఖరిగాఁబల్క పడినతలలు

కదియుభామమల్ల నెత్తురుగ్రక్కుతలలు నూపిరెగఁదీయు ముక్కులఁజూపిరిపులఁ
గుత్తుకలఁగోయు నీయసికోటిరాయ విజయరఘునాథ! జయభార్గవీసనాథ!

సీ. ఆధోరణుని విన్ననంటియుండెడి పింజ దంతితుండవుచుట్లు దాఁకనలుగు
భటునకుఁ గుడిజబ్బఁబడి కానఁబడుపింజ డాక్కెలకేడెంబు దాకనలుగు
రాహుత్తునెత్తిపై రంజిల్లఁ దగుపింజ గుఱ్ఱమువలచెవిఁ గొన్ననలుగు
రథికులస్తకమునఁ గ్రాలుచుండెడి పింజ నాభిదేశంబున నాట్రనలుగుఁ
గానజడిపట్టు చందాన కలనులోన శరముల గలించుధాటి దేవరకుసాటి
గాన రిపుకోటి నేను జగానఁ గోటి గోటివంశసనాథ! సంగుప్తబోధ
విజయరఘునాథ! జయభార్గవీసనాథ!

సీ. చికిలిబంగరుపూఁత పల్లోడుగేడెంబు చిప్పలంచును జనుల్ చెనకవెఱచి
భేదమాలెడు జనభీభ్రఘరంగు మెఱుంగు ధారగానెంచి నూగారుకలికి
సరిగ ప్రాకారప్రల చాయనూర్యపుటంప దొనలంచుఁ బిక్కలఁగనఁగ వెఱచి
ఘాటంపులాహురి నాటుకువిల్లని బొమముడిపాటున భ్రమవహించి
భవదహితపాళి యప్సరఃప్రతతికేళి ఖేదము వహించుఁగాని సుఖింపదాయె
కోటివంశసనాథ! సంగుప్తబోధ! విజయరఘునాథ! జయభార్గవీసనాథ!

సీ. పాండ్య భూపాలుదీప్త ప్రతాపాగ్ని కే నూరుపనిబలము సమీరణంబు
మధురేశుకీర్తి నిర్మలసుధారాశి కే యున్నిద్రుజయము చంద్రోదయంబు
త్రిశిరఃపురాధిపతిప్రతిజ్ఞామంథరమున కే దొరబుద్ధి కమఠరాజి
విశ్వనాథావనీ విభుమనశ్శుభ వయూగ్రీవ కేత్తభూపాలు సేవబోట్టు
అతడునీవెగదా, పదానతమహారి! హారికరుణావిహారి! యాహాంపు గారి!
కోటివంశసనాథ! సంగుప్తబోధ విజయరఘునాథ! జయభార్గవీసనా[illegible]!

సీ. తేలపై చెడి వేళబాళిచేఁ దొడరిన వెన్కమొనఁబడ్డ విసరివిసర
కంఠంబుకంఠంబుఁ గవిసియున్నటులైన దాఁటించిపోడిఁబసె మీటమీటి
కావాలపట్టునొగలయక దగఁజెంది చెండింపగాఁజేరి జిమిరిజిమిరి
... ... ... ... ... మరలించి పైపైని జేకొద్ది పైచిపైచి
జోడనలుమించఁ గురుచల చుఱుకుఁజూపి నరికినరికి............దరిమిదరిమి
ఘోటివడిమీటి గురుదాను గొనెడు కోటి విజయరఘునాథ! జయభార్గవీసనాథ

సీ. గరినిక్కుటమ్ములఁ గుఱుచ యెల్లెలుపూన్చి జబ్బువింటను వేసి చంపుకడిమి
కటికను దాఁటించు గతనైన మరలిన తేజినేమీటి హత్తెడుచలంబు
కత్తికత్తినఁ బట్టగద్దాను బోర్చిన నఱకుచోఁ బాళ్ల నేర్పగచు నేర్పు
జీరాలు తెగనని చేరి మొనల్ చిమ్మఁ దప్పించు మక్కుచే గుప్పతెగువ

నీకులమ్మున కమరెను గాకధరను గనఁగ నేర్తురే? పోటుగాండ్రనికి మకుట
లనికిలగుచేర తిరుమలరాట్కుమార విజయరఘునాథ! జయభార్గవీసనాథ!

సీ. జన్యాంగమున రాజన్య పుంగవులెన్నఁ గ్రొన్నన విల్కానికన్న మిన్న
సన్నాహమున సముత్పన్న పన్నగవైరి జవయుతమగు మహాశ్వంబునెక్కి
"ఛే"యని యార్చి సందీప్త కాలానల కీలాకరాళ సంవేలఖడ్గ
ధారాహతానేక వీరారిజనవార సాగశోణితపూర ఘోరనదులఁ

బఱపనోరపైన దురము నిర్భరము సేయ నేర్పునీకబ్బె భార్గవు నేర్పుమీఱఁ
గోటివంశసనాథ! సంగుప్తబోధ! విజయరఘునాథ! జయభార్గవీసనాథ!

సీ. గడెగడమని కాళ్లువడకఁ జొచ్చినయంత స్తంభగుణంబు కొంతఁ జెచ్చిపై చెం
బలుసహస్రస్త్రైకఁ బడి వికారము నొందఁ బ్రణయమ్ము మానసంపదను నిల్ప
వెలవెలనై మేను వికృతి వహింపగా రోమాంచలంబు మఱుంగు దిత్రై
గన్నీటఁ జినుకులు కాలువలై పాఱ స్వేదప్రవాహంబుఁ జేగ్బుకొనియె
దక్కులను గ్రొత్తెన్గంధమైఁ దనుపు బ్రేమ యనుచు నీవైరి నేర్పగనతనుదారిఁ
గోటివంశసనాథ! సంగుప్తబోధ విజయరఘునాథ! జయభార్గవీసనాథ!

సీ. చెంగావి పావడ ంగుగా మొఱయించి యాగి కాక పూదండ లలవరించి
తనమేని చాయచిత్తంబున గ్రథిమియించి గలసిన బహుమానములనుఁ జెంది
కేడంబు తెరచాటు వీడి మున్ముందునిల్చి క్రమముగా నటనవై ఖరిని జూపి
చెంతవరమ్మని చింగున దనుదీసి వేగమే కంఠంబుఁ గౌఁగిలించి

గీ. సురతలీలను గమపించి సుఖమునిందు నాఁటవిరిబోణియునఁగ నీదగుకృపాణి
గోటివంశసనాథ సంగుప్తబోధ విజయరఘునాథ! జయభార్గవీసనాథ!

## 5. మన్నారుకవి కృతములు చాటువులు

సీ. ప్రాతరారంభ జృంభన్మానసాంభోజ రమణీయమకరంద రసముఁ గేరి
సాయంసముత్ఫుల్ల జాతిప్రసూనాళి పరిమళ సందోహపటిమ దూఱి
శారదచంద్రికాపార సారపటీర ఘనసార శీతల గరిమమీఱి
వాణీలసద్వాణి వీణా పరిక్వాణ కలకలార్భటులతోఁ గలసి పోరి

మధురసురభిళ శీతల మంద్రభావములను విలసిల్లు నీపల్కు వలనుమీఱి
విజయరఘునాథ మేదినీ విభుతనూజ! రాయరఘునాథభోజ! విక్రమబిడౌజ!

సీ. ఈతఁడే నాసముదితహిత సముదయములు కొలువఁగ బలుచెలువు తనర
ఘనరశ్మికులగము లనవరతము మదిముద మొదవఁగనరు..................
..................మతులగు బుధకవి గురులును నయమున వరుసఁదనరఁ
గవితలు బలుకఁగ కలిత మధురస మధురిమను గనుఁగొని మెఱయ వినకి

గీ. గొను............నత నమరు నమలపతి కరణిధరణిఁ
దగు విజయరఘునాథేంద్రు తనయుఁడైన రాయరఘునాథ మానవ .........

సీ. ..............................దురమున నదరక బెదరక కుదురుకొనిన
మదమునరిపులను గదుముచు గుదుముచుఁ జదుముచు నదుముచు మెదలనీక
................................... గదులను గళములఁ జిదురుపలుగఁ
బడపడి పుడమిని గదుపుల గెలుపులఁ గలుముల చిలుకలకొలికి నెనసె

గీ. విభవుఁడై కీర్తిచేఁ జాలవెలసినట్టి విజయరఘునాథ తొండమాన్ విభుకిరీటి.....

సీ. కీర్తిచే ధైర్య విస్ఫూర్తిచే సతతంబు గలధౌత గిరిలీల వెలసినావు
దానంబుచేఁ బూర్ణమానంబుచే సదా రాజరాజఖ్యాతిఁ బ్రబలినావు
జయముచే నుతదయోదయముచే ననిశంబు కృష్ణప్రభావంబు గెలిచినావు
చెలువుచే విద్యల నలువుచే సంతతం బాత్మభూవైఖరి నలరినావు
రాజమాత్రుండవే! నీవు రాజలోక సమున్నతౌన్నత్య గాంభీర్య శౌర్యధుర్య!
విజయరఘునాథ మేదినీ విభుతనూజ! రాయరఘునాథభోజ! విక్రమబిడౌజ!

సీ. రాజకరప్రాప్తిఁ దేజంబు కడుమించి రిపుభేదనస్ఫూర్తి నతిశయించి
వక్రశేఖరఖ్యాతి వదలకుండుటఁజేసి వృత్త సంఛేదన వృత్తిఁదనరి
[illegible]ఘశోన్నతిఁ దనరారుటను రాజహంసోదయనటన మమరఁజేసి
తతసమగ్రస్ఫూర్తి నతిశయించుచుఁ జాల కమలాధికవిహార గరిమమీఱి

నీదుతరవారి పటువైరి నియతదారి భూరిశుభకారి సంతతభూరిదారి
విజయరఘునాథ మేదినీ విభుతనూజ! రాయరఘునాథభోజ! విక్రమబిడౌజ!

వ. అలాగె యనుచు నైజాననాంభోరుహ సౌందర్య మకరంద సాగలోక
చంచరీకచ్ఛటచ్ఛవిఁ గేరుమీసంబు వడవేయ శాత్రవుల్ జడిసిపార
నడవులలోదూరి యయ్యెడలను బారిపోనున్నవడియూరి పాదలదూరి
ముండ్లిడ వగవైరి మూఁకలంచును దారితప్పఁగమదిఁగోరి దారదూరి

రేడపెడలితిమీసారి యింకసారి వలదటంచును దమవారివద్దఁజేరి
తెలుపుకొనఁజేసి తహహా! దోర్బలజితారి! రాయరఘునాథశౌరి! విక్రమవిహారి!

సీ. జడకేకవైచి నవ్వీరమణమణిదేవ్ర హాటకద్రోలికా కోటికలిత
కుంభికుంభములపై గౌరిసెలుప్రమోవంగ బారాహజారిని జేరనురికి
దాపుననిడిన నిద్దాశిరంగులఛాయ ధగధగయనఁగ వైపుగనె దూసి
“ఆదెపోటులదెమీటు లదెనలు కదెచులు కదెకొసరదె విసరదెయదె”యని

కదనమున నెదురుపడెడు మదవదరులఁ గదిమిచిదిమెండి మెఱవడి కలదెమహిని
నీకెతగుఁగాక సమరలీలాకుమార రాయరఘునాథశౌరి! విక్రమవిహారి.

## కోటి రాజగోపాలరాయలు

క. అదిరా! మహిరథవిధిమధు మధుమథన కథాసుధాసుమధు మధురిమధూ
ర్మధురమతీ! మధురగతీ కుధరధృతీ! కోటిరాజగోపాలపతీ!

క. కోటిగదా వితరణశతకోటిగదా! యరిసహస్రకోటీరలురత్
కోటిగదా చరణతులాకోటిభళీ! కోటి రాజగోపాలపతీ!

క. దృషణయున నీకువనితా విషమాంబక కావ్యకార్యవిషమాంబక సత్
విషిత సుధద్విషితబుధో ద్ఘుషిత కలాలాప! రాజగోపాల నృపా!

క. మాపాటివారి నెల్లను కాపాడుచు విమలహృదయకమలాభాస్వత్
గోపాలక గోపాలక గోపాలకలాప! రాజగోపాల నృపా!

క. అంపజెకి దొరకనేరదు మదన్మందాకి నిందు మందారఖగ
స్యందన నందన చందన కుదయశః ప్రతతి! రాజగోపాల పతీ!

## తురంగపంచకము

“తురగపంచకము” అను పేర నైదు సీసపద్యములను నాంధ్రభాషార్ణవ కర్త నుదురుమాటి వెంకనకవి, రఘునాథుని తురంగమును గూర్చి వర్ణించియున్నాఁడు. ఈ పద్యపంచకమున విశేషమేమనఁగా నిందు “అశ్వశాస్త్రసంప్రదాయములు” విశదీకరింపఁబడినవి.

సీ. ఆస్కందితాశు ప్రహసితాశుగోన్నత్తురంగ మంబగునీతురంగమంబు
ధౌతకస్వరోద్ధతిధుత స్థావర జంగమంబగు నీతురంగమంబు
శేచితోద్వేగాధరీకృతహరి భృద్విహంగమంబగు నీతురంగమంబు
వల్గితస్యదవినిర్భగ్న ఫణాద్యభుజంగమంబగు నీతురంగమంబు.

గీ. ప్లుతజనవినిర్జిత సురాశ్వవితతగమన చంగమంబు నీయతురంగమంబు
కవితగుణపేటి ! కవికోటికల్పవాటి ! రాయరఘునాథపంచణ ప్రభుకిరీటి ! ౧

సీ. పుటములుద్రొక్కెనా కుటిలారి రాజన్యకోటికోటీరములే కుదియఁబడును
జోడెనల్ చూపెనా శూరవీరకఠోర గంధాంధసింధురఘటలు చదియు
చౌదాట్లుదాఁటెనా సామంత భూపాలజవనకంఖాణముల్ ప్రగ్గిమొగ్గు
వేడెముల్ తిరిగెనా విమతుల పురములు గాలిచక్రమ్ముల కరణిఁదిరుగు

గీ. భళిర! రవగాలుఘటియింపఖండనమున పెడఁదయురములు బయలునువిఱిగివిఱిగి
దొరఁగురిపుకోటి నీదెరాబిరుదు కోటిరాయరఘునాథ పంచణప్రభు కిరీటి. ౨

సీ. కదలికచూపెనా, కక్కసంపడనేలగుండెలు కలఁగు గగ్గోలు గాను
దులదులనడచెనా దుర్దాంతసామంత బలములగములు గర్భములు గలఁగు
పరువులువాఱెనా పరిపంథినరపాల చిత్తముల్ మెత్తనైతత్తళించు
కరికరినెదిరెనా గర్వితారాతిరాట్ ప్రాణంబులటునిటు పఱచిపోఱచు

గీ. దూరిరణమున హదలికల్ మీఱఁగాను ఖురపుటోద్ధతులదరంగఁ గొట్టిమెట్టఁ
దొరగ రిపుకోటి నీదెరా ! బిరుదుకోటి ! రాయరఘునాథ పంచణప్రభు కిరీటి. ౩

సీ. సమరాననశాత్రవ సమితి శిరోజముల్ గసగస ఘాసమ్ము కరణినమలి
కదనానవిమతుల కండలు గుండెలు ఝుళిఝుళి కబళమ్ము సరణిమెసగి
ప్రధనానమార్తుఱ ప్రక్కలు డొక్కలు కరకరభాణంబువరుస మెక్కి
బవరానఁ బరరాజవరుల రక్తంబులు గళగళ జలములగతిని గ్రోవి

గీ. మొట్టిమర్దించి చుట్టుక మెదలనీక గొట్టిగోరింప రణమున గుండెలవిసి
తొరఁగ రిపుకోటి నీదెరా! బిరుదుకోటి రాయరఘునాథ పంచణప్రభు కిరీటి. ౪

సీ. గర్వాంధపరిపంథిగంధసింధురములకొమ్ముకత్తుల మొనల్ కొట్టకొట్టి
చెనఁటిమనేదార్ల శిరములగొగ్గిల గొలుసులువీడంగఁ గూల్చికూల్చి
మూర్ఖారివీరులౌముసలిమానుల మోము ముక్కుదూలములూడ మోఁదిమోఁది
ఘోరవజీమోటు జీరాలయుంగరాల్ చెదరిఝల్లనరాలఁ జెండిచెండి

గీ. చీరితుఱుముఖురములఁ జించిచించి పేరెములు వారబారువపెంటలగుచుఁ
దొరఁగెరిపుకోటి నీదెరా ! బిరుదుకోటి రాయరఘునాథ పంచణప్రభు కిరీటి. ౫

## మైసూరి చికదేవరాయలు

సీ. స్వస్త్వస్తు ! విశ్వవిశ్వంభరాభరణైక దక్షదక్షిణభుజాస్తంభ ! నీకు
విజయోఽస్తు ! నిర్వక్రవిక్రమకళాపరిభూత విద్విషత్పటల ! నీకు
మహనీయతాస్తు ! సామంతచూడారత్న బిరుదాంగదస్ఫారచరణ ! నీకు
హర్షోస్తు ! పృథుశౌర్యవైశ్వర్యధౌర్ధర్య సౌందర్యధుర్యతాశ్చర్య ! నీకు

గీ. వివిధభవోఽస్తు! సత్కీర్తివిజిత రజతతారకాదార తారకాదారవార
హారనీహారరది విషదాహారరుచిరహార! మైసూరి చికదేవధీర! నీకు. ౧

సీ. శ్రీమించుజడదారి చికిలిదొందపుటూట పట్టఁవాఁడపరంజి పట్టువాఁడు
తనభక్తులగువారి తప్పులన్నియును మన్నించు వాఁడనుకంప నించువాఁడు
తలఁచినఁ జాలుపాతకములన్నియు రాచుపేరు వాడరదంపుఁ బేరువాఁడు
తఱచు లెవ్వియులేక తానయై త్రైలోక్యమేలు వాఁడింగిర మేలువాఁడు

గీ. రంగరమణుఁడ భంగసామ్రాజ్యలక్ష్మి నొసఁగుఁ గాతనిజాంఘ్రిసారసమదాళి
పటలగిరి వీరమకుటాగ్రఘటిత దివిజరాజమణికిని చికదేవరాజమణికి ౨

సీ. జంగమార్చనము భూషాయమాణ మహాభుజంగమార్చనమునే జాణసేయు
చారదర్శనము సజ్జనశుద్ధమగు శివాచారదర్శనమునే సరసుఁ డెఱుఁగు
దేవమాన్యములు సంభావితా భోగిభూదేవమాన్యులునే ధీరుఁ డొసఁగు
రణపరాక్రమను దుర్ధరరాధర విదారణపరాక్రమమునే రాజుఁ గాంచు

గీ. నతఁడు పొగడొందు నెందు నుదగ్రనిజభుజాగ్రజాగ్రన్మహామండలాగ్రఖండి
తాగ్రహాగ్రహదుర్నిగ్రహారిహారి పాలన విహారి చికదేవరాయశౌరి!

సీ. సిరిమించు.................పఱపువాఁ డొకఁడు నీయొఱపువాఁడు
కఘనుబంగరు పట్టుగిరులసింగిణి కోపువాఁ డొకఁడు నీయొఱపువాఁడు
కషలిరాయల తరంగముల చిందులు పొందు పఱపువాఁ డొకఁడు నీయొఱపువాఁడు
ననుఁబూల రెండు నొండుగఁ జేయువిలువిద్య పఱపువాఁ డొకఁడు నీయొఱపువాఁడు

గీ. విక్రమవిభూతిగాన వాగ్విలసనముల నారయాహవ ధీసాహసకుమార!
శ్రీవిభవవిధేయ హగలుగగ్గోలురాయ! రాజదేవేంద్ర చికదేవరాజచంద్ర! ౪

సీ. కడఁగివీరాధివీరుఁడు వచ్చెనని పూరిగఱచువారును బారిమఱచువారు
హగలుగగ్గోలు రాయఁడువచ్చెనని చెట్లఁదారు వారునుఁ గట్లు సేయువారు
గడిమన్నెవారలగండఁడు వచ్చెనని కూలిపోరలువారలు జాలినోరలువారు
ఘోరాజి విక్రమార్కుఁడు వచ్చెనని నీళ్లుచొచ్చువారును గాళ్లు చచ్చువారు

గీ నగుచుఁదారెలగోల్ హాళాహాళికినళికి పఱచునిజ బలమాజికి బఱపలేక
పఱచె నిక్కేరిశివ్వభూవరుఁ డయారె రాజదేవేంద్ర చికదేవరాయచంద్ర! ౫

సీ. ఢాసిఢిల్లీకవాటములు వాటములయ్యె గోలకొండకుఁ గ్రొత్తళాలు బలిసె
తగవిజాపురినగడ్తలు పొగడ్తలుఁగాంచెఁ గటకార్గళములు మిక్కుటములయ్యె
ప్రబలికల్బరిగవప్రములు దీప్రములయ్యె నాగడా నుక్కడాలతిశయిల్లె
కొల్లూరు పలుతెలుంగులఫిరంగులు బొల్చె బెడదకోటకు రస్తుబెడిదమయ్యె

గీ. ఘోర! తోల్జగడాన నీ వడిమితతిమి తతిమి నిక్కునిక్కేరి శివ్వపనేని సరగ
విఱుగఁ బొడిచిన యావార్తవిన్న నాఁడె యాహవోపేంద్ర! దేవరాయక్షితీంద్ర!

సీ. చూచినచాలదా? సుల్తాన్ మహమ్మదుపాదుషాయెదఁదాఁకు నీదుబాకు
ఎదిరినఁ జాలదా? యిక్కేరి శివ్వప్పనేని పొలిటిమిత్తి నీదుకత్తి
కవసినఁజాలదా? రవణించురాయదునే దారులకుమారి నీదుచూరి
మలసినఁ జాలదా? మధుర తంజావురినేతలపైదూరు నీదుబారు

గీ. పరనృపతులెంత నీయంతదొరకు రాయభేరికాభూరికాహళాబీలమకర
మర్తుబాంకుశదోనేజ మహితబిరుద రాజదేవేంద్ర చికదేవరాయచంద్ర! ౨

సీ. కురువిరాటవరాటకరహాట నృపజూట తటకిరీటములపైఁ దాఁగి తాఁగి
చోళనేపాళ పాంచాలభూపాల విస్ఫాలఫాలములపై వ్రాలివ్రాలి
యంగగౌళ కళింగవంగబంగాళరాడుత్తమాంగములపై నుఱికియుఱికి
కుకురుకాశకరూశ కోసలక్ష్మాధీశ మాంసలాంసములపై మలసిమలసి

గీ. యెవ్వని భుజాసిజయలక్ష్మి నెసగియుండు
నతఁడు పొగడొందు నెందును నసమసమర
విస్ఫురచ్చమూసమూహసధూరాప
రాజతనతారి చికదేవరాయశౌరి!

సీ. కడఁగిపై రాగడా గడగడాగడ పడంతుల పాపటలకు సిందూరరజము
గోలకొండ బెడఁదకోటవిజాపుర స్త్రీల చన్నులకుఁ గాశ్మీరరసము
కటకకల్యాణమఖ్యావధూ కబరీభరములకుఁ జంపకప్రసవ సమితి
ఆముదానగర ఢిల్లీమాహురాపురాంగనలమోవులకు లాక్షాద్రవంబు

గీ. తానయియుండునే యశోధనుని తేజ మతఁడు పొగడొందు నెందును నసమసమర
సాహసకళావిహారి దుస్సహవిరోధి రాణ్మదవిదారి చికదేవరాయశౌరి! ౩

సీ. గడిదొరల్ గడగడవడఁక నీరోడుపై గగ్గోలుపడి కోటకట్టుకొనియె
దిక్కుదిక్కులవార్తకెక్కు నక్కారెడ్డి నట్టిట్టుచేసి చేపట్టుపట్టె
తోడ్తోడ గంధసింధుర సైంధవవ్రాతముడివోని కడిమిచే నొడిసితెచ్చె
శ్రీదేవితో జయశ్రీ లెదుర్కొనుచురాఁ గీర్తిప్రతాపవిస్ఫూర్తిఁ గాంచె
గీ. ఔర కేతన పటపటాత్కారధీరకరటి ఘీంకారపటహభాంకారవీర
వారహుంకారచాపటంకార ఘోరరణ విఘటితారి చికదేవరాయమౌళి! ౧౦

సీ. సెనరుఁజూపులువాఁడిఁదనరుతూపులు భక్తిసరులపై నరులపైఁ బఱపువాఁడు
చుట్టుకైదువుఁదమ్మిఁబుట్టు కైదువు కైజకరమున నురమునఁ గలుగువాఁడు
చందురుఁగేరెడుతమ్మి విందుమోమెడు శంఖరాజంబు తేజంబుఁగ్రాలువాఁడు
కెంపుపావలుఁవిడియంపురేవలు నాత్మపదముల రదములఁ బరగువాఁడు
గీ. రంగదమణుఁడభంగసామ్రాజ్యలక్ష్మి నొసఁగుఁగాత నిఃాంఘ్రి)నారసమదాళి
పటలదరివీరమకుటాగ్రఘటిత దివిజరాజమణికిని చికదేవరాజమణికి

సీ. అరికాంతలముసుంగు తెరలఁ దెంపరలాడి కడుఁబోగడొందు జెట్టుఁడవు నీవు
కళలచే విబుధలోకముల కెంతయుఁ బ్రీతి నెఱపఁ జాలిన కళానిధివి నీవు
సర్వసర్వంసహాచక్రంబు జీవనాకలనచే నలరించుఘనుఁడ వీవు
మహనీయముగ సర్వమంగళావాప్తిచేఁ గర మొప్పు రాజశేఖరుఁడ వీవు
గీ. ఆవుర! నృప మాత్రుఁడవె మహోదగ్రనిజభుజాగ్రజాగ్రదనర్గళోగ్రాజప్ర
తాపతపనప్రతాపితోద్దండరిపునృపాళి శ్రీ చికదేవభూపాలమౌళి. ౧౧

# దక్షిణదేశ నాయకరాజుల తెలుగు శాసనములు

తంజావూరి నాయకరాజులు శాసనములను చాలవఱకును సంస్కృతమునను తమిళభాషలోను మాత్రమే వెలయించిరి. తెలుఁగుభాషలో వారిచ్చిన దొకటి యీ క్రింద వివరింపఁబడినది.

విజయరాఘవనాయకుఁడు నాగపట్నమునందు డచ్చివారికి (ఒలాందావారికి) నిచ్చిన నమ్మిక శాసనము. (ఇది తెలుఁగుభాషలో వెండి రేకుపైని చెక్కఁబడియున్నది. ఇండోనేషియాయందు బటేవియా పురాతత్వశాలలో భద్రపఱుపఁబడినది.)

స్వామిసాక్షి తప్పేదిలేదు శ్రీరామ

1. విళంబిసంవత్సర మార్గశిర శు॥ 15 లు శ్రీమతు అచ్యుతశ్రీ
2. విజయరాఘవ నాయనయ్యవారు వొలాందా రికులా
3. ప్పంగుసు అమరాల్కు యిచ్చినకౌలు నమ్మిక శాసనము
4. తమకుంపినయ్య వర్తకప్రవర్తకం నాగపట్నం రేవున న
5. డిపించుకొనేమనిన్నీ అందుకు కౌలుకట్టళ్లు కట్టడశాయ
6. వలెనని చిన్నయశెట్టివారు మాతో చాలామనవి రూపం
7. గా విన్నపంబు సేసుకొన్నారు కాంబట్టి ఆరీతున్నే తాము నాగ
8. పట్నానకువచ్చి వర్తకప్రవర్తకం నడిపించుకొనేది తమకు
9. పరంగివారి వశానవున్న కోటానుకట్టడసేసి వారియిండ్లు
10. ముంగిళ్లును కట్టడచేసినారము । ఇదిగాక పరంగివారి
11. కాపితానికిన్ని వాయిర్ పల్లి కుళ్లకున్ను తోంటపరంగివారికిన్ని నడ
12. చినగ్రామాలు పుత్తూరుగ్రామం ముట్టంగ్రామం పోరు
13. వాళ్చేరిగ్రామం అంతోనిపెంటగ్రామం కరువేప్పం
14. గాడెగ్రామం అలిండిళమంగళంగ్రామం సంగమం
15. గళంగ్రామం నిరుత్తినమంగళంగ్రామం మంజెకొల్లెగ్రా
16. మం నరియంగుడ్డిగ్రామం అంతుగ్రామాలు 10

7. ఈ పది గ్రామాలున్నూ తమకు కట్టడచేసినారంగనక ఆగ్రామా

18. లు ఎంటిపేరింటననే పుట్టాస్తికె నగరికి తాము ఎంటిపేరిట కానుక
19. యిచ్చుక రాగలవారు । ఇదిగాక తాము నాగపట్నంరేవున ఎ
20. క్కించే సరుకుసప్పట్ల కోంకదాకలు దివసధాన్యాదులకున్ను దించే
21. సరుకుసప్పట్లకున్ను ఎగుమతి దిగుమతి తీరువ సర్వమాన్యం
22. గాకట్టడచేసినారము । తమ కుంపినీవాడల్కు అడసాలమురిసాలలే
23. కుండా తమదిగానే కట్టడచేసినారము । తమవర్తకులేమిమనుష్యమా
24. తృలేమి నిలువసాలువలు సొమ్ముసంమ్మంధాలు ఎట్టుకొని
25. నగరి గ్రామాంతరాల పారివచ్చి వున్నట్టాయన వార్నినీవార్ని సొ
26. మ్ముమ్నా, తమకే పప్పగించగలవారము । మాసీమలోతాము
27. వర్తకప్రవర్తకం తమకుసరిపోయిన దారిని నడిపించుకొనే
28. తంన్తల్లోనగరి చిల్లరళ్లు నడపకుండానున్నా కట్టడసేసినారము । త
29. మకుయిచ్చిన పరంగివారిగ్రామాల్లో వుమ్మెకాంఫులపట్లనేమి
30. నాగపట్నాన తమవర్తకులైవుండే వారిపట్లనేమి నగరనుండి
31. న్నిచిల్లరల్లు నడునకుండానున్నా తమమనుష్యులు నాల్గుదిక్కుల
32. కున్ను కమ్మగాళ్లు కొంచపొయ్యేవాన్ని సుంకసూత్రాలు లే
33. కనున్నా కిట్టచేసినారము. యీప్రకారం కవులు కట్టడచేసినార
34. ము । కనక యీబద్ధతినాంట పుత్రపౌత్ర పారంపర్యంగానడి
35. చేటట్టు కట్టడచేసినారము । గనక యిందుకు లేశమయినాతప్ప
36. కతమపట్ల సడిపించుకవచ్చేమని చిన్నన్న శెట్టివార్కి నమ్మిక
37. మాటపట్లున్ను యిచ్చినారము । అటుగనునగరిప
38. ట్లహిత విశ్వాసముగనిగి కరతోరలున్నా ఋజువులయ్యేటట్టు
39. గానడిపించుకొని యీకవులకునమ్మిక ఆచంద్రార్కస్థాయి
40. గావర్తకప్రవర్తకము నడిపించుకునే సుఖానవుండేది
41. శ్రీ విజయరాఘవ.

పై నమ్మికశాసనము చారిత్రకముగనేగాక భాషావిషయమున విలువగలది. ఈ శాసనము తేది 15-9-1658. ఆ కాలమున, నన-గా తంజావూరి నాయకరాజుల పాలనలోఁ తెలుఁగు తమిళములు రెండును

రాజకీయ వ్యవహారభాషలుగా నుండెనని దీనివలనఁ దెలియుచున్నది. ఇందు "పరంగి" యనుపదము "పోర్చుగీసు" వారికి వాడఁబడినది. ఈ తరువాత నిది ఫ్రెంచివారికి వాడఁబడినది. భాష వర్తకవ్యవహారసరళి నున్నది-"కుంపినీ" అను పదము ప్రయుక్తమగుట కిదియే మొదటిసారి.

తంజావూరి నాయకుల శాసనములన్నియు సంస్కృతమున తమిళమున నున్నవి. తెనుఁగులోనున్న శాసన మిదియొకటియే. ఇది విజయరాఘవనాయకుని శాసనము. దీనిననుసరించియే మధురలో తెలుఁగు శాసనములు వెలసినవి - కావున దాక్షిణాత్య మండలములలో మొదట తొలి శాసనమును వెలయించినకీర్తి విజయరాఘవనాయకునిచే యని చెప్పనొప్పును.[1]

## మధురనాయకుల శాసనములు

మధురనాయకులు తంజావూరినాయకులవలెగాక, ద్రావిడ దేశమున తెలుఁగుభాషలో శాసనములను చాలగా నెలకొల్పినారు. అవి వారి భాషాభిమానమున కెంతయుఁ దార్కాణ. వానిలోఁ గొన్నింటిని మాత్రమే యిందుదాహరించుచున్నాను.

### విజయరంగ చొక్కనాథుని జంబుకేశ్వర శాసనము

1. శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్యవర్య శ్రీకాంచీపుర
2. పురస్థిత శ్రీమచ్ఛంకర భగవత్పాదాచార్యస్వాములు వారికి
3. స్వస్తిశ్రీ విజయాభ్యుదయశాలివాహన శకాబ్దములు
4. 1630 అగు నేటి వికృతినామ సంవత్సరం కార్తిక శు॥ ౧౫ యిం
5. ద్దువాసరం రోహిణీ నక్షత్రం యీా కూడిన శుభదినమం
6. ద్దు శ్రీమద్రాజాధి రాజరాజపరమేశ్వర వీరప్రతాప శ్రీ వేంకట
7. దేవమహారాయలయ్యవారు ఘనగిరి నగరమంద్దు రత్నసిం

1. The Negapatam grant from the Batavia Museum - K. A. Nilakantha Sastry M. A. Proceedings of the Indian Historical Records Commission 1937. vol. XIV Art 39 Page 42.

8. హాసనాసీనులై పృథ్వీసామ్రాజ్యం శేయుచునుండ్డగాను
9. పాండ్యధరామండలేశ్వరులైన దక్షిణ సింహాసనాధ్యక్షు
10. లైన కాశ్యపగోత్రం విశ్వనాథనాయనివారి వంశకర్తలైన
11. చొక్కనాథనాయనయ్యవారి పౌత్రులైన రంగక్రిష్ణముద్దు వీ
12. రప్పనాయనయ్యవారి పుత్రులైన విజయరంగచొక్కనాథనా
13. యనయ్యవారు లోకగురుస్వాములైన శ్రీ మచ్ఛంకరాచార్యస్వా
14. ములవారికి గజారణ్యంక్షేత్రమందు పాన్‌వాళి కొండ్డాం
15. వీథిలో పూర్వం మొదలుకొని స్వాములవారికి స్వంత మ
16. రంవుండేటందున ఆ మఠాన నిరంతముగా అంన్నదానం
17. ధర్మ్మాదులు నడిపించవలెనని స్వాములవారు ఆజ్ఞాపించ్చి
18. నందున ॥ ప్రీతిగాను పూజనైవేద్యం అంన్నదానం బ్రాం
19. హ్మణసంతర్పణ మొదలైన విడిచినట్టేట్టుగా సర్వ్వమా
20. ంన్యతాంబ్రశాసనం వ్రాసియిచ్చినక్రమం తొట్టియం శీమ
21. లో మనేంద్రమంగలంల్లో భట్టవృత్తి అరమూవులు ర౪ తా
22. రు ౧ గోపాలస్వామికొట ౧ కృష్ణాపురంలో అరమా
23. వులు ర౪ తారు ౨ కారకాడులో అరమూవులు ర౪ తారు
24. ౧ కొండయంపేటలో నంజనెయి ౨ తిరుచ్చంపార శీమ
25. లో మంగమాంబాపురంల్లో నంజనెయిన తిరున్నం శీ
26. మలో అరియూరిలో నంజనెయి ౧౬. దక్షిణం కోనా
27. యి శీమలో అరియమంగలలల్లో నంజనెయి ౬ జంబుకేశ్వ
28. రంగుపలో (1) నిత్యకట్టపడ్దిం ౧కి ౧యిమ్యంపడి ౯ అన్నంతళిగలు
29. ౨ దోసెలు ౨ అతిరసాలు ౨ సుగియ ౧ దీపంచమరు పడి ౪ ఉభ
30. యలీరంలోను నెయి 1కి తూముకు వడ్లవంతు నానుంచ్చు
31. నంశాసనిత్యకట్టపడి ౧ ప్రకారం నడిచివచ్చేటట్టుగా
32. దిట్టంచేసి వ్రాయించ్చి వుంన్నాము కనక తాముయున్న వీతవరం
33. పరలుగా అనుభవించ్చుకొని ఆచంద్రార్క స్థాయిగాధర్మ్మా
34. పరిపాలనం చేసుకోనుచు ఆశీర్వాదంశాయగలది ॥ దాన
35. పాలన యోర్మ్మధ్యే దానచ్ఛ్రేయోను పాలనం దానాత్స్వ

36. గ్ర్గామవాప్నోతి పాలనాదచ్యుతం పదం ॥ స్వదత్తాద్ద్విగుణం
37. పుణ్యం పరదత్తానుపాలనం। పరదత్తాపహారేణ స్వద
38. త్తం నిష్ఫలంభవేత్ ॥ స్వదత్తాపరదత్తాంవా యోహరే
39. తవసుంధరా। షష్టివర్ష వర్ష సహస్రాణి విష్టాయాంజాయ
40. తేక్రిమిః ॥ మద్వంశజాపరమహీపతి వంశజాయాయే
41. భూమిపాః సతతముజ్జ్వలధర్మచిత్తాః। మద్ధర్మమేవ
42. పరిపాలన మాచరంత్తి తత్పాదుకాద్వయమహం శిర
43. సావహామి.

విజయరంగ చొక్కనాథనాయనయ్య వ్రాలు.

## మధురమీనాక్షీదేవి శాసనము క్రీ. శ. 1739

ఈ తెలుఁగుశాసనము తిరునల్వేలి మండలమున పంగునేరి తాలూకాయందలి "సేవల్లప్పేరి" అను గ్రామమునకు సంబంధించినది దానికి "ముద్దు వేంకటలక్ష్మీపతి భూపాలసముద్రము" అను వేఱొక పేరుగలదు-ఈ గ్రామమునందలి కొన్ని భూములను "ఇమామ్‌సాహెబు" అనునొక ఫకీరునకు మీనాక్షీదేవి దానమొసంగిన వివరములను దెలుపు నది. ఈ శాసనము వ్రాసినది గోవిందప్పయ ప్రధాన కార్యకర్తయగు శివరామయ్య.

శాసనములు 55 పంక్తులు గలవు. అందు సరిహద్దులను దెలుపు భాగము 6 పంక్తులు అరవము. మిగిలినది తెలుఁగు.

"స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకాబ్దంబు 1660 ప్రభవాది సంవత్సరంబులు 51 మీఁదటనగు నేటి కాళయుక్తినామ సంవత్సరము మాఘశుద్ధ 12 శుక్రవారమున్ను పునర్వసు నక్షత్రమున్ను శుభయోగ శుభకరణమున్ను కూడిన శుభదినమందు శ్రీమత్కాశ్యపగోత్ర జాతులైన చొక్కనాథ నాయనయ్యవారి పుత్రులైన విజయరంగ చొక్కనాథ నాయనయ్యవారి పట్టమహిషి అయిన శ్రీ మీనాక్షమ్మగారు పకీరు గురువులు యిమామ్ సాయెబుకు యిచ్చిన తామ్రశాసనక్రమము యెట్లన్నను,

శ్రీ మన్మహామండలేశ్వర మహారాజమకుటోప లాలితాక్షమాదిత సామ్రాజ్యలక్ష్మీనివాస భూతదేవ మహారాజులైన శ్రీరాయలుదేవుని వారు మాకు పాలించియిచ్చిన తిరుచినాపల్లి మధుర సంస్థానమందు తిరువాడిరాజ్యాన తిన్నవేల్లితోచేరిన శీవల్లప్పేరికి ప్రతినామమైన ముద్దు వెంకటలక్ష్మీపతి భూపాలసముద్రములో పెద్ద చెఱువుక్రింద తూరుపు మడవపాతే తూరుపుకట్ల మూడోకణ్ణరులోను కట్లసేఖరముగాను కయ్యాలు 9 టికి విత్తనము కోట 1 న్ని తిన్నవెల్లి ప్యాతసుంకములో దినము 1 కి తెలుపులుకి 2 లెక్క అడిత్తూముడు రూకలున్ను ఈ రెండు మాన్యము లున్ను పకీరుగురువులు ఇమామ్‌సాయిబుకు శుద్ధసర్వమాన్యముగా కట్టడ చేసి తామ్రశాసనమును వ్రాసియిచ్చినారము. గంగకోటడు విత్తన ములో కలిగిన నిధినిక్షేపజలతరు పాషాణాక్షీణాగామ్య సిద్ధసాధ్యము లనియెడి అష్టభోగతేజస్వామ్యముల సహితముగాను పుత్రపౌత్ర పారం పర్యముగాను, శ్రీ మీనాక్షమ్మ వ్రాలు. ఆచంద్రార్కస్థాయిగాను దానాదివినియయ విక్రయములకున్ను ఈ అడిత్తూముడు దినము 1కి తెల్పులికి 2కిన్ని యిదే తామ్రశాసనముగా కట్టివుంచుకొని సుఖాన అనుభవించుకొనేది. ఈ ధర్మానకు ఎవ్వండైనానేమి విఘాతంచేస్తే వాణ్ణు బ్రహ్మక్షత్రియ వర్ణములలోనివాణ్ణైనానే కాశిలోను బ్రహ్మహత్య గోహత్య మాతృ పితృహత్యచేసిన పాపాన పోగలవాణ్ణు! ఈ క్రమానకు నాయసం గోవిందప్పయ్య కుమారుణ్ణు శివరామయ్య వ్రాసిన తామ్ర శాసనము.

దానపాలన యోర్మధ్యే దానాచ్ఛ్రేయోను పాలనమ్
దానాత్ స్వర్గమవాప్నోతి పాలనాదచ్యుతం పదమ్."

తరువాత భాగము దమిళభాషలో నున్నది.

(Travancore Archaeological series Vol. VI Past II. No. 81. A Telugu Copper plate of Queen Minakshi Saka 1660. Pages 229-235.)

పై శాసములో 'తెలుపులు' అనఁగా వెండితోఁజేసిన రూకలని యర్థము.

# సవరణలు

పుట 8. సంస్కృత శ్లోకము ౧. రెండవ పాదమున "కాంచిత్సమయమయస్తే" అనుచోట "కాంచిత్సమయమయనిహస్తే" అని చదువుకొనవలెను.

ఆ శ్లోకమున నాల్గవపాద మిట్లుండవలెను. "సమ్యగ్వర్యం సపర్యామ కృతభువియశః ప్రాపణే గోపణార్యః"

,, 27. రాజగోపాలవిలాసావతారిక ముద్రితము. ముద్రితము అను మాట తీసి వేయవలెను.

,, 28. దశమైకాదశ సర్గాంతములలో శార్దూలవృత్తములు మాలినియు ... గలవు. దీనిని "దశమైకాదశ సర్గాంతములలో మాలినిలేదు" అని సవరించుకొనవలెను.

,, 35. "2. గజేంద్రమోక్షము 3. రుక్మిణీ కృష్ణవివాహము 4. జానకీపరిణయము ఈ మూఁడును యక్షగాన కృతులు. వీనిలో గజేంద్రమోక్షము రుక్మిణీ కృష్ణవివాహ రచనలు సాహిత్యసుధలో యక్షగానములుగాఁ జేర్కొనఁబడినవి."

కాని సాహిత్యసుధయందు గజేంద్రమోక్షము యక్షగానములలో చేర్పఁబడలేదు.

శ్రీపారిజాతాహరణ ప్రబంధచిత్రంచ వాల్మీకిచరిత్ర కావ్యం
తథాచ్యుతేంద్రాభ్యుదయం గజేంద్రమోక్షం చరిత్రంచ నలస్యచిత్రమ్.
శ్రీరుక్మిణీకృష్ణవివాహ యక్షగానం ప్రబంధానటనైక భేదాన్
నిర్మాయవాగ్భిర్నిపుణార్థభాగ్భిర్విద్వత్కవీనాం విదధాపిహర్ష మ్.

పై వానిలో పారిజాతాహరణము దొరకకపోయినను ప్రబంధమని చెప్పినకతన దత్స్వరూపమును గూర్చి వివాదములేదు. వాల్మీకి చరిత్ర ప్రబంధము. అచ్యుతేంద్రాభ్యుదయము (ద్విపదకృతి) నలచరిత్ర (ద్విపద కృతి) నడుమనున్న గజేంద్రమోక్షముకూడ ద్విపదకృతి యగునా యని సందేహము గలుగుచున్నది. ద్విపదకూడపాడఁదగినదియే కావున, ద్విపద గజేంద్రమోక్షము, యక్షగానరూపమునఁగూడ రఘునాథుఁడు రచించెనని యూహించుటకు నవకాశము గలుగుచున్నది. రఘునాథనాయకుని కొమారుఁడగు విజయరాఘవనాయకుని రచనలలో నిట్టి ద్విపదలు నాటకముగా గూడ రచించినవి కన్పట్టుచున్నవి.

పుట 35. "ధర రఘునాథాభ్యుదయము నాటకముగాద్విపదగా రచియించు ధీరవర్య!"
"అలమోహినీవిలాసాఖ్య ద్విపదకృతి నాటకం బొనరించు నలసమాన!"
(ప్రహ్లాద చరిత్ర)

మఱియు కొన్ని కృతులేశాఖకుఁ జెందినవో తెలియఁబడకున్నను, లభ్యములైనవానినిఁ బట్టి చూడగా నవి యక్షగాన నాటకములని తెలియుచున్నవి.

"అతి పవిత్రంబు ప్రహ్లాద చరిత్రంబు నవరించుఘనమనీషాధురీణ"
ప్రహ్లాద చరిత్ర – నాటకము
"విప్రనారాయణ విద్వత్కథాసంవిధానఁ బొనర్చిన ధీనిధాన"
విప్రనారాయణ చరిత్రనాటకము

,, 40. "నలోపాఖ్యానము ప్రత్యేక ప్రబంధరూపమున" అను వాక్యము "నలోపాఖ్యాన కథ సంపూర్ణముగాఁ బ్రత్యేక ప్రబంధరూపమున" అని చదువుకొనవలెను.

,, 70. చేమకూర వెంకటరాజు సారంగధర మూలకథ శీర్షిక క్రింద "వేంకట రాజు మాళవ మాంధాతనామము లుజ్జగించి" అను వాక్యమున 'మాళవ' పదము త్యాజ్యము.

,, 90. విజయరాఘవుని నాటకములు. ఈ క్రిందివానిని చేర్చుకొనవలెను.

24 పుణ్యక వ్రతము 25 మంజరీద్విపద ప్రబంధనాటకము 'చౌపదులు' శీర్షికపైని సాంగత్యములు 1. వీరశృంగారసాంగత్యము 2. సంపంగిమన్నారు సాంగత్యము (సాంగత్యము అనునది కన్నడమున బహుళ ప్రచారముగల గేయ వికారరచన – ఇట్టి సాంగత్య రచనలు మైసూరిపాలకుఁడగు కంఠీరవ రాజకృత తెనుఁగు యక్షగాన కృతులందగపడుచున్నవి.)

,, 96. లభ్యములైన విజయరాఘవ నాయకునికృతులు. 7. శ్రీకృష్ణ విలాసనాటకము ఆదేపుటలో అధన్సూచిక ప్రారంభమున "పై రెండు గ్రంథములును" అను దానికి బదులు "మొదటి రెండు గ్రంథములును" అనియు మఱియు రెండవ పంక్తిలో "డాక్టరు నేలటూరి వెంకటరమణయ్య శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగార్ల" అనియు చదువుకొనవలెను.

చూడుఁడు తంజావూరి సరస్వతీమహాల్ గ్రంథాలయపు జర్నలు. సం. XI. సం. 1 (1956)

,, 97. తమ తండ్రుల పూర్వవృత్తాంతముఁ దెలుపు నిట్టి రచనలకు రఘునాథనాయకుఁడే మార్గదర్శకుఁడు." ఇచట రచనలకు అనుపదము వెనుక "తెలుఁగున" అని చేర్చవలెను. సంస్కృతమున రాజనాథడిండిముని సాళ్వాభ్యుదయము అచ్యుతరాయాభ్యుదయము సాళువ నారసింహుని రామాభ్యుదయము మున్నగు కావ్యములు రాజుల వృత్తాంతములను దెలుపునట్టివి గలవు.

పుట 98. నాటకము 1. క్రింద యీ క్రింది వివరములు చేర్చుకొనుఁడు.

హేమాబ్జనాయికా స్వయంవరము తంజాపూరి సరస్వతీ పుస్తక భాండాగారము వారిచేతను. ఆంధ్ర విశ్వకళా పరిషత్తువారి చేతను ప్రకటిత మైనది. (1955)

,, 104. "విజయరాఘవనాయకుఁడు అముద్రిత కృతులు" ఈ శీర్షిక క్రింద నీ క్రింది వానినిఁ జేర్పవలెను.

పూతనాహరణము

,, 106. కాళియమర్దనము.

,, 108. ప్రహ్లాదచరిత్ర ఈ మూఁడును ఆంధ్రవిశ్వకళా పరిషత్తువారిచే, 1955 లో "యక్షగానములు (తంజాపూరు)" సంపుటము ౧ లో ప్రకటితములైనవి.

,, 123. కోనేటి దీక్షితచంద్రుఁడు విజయరాఘవకల్యాణము.

,, 126. పురుషోత్తమ దీక్షితుఁడు తంజాపురాన్నదాన మహానాటకము.

,, 129. కామరసు వెంకటపతి సోమయాజి – విజయరాఘవ చంద్రికావిహారము.

ఈ మూఁడును ఆంధ్రవిశ్వకళా పరిషత్తువారిచే 1956 లో "యక్షగానములు (తంజాపూరు)" ౨వ సంపుటములో ప్రకటితములైనవి.

,, 135. పసుపులేటి రంగాజమ్మ – కనకాభిషేక గౌరవము "కాని యింతవఱకు రంగాజమ్మ తప్ప స్త్రీ లెవ్వరును నిట్టి గౌరవమును పొందినట్లు మనకుఁ దెలియుట లేదు" కాని రంగాజమ్మకుఁ బూర్వము రఘునాథనాయకుని కాలమున వెలసిన కవయిత్రులలో మధురవాణి యిట్టి గౌరవముపొందినట్లుఁగా తాను రచించిన సంస్కృత రామాయణమున నేకాదశసర్గ గద్యలో నిట్లు చెప్పుకొన్నది. "ప్రౌఢ శ్రీరఘునాథనాయక కృత స్వర్ణాభిషేక క్రియాదీవ్యోద్యన్మతి."

,, 157. "మన్నారుదాస విలాసమునే గాక" అని 104వ పంక్తి చదువుకొనవలెను

,, 171. అధస్సూచిక – "సౌమ్యసంవత్సరము క్రీ. శ. 1664 లో సంపోవుచున్నది" ఈ వాక్యము – సౌమ్యసంవత్సరము క్రీ. శ. 1669 లో సంపోవుచున్నది. అని చదువవలెను.

,, 172. అధస్సూచిక – ఈ క్రిందివాక్యము చేర్చుకొనఁదగును.

హేమాబ్జనాయకాస్వయంవరమును క్రీ. శ. 1955 లో నాంధ్రవిశ్వకళా పరిషత్తువారు 'యక్షగానములు (తంజాపూరు) సంపుటము ౧'లో ప్రకటించిరి.

పుట 190. శహాజీ కృతులు.
ద్రౌపదీ కల్యాణము.

,, 194. రతీ కల్యాణము.

,, 204. శచీపురందరము.

,, 205. పతిదానశూరము.

ఈ నాలుగు నాటకములును. ఆంధ్రవిశ్వకళా పరిషత్తువారు "యక్షగానములు (తంజావూరు)" సంపుటము 3 1957 లో ప్రకటించియున్నారు.

,, 232. బాలకవిసుబ్బన్న – పంచకన్యాపరిణయము. ఈ నాటకము పై మూడవ సంపుటమునం బ్రకటితమైనది.

,, 233 తంజావూరి పుస్తక భాండాగారము కేట్లాగు సంఖ్య 631 గల శాహారాజ కల్యాణము ఈతని కృతియై యుండవలెపునని డాక్టరు యస్వీ జోగరావుగా రూహించుచున్నారు. చూ. భారతి (జూను 1955) పుట 53.

,, 249. ఆలూరి కుప్పనకవి – "భాగవత దశమస్కంధ యక్షగానవతారిక" అను వాక్యమునకుముందు "పార్థసారథి విజయము" అను పదము చేర్చుకొనవలెను. ఇది R. 758 – మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారము. ట్రైనియల్ కేట్లాగు – సంపుటము 5 నందుగూడ వర్ణితమైనది.

,, 255. అథన్యూనచిక త్యాజ్యము.

,, 269. చతుర్థచరణమున మల్లలోకైక శ్రేష్ఠునితో శ్రీకృష్ణునికి సామ్యమునట్టిదే... పై వాక్య మీ క్రింది రీతిగా నుండవలెను.

శ్రీకృష్ణునకు మల్లలోకైక శ్రేష్ఠునితోడి యౌపమ్యమును, ఇలాదేవి కే దొడలకు బాలమల్లులతోడి సామ్యమును ముఖ్యముగా వ్యంగ్యములు.

,, 279. త్యాగరాజు రచియించిన నాటక కృతులలో ప్రహ్లాదనాటకమును నౌకా చరిత్రమును ముద్రితములైనవి. అను వాక్యమున కీ క్రింది వివరణము చేరు కొనవలెను.

"సీతారామ విజయము – ఇది వాలాజానగర్ లో, లోక నారాయణ శాస్త్రిగారిచే ముద్రణ కాంచినదంట. (చూడుండు త్యాగరాజశతవార్షిక సంచిక)

పుట 310. నత్కీరుని కథ తెలుఁగు వాఙ్మయమున నొక్కచోటనే ధూర్జటి శ్రీకాళహస్తీశ్వర మహాత్మ్యమున గలదు. ఇచట "నొక్కచోటనే" అనునది త్యాజ్యము: నత్కీరుని కథ పచ్చకప్పురపు తిరువేంగళకవి ద్విపద చొక్కనాథచరిత్రము నందును "హాలాస్యమాహాత్మ్యము" అను పేరుగల పద్య గద్య కృతులయందును కానవచ్చుచున్నది.

,, 353. సముఖము వేంకట కృష్ణప్పనాయకుఁడు. రెండపంక్తి ఇటీవల నీగ్రంథము ముద్రణభాగ్యము నందినది. ఇందు "ఇటీవల" పదము త్యాజ్యము. అదేపుట యథసూచి 3 రాధికాసాంత్వనము – ఆంధ్రసాహిత్య పరిషత్ప్రచురణము.

,, 378. శేషూరి అనంతయ (బాలకవి) శ్రీముష్ణమాహాత్మ్యము ఈ శీర్షికలో (బాలకవి) అనునది త్యాజ్యము.

,, 385. వెలఁగపూఁడి కృష్ణయామాత్యుఁడు. 2. అన్నయ్య కొడుకులలో......విశ్వపతిరాయ మంత్రియై......వంశీయులు గాదెవారైరి ఈతఁడు మధుర రాజ్య సంస్థాపకుఁడగు విశ్వనాథనాయకుఁడు కాఁదగును.

పై వాక్యములలో ఈతఁడనఁగా విశ్వపతి రాయఁడని గ్రహింపనగును.

,, 402. భాస్కర వేంకటాచల కవి – ఇందు శ్రీరామ కథయు సేతువృత్తాంతము .........వర్ణింపఁబడినవి. ఇందు అను పదమునకు బదులు "సేతుమాహాత్మ్యమున" అను గ్రంథనామము చేర్చుకొనఁదగును.

,, 405. చంద్రతారా విలాసము – మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారము R. 130. 204 పుట

,, 406. అథసూచిక. ఈ నీలగిరియాత్ర.........వారిచే నీతరువాత ముద్రితమైనది. ఇచట 'నీతరువాత' అనునది త్యాజ్యము.

,, 409. పుదుకోట-ఆంధ్రవాఙ్మయము–"ఈ సంస్థానధ్వజమునందు తెనుఁగులో శ్రీబృహదంబా సహాయం" అని వ్రాయఁబడియున్నది.

ఇచట "తెనుఁగులో" అనుచోట "తెనుఁగు లిపిలో" అని చదువుకొనవలెను.

పుట 451. సం. 9 పావకినాటకము 10. వైవస్వతనాటకము 11. నైరుతినాటకము 12. వారుణినాటకము 13. వాయవినాటకము 14. కౌబేరినాటకము.

ఇవియన్నియు 'అష్టదిక్పాలక విలాసము'లోనివి. కాని వేరు నాటకములు కావు.

కంఠీరవరాజు యక్షగాన కృతులు మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారము. డి. 1128. (కన్నడ భాషాశాఖ).

పుట 454. "కలవాణి యను వేశ్య" కాని కలవాణీవిలాసమున "కాంభోజపతి పుత్రి" అని కలదు.

నాట్యవిద్యావిలాసము – "పద్యరచన తెనుఁగున నచ్చటచ్చటఁగాన నగును"

పద్య రచనకు బదులు "ద్విపదలు, దరువులు" అని చదువుకొనవలెను.

పుట 458. ఆధనూచి – ఈ క్రిందిపేరు చేర్చుకోవలెను. 5. డాక్టరు యస్వీ జోగారావు – ఆంధ్రవిశ్వవిద్యాలయము.

పుట 464. అధనూచి – గంగాగౌరీ విలాసము – ప్రా. లి. పు. భా. డి. సం. 1846.

పుట 495. నుగుటూరి తిమ్మభూపాలుల రచనలు సంస్కృత ౧ శివదర్పణము. కాని శివదర్పణ గద్యలో "వసాన్వయ......బ్రహ్మవిద్యాధ్వరేణ విరచితే" అని యుండుటచేత నిది వనము బ్రహ్మవిద్యాధ్వరి కృతమని చెప్పనొప్పును.

# శుద్ధ పత్రము

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 8 | 5 | గోపణ | గో, ణః |
| | 6 | హాతా | హాతే |
| | 7 | యుళ | యుగ |
| | | నిపా | సపా |
| | 8 | స్థాప్యం | ప్యాస్యాం |
| 15 | 8 | గారె | ఈ. గార |
| | 20 | భక్ష్య | అ. శె. భక్ష్య |
| 28 | 26 | నాకే | భిన్న |
| | | వృత్తము | వృత్తములు |
| 30 | 8 | మణీ: | మణీ |
| | 11 | యోభవేత్ | యోఽభవత్ |
| 31 | 8 | స్వర్ణా | స్వర్గా |
| 32 | 12 | దాహ్వా | దాదాహ్వా |
| | | యమన్మా | యన్మా |
| | 13 | మనపన | మవనిప |
| 38 | 24 | కొనియు | గాను |
| 40 | 17 | ధము | నల |
| | 18 | నల | ధము |
| | 30 | శేది | లేక |
| | 31 | నిక | నిది |
| 43 | 18 | జాణ | గాణ |
| 60 | | మనసు | మన సుభ |
| 68 | 8 | చి_ | చిత్త |
| 69 | 7 | లఘు వ | లఘ వ |
| 71 | 10 | శాంబ | శాంగి |
| 85 | 7 | మ యబిసా | మయ బిసా |
| 95 | 25 | ఆనుపేరు | అనుపేరు |
| 99 | 12 | తిరుచ | తిరుచి |
| | 23 | పంపు | సంపు |
| 104 | 25 | నం | న |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 105 | 2 | మొన | మొద |
| 156 | 14 | అము | అము |
| 216 | 27 | ఇమానిత్రయోదశ | ఇమానిత్రయోదశ ? |
| 217 | 13 | ఏవసుప్బో | ఏవసుప్చో |
| 221 | 25 | పెండ్లియాడుట | సత్కరించుట |
| 223 | అధస్సూచి | 500 నుండి 510 వఱకు | 509 నుండి 511 వఱకు |
| 252 | | కనూరి | కస్తూరి |
| 268 | 13 | ఆర్థ | అర్థ |
| | 21 | నెమ్మోవికా | నెమ్మోనికా |
| 353 | 9 | చున్నాను, | చున్నాను. |
| | 11 | అశ్వాస | ఆశ్వాస |
| | | అశ్వాస | ఆశ్వాస |
| 355 | 10 | నంసంబు | నిముసంబు |
| 360 | 14 | ఆసదృశ | అసదృశ |
| 364 | 2 | నేడుభూ | కేఁడుభూ |
| 365 | 18 | అసుమధుర | అశుమధుర |
| 372 | 5 | మాన | మాస |
| 382 | 28 | గాతాగో | గాయగో |
| 383 | 4 | శ్యాభుజంగ | వేశ్యాభుజంగ |
| 386 | 15 | పేషునా | షేషునా |
| 388 | 10 | కపురె | కవురె |
| 402 | 21 | చున్నది. | చున్నవి |
| 411 | 18 | ధరణి | తరణి |
| 422 | 12 | సమర | నమర |
| 436 | అధస్సూచి | సద్య | పద్య |
| 477 | 10 | ఆహామ | అమహా |
| 495 | 3 | భూపాత్రయ | భాపాత్రయ |

